**ACHARYA TIRUMALA KAAVYALU-PARISHEELANA**

**Dr. POREDDY RANGAIAH**



ఆలేరు అనగానే సాహిత్య, సాంస్కృతిక, సామాజిక సేవారంగాల్లో గుర్తుకు వచ్చేంతగా తనదైన ముద్ర వేసిన సాహిత్యకారుడు డా. పోరెడ్డి రంగయ్య. ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయుడిగా తొలి అడుగులు వేసిన రంగయ్య ఆ తరువాత ఎన్నో కొత్తదారుల్లో ప్రయాణించాడు. 'శబ్దశిల్పాల'తో మినీ కవితల మెరుపులు పూయించి, 'అగ్నిపుష్పాలు' అనే ఉద్యమ కవితల సంపుటికి సంపాదకుడిగా ఎదిగాడు. 'రాయలసీమ కథల్లోని సామాజికాంశాల' పై ఎం.ఫిల్.తో పరిశోధన మొదలుపెట్టి, తేజ ఆర్ట్ క్రియేషన్స్ సాహిత్య సంస్థను ప్రారంభించి పలు విభిన్న కార్యక్రమాలకు విశిష్టమైన వేదికగా నిలబడ్డాడు. తన అభిరుచిని, అధ్యయనాన్ని, దృక్పథాన్ని మరింతగా విస్తృత పరచుకొని వైవిధ్యమైన కార్యక్రమాలను చేస్తూ విశిష్ట పురస్కారాలతో ప్రముఖులను సన్మానిస్తూ సాహిత్యబోయిగా, సామాజిక సేవా కార్యకర్తగా తనది ఆచరణాత్మక శైలని నిరూపించుకున్నాడు. అందుకే, ఆలేరు మరియు పరిసర ప్రాంతాల్లోని ఎన్నో సంస్థల చేత సత్కరింపబడ్డాడు. రాష్ట్ర స్థాయి ఉత్తమ ఉపాధ్యాయ పురస్కారం, సోమనాథ కళాపీఠం, హృదయభారతి, సూర్యచంద్ర పురస్కారాలతోపాటు ఎన్నో సంస్థలచే సన్మానాలు, సత్కారాలు పొందాడు. వృత్తిపరంగా కూడా బాధ్యత కలిగిన గురువుగా గుర్తింపబడ్డాడు. డా.సి.నారాయణరెడ్డి, డా.ఎన్.గోపి లాంటి విశిష్ట సాహితీవేత్తల అభినందనలు అందుకున్నాడు. డిపెప్ విద్యాశిక్షణ కార్యక్రమాల్లో రాష్ట్రస్థాయి వర్క్‌షాపుల్లో రీసోర్స్ పర్సన్‌గా తన వంతు సేవల్ని అందించిన నిత్య విద్యార్థి రంగయ్య. మంచివక్తగా, కార్యక్రమాల వ్యాఖ్యాతగా అందరి మదిలో నిలిచిన సహృదయుడు. ఉపాధ్యాయ సంఘ నాయకుడు. 'డా. ఆచార్య తిరుమల సాహిత్యం'పై ఎంతో లోతైన పరిశోధన చేసిన ఈ పిహెచ్.డి. గ్రంథం ద్వారా మరోసారి సాహిత్యలోకానికి తన పరిచయాన్ని సరికొత్తగా ఆవిష్కరించుకుంటున్నాడు.

– డా. ఎస్.రఘు

# ఆచార్య తిరుమల కావ్యాలు-పరిశీలన



డా॥ పోరెడ్డి రంగయ్య

ఆచార్య తిరుమల కావ్యాలు-పరిశీలన
డా॥ పోరెడ్డి రంగయ్య

# ఆచార్య తిరుమల కావ్యాలు - పరిశీలన

(ఉస్మానియా విశ్వవిద్యాలయం పిహెచ్.డి డిగ్రీ పొందిన పరిశోధన గ్రంథం)

డా॥ పోరెడ్డి రంగయ్య

M.A., M.A., B.Ed., M.Phil., Ph.D

తేజ పబ్లికేషన్స్

ఆలేరు, నల్లగొండ-508101

**Aacharya Tirumala Kaavyalu - Parisheelana**
*[Ph.D Thesis]*
**By Dr. Poreddy Rangaiah**



*First Print:* **August, 2008**
*Copies:* **1000**

*Price:* **Rs. 200**

*Published by:*
**Teja Publications**
ALER

*Cover Design:* **Nivas**

*For copies:*
**Poreddy Rajeshwari**
C/o. Dr. Poreddy Rangaiah
Adarsha Nagar, Main Road
ALER-508101, Nalgonda Dist.
Cell: 9948049864

**All Branches of**
**Vishalandhra & Novodaya Book House**

*Printed at*
**Vipla Computer Services**
*(Designers & Multicolour Offset Printers)*
Nallakunta, Hyderabad - 500 044.
Ph: 27677078, 2767 6910, 2765 4003
E-mail: viplavision@gmail.com

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారి ఆర్థిక సహాయంతో ముద్రితం

# అంకితం



**శ్రీమతి & శ్రీ ననబోలు జయ బాల్‌రెడ్డి దంపతులు**
రిటైర్డ్ ప్రధానోపాధ్యాయులు
(మాసాయిపేట, మం॥ యాదగిరిగుట్ట, జిల్లా నల్లగొండ)

మాసాయిపేట మట్టిచందనం ఎత్తిన పొత్తిళ్ల నుంచి లోకానికేసి నడిచివచ్చి, మానవత్వాన్ని కమ్మని కళగా మలచుకొని, చదువుల నుంచి సంస్కారాన్ని వెదజల్లి, ఆదర్శాన్ని జీవితంగా దిద్దుకొని, ఉపాధ్యాయ వృత్తిలో ప్రవేశించి దిశలు మోసే చరిత్రను సృష్టించి, ఉపాధ్యాయ ఉద్యమ గమనానికి నాయకత్వం రచించి, ప్రామాణికమైన సిద్ధాంతాలను భవిష్యత్తు ఉద్యమాలకు పాదేయంగా అందించి, త్యాగమయి పరిమళించి, అనురాగమయి ప్రవహించి, అమృతమయి విహరించి సౌజన్యధుని, సాహిత్యనీరధి, అనురాగ జలధి, సమతా వారధి అన్న పదబంధాలకు చక్కని తార్కాణంగా నిలిచిన మహామనీషి, అమృత హృదయులు, అనురాగ భావుకులు, ఉపాధ్యాయ సంఘ రాష్ట్ర నాయకులు, జిల్లా ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహీత శ్రీ ననబోలు బాల్‌రెడ్డి, పేదసాదల ఆదరించిన ఉత్తమగృహిణి, అందరినీ ఆప్యాయంగా చూసుకునే మానవతామూర్తి శ్రీమతి జయ దంపతుల గారలకు వాత్సల్యంతో నా ఈ పరిశోధన గ్రంథాన్ని అంకితమిస్తున్నాను.

– డా. పోరెడ్డి



నా ఉన్నతిని ఆకాంక్షిస్తూ,
నిండు మనసుతో సహకరిస్తున్న
సరస్వతీ ఉపాసకులు
శ్రీమతి & శ్రీ కొప్పుల రమాదేవి
బాపురెడ్డి దంపతులు
(ప్రధానోపాధ్యాయులు,
విశ్వభారతి ఆలేరు)

## ఈ గ్రంథం ముద్రణ రూపంలో వెలుగుచూడడానికి ఆర్థికంగా చేయూతనందించి తమ హృదయాలను ఆవిష్కరించిన వదాన్యులు



శ్రీమతి & శ్రీ మూర్తల
శిరీష సుభాష్ రెడ్డి
దంపతులు
*(రీజినల్ మేనేజర్,
VST, కర్నూలు)*



శ్రీమతి & శ్రీ అయిల కమలాదేవి
రామనర్సయ్య దంపతులు
*(రిటైర్డ్ గజిటెడ్
ప్రధానోపాధ్యాయులు, ఆలేరు)*



శ్రీ బేతి మహేందర్
రెడ్డి, (రియల్టర్,
శాయిగూడెం,
మం॥ ఆలేరు)



శ్రీ బింగి
రామకృష్ణ
(వ్యాపారవేత్త,
ఆలేరు)

పి.ఆర్.టి.యు నల్లగొండ జిల్లా శాఖ ప్రధాన కార్యదర్శి శ్రీ పూల రవీందర్,
నల్లగొండ మండల శాఖ అధ్యక్షులు శ్రీ సుంకరి భిక్షంగౌడ్ గారలకు **కృతజ్ఞతలు**.


జ్ఞానపీఠ అవార్డు గ్రహీత
**డాక్టర్ సి. నారాయణరెడ్డి** ఎక్స్.ఎం.పి.
ఎం.ఏ., పిహెచ్.డి., డి.లిట్.
అధ్యక్షులు
**ఆంధ్ర సారస్వత పరిషత్తు**
తిలక్ రోడ్, హైదరాబాదు-500 001.
ఫోన్ : (అ) 24753724






# అభినందన

ఆచార్య తిరుమల పండిత వంశం పాదులో మొలిచి సాహితీరంగంలో వృక్షంలా నిలిచిన కవి వతంసుడు. నాకు సహోదరతుల్యుడు. అతని అకాలమృతి తెలుగు కవితా జగత్తుకు తీరని క్షతి.

ప్రాథమిక ప్రాయం నుంచే తిరుమలను కవిత్వం నీడలా అనుసరించింది. వయసు పెరిగిన కొద్దీ అది వర్ధమాన దశ నుంచి ప్రవర్ధిత దిశ వైపు ఎదిగింది. ఆచార్య తిరుమల బహుముఖ సాహిత్యసృష్టి పైన డా. పోరెడ్డి రంగయ్య పిహెచ్.డి. పట్టా కోసం సమగ్రంగా రూపొందించిన పరిశోధన గ్రంథమిది.

ఆచార్య తిరుమల రచనల్లోని పది ప్రక్రియలపైన డా.రంగయ్య లోతైన పరిశీలన జరిపాడు. పద్యం కూర్చినా, గేయం పలికినా, వచన కవితలు వచించినా – ఈ మూడు కవితా ప్రక్రియల్లో ఆచార్య తిరుమల మౌలిక ప్రతిభ ప్రదర్శించాడు. పరమగానయోగ్యంగా, వుండే లలిత గీతాలను నాటకాలను, సంగీత రూపకాలను, నృత్య నాటికలను, కథలను, వ్యాసాలను – ఇలా ఎన్నెన్నో ప్రక్రియల్లో అతడు తన రచనా చణత్వాన్ని ఆవిష్కరించాడు. ఈ ప్రక్రియలన్నిటినీ అవగాహన చేసుకొని, పరిపూర్ణంగా పరిశీలించి ఈ విమర్శన గ్రంథాన్ని రూపొందించాడు డా. పోరెడ్డి రంగయ్య.

ఈ మధ్య వెలువడిన పరిశోధనా గ్రంథాలలో వస్తుపరంగా, విశ్లేషణ దృష్ట్యా సర్వోత్తమంగా నిలిచిపోయేట్టుగా ఈ గ్రంథ రచన చేసిన డా. పోరెడ్డి రంగయ్యకు నా హార్దికాభినందన.

తేది: 20.06.2008

*Dr. N. Gopi*, M.A., Ph.D.
Professor of Telugu
Former Vice-Chancellor
P.S.Telugu University
Former Dean Faculty of Arts
Osmania University, Hyderabad-7
Resi. : 040-27037585
Cell: 9391028496



# ఆశీరభినందన

మంచి వయఃపరిపాకంలోకి వస్తున్న సందర్భంలోనే ఆచార్య తిరుమల అస్తమించడం తెలుగు కవిత్వం చేసుకున్న దురదృష్టం. ఆలోచనల్లో, భావ విన్యాసంలో పరిణతి పదునెక్కుతున్న దశలో తిరుమల మరణించడం నాకెంతో బాధను కలిగించింది. ఆయన హైదరాబాదుకు వచ్చిన తొలి రోజుల్నుంచి పరిచయం. ఆ పరిచయం గాఢమైన స్నేహంగా పరిణమించింది. తిరుమల అపారమైన ప్రతిభావంతుడు. భాషా వైదగ్ధ్యంలో శక్తిమంతుడు. కవిత రాసినా, పాట రాసినా, వ్యాసం రాసినా, ఉపన్యాసం చెప్పినా హృదయాలనూ, చప్పట్లనూ కొల్లగొట్టేవాడు. తాడేపల్లిగూడెంలోని వారింటికి నన్ను తీసుకెళ్లాలని ఆయన ఆకాంక్ష. అది నెరవేరలేదు.

తిరుమల రచనలపై పిహెచ్.డి. చేయించాలని అభిలాష నాకుండేది. మా పూర్వ విద్యార్థి పోరెడ్డి రంగయ్యను చూసిన తర్వాత ఇతడు ఆ కార్యం చక్కగా నిర్వహించగలడని నాకు అనిపించింది. అది నిజమేనని రంగయ్య నిరూపించాడు. ఆచార్య కె.కుసుమారెడ్డిగారి నిపుణ పర్యవేక్షణలో ఈ పరిశోధన వ్యాసంగం సార్థకంగా నెరవేరింది. అందుకు నేను ఎంతో సంతోషిస్తున్నాను. ఈ గ్రంథాన్ని చూసుకోవడానికి తిరుమల లేడు కదా! అన్న కించిత్తు బాధ. 'నీ దగ్గర పిహెచ్.డి. చేయాలని ఉందన్న' అని అంటుండేవాడు తిరుమల. 'నువ్వేం చేస్తావ్ నీ రచనలపైనే పరిశోధనలు జరగాలి' అనేవాడిని. ఇప్పుడు ఈ గ్రంథాన్ని చూస్తే అప్పటి ఆ మాటలు గుర్తొస్తున్నాయి.

మా డా॥ రంగయ్య తిరుమల రచనలకు తగిన న్యాయం చేశాడు. విశ్లేషణ చేశాడు. వివేచన గావించాడు. వింగడించాడు. తిరుమల కవిత్వంలోని విలక్షణతను నిరూపించాడు. పదహారేళ్లుగా అధ్యాపకత్వం నెరపుతున్న డా॥ రంగయ్య చక్కని అధ్యయనశీలిగా మారి ఈ వ్యాసంగాన్ని సమర్థవంతంగా నిర్వహించాడని నా అభిప్రాయం. ఈ గ్రంథం చదివితే మీరూ నాతో ఏకీభవిస్తారు. వినయశీలి, సౌహార్ద్ర హృదయుడు మా డా॥ రంగయ్యను ఆశీర్వదిస్తూ అభినందిస్తున్నాను.

తేది: 21.05.2008

– ఎన్.గోపి



**Dr. J. Bapu Reddy**
D.Litt., IAS (Retd.)
POET
'RAMACHILUKA'
Plot No. 10, Road No. 5
Jubilee Hills, Hyderabad - 500 033
Cell: 9949465964,Tel. 91-40-23608381 (R)
E-mail : bapureddy@hotmail.com



# సాహిత్య సాగర మథనం

డా. పోరెడ్డి రంగయ్యకి ప్రతిష్ఠాత్మకమైన 'పిహెచ్.డి.'పట్టా అనే అమృత కలశాన్ని ప్రసాదించిన ఆచార్య తిరుమల సాహిత్య సాగర మథనం ఇది. రంగయ్య తన మనోమంథరంతో, ఆయన ప్రతిభా పాండిత్యాలు-ఆలోచనలు-అనుభవాలు చిలికిన ఫలితం ఇది. "ఆచార్య తిరుమల కావ్యాలు-అనుశీలన" పేరుతో పోరెడ్డి సలిపిన సమాలోచన, విశ్లేషణ, వివేచనాత్మక పరిశోధన ఒక సమగ్రమైన, సార్థకమైన గ్రంథంగా తీర్చిదిద్దడం ఆనందదాయకం. అయితే 2001లోనే రూపొందిన ఈ రచన 2004లో ఆచార్య తిరుమల దివంగతుడైన నాటికి ప్రచురింపబడకపోవటం విచారకరం. అయినా డా॥ పోరెడ్డి రంగయ్య చేసిన కృషిని చూసి ఆయన్ని అభినందించిన సంతృప్తి తిరుమలకు దక్కింది.

ఆచార్య తిరుమలగారితో నాకు పెంపొందిన మూడు దశాబ్దాల మైత్రి, సాహితీ బాంధవ్యం, పంచుకున్న ఆత్మస్పందనలు, విదేశీ యాత్రానుభూతులు అన్నీ అక్షరస్మృతులుగా మిగిలిపోయాయి. ఎత్తిన కలం దించకుండా ఆయన జీవితాంతం కొనసాగించిన సృజనాత్మక, ప్రయోజనాత్మక, దార్శనిక సాహిత్య కృషీవలత్వం పండించిన పద్య, గేయ, వచన కావ్య సంపద గణనీయమైంది. ఒక పరిణత గల కవిగా, పండితుడుగా, విమర్శకుడుగా, తాత్వికుడుగా, వ్యాసకర్తగా ఆయన ఆర్జించిన గుర్తింపు వరణీయమైంది. ఈ గ్రంథం ద్వారా తిరుమల సాహిత్య వైభవాన్ని తరతరాలకు అందిస్తున్న డా॥ రంగయ్య ధన్యుడు, అభినందనీయుడు. నాలుగు దశాబ్దాలుగా తిరుమల రాశిపోసిన భావరత్నాల కాంతుల్ని రంగయ్య ఈ గ్రంథంలో భద్రపరచిన తీరు ఎంతో ఇంపుగా ఉంది. అది ఆయన ఒక కవిగా, కవితా సంకలనాల సంపాదకుడుగా, సాహిత్య సంస్థ అధ్యక్షుడుగా, రాష్ట్ర ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహీతగా గడించిన అనుభవాన్ని ప్రతిబింబిస్తున్నది. తిరుమల కవితా దర్శనాన్ని, సాహిత్య. సర్వస్వాన్ని, వైరుధ్యం లేని వైవిధ్యాన్ని ఎంతో సమర్థవంతంగా ఆవిష్కరించడం నాకు ఆశ్చర్యం ఆనందం కలిగించింది.

1997లో నా "సాహిత్య దృక్పథం"పై శ్రీ చింతోజు మల్లికార్జునాచారి పరిశోధన చేసి పిహెచ్.డి. పట్టా పొందిన గ్రంథం కూడా ఈ సంవత్సరమే ముద్రణకు ముస్తాబు అవుతుండడం యాదృచ్ఛికమే అయినా తిరుమలతో నాకున్న అనుబంధానికి దైవం కల్పించిన నిదర్శనంగా భావిస్తున్నాను. ఆయన తన "కవిదర్శనం" వ్యాస సంపుటిని 1986లో నాకు అంకితం చేస్తూ నా మీద చిలికిన పలుకులు ఈ శుభ సందర్భంలో గుర్తు చేసుకుంటున్నాను-

*"చెలిమిక మారుపేరు, రససింధువునన్ దనరారు, వాక్కు ధా*
*కలశము సద్గుణ ప్రసవక్రమ పరీమళ కల్పకమ్ము, ధీ*
*లలిత విశేష కీర్తి పరిరంభ సుఖాస్పద జీవన ప్రభా*
*కలితము 'బాపు' మానసము కావున మెచ్చియొసంగితీ కృతిన్"*

జన్మజన్మాలకు మరిచిపోలేని ఆయన సుహృద్భావం పలికిన ఈ కవితా సత్యం, నిజానికి ఆయనపట్ల అక్షరాల వర్తిస్తుంది. నా "జీవనశ్రుతులు" పద్యకావ్య సంపుటి గూర్చి ఆయన వ్రాసిన వ్యాసం ఆయనకు "కవితా కళ" పట్ల సమకూరిన సత్యదర్శనానికి ప్రతిరూపంగా కళ్లకద్దుకున్నాను. నా "సాహిత్య స్వర్ణోత్సవ" సందర్భంగా వెలువడ్డ "నవభావనందనం" వ్యాస సంపుటిలో అది వెలుగొందడం నా సౌభాగ్యంగా భావిస్తున్నాను.

ఈ గ్రంథంలో వివరించిన అనేక అంశాలు, సన్నివేశాలు, సంఘటనలు, నేను ప్రత్యక్షంగానో, పరోక్షంగానో అనుభూతించినవే కావటం నాకెంతో సంతోషం కలిగించింది. తిరుమలగారికి టర్కీలోని ఇస్తాంబుల్‌లో జరిగిన ప్రపంచ కవుల సమ్మేళనంలో, గౌరవ డాక్టరేటు ప్రదానం జరిగినపుడు నేను ప్రత్యక్ష సాక్షిగా పొందిన స్పందన ఆత్మీయతకు మాత్రమే అందే అక్షరానుభూతి. ఒక్క ముక్కలో చెప్పాలంటే, ఈ గ్రంథంలో డా॥ రంగయ్య తిరుమల జీవిత విశేషాలను, సాహిత్యపరమైన సాధనలను, సాఫల్యాలను ఆమూలాగ్రం ఎంతో ఆసక్తికరంగా ఆవిష్కరించాడు. సరళసుందరమైన శైలి ఆబాల గోపాలాన్ని అలరించేదిగా ఉంది. పరిశోధకుడు తిరుమలతో జరిపిన ఇంటర్వ్యూ గ్రంథంలో చేర్చడం ఒక హైలైట్‌గా భాసిల్లింది. ఎంతోమంది ప్రాచీన, ఆధునిక రచయితల 'ప్రభావం' తిరుమల మీద ఉన్నా ఆయన "భావాలు" రాజీపడని ఆయన సర్వస్వతంత్ర సత్యాన్వేషణ దృష్టికి సృష్టికి అద్దం పట్టినవి. ఈ పరిశోధనలో రంగయ్యకి మార్గదర్శిగా, పర్యవేక్షకులుగా వ్యవహరించిన డా॥ కుసుమారెడ్డిగారిని అభినందిస్తున్నాను. పాఠకులు, ఉత్తమ సాహిత్య విలువల పట్ల జిజ్ఞాసతో, గ్రంథాన్ని చదివి ఆనందించగలరని విశ్వసిస్తున్నాను. డా॥ పోరెడ్డి రంగయ్య మునుముందు మౌలిక రచనలతో పాటు, విజ్ఞానదాయకమైన పరిశోధనాత్మక రచనలను కూడా విరివిగా చేస్తూ, తెలుగు భాషా సాహిత్యాల వికాసానికి తోడ్పడగలరని ఆశిస్తున్నాను.

శుభం భూయాత్

తేది: 15.06.2008

**- జె. బాపురెడ్డి**



**Dr. K. KUSUMA REDDY**
M.A., M.Phil., Ph.D.(T), Ph.D.(A.I.H.C & A)
**Professor,**
**Head of the Dept. of Telugu**
Osmania University
Hyderabad - 500 007, A.P.
Cell : 98493 94022






# ఆశీస్సులు

శ్రీ. శే. ఆచార్య తిరుమల ఆధునిక కవులల్లో ఒక ప్రత్యేకమైన గుర్తింపు పొందినవారు. పండిత వంశంలో జన్మించిన ఆయన తన కవితా వ్యవసాయంతో జీవితాన్ని పండించుకొన్నారు. వివిధ అవార్డులతో ఆయన తన సాహితీ కృషికి గుర్తింపును సంపాదించుకొన్నారు. కవి కౌస్తుభ, విశ్వభారతి వంటి అనేక బిరుదులతో ఆయన తన సాహితీ వ్యక్తిత్వానికి వన్నె తెచ్చుకొన్నారు. ఉత్తమ ఉపాధ్యాయుడుగా విద్యార్థి లోకంలో చెరగని ముద్ర వేశారు. విశిష్ట రచయితగా ఆధునిక సాహిత్య చరిత్రలో ప్రత్యేక స్థానాన్ని ఆక్రమించారు.

డా॥ పోరెడ్డి రంగయ్య తన పి.హెచ్.డి. పరిశోధనకు 'ఆచార్య తిరుమల కావ్యాలు-పరిశీలన' అనే అంశాన్ని ఎన్నుకొని చాల సమగ్రమైన సిద్ధాంత గ్రంథాన్ని రచించాడు. ఈ గ్రంథంలో ఆచార్య తిరుమల వ్యక్తిత్వాన్ని సంపూర్ణంగా ఆవిష్కరించాడు. ఆయన సాహిత్య కృషిని చక్కగా పరిచయం చేశాడు. ఆయన రచనలను వర్గీకరించి విశ్లేషించటంలో మంచి ప్రతిభను ప్రదర్శించాడు.

డా॥ రంగయ్య ఆచార్య తిరుమల కవితా దృక్పథాన్ని ఉదాహరణ సహితంగా వివిధ కోణాల్లో వివేచన చేశాడు. అందులో ప్రప్రథమంగా కవి భక్తితత్త్వాన్ని వివరించి, భగవద్భక్తి, మాతృభక్తి, పితృభక్తి, గురుభక్తి, దేశభక్తి అనే వివిధ భక్తిభేదాల్లో కవి స్పష్టం చేసిన తాత్త్విక నేపథ్యాన్ని చక్కగా విపులీకరించాడు.

కవి ప్రేమతత్త్వాన్ని విశ్వకల్యాణ కారకమైందిగా గుర్తించి, కవికి ప్రేమపై గల ప్రేమను సుస్పష్టం చేయడంలో డా॥ రంగయ్య కృతకృత్యుడైనాడు. కవి ఆధ్యాత్మికతలోని సత్యనిష్ఠను, మానవతావాదంలోని మంచితనాన్ని, విశ్వజనీనమైన అంశాలను, అంతర్లీనంగా ఉన్న సామాజిక స్పృహను, సమాజ చైతన్యానికి ఊపిరిగా నిలిచే వాస్తవికతా రీతిని, శక్తిమంతంగా ప్రదర్శించిన ఆధునిక భావాలను, ప్రతీకాత్మకమైన శైలీ విన్యాసాలను అభివ్యక్తి

విధానాలను, అధిక్షేప వైచిత్రిని, సూక్తిసుధలను అద్భుతంగా విశ్లేషించి వివరించి రంగయ్య తన పరిశోధనా పాటవాన్ని నిరూపించుకొన్నాడు.

కవి ఆకాంక్షలను ఆశయాలను ఆదర్శాలను రంగయ్య చాల ప్రస్ఫుటంగా విశదం చేశాడు. తిరుమల కవికి కవితా నడకలను నేర్పిన పూర్వకవుల అడుగు జాడలను గుర్తించి రంగయ్య తన విస్తృతమైన పఠనా పాటవాన్ని ప్రకటించుకొన్నాడు. మొత్తం మీద డా॥ రంగయ్య ఆచార్య తిరుమల సాహితీమూర్తికి ప్రాణం పోసి నేడు ఈ పుస్తకాన్ని ముద్రించటం అభినందనీయం. రంగయ్య శైలి పాఠకులను ఆకట్టుకొని కట్టిపడేసే విధంగా ఉంటుంది. ఈ చిరంజీవికి నేను పర్యవేక్షకురాలిగా ఉండినందుకు గర్విస్తూ నా అభినందనలు ఆశీస్సులు అందిస్తున్నాను.

తేది: 25.05.2008 - కె.కుసుమారెడ్డి



డా॥ ద్వా.నా. శాస్త్రి
161-428, గాంధీనగర్
హైదరాబాద్-500 080
ఫోన్: 98492 93376



# మంచి పరిశోధన

విమర్శ, పరిశోధన రెండూ సాహిత్యాభివృద్ధికి రెండు కళ్లు. ఒకదానికొకటి ఉపకారులు. విశ్వవిద్యాలయాలలో పరిశోధన రానురాను ఉత్తమ పరిశోధనగా కాకుండా ఉత్త పరిశోధనగా వుంటోందని చాలాసార్లు విమర్శించాను. అప్పుడప్పుడు ఉత్తమ పరిశోధనలూ వెలువడుతున్నాయి. వాటిలో డా॥ పోరెడ్డి రంగయ్య వెలువరించిన "ఆచార్య తిరుమల కావ్యాలు-పరిశీలన" ఒకటి.

ఆచార్య తిరుమల నేనూ ఎం.ఏ. తెలుగులో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో సహాధ్యాయులం. హాస్టల్‌లో 'రూమ్‌మేట్సు'. కూడా. అంతేకాదు- ఎం.ఏ. అయిపోయిన తర్వాత నేను ఉస్మానియాలో భాషాశాస్త్రం చదువుతున్న రోజుల్లో- 1972లో బర్కత్‌పుర చమన్‌లో ఒక గదిలో వుండేవాళ్ళం. మేమిద్దరం ఒకరికొకరం అనురక్తులం. నేను ఎం.ఏ.లో జేరేటప్పటికే తిరుమల సంస్కృత, తెలుగు సాహిత్యాలు బాగా చదువుకున్నాడు. నా రూమ్ మేట్ కావడం నా అదృష్టం. అతని వల్లనే నా సాహిత్య రచనకి బీజం పడింది. నన్నెంతో ప్రోత్సహించినవారిలో తిరుమల ఒకడు.

ఆచార్య తిరుమల అక్షరాలా బహుముఖ ప్రతిభాశాలి. అతను నిలువెల్ల ఆత్మీయుడు. అతని వల్ల ఎందరో కవులయ్యారు. గాయకులయ్యారు. సాంస్కృతిక కార్యకర్తలయ్యారు. జంట నగరాల సాహితీ సాంస్కృతిక సంస్థలకు చుక్కాని అయ్యాడు. అటువంటి ఆచార్య తిరుమలపై డా॥ పోరెడ్డి రంగయ్య పిహెచ్.డి. చెయ్యటం, దానిని అచ్చువెయ్యడం- నా చేత రెండు మాటలు రాయించడం గొప్ప అనుభూతి. నన్ను మళ్ళీ తిరుమల వలయంలోకి తీసికెళ్ళారు రంగయ్య.

డా॥ పోరెడ్డి రంగయ్య ఉత్తమ అధ్యాపకులు. సాహితీపిపాసి. ఇంతకుముందే సీమ కథలపై ఎం.ఫిల్.చేశారు. ఆ పుస్తకం అచ్చు కావలసిన అవసరం వుంది. ఇప్పుడు డా॥

కుసుమాబాయిగారి పర్యవేక్షణలో ఉస్మానియాలో డాక్టరేట్ కోసం "ఆచార్య తిరుమల కావ్యాలు-పరిశీలన"పై పరిశోధన చేశారు. నిజానికి ఇది డిగ్రీకోసం మాత్రమే చేసింది కాదని- ఈ పుస్తకం చెప్తుంది. చాలా లోతుగా విస్తృతంగా అధ్యయనం చేసి రాసిన పుస్తకం ఇది. మొత్తం రచనలపై కాకుండా కావ్యాలు మాత్రమే తీసుకోవటం వల్ల మంచి సిద్ధాంత గ్రంథమైంది. ఒక కవిని ఎలా అంచనా వెయ్యాలో రంగయ్యకి బాగా తెలుసు. తిరుమల కవిత్వంలో ఎన్ని రహస్యాలున్నాయో, ఎన్ని పోకడలున్నాయో వెల్లడించిన తీరు సమంజసంగా వుంది. ఈ పుస్తకంలో తిరుమల కవితా ప్రభ దర్శనమిస్తుంది. ఇంత మంచి పుస్తకం వెలుగు చూస్తున్నందుకు నాకంటె ఆనందించేవారుండరన్న విశ్వాసం నాది.

ఒకసారి తిరుమలతో అన్నాను "పిహెచ్.డి. చెయ్యొచ్చుగదా?" అని. "నేను చెయ్యను. నాపై పిహెచ్.డి.చెయ్యాలి" అని సమాధానమిచ్చారు. అది నేటికి నిజమైంది. తిరుమల ఆత్మ అంటూ వుంటే ఇప్పుడు శాంతిస్తుంది, పొంగిపోతుంది. డా॥ పోరెడ్డి రంగయ్యకి శుభాకాంక్షలందిస్తూ దీంతో ఆగిపోకుండా రచనా వ్యాసంగం కొనసాగించాలని కోరుతున్నాను.

10-06-2008. - ద్వా.నా. శాస్త్రి




కవి శిరోమణి

**ఆచార్య రావికంటి వసునందన్**

M.A., M.Phil., Ph.D.

అధ్యక్షులు, తెలుగు అధ్యయన శాఖ

డా॥ బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం

హైదరాబాదు. సెల్: 9849852182




# తిరుమలకోశం

నామకరణం చేసేటప్పుడు సాధారణంగా పరిశోధకులు అంశానికి సంబంధించిన "ఒక పరిశీలన" లేదా "సమగ్ర పరిశీలన" అని పరిశోధనాంశాన్ని పేర్కొంటారు. కాని, ఈ గ్రంథం పేరులో ఆ పద్ధతి లేదు. దీనికి కారణం మిత్రుడు డా॥ పోరెడ్డి రంగయ్య నిత్య ప్రత్యగ్రమతితో సమగ్రంగా, సమీచీనంగా, ఇంకొక పరిశోధకునికి వీలు కలుగకుండా, కవికౌస్తుభ ఆచార్య తిరుమల సాహిత్య సర్వస్వాన్ని పరిశోధనాంశంగా ఆవిష్కరించడం అనుకుంటాను. అందుకే, ఈ 'ఆచార్య తిరుమల కావ్యాలు-పరిశీలన' తిరుమలకోశం. పద్యంలో, గద్యంలో, గేయంలో నిరాఘాటంగా కొనసాగిన ఆచార్య తిరుమల సాహిత్య రేఖలకు, జీవన విశేషాలకు ఇది వైశిష్ట్యానుశీలనం. ఆకరాల సేకరణ నుండి ప్రణాళికారచన, సోపపత్తికమైన వివరణ, అధ్యాయ విభజన చాకచక్యంతో చకచక నడిచిన ఉత్తమ పరిశోధన గ్రంథం ఇది. దీనితో ఆచార్య తిరుమలకు ఒక పరిణత సాహిత్య వారసత్వం సమకూరిందనడంలో ఎలాంటి సందేహమూ లేదు.

రచన సుమధురంగా, విస్పష్టంగా, ఎక్కడా పక్కకు పెట్టకుండా చదివించే రీతిలో సరస ధోరణిలో సాగింది. పరిశోధన గ్రంథ రచనలో ఈ ఫణితి సాధించడం కష్టం. డా॥ రంగయ్య సహజకవి, ఉత్తమ అధ్యాపక విద్వన్మణి ఐన నేపథ్యం- ఆయనకున్న ప్రతిభావ్యుత్పత్తి అభ్యాస వాహికలను ఇందులో ముడి వేసి చూపింది. ఎన్నో కృతులు ప్రచురించిన పూర్వానుభవం ఈ గ్రంథం దోషరహితంగా, గుణమహితంగా అచ్చులో ఆవిష్కృతం కావడానికి దారి తీసింది. ఆనుపూర్వి, అధ్యతన మహాకవుల లక్షణాలను ఆచార్య తిరుమలతో బేరీజు వేయడంలో ఈ రచయిత దార్శనికత, తిరుమల కవిత్వ లక్షణాలను ప్రదర్శించడంలో అసమాన్య ప్రజ్ఞ ప్రకాశిస్తున్నాయి. పరిశోధన వ్యాసంగానికి కావల్సిన హంగులన్నీ రంగయ్య వస్తువిన్యాస వైఖరిలో పొంగులెత్తుతూనే ఉన్నాయి. ఆచార్య కె.కుసుమాబాయిగారు ఈ పరిశోధన వ్యాస పర్యవేక్షణతో మరొక కొత్తరేకు ఎత్తుకున్నారు.

ఈ రచయిత పరిశోధనలో, సాహిత్య విమర్శలో, ఉత్తమ కవిత్వ రచనలో కాలక్రమంలో మరిన్ని కొత్తదారులు వేసుకోవాలని మనసారా ఆకాంక్షిస్తూ...

28.05.2008 - వసునందన్



**Prof. Masana Chennappa**
M.A., M.Phil., Ph.D.
Department of Telugu
Osmania University
Hyderabad - 500 007
Resi: 040 - 27201007
Cell:98856 54381

# తిరుమలాంతరంగం

20వ శతాబ్ది తెలుగు కవులలో ఆచార్య తిరుమలకు ప్రముఖస్థానం ఉంది. ఆయన సంప్రదాయ సాహిత్యాన్ని సమగ్రంగా ఆకళింపు చేసుకున్న ఆధునిక కవి. ప్రాచీన, అర్వాచీన కవితా మార్గాలను తెలిసికొని తనదైన ఒక కొత్త మార్గానికి ఆద్యుడయ్యాడు.

పద్య గద్య గేయ వచన కవితా ప్రక్రియల్లో తనదైన ముద్రను చూపించగలిగిన సాహితీమూర్తి తిరుమల. ఆయన పేరులోని ఆచార్య శబ్దం అధ్యాపకత్వాన్ని, తిరుమల శబ్దం కవిత్వ తత్వాన్ని మనకు తెలియజేస్తున్నాయి.

ఆచార్య తిరుమల జీవితాన్ని పరిశీలించినప్పుడు ఒక అధ్యాపకుడు ఇంత వైవిధ్యభరితమైన సాహిత్యాన్ని సృష్టించగలడా అనే అనుమానం కలుగుతుంది. కాని, ఆచార్య తిరుమల ప్రతిభావంతుడు కనుక దాన్ని సాధించగలిగాడు. కవిత్వానికి పాతకొత్తలు లేవని నిరూపించిన నవ్య కవితామూర్తి తిరుమల. ఆయన కవితలు సహృదయులకెంత ఆనందాన్ని కూర్చాయో, ఆయన ఆకాశవాణి లలితగీతాలు శ్రోతలకు అంత కర్ణపేయం చేశాయి.

ఆయన మరికొన్నాళ్లు జీవించి ఉంటే తెలుగు కవిత కొత్తపుంతలు తొక్కేదని, తెలుగుభాషా సాహిత్యాలకు సమన్వయాన్ని సాధించిన అలాంటి ఉభయకవిమిత్రుడు లేనిలోటు నేటికీ లోటుగానే కనిపిస్తుంది. ఆయనతో పాటు నేను ఎన్నో సాహితీ సభలలో, కవి సమ్మేళనాల్లో పాల్గొన్నాను. ఇప్పుడేసభకు వెళ్లినా. ఆచార్య తిరుమల లేకపోయెనే అనే బాధ కల్గుతుంది. ఒక నియమబద్ధమైన జీవితాన్నే కాక, సాహిత్య సృజనను అసిధార వ్రతంగా కొనసాగించిన తిరుమల చాలా మంది ఆధునిక కవులకు మార్గదర్శకుడు. అలాంటి మహానుభావుడు జీవించి ఉండగానే ఆయన రచించిన కావ్యాలను పఠించి, పరిశీలించి ఆయన సాహితీ వరివస్యను ఒక పరిశోధన గ్రంథ రూపంలో డా॥ పోరెడ్డి రంగయ్య తీసుకొని రావడం నాకెంతో హర్షదాయకమైంది.

డా॥ పోరెడ్డి రంగయ్య తిరుమల కావ్యాంత రంగంలోకి ప్రవేశించి అందలి అమూల్య కవితా సంపదను మనకందించాడు. తిరుమల కవిత్వం ఒక క్షీరాబ్ది. డా॥ రంగయ్య తన



పరిశీలనా చక్షువును కవ్వంగా చేసుకొని ఆ క్షీరాబ్దిని తరచి మనకు నవనీతాన్ని అందించే ప్రయత్నం చేశాడు.

ఈ సిద్ధాంత గ్రంథం చదివితే తిరుమల మన కళ్లముందే ఉన్నాడన్న అనుభూతి కలుగుతుంది. అంతేకాదు, తిరుమల కావ్య నిర్మాణదక్షత ఎంత గొప్పదో మనకు తెలుస్తుంది.

కావ్యాలను రాసే అదృష్టమే కాదు, కావ్యాలను అధికంగా అంకితం తీసుకున్న అదృష్టం తిరుమలకే దక్కింది. ఆయన శిష్యవత్సలుడు. ఆయన సహచర్యంతో ఎంతోమంది కవులయ్యారు. ఎంతోమంది పాఠకులు రచయితలయ్యారు. డా॥ పోరెడ్డి రంగయ్య సహజంగా కవి. ఆయన ఆచార్య తిరుమల కావ్యం మీద పరిశోధన చేసి ఉత్తమ పరిశోధకుడయ్యాడు.

తిరుమల కావ్య సర్వస్వాన్ని ఆమూలాగ్రం దర్శించటానికి ఈ సిద్ధాంత గ్రంథం ఎంతో ఉపయోగపడుతుంది.

పరిశోధకుడు కేవలం తిరుమల జీవితాన్ని పైపైన పరామర్శించక, ఆయన జీవిత లక్ష్యాన్ని తెలుసుకునే ప్రయత్నం చేశాడు. అంతేకాదు, మౌలికంగా ఆయన కావ్యాలను అనుశీలించి తిరుమల ప్రతిభా పాటవాలను సోదాహరణంగా తెలియజేశాడు. అన్నింటికంటే నాకు నచ్చింది పరిశోధకుడు ఆచార్య తిరుమలలో కనిపించే రెండు పార్శ్వాలను (సంప్రదాయ, అభ్యుదయ ధోరణులు) దర్శింపజేయడం. తిరుమల కవితోక్తులు సూక్తులైన విధానాన్ని డా॥ రంగయ్య విశదపరిచిన తీరు బాగుంది. “నిరంతర అధ్యయనశీలి అవడంచేత తిరుమల కవితాసూక్తి సుధామయంగా చవూలూరిస్తుంది” అన్న పరిశోధకుని అభిప్రాయంతో నేనేకీభవిస్తున్నాను.

ఈ సిద్ధాంత గ్రంథాన్ని చదివినప్పుడు తిరుమల ఒక మానవతామూర్తిగా, ఒక ఆధ్యాత్మికవేత్తగా, ఒక సహృదయ సాహితీవేత్తగా, అచ్చమైన కవిగా మనకర్థమవుతాడు.

తిరుమలలో సందర్భానుసారంగా స్పందించి కవితా వినీలాంబరంలో మెరుపులు మెరిపించే సుగుణమే కాక, శాశ్వతమైన విలువలను అక్షరబద్ధం చేసే నిబద్ధత కూడా ఉందని ఈ సిద్ధాంత గ్రంథం నిరూపిస్తుంది. అందుకు డా॥ రంగయ్య కృషిని మెచ్చుకోకుండా ఉండలేకపోతున్నాము.

కవిది కావ్య పరిశ్రమ అయితే, పరిశోధకునిది అనుశీలన పరిశ్రమ. డా॥ రంగయ్య దేన్నైనా అలవోకగా చేయడు. అయువును పట్టుకునే సాహసం చేస్తాడు. అందుకే ఆ పని నిర్దుష్టంగా ఉంటుంది. ఎన్నుకున్న అంశం మీద సదభిప్రాయంతో పాటు ఎన్నుకున్న కవి మీద అభిమానం ఉండటం తప్పు కాదు. డా॥ రంగయ్యలో ఈ సద్గుణం ఉండటం వల్ల ఈ సిద్ధాంత గ్రంథం సహృదయ సంవేద్యమైంది. ఆచార్య తిరుమలకు గల కవితా దాహం ఏ పాటితో లోకానికి అవగతమైంది.

"దప్పికతో తిరుగుతున్నాను
భువన భవనాలు
కవితాధార కోసం"

అని ఆచార్య తిరుమల స్వయంగా చెప్పుకున్నాడు. కవితాదాహం ఉన్నవాడే కవి. తిరుమల నిజమైన కవి. అట్లే తెలుసుకొని చెప్పాలన్న దాహం ఉన్నవాడే పరిశోధకుడు. అలాంటి పరిశోధకుడు డా॥ పోరెడ్డి రంగయ్య.

డా॥ రంగయ్య నా దగ్గర చదువుకున్న ఎం.ఏ. విద్యార్థుల్లో ఉత్తమ విద్యార్థి. నా దగ్గర పరిశోధన చేస్తే బాగుండుననుకున్నవారిలో రంగయ్య ఒకరు. కానీ, ఆ అవకాశం ఆచార్య కె.కుసుమారెడ్డిగారికి లభించింది. ఐనా నాకు ఈ సందర్భంగా తాను రచించిన ఈ సిద్ధాంత గ్రంథానికి నాలుగు మాటలు రాయమని కోరినందుకు సంతోషిస్తూ, ఉత్తమ అధ్యాపకుడిగా, కవిగా, పరిశోధకుడిగా ఇంకా ఉన్నత శిఖరాలను అధిరోహించాలని కోరుతూ ఇటువంటి ఉత్తమ పరిశోధకునికి విశ్వవిద్యాలయాలు తగిన స్థానాన్ని ఇవ్వాలని ఆకాంక్షిస్తూ పరిశోధకున్ని హృదయపూర్వకంగా ఆశీర్వదిస్తున్నాను.

తేది:23.05.2008. - మసన చెన్నప్ప





భారత్‌భాషాభూషణ్, కవితిలక
డా. తిరునగరి
6-17/5 డి.నగర్
గణేష్ నగర్, చింతల్
హైదరాబాదు - 54.
సెల్:9392465475

# ఆచార్య తిరుమల సాహితీమూర్తిని చూపే నిలువుటద్దం

అద్యతనాంధ్ర కవి ప్రపంచంలో ఆచార్య తిరుమలది సమున్నత స్థానం. మహాకవి దాశరథి 'కవితా గోష్ఠికి తిరుమల కవి లేనిది వన్నె లేదు' అన్నారు. పద్యం నుండి వచన కవిత దాకా అన్ని కవితా ప్రక్రియలలో రచనలు చేశారు. గేయ రచనలో ఆయనది ప్రత్యేక శైలి రమ్యత. 'లిరిసిజం' దండిగా ఉన్న కవి. దండి పద లాలిత్యం, భారవి అర్థగౌరవం కాళిదాసు కవితాధారను అకళించుకున్న కొద్దిమంది కవులలో ఆచార్య తిరుమల ఒకరు. మాఘుణ్ణి నిరంతరం అధ్యయనం చేసిన పండితుడాయన. నన్నయ్య నుండి చిన్నయ్యదాకా అటు సంప్రదాయ సాహిత్యాన్నీ రాయప్రోలు నుండి సి.నారాయణరెడ్డిదాకా ఆధునిక కవిత్వాన్నీ కూలంకషంగా, సమగ్రంగా చదివిన సాహితీవేత్త ఆచార్య తిరుమల. ఆయన పద్యం హృద్యం. గేయంలో తీయతేనియ రుచి. వచన కవితలో తనదైన 'ముద్ర'.

ఆయన 'నిరంతర కవి'. తుదిశ్వాస విడిచేదాకా ఎత్తిన కలం దించకుండా రచనలు చేశారు. సిరిప్రెగడ భార్గవరావులాగా అర్థాంతరంగా వెళ్ళిపోయారు. రాసిన ప్రతి పద్యం వాక్యం రమణీయార్థ ప్రతిపాదకమే. తిరుమల కన్ను మూసేనాటికి తెలుగు సాహితీ జగత్తులో మధ్యాహ్న మార్తాండునిలా ప్రకాశించారు. జాషువా మహాకవి మాటలలో 'రవ్వలు రాల్చారు ఆంధ్రవాణికి గరగరలు పచరించారు'. ఆచార్య తిరుమల సాహితీ వ్యక్తిత్వం ఎందరినో ఆకట్టుకుంది. అందరి ప్రశంసలందుకుంది. ఆయన శబ్దశారద.

ఆచార్య తిరుమలతో నాకు నాలుగు దశాబ్దాల స్నేహానుబంధం. మునిమున మీసంబు మొలుచునాటి నుంచి ఇప్పటిదాకా చిన్న పెద్ద పత్రికలలో సహపంక్తిలో మా రచనలు ప్రచురింపబడినై. ఆయన ఏలూరు నుండి హైదరాబాదుకు వచ్చిన తరువాత సాహితీక్షేత్రంలో నిరంతర కృషీవలుడుగా ఎన్నో పంటలు పండించారు. నగరంలో అన్ని సాహిత్య కళాసంస్థలతో ప్రగాఢ సంబంధాన్ని పెట్టుకున్నారు. కవులతో, సాహితీవేత్తలతో సహృదయులతో ఆయనది

ప్రగాఢ సంబంధం. ఒక్కమాటలో చెప్పాలంటే ఆచార్య తిరుమల సౌహార్ద్ర హృదయమే ఆయనను సాహిత్యాభిమానులకు సన్నిహితుణ్ణి చేసింది. ఆయనకూ నాకూ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారంటే ప్రత్యేకాభిమానం. ఆముక్తమాల్యదలోని రాయల కవితా వైదగ్ధ్యాన్ని గూర్చి మేం కలిసినప్పుడల్లా ప్రత్యేకంగా ముచ్చటించుకొనేవాళ్ళం. ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే ఆచార్య తిరుమలతో మాట్లాడడమే ఓ ఎడ్యుకేషన్. సాహిత్య సభలలో, ఆకాశవాణిలో, దూరదర్శన్‌లో ఆయన కవితాగానాలు, ప్రసంశలూ విన్నవారు మరచిపోలేరు. ఒక సాహిత్యాన్ని గూర్చి ఆయన మూల్యాంకనం ఓ విశిష్టంగా ఉండేది. కవిగా, సమీక్షకుడిగా, విమర్శకుడిగా, వ్యాసకర్తగా ఆయనది విలక్షణమైన, విశిష్టమైన రీతి. తన యేభయ్యేదేళ్ళ జీవితకాలంలో నలభైదాకా గ్రంథాలు రచించి తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేసిన 'సుకవి' ఆచార్య తిరుమల.

ఆచార్య తిరుమల సాహితీ వ్యక్తిత్వాన్ని గూర్చి, ఆయన సమగ్ర సాహితీ ప్రపంచాన్ని గూర్చి విస్తృతంగా పరిశోధించిన ప్రతిభాశాలి, డా॥ పోరెడ్డి రంగయ్య. ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఆచార్య తిరుమల సమగ్ర సాహిత్యంపై పరిశోధించి పిహెచ్.డి. పట్టా పొందారు. ఓ మహాకవిని గూర్చి ఓ మంచి పరిశోధకుడు రచించిన సిద్ధాంత గ్రంథం ఇది. డా॥ పోరెడ్డి రంగయ్య యువకవి, వ్యాసకర్త. సాహిత్య విమర్శకుడు. 'శబ్దశిల్పాలు' అనే మినీ కవితా సంపుటిని ప్రచురించి యువతరం కవులలో స్థానం సంపాదించాడు. తిరుమల కవిత్వాన్ని, సాహిత్యాన్నీ లోనారసి తిరుమల గూర్చి సమకాలీన సాహితీమూర్తుల అభిప్రాయాలనూ సేకరించి, సంస్కృత, ఆంగ్ల సాహిత్యాలలోని కవితా ఆధునిక కవితా ధోరణులను స్పృశించి, తమ పరిశోధనా వ్యాసంలో సందర్భోచితంగా పేర్కొనడం ద్వారా డా॥ రంగయ్య తమ సిద్ధాంత వ్యాస రచనకు సాహితీ విలువను సంతరించారు. ఆచార్య తిరుమల సాహితీ మూర్తిని చూపే నిలువుటద్దం ఈ గ్రంథం. భావితరాలకు ఉపయోగించే కొన్ని సిద్ధాంత గ్రంథాలలో ఇదొకటి. మరో మాటలో చెప్పాలంటే సహస్రాధికంగా వచ్చిన వాటిలో నిలిచే కొన్నింటిలో ఈ సిద్ధాంత గ్రంథం ఒకటి. ఇప్పటివరకు రెండు వందలదాకా సిద్ధాంత గ్రంథాలు చదివిన అనుభవంతో ఈ మాటలు అనడానికి సాహసిస్తున్నాను. ఇంతటి విశేషకృషి చేసిన ఈ యువ పరిశోధకుడిని అభినందిస్తున్నాను. ఆచార్య తిరుమలతో నా స్నేహం దృష్ట్యా డా॥ పోరెడ్డి రంగయ్యతో శిష్యవాత్సల్యం కారణంగా "ఈ గ్రంథానికి నాలుగు మాటలు వ్రాయండి సార్" అని అడిగాడు డా॥ పోరెడ్డి రంగయ్య. ఆయన ఆత్మీయతకు అభివాదాలు తెలుపుకుంటూ ఆయనకు ఉజ్జ్వల భవిష్యత్తు నాకాంక్షిస్తూ...

తేది: 31.5.2008 - తిరునగరి



'కవిసౌజన్య', 'మహోపాధ్యాయ'

**డా॥ లింగంపల్లి రామచంద్ర**

ఎం.ఏ., పిహెచ్.డి.

పూర్వసెనెట్ సభ్యుడు, కాకతీయ విశ్వవిద్యాలయం
రాష్ట్ర ప్రభుత్వ ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహీత
ఇంటర్నేషనల్ మ్యాన్ ఆఫ్ ది ఇయర్ 1996
బి.యన్.రెడ్డి. సాహితీ పురస్కార గ్రహీత
పాల్కురికి అవార్డు గ్రహీత
సెల్ : 9394023143



## ఈ పరిశోధనం సమగ్ర దర్శనం

పరిశోధన అనేది మానవ జీవితాన్ని జ్ఞానపథంలో నడిపించి గమ్యాన్ని చేర్చే అన్వేషణాత్మకమైన అక్షరకళ. ఇది విస్తృతమైన విశ్లేషణను కలిగి ఉంటుంది. వాస్తవాలను ప్రకటిస్తుంది. అందుకోసం సరికొత్త సూత్రాలను కొలమానాలుగా వినియోగిస్తుంది. నవీనమైన సిద్ధాంతాలను వివేచించి సమన్వయించి ఆశావహమైన ఆకర్షణవంతమైన ప్రయోజనశీలమైన ఫలితాలను సాహితికి అందిస్తుంది. ఆగామి తరాలకు పాదేయంగా నిలుస్తుంది. ప్రభావితం చేస్తుంది కూడా.

డా॥ పోరెడ్డి రంగయ్య పరిశోధన అలాంటిది. ఆయన ఆధునిక తెలుగు సాహిత్యాన్ని ప్రభావితం చేసిన కొద్దిమంది కవుల్లో ఒకరైన డా॥ ఆచార్య తిరుమలగారి సాహిత్యాన్ని "డా॥ ఆచార్య తిరుమల కావ్యాలు-పరిశీలన" అనే శీర్షికతో పరిశోధించాడు.

డా॥ తిరుమల దాదాపు అరవైయేళ్లు జీవించారు. ఆయన సాహితీ జీవితం మాత్రం నలభై ఐదు వసంతాలు. పద్యం, గేయం, వచనపద్యం, రూపకం, విమర్శ, సిద్ధాంత వంటి ప్రక్రియల్లో చాలా గ్రంథాలు వెలయించారు. విజ్ఞులను కదలించారు. రసజ్ఞులను అలరించారు. అంతర్జాతీయ సాహిత్య వేదికల నుంచి కవితాగానం చేశారు. తెలుగు సాహితి విలువలను పెంచారు. ఆదరణను కూడా తెచ్చారు. ఆయన మహావక్త. సభలను ఉర్రూతలూగించే చమత్కృతి తోడి మాధుర్యం ఆయన గళంలోంచి వినిపించే నాదకళ. అలా జీవితాన్ని సాహిత్యంగా అందించిన తిరుమలగారి సాహిత్యాన్ని పరిశోధించిన డా॥ పోరెడ్డి రంగయ్య అన్ని విధాలా యోగ్యతలున్న సాహిత్యాభిలాషి, వినయరాశి. వివేకశీలి. సౌజన్యరాశి, జ్ఞానవారాశి. ఆయన నా విద్యార్థి. శైశవం నుంచి ఆయన వ్యక్తిత్వాన్ని చూస్తున్నవాణ్ని. బడిని గుడిగా ఆరాధించిన ఉత్తముడు. ఆయనలో నిత్యచైతన్యం ఉంది. పరిశీలనా పటుత్వం ఉంది. సూటిదనం ఉంది. నీటుదనం. అధ్యయనశీలం ఉంది. సమాజ పరిణామాలను

వ్యాఖ్యానించే చతురత ఉంది. సద్విమర్శా స్వభావం ఉంది. సిద్ధాంత ప్రతిపాదనం ఉంది. సమన్వయ సంయోజనాశీలం ఉంది. సరియైన బాటను వేసే లక్షణం ఉంది. స్వచ్ఛంద సంస్థను సజీవంగా నడిపించే కృశీవలత్వం ఉంది. ఆయన మానవత్వానికి కళ్లవంటివాడు. మనిషికి నీడలాంటివాడు. మనస్సుకు పరిమళం లాంటివాడు. ఉషస్సుకు నాదంలాంటివాడు. బోధనను కళగా మలచుకున్న గురువు. జిల్లా రాష్ట్ర స్థాయిలలో మాదిరి పాఠ్యాంశాలను బోధించిన ఆచార్యుడు. ఉపాధ్యాయ ఉద్యమనేత. అంతరాలు లేని ధార్మికుడు. పొలిమేరలు కనిపించని దార్శనికుడు. దాపరికం లేని రసజ్ఞుడు. తనను తెలుసుకున్న తత్వజ్ఞుడు. ఎత్తుకు ఎదిగినా ఒదిగిపోయే గుణశీలుడు. అందరినీ ఎదకు హత్తుకునే విశాల భావుకుడు. అదీ డా॥ పోరెడ్డి రంగయ్య సాహిత్య సాహితీ జీవితం. అలాంటి చక్కని వ్యక్తిత్వం ఉన్న డా॥ రంగయ్య ఆయన జీవితంలో ముప్ఫై యైదేళ్ల వయసుసనాటికే బృహత్తర పరిశోధనాంశానికి న్యాయం చేశాడు. అంతకుముందే 'సీమకథలు-సామాజికాంశాలు' అనే పేరుతో చక్కటి సిద్ధాంత గ్రంథాన్ని రాసి ఉస్మానియా విశ్వవిద్యాలయం నుంచి ఎం.ఫిల్. డిగ్రీ పొందాడు. ఆ గ్రంథం కూడా చాలా విలువైనదే. ఆయన ప్రస్తుతం ఇటీవలే 'శబ్దశిల్పాలు' అనే భావ సౌందర్యంలో ఉన్న కవితా సంపుటిని ప్రచురించాడు. ఈ సంపుటిని నాకే అంకితమిచ్చాడు. డా॥ రంగయ్య ముద్రిస్తున్న 'ఆచార్య తిరుమల కావ్యాలు-పరిశీలన' అనే అంశంలో ఐదు అధ్యాయాలున్నాయి. పుటలు 435. నేను ముందు చెప్పినట్టు పరిశోధనకు అవసరమైన అన్ని కొలమానాలను వాడుకొని తన సిద్ధాంత గ్రంథానికి ప్రామాణికతను కల్పించారు. ఇదీ డా॥ రంగయ్య సూక్ష్మ వివేచనకు లోతైన వైదుష్యానికి చక్కని తార్కాణ. ఆయన ఈ ప్రక్రియలో మరిన్ని గ్రంథాలు రాయాలి. సంస్కృతిని కాపాడాలి.

శుభాశీస్సులతో....

గుండ్లగూడెం,

5.6.2008. – రామచంద్ర



# కృతజ్ఞతలు

తెలుగు కవిత్వంలో నవ్య ప్రక్రియలను సృష్టిస్తూ, గేయ కవితకు పట్టాభిషేకం జరిపించిన 'విశ్వంభర' మహాకవి, తెలుగు కవితకు చిరునామా, జ్ఞానపీఠ అవార్డు గ్రహీత, పద్మభూషణ్ 'అభినందన'తో ఆశీర్వదించిన డా. సి. నారాయణరెడ్డి గారికి –

'నానీ'ల ప్రక్రియకు పురుడుపోయిడమే కాకుండా దాన్ని వటవృక్షంగా ఎదిగేలా చేసిన నానీలనాన్న బహుగ్రంథ కర్త, ప్రముఖ సాహితీవేత్త, విమర్శకాగ్రేసరులు, కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయ పూర్వ వైస్‌ఛాన్సలర్ గురువర్యులు ఆచార్య ఎన్.గోపి గారికి –

ఆచార్య తిరుమల సాహిత్యాన్ని పరిశోధనాంశంగా అవకాశం ఇచ్చి ప్రోత్సహించిన ఆనాటి ఫ్యాకల్టీ ఆఫ్ ఆర్ట్స్ డీన్ ఆచార్య ఎస్.వి.రామారావుగారికి, తెలుగు శాఖ అధ్యక్షులు ఆచార్య ఎల్లూరి శివారెడ్డిగారికి, బోర్డ్ ఆఫ్ స్టడీస్ ఛైర్మన్ ఆచార్య యెల్లంద రఘుమన్న గారికి, ఆశీస్సులు అందించిన ఆచార్య కసిరెడ్డి గారికి –

ఆచార్య తిరుమల గారు భారతదేశం నలుమూలలూ, విదేశీ పర్యటనలు చేయడంలో చేయూత, స్ఫూర్తిని కలిగించటంతోపాటు, అడిగిన వెంటనే నా విన్నపాన్ని మన్నించి శిష్యవాత్సల్యంతో గుండెలోకి నన్ను చేదుకొని 'సాహిత్య సాగర మథనం' శీర్షికతో దీవించిన సుప్రసిద్ధ సాహితీవేత్త, విమర్శకులు అంతర్జాతీయ ఖ్యాతిని పొందిన కవివరేణ్యులు డా. జె. బాపురెడ్డి (ఐ.ఏ.ఎస్) గారికి –

కవిగా,అత్యుత్తమశ్రేణి విమర్శకులుగా తెలుగు సాహిత్యమంతటా పరచుకున్న ప్రముఖ సాహితీవేత్త, సాహితీ శిఖరం 'మంచి పరిశోధన' అంటూ ప్రోత్సహించిన డా. ద్వా.నా. శాస్త్రి గారికి –

సిద్ధాంత వ్యాసం రాస్తున్నపుడు చర్చకు చక్కటి అవకాశం కల్పించి నాలో తలెత్తిన సంశయాలను సాకల్యంగా వివరించి నా మార్గాన్ని సుగమం చేయడమే కాకుండా 'ఆశీస్సులు' అందించిన పరిశోధన గురువులు ఉస్మానియా విశ్వవిద్యాలయ తెలుగుశాఖ అధ్యక్షులు ఆచార్య కె. కుసుమారెడ్డి గారికి –

పరిచయమైన నాటి నుండి ఈనాటి వరకూ తరగని వాత్సల్యాన్ని కురిపిస్తూ పుత్రునిలా అక్కున చేర్చుకున్న ప్రముఖకవి, విమర్శకులు డా. బి.ఆర్. అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయ తెలుగు అధ్యయనశాఖ అధ్యక్షులు, కవిశిరోమణి ఆచార్య రావికంటి వసునందన్ గారికి –

స్నాతకోత్తర స్థాయిలో పాఠాలను బోధించడమే కాకుండా, జీవితాన్ని వెలిగించుకునే ప్రశ్నలనూ నేర్పించిన ఆర్ష దార్శనికులు. భారతీయ తత్వదర్శనులు అత్యుత్తమ ఆచార్యులు ఉస్మానియా విశ్వవిద్యాలయ అధ్యాపక సంఘం అధ్యక్షులు, ఆచార్య మసన చెన్నప్ప గారికి–

'సీమ కథలు- సామాజికాంశాలు' (ఎం.ఫిల్ డిగ్రీ) పరిశోధనాంశానికి మార్గదర్శనం చేసిన గురువులు ప్రముఖ సాహితీవేత్త, నిరంతర పరిశోధకులు ఆచార్య ననుమాస స్వామి గారికి –

పరిశోధనకు అవసరమైన తన సాహిత్యానంతా అందించి పరిశోధనలోని మెళకువలను వివరించి చర్చకు సానుకూలంగా అవకాశం కల్పించి పుత్ర వాత్సల్యాన్ని చూపిన ప్రముఖ సాహితీవేత్త, విమర్శకులు కీ.శే. ఆచార్య తిరుమల గారికి, పరిశోధన పనిమీద ఎప్పుడు ఇంటికి వెళ్లినా ఆప్యాయంగా పలకరిస్తూ ఆతిథ్యాన్నిచ్చిన మాతృమూర్తి శ్రీమతి శేష సుభద్ర గారికి, వారి కుటుంబసభ్యులకు –

సాహితీ సృజనలో, విమర్శలో సూచనల్ని, విలువైన అభిప్రాయాల్ని అందిస్తున్న ఆచార్య జయధీర్ తిరుమలరావు, ఆచార్య కె. యస్. రమణ, ఆచార్య ఎస్వీ సత్యనారాయణ, ఆచార్య శిఖామణి, డా. వెలుదండ నిత్యానందరావు, డా. బన్న అయిలయ్య గారలకు –

తెలుగు సాహిత్యాన్ని ఔపోశన పట్టడమే కాకుండా, విలువైన సాహిత్య సృజనతోపాటు విమర్శను రాశులుగా పోసిన సుప్రసిద్ధ సాహితీవేత్త 'నీ సాహితీ సృజన కొనసాగాలంటూ' సున్నితంగా కర్తవ్యాన్ని గుర్తు చేస్తున్న గురువర్యులు భారత్‌భాషాభూషణ్, కవితిలక డా. తిరునగరి గారికి –

నాచే అక్షరాలతోపాటు జీవితాన్ని దిద్దుకునే అక్షరాలు... ఆపై సాహిత్యాక్షరాలను దిద్దించి... సాహిత్యాభిమానిగా మార్చి... పరిశోధనరంగంలోకి దూకించి ఎం.ఏ., ఎం.ఫిల్, పిహెచ్.డి. డిగ్రీలు అందుకునేవరకు వేలుపట్టి నడిపించిన గురుదేవులు, నా హృదయమంతా పరచుకున్న పితృసమానులు, మానవత్వానికి నిలువెత్తు ప్రతీక కవిసౌజన్య డా. లింగంపల్లి రామచంద్ర గారికి –

నా పరిశోధన గ్రంథం ముద్రణ రూపంలో వెలుగుచూడాలని వెన్నుదట్టి ప్రోత్సహించిన ప్రముఖ సాహితీవేత్త, పల్లెపట్టుల్లో ఉంటూ పల్లెలే ప్రాణంగా సాహిత్యసేవ చేస్తున్న అవిశ్రాంత సాహితీ సృజనకారులు, మధురకవి డా. కూరెళ్ళ విఠలాచార్య గారికి –

అత్యున్నత అధికారి, పరిపాలనాదక్షులు, ప్రముఖ సాహితీవేత్త డా.ఏ. విద్యాసాగర్ (ఐ.ఏ.ఎస్) కమీషనర్, సాంఘిక సంక్షేమ శాఖ గారికి –

ఆలేరు శాసనసభ్యులు డా. కుడుదుల నగేష్, మాజీమంత్రివర్యులు శ్రీ మోత్కుపల్లి నర్సింహులు, శాసనమండలి సభ్యులు శ్రీ బి. మోహన్‌రెడ్డి, శ్రీ పి. సుధాకర్‌రెడ్డి గారలకు –

శ్రీ కలపాల ఆనందకిశోర్, డైరక్టర్ ఎస్.సి.ఇ.ఆర్.టి., శ్రీ సత్యనారాయణరెడ్డి, ఆర్.జె.డి., శ్రీ పాటి నర్సింహారెడ్డి, ఆర్.జె.డి., శ్రీ వి.ఎన్. మస్తానయ్య, డి.ఇ.ఓ., గారలకు–

తెలుగు సినీపాటకు జాతీయ అవార్డుతో మరింత గౌరవాన్ని ఆపాదించిపెట్టిన ప్రముఖ సినీ గేయ రచయిత 'జన కవన జ్వాల' శ్రీ సుద్దాల అశోక్ తేజ గారికి –

సహజకవి, నంది అవార్డు గ్రహీత, సినీ గేయ రచయిత డా.అందెశ్రీ గారికి –

విద్యావేత్త, స్పేస్ (వయోజన విద్య) డైరక్టర్ డా. సి.ఎన్.రెడ్డి, ఏకశిల విద్యాసంస్థల అధినేత శ్రీ సి. ఉపేందర్ రెడ్డి గారలకు –

ఈ పరిశోధన గ్రంథ ముద్రణకు కొంత ఆర్థిక సహాయం అందించిన పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం అధికారులకు –



నా ఈ గ్రంథాన్ని అంకితం తీసుకోవడానికి అంగీకరించిన మానవతామూర్తి, ఉపాధ్యాయ ఉద్యమనేత, అందరి హృదయాలపై ఊరేగుతున్న సౌహిత్యశీలి శ్రీ ననబోలు బాల్‌రెడ్డి దంపతులు గారలకు –

ఎం.ఏ. నుండి పిహెచ్.డి. డిగ్రీలు అందుకునే వరకూ సహాధ్యాయి, పరిశోధకుడు. నా మాటను అంగీకరించి పరిచయాన్ని రాసిన ఆత్మీయ మిత్రులు తెలుగుసాహితీ లోకంలో తనదంటూ ఓ ప్రత్యేకతతో వేళ్లూనుకున్న కవి, విమర్శకుడు డా. ఎస్. రఘు గారికి–

విద్యాబోధనతోపాటు జీవితాన్ని దిద్దుకునే క్రమశిక్షణను నేర్పిన అక్షరగురువులు ప్రముఖ కవి, బహుముఖీన ప్రజ్ఞాశాలి శ్రీ కలపాల పుష్పనాథం గారికి –

పి.ఆర్.టి.యు రాష్ట్ర అధ్యక్ష కార్యదర్శులు శ్రీ పి. వెంకటరెడ్డి, శ్రీ పి. రవికిరణ్, నల్లగొండ శాఖ అధ్యక్ష కార్యదర్శులు శ్రీ టి.జితేందర్ రెడ్డి, శ్రీ పూల రవీందర్, మాజీ అధ్యక్ష కార్యదర్శులు శ్రీ ఎ. సీతారామచందర్ రావు, శ్రీ జి. సుదర్శన్ రెడ్డి, సీనియర్ నాయకులు శ్రీ జి. వెంకటరెడ్డి, శ్రీ ఎం.ఏ. అజీజ్, శ్రీ కొల్లు మధుసూదనరావు, నల్లగొండ మండలశాఖ అధ్యక్షులు శ్రీ ఎస్. బిక్షంగౌడ్ గారలకు –

నా మాటలను ఆత్మీయంగా తీసుకొని ఆర్థికసహాయం అందించి తమ హృదయాలను ఆవిష్కరించిన దాతలు శ్రీ కొప్పుల బాపురెడ్డి దంపతులు (ప్రధానోపాధ్యాయులు, విశ్వభారతి విద్యాలయం, ఆలేరు), శ్రీ అయిల రామనర్సయ్య దంపతులు (రిటైర్డ్ గెజిటెడ్ ప్రధానోపాధ్యాయులు), ఆలేరు; శ్రీ మూర్తల సుభాష్ రెడ్డి దంపతులు (రీజినల్ మేనేజర్ విఎస్‌టి కర్నూలు); శ్రీ బేతి మహేందర్ రెడ్డి, రియల్టర్ శాయిగూడెం; శ్రీ బింగి రామకృష్ణ, ప్రముఖ వస్త్ర వ్యాపారవేత్త, ఆలేరు గారలకు –

అడిగిన వెంటనే చిరునవ్వుతో నా విన్నపాన్ని మన్నించి అందమైన ముఖచిత్రాన్ని రాసి ఇచ్చిన ప్రముఖ చిత్రకారులు, ఆత్మీయులు నివాస్ (ఆంధ్రభూమి) గారికి –

నన్ను ప్రోత్సహిస్తున్న ప్రముఖ కవులు, విమర్శకులు శ్రీ గోవర్ధనం పురుషోత్తమాచార్య, డా. తూర్పు మల్లారెడ్డి, శ్రీ వేమూరి వెంకటేశ్వరశర్మ, శ్రీ వేణు సంకోజు, శ్రీ పున్నా అంజయ్య, శ్రీ కందుల సత్తయ్య, డా.పెద్ది వెంకటయ్య, డా.రాపోలు సత్యనారాయణ, శ్రీ సిహెచ్. ఆంజనేయులు, శ్రీ నాగపురి శ్రీనివాసులు, డా. కృష్ణ కౌండిన్య, శ్రీ ఆరుట్ల యాదగిరిరెడ్డి, డా.బండారు సుజాతశేఖర్, శ్రీ పెసరు లింగారెడ్డి గారలకు –

ఇప్పటి వరకు తేజ ఆర్ట్ క్రియేషన్స్ నిర్వహించిన కార్యక్రమాలకు ఆర్థిక చేయూత నందించిన వదాన్యులు శ్రీమతి & శ్రీ ఆరుట్ల సుశీలాదేవి, విప్లవరెడ్డి దంపతులకు, శ్రీ టి. శోభనాద్రి, శ్రీ సిలివేరు సుదర్శనం, శ్రీ గోస్కొండ బాల్‌రెడ్డి, శ్రీ టి. వేణుగోపాలస్వామి, శ్రీ చెక్కిళ్ల మధుసూదన్, శ్రీ పెంటపర్తి మాధవరెడ్డి గారలకు –

సాహిత్యాభిమాని, ప్రముఖ రాజకీయనాయకులు డి.సి.సి.బి. డైరెక్టర్ శ్రీ జనగాం ఉపేందర్ రెడ్డి, ప్రముఖ వ్యాపారవేత్త శ్రీ ఏనుగుల చంద్రయ్య గారలకు –

నా ఉన్నతిని ఆకాంక్షించే సాహితీ ప్రముఖులు, శ్రీ విరువంటి గోపాలకృష్ణ, శ్రీ ఎస్. హరగోపాల్, శ్రీ తిరునగరి శ్రీనివాస్, శ్రీ ఎం.డి. అబ్దుల్, శ్రీ యంబ నర్సింహులు,

శ్రీ నర్సింగోజు లక్ష్మయ్య, శ్రీ మంగళగిరి యాదగిరిస్వామి, ఆత్మీయమిత్రులు శ్రీ గుత్తి రాజేశ్వరరావు, శ్రీ ఎ. ప్రభాకారాచారి, శ్రీ పానుగంటి రామమూర్తి, శ్రీ సుధాకర్, శ్రీ తిరునగరి శ్రీధర్, శ్రీ సింహాద్రి, గురువర్యులు శ్రీ జి. ముకుందరెడ్డి, శ్రీ వి. అంజిరెడ్డి, శ్రీ వంటేరు వెంకటేశ్వర్లు గారలకు -

దీనశరణ్య అధ్యక్షులు శ్రీ చింతల సాయిబాబా, సామాజిక సేవా కార్యకర్తలు శ్రీ బేతి రాములు, శ్రీ మంచన మల్లేశం, శ్రీ బి. స్వామి గారలకు -

అంబేద్కర్ ఓపెన్ యూనివర్సిటి ఆలేరు అధ్యయన కేంద్ర అధ్యాపక బృందానికి-

గత దశాబ్దిన్నరకాలంగా నేను నిర్వహిస్తున్న సాహిత్య, సామాజిక సేవా కార్యక్రమాలకు ప్రచారం కలిగించడమే కాకుండా వెన్నుదట్టి ప్రోత్సహిస్తున్న ఆలేరు మండల పత్రికా విలేఖరుల రుణం ఎన్నటికీ తీరనిది. అలాంటి గౌరవ పాత్రికేయులు గారలకు -

'విప్ల పబ్లికేషన్స్' పక్షాన ఆచార్య తిరుమల గారి కొన్ని కావ్యాలను ముద్రించడంతో పాటు వారితో ఆత్మీయ సంబంధం కలిగిన సాహిత్యాభిలాషులు, చిన్నవాన్నైనా అమితమైన ప్రేమను చూపుతూ నా ఈ పరిశోధన గ్రంథాన్ని అందంగా ముద్రించి ఇచ్చిన 'విప్ల కంప్యూటర్ సర్వీసెస్' అధినేత శ్రీ ఎం. విజయసేనారెడ్డిగారికి, సహకరించిన సిబ్బందిగారలకు -

ఆలేరు మండల విద్యాశాఖకు, ఉపాధ్యాయలోకానికి సేవచేసే అవకాశం కల్పించిన ఆలేరు పి.ఆర్.టి.యు. సంఘానికి, సహకరిస్తున్న కార్యవర్గానికి, సీనియర్ నాయకత్వానికి, ప్రాథమిక సభ్యులకు, సోదర ఉపాధ్యాయ సంఘాల గారలకు -

సాహిత్య, సమాజసేవ అంటూ తిరిగే వారిని ఆ ఇంటి వాళ్లు భరించడం ఎంత కష్టమో అనుభవంలో ఉన్న వారికి బాగా తెలుసు. అలా నన్ను పుష్కరకాలం పైగా భరిస్తూ సహకరిస్తున్న నా శ్రీమతి రాజేశ్వరికి, కుమారులు శరత్‌చంద్ర, సాహితీ చంద్రలకూ -

ప్రూఫులు చూడడంలో సహకరించిన ఉపాధ్యాయురాలు బండ్ల మమత (చేర్యాల)కు-

జన్మనిచ్చిన తల్లిదండ్రులకు, తోబుట్టువులకు, బంధువులకు, ఆత్మీయతను పంచిన జన్మభూమి గుండ్లగూడెంకు, నన్ను గుండెలకు హత్తుకున్న గొలనుకొండ, శారాజీపేట గ్రామాలకు - ప్రస్తుతం నేను పనిచేస్తున్న జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల (శారాజీపేట) అధ్యాపక బృందానికీ, ఆలేరు ప్రజలకు, ప్రజాప్రతినిధులకు -

తేజ ఆర్ట్ క్రియేషన్స్ నిర్వహించే కార్యక్రమాలకు చేయూతనందిస్తున్న ప్రతి ఒక్కరికీ-

నా సాహితీ ప్రస్థానంలో సహకరిస్తున్న వారు వందల్లో ఉన్నారు. అందరిపేర్లు ఇక్కడ రాసుకోలేకపోతున్నాను. అయినా ఎప్పుడో నా హృదయ పలకపై చెరిగిపోకుండా ముద్రించుకున్నాను.

కృతజ్ఞతాభివందనాలు.

- డా॥ పోరెడ్డి



# విషయసూచిక



## అధ్యాయం-1

## తిరుమల జీవితం - సాహితీ వ్యక్తిత్వం

## అధ్యాయం-2
### తిరుమల రచనలు - పరిచయం



## అధ్యాయం-3
### తిరుమల కవితా దృక్పథానుశీలనం







## అధ్యాయం-4
### తిరుమల కవితా వైశిష్ట్యానుశీలనం



## అధ్యాయం-5



## అనుబంధం

అధ్యాయం-1

# తిరుమల జీవితం - సాహితీ వ్యక్తిత్వం

కవి మానవుడు. మనిషి మనిషిగా పరిమళిస్తే, ఆయనలో ఉన్న మానవత్వం మరీ భాసిస్తే, అతడు ఒక మహోన్నత శిఖరంగా ఎదుగుతాడు. ఎలుగెత్తి జాతిని పిలుస్తాడు. చేయెత్తి జీవన పథాన్ని నిర్దేశిస్తాడు. అందరికంటే ముందుగా తాను నడుస్తాడు. ఎన్ని అడ్డుగోడలు నడకను నిలువరించినా, ఎన్ని చీకట్లు తమ విషపు కోరలతో చరచినా, తన గమ్యాన్ని చేరే దాకా పయనం సాగిస్తూనే ఉంటాడు. ప్రజాభ్యుదయం కోసం, మానవ జీవన సౌభాగ్యం కోసం చెమట కాలువలు కట్టిస్తాడు. అట్లా జన జీవన సౌఖ్యం కోసం ఆరాటపడే కవిలో పలురకాల భావనలు ఉదయిస్తాయి. గాయపరచిన సంఘటనలు, రుధిరాన్ని నడిపించిన సన్నివేశాలు, ఆకలితో తనువులు చాలించిన హృదయ విదారక దృశ్యాలు అంతేకాక, ప్రకృతి సౌందర్యం నాదరూపంగా తరగలెత్తే శబ్దచిత్రాలు, ఇవన్నీ మనసున్న అతనిలో స్పందనను కలిగిస్తాయి. కార్యోన్ముఖున్ని చేస్తాయి. ఆయన హృదయ పాదు నుంచి కవితాంకురాలను సృష్టిస్తాయి. గళమెత్తి పాడిస్తాయి. కావ్యాలుగా అవతరిస్తాయి. ఒక అపూర్వమైన, ఆశావహమైన రమ్యాలోకాన్ని మరింతగా దర్శింపజేస్తాయి. తన చుట్టూ పరచుకొని ఉన్న సమాజాన్ని అనేక ప్రక్రియల ద్వారా సరిదిద్దటానికి అతడు పూనుకుంటాడు. అవి పాట, పద్యం, గేయం, వ్యాసం అలాంటివి ఎన్నైనా కావచ్చు. వాటిని సమాదరించి చైతన్యోర్మికులను కదను తొక్కించి సమాజ హృదయాంతరాళలో ప్రశాంతను కలిగిస్తాడు. ఎన్ని దుర్ఘటనలు ఎదురు వచ్చినా తన మార్గాన్ని ఆగామి కాలానికి ప్రయోజనవంతంగా రూపిస్తాడు. ఆచార్య తిరుమల అలాంటి కవీ, పండితుడునూ. కవితా స్వరూపాన్ని, కవిత్వంలోని సౌగంధ్యాన్నీ నిండుగా ఆస్వాదించిన కవితామూర్తి ఆయన. కవిత్వ పరిణామ దశలను, అవి సాధించిన విజయ పరంపరలను నిండుగా అనుభవించి ప్రాచీనార్వాచీన రీతులను, గతులను సాకల్యంగా అవలోకనం చేసుకున్న దార్శనికుడు. మహాకవి డా॥ సినారె తిరుమల కవితాత్మలో ఉప్పొంగుతున్న రసరేఖల స్వరూపాలను మనోజ్ఞంగా దర్శించి చెప్పారు.

కవిత్వం ఎలా పుడుతుంది?
కదిలే మనసుంటే.
పాట ఎలా గజ్జె కడుతుంది?
హృదయంలో లయ లహరులెత్తితే.
మాట ఎలా ఉరుముతుంది?
ధర్మాగ్రహం జడలు విదిలిస్తే.
వ్యాసం ఎలా ఉదయిస్తుంది?

ఆలోచన మారాకు హత్తితే.
ఆ కవిత
ఆ పాట
ఆ మాట
ఆ వ్యాసం
నాలుగు పేటలుగా అల్లుకున్న ప్రతిభ
ఆచార్య తిరుమల ప్రభ !![1]

తిరుమల దృష్టి భవిష్యత్తును సుషమాసుందరంగా చూడడమే. కవితతో చెరగని సోయగాలను రేపటికి కుప్పలుగా పోయడమే. ఆయన ఆలోచన అంతా ఒక రసలోకాన్ని నిర్మించడం కోసమే. "ముందు చూపు కవి ఒక్కడు చాలు, వాడు అవశ్యం కలిగిస్తాడు మేలు"[2] అన్న ఆరుద్ర మాటలు తిరుమల ఎడల అక్షర సత్యాలు.

తిరుమల కవితానుశీలనానికి ముందు ఆయన జీవిత రేఖలను పరిచయం చేస్తున్నాను.

## 1. జననం

ఆధునిక కవులలో రుచిరమైన స్థానాన్ని సంతరించుకున్న డా॥ ఆచార్య తిరుమల పార్థివ నామ సంవత్సరం ఆశ్వయుజ బహుళ పాడ్యమి అశ్విని నక్షత్రమున (20-10-1945) జన్మించారు.

"కమలాచలాగ్ర మార్కండేయ శివ శిర
శ్శశి చంద్రికా ధౌత సౌధ వీధి
గోదావరి పుణ్య కూలంకషా జల
స్వారిత శ్రీ రుద్ర పాద యుగళి
బలవదభ్యున్నత ప్రాకార పరివేష
గండూషితాజాండ మండలంబు
గంధ దంతావళ గ్రైవేయ ఘంటికా
ఠంకార ముఖర ఘంటా పథంబు
రాజబింబాననా నూత్న రత్న పేటి
వీర రాహుత్త సుభట కంఠీరవాద్రి
వేమ భూపాల రాజ్యాభివృద్ధికరము
సాంద్ర విభవంబు రాజమహేంద్రవరము"[3]

అని ప్రస్తుతి గాంచింది రాజమహేంద్రవరం. తెలుగు సాహిత్యానికి నాంది పలికి, చారిత్రకంగా, సాంస్కృతికంగా, పౌరాణికంగా ప్రత్యేకతను సంతరించుకొని సంఘ సంస్కరణను వికసింపజేసిన రాజమహేంద్రవరం తిరుమల జన్మస్థలం. ఇక్కడికి ఇరవై కి.మీ. దూరంలో ఉన్న పెంటపాడు గ్రామం ఆయన స్వస్థలం. తాడేపల్లిగూడెం తాలూకా



పరిధిలోనిది ఈ గ్రామం. నన్నయ్య కాలం నుండి ప్రతి శతాబ్దానికి ఒక మహాకవిని అందిస్తున్న ఘన చరిత్ర[4] పుణ్య గోదావరికి ఉంది.

సుగుణావతి, శ్రీమత్తిరుమల వేంకట శ్రీనివాసాచార్యులు తిరుమల జననీజనకులు. ఈ దంపతులకు పన్నెండు మంది సంతానం. ఐదుగురు మగవాళ్ళు, ఏడుగురు ఆడవాళ్ళు. నాలుగవ సంతానం తిరుమల. 'ఆచార్య తిరుమల' గా నిఖిల జగత్తుకు పరిచయమైన ఆయన పూర్తిపేరు శ్రీమత్తిరుమల వేంకట వీర రాఘవ జగన్నాథాచార్యులు. ఐతే డా॥ వేల్చేరు నారాయణ రావు "నీ పేరు అంత పెద్దదిగా ఉంటే ఎవరు పిలుస్తారని"[5] 'ఆచార్య తిరుమల' అని అందంగా స్వరూపించారు. వారి మాట తిరుమలను సాహితీవేత్తగా నిలబెట్టిందేమో ! ఇదే పేరు ఆయన కలం పేరు కావటం విశేషం.

## 2. గురు చతుష్టయం

### (అ) శ్రీమత్తిరుమల వేంకట రాఘవాచార్యులు

ఆచార్య తిరుమల కవిగా ఎదగటానికి ఆయన సొంత ఇల్లే పాదు అని చెప్పాలి. ఎందరో విద్వత్కవులు వీరి పూర్వీకులు. భక్తి జ్ఞాన విజ్ఞాన విశిష్టమైన పండిత వంశం వీరిది. అంతేకాక వాళ్ళ సమకాలికులైన కవులు వీరింటికి వస్తూ కవితాగోష్ఠులు జరుపుతుండేవారు. తిరుమల పూర్వజులలో వారి తాతయ్య వేంకట రాఘవాచార్యులు సంస్కృతాంధ్రాంగ్ల భాషల్లో బాగా రాణించినవారు. ఆయన కవి, తత్త్వవేత్త, లౌకికవాది, సుప్రసిద్ధ ఆయుర్వేద వైద్యులు, షడ్దర్శనవేది. అంతేకాదు, కవితా రహస్యాలు బాగా తెలిసినవారు. తిరుపతి వేంకటకవులు లాంటి ఉద్దండులు కూడా తూర్పు పశ్చిమ గోదావరి జిల్లాల్లో ఎక్కడ సభలు నిర్వహించిన రాఘవాచార్యుల ఆశీస్సులతో, ఆయన సలహాలతో నడిపేవారట. ఆయన లేకుండా సభలు నిర్వహించేవారు కాదట. రాఘవ వెంకటేశ్వర శతకం, భీష్మ సంభవం, వేశ్యామృతం వంటి రచనలు ఆయన లేఖిని నుండి వెలువడినాయి. కాని ప్రస్తుతం అలభ్యం. 'వేశ్యామృతం' కావ్యాన్ని పి.యస్.ఆర్. అప్పారావు తన 'నాట్యశాస్త్ర' అనువాదంలో ఉదహరించారు. తాత ఒడిలో కూర్చొని ఆయన సాహితీ పరిజ్ఞానాన్ని గుండెలోకి చేర్చుకోగలిగారు తిరుమల. తమ ఇంటికి వచ్చే కవి శ్రేష్ఠులతో రాఘవాచార్యులు జరిపే చర్చలు, వాదోపవాదాలు, శాస్త్ర సాహిత్య గోష్ఠులు, కవి పండిత వరేణ్యుల కవితా గానాలు ఇటువంటివన్నీ తిరుమల లేత హృదయంలో చిద్విలాసాలు చేసేవి. ఆలోచనకు స్ఫూర్తి కలిగించేవి. ఒక ఉద్వేగాన్ని సృష్టించేవి. అప్పుడే ఆయన మానసంలో కవి మేల్కొన్నాడు. ఏవో, ఏవేవో సాహితీ లహరులు తిరుమల సుకుమార అధరాల నుంచి తొణికి తొణికి పడుతుండేవి. తాత వాత్సల్యం, ప్రోత్సాహం తిరుమల కవిగా ఎదగడానికి తోడ్పడి అక్షరమూర్తిని చేశాయి. *"I learnt the rudiments of Telugu and Sanskrit from my Grand father Sri. Raghavacharyulu who was also a great scholar in the six darsanas"* అని తిరుమల తన తాతయ్య పాండిత్య విశిష్టతను

గూర్చి చెప్పారు. తిరుమల సాహితీ వికాసానికి, రచనా వికాసానికి తాతయ్య ఆత్మీయత, సాన్నిహిత్యం ఎంతగానో దోహదం చేశాయి.

### (ఆ) శ్రీమత్తిరుమల వేంకట శ్రీనివాసాచార్యులు

డా. ఆచార్య తిరుమలకు సంస్కృత, తెలుగు భాషా శబ్దజాలంపై పట్టును నేర్పింది వారి తాతగారైతే, సాహితీమూర్తిగా ఎదగడానికి, సాహితీ జీవితంలో హ్లాదరమణీయమైన తళకులను అద్దింది ఆయన నాన్న శ్రీమత్తిరుమల వేంకట శ్రీనివాసాచార్యులు. ఆచార్యులు ప్రాచీన సాహిత్యాన్ని ఆపోశన పట్టిన పండితులు. ఋషితుల్యులు. పరమాత్మ దర్శనం పొందిన అదృష్టజాతకులు. కవిత్వంలో ఉన్న మార్మికతను విప్పి చెప్పగల ధీషణ ఆయన సొంతం. సాహిత్యంలో ప్రామాణికమైన అంశాలను సిద్ధాంత పరచడంలో ఆయనకు ప్రత్యేక అభినివేశం ఉండేది. ఈ తత్వాన్ని ఆయన వేదాధ్యయనం ద్వారా, విస్తృత పరిశీలనం ద్వారా సంతరించుకోగలిగారు. మహాభారతాన్ని పంచమ వేదమని నిరూపణ చేశారు. అందుకు వేదాలు, వేదాంగాలు వాటి స్వరూప స్వభావాలు తమ రచనకు ఉపయోగపడిన విధానాన్ని ఆచార్యులు సాహితీలోకానికి అందించి తన శాస్త్ర పరిశీలనా దక్షతను చాటుకున్నారు. కవిత్వం రాయటంలోని మెళకువలను, పద్యంపై పట్టును తండ్రి వద్దే నేర్చుకున్నారు తిరుమల. "నాకు తండ్రి, గురువు, దైవం అన్నీ మా నాన్నగారే. కవిత్వపరమైన విషయాలలో మా నాన్న గారిని ఒప్పించటం, మెప్పించటం చాలా కష్టంగా ఉండేది"[7] అంటారు తిరుమల. అంతేగాక *"Not only the blood that flows in my vien's is his but also the power that electrifies all my thoughts"*[8] అంటూ నాన్న నుండి స్వంతం చేసుకున్న సాహితీ పరిజ్ఞానం గురించి చెప్పారు.

"గీతా కృష్ణుని దివ్యరూపమును యోగీంద్రుండవై గాంచి, త
ద్గీతానంత మహత్వ తత్త్వయుత వాగ్దేవీశ కోశంబులన్
చేతః ప్రీతిని పంచిపెట్టి ప్రజకున్ క్షేమామృతంబిచ్చి, లో
కాతీతంబుగ వెళ్ళినేగితివి? మోక్షానంద కాంక్ష రతిన్"[9]

శ్రీనివాసాచార్యులు దేవాదిదేవుని దివ్యావతారాలు దర్శించి ఋషిత్వాన్ని పొందిన గొప్పజ్ఞాని. ఈయన 1983లో పరమపదించారు.

### (ఇ) సుగుణావతి

తాత, తండ్రిల నుండి పద్యగద్యాలను సొంతం చేసుకున్న తిరుమల కన్న తల్లి నుండి మాతృప్రేమతోపాటు గేయ కవితా మాధుర్యాలను చవి చూశారు. "నేను పాట మీద కుదురుగా నిలవటానికి, లయ నాలో లహరులెత్తటానికి ఆమె పాటే కారణం...... సంగీతజ్ఞత మా అమ్మగారి నుండి వచ్చాయని"[10] తిరుమల చెప్పుకున్నారు. తిరుమల మాతృమూర్తియైన శ్రీమతి సుగుణావతి సంప్రదాయ కుటుంబంలో పుట్టిన సాధ్వి. పేదసాదల నాదరించిన పుణ్యాత్మురాలు. భక్తురాలు. ధన్యజనని. సంస్కృతాంధ్ర సాహిత్యాలతో ఆమెకు మంచి పరిచయం ఉంది. అమ్మ ఒడిలోనే ఆటపాటలు నేర్చుకున్నారు తిరుమల. సహజంగా శ్రీ వైష్ణవ కటుంబాల వాళ్ళు ద్రావిడ వేదాన్ని పారాయణం చేసుకునే సంప్రదాయం ఉంటుంది. సుగుణావతి ద్రవిడ వేదంలోని విషయాలను గేయాలుగా పాడుతుండేవారు. "ఆమె మధుర గాయని. త్యాగరాజకృతులు, నారాయణ తీర్థుల వారి తరంగాలు, జయదేవుని అష్టపదులు అమె పాడుతుంటే వినితీరాలి. తన్మయత్వం కలిగేది. ఆమె భారత, భాగవత, రామాయణాలు, పురాణాలు అన్నీ తన కోసం చదివింది"[11] అని తిరుమల 'వాత్సల్య వల్లిక' కావ్య ముందుమాట 'మాతృదేవోభవ' లో తెలిపారు. అంతేకాక, శ్రావణ శుక్రవారాల విశిష్టతను తెలిపే పాటలు కూడా ఆమె మధురాతి మధురంగా ఆలపిస్తుండేది. స్వరయుక్తమైన పాటలకు తిరుమల ముగ్ధుడయ్యేవారు. అమ్మ పాటలను తానూ అనుకరించేవారు. శ్రీనివాసాచార్యులు కూడా అప్పుడప్పుడు ఆమెచేత పాటలు పాడించుకొని ఆనందించేవారు. ఆమె కంఠ మాధుర్యం ఇంటిల్లిపాదికి ఆనందాన్ని కలిగించేది. తిరుమల పాటకు ప్రేరణ కలిగించిన తల్లిని పాటకు తొలి గురువుగా భావిస్తారు. 'ఆమె లేకపోతేనా పాటలేదు' అని వినమ్రంగా చెబుతారు. శైశవంలో తాత, తండ్రి, తల్లి గారల భాషా సాహిత్యాల ప్రభావం ఆయన మానసాన్ని కదిలింపజేసింది. ఒక ప్రగాఢమైన ఆలోచనకు, అన్వేషణకు ఉద్దిష్టమైన ప్రేరణ కలిగించింది. సుగుణావతి 21-09-1992న మరణించారు.

### (ఈ) చల్లా కృష్ణమూర్తి శాస్త్రి

తాత, తండ్రి, తల్లి ప్రతిభా పాటవాలను సొంతం చేసుకున్న తిరుమలకు బ్రహ్మశ్రీ చల్లా కృష్ణమూర్తి శాస్త్రి ఇచ్చిన స్ఫూర్తి మరో రసరేఖను ఆవిష్కరించింది. చల్లా వారు శ్రీనివాసాచార్యులకు ప్రత్యక్ష గురువు. తపస్వి. ఆయన తరచుగా వీరి ఇంటికి వస్తుండేవారు. బ్రహ్మ విజ్ఞాన పరిచయము, ఆత్మ బ్రహ్మకర్మ జ్ఞానము, 'గీతా విజ్ఞానము, గీతా చార్య లక్ష్మీనారాయణీయము' అనే శీర్షికతో వేదవిద్యకు ప్రమాణబద్ధమైన వ్యాఖ్యానాన్ని చేసి 'అనుశ్రుత వైజ్ఞానిక' అనే బిరుదు పొందిన చల్లా వారు ప్రాచీన వైదిక సాహిత్యంలో ఉన్న ఆధ్యాత్మిక విలువలను తిరుమలకు వివరించేవారు. వీటిని చాలా ఆసక్తితో వినేవారు. అంతేకాదు, హృదయంలో పదిలంగా దాచిపెట్టుకునేవారు. ఏకాంతంలో ఉన్నప్పుడు చల్లా బోధనలు పాటలుగా, పద్యాలుగా ఆయన నోటి నుంచి వెలువడుతుండేవి.

పద్యంకానీ, పాటకానీ, గేయంకానీ మరో ప్రక్రియ ఏదైనా సంప్రదాయాన్ని, ఆధ్యాత్మిక విలువలను ప్రోదిచేసుకున్న రచనలే పదికాలాల పాటు నిలబెడతాయి. జాతిని ప్రబోధిస్తాయి. తిరుమల అలాంటి గురుచతుష్టయం అందించిన బోధనల నేపథ్యంలో నుంచే ప్రముఖంగా ఎదిగారు. అందుకే ఆయన లేఖిని నుంచి వెలువడే ప్రతి రచన వెనక ఒక తాత్విక భూమిక కన్పిస్తుంది. తాత్వికమైన దృక్పథాన్ని ప్రచారం చేసే రచయిత వీస్తున్న అనేక పరిణామ ప్రవాహాలను తట్టుకొని శిఖరంగా నిలబడ గలుగుతాడు. ఆచార్య తిరుమల ఈ విధమైన సంస్కృతీధారను సొంతం చేసుకున్న కళానిధి. కాబట్టి ఆయన ప్రతి కవిత వియన్నదిలాగా సాగిపోతుంటుంది. సొగసులు చెరగని ఆమని సౌగంధంలా పరిమళిస్తూంటుంది. ఆధునిక సాహిత్యంలో చాలా ప్రక్రియలు ఆదరించి మనిషిని ఉన్నతునిగా నిలబెట్టే రచనలు చేశారు.

## 3. విద్యాభ్యాసం

శైశవంలో సాహిత్యాన్ని రుచి చూచిన తిరుమలకు విశిష్ట వ్యక్తుల పరిచయాలు, సొంత ఇంటిలో ఉన్న దార్శనిక సంప్రదాయరీతులు ఆయనను ఉత్తమ విలువలున్న విద్యార్థిగా తీర్చిదిద్దాయి. మొదట తన అభిజనమైన పెంటపాడులోని వెలమలపేట వీధిబడిలో నాలుగవ తరగతి వరకు చదువుకున్నారు. అక్షర భారతిని గుండెలో పదిలంగా, పవిత్రంగా ఆరాధిస్తున్న తిరుమల అక్షరాలను ఆదే రీతిలో నేర్చారు. అయిదవ తరగతి నుండి యస్.యస్.యల్.సి. వరకు 'శ్రీమత్తిరుమల వేంకట నరసింహాచార్య హిందూ ఉన్నత పాఠశాల'లో చదివారు. 1961లో యస్.యస్.యల్.సి. పూర్తి చేశారు. పెంటపాడు పరిసర ప్రాంతంలో ఉండే హిందువులను విద్యావంతులు చేయాలన్న మహాసంకల్పంతో తిరుమల పూర్వజుడైన నరసింహాచార్య ఆయన పేరు మీద పాఠశాలను ఏర్పాటు చేశారు. ఈ పాఠశాలలో చదువుతున్నప్పుడే తిరుమల "గ్రహంబులలో నుడు రాజుకైవడిన్"[12] అని శ్రీనాథుడన్నట్లుగా విద్యలలో రాణించడమేకాక, పద్యాలల్లటం, పాటలు పాడటం, వ్యాసాలు రాయడం లాంటి ప్రక్రియల్లో విశేషమైన ప్రతిభను ప్రదర్శించేవారు. వ్యాసరచన, వక్తృత్వం, చిత్రలేఖనం, పాటల పోటీల్లో ఎప్పుడూ అగ్రస్థానంలో ఉండేవారు. అతను పాఠశాల స్థాయిలో అనేక బహుమతులు గెల్చుకున్నారు. ఆయన ధారణశక్తికి, కవితాపటిమకు ఆనాటి గురువులు ఎంతో పొంగిపోయేవారు. ముఖ్యంగా ఆనాటి ఉపాధ్యాయులైన చామర్తి సత్యనారాయణ, పరవస్తు రామానుజాచార్యులు, తిరుమలకు భారత, రామాయణ, భాగవతంలోని పద్యాలను రాగయుక్తంగా పాడి వినిపించేవారు. తిరుమల సాహిత్య జిజ్ఞాసను కనిపెట్టి ప్రోత్సహించేవారు. ఇలా గురువుల ప్రోత్సాహంతో సాంస్కృతిక పరమైన పోటీల్లో విశేషంగా రాణించేవారు.

1961 నాటికి ప్రాథమిక విద్యను పూర్తిచేసుకొని 1962లో సర్ కట్టమంచి రామలింగారెడ్డి కళాశాల ఏలూరులో ప్రీ యూనివర్శిటి కోర్సులో చేరారు. అదే కళాశాల నుండి 1966లో బి.ఏ. డిగ్రీని అందుకున్నారు. 1971లో ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి ఎం.ఏ (తెలుగు) స్నాతకోత్తర పట్టాను పొందారు. తిరుమల ఉన్నత చదువులు చదువుతున్నప్పుడు మరింతగా ఎదిగారు. ద్వా.నా. శాస్త్రి, పైడిపాల, మారేమండ శ్రీనివాసరావు, పరిమి రామనరసింహం, యార్లగడ్డ బాలగంగాధర రావు, సున్నా అచ్యుత రావు వంటి పేరు గాంచిన ప్రముఖులు ఎం.ఏ. లో తిరుమలకు సహాధ్యాయులు.

## 4. ఉద్యోగం

తిరుమల ఉద్యోగ జీవితం తెలుగు మాష్టారు గిరితో మొదలయ్యింది. 1966లో డిగ్రీ పూర్తిచేశాక తన స్వగ్రామం పెంటపాడు తాలుకా కేంద్రమైన తాడేపల్లిగూడెం 'గురజాడ విద్యానికేతన్' లో కొన్ని నెలల పాటు ట్యూటర్‌గా పనిచేశారు. అప్పుడు ఆయన జీతం 75 రూపాయలు. తరువాత ఏ.పి.పి.యస్.సి. వారు నిర్వహించిన పరీక్షలలో ఉత్తీర్ణుడై జిల్లా ట్రెజరీలో అకౌంటెంట్‌గా ఎన్నికకాబడినారు. గుంటూరులో నాలుగు నెలల పాటు శిక్షణ



పొందిన పిదప కాకినాడలో పోస్టింగ్ ఇచ్చారు. అక్కడ కొంతకాలం పనిచేశాక ఏలూరుకు బదిలీ చేశారు. ఏలూరులో రెండు సంవత్సరాలు పనిచేశాక కొండముది శ్రీరామచంద్రమూర్తి సలహా మేరకు అకౌంటెంట్ ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఎం.ఏ. (తెలుగు) విద్యార్థిగా అడుగుపెట్టారు. రెండో సంవత్సరం పూర్తికావొస్తున్న సమయంలో (1971) యు.పి.యస్.సి. వారు నిర్వహించిన పరీక్షలలో నెగ్గి హైదరాబాదులో ఉన్న ఆడిట్ అండ్ జనరల్ కార్యాలయంలో అకౌంటెంట్‌గా నియమింప బడినారు. ఈవిధంగా తిరుమల ఉద్యోగ రీత్యా పెంటపాడు నుండి మకాంను హైదరాబాదుకు మార్చుకున్నారు. తిరుమల సహజంగా ఆర్ద్ర హృదయులు. చక్కని కవితాత్మ ఉన్న భావుకులు. అప్పటికే చిక్కని చక్కని రచనలెన్నోచేశారు. అలాంటి ఆయనకు ఈ అకౌంటెంట్ ఉద్యోగం అంతగా నచ్చలేదు. కూడికలు, తీసివేతలు ఆయన మనస్తత్వానికి సరిపడలేదు. ముఖ్యంగా ఆయనకు ఎప్పుడూ ఉపాధ్యాయుడిగా జీవితం గడపాలన్న కోరిక ఉండేది. ఆ కారణంగా తిరుమల అకౌంటెంట్ ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి పి.వి. నరసింహారావు సతీమణి శ్రీమతి సత్యమ్మ స్మారకార్థం వారి కుమారుడు డా॥ పి.వి. రంగారావు స్థాపించిన 'సత్యమ్మ నరసింహారావు మెమోరియల్ కళాశాల'లో తెలుగు లెక్చరర్‌గా చేరారు. కొంత కాలం తరువాత ఈ కళాశాల అనివార్యకారణాల వల్ల మూతపడింది. అప్పటికే లెక్చరర్‌గా రెండు సంవత్సరాల అనుభవం గడించారు. పిదప సిటీ కాలేజీలో చేరారు. అక్కడ ఒక సంవత్సరంపాటు తెలుగు లెక్చరర్‌గా పనిచేశారు. ఈ కళాశాలలో తిరుమలకు ప్రత్యేకమైన గుర్తింపు దొరికింది. అధ్యాపకుడిగా తిరుమలకు కొన్ని అభిప్రాయాలు ఉన్నాయి. ఆశయాలు ఉన్నాయి. ఇట్లా వేర్వేరు కళాశాలల్లో పనిచేయటం కంటే తానే స్వయంగా ఒక కళాశాలను స్థాపించాలనుకున్నారు. దాన్నొక విద్యారామంగా, ఆదర్శ కేదారంగా మలచాలనుకున్నారు. ఆయన ఆలోచన కార్యరూపం ధరించింది. 1975లో తానే వ్యవస్థాపక అధ్యక్షులుగా 'చైతన్య కళాశాల' పేరుతో ఒక కళాశాలను హైదరాబాదులోని హుమాయూన్ నగర్ (మోహిదీపట్నం)లో స్థాపించారు. ఆయనే తెలుగుశాఖకు అధ్యక్షులుగా ఉంటూ కళాశాలను తీర్చిదిద్దుతూ మంచి ఫలితాలను తెప్పిస్తున్నారు. ఈ కళాశాలకు అనుబంధంగా 'న్యూ చైతన్య కళాశాల'ను స్థాపించారు. కొంతకాలం ఆ కళాశాలకు ప్రిన్సిపాల్‌గా పనిచేశారు. 1989లో రోడ్డు ప్రమాదానికి గురి కావడం వల్ల తిరుమల ప్రిన్సిపాల్ బాధ్యతల నుంచి తప్పుకొని చైతన్య కళాశాలలో తెలుగుశాఖకు అధిపతిగా ఉన్నారు.

## 5. వివాహం

తెలుగు సాహితీరంగంలో ఉన్నతంగా భాసిస్తున్న ఆచార్య తిరుమల వివాహం గుంటూరు వాస్తవ్యులు కిలాంబి వరదాచార్యులు అయిదో కూతురైన శేష సుభద్రతో 1971లో జరిగింది. మంచి పలుకుబడి, సంప్రదాయం ఉన్న వైష్ణవ కుటుంబం వీరిది. తిరుమల ఇదే సంవత్సరం మాస్టర్ డిగ్రీ (ఎం.ఏ.) పొందటం మరో విశేషం. తిరుమల దంపతులకు సంతానం ముగ్గురు అమ్మాయిలు. సుగుణావతి, గీతా భాషిణి, ఆనంద లక్ష్మి వారి పేర్లు. తిరుమల సాహితీ జీవితం ఎలాంటి అడ్డంకులు లేకుండా సాఫీగా సాగుతుందంటే

అందుకు ప్రథమ, ప్రధాన కారకులు శేష సుభద్ర గారే.

నా భార్య సుభద్ర సదా
నా భాగ్యంబటుల వెంట నడవగ కవితా
వైభోగమునై నిల్చితి[13]

అంటూ చెప్పారు. ఆమె తిరుమల భాగ్యం. అంతేకాదు ఎప్పుడూ ఆయన్ని అనుసరిస్తుండేది. ఆమె సహచర్యం వలన కవి కవితావైభోగంతో వెలుగొందారు.

## 6. రచనా వ్యాసంగం

స్కూల్ ఫైనలు చదువు కుఱ్ఱతనము నందె
పద్యమల్లుట కలవాటుపడితి
ఇర్వది రెండేండ్లకే యమునా తటి'
కృతి సంతరించితి కృష్ణవృత్తి
ఇర్వదారేండ్లకు సర్వంకషప్రౌఢి
'చక్రారపంక్తి' రచన సలిపితి
'రామనామ సుధ' లూర 'హృదయ భారతి'
ముప్పదేండ్ల కిడితి పుణ్యమలర

పరగ ముప్పదెన్మిది 'పితృస్మరణ' జేసి
నలుబదేబది మూడేండ్ల నడుమ 'చక్ర
ధ్వజము' 'విశ్వవిభూతి' నవ 'యుగగీత'
'తిరుమలో'క్తు లొసగితి వాగ్దేవి కరుణ[14]

తిరుమల మనస్సులో తన పూర్వజుల సంప్రదాయ రేఖలు తొలకరిలో కన్ను తెరచిన మెరుపుల్లా గిలిగింతలు పెట్టసాగాయి. ఆ స్పర్శ అతని హృదయంలో కవితను ఊహింపజేసింది. ఆ భావనతో తిరుమల యౌవనంలోకి అడుగులేస్తున్న దశలోనే భారత, భాగవత, రామాయణం వంటి గ్రంథాలలోని రసవత్తర ఘట్టాలను ఆపోశన పట్టారు. ఈ ఆపోశనం ధారణకు బాటలు వేసింది. ధారణకొన్ని సమయాలలో, కొన్ని సన్నివేశాలలో కవితాత్మను ఆకర్షణీయంగా పల్లవింపజేస్తుంది. ఈ పల్లవింతల అలల తాకిడుల నుంచే మహాకవి వస్తాడు. ఈ అలల వలయాల నుంచే అమృతం లాంటి ప్రగతి ధర్మ కవిత్వం వస్తుంది. ఈ తాత్వికతను తిరుమల చిన్ననాటి నుంచే సొంతం చేసుకున్నారు. ఇందులో నిరంతర అధ్యయనం కూడా మిళితమై ఆయన కవితారాసిక్యాన్ని స్పష్టీకరిస్తుంది. పదిహేనేళ్ళ వయసులోనే తిరుమల ఒక కవిగా అవతరించారు. అయితే – ఆయన హృదయ కవాటాలు తెరచుకొని కవిత్వం రెక్కలు కట్టుకొని కాగితాల మీద అక్షరంగా నిలిచింది ఓ సన్నివేశం నుంచే. అదేమంటే తిరుమల ఒకనాటి సాయంత్రం తన ఇంటి ముందు కూర్చొని చదువుకుంటున్నారు. ఆ వేళ పెనుగాలి తన వీరత్వాన్ని చూపుతుండటం వలన ఆ



క్రౌర్యాన్ని తట్టుకోలేక ఇంటి ముంగిలిలోనున్న గులాబి చెట్టు పువ్వు నుంచి ఒక్కొక్క రెక్క రాలి నేలపై పడడం ఆయనకు కనిపించింది. ఒక్కొక్క రేకును కొల్పోతున్న గులాబిరూపం తిరుమలకు బాధ కలిగించింది. ఆనాడు చెట్టు కొమ్మమీద తీయని ప్రేమభావనతో రతిపారవశ్యంలో తేలిపోతున్న మగపక్షిని బాణంతో కొట్టగా అది నేలపైబడి చనిపోయినప్పుడు ఆ హృదయ విదారకమైన దృశ్యం వాల్మీకి హృదయాన్ని చలింపజేసింది. ఆ ఆవేదనల్లోంచే శ్లోకం పుట్టుకొచ్చింది. అట్లాగే తిరుమల సుడిగాలికి రెక్కలు పోగొట్టుకుంటూ దీనంగా ఉన్న నగ్న గులాబి రూపం ఆవేదనను కలిగించింది. ఆ వ్యధాపూరిత హృదయంనుంచే ఆయన కాగితం మీద రాస్తే చంపకమాల వృత్తం అయ్యింది. అదీ ఆయన తొలి పద్యం.

"కలకల లాడు నీ ముఖము కన్నుల పండువు గాగదోతువే
చెలువల యంతరంగములు చిత్రముగా! గనవే గులాబి! నీ
కులుకులు చాలు చాలు నిక కోపముతో నిను కూల్చమబ్బులే
బలమగు శత్రుసేనలయి వచ్చిన వల్లదె గాలి కత్తులన్"[15]

## 7. ప్రభావం – పరిచయాలు

పాఠశాల విద్యార్థి నుంచీ తిరుమల జీవితం, సాహితీ నేపథ్యం ఆకర్షణీయంగా ఉందని మొదటే చెప్పాను. తాత, తండ్రి, తల్లి, గురుదేవులు అందించిన సాహితీ సంపదను పదిలపరచుకొని ముందుకు సాగుతున్న తిరుమలకు ఉన్నత పాఠశాలలో గురువుల ప్రోత్సాహం మరింత ముందుకు నడిపించింది. ఏలూరులో ప్రీ యూనివర్సిటి కోర్సు చదువుతున్నప్పుడు అద్దేపల్లి నాగగోపాలరావు తెలుగు భాషను బోధించేవారు. ఆయన ఆంధ్రాంగ్లభాషల్లోనేకాక సంస్కృతంలోనూ మంచి పండితులు. వారి బోధన కవితాత్మతో పరుగులు తీసేది. తిరుమల ఆయన బోధనా వాహినిలో నిలువెల్ల తడిసి పులకించిపోయేవారు. ఇది ఆత్మీయంగా మారిపోయింది. అద్దేపల్లి వారి సాన్నిహిత్యంతో తిరుమలలో సాహిత్య జిజ్ఞాస చిగురుపెట్టింది. తెలుగు కవిత్వంలో వస్తున్న పరిణామ దశల గూర్చి వారితో చర్చిస్తూ ఉండేవారు. 'ఆయన చూపిన అనురాగం, ప్రోత్సాహం కొండంత అండ' అని తిరుమల చెబుతారు. ఎం.ఏ. చదువుతున్న రోజుల్లో తిరుమలకు తూమాటి దోణప్ప, కె.వి.ఆర్.నరసింహం, చిలుకూరి సుబ్రహ్మణ్యం శాస్త్రి, ఎక్కిరాల కృష్ణమాచార్య, లకంసాని చక్రధరరావు, షడంగి వంటి పండిత ప్రకాండులు ఆచార్యులుగా ఉండేవారు. వీరి ప్రేరణ తిరుమలను సాహిత్య విమర్శ వైపు మళ్ళించింది. తరగతి గదిలో పాఠ్యాంశాలను వినడం, చర్చించడమే కాకుండా అదనపు సమయంలో సాహిత్యంలో వస్తున్న సైద్ధాంతిక విలువలను గూర్చి విమర్శనాత్మక పరిశీలన చేస్తుండేవారు. డిగ్రీచదువుతున్న కాలంలో పాఠాలు బోధించి ఎం.ఏ. సహాధ్యాయులుగా చేరిన వేల్చేరు నారాయణరావు ప్రోత్సాహం తిరుమలకు బాగా సహకరించింది. అట్లాగే కొండముది శ్రీరామచంద్రమూర్తి, పోలాప్రగడ సత్యనారాయణ, సామవేదం జానకి రామశర్మ వంటి కవి ప్రముఖులతో ఆయనకు సాన్నిహిత్యం ఉండేది.

ఇంతకు పూర్వమే ప్రస్తావనకు వచ్చిన వారితోపాటు విశ్వనాథ సత్యనారాయణ, దివాకర్ల వెంకటావధాని, రాయప్రోలు సుబ్బారావు, గోపాల్ రెడ్డి, కాళోజీ, సినారె, మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి, పేర్వారం జగన్నాథం, కేతవరపు రామకోటి శాస్త్రి, కోవెల సంపత్కుమారాచార్య, ఉత్పల సత్యనారాయణాచార్య, గుంటూరు శేషేంద్ర శర్మ, యం. కులశేఖరరావు, ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యం, పోతుకూచి సాంబశివరావు, మల్లెమాల, ఎస్వీ రామారావు, ఎన్. గోపి, ఎల్లూరి శివారెడ్డి, కసిరెడ్డి, రఘుమన్న, ముదిగొండ శివ ప్రసాద్, రుక్మిణి, ఆనందరామం, ముదిగొండ వీరభద్రయ్య, రవ్వా శ్రీహరి, జె. బాపురెడ్డి, మసన చెన్నప్ప, తిరునగరి, లింగంపల్లి రామచంద్ర, కప్పిగంతుల లక్ష్మణ శాస్త్రి, చక్రవర్తుల లక్ష్మీనరసమ్మ, జి.వి.కె. కృష్ణమూర్తి, ఊట్ల కొండయ్య, వేదుల సూర్యనారాయణ శర్మ వంటి కవి వరేణ్యులతో, జస్టిస్ ఆవుల సాంబశివరావు, జస్టిస్ ఇ. అయ్యపురెడ్డి, జస్టిస్ కె.పున్నయ్య వంటి న్యాయకోవిదులతో, ఎన్.టి. రామారావు, అక్కినేని, దాసరి, బాలు, సుశీల, జె.వి. సోమయాజులు, పెండ్యాల, పి.బి. శ్రీనివాస్ వంటి సినీరంగ ప్రముఖులతో తిరుమలకు మంచి సాన్నిహిత్యం ఉంది.

## 8. సాహితీ, కళా సంస్థలు - అనుబంధం

తిరుమల రచనలు చేయడమే కాకుండా, సాహితీ, కళా సంస్థలను స్థాపించడమేగాక, వివిధ సంస్థలలో సలహాదారులలో, సభ్యులుగా ఉన్నారు. ఏలూరులో ఉద్యోగం చేస్తున్న కాలంలో 'విజయభారతి' సంస్థను స్థాపించి తానే అధ్యక్షులుగా ఉన్నారు. అదే విధంగా కూరెళ్ళ లక్షణరావు నడిపిన 'తెలుగు దర్బారు'లో సభ్యులుగా ఉండేవారు. సాహితీ సంస్థలతో అనుబంధం ఏలూరులో అంకురార్పణ జరుగగా, హైదరాబాదుకు మకాం మార్చిన తరువాత చాలా సంస్థలు ఆయన నేతృత్వంలో అభివృద్ధి చెందాయి. కళాత్మక విలువలను కాపాడుతున్నాయి. మానవాళిని మంచి వైపు నడిపిస్తున్నాయి. హైదరాబాదు, సికిందరాబాదు జంట నగరాల్లో వెలిసిన సాహిత్య, కళా సంస్థలు తిరుమలతో ప్రత్యక్షంగానైనా, పరోక్షంగానైనా సంబంధం కలిగా ఉన్నవే. వంశీ ఆర్ట్ థియేటర్స్, కిన్నెర ఆర్ట్ థియేటర్స్, సుస్వర ఆర్ట్ అకాడమి, ఆకృతి సాంస్కృతిక సంస్థ, సాధన సాహితీ స్రవంతి, నందనవనం సాహితీ సమితి, స్వర సుధ సాంస్కృతిక సంస్థ, రాజధాని సాంస్కృతిక సంస్థ, శ్రీనివాస సాహితీ సమితి, ఆత్మీయ కల్చరల్ అసోసియేషన్, పాంచజన్య యూత్ అసోసియేషన్, సరస్వతి అసోసియేషన్, ప్రణవోదయ కల్చరల్ అసోసియేషన్, శ్రీ పరిమళ సాంస్కృతిక సంస్థ, భారతి (ఏలూరు), శ్రీనివాస భారతి, కళా స్రవంతి, రస చంద్రిక (భీమవరం), నున్నా సాహితీ పరిషత్ (నున్నా, విజయవాడ), వంటి గొప్ప సంస్థలు తిరుమల సాన్నిహిత్యాన్ని పొందుతూ పరిమళిస్తున్నట్టివే. పైన పేర్కొన్నవి మచ్చుకు కొన్ని మాత్రమే. ఇంకా స్వర తరంగిణి, భావన సాహితీ సంస్థ, భారతీ భారతి, రవి ఆర్ట్స్, ఆర్ట్ లవర్స్, కవి కౌస్తుభ కళా కేంద్రం వంటి సంస్థల్లో కూడా తిరుమల ప్రాతినిధ్యం కలిగి ఉన్నారు.



## 9. నటనాభిమానం

తిరుమలకు సాహిత్య, కళా సంస్థలతో చక్కని ఆత్మీయత అల్లుకొని ఉంది. ఆయన కలం వీటికి కమ్మని ఆకృతిని ఇస్తే. ఆయన గళం చల్లని ఆత్మను ఇచ్చింది. ఆయన కళారాధనం ఏలూరుతో మొదలైంది. నటుడుగా కొంచెం అనుభవమున్న తిరుమల ఏలూరులో పనిచేస్తున్నప్పుడు కర్రి రంగారావు, ప్రకాశరావు, రాంజీ వంటి నాటక రంగ కళాకారుల సహచర్యంతో నాటకాల్లో నటించడం మొదలుపెట్టారు. కొర్రపాటి గంగాధర రావు నటించిన 'నిర్మల' నాటకంలో తిరుమల కవి పాత్రను ధరించారు. ఆ తరువాత అనేక నాటకాల్లో వైవిధ్యభరితమైన భూమికలు ధరించి ప్రేక్షకుల ఆదరాభిమానాలను అందుకొన్నారు. సినీనటుడు కోట శ్రీనివాసరావుతో కలసి నటించారు. చదువుకునే రోజుల్లో వీరిద్దరిది ఒకే కళాశాల.

## 10. అవార్డులు

ప్రజావళి హృదయాలలో తిష్టవేసిన చీకట్లను క్షాళనం చేసి జ్ఞానరోచిస్సులను పంచి మానవతా పరిమళంతో లోకాన్ని ప్రగతిపథంలో నడిపించే కావ్యం ఎల్లకాలాలు సతత హరితంగా ఉంటుంది. సమాజం విలువలను పదిలంగా, పవిత్రంగా కాపాడుతూ మరిన్ని కావ్యాలు వెలువడటానికి దోహదపడుతూ ఉంటుంది. ఇలాంటి కావ్యాలు ప్రజల మానసాల మీద నర్తిస్తూ ఉంటాయి. ఎప్పుడూ ఆదరాన్ని పొందుతాయి. ఆచార్య తిరుమల కావ్యాలు అలాంటివే. ఆయన ప్రజాగమనానికి అవసరమైన రీతిలో సాంఘిక చైతన్యాన్ని కలిగించే విధంగా కావ్య రచన చేశారు. అవి రసజ్ఞులను ఆకర్షించాయి. కర్తవ్యాన్ని ప్రబోధించాయి. అలాంటి తిరుమల కృతులు బహు కృతులతో ఆధునిక తెలుగు సాహితీ రంగం మీద మరింతగా శోభిస్తున్నాయి.

### (అ) దేవులపల్లి కృష్ణశాస్త్రి అవార్డు

తిరుమల 'హృదయభారతి' పద్యకావ్యం సాహితీక్షేత్రంలో పండిన విశిష్ట ఫలం. ఈ కావ్యానికి 'దేవులపల్లి కృష్ణశాస్త్రి అవార్డు' లభించింది. ఆంధ్ర మహిళా సభ, హైదరాబాదు వారి ఆధ్వర్యంలో ఈ అవార్డు ఏర్పాటు చేయబడింది. జస్టిస్ బాల గంగాధరరావు అధ్యక్షతన జరిగిన ఒక సమావేశంలో ఆయన చేతుల మీదుగా తిరుమల అవార్డు అందుకున్నారు.

### (ఆ) కుందుర్తి స్మారక అవార్డు

ఆధునిక తెలుగు కవిత్వంలో వచన కవితా ప్రస్థానానికి తన జీవితాన్నంతా అంకితం చేసిన కవి కుందుర్తి. ఆయన పేరట వెలసిన స్మారక అవార్డు 'చీకటి మెరుపులు' కవితా సంపుటిలోని ఒక కవితను అలంకరించింది. ప్రముఖ సాహిత్య విమర్శకులు అద్దేపల్లి రామమోహనరావుచే అవార్డుకు ఈ కవిత ఎన్నిక చేయబడింది. విజయవాడకు సమీపంలో ఉన్న 'నున్నా' గ్రామం 'సాహిత్య పరిషత్' తిరుమల కావ్యాన్ని హృదయం మీద పెట్టుకొని పరవశించిపోయింది.

### (ఇ) రికగ్నిషన్ అవార్డు

తిరుమల వసుధైక కుటుంబాన్ని స్వరూపిస్తున్న సాహితీవేత్త. ఆయన విశ్వనరుడు. అందుకే ప్రపంచదేశాలు తమ హృదయ ద్వారాలను తెరిచి ఆయనను సాదరంగా స్వాగతించాయి. తమ మానసాలలో విరియబూసిన ఆత్మీయంతో అంత ఎత్తుగా సత్కరించాయి. ఆ వేళ 'తెలుగు కళా సమితి న్యూయార్క్' వారు తిరుమలను 'రికగ్నిషన్' అవార్డుతో సత్కరించారు.

### (ఈ) ఇంటర్నేషనల్ ఎమినెంట్ పోయెట్ అవార్డు అండ్ బర్కిలీ వేణీ మహదేవ్ అవార్డు

1988లో బ్యాంకాక్‌లో జరిగిన 10వ ప్రపంచ కవి సమ్మేళనంలో 'వరల్డ్ పోయెట్రీ అకాడమి' వారు 'ఇంటర్‌నేషనల్ ఎమినెంట్ పోయెట్' అవార్డును తిరుమలకు అందజేశారు. దీనితో పాటు 'అమెరికా బర్కిలీ వేణీ మహదేవ్' అవార్డు నగదు బహుమతి బర్కిలీ సౌజన్యంతో అందజేయబడింది.

### (ఉ) మైఖేల్ మధుసూదన్ దత్ జాతీయ అవార్డు

మైఖేల్ మధుసూదన్ దత్తు ప్రగతి శీల రచయిత. వంగదేశపు కవులలో ఆయనదొక విశిష్ట స్థానం. ఆ సాహితీమూర్తి పేరుతో ఏర్పడిన 'మైఖేల్ మధుసూదన్ దత్ జాతీయ అవార్డు' దత్ అసోసియేషన్ వారు ప్రతి సంవత్సరం జాతీయ స్థాయిలో ఒక ఉత్తమ కవిని ఎన్నుకొని ఈ అవార్డుతో సత్కరిస్తుంటారు. 1989వ సంవత్సరానికి ఈ పురస్కారం తిరుమల రచించిన 'అక్షరాగ్ని' కవితా సంపుటిని వరించింది.

### (ఊ) తెలుగు విశ్వవిద్యాలయ ఉత్తమ పద్య కవిత అవార్డు

తిరుమల పద్య, గేయ, వచన ప్రక్రియలలో నిరంతరాయంగా రచనలు చేశారు. ఆయన వచన గేయ కావ్యాలు జనాదరణ పొందినట్టుగానే ఆయన పద్య కావ్యాలు కూడా పలువురిని బాగా ప్రభావితం చేశాయి. వారి ఆదరాభిమానాలకు పాత్రమయ్యాయి. 'హృదయభారతి' పద్య కావ్యం సమస్త ప్రజల హృదయ భారతి అయినట్టుగానే 'చక్రధ్వజం' కూడా మందార మకరందంలాంటి శైలితో జన సందోహాన్ని బాగా పరవశింపజేసింది. ఆధునిక తెలుగు కవితా రంగంలో ఒక విశిష్టతను సంపాదించుకుంది. 1991 సంవత్సరానికి 'ఉత్తమ పద్య కవిత' పురస్కారాన్ని తెలుగు విశ్వవిద్యాలయం 'చక్రధ్వజం' కావ్యానికి ప్రకటించింది. ఆనాటి ఆంధ్రప్రదేశ్ గవర్నర్ కృష్ణకాంత్ అవార్డును తిరుమలకు అందజేస్తూ తిరుమల రాసిన 'ది కాస్మోస్ ఇన్ మై ఐ'లోని కొన్ని కవితలను విశ్లేషించి ఆయన సాహితీ వ్యక్తిత్వాన్ని మెచ్చుకున్నారు. కృష్ణకాంత్ విశ్లేషణకు పరవశులైన డా॥ సి. నారాయణ రెడ్డి 'చూశావా తిరుమలా! మార్కులన్నీ నీవే కొట్టేశావ్' అని తిరుమలను అభినందించడం మరో విశేషం. ఆనాటి పురస్కార సభలో తూమాటి దోణప్ప వంటి సాహితీ మూర్తులు తిరుమలతో పాటు అవార్డులు అందుకున్న వారిలో ఉన్నారు.



పైన పేర్కొనబడిన అవార్డులతో పాటు ఇంకా అనేక సంస్థలు సత్కరించాయి. అశోకా ఫ్యాన్స్, సాధన సాహితీ స్రవంతి సంస్థలు సంయుక్తంగా నిర్వహించిన విశిష్ట వ్యక్తుల సత్కారం 'లిటరరీ అవార్డు' తిరుమలను వరించింది. విభిన్న రంగాలలో విశేషంగా కృషి చేసిన మాననీయ వ్యక్తుల సమక్షంలో తిరుమల ఈ గౌరవాన్ని పొందటం ప్రశంసనీయం. వాస్తుశిల్పి బి.ఎన్. రెడ్డి అధ్యక్షతన జరిగిన మరో కార్యక్రమంలో 'పద్మిని - ప్రణవోదయ లిటరరీ అవార్డు' తిరుమలను అలంకరించింది. ఇంకా విశ్వసాహితి సాహిత్య పురస్కారం, రాయప్రోలు - వంశీరత్న నగదు పురస్కారం, నీలా జంగయ్య స్మారక పురస్కారం, చైతన్య ఆర్ట్స్ సాహిత్య పురస్కారం, డా. మధునాపంతుల-సాధననగదు పురస్కారం, డా. సి. నారాయణరెడ్డి సాహిత్య పీఠం నగదు పురస్కారం, శ్రీశ్రీ సాహిత్య స్వర్ణపతకం - హిమగిరి ఆర్ట్ పురస్కారం, శ్రీ కళా సుబ్బారావు స్మారక సాహిత్య పురస్కారం అందుకున్నారు.

## 11. బిరుదులు

తిరుమల సహజంగా కవితాత్మ ఉన్నవారు. చక్కని భావావేశమూ ఉన్నవారు. ఎంత చైతన్యోద్దీపంగా రచనలు చేస్తారో అంతగా సభను ఉర్రూతలూగించే విధంగా మాట్లాడతారు. కవిత్వంలో సార్వకాలికమైన, సార్వజనీనమైన తత్వాన్ని ఎంత గంభీరంగా రాస్తారో అంతగా జనసందోహాన్ని తన వాద పటిమచే ఉత్తేజం చేస్తారు. తమను అంతగా స్పందింపజేసిన కవితాత్మను అక్షరాలుగా తమ పాథేయంగా నడిపించిన ఆయనకు నతమస్తకులవ్వడమే కాదు ఘనంగా సత్కరించారు. సన్మానించారు. బిరుదులతో అభిషేకించారు.

తిరుమలకు బిరుదులు భూషణాలయ్యాయి. అవే ప్రజల, సాహితీ సమారాధకుల హృదయాల నుంచి ఆయనకు మణిమకుటాలయ్యాయి. మంగళతోరణాలయ్యాయి. అంతేకాని ఆయన బిరుదుల కోసం ఎప్పుడూ ఎదురుచూడలేదు. ఆయన హృదయం నిండా తరగలెత్తుతున్నది మంచి గంధం లాంటి మానవత్వమే. ఈ ఆర్ద్రమైన, రసార్ద్రమైన మనిషితత్వంలో యావదాంధ్ర దేశం నిలువెల్లా తడిసిపోయింది. ఎంతో పులకించి పోయింది. అనేక బిరుదులతో సత్కరించింది.

### (అ) కవి కౌస్తుభ

తిరుమలకున్న బిరుదుల్లో 'కవికౌస్తుభ' బాగా ప్రచారంలో ఉంది. ఈ బిరుదనామాన్ని చెప్పగానే ప్రతి సాహితీపరుడు ఠప్పున తిరుమల పేరు చెబుతాడు. రవీంద్రభారతిలో జరిగిన విశిష్ట కార్యక్రమంలో 'స్వరసుధ అసోసియేషన్' వారి నిర్వహణలో ఈ బిరుదు ప్రదానం చేయబడింది. అప్పటి సాంస్కృతిక వ్యవహారాల శాఖామాత్యులు కోన ప్రభాకర రావు చేతుల మీదుగా ఈ బిరుదు తిరుమలకు అందజేయబడింది. ఈ ఉత్సవంలో పాల్గొన్న వాసిరెడ్డి సీతాదేవి, మాదిరెడ్డి సులోచన, జె.వి. సోమయాజులు, పి.బి. శ్రీనివాస్ వంటి చైతన్య తేజోవంతులు తిరుమల సాహితీ వ్యక్తిత్వాలను ప్రశంసించారు.

**(ఆ) సాహితీ స్వరాట్**

తిరుమలను వరించి వచ్చిన మరో బిరుదు 'సాహితీ స్వరాట్'. 1983లో 'రసచంద్రిక' (భీమవరం) అనే సంస్థ ఈ బిరుదంతో ఘనంగా సత్కరించింది. భీమవరంలో జరిగిన శ్రేష్టమైన కొద్ది కార్యక్రమాల్లో ఇదొక ప్రత్యేకతను సంతరించుకొంది.

**(ఇ) విశ్వభారతి**

తిరుమల పొలిమేరలను తుడిచిపెట్టడానికే కవితను పలుకుతున్న కోయిల. ఆయన కవితలో విశ్వజనీనత పుష్కలంగా ఉంటుంది. ఈ తత్వాన్ని అందుకున్న పశ్చిమ గోదావరి జిల్లా 'సరస్వతీ పీఠం' తిరుమలను 'విశ్వభారతి' బిరుదుతో సన్మానించింది.

**(ఈ) ప్రభాస వికాస**

1992లో సాధన సాహితీ స్రవంతి, (నరసింహాచార్య) హైదరాబాదు వారిచే ఘనంగా నిర్వహింపబడిన ఒక కార్యక్రమంలో తిరుమలకు ఈ బిరుదు ప్రదానం చేయబడింది.

**(ఉ) మధుర కవి**

తిరుమల కీర్తి పతాకాలు ఈ దేశ పొలిమేరలు దాటి ఖండాంతరాలలో కూడా రెపరెపలాడాయి. ఆయన కవితాశక్తికి ఉన్న పదును అలాంటిది. 1985లో అమెరికాలోని న్యూజెర్సీ పట్టణ సమీపంలోఉన్న శ్రీ వేంకటేశ్వర ఆలయట్రస్టు వారిచే జరుపబడిన సన్మాన సభలో ఈ బిరుదు ప్రదానం చేయబడింది. శ్రీ స్వామి వారి శేష వస్త్రంతో తిరుమలకు సన్మానం జరుపబడటం విశేషం. అర్చకులు వెంకటాచార్యులు సంస్కృతంలో రాయబడిన సన్మాన పత్రాన్ని తిరుమలకు అందజేశారు.

**(ఊ) భారత్‌భాషాభూషణ్**

ఇది చాలా ప్రతిష్ఠాత్మకమైన బిరుదు. జాతీయ స్థాయిలో నిర్వహింపబడుతూ ప్రముఖ సాహితీవేత్తలను గౌరవించేందుకు ఉద్దేశింపబడింది. 1999 జూన్ 14, 15, 16 తేదీలలో బెంగుళూరులో జరిగిన 'అఖిల భారతీయ భాషా సాహిత్య సమ్మేళనం'లో 'కోలాడ్ మఠ్ మహా సంస్థాన్' అధిపతులు డా॥ శాంత వీర మహరాజ్ చేతుల మీదుగా తిరుమల 'భారత్‌భాషాభూషణ్' బిరుదు అందుకున్నారు. ఈ సందర్భంగా తిరుమలను ఘనంగా సన్మానించారు. ఈ సమావేశంలో ప్రారంభోపన్యాసంగా 'దేవ నాగరలిపి - దేశ సమైక్యత' అనే అంశంపై తిరుమల చేసిన ప్రసంగం సభికులను విశేషంగా ఆకట్టుకుంది.

పైన పేర్కొన్న బిరుదులతో పాటు తిరుమల 'సాహితీ సుధాకర', 'సాహితీ సింధువు' వంటి బిరుదులు కూడా కలిగి ఉన్నారు.

## 12. ఉత్తమ అధ్యాపకుడు

అధ్యాపకుల్లో కొందరు మాత్రమే విద్యార్థుల మనోమందిరాల్లో దైవంగా ఆరాధింప బడతారు. తరాలు గడిచిపోయినా ఆ పూజనీయత అక్షరమై నిలుస్తుంది. నినదిస్తుంది. అట్లా



వారు విద్యార్థుల గుండె గుడిలో సదా మాన్యతను సంతరించుకొని నిలిచి ఉండటానికి వారి బోధన, విశిష్ట వ్యక్తిత్వం కారణంగా ఉంటాయి. వారు జీవితంలో అధ్యయనాన్ని తపస్సుగా భావించి తమ శిష్యులను అలరిస్తారు. ఆచార్య తిరుమల అలాంటి అధ్యాపకులే. రుషిత్వాన్ని కూడగట్టుకున్న ఆచార్యవర్యులు.

విశ్వవ్యాప్తంగా కీర్తి గడించిన తిరుమల సాహితీ జీవితంలో ఎన్ని ఉజ్వల ఘట్టాలు చరిత్రను సృష్టించాయో అధ్యాపక జీవితంలోనూ అంతే. తన తీయని ప్రసంగాలతో ఎట్లా సభను కవ్విస్తారో ఆచార్యులుగా అంతగా భాసిస్తారు. బోధనను పవిత్ర కళగా తలపోశారు. గదిలో ఉన్న అందరు విద్యార్థుల మీద ఆయన దృష్టి ఉంటుంది. ఒకడిని చూస్తారు. మరొకడిని పలకరిస్తారు. ఇంకొకరిని హెచ్చరిస్తారు. ఆ పక్క వాడిని గుర్తిస్తారు. ముందున్న వాడి మనోగతాన్ని గుర్తిస్తారు. వెనక కూర్చున్న వారి నిర్లక్ష్యాన్ని పరిశీలిస్తారు. తరగతిని తన వలయంలోకి తెచ్చుకుంటారు. అప్పుడు పాఠాన్ని మొదలు పెడతారు. ఆయన బోధనామృతం నుంచి అందరికీ అన్నీ కిరణాలు లభిస్తాయి. వారు పాఠ్యాంశాన్ని అందుకోవడమేకాదు. ఉత్తమ వ్యక్తులుగా భవిష్యత్తుకు సారథులవుతారు. సాధులోకాన్ని శిల్పించే శిల్పులవుతారు. వారు రాల్చిన చెమట బిందువులలో తడసిన నేల నుంచి పచ్చని మొక్కలు వికసిస్తాయి. పరంపరగ వృద్ధిచెంది ధర్మవృక్షాలవుతాయి.

తిరుమల అధ్యాపక వ్యక్తిత్వం పట్ల ఆకర్షితులు గాని విద్యార్థిలేడంటే అతిశయోక్తిగాదు. పద్య బోధన రసలోక హృదయ నేత్రాల ముందు దిగినంత అనుభూతితో మధురంగా ఉంటుంది. తరగతి గదిలో ఆయన పద్యాన్ని ముందుగా గొంతెత్తి పాడరు. అలా ఆలపిస్తే విద్యార్థులు సంగీత మాధుర్యంలో పడిపోయి అర్థస్ఫూర్తినీ, భావ గాంభీర్యాన్ని అందుకోలేరు. అందుకని పద్యాన్ని ఖండపద్ధతిలో పదాలను విడదీసుకుంటూ చదువుతారు. ఆ మీద అర్థ తాత్పర్యసారాన్ని వివరిస్తారు. తిరుమల పద్యం చదివితే చాలు భావ సౌరభ్యం ఇట్టే విద్యార్థిలోకాన్ని రసలోకంలో పరుగులు తీయిస్తుంది. వివిధ ఉదాహరణాలతో ప్రాచీనాధునిక సాహిత్యాలను మేళవించి బోధిస్తుంటే ఆకర్షితులు కాని విద్యార్థులు లేరు. ఆయన గద్యబోధన అంతే విశిష్టతను కలిగి ఉంది. భాషా విషయాలు అలలు అలలుగా వస్తాయి. సందర్భాన్ని పోషిస్తూ ఔచితికి ప్రత్యేకతను కలిగించే రీతిలో ఉంటుంది. తిరుమల నడుస్తున్న గ్రంథాలయం లాంటివారు. అందుచేత వేటికోసమో వెతుక్కోకుండా బోధనకు అవసరమైన అన్ని సోపానాలు తరలివస్తూనే ఉంటాయి.

తిరుమలలో మరొక ప్రత్యేక గుణం ఉంది. తరగతి అలసిపోయినట్టు కన్పిస్తేచాలు తాను చెప్పదలచుకున్న అంశాలను ప్రక్కకు పెడతారు. అయితే విద్యార్థిని తనవైపు మళ్ళించుకోవడానికి ఒక భావనా ప్రపంచాన్ని అనేక ఉదాహరణలతో, కవ్వింతలతో వారిలో స్తబ్దతను పోగొట్టి తన బోధనాంశాలలోనికి తీసుకొస్తారు. అందుకోసం ఆయన విసిరే శబ్దజాలం రసాలం నుంచి గొంతెత్తి కోయిల కొసరి కొసరి కూస్తున్నట్టుగా అనిపిస్తుంది. అప్రయత్నంగా ఒక భూపాలరాగం వీణ నుంచి ఒలికినట్టుగా ఛాత్ర లోకానికి తోస్తుంది.

ఎంత మందబుద్ధి విద్యార్థి అయినా తిరుమల వాక్చాతుర్యంలో తడసిపోయి జాణ అవుతాడు. భవిష్యత్తును అందంగా పలికించుకునే తరణి అవుతాడు. ఆయన జీవితం చరమాంకం దాకా తిరుమల విశిష్టబోధననూ, ఆయన వ్యక్తిత్వాన్ని తలపోస్తాడు.

## 13. కావ్యాంకితం

కావ్యాన్ని రాసినవాడు నిత్యుడవుతాడు. కాలం మారినా, యుగధర్మం మారినా కావ్యం తన ప్రత్యేకతను చాటుతూనే ఉంటుంది. కొన్ని కావ్యాలు కాలధర్మాన్ని కూడా మార్చివేశాయి. యుగాలను శాసించాయి. ఆరాధనీయమయ్యాయి. అయితే కృతికర్త తన చిత్తవృత్తిని అనుసరించి కావ్యాన్ని అంకితమిస్తాడు. నన్నయ్య తనను బాగా సమాదరించిన చాళుక్య రాజరాజుకు రెండున్నర పర్వాల భారతాన్ని అంకితం చేస్తే, తిక్కన హరిహరనాథునికి కృతిని కానుకగా సమర్పించాడు. కవులలో కొందరు నరులకూ, మరి కొందరు దైవతాలకు కావ్యాలను సమర్పించి ధన్యులయ్యారు.

ఆచార్య తిరుమల తమ కావ్య సంపదను విశిష్ట వ్యక్తులకు అంకితం చేశారు. ప్రతిఫలాపేక్ష లేకుండా కవి ఈ పుణ్య కార్యాన్ని సంపన్నం చేశారు. కృతి సంతరించిన రచయిత కీర్తి కాయం ఎల్లప్పుడూ పరిమళిస్తున్నట్టుగానే అంకితం తీసుకున్న వ్యక్తి జీవితం కూడా పవిత్ర శ్రీలతో ఒప్పుతుంది. తిరుమల రాసిన చాలా కావ్యాలలో పాతిక పైచిలుకు వరకు అంకితమిచ్చారు. వీళ్లందరూ అయా రంగాలలో నిష్ణాతులు. ఆయన తొలి పద్య కావ్యం 'యమునా తటి'ని తన అక్షర గురుదేవులైన చల్లా కృష్ణమూర్తి శాస్త్రికి అంకిత మిచ్చారు. ఈ కావ్య నాయకుడు లోకాలకు గురువైన అక్షర పరబ్రహ్మ యోగి కృష్ణుడయితే, కృతిని అందుకున్న మరో గురువు అక్షర ప్రదాత కృష్ణమూర్తి శాస్త్రి కావడం విశేషం. 'రాళ్ళ గాజులు' కథా సంపుటి. ఈ రచనను తమ హృదయానికి చేరువైన మిత్రుడు వట్టి వెంకటరంగపార్థసారథికి అంకిత మిచ్చారు. తిరుమల పద్య కావ్యాలలో 'చక్రార పంక్తి' అన్ని విధాలా ఉచితమైన కావ్యం. వ్యక్తిత్వం రీత్యా అన్ని విధాలా భేషైన మంచి మనిషి అంబికాచరణశర్మకు కవి సమర్పించారు. శర్మ 'కళానికేతన్' వ్యవస్థాపక అధ్యక్షులు కూడా. సదాశయాలు ఊపిరిగా సముచితమైన సాహితీ సమారాధన చేస్తున్న హిమస్వచ్ఛ హృది ఆయన. తిరుమల 'స్వరవల్లరి' గేయ కవితా జగత్తులో రసార్ద్రమైన కావ్యం. న్యాయవాది, కళావేత్త కోకా రాఘవరావుకు అంకితమివ్వబడింది. రావు బహుముఖ పండితుడు. ఆయనకు హైదరాబాదులోని కళా సంస్థలతో మంచి సాన్నిహిత్యం ఉంది. తిరుమలకు మనసు కలసిన మిత్రుడు రావులపాటి కృష్ణారావు. చైతన్య కళాశాలలో కామర్స్ లెక్చరర్. వ్యక్తిత్వం రీత్యా కావ్యజాతికి చెందిన మంచి మనిషి. ఆయనకు తిరుమలంటే వల్లమాలిన ఆత్మీయం. కృష్ణారావు తమ ఎడల చూపుతున్న అనురాగానికి రాగచిహ్నంగా తిరుమల 'మాట్లాడే మల్లెలు' అనే వచన కవితా కావ్య కన్యకను ఇచ్చి పరిణయం జరిపించారు. తిరుమల నాటిక 'మరీచిక' ఆంధ్రదేశంలో చాలా ప్రదర్శనలు అందుకున్న కృతి. ఇది విన్నకోట మురళీకృష్ణకు అంకితమిచ్చారు. ఈయన తిరుమల హితైషి. కె.వి. భాస్కరరావు మంచివక్త.



విశేషించి సంస్కృతం, ఆంగ్లం, తెలుగు లాంటి భాషలను అధ్యయనం చేసిన ద్రష్ట. సభను ఉర్రూతలూగించే చతురత ఆయన స్వంతం. ఆయనకు తిరుమల 'స్వేచ్ఛాభారతి' అనే సంగీత రూపకాన్ని సమర్పించారు. మిత్రుడు సుంకు బలరాంకి తన గేయ సంపుటి 'పల్లవి'ని అంకితమిచ్చారు. సుమనోజ్ఞ కవితాశరధి డా॥ దాశరథి. అంగారాన్నీ, శృంగారాన్నీ మేళవించి అసంఖ్యాకమైన రచనలు గుప్పించిన మహాకవి. నిజాం నియంతృత్వాన్ని తన కవితా కరవాలంతో తుదముట్టించిన వీరయోధుడు. వైతాళికుడు ఆయన. ఆంధ్రప్రదేశ్ ఆస్థానకవిగా ఉన్నప్పుడు దాశరథికి తిరుమల 'తెలుగు తెమ్మెరలు' లనే వ్యాస సంపుటిని అంకితం చేశారు.

బొండా నాగేశ్వరరావు 'రసచంద్రిక' అధ్యక్షులు. ఆయన హృదయం కూడా రసచంద్రిక లాంటిదే. ఇలాంటి సుకుమార నీహారి హృదికి కవి 'హృదయ భారతి' అనే పద్య కావ్యాన్ని సొంతం చేసి బాంధవ్యాన్ని మరింత గాఢం చేసుకున్నారు. జీవితం మహోన్నతంగా వెల్లువెత్తడానికి ఆయన తల్లిదండ్రులు సుగుణావతీ శ్రీనివాసాచార్యులు ప్రథమ కారకులు. ఇదే విషయాన్ని తిరుమల అనేక సన్నివేశాలలో చెప్పుకున్నారు. జీవితాన్ని అలా పండించిన అమ్మానాన్నలకు కవి 'శ్రీరామనామసుధ' అనే శతకాన్ని సొంతం చేసి రుణవిముక్తులయ్యారు. 'జగమెరిగిన బ్రాహ్మణునకు జందెమేలా' అన్నట్టు మహాకవి సినారె గురించి చెప్పనవసరం లేదు. నిత్యం పచ్చని కవిత్వాన్ని ప్రక్రియపరంగా పలికిస్తున్న కవితా తపస్వి ఆయన. తిరుమల 'చీకటి మెరుపులు' అనే వచన కావ్యాన్ని సినారెకు అంకితమిచ్చి జామాత బాంధవ్యాన్ని పటిష్టం చేసుకున్నారు. జి.ఆర్.రెడ్డి ప్రేమైకజీవి. మానవీయ ధర్మాలను ప్రబోధిస్తున్న మంచివారు. ఆయనకు కవి 'విద్యుల్లత'ను అంకితం చేసి మనిషికి ఈవల ఆవలా ఉన్న చీకట్లను క్షాళనం చేశారు. 'శిలల పొదలు' తిరుమల విశిష్టమైన వచన కావ్యం. ప్రతీకాత్మక నేపథ్యంతో రాసిన ఈ వచన కవితా సంపుటిని ప్రముఖ సినీనటుడు ఆర్ద్ర హృదయులు జె.వి. సోమయాజులుకు ఇచ్చి వైభవంగా పరిణయం జరిపించారు. మామా అల్లుళ్ళ బంధం పచ్చగా పరిమళించడం సాహితికి విశేషత్వాన్ని కలిగించడం కాక మరేమవుతుంది. ఆచార్య ఉండేల మాల కొండారెడ్డి పద్యకవి. మహావక్త. మైత్రికి ఆత్మను అందించే పుణ్యశీలి. అలాంటి రెడ్డికి 'అక్షరాగ్ని'ని కానుక చేశారు. ఒక్క రసస్పర్శతో అమాంతంగా చలించిపోయే ఆర్ద్రమైన మనసున్న రెడ్డి తిరుమల కావ్యాన్ని స్వీకరించి ఎంతగా ఆనందపడ్డారో మాటల్లో చెప్పలేం. సహజంగా ఇంజనీరైన రెడ్డి హృదయం నిండి కవితా శ్రీ చందనమే గుప్పుమంటుంది. తెలుగులో డా॥ జె. బాపురెడ్డి మహోన్నత శిఖరం లాంటివారు. ఆయన పండించని ప్రక్రియ లేదు. చక్కని కవితాత్మతో పలువురిని రంజింపజేస్తున్న రెడ్డికి తిరుమల 'కవి దర్శనం' అంకిత మొనర్చారు. వ్యాస సంపుటి ఇది. తిరుమల మరో వచన కవితా సంపుటి 'అమృత నేత్రాలు'. అమృత నేత్రాలు మనిషికి ఉండే చూపుకు అందినదంతా హరిత భరితమవుతుంది. అలాగే జరిగింది. సి. జగన్మోహన రెడ్డి ఆశయాలు విరగబూయించిన మనస్వి. అందుకే తిరుమల 'అమృత నేత్రాలు' ఇచ్చి ఇల్లరికం జరిపించారు.

ద్వాదశ జ్యోతిర్లింగాలలో విశ్వనాథలింగం మహా శ్రేష్టమైంది. ఆ స్వామిని అర్చిస్తే పునర్జన్మ ఉండదని ఆధ్యాత్మ విదులు చెబుతారు. తిరుమల సహజంగా సంప్రదాయవాది. భక్తితత్పర పూజలు చేశారు. ఆ ప్రేరణతో 'విశ్వవిభూతి' అనే శతకాన్ని విశ్వనాథునికి అంకితం చేసి జన్మ చరితార్థం చేసుకున్నారు. తెలుగులో బి.యన్. రెడ్డి స్థానం ఉన్నతమైంది. ఆయన వాస్తుశిల్పిగా చాలి మందికి తెలిసినా, కవితా వాస్తుశిల్పిగా రసజ్ఞులకు బాగా పరిచయమే. ఉచితమైన చారిత్రక మూల్యాలున్న రెడ్డికి తిరుమల 'గీతాభాషిణి' అనే గేయ సంపుటిని గృహలక్ష్మిని చేసి కవితా వాల్లభ్యాన్ని మరింత పటిష్టంగా అల్లించారు. వీరి మధ్య విరగ బూస్తున్న మైత్రీలతాంతాలు తెలుగు కేదారాన్ని సస్యీకరిస్తున్న నాద పరిమళాల వంటివని చెప్పవచ్చు. చిత్రరంగంలోనూ, కవితా చిత్ర రంగంలోనూ సవ్యసాచిగా పేరు తెచ్చుకున్న సహజకవి మల్లెమాల. ఒక్క నాదమయ పదం వినబడితే నిలువెల్లా పులకించిపోయే కళాతపస్వి. అలాంటి మల్లెమాల తిరుమల కవన మార్గాన్ని దర్శించి పరవశించేవారు. ప్రోత్సహించేవారు. హృదయానికి చేరువైన మల్లెమాలకి తిరుమల 'చక్రధ్వజం' అనే పద్య కావ్యం సూడిదగా అందించారు. ఈ కావ్యాన్ని ఆయన తమ గుండెలో భద్రంగా పదిల పరచుకున్నారు. వారిద్దరి మధ్య మామా అల్లుళ్ళ ఆత్మీయం ఆర్ద్రంగా అల్లుకొని ఉంది.

తిరుమల ఆంగ్లంలోనూ కవిత రాసి 'MY LOVE OF LOVE' అనే పుస్తకంగా ప్రచురించారు. తనకు ఆప్తుడు, స్నేహశీలి అయిన ప్రొఫెసర్ సయ్యద్ అమీరుద్దీన్‌కి అంకితమిచ్చారు. ఆయన ద్రావిడ భూములలో ఉన్నా, ఈయన తెలుగు మాగాణంలో ఉన్నా ఇద్దరి మధ్య రాగబంధం నేటికి ఆదర్శాన్ని ప్రసారం చేస్తున్న కావ్యం లాంటిదే. ఆధునిక తెలుగు కవితా క్షేత్రంలో నాయని కృష్ణ కుమారి స్థానం విశిష్టమైంది. ఆమె వ్యాసం రాసినా ప్రతి పదంలో కవిత ప్రవహిస్తుంది. ఈ కవయిత్రితో తిరుమలకు సోదరీ ప్రేమ. ఈ విశిష్టమైన అనుబంధానికి గుర్తుగా కవి 'యుగగీత'ను అంకితం చేశారు. స్పార్క్ ఉన్న కవిగా, విమర్శకుడుగా, సహాయ సంపాదకుడుగా ఎల్లోరా ఆధునిక తెలుగు సాహితికి సుపరిచితులు. ఆయనకు తిరుమలకి చాలా కాలం నుంచి మంచి మాట. ఈ స్నేహానికి చిహ్నంగా కవి 'స్వప్నవీణ'ను అంకితం ఇచ్చారు.

పి.బి. శ్రీనివాస్ పేరు వినబడితే హృదయం రస తరంగితం అవుతుంది. ఆయన గళం ఆర్ద్రమైన నాదాన్ని అందించేదిగా ఉంటుంది. తిరుమల ఈ మధుర గాయకునికి ఆయన హృదయానికి చేరువగా ఉండే 'రాగానందం' సమర్పించి లోకాన్ని రాగపరిమళం చేశారు. కవి పెద్దక్కయ్య ఈయుణ్ణి వెంకట రాజ్యలక్ష్మి. ఆమెకు తమ్ముడంటే అమితవాత్సల్యం. తమ్ముడి కీర్తి వైభవాన్ని ఆమె ఎప్పుడూ కోరుకునేది. సోదరి ఆత్మీయతకు ముగ్ధుడైన తిరుమల 'తిరుమలోక్తి'ని ఆమెకు అంకితమిచ్చారు.

తిరుమల తన రచనలను అన్నింటినీ చేర్చి ప్రక్రియా పరంగా పద్యప్రభాస, గేయనందిని, వచన కవితా కాదంబిని అనే బృహత్కావ్యాలుగా అచ్చువేశారు. 'పద్యప్రభాస' తనకు దగ్గరి మిత్రులు గౌతమీ కో-ఆపరేటీవ్ జూనియర్ కాలేజి వ్యవస్థాపకులు, ప్రిన్సిపాల్ శ్రీ బి. శివ



కుమార్ రెడ్డికి అంకితమిచ్చారు. తనకు మాటా, పాటా నేర్పించి కవిగా తీర్చిదిద్దిన కన్న తల్లి శ్రీమతి సుగుణావతికి 'గేయనందిని'ని సమర్పించి జన్మ చరితార్థం చేసుకున్నారు. బ్రహ్మశ్రీ వెంకట అప్పయ్య దివ్యస్మృతికి తిరుమల తన 'వచన కవితా కాదంబిని' అంకితం ఇచ్చారు.

## 14. కావ్య స్వీకారం

తిరుమల ఎందరికో ఆత్మీయులు. మరెందరికో హృదయంలోని హృదయం. సౌజన్యం మూర్తీభవించిన ఆయనకు ఎన్నో కానుకలు అభిమానుల నుంచి అందాయి. అట్లాగే కావ్యాంకితాలూ జరిగాయి. కృతులను సమర్పించుకున్న వాళ్ళల్లో లబ్ధ ప్రతిష్ఠులైన రచయితలూ ఉన్నారు. ఉదీయమాన రచయితలూ ఉన్నారు. అందరి రచనలను ఆయన సమంగా భావించారు. తిరుమల మొదట అంకితంగా తీసుకున్న కావ్యం 'త్రిశంకు స్వర్గం'. ఏలూరు వాస్తవ్యులు, ప్రముఖకవి కాట్రగడ్డ నరసింహారావు ఈ కావ్యాన్ని రాశారు. హైదరాబాదు రచయిత రాజు తన కవితా సంపుటి 'సూర్యధ్వజం' అంకితమిచ్చారు. ప్రముఖ కవయిత్రి శారదా అశోకవర్ధన్ తన కృతి 'శారదా సరాలు' అంకితమిచ్చారు. దేరెడ్డి జగదీశ్వర్ తన పద్యకావ్యం 'ఆకలి పంజరం' తిరుమలార్పితం చేశారు. సాహిత్య రత్న వనం సావిత్రనాథ్ తన కవితా సంపుటి 'మల్లెలు మందారాలు' హారంగా తిరుమలకు అందించారు. యువ రచయిత పి. రవీంద్రబాబు 'రాగాల పందిరి'తో తిరుమలను సన్మానించారు. జొన్నలగడ్డ శివరామ కృష్ణ ప్రసాద్' 'అల'లతో ఆయనను మధుర మధురంగా ఊగించారు. కోరుప్రోలు మాధవరావు 'యువ వసంత గీతిక'తో తిరుమలను నాయకుణ్ణి చేశారు. తిరుమలకు పద్య కావ్యం 'బొబ్బిలి సూక్తులను'ను బొబ్బిలి మల్లారెడ్డి అంకితం ఇచ్చారు. తిరుమలకు పద్యకావ్యాలు, వచన కవితా సంపుటాలు, లలిత గీతికా సమాహారాలు మాత్రమే అంకితమివ్వబడలేదు. నాటికలు కూడా ఉన్నాయి. యాదగిరిగుట్టకు చెందిన జంటకవులు సహదేవ్, ఉప్పలాచారి 'నాలుగు దిక్కులొక్కటైతే' అనే నాటకాన్ని అంకితమిచ్చారు. తిరుమల కవిత్వం, వ్యక్తిత్వంచే ప్రభావితులైన ఎందరో యువకవులు తమ రచనలను అంకితమిచ్చి తమ గురుభక్తిని చాటుకున్నారు.

## 15. సభలు - సమావేశాలు

తిరుమల స్వీయ కవితా గానం చేసినవీ, ప్రసంగాలు చేసినవీ, అధ్యక్షత వహించినవీ అసంఖ్యాకాలు. నిత్య చైతన్యం ఉట్టిపడే రచనలు మాత్రమే కాకుండా, తన వక్తవ్యంతో, కవితా గానంతో సమాజాన్ని అభిషేకించడం సాహితీమూర్తిగా ఆయన చేస్తున్నపని. అయితే తిరుమల సాహితీ జీవితంలో ఆయన పాల్గొన్న ముఖ్యమైన సభలూ, సమావేశాల్లోని కొన్ని అంశాలను పేర్కొనడం ఉచితంగా ఉంటుంది.

### (అ) ఇంటా

ఉత్పల సత్యనారాయణ అధ్యక్షతన బెంగుళూరులో జరిగిన తెలుగు మహాసభల్లో ప్రాతినిధ్యం వహించారు తిరుమల. ఈ సభల్లో తెలుగు కవితా పరిణామ దశల గురించి

ఉపన్యసించి తన కవితా గానాన్ని ఆలపించారు. మైసూర్‌లో జరిగిన 'కావ్యమిలాన్' దక్షిణ భారత కవితా గోష్ఠిలో పాల్గొన్నారు. హైదరాబాదులో తొమ్మిదవ అఖిల భారత రచయితల మహాసభలు జరిగాయి. దేశం నలుమూలల నుంచి చాలా మంది సాహితీపరులు వచ్చారు. ఆ మహాసభల్లో భాగంగా కవిసమ్మేళనం జరిగింది. 70 మంది కవి పండితులు పాల్గొన్న ఆనాటి సభకు తిరుమల అధ్యక్షత వహించి నడిపించిన తీరు ప్రశంసలు అందుకుంది. దక్షిణ భారతదేశంలోని రామాలయాల్లో భద్రాచలం మరీ విశిష్టమైన పుణ్యస్థలం. 1996 అక్టోబరులో 'శ్రీరామచరణసేవాసమితి' వారు ఓ ప్రత్యేకమైన కార్యక్రమాన్ని జరిపించారు. అదే సమయంలో స్వామి వారి గర్భగుడిలో వేదోక్తంగా రామచంద్రుల వారి శేష వస్త్రాలతో, ముత్యాలతో సన్మానం జరిగింది. ఇది ఆయన జీవితంలో అపూర్వమైన సన్నివేశం. పరవశులైన తిరుమల ఆశువుగా ఈ క్రింది పద్యాన్ని చెప్పారు.

"నీపై గప్పిన క్రొత్త పట్టువలువన్ నీ దివ్య మాలాక్షతల్
నాపై వేయుచు వేద గానముల సన్మానించి నీ యర్చకుల్
దీపారాధన వేళ నన్ను మనసా దీవించుటెల్లన్, ప్రభూ!
నీ పూర్ణామృత రాగ వీక్షణమె కానీ, అన్యమే! రాఘవా!![17]

త్రివేంద్రంలో జరిగిన దక్షిణ భారత రచయితల సమ్మేళనంలో తిరుమల తెలుగు ప్రతినిధిగా చేసిన ప్రసంగం ఆనాటి సదస్సుకు అలంకార ప్రాయమైంది. తిరుమల తిరుపతి దేవస్థానం వారు బహుభాషా కవి సమ్మేళనం జరిపించారు. హిందీ, తమిళ, కన్నడ, తెలుగు భాషలకు చెందిన సాహితీ వేత్తలు పాల్గొన్నారు. నాయని కృష్ణకుమారి, ఉండేల మాల కొండారెడ్డి, నందూరి రామకృష్ణమాచార్యులు, మేడసాని మోహన్ వంటి తెలుగు ప్రముఖులతో పాటు భీమ్‌సేన్ నిర్మల్ లాంటి హిందీ కవులు పాల్గొని కవితాగానం చేశారు. ఈ సమ్మేళనానికి ఆచార్య తిరుమల అధ్యక్షత వహించారు. ఆయన ప్రతి కవితను వ్యాఖ్యానించిన తీరు సదస్యులను బాగా అలరించింది.

1986లో ఢిల్లీలో ఆకాశవాణి నిర్వహణలో జాతీయ కవి సమ్మేళనం జరిగింది. అప్పుడు తిరుమల చదివిన 'సమైక్యదర్శనం' కవిత పదునాలుగు భాషల్లోకి అనువదింపబడింది.

"వాక్యానికి పనికి రాని పదం ఎందుకు
జాతీయతాభావం లేని వ్యక్తి ఎందుకు
పొరలు పొరల్లోవున్నా
దానిమ్మ పండులోని గింజల్లా
దేశ సంస్కృతిలోని వ్యక్తి భావాలు
చవులూరించక పోతే ఎలా!

చరిత్రల త్యాగాల వేదికల వెలుగు మీద
ఎగురుతున్న పతాకం
కేవలం మూడు రంగుల గుడ్డకాదు
పదాల ప్రణవనాదాల వెన్నెలగడ్డ"[18]

పై కవితా పంక్తుల్లోని జాతీయతా భావం, దేశభక్తి ప్రకటిస్తున్న భావలహరి సభికులను ఆకర్షించింది. అదే తరుణంలో 'మ్యాన్ ఆఫ్ ది షో' గా సత్కరింప బడినారు. జాతీయ కవిగా ఎన్నికయ్యారు.

1997 మార్చిలో కళాస్రవంతి, భీమవరం వారిచే కనకాభిషేక పురస్కారం జరిగింది. 'ఈ సత్కారం నా జీవితంలో ఒక ప్రధాన ఘట్టంగా, మరపురాని అనుభూతి' అని తిరుమల అంటారు. ఈ కార్యక్రమంలో నందూరి రామకృష్ణమాచార్యులు, సహస్రావధాని గరికపాటి నరసింహారావు, అవధాని గరిమెళ్ల ప్రసాదరావు వంటి ప్రముఖులు పాల్గొన్నారు. బొండా నాగేశ్వరరావు (కళాస్రవంతి అధ్యక్షులు) అధ్యక్షతన ఈ కార్యక్రమం జరిగింది. కనకాభిషేక సత్కారానికి ఆనందభరితుడై ఆచార్య తిరుమల ఆశువుగా ఈ పద్యాన్ని చెప్పారు.

"మాన్యుల్ మానస వల్లకీ శ్రుతిలయాత్మాద్వైత మాధుర్య సౌ
జన్య శ్రీ యుతులొప్పు నీ సభను, నన్ స్వర్ణాభిషేకంబు నన్
ధన్యున్ జేసిన భారతీ హృదయు బొండా వంశ నాగేశ్వరున్
విన్యస్తాదర దృష్టి నేలుత రమావిష్ఫారుండ శ్రాంతమున్"[19]

**(అ) బయటా**

తిరుమల యశఃకాంతులు విశ్వప్రాంగణాలను కూడా వెలిగించాయి. 1985 జూలైలో లాస్ ఏంజలెస్ (ఉత్తర అమెరికా)లో ఐదవ తెలుగు మహాసభలు జరిగాయి. ప్రారంభోత్సవంలో తిరుమల కవితా గానం చేశారు. అది సభకు అలంకార ప్రాయంగా ఉందని విజ్ఞులు భావించి తిరుమలను విశేషాదరణంతో గుండెలకు హత్తుకొని సన్మానించారు.

కిన్నెర ఆర్ట్ థియేటర్ సౌజన్యంతో థాయిలాండ్‌లోని హువాసావన్‌లో ప్రపంచ మత సమావేశం జరిగింది. తిరుమల భారత ప్రతినిధిగా పాల్గొని భారతీయ సంస్కృతీ, సంప్రదాయాల విశిష్టతను గూర్చి వివరించిన తీరు సభికులను ఆకట్టుకుంది.

టర్కీ రాజధాని ఇస్తాంబుల్‌లో జరిగిన 12వ ప్రపంచ కవిసమ్మేళనంలో (వరల్డ్ కాన్ఫరెన్స్ ఆఫ్ పోయెట్స్) తిరుమల పాల్గొన్నారు. ఆ సభలో చదివిన 'The Man' కవిత అక్కిడికక్కడే ఐదు ప్రపంచ భాషల్లోకి అనువదింపబడింది.

తిరుమల సాహితీ జీవితంలో ఇలాంటి విశేషమైన ఘట్టాలు, అపురూపమైన సన్నివేశాలు ఎన్నో ఉన్నాయి.

## 16. విదేశీ పర్యటన – అనుభూతులు

విశాల ప్రపంచంలో ఎన్నో జాతులూ, ఎన్నో సంస్కృతులు ఉన్నాయి. ఇవన్నీ వేర్వేరుగా కన్పిస్తున్నప్పటికీ అన్నింటిలోని అంతస్సూత్రం ఒకే విధంగా ఉంటుంది. అది

విశ్వమానవాళి ఆత్మీయంగా, శాంతిమయంగా ఎదగడానికి ఉపయోగపడుతుంది. ప్రపంచం వైజ్ఞానికంగా ఎంతో పురోగమించినప్పటికీ, సంస్కృతీ సంప్రదాయాలు, ఆధ్యాత్మిక చింతన లేకపోతే శాస్త్రీయ ప్రగతి నిష్ప్రయోజనమే అవుతుంది. అట్లాగే భిన్న సంస్కృతులల్లో అంతర్లీనంగా ప్రవహించే సంస్కృతీధార స్వరమేళగా రవళిస్తే నిఖిల విశ్వం మానవతా పథంలో సుందరమైన భవిష్యత్తును స్వరూపించుకుంటుంది. శక్తివంతమైన ఈ సంస్కృతిధారను పవిత్రీకరించడానికి, పంచడానికి దార్శనికత ఉన్న కవులకు, కళాకారులకు మాత్రమే సాధ్యమవుతుంది. ఈ సత్యాన్ని అవగాహన చేసుకున్న దేశాలు కవులనూ, కళాకారులను ఆహ్వానించి రసానందంతో పాటు సామాజిక విలువలను పెంచుకునే ఆశయాలను ముమ్మరం చేసుకుంటాయి. అదే పరంపరలో మనవాళ్ళు ఇతర దేశాలను, పరదేశీయులు మనదేశాన్ని సందర్శించటం జరుగుతుంది. మానవ కళ్యాణానికి, విశ్వమానవ సౌభ్రాత్రానికి ప్రపంచ కవిసమ్మేళనాలు వేదికగా నిలిచి ప్రపంచంలోని నలుమూలల విభిన్న సంస్కృతులను, సంప్రదాయాలను సాహితీ చట్రంలో బిగించి పురోగాభివృద్ధి వైపు పయనించడానికి దోహదపడుతున్నాయి. తిరుమల ఇలాంటి బృహత్ కార్యక్రమాలలో పాల్గొని ప్రపంచానికి మన సంస్కృతి, ఆచారాలను వ్యక్తపరిచారు.

1983లో థాయిలాండ్, మలేషియా, పెనాంగ్, సింగపూర్ దేశాలను పర్యటించి తన కవితా పటిమచే ఆయాదేశ కవితాభిమానులను మంత్ర ముగ్ధుల్ని చేశారు. 1985లో ఉత్తర అమెరికా పర్యటన గావించారు. ఐదవ ప్రపంచ తెలుగు మహాసభల్లో భారతీయ ప్రతినిధిగా పాల్గొని లాస్ ఏంజలెస్‌లో జరిగిన సభా ప్రారంభోత్సవ కార్యక్రమంలో తిరుమల చదివిన ప్రత్యేక కవిత సభికులందరిని ఆకట్టుకుంది.

ఉత్తర అమెరికాలో స్థిరపడిన ప్రవాసాంధ్రుల ఆత్మీయతానురాగాలు తిరుమలను పులకరింపజేసాయి. ఖండాలు దాటి వచ్చినా పాశ్చాత్య నాగరికత వ్యామోహానికి లోను కాకుండా తెలుగు సంస్కృతీ, తెలుగుదనం, ఆచారాలు, కట్టుబాట్లను కాపాడుకుంటున్న తన వారి ఉన్నతత్వానికి ఆశ్చర్యం చెందారు.

"చెట్టు ఎన్ని అడుగుల పై కెదుగుతూ పోయినా
దాని వేళ్ళుమాత్రం అది మొలకెత్తిన నేలలోనే
బీజంగా పడినప్పుడు ఆదరించిన నేలని ఏ చెట్టూ కాదంటుంది"[20] అంటూ మనిషి ఎన్ని ఉన్నత శిఖరాలు అధిరోహించినా తన మాతృభూమిని మరిచిపోకూడదని కవి ఆకాంక్షించారు.

"ఓ ఉత్తర అమెరికా
ఉజ్వల వనసీమల్లారా
మీ చరణాల ముద్రలు
తెలుగు తల్లి గుండెల మీద
ఇంకా చెరిగి పోలేదు చూడండి



మిమ్మల్ని పలకరించి పులకరించటానికి వచ్చిన
ఈ తెలుగు గాలులతో కలిసి హాయిగా పాడండి
విమానం మీద వచ్చేటప్పుడు ఏం తెలిసింది గనక
విడమరచి చెప్పటానికి

అరేబియా, మధ్యధరా, అట్లాంటిక్ సముద్రాలో
గల్ఫ్, జర్మనీ, ఇంగ్లాండ్ దేశాలో
పర్వతాలో, నదులో, అరణ్యాలో
ఏవైనా గానీ - అన్నీ ఒకటే ! ఒకటే!

తెలుగునేల నుండి తెలుగు జ్వాలకు వాలాను
పిడికెడు అనుభూతిని తెలుగు నేల మీద
వెద జిమ్మాలను కోరాను
మీ ఆలోచనల రత్నాల హారాలు
తెలుగు తల్లికి వేయండి
మీ చెలిమి కలిమి వెలుగును
తెలుగు మేనికి గంధంలా పూయండి
మీ కోసం పుట్టింటి తలుపులు
ఎప్పుడూ తెరిచే వుంటాయి రండి"[21] అని తన వారిని ఆహ్వానించారు.

1988 నవంబర్ 14 నుండి 18 వరకు థాయిలాండ్ రాజధాని బాంకాక్‌లో జరిగిన పదవ ప్రపంచ కవిసమ్మేళనంలో తిరుమల పాల్గొన్నారు. 'రండి ఇవటికి థాయిలాండ్ రెండు చేతులా మిమ్మల్ని నిండుగా ఆహ్వానిస్తుంది. విశ్వకవులమై, విశ్వభ్రాత్రానికి, విశ్వశాంతికి పాటు పడదాం రండి' అంటూ ఆహ్వానం పలికింది థాయిలాండ్. ఈ ప్రపంచ కవి సమ్మేళనంలో 50 దేశాల నుంచి దాదాపు 300 మంది కవులు పాల్గొన్నారు. భారతదేశం నుంచి 80 మంది కవులు పాల్గొన్నారు. ఆంధ్రప్రదేశ్ నుంచి జె. బాపురెడ్డి, మల్లెమాల, ఉండేల మాల కొండారెడ్డి, సి.హెచ్. రాజేంద్రప్రసాద్, జి.వి. సుబ్రహ్మణ్యం, వెలిచాల కొండల్‌రావు, వంటి ప్రముఖ కవులు తిరుమలతో పాటు పాల్గొన్నారు. థాయిలాండ్ యునివర్సిటి ఆంగ్ల భాషాచార్యులు ఉమర్ ఉమా విజానీ ముఖ్య కార్యనిర్వాహకులుగా కార్యక్రమాన్ని విజయవంతంగా నిర్వర్తించారు.

"భూమి నా పాద పీఠమైపోయె, గగన
దీపమున చూచితిని విశ్వరూప రేఖ
నేను నాదను తలపులు నీల్గి కృంగె
మేము - 'మన' దను పలుకుల మేను పొంగె"[22] నంటూ విశ్వమానవతావాదాన్ని ఈ సందర్భంగా తిరుమల ప్రకటించారు.

టర్కీ ముఖ్యపట్టణమైన ఇస్తాంబుల్‌లో జరిగిన పన్నెండవ ప్రపంచ కవి సమ్మేళనంలో తిరుమల భారత ప్రతినిధిగా పాల్గొన్నారు. మార్గ మధ్యంలో జోర్డాన్ రాజధాని అమ్మాన్ నగరాన్ని సందర్శించారు. అక్కడి సుందర దృశ్యాలకు పరవశులై

"ఎంత భాగ్యము! ఏమి భాగ్యము
ఓ అమ్మాన్! నిను చూచు భాగ్యము
చూపు మేరకు పచ్చదనము
మాట వీయని - ఇసుక కడలని
ఎండమావుల - కొండ కోనల
కఠిన శిలల - అలల హోయల
అందమంతా కూడ గట్టుకు అవులించే నగర రత్న"[23] అంటూ తన అనుభూతులకు అక్షరాకృతి ఇచ్చారు.

ఈ సమావేశంలో 'వరల్డ్ అకాడమీ ఆఫ్ ఆర్ట్ అండ్ కల్చర్' కాలిఫోర్నియా (అమెరికా) వారిచే తిరుమల టిన్.వెన్ చుంగ్ చేతుల మీదుగా గౌరవ డి.లిట్ సత్కారాన్ని అందుకున్నారు. అంతర్జాతీయ కవిగా ఖ్యాతిగాంచారు.

## 17. ప్రసార సాధనాలు - అనుబంధం

రచయితలు, కళాకారులు తమ కార్యక్రమాలు ఆకాశవాణి, దూరదర్శన్‌లలో ప్రసారం కావడానికి తాపత్రయ పడుతుంటారు. తిరుమల సహజంగా కవితాత్మ ఉన్న కవి. కమనీయ భావకుడూ అవడం వల్ల ఆయన రచనలను ఆకాశవాణి, దూరదర్శన్ తామే ముందుగా ఆహ్వానించాయి.

ఆచార్య తిరుమలకి కోపల్లి శివరాం మనసు కలిసిన మిత్రులు. 1971లో ఆయన హైదరాబాద్ డిఫెన్స్ శాఖలో ఉద్యోగం చేస్తుండేవారు. శివరాంకు సంగీత దర్శకుడు పి.వి. సాయిబాబా దగ్గరి నేస్తం. తిరుమల ఎం.ఏ. చదువుతున్న రోజుల్లో 'ఏ గీతము ఏ రీతిగ వినిపించెదు దాన' అనే లలిత గీతం రాశారు. ఆ పాటలో పరవళ్ళు తొక్కుతున్న భావుకతకూ, లయకూ పరవశించిపోయిన శివరాం వెంటనే ఆ గీతాన్ని సాయిబాబాకు పంపించారు. ఆయన ఆ గీతానికి చక్కని స్వరాన్ని కూర్చి ప్రముఖ గాయని ఛాయాదేవితో పాడించారు. ఆ పాట శ్రోతలను పులకింపజేసింది. తిరుమలకు అసంఖ్యాకమైన అభినందనలు శ్రోతల ఉత్తరాల ద్వారా అందాయి. పాటలో కవిత్వపు విలువలు ముమ్మరంగా శబ్దిస్తే ఆ గేయం సార్వకాలినత్వాన్ని, సార్వజనీనత్వాన్ని సంపాదించుకుంటుంది.

తిరుమల అప్పటి నుంచి ఇప్పటి దాకి దాదాపు పదిహేను వందలపై చిలుకు గీతాలు రాశారు. ఇవన్నీ హృదయాలను చలింపజేసేవే. ఊహలకు రెక్కలు కట్టించి పూల తోటల్లో విహరింపజేసేవే.



ఛాయాదేవి పాడిన 'పాడనా నీ రేయి' అనే పాటకు దక్షిణ భారత లలిత సంగీత పోటీల్లో ప్రథమ బహుమతి లభించింది. ఈ పాట భావ కవిత్వపు ఛాయల్లో నడిచింది. లయ ఊపిరిగా కదిలింది. ఇది తిరుమల ప్రత్యేకత. మరో పాట కూడా పోటీలో తన ప్రత్యేకతను చాటుకుంది. గౌరి శంకర్ పాడిన 'ఈ వెన్నెలలోన నీ కన్నులలోన' కు దక్షిణ భారత లలిత సంగీత పోటీల్లో ద్వితీయ బహుమతి లభించింది. వి. మురళీకృష్ణ ఈ గీతానికి సంగీతం సమకూర్చారు. ఇట్లా తిరుమల చాలా గేయాలకు విశిష్టమైన బహుమతులు వచ్చాయి. ఇప్పటికీ ఆకాశవాణి నుంచో, దూరదర్శన్ నుంచో తిరుమల కవితాక్షరాలు గాయనీ గాయకుల మధుర గళాల నుంచి వినబడుతూ రసజ్ఞులను అలరిస్తుంటాయి. ఆయన లలిత పద విన్యాసం హృదయాలను ఆర్ద్రం చేస్తుంది.

తిరుమల ఆకాశవాణిలో లైట్ మ్యూజిక్ కమిటీ మెంబర్‌గా 1992 నుంచి ఉన్నారు. కథ, కవిత, సంగీత రూపకాలు, బాలగేయాలు, దేశభక్తి గేయాలు, కార్మిక గేయాలు, కర్షక గేయాలు, ప్రబోధ గేయాలు ఇలా ఎన్నో ఈ ప్రసార సాధనాల ద్వారా తిరుమల రచనలు ప్రసారమయ్యాయి. అవుతున్నాయి. అలాగే దూరదర్శన్ స్క్రీనింగ్ కమిటీ మెంబర్. పాలగుమ్మి విశ్వనాథం, చిత్తరంజన్, రమేశ్ పాత్రో, రాఘవులు, నల్లూరి సుధీర్ కుమార్ వంటి సంగీత దర్శకులు తిరుమలకు సన్నిహితులు. వేలూరి సహజానంద, దేవళ్ళ బాలకృష్ణ, ప్రయోగ వేదవతి, పి.యస్. గోపాల కృష్ణ, బి.జె.యస్. రావు, కొత్రా మల్లికార్జున శర్మ, సుధామ, నాగపద్మిని, వంటి అకాశవాణి వివిధ హోదాల్లో ఉన్న ప్రముఖులతో, దూరదర్శన్‌లో వివిధ హోదాల్లో ఉన్న నండూరి విఠల్, అప్పారావు, రమణ, వెంకటేశ్వర్లు, మహాదేవ్, ఆర్.ఆర్.శ్రీ, ఓలేటి పార్వతీశం, యం.వి. శశిధర్, కేశరాజు ఫణి ప్రసాద్, యార్లగడ్డ శైలజ, యమునా సంజయ్, చక్రవర్తి, హనుమంతరావు వంటి ప్రముఖులతో తిరుమలకు మంచి సాన్నిహిత్యం ఉంది.

## 18. చిత్రకారుడు

ఒక విశిష్టమైన కవిలో ఒకే లక్షణం ఉండదు. సహజంగా ఆయన రచనలు చేసేటప్పుడు ఏవేవో ధోరణులు రచనలోకి వచ్చి చేరుతాయి. కొందరు వీటిని అలాగే పరిమితంగా రాసిపెడతారు. మరికొందరు విస్తరించి రచనలు చేస్తారు. రామరాజభూషణుడు ద్వర్థికావ్యాన్ని, శ్లేషకావ్యాన్ని రాశారు. శ్లేషకావ్యాలలో సంగీత ధోరణులను విస్తృతంగా వర్ణించారు. అంతేకాక ప్రకృతిని చిత్రాలుగా ఆయన కవితలో రచించారు. పింగళి సూరన కూడా ఇలాంటి మార్గాన్నే అనుసరించారు. అంటే అతడు కవి మాత్రుడే కాక చిత్రకారుడూ, సంగీత శాస్త్రవేత్త కూడా. ఆధునికులలో అడవి బాపిరాజు అలాంటి వారే. ఆయన నవలలు రాశారు. సంగీత పరమైన గేయాలు రాశారు. చక్కని చిత్రాలు రాసి మంచి చిత్రకారుడుగా పేరు తెచ్చుకున్నారు. ఇట్లాగే మరి కొందరు కృషి చేసిన వాళ్ళున్నారు.

ఆచార్య తిరుమల కవితతో పాటు చిత్రరచనను చిన్నప్పటి నుంచే అనుసరించారు. ఆయన పెంటపాడు ఉన్నత పాఠశాలలో విద్యార్థిగా ఉన్నప్పుడు ఆ పాఠశాల పక్షాన

ఏర్పాటైన ఎగ్జిబిషన్‌లో తిరుమల గీసిన చిత్రానికి ప్రథమ బహుమతి లభించింది. తాడేపల్లి గూడెంలో నిర్వహింపబడిన మరో ఎగ్జిబిషన్‌లో ఆయన కుంచె నుంచి రూపుదిద్దుకొన్న 'రవీంద్రనాథ్ టాగూర్' అనే చిత్రానికి ప్రథమ బహుమతి వచ్చింది.

తిరుమల సౌందర్యాన్వేషి. అందమైన చిత్రాలు ఎదను కదిలించినప్పుడు ఆ విధమైన బొమ్మలు గీస్తుండేవారు. ఆయనలోని చిత్రకారునికి ప్రేరణ ఇచ్చింది ఆయన అన్నయ్య రాఘవాచార్యులు.

## 19. సంగీతవాల్లభ్యం

తిరుమల గృహనామం శారదాపీఠం. సంగీత శాస్త్రంలో అభినివేశం ఉన్నవాళ్ళు ఎప్పుడూ తిరుమల ఇంటికి వస్తూ ఆ శాస్త్రం గురించి శ్రీనివాసాచార్యులతో చర్చించేవారు. అవసరమైనపుడు రాగాలను వినిపించేవారు. ఈ సంగీత విద్వాంసుల చర్చలు, రాగాలు వినిపించడం వంటి అంశాలు తిరుమలను ప్రేరేపించాయి. ముఖ్యంగా కవి కన్నతల్లి సుగుణావతి సంగీతం తెలిసినవారు. ఆమె శ్రీకృష్ణలీలా తరంగిణి శ్లోకాలు, అష్టపదులు శ్రావ్యంగా పాడేవారు. శాస్త్రీయ సంగీతంలో కచేరీలు సొంత ఇంటిలో జరుగుతుండేవి. ఇవన్నీ కూడా తిరుమల లేత హృదయంలో అడుగుపెట్టి చిద్విలాసంగా పనిచేశాయి. ఈ ప్రేరణ, స్ఫూర్తితో సంగీతంలో చక్కని అభినివేశం సంపాదించారు. నిజమైన కవికి ఇవన్నీ ఉండాలి కదా! ఆయన సంగీత వాల్లభ్యానికి రాగానందంలోని ఈ కవిత పరమ ప్రమాణంగా ఉంది.

"రాగమే అనురాగము
అనురాగమే సుర వైభోగము
వైభోగమే ఆనందయోగము
యోగమే నవ రస యాగము

చిన్మయమే ఆది శ్రీరాగము - తోడి
తన్మయమే లోక కళ్యాణి
మోహనమే స్మర శర జాలము
ప్రణవోదయే భూపాలము

ఆశాగానమే చక్రవాకము
శివరంజనియే జీవశోకము
సరసాలోకమె శంకరాభరణము
హిమ వచనపు హిత హిందోళ

సావేరీ అసావేరీ తీర
భావామృతమే అమృతవర్షిణి



కలిమి మీగడల కమ్మదనాల
మలయ మారుత హేల బేగడ

హృదయ గీతమే యదుకుల కాంభోజి
సదయ హృదయమే లలిత వసంతము
మోక్షానందమే ఆనంద భైరవి
ప్రాణధారయే స్వర సౌరభ దివి."[24]

## 20. సంపాదకత్వం - సంపాదకమండలి సభ్యుడు

తిరుమల సమాజ వికాసం కోసం దోహదపడుతున్న రచనలు చేయడమే కాక విలువైన సంపుటులకు సంపాదకత్వం కూడా నెరిపారు. సంపాదకత్వం అనేది సామాన్య విషయం కాదు. ఇది పలు విధాలుగా ఉంటుంది. ఐతే 'సంపాదకుడు' అనే మాట వినబడగానే ఛప్పున స్ఫురించేది పత్రికను నడిపే మేధావి అని. ఇది చాలా బాధ్యతతో కూడుకున్న విషయం. అనేక శీర్షికలతో ఉంటున్న పత్రికను ప్రజలకు అందివ్వడం, వాళ్ళను ఆలోచింపజేయడం సంపాదకుని నిపుణత మీద, ఆతని చాకచక్యం మీద ఆధారపడి ఉంటుంది. సంపాదకుడు భవిష్యత్ దర్శన కలిగి ఉండాలి. రాజకీయ, సాహిత్య, సాంస్కృతిక రంగాలను బాగా అధ్యయనం చేసి మథించిన వాడై ఉండాలి. అలాంటప్పుడే ఆ సంపాదకుని సామర్థ్యం చక్కగా ప్రస్ఫుటమవుతుంది. ఐతే విలువైన పుస్తకాలను వెలుగులోకి తేవడానికి కూడా సంపాదకత్వం అవసరమే. ఏ ప్రక్రియ ఐనప్పటికీ మంచి అంశాలను ఎన్నుకొని గుదిగుచ్చడంలో సంపాదకుని నిపుణత ప్రస్ఫుటమవుతుంది.

తిరుమల సంపాదకత్వంలో వచ్చిన ఆధునిక కవిత - అభిప్రాయ వేదిక, ఉప్పెన, పద్యవల్లరి, యుగద్రష్ట, వెండి వెన్నెల, అక్షర సాధన, షోడశి, సాధన వంటివి సాహితీ మూల్యాలను వెదజల్లుతున్న కృతులు. అంతేకాక తిరుమల 'ఇంటర్మీడియేట్' తెలుగు విషయ సంపాదక మండలి సభ్యులుగా పని చేశారు.

## 21. సాహితీ రజతోత్సవ వేడుక

దార్శనికులైన మహాకవి జీవితాన్ని కొన్ని దశలుగా విభాగింపవచ్చు. ఈ విభజనం అనంతర కాలాలలోని సాహితీ పరులకు ఉపాదేయం అవుతుంది. వివేచనకూ, ప్రక్రియా పరిశీలనకూ, విశ్లేషణకూ ప్రేరణగా, ఆధారంగా తోడ్పడుతుంది. ఫలితంగా సాహిత్యం అన్ని కోణాల నుంచి విస్తృతం అవుతుంది. అది విశ్వశ్రేయం అవుతుంది. ఒక నవలోకం రెక్క విప్పుతుంది.

ఆచార్య తిరుమల సాహిత్య క్షేత్ర మంతటా ఆవరించిన మహాకవి. అక్షరాలు ఆయన జీవితం. అలాంటి సాహితీ విరాణ్మూర్తికి 1992లో సాహితీ రజతోత్సవం ఘనంగా జరిగింది. ఎప్పుడో వచ్చే వసంతం పలు వన్నె చిన్నెలతో ఝుమ్మని చిమ్ముకొని వచ్చే పరిమళాల మధ్య వైభవంగా జరిగింది. త్యాగరాయ గానసభలో రంగుల ముత్యాలు

మాలలుగా మెరుస్తూ కళ్ళకు మిరిమిట్లు గొలుపుతున్న కాంతి వేదిక మీద ఆకర్షణీయంగా జరిగింది. ప్రముఖ రాజకీయ వేత్త కొణిజేటి రోశయ్య ముఖ్య అతిథిగా సభకు శోభను కలిగించిన ఆ రజతోత్సవానికి జ్ఞానపీఠ పురస్కార అవార్డు గ్రహీత డా॥ సి. నారాయణరెడ్డి కావ్యావిష్కర్తగా వచ్చారు. ప్రతి సదస్సులో కొత్త విషయాలను కవితాత్మకంగా గళమెత్తి పలికే సినారె ముందుగా తిరుమల వచన కవితా కావ్యాల సంపుటి 'వచన కవితా కాదంబిని', పద్యకావ్యాల సమాహారం 'పద్యప్రభాస', గేయాల మాల 'గేయనందిని' అనే మూడు బృహత్ కావ్యాలను ఆవిష్కరించారు. అభివ్యక్తిలో, వ్యక్తీకరణంలో కొత్త పంథాను ఎన్నుకొని హృదయాలు ద్రవించి వికాసాన్ని పొందే విధంగా తిరుమల కవితా వాహిని సాగుతుందని, కవి జీవితంలో బలమైన దశను, ఆ దశలో దిశలను చకితం చేస్తున్న ఆయన సాహితీ మూర్తిమత్వాన్ని అభినందించారు. తిరుమలచే ఆత్మీయ సోదరిగా ఆదరాభిమానాలు అందుకుంటున్న ప్రముఖ కవయిత్రి ఆచార్య నాయని కృష్ణకుమారి ప్రధానవక్తగా ప్రసంగించారు. తెలుగులో వచ్చిన అన్ని ప్రక్రియలకూ జవజీవాలను ఇస్తూ ప్రతి సన్నివేశాన్ని కళ్ళకు, మనసుకళ్ళకు కట్టేలా రాస్తున్న తిరుమల కావ్యావారాశి అమోఘమైందని ప్రశంసల వర్షం కురిపించారు. పద్యంలో సుందరతనూ, వాస్తవికతనూ మేళవించి కావ్యసస్యాలు పండిస్తున్న తిరుమల పద్య కవిత్వంలో ఉన్న వైశిష్ట్యాన్ని ఉండేల మాల కొండారెడ్డి విశ్లేషించిన తీరు సభికులను ఆకట్టుకొంది. ఇతి వృత్తంలో అవసరమైన సన్నివేశాలలో ఆకర్షణీయమైన ఛందస్సును పాటించడం, లయను కల్పించడం, అలంకార వైచిత్రిని పాటించడం, పద్యానికి ఆర్ద్రతను తేవడం, లోకం మీద విడిచిపెట్టడం, ఆ పద్యం తెస్తున్న ఆదరానికి మురిసిపోవడం, మరిన్ని కావ్యకుసుమాలను ఆవిష్కరింపజేయడం తిరుమల విశిష్ట లక్షణాలలో మరీ విశిష్టమైన విషయాలు అని రెడ్డి కితాబునిచ్చారు. వజ్రపుటుంగరాన్ని కానుకగా ఇచ్చారు.

డా॥ జె. బాపురెడ్డి మాట్లాడుతూ తిరుమల అలంకారాల కోసం, లయకోసం, నాద సౌందర్యం కోసం వెతుక్కునే కవి కాదు. ఆయన నిండుగా వికసించి స్వరమెత్తిన వసంతం లాంటి హృదయమున్న వారు. తెలుగుదేశం అన్నికాలాలూ చదువగల రచయిత అని తన గంభీరమైన ప్రసంగంలో తిరుమలను కొనియాడారు. 'డా॥ ఆచార్య తిరుమల సాహితీ రజతోత్సవ సంఘం' అధ్యక్షులుగా వ్యవహరించారు. ఆనాటి ప్రభుత్వ ఛీఫ్ విప్ నన్నపనేని రాజకుమారి మాట్లాడుతూ ఏడు కొండల వెంకటేశ్వరుడికి, తిరుమలకు పోల్చుతూ చక్కని పద్యాన్ని వినిపించి సభికుల ఆనందడోలికల్లో విహరింపజేశారు. తిరుమల గేయ కవిత్వంలో ప్రవహిస్తున్న ఝుమ్మని చిమ్ముకొని వచ్చే హృదయ లాలిత్యాన్ని పెంచే సౌగంధాన్ని ప్రస్తుతించి ఆయన జీవితంలో మరిన్ని మహాకావ్యాలు రాసి ఆంధ్రిని అలంకరించాలని కోరారు.

ఆనాటి సభకు మరో ప్రధానవక్తగా విచ్చేసిన సాహితీ మేరుశిఖరం ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యం మాట్లాడుతూ 'ఆధునిక తెలుగు సాహిత్యంలో దాశరథి, ఆరుద్ర,



సినారెల తరువాత అత్యంత ప్రతిభావంతులైన కవుల్ని ఇలా ఐదు వేళ్ళు చూపెడితే అందులో ఒక వేలు తిరుమల అయి వుంటారు' అంటూ తిరుమల సాహితీ జీవితాన్ని కొన్ని యుగాలుగా విభజించి ప్రసంగించారు. ముఖ్యఅతిథి రోశయ్య మాట్లాడుతూ 'రాజకీయాలతో సతమతమవుతున్న మాలాంటి వాళ్ళకి తిరుమల రచనలు ఎంతో మానసిక శాంతిని చేకూర్చుతున్నాయని' అన్నారు. 'ప్రయాణాలలో తిరుమల కావ్యాలను తీసుకెళుతుంటాను. వారి మాటలు మనస్సుకు హత్తుకుంటాయి. ఆలోచన రేకెత్తిస్తుంటాయి. మార్గనిర్దేశం చూపిస్తుంటాయని' అన్నారు. ప్రముఖ సినీనటులు గుమ్మడి 'తిరుమల సాహితీ రజతోత్సవ సంచిక'ను ఆవిష్కరించారు.

ఈ సాహితీ రజతోత్సవానికి తెలుగునాట బాగా పేరుగాంచిన మహాకవులూ, సుప్రసిద్ధ రచయితలూ సదస్యులుగా ఉన్నారు. ఉత్సవం ఆద్యంతం నేలకు దిగొచ్చిన రసలోకంలా భాసించింది. సమావేశం చివరలో జరిగిన తిరుమల లలిత గీతాల 'సంగీత విభావరి' అందరినీ ఆకట్టుకుంది.

## 22. వక్తృత్వం

మనిషి నడవడికల్లో మాట ఒకట. పరిస్థితులు ఎదురు తిరిగినా, సమస్యలు భయపెట్టిన మాట ఆర్ద్రంగా ఉండాలి. ఎదుటి హృదయాలలో కారుణ్య భావాన్ని సృష్టించేదిగా ఉండాలి. ఒకే ఒక్క మాటతో ఓ మహాయుగానికి ఊపిరులను ఇవ్వొచ్చు. పడగలెత్తిన క్రౌర్యం నుంచి కారుణ్య భావాలను చేదుకోవొచ్చు. ఒక్క మంచి మాటతో చెదిరిపడిన సమాజాన్ని ఒక్క ఆత్మలోకి చేర్చి శాంతి సౌభాగ్యాలతో ప్రజ్వలించేట్టు చేయవచ్చు. తిరుమల మాట అలాంటిది. ఆయన మాట, నడవడిక – ఇవన్నీ ఆయన విశిష్ట స్థానాన్ని మరింత పదిల పరుస్తున్నాయి. తిరుమల మాట నిర్మలమైన సరస్సు నుంచి గుండె విప్పుతున్న కలవల్లోంచి ఎగిసివస్తున్న పరిమళం లాంటిది. పాల మీద తేలిన మీగడలాంటిది. ఆయన మాట మనిషికి భావన ఇస్తుంది. ఆయన వ్యాఖ్యానిస్తే చాలు ఏ అంశమైనా కొత్త సింగారాలను అలంకరించుకుంటుంది. అది అభ్యుదయమూ కావచ్చు, మానవత్వమూ, ఆధ్యాత్మికమూ కావచ్చు. శాస్త్ర విషయామూ కావచ్చు. ఉత్తమ విలుకాడు విసిరిన అస్త్రం గురి తప్పకుండా లక్ష్యాన్ని ఛేదించే వీరుడికీ – ఆ వీరుడికి నిలయమైన నేలకు ఎలాంటి కీర్తిని తెచ్చిపెడుతుందో, తిరుమల దార్శనికత్వం లోంచి వెలువడిన ప్రతి మాట విశ్వశ్రేయానికి పుష్టిని చేకూర్చుతూ ఆ తరువాతి తరాలకు కూడా బాటలు వేస్తుంది. ఎంత జటిలమైన తాత్త్విక విషయాలైనా ఆయన రసన నుంచి అందరికీ అవగాహనకు వచ్చేరీతిలో వెలువడుతుంటాయి. మంత్రపు సంకెళ్ళతో కట్టివేయబడిన మహానాగంలా విమతులు కూడా అలా ఉండిపోతారు. ఆ తరువాత మార్పు అనే మథనంతో సరికొత్త జీవితాలను సంతరించుకొంటారు. గిరి శిఖరం నుంచి దూకి ఎత్తు పల్లాల నుంచి ముందుకు సాగిపోతూ తన నాదాన్ని కోల్పోని ప్రవంతికలా తిరుమల వాక్కులలో పరుషాలు కనపవడవు అన్నీ సరళాలే. ఈ సరళాల నుంచే ఒక ఆత్మీయధార తరగలెత్తుతుంది. ఆ ధార ఎప్పుడూ సాగిపోయేది. ఆ ధారామృతంలోనే

అందరూ తడిసిపోయేది. అందరూ ఆయనకు ఆత్మీయులయ్యేది. ఆ ఆత్మీయులే ప్రజలు. ఆ ప్రజా సమూహాలే సభలూ, సమావేశాలూ. ఇవన్నీ తిరుమల హృదయంలో నిండుగా ఉంటున్న ఋషిత్వధర్మమే అని చెప్పొచ్చు.

తిరుమలది విద్వత్కుటుంబమని ముందే రాశాను. ఆయన సంస్కృతాంధ్రంగ్ల భాషల్లో నిష్ణాతులు. బహుభాషలతో గల పరిచయం ఆయన రచనలకే కాకుండా, వ్యాఖ్యానానికి, వక్తృత్వానికి కొత్త సొగసులను చేకూర్చాయి. వైజ్ఞానిక, వేదాంత శాస్త్రాలు, గీతోపనిషత్తులు ఇత్యాది విషయాలపై ఉన్నపట్టు ఆయన సాహిత్యంలో కూడా ప్రస్ఫుటంగా కన్పిస్తుంది. అన్యదేశాలు ఆయన కవితలో ఒజ్జబంతులై ఒదిగిపోతాయి. సభారంజకంగా మాట్లాడి సభికులను ఆనందడోలికల్లో విహరింపచేయడం ఆయనకు వెన్నతో పెట్టిన విద్య. తాత్విక విషయమైన, తామరతంపరలుగా పుట్టుకొస్తున్న ఆధునిక ఇజాల మీద గానీ అనర్గళంగా మాట్లాడుతారు. భాషా సంపద, మనోహరమైన అభివ్యక్తి, స్పష్టమైన ఉచ్చారణ, ధారాశుద్ధి, కళాత్మక హృదయం ఆయన వ్యక్తిత్వానికి, వక్తృత్వానికి వన్నెను తెచ్చాయి.

## 23. వ్యక్తిత్వం

మాట - చేత - నడక సహృదయ గతంగా సాగినపుడు అది ఉత్తమ విలువలతో భాసిస్తూ మనిషిని మనీషిని చేస్తుంది. కవితాత్మ ఉన్న మనిషిలో ఈ మూడు గుణాలు రాశిగా నిలిస్తే ఆయన మార్గదర్శి, క్రాంతదర్శి అవుతాడు. అంటే ఆయనలో వెలుగు వెల్లువలను ఉరకలు తీయిస్తున్న వ్యక్తిత్వం వర్తమాన సమాజ చేతనను ప్రభావితం చేస్తుందన్న మాట. భవిష్యత్తును ఆదర్శంగా, ఆదరణీయంగా తీర్చిదిద్దుతుంది. తెలుగు కవులలో వ్యక్తిత్వానికి విలువనిస్తూ కవిత్వం పలికే వాళ్ళూ ఉన్నారు. వ్యక్తిత్వం ఎలా ఉంటేనేం కవిత్వం ఆదర్శంగా ఉంటే సరిపోతుందని భావించిన వాళ్ళూ ఉన్నారు. కవి కేవలం తన ఆరామంలో కూర్చొని రచనలు చేస్తే సరిపోదు. ఆయనా ఒక సామాజికుడు, సంస్కరణాభిలాషి కావడం వల్ల ఇతరుల కంటే తన వ్యక్తిత్వాన్ని పవిత్రంగా స్వరూపించుకోవలసి ఉంటుంది. తనను శిఖరంగా నిలబెట్టుకోవడానికి శ్రమించవలసి ఉంటుంది. అలాంటి కవీ, ఆయన లేఖిని నుంచి వెలువడిన ప్రతి రచనా ఎన్నో మలుపులనూ, మజిలీలనూ దాటి పచ్చపచ్చగా ఉంటుంది. జాతిని విశిష్ట మార్గాలలో నడిపిస్తుంది.

కవులలో పలురకాల గుణాలున్నవాళ్ళుంటారు. కొందరు తన ఆదర్శాన్ని రాస్తారు. కొందరు ఆదర్శం కోసం రాస్తారు. మరి కొందరు అవసరం కోసం రాస్తారు. ఇంకొందరు నాలుగైదు పద్యాలు రాసేసి అమాంతంగా ఎదిగిపోవాలని చూస్తారు. కొందరు రాశికి ప్రాధాన్యమిస్తే మరి కొందరు వాసికి ప్రాధాన్యమిస్తారు. ఆధునికుల్లో గురజాడ, శ్రీశ్రీ, తిలక్, అజంతా లాంటి వాళ్ళు రాసినవి కొద్దిగా ఉన్నప్పటికీ "ఒకే ఒక్క సిరా చుక్క లక్ష మెదళ్లకు కదలిక"[25] అని బైరన్ అన్నట్టుగా ఎప్పుడూ వెలుగులను విరజిమ్ముతూ కొత్త ప్రక్రియల అవతరణకూ, వికాసానికీ దోహదపడుతున్నాయి. వీళ్ళ శబ్దరాశి పొదుపు పొదు నుంచి వెలువడినట్టుగా ఉంటుంది. ఐతే వీళ్ళ రచనలు ఎప్పటికీ హరితంగా ఉండటానికి



వాళ్ళు అనుసరిస్తున్న ఆదర్శమే ప్రధాన హేతువుగా కన్పిస్తుంది. రచనలో మాత్రమే నిజాయితీని చూపే రచయిత నవ్వుల పాలవుతాడు. ఆదర్శం రచనలో, వ్యక్తిత్వంలో సమంగా దీపమై వెలగాలి. ప్రధానంగా ప్రతీ కవి ముందు తాను మనిషినన్న భావాన్ని కలిగి ఉండాలి. సమాజాన్ని దర్శింపగలగాలి. అప్పుడు మాత్రమే ఆయన కావ్యావారాశి రసజ్ఞుల మెప్పులను అందుకుంటుంది.

ఆచార్య తిరుమల వ్యక్తిత్వాన్ని పరిశీలిస్తే ముందు తనను తాను మనిషిగా ఎంచుకుంటారు. సురభిళాత్తమైన తన హృదయంతో ప్రతి వస్తువునూ దర్శిస్తారు. చకితమైన మేధతో సంయోజన చేస్తారు. అప్పుడు రచన చేస్తారు. ఆయన వ్యక్తిత్వాన్ని రెండు కోణాల నుంచి దర్శించ వలసి ఉంటుంది. ఒకటి ఆయన కలం నుంచి వెలువడిన రచనలు. రెండు ఆయన గూర్చి కవి పండితులు చెప్పిన అభిప్రాయాలు.

తిరుమల సహజంగా వినయశీలి, వస్తుతః సౌజన్య శీలి. ఎంతటి కవియో అంతటి సహృదయులు. ఎన్ని బిరుదులు తనను వరించినను, ఎన్ని ఉన్నత శిఖరాలు అధిరోహించినను కించిత్తు గర్వం లేని వ్యక్తి ఆయన. తాను హిమవన్నగం అంతగా ఎదిగినా తనకు తాను తగ్గించుకొంటారు. 'పద్యప్రభాస'కు తాను రాసుకున్న ఈ మాటలను పరిశీలిస్తే తిరుమల సౌజన్య సమ్మిళితమైన సంస్కారధార స్పష్టంగా కన్పిస్తుంది. "నేనిప్పటి వరకూ చేసిన సర్వ సాహిత్య సృష్టిలో ఏ ఒక్క మాట ఏ ఒక్కరికి రవ్వంత సంతోషాన్ని కలిగించినా చాలుననుకుంటున్నాను. ఎందుకంటే, నేను అపార జ్ఞాన సాగర తీరాన పడివున్న రేణువులో సహస్రాంశమైనా కాను కాబట్టి. 'కవర్మనీషీ పరిభూః స్వయంభూ' వేదార్థాన్ని తెలుసుకోవడానికి ప్రయత్నిస్తున్న నిత్య సాహిత్య విద్యార్థిని కాబట్టి".[26] కొద్దిగా రాసి అందులో కూడా పసలేక పోయినా తననూ, తన కవితా శక్తిని పొగిడించుకునే సాహితీ పరులున్న సమాజంలో తిరుమల తాను సహజంగా, సమున్నతంగా నింగి అంతగా ఎత్తుకు ఎదిగి సాహిత్యపు వినీలాకాశంలో ప్రభాకరుడిలా ప్రభాసిస్తున్నప్పటికీ తనను తాను తగ్గించుకోవడం, విద్యార్థిగా చెప్పుకోవడంలోనే ఆయన ఉదాత్తమైన హృదయ ధావళ్యం కన్పిస్తుంది. తెలుగు కవితకు ప్రాతఃస్మరణీయులూ, ఆదర్శ వ్యక్తిత్వం కలవాళ్ళూ అయిన నన్నయ, తిక్కన, పాల్కురికి, పోతన లాంటి ప్రాచీన కవుల్లో ఎంత వినయం తొణికిసలాడుతుందో అదే సంప్రదాయం మొదటి నుంచి తిరుమల జీవితంలో గాఢంగా కన్పిస్తుంది.

జీవితాన్ని జీవితంగా అనుభవించాలని తిరుమల తలపోస్తారు. జీవితాన్ని జ్యోతిర్మయం చేసే రేఖలలో నుంచి ఒక రేఖ ఆగిపోయినా ఆయన అమితంగా కుమిలిపోతారు. జీవితంలోని ఆ వెలితిని పూరించడానికి ఉద్యమించమంటారు. ప్రశ్నించమంటారు. అలాంటి వాళ్ళకు నమస్కరిస్తానంటారు.

"నిప్పులు తింటూ, నిశ్శబ్దాన్ని తింటూ
రెప్పలార్పకుండా జాలిగా చూసే

సజీవ పుస్తకాలు
నా ఊపిరికి నేస్తాలు"[27] అనడంలో తిరుమల హృదయగతమైన ఆశయం చిత్రాకృతిలో కన్పిస్తుంది. నిప్పులు తింటూ, నిశ్శబ్దాన్ని తింటూ ఉండటం అనే పదబంధాలు పూర్ణ హృదయానికి ప్రతీక. వాస్తవ దర్శనానికి పతాక. తిరుమల సమాజ బహిరంతర్వలయాలను తన ఎక్సురే కళ్ళతో చూస్తూ రచనలు వెలువరించారు. ఆయన భావుకసీమ నిరంతరం చైతన్య గీత. ఈ చైతన్యం, స్పందన నుంచి పుట్టిన ప్రశ్నలు మనిషి విశాలంగా సాగడానికి ఉపయోగపడతాయి. ఈ ప్రశ్నాసమాహారం అనుభూతితో తడుస్తూ అనుక్షణం ప్రజ్వలిస్తూ ఆలోచనలకు చూపులనిస్తాయి. ఇవి సజీవ పుస్తకాలు అవుతాయి. నిప్పులూ, నిశ్శబ్దమూ ఆత్మగా వీటిలో సాగుతాయి. ఇవి చూసేవి జాలి చూపులే. ఈ జాలి చూపులు అవసరమైనపుడు వాడి చూపులుగా తగులుతాయి. మనిషిలో రెక్కవిప్పిన మానవత్వాన్ని ఉసిగొల్పుతాయి. ఉద్వేగాన్ని ఇస్తాయి. నిప్పులను తినిపిస్తూ వెన్నెలలను కురిపిస్తాయి. నిజాలను నింగి అంత విశాలంగా పలికిస్తాయి. అలాంటి పుస్తకాలు జాతికి పాథేయంగా ఉంటాయి. జాతిని హెచ్చరిస్తాయి. పలకరిస్తాయి. అవసరమనుకున్నప్పుడు నిప్పుకలను చిమ్ముతాయి. కరడు గట్టిన చీకట్లను కాల్చివేయడానికి, పడగ విప్పిన ఈర్ష్యాద్వేషాలను కడతేర్చడానికి, మనిషి హృదయాన్ని పవిత్ర దేవళంగా తీర్చిదిద్దడానికి ప్రయత్నిస్తాయి. అలాంటి పుస్తకాలు తిరుమల ఊపిరికి నేస్తాలు. అంటే తిరుమల హృదయం మానవతా సదనం అన్నమాట.

తిరుమల ఒక ఇజం పొలిమేర మధ్య కట్టుబడి రచన చేసిన వారు కాదు. ఆయన కవిత మీద ఏ ఇజాల ప్రభావం ప్రదర్శనా లేవు. మానవత్వపు విలువల మెరుపులే ఎక్కువగా కన్పిస్తుంటాయి. "మంచితనం పచ్చగా ఉండాలి మనిషితనం పచ్చగా ఉండాలి"[28] అన్న సినారె కవితోక్తులు ఆయన జీవితానికి, కవిత్వానికి అన్వయిస్తాయి. ఉషస్సులను స్వాగతించడం, తమస్సులను కాల్చివేయడం లాంటి అంశాలు ఆయన ఆశయంగా కన్పిస్తాయి. "తిరుమల కవిత్వంలో వున్నవి ఇజాలు కాదు నిజాలు. ఈ కవిలో విద్వత్తు, నైతిక సత్యము, ప్రతిభ త్రివేణి సంగమం చెందాయి"[29] అన్న మాటలు తిరుమల పట్ల అక్షర సత్యం. 'నిజానికి నేనెంత? నాకు తెలిసినదెంత? ఆవగింజలో వెయ్యోవంతైనా కాదు. నా కళ్ళ ముందు సాహితీ మేరు శిఖరాలు! అపార తత్త్వ జ్ఞాన సాగరాలు! ఈ 'నేను'కి అర్థం గానీ, పరమార్థం గానీ యింకా కనిపించటం లేదు"[30] అని వినమ్రంగా చెప్పారు. అంతే కాకుండా "I have come as a small sprout and you have enlarged me into a big tree. I have come as a small canal and you have turned me into an ocean. I have come as twinkling star and you have made me as big as a galaxy"[31] అన్న తిరుమల మాటలు ఆయనను ఆదరించి, అభిమానించిన వారి ఆశీస్సులే సాహితీ రంగంలో ఆయనకున్న స్థాయికి కారణమన్న అర్థం మనకు ద్యోతకమవుతుంది.

తిరుమల సొంత జీవితంలోనూ, రచనల్లోనూ ఆదర్శాన్ని పండిస్తున్న సత్కవి. ఆయన ఆశయం ఇట్లా ఉంటుంది.



"నా పవిత్ర భారత దేశ దీప కాంతి
ఎంత దూరము సోకునో అంత వరకు
నేను నడతును ధార్మిక నిష్ఠబూని
కర్మ వీరుండనై! భోగ కాంక్ష విడిచి"[32]

పవిత్ర భారత దీప కాంతి ఎంతదూరం వెళుతుందో అంతదాకా నడుస్తానంటారు. ఈ దీప కాంతికి పొలిమేరలు అంటూ ఉండవు. మనిషి కట్టుకున్న సరిహద్దులను తుడిచిపెడుతూ ఎదుగుతూ ఎదుగుతూ విశ్వమంతా అల్లుకుంటుంది. భారతదేశ దీపకాంతి అన్నప్పుడు - కేవలం భౌతికమైన ప్రదేశానికి సంబంధించింది కాదు. సంస్కృతికి, సంప్రదాయానికీ, శాస్త్రానికీ, రీతికీ, నీతికీ సంబంధించి నట్టిదిగా భావించాలి. "స్వాదువులౌ ఫలంబులు స్వచ్ఛములైన జలంబులన్ మతాస్వాదన చేసి చేసి తుది వాయువె భక్షణముంబొనర్చి వ్యాసాదులు"[33] రాసిన దర్శనాలు మహా దీపకాంతులలా నేటికీ ప్రపంచాన్ని జ్యోతిర్మయం చేస్తున్నాయి. అయితే తిరుమల భావించిందిదే దీపకాంతి. ఆయన నడక కూడా ఇంత వరకే - అంటే పరిమిత రేఖను సూచించేది కాదు. ప్రపంచమంతటికీ - అన్నమాట. ఇట్లా నడవడానికి మరో ఆశయం ఆయన మనస్సులో ఉంది. అది ధార్మిక నిష్ఠ. అంత వరకే పరిమితమై పోలేదు ఆయన. కర్మ వీరత్వాన్ని కూడా కలిగి ఉన్నారు. ఈ సద్గుణాలన్నీ ఆయనకు భోగకాంక్షను విడిచిపెట్టడం వలన సంక్రమించినట్టివే.

తిరుమల తన విశిష్టమైన వ్యక్తిత్వంలో ఒకటైన ఆశయాన్ని ఇట్లా ప్రకటించారు.

"నడచువారల తోడనే నడచుచుండు
వెలుగులిడు వారి తోడనే వెలుగు చుండు
స్తబ్ద పాషాణ జీవన ధర్మమేల?
భవ్య చైతన్యవంతమౌ భవము నాది"[34]

నడిచే వాళ్ళ అడుగుల్లో అడుగులు వేయడం, వెలుగులతో నడవడం వంటివి కేవలం అనుసరణీయాలే. వీటిలో కొత్తదనం కానీ, సృజనశక్తికానీ ఉండవు. వీటివల్ల మనిషి గానుగెద్దులా తిరగాల్సిందే తప్ప మరొకటి లేదు. వీటిని కవి తిరుమల స్తబ్ద పాషాణ జీవన ధర్మాలని తిరస్కరించారు. వీటి వలన మనిషికానీ, సమాజంకానీ కొత్త తళుకును సంతరించుకోలేవని ఆయన అభిప్రాయపడినారు. కాబట్టే తిరుమల వీటిని కాదన్నారు. ఎప్పుడూ వికాసాన్ని పొందేదీ, మానవశక్తులలో నూతనత్వాన్ని ప్రేరేపించేది అయిన స్థితిగా తన లక్షణాలను ప్రకటించారు. ఈ తత్వం తిరుమలలో క్రాంతి దర్శిత్వాన్ని, మార్గదర్శిత్వాన్ని రుజువు చేస్తుంది. సమాజానికి నూతనమైన చేవను సమకూర్చిపెడుతుంది. ఈ అంశాలను నిశితంగా పరిశీలిస్తే తిరుమల సమాజంలోని ఎక్కువ పార్శ్వాలను చైతన్యీకరించి వాళ్ళ హృదయాలలో నిలిచి పోయిన కవిలా అగుపిస్తున్నారు. కాబట్టే ఆయన ఏ పొలిమేరలూ, ఏ అడ్డుగోడలు, గొడవలు లేకుండా చేయెత్తి పిలుస్తూ సమాజాన్ని తన వెంట తీసికొని వెళుతున్నారు.

"అంతమే లేని నింగి తానెంత నాకు
నా హృదయ మందది చిరు సందడియె కాని,
బిందువందున సింధువు బింబమట్లు
నాదు కంటను విశ్వమ్ము నటన మాడు"[35]

అంతం అనేది లేకుండా విశాలంగా పరచుకొని ఉన్న వినీలాకాశం ఆయనకు అంత పెద్దగా కనిపించదట. అది ఆయన హృదయంలో చిరుసందడిలాంటిదట. నింగి అన్నప్పుడు అది కేవలం విశాలత్వానికి మాత్రమే ప్రతీక కాదు. సూర్యచంద్రులు, నక్షత్రాలు, గ్రహాలు, హ్యోమనౌకల విహారాలు - ఇలాంటి వాటితో నేలపై ఉన్న మనకు వినిపించని రణగొణధ్వనులతో ఉంటుంది. వీటితో కూడుకున్న గగనం అంటే మనముంటున్న సమాజమే. ఇది విశ్వనరుడైన తిరుమలకి హృదయంలో కదలుతున్న చిరుసందడిలాంటిదే. ఒక్క బిందువులోనే సింధువు, బింబం ఒదిగి ఉన్నట్టు నిఖిల విశ్వం ఆయన కళ్ళల్లో నాట్యమాడుతుంది. 'ఆకసము బీజప్రదాతగ, అవనియే ఒక ఆదిమాతగ, కానగల్గిన మానవునకు జగజ్జనాళి ఒకే కటుంబము"36 అన్న సినారె కవితోక్తులు చక్కగా వర్తిస్తాయి. నింగి అంత విశాలత్వాన్ని గుండెలో పదిలంగా నిలుపుకున్న తిరుమల

"తృప్తి నొందని వాడేపో దీనుడగును
తృప్తినందెడు వాడే పో ధీరుడగు
గడ్డి పోచయే మేరు శిఖరము నాకు
నను జయించుట కష్టమే మనజునకును"[37]

కొందరికి ఎంత తిండి ఉన్నా, ఎంత ఆస్తి ఉన్నా తృప్తి ఉండదు. పొరుగు వాళ్ళ సొత్తును సొంతం చేసుకోవడానికి ప్రయత్నిస్తారు. ఈ దురాలోచనల వల్ల వాళ్ళు అనామకులుగా నిరాదరణకు గురి అవుతారు. మరి కొందరు కొద్దితోనే సంతృప్తిపడతారు. సంతోషిస్తారు. సాటివాళ్ళు ఎంత ఎదిగినా, సిరి సంపదలతో కళకళలాడినా ఉప్పొంగి పోతాడే కానీ. వాళ్ళను అభినందిస్తాడే కానీ ద్వేషించడు. ఈ త్యాగశీలురే ధీరులుగా ఉండి జాతిని రేపటిలోకి నడిపిస్తారు. తృప్తి దండిగా ఉన్న తిరుమల గడ్డిపోచను కూడా మేరు శిఖరంగా భావించారు. అలాంటి నిండు మనసున్న మనీషి, నిజాయితీగా రచనలను వెదజల్లుతున్న మహాకవి తిరుమల. సౌశీల్యాన్ని, సౌగంధ్యాన్ని కలిగి ఉన్న తిరుమలను ఎవరూ జయించలేరని సూటిగా చెబుతారు. ఇదీ ఆయన వ్యక్తిత్వానికి ఉన్నత సోపానం.

"నీతి నియమం నా బాట
న్యాయం ధర్మం నా మాట
అసమానత పై నా వేట
శాంతి సహనం నా పాట"[38]

ఇదీ తిరుమల లక్ష్యం. ఇది దార్శనికుడైన కవి మనోధర్మాన్ని ప్రకటించేది. ఈ మనోధర్మమే సమాజాన్ని వెలుగులతో నింపి వేస్తుంది.



వందల కొలది సాహితీ సభల్లో పాల్గొని ప్రపంచ నలుమూలలా సాహితీ యాత్రను దిగ్విజయంగా జరిపిన ఘనుడు తిరుమల. సాహిత్యమంటే ఎనలేని గౌరవం ఆయనకు. ముందుగా తనను తాను మనిషిగా ఎంచుకుంటారు. ఆ తరువాతే కవిగా భావించుకుంటారు. ఇలాంటి తత్వం ఉన్నవారే సమాజాన్ని శాసించగలుగుతారు. కాలాన్ని ప్రశ్నించగలుగుతారు. తిరుమల వ్యక్తిగా రచయితగా సదాశయాలకు కట్టుబడి సమాజ కల్యాణం కోసం రచన చేశారు.

"ఆశను జెండగా ఎత్తిపట్టి
ఆశయాన్ని పాడుకుంటూ
అడుగులు వేస్తున్నాను"[39]

అని ఆయన అంటున్నది అక్షర సత్యం. ఆశయం లేని కవి జనజీవన సౌందర్యాన్నీ పాడటానికి అర్హుడుకాదు. తిరుమల నిజమైన కవి. ఆయన వేస్తున్న ప్రతి అడుగు సమాజానికి ఆదర్శవంతమైన జీవన పథాన్ని నిర్దేశించేదే. తిరుమల కవిత్వంలో మానవత అంతర్గతంగా ప్రవహిస్తూనే ఉంటుంది.

"నేనొక కిరణ మార్గాన్ని
మానవతా భావ స్వర్గాన్ని"[40]

అని చేయెత్తి భవ్యమైన మార్గాన్ని చూపిస్తున్నట్టుగా ఉంటుంది.

కవిత్వమే జీవితంగా సాగుతున్న వాళ్ళు చాలా అరుదుగా ఉంటారు. అలాంటి వాళ్ళలో సచ్ఛీలం, సత్సంప్రదాయం నిండుగా కన్పిస్తాయి. ఈ మేలు గుణాలు ఉన్నవాళ్ళు మాత్రమే జాతికి శ్రేయస్సును కలిగించే కవితను పలుకుతారు.

"కవిత అన్నది జీవితంబగు
కవిత అన్నది జీవనంబగు
కవిత వైరుధ్యములు కలిపే
క్రమ మానస సూత్రమేయగు"[41]

అన్న ఈ పంక్తుల్లో తిరుమల ఆశయం స్పష్టంగా కన్పిస్తుంది. తిరుమల సహజంగా సమాజంలోకి చూస్తూ సమాజ కేంద్రంలోకి సాగివస్తారు. అక్కడ నుంచి సమాజ ఎదుగుదలకు పాటుపడతారు. ఈ అభినయానికి అక్షరాలు ఆధారంగా అమరుతాయి.

"I walk slowly over the piles of letters
to reach the diamond mines of human love"[42].

మానవత్వం ఆయన పెన్నిధి. ఎన్ని తరాలు కాల గర్భంలో గడిచిపోయినా మానవత అనేది ఎప్పటికీ పచ్చగా కళకళలాడాలన్నదే ఆయన అభిమతం.

తిరుమల కవితలో అభివ్యక్తి ఆయన వ్యక్తిత్వంలో నుంచే పొంగి వస్తుంది. ఆయన ఎంచుకున్న అక్షరలోకం నుంచే రెక్క విప్పుతుంది. తన కన్నా దేశం మిన్న అని ఆయన భావించారు.

"నేను తలదించుకున్నా
నా దేశం తలెత్తుక తిరిగితే చాలు
నేను పేదనైనా
నా పొరుగువాడు శ్రీమంతుడైతే చాలు
నేను ఆకలితో ఉన్నా
నా అనుచరుల ఆకలి తీరితేచాలు
నేను అందంగా లేకున్నా
నా కవిత అందంగా ఉంటే చాలు"[43]

అని సంతృప్తి పడడంలోనే నింగి అంత ఆశయం కన్పిస్తుంది. ఇది సహజమైన ఆయన కవితాత్మకు ప్రతీకగా దీపిస్తుంది.

సమాజంలోని వ్యక్తులు తమ తమ అభ్యున్నతి కోసం పాటు పడతారు. ఇది సహజం. అయితే మనిషి చేసే ఈ కృషికి అనేక కారణాల మూలంగా అంతరాయాలు ఏర్పడుతుంటాయి. అప్పుడు మనిషి లోని ఆసురీశక్తులు ప్రజ్వలించి అతనిలోని క్రోధాన్నీ, అహంకారాన్నీ, అసూయాద్వేషాన్ని రెచ్చగొడతాయి. అప్పుడా వ్యక్తి తన ఆధిక్యం కోసం ప్రయత్నిస్తాడు. అందిరకన్నా తానే గొప్ప అంటాడు. తానే పండితుడనంటాడు. తాను చెప్పిందే వేదమంటాడు. తన కంటే గొప్పవాళ్ళు ఈ ప్రపంచంలో ఎందరో ఉన్నారనే నగ్నసత్యాన్ని విస్మరించి గర్విస్తాడు. అందుకే 'ఏల గర్వంబు? విశ్వ విశాల శాలలో నిలిచి" అని చెబుతూ విశ్వ దృశ్యాన్ని ఇలా చిత్రీకరించారు తిరుమల.

"ఎంత నేర్చిన గాని యెంతయో ఘోషించు
విజ్ఞాన జలధి యీ విశ్వమెల్ల
ఎంత చూచిన గాని యెంతయో కనిపించు
దృశ్య ప్రబంధ మీ పృథ్వియెల్ల
ఎంతగా నడచినన్ అంతమ్ము కనరాని
వ్యధల పథంబు ఈ బ్రతుకు బాట
ఎంత చెప్పిన గాని యెంతయో మిగులు
కథాద్భుత మీ చలత్ప్రాణ చర్య

చాల దూరమైన చాల దగ్గరనైన
చూడలేని కంట జూచు చుండి
తెలియలేదు గర్వి దివ్య వినయగుణ
ప్రభను, మీరి యెగిరి పడుచునుండు"[44]



ఇటువంటి అనంతత్వాన్ని తెలుసుకోగలిగితే మానవుడికి ప్రపంచంలో తన స్థానం ఏమిటో తెలుస్తుంది. తన గర్వం 'సంకుచిత' మనస్తత్వ సంభూతమనీ, మహాసముద్రంలో తానొక నీటి బిందువు మాత్రమేనని, ఏమీ లేని చోట మాత్రమే తానొక మహావృక్షమనీ అవగతం అవుతుంది. ఈ పద్యంలో గర్వాశ్రితుడైన మానవుడి అల్పత్వ నిరూపణ జరిగింది. వినయ గుణావశ్యకత చెప్పబడింది.

"తనకు తానెంత యెదిగిన తప్పులేదు
పరుల దూషించు గుణమున్న బాధ రగులు"[45]

అంటారు తిరుమల మరో పద్యంలో. ఈ పద్య పాదాలు ఆయనలోని వివేకాన్ని, ఆదర్శ భావాన్ని, సున్నిత మనస్తత్వాన్ని సూచిస్తాయి.

ఎంతటి పదవి యున్న ఎంతటి సిరులున్న
ప్రకృతి కెవడు నెపుడు రాజు కాడు[46]

మానవుడు విద్యావంతుడై ఎంతటి ఉన్నత పదవినైనా అలంకరించవచ్చు. అధికార వైభవాన్ని అనుభవింపవచ్చు. సిరిసంపదలతో తులతూగవచ్చు. అంతమాత్రం చేత తానే సర్వం సహాధికారినని చెప్పుకోవడాన్ని తిరుమల గర్హిస్తారు. ప్రకృతికి ఎవరూ ప్రభువులు కారని నిర్ద్వంద్వంగా చెప్పారు. ప్రతి వ్యక్తి సత్వ గుణ సంభూతమైన వినయాన్ని పెంపొందించుకోవాలనీ, దాని వల్ల అహంకార ద్వేషాదులు నశిస్తాయని, సమతా దృష్టి ఏర్పడుతుందని, ఇది జ్ఞాని లక్షణమని తిరుమల అన్నారు.

తిరుమల వ్యక్తిత్వం విశిష్టమైంది. ఆచరణీయమైందీనూ. అనుసరణీయమైందీనూ. ఆయన హృదయమే కాక తనువెల్లా కవిత్వమే పరిమళిస్తుంది. అలాంటి తిరుమల ఈ అభివ్యక్తి పరిశీలించండి.

కవితయె నా ఆహారము
కవితయె నా శాంతి దాంతి కనక గృహంబున్
కవితయె నా సిద్ధాంతము
కవులే నా బంధుకోటి, కనరో! రసజ్ఞుల్[47]

కవిత ఆహారం అనటంలో ఔచిత్యం పరచుకొనివుంది. దేహానికి పుష్టిని కలిగించే శక్తి విటమినుల రూపంలో ఉంటుంది. కవితకు పదును పెట్టే శక్తి సాహిత్యాధ్యయనంలో ఉంటుంది. నిరంతర పరిశీలనం, అధ్యయనం వల్లనే కవి మార్గదర్శి అవుతాడు. తిరుమలకి ఈ అధ్యయనం, పరిశీలనం ఆహారంగా ఉన్నాయి. శాంతిగా ఉన్నాయి. శాంతి ఉండడమేమిటి? అంటే కవి అంతరంగంలో కల్లోలాలు, కాలుష్యాలు లేకుండా ఉండడం. హృదయం ప్రశాంతంగా ఉన్నప్పుడే కవి నుంచి ఆగామి కాలాన్ని సంస్కరించే కవిత ఉద్బుద్ధమవుతుంది. అంతేకాదు, రేపటిని నడిపించే శక్తిమంతమైన కవిత్వం ఉదయిస్తుంది.

అదే తిరుమల 'కవితయే నా శాంతి' పదావళి. ఆయన కవితాశయాలలో మరొక్కటి దాంతి. శాంతి భవిష్యత్తును ఎట్లా సుందరంగా చేస్తుందో ఆ సుందర చైతన్యానికి దాంతి మానసికమైన పీఠంగా అమరుతుంది. దాంతి అంటే ఇంద్రియ నిగ్రహం. దీన్నే 'నా నృషిః కురుతే కావ్యమ్' అనొచ్చు. కోరికలను ఎదలో అదుపులో పెట్టుకున్న కవి నుంచే రసోజ్వలమైన సాహిత్యం వస్తుంది. వ్యాస వాల్మీకులు మరి కొందరు ఈ కవితా దృక్పథాలకు ప్రతీకలు. ఆధునిక కాలంలో తిరుమల అలాంటి రుషి ధర్మాన్ని పూర్ణంగా, పవిత్రంగా ఆచరిస్తున్న మహా మనీషి. తిరుమలకు కవిత కనక గృహం లాంటిది. కనకం అంటే బంగారం కదా! కనక గృహం అంటే బంగారం చేత నిర్మితమైందికాదు. బంగారంలా పరిణమించిన భవనం. అలాంటి విశిష్టమైన గుణాలు కలది అన్నమాట. ఆ వెంటనే 'కవితయె నా సిద్ధాంతము' అన్నారు కవి. ఆధునికంగా వచ్చిన, వస్తున్న కవితా సిద్ధాంతాలు చాలా ఉన్నాయి. ఇవన్నీ కూడా సమాజ వికాసానికి దోహదపడే సాధనాలే. వీటన్నీటికీ మూలం అసలైన కవిత. తిరుమల భావించిన కవితా సిద్ధాంతం ఈ ఆధునిక సిద్ధాంతాలకు మూలకందంగా ఉన్న 'విశ్వ శ్రేయం కావ్యం' అనేది. కవి హృదయంలో ఈ దృక్పథం లేకుంటే తానేమి రాస్తున్నాడో, ఎందుకు రాస్తున్నాడో తెలియని అయోమయమైన స్థితి ఏర్పడుతుంది. ప్రజోపయోగమైన, సహజమైన, సుందరమైన, శివ పరమైన, సత్యమైన కవిత్వమే ఆయన సిద్ధాంతమన్న మాట. కవులు తిరుమల బంధుకోటి. మరి బంధువులు లేరా! ఉన్నారు. ఆ అనుబంధాలు పరిమితమైనవి. కవులే బంధువులన్నది విశిష్టమైన, విశాలమైన ఆత్మీయ దృక్పథానికి ప్రతీక. అలాంటి కవితాశయాలను రసజ్ఞులు గమనించాలి. అప్పుడు కాని తిరుమల కవితా వ్యక్తిత్వం అవగతమవుతుంది.

తిరుమల సహజమైన కవి. ఆయన ఆదర్శంగా ఉండడమే కాదు. మార్గదర్శకత్వాన్ని వహిస్తారు. నడిపిస్తారు. నీటుదనాన్ని అందించడమే ఆయన వ్యక్తిత్వంలో స్పష్టత.

కవుల కులాన నేనొకడ కాకిని కాను వసంత కోకిలన్
రవి కిరణ ప్రభా పటల రంజిత లోకము నాకు గూడు, నే
నవిరళ కావ్య గాన రసయజ్ఞ ఫలోదయ సాధకుండ, నా
భవము కళా ప్రభావము శుభావహ భావము జీవకోటికిన్[48]

కవులది ఒక కులం. ఇది ఇతర కులాల లాంటిది కాదు. ప్రత్యేకమైంది. పవిత్రమైంది. అయినప్పటికి కొందరు కవిత్వం పేరిట అకవిత్వాన్ని సృష్టించి విశ్వశ్రేయాన్ని వక్రమార్గంలోకి మళ్ళిస్తారు. అలాంటి వాళ్ళను కాకవులంటారు. తిరుమల ఈ దుర్గుణ కవులను నిరసిస్తారు. తనను కోకిలగా చిత్రిస్తారు. అది వసంత కోకిలగా. వసంత రుతువుకూ కోకిలకూ దగ్గరి సంబంధం. వసంతం అందంతో, పరిమళంతో, పలువురిని రంజింపజేస్తున్నా కోకిల పాట లేకపోతే వసంతపు సోయగాలకు విలువ ఉండదు. అందుకే తిరుమల వసంత కోకిల. ఇక ఆయన నివాసం ఎక్కడో కాదు. 'రవి కిరణ ప్రభా పటల రంజిత లోకము' అంటే రవి కిరణాల కాంతి సమూహాల చేత వర్ధిల్లుతున్న లోకం. ఆయన నిరంతరం



కవితాగానంతో రసయజ్ఞ ఫల సాధకుడు. ఆయన భవం కళా ప్రభావం జీవ కోటికి శుభాన్ని కలిగించేది. ఈ పద్యంలో విశేషణాలన్ని ఆయన వ్యక్తిత్వంలోనే కాకుండా ఆయన రచనలలోనూ కన్పిస్తాయి. అందుకే 'ఈ లోకం నవ్య కవనం, ఎప్పుడూ నాదే విజయం"[49] అని ఎలుగెత్తి చాటగలుగుతున్నారు.

ప్రతి రచనలోనూ మనిషినీ, మానవత్వాన్ని తలపోస్తారు తిరుమల. ఉత్తముని లక్షణాలను నీతి శాస్త్రంలోని సంఘటనలా చెబుతారు.

"లేని గొప్ప చెప్పి లేమి పురులు విప్పి
నటన మాడు మనిషి నాకు వలదు
ఉన్నదేదో తనకు మిన్నయే అనుకొన్న
పేద అయిన నాకు ప్రియ హితుండు"[50]

సమాజంలో కొందరు అడగక పోయినా తాము గొప్పవాళ్ళమని, జాతిని ఉద్ధరించామని, సాటివాళ్ళ సౌఖ్యానికి సాయపడినామని, మా వంశీయులంతా త్యాగధనులు అని చెబుతుంటారు. గొప్ప చరిత్ర కలవాళ్ళమనీ, మమ్ములను మించిన వాళ్ళులేరని గొంతెత్తి విన్పిస్తుంటారు. ఈ తత్వాన్ని తిరుమల తీవ్రంగా నిరసించారు. నీతి, నిజాయితీ, నియతీ ఉన్న మనిషి ఎప్పుడూ తనను ఉన్నతునిగా భావించడు. ఎక్కడా ఎలుగెత్తి చాటుకోడు. వినయంతో ఉంటాడు. ప్రతి కదలికలోను విధేయతను చూపిస్తాడు. అందరి ఆత్మీయతను అందుకుంటాడు. మానవోత్తముడిగా చరిత్ర పుటలలో శాశ్వతుడవుతాడు. తన గొప్పలకు చాటుకునే వ్యక్తి 'నటన మాడు మనిషి'గా తిరుమల భావిస్తారు. అలాంటి మనిషి తనకు యిష్టం లేదంటారు. అట్లాగే కొందరు తమకు ఉన్నదానిలోనే తృప్తిని, ఆనందాన్ని అనుభవిస్తుంటారు. పరాయి సొత్తుకు చేతులు చాచరు. 'ఉన్నదేదో తనకు మిన్న' అన్న కవివాక్కుకు అనుగుణంగా ఉంటారు. ఇలాంటి సజ్జనుల వలన సమాజం ప్రశాంతంగా ఉంటుంది. నిలువెత్తునా పరవశించి అలాంటి వాళ్ళు. ఆర్థికంగా బలహీనులైనా మానసికంగా మహర్షుల వంటివాళ్ళు. మహర్షుల రూపాలు కానీ, వాళ్ళ ఆశ్రమ ప్రాంతాలు కానీ పేదతనాన్ని ప్రదర్శిస్తాయే తప్ప - వాళ్ళ హృదయాలు మాత్రం ధరాగోళాన్ని క్షణంలో ఓడించే నైతిక, ఆధ్యాత్మిక శక్తులను కలిగి ఉంటాయి. ఇలాంటి మహర్షుల ముందు అన్ని లోకాలు మోకరిస్తాయి. పేద అయినా వాడు మంచి మనస్సును కలిగి ఉంటే చాలు. అతని కన్నా ధనికుడెవ్వడూ లేడు. కాలుష్యం అంటని హిమ స్వచ్ఛంలాంటి హృదయ మున్న మనిషిని ఇష్టపడతారు తిరుమల.

దాదాపు నాలుగు దశాబ్దాల నుంచి తిరుమల సాగిస్తున్న కృషీవలత్వం ఆయనను కవి పోతనగా నిలబెడుతూ ఉందని చెప్పవచ్చు

గుణసంపత్తియు, దానికిందగిన వాక్ఛోభా మహత్వంబు, పా
మనమౌశీలము, సత్కవిత్వ రచనా ప్రావీణ్య మార్యాంఘ్రి సే

వన తాత్పర్యము కల్గి సర్వజన సంభావ్యుండవై యౌవనం
బుననే కీర్తి వహించి మింతునయ సంపూర్ణా! వచో మోహనా॥ [51]

అని తిరుమల గురించి ఆచార్య దావాకర్ల వెంకటావధాని రాసిన పద్యంలో ఆయనలో పరిమళిస్తున్న కవిత్వానికి మోహనత్వం అబ్బిన తీరు శ్లాఘించబడింది. ఈ సమ్మోహనతత్వం తిరుమల పవిత్ర శీలం వలన, వినయ దృక్పథం వలన అబ్బిందని దివాకర్ల అనడం ఔచిత్యంగా ఉంది. తిరుమల ఆధునికులలో ప్రముఖులైన చాలా మంది మానసాలను పరవశింపజేశారు. ఆయన మనస్సును పట్టేసిన కరుణశ్రీ

మంచి మనసువాడు మర్యాద కలవాడు
అందమైన కవితలల్లువాడు
ఎదుటి వారి సిరికి ఈర్ష్య చెందనివాడు
వికృతి సుంత లేని 'సుకృతి' యితడు[52]

మంచి మనసు, దానికి మించిన మర్యాద - ఇలాంటి విశేష గుణాలు ఆయనలో ఉన్న కవితాత్మను మరింతగా వికసింపజేశాయి. అందుకే కరుణశ్రీ 'అందమైన కవితలల్లువాడు' అని తిరుమలను వర్ణించారు. అంతేకాదు 'సుకృతి' అని కీర్తించారు.

నాగభైరవ కోటేశ్వరరావు తిరుమల వ్యక్తిత్వంలో దాగి ఉన్న మహత్యాన్ని ఇట్లా వర్ణించారు.

అచ్చపు కవివి - స్వచ్ఛపు కవితా రవివి నీవు
అల్లిబిల్లి కబుర్లు పోచుకోట జీవివి కావు
మాతృదేశం పట్ల మమకారం ఉన్న వాడివి
మాతృభాషకు మంత్రపుష్పం ఇచ్చిన వాడివి
రైతు పచ్చదనానికి ప్రతీక
కైత తిరుమలత్వానికి పతాక
శిశిరాల శిరస్సులు వంచి
వసంతాలు దూసుక వస్తున్నాయి
నీ కవితా వనంలో
వసంతాలు కొల్లలుగా పాపిస్తున్నాయి
అసలైన కవిత్వాన్ని పిలిచే మనసు అరుదు
అరుదైన అలాంటి కవుల్లో నీదీ బిరుదు[53]

రైతు ఆరుగాలం చెమటలు చిందించి బీళ్ళను పచ్చదనం నిండిన పంట పొలాలుగా మార్చి ప్రజావళికి అన్నం పెట్టి కళకళలాడిస్తాడు. అలాగే తిరుమల శిశిర శిరస్సుల మీద కవిత్వపు వసంతాలను నవ్విస్తారు. ఆయన అసలైన కవిత్వానికి బిరుదులాంటివారు.



తిరుమల హృదయంలో ఆలోచన, ఆవేశం కలగలసిపోయి సౌజన్యస్ఫూర్తిని ప్రసరిస్తాయని నాగభైరవ అభిప్రాయపడ్డారు.

ప్రతిభ ఉన్న కవులలో అహంకారం తొంగిచూస్తుంది. తానే సర్వ సాహిత్యానికి అధినేతను అని తాను ఒక వలయాన్ని సృష్టించుకుంటాడు. శిఖరం మీదే కూర్చుంటాడు. తిరుమల అలా కాదు. తనదంటూ ఒక ఉన్నతమైన పీఠం మీద ఉన్నా అంత మీదుగా, అందనంత కిందుగా ఉన్న వాళ్ళను కూడా చేదుకొని గుండెకు హత్తుకుంటారు. "నేనో మెట్టు పైకి ఎక్కితే నా క్రింది వారిని ఓ మెట్టు పైకి లాగటానికే నా ప్రయత్నం"[54] అన్న వారి మాటలు ఇందుకు నిదర్శనం. డా॥ ద్వా.నా. శాస్త్రి ఈ తత్వాన్ని ఇట్లా విశ్లేషించారు. "తిరుమల గళమూ అంతే - చిన్నవారితో మాట్లాడినా, పెద్ద వారితో మాట్లాడినా ఆ ఆప్యాయతా, ఆ అభిమానమూ, ఆ సహకారమూ, ఆ ప్రోత్సాహమూ సమానంగా అందివ్వటం అతని గళంలోని ప్రత్యేకత"[55] అనేది సత్యసన్నిహితం. తిరుమల నిరంతర అధ్యయన శీలం ఉన్న కవి, రచయిత. తెలుగు, సంస్కృతం, ఆంగ్లం ఈ మూడు భాషల్లోను విశిష్టమైన పరిజ్ఞానం ఉన్న కవి. ఆయనను కదిలిస్తే చాలు వేల గ్రంథాలు ఓ దాని తర్వాత మరోటి పుటల హృదయాలను తెరిచి జ్ఞానభిక్ష పెట్టినట్టుగా ఆచార్యుల బోధన సాగుతుంది. ఆయన గళం చిలికే ప్రతి మాట హృదయం లోతుల్లోంచి ఉబికి వస్తుంటుంది. కాబట్టి, శ్రోతలు ఆ జ్ఞాన వాహినిలో నిలువెల్లా తడుస్తూ పులకించిపోతుంటారు. వినూత్న శోభలను విరజిమ్మే జ్యోతిర్మండలంలో విహరిస్తున్నట్టూ, జుంటితేనెను కొసరి ఆస్వాదిస్తున్నట్టూ, ఆనందిస్తున్నట్టూ పొంగిపోతారు. డా॥ ద్వా.నా. శాస్త్రి అన్న ఈ కింది మాటలు అక్షర సత్యాలు.

అతనితో మాట్లాడటమే ఎడ్యుకేషన్
అతని కలం యువకులకి మార్గదర్శకం
అతని గళం ఆదరాభిమానాల్ని ఒలకబోస్తుంది[56]

తిరుమల తన ఆత్మతో, కవితాత్మతో సాహితీ పరులతో పాటు గాయకులను కూడా అమితంగా ఆకట్టుకున్నారు. ప్రముఖ సినీ గాయకులు, గేయ రచయిత పి.బి. శ్రీనివాస్ మనో నేత్రాలకు తిరుమల కనిపించిన తీరు చూడండి.

ఆ తిరుమల పర్వతమగు
నీ తిరుమల సుకవి హిమ నగేంద్రుండందున్
నీతిని సూటిగ, దెలిపెడ
వో తిరుమల త్వత్సన్నిభులుర్విన్ గలరే?[57]

తిరుమల మృదుభాషి. ఎవరి మనస్సును గాయపరచరు. అంతకు మించి సంస్కరణాభిలాషి. నిజాయితీ, సహృదయత ఆయనకు పెట్టని ఆభరణాలు. దాపరికం లేకుండా ఏ ఇజం గురించి అయినా యదార్థంగా మాట్లాడటం ఆయన నైజం. తిరుమల సభలో ఉన్నారంటే ఆ సభకే శోభాయమానం. ఇదే విషయాన్ని దాశరథి మాటల్లో చెప్పాలంటే.

కవితా గోష్ఠికి తిరుమల
కవిలేనిదే వన్నె లేదు, కటినపు ప్రౌఢుల్
చివురింపజేయు కవితా
నవ వాసంతం బదంతనంత ప్రతిభన్[58]

తిరుమల సమాజం చేత గౌరవింపబడిన వ్యక్తి. కవి. నిరంతర సాధకులు. సతత హరితాన్ని కోరుకుంటున్న మనస్వి. యశస్వి. అరుద్ర ఈ కవితా పంక్తులు తిరుమలకు అక్షరాలా వర్తిస్తాయి.

తరానికో వందకవులు
తయారవుతారెప్పుడూ
వందలోను మందలోనూ
మిగల గలిగే దొక్కడూ[59]

కవిత్వాన్ని కవిత్వంగా గౌరవిస్తూ రచనలు చేస్తున్న కవులలో తిరుమలది విశిష్ట స్థానం.

"వ్యక్తిగతంగా తిరుమల ఉదార స్వభావులు. విశాల హృదయం కలవారు. శక్తిమేరకు తోటి వారికి సహాయ పడాలన్నది వారి సంకల్పం. ఎందరో యువకవుల్ని ప్రోత్సహిస్తూ వారిలో దాగి ఉన్న కళను వెలికి తీసుక వచ్చారు. సాహితీ జగత్తులో వారికో స్థానాన్ని కల్పించారు. ఈ కృషి నిర్విరామంగా సాగుతుంది. పండితుల్ని పారితోషకాలిచ్చి, శాలువలు కప్పి సత్కరించారు. యువకవులు గాని, యువ రచయితలు గానీ ఆయన్నీ కలిసినప్పుడు వారిని ఆప్యాయతతో పలకరించి, ఆదరించి, మంచి సలహాల నిచ్చి ఉత్తేజ పరుస్తారు. అంతేకాని నీ బొంద నీకేం తెలుసు? అని పాతాళానికి పంపించరు. ఆయన దోహదంతో మొగ్గలు చక్కగా వికసిస్తాయి. అలాంటి గుణం వారి హృదయంలో ఉంది. మనస్సులో ఉంది. మాటల్లో ఉంది. చేతలో ఉంది"[60] అన్న వేమూరి వారి మాటలు తిరుమల సంపూర్ణ వ్యక్తిత్వానికి అద్దం పడుతున్నాయి.

తిరుమల నిరంతర కవి అని ముందే చెప్పాను. ఆయన తెలుగులో వచ్చిన చాలా ప్రక్రియలను సమాదరించి రస బంధురమైన కావ్యాలు రాసి ఒక మహోన్నత వాఙ్మయ శిఖరంలా భాసిస్తున్నారు. ఇది జగమెరిగన సత్యమే. అట్లా రవ్వలు వెదజల్లుతున్న సాహితీ మూర్తి చెప్పిన ఈ కింద పద్యం ఆయన ధిషణాశక్తిని ఎత్తి చూపుతుంది.

గద్యము గేయము ఛందః
పద్యము వచన కవితలను పటుతర శక్తిన్
హృద్యముగా రచియించిన
ఆద్యకవి శ్రేణి నిల్పితాధుని కాంధ్రిన్[61]



తిరుమల గద్యంలో హృద్యమైన రచనలు వెలయించారు. గేయంలో రసవన్మధురమైన కవితలు గుప్పించారు. పద్య ప్రక్రియలో తీయని కావ్యాలను పలికించారు. వచన పద్య ప్రక్రియలో కాలాన్ని శాసించే చైతన్య కవితలను సృష్టించారు. అంతేకాదు, విమర్శనంలో సాహిత్యపు మూల్యాలను వెల్లువెత్తించారు. వక్తవ్యంలో ఆకర్షణీయమైన బాణిని సాధించారు. ఆయన కావ్యావరాశి సాగర మంత విశాలమైంది. అలాంటి అపూర్వమైన కృషితో తిరుమల 'ఆద్యకవిశ్రేణిని' నిలిచారు.

ధన్యుడనైతిని కవి మూ
ర్ధన్యుడ నైతిని నిరంతరాయ శ్రమలన్
మాన్యుడనైతిని నాపై
విన్యస్తంబయ్యె కీర్తి విబుధాదరమున్[62]

తిరుమల నిరంతర పరిశ్రమతో కవులలో శ్రేష్ఠుడయ్యారు. క్రాంతదర్శి అయ్యారు. మార్గదర్శి అయ్యారు. ఆయన రచనల సారాన్ని ఆస్వాదించి విబుధలోకం ప్రశంసించింది. చెరగని కీర్తిని ఆపాదించింది. అనురాగాన్ని వర్షించింది. అలాంటి విబుధాళి పొగడ్తలతో నిలువెల్లా తడిసిపోయిన తిరుమల జీవితం ధన్యమైంది.

# పాద సూచికలు

1. 'కవి దర్శనం' చివరి అట్టపైన సినారె 'పరిచయం'
2. సినీ వాలి - పుట 10
3. రాజమండ్రి చరిత్ర - పుట 41
4. కొలమానమ్ - పుట 117
5. ఆచార్య తిరుమలతో ముఖాముఖి
6. వచన కవితా కాదంబిని - 'ముందుమాట'లో
7. ఆచార్య తిరుమలతో ముఖాముఖి
8. వచన కవితా కాదంబిని - 'ముందుమాట'లో
9. పితృస్మరణ - పుట 29
10. గేయ నందిని 'పాట వెనుక దాగిన మాట' -పుట vi
11. 'వాత్సల్యవల్లిక' ముందుమాట 'మాతృదేవోభవ'లో (అముద్రితం)
12. హరవిలాసం - పుట 2-73
13. మణిపుష్పకం - పుట 21
14. మణిపుష్పకం - పుట 1
15. మణిపుష్పకం - పుట 66
16. తిరుమలతో ముఖాముఖి
17. మణిపుష్పకం - పుట 55
18. అమృత నేత్రాలు - పుటలు 3,4
19. మణిపుష్పకం - పుట 77
20. అమృత నేత్రాలు - పుట 14
21. అమృత నేత్రాలు - పుటలు 14,15
22. చక్రధ్వజం - పుట 11
23. వచన కవితా కాదంబిని - పుట 206
24. రాగానందం - పుట 10
25. ఎక్స్‌రే - పుట 20
26. 'పద్యప్రభాస' పీఠిక - పుట 14
27. మాట్లాడే మల్లెలు - పుట 52
28. మనిషీ చిలక - పుట 65
29. డా॥ ఆచార్య తిరుమల సాహితీ రజతోత్సవం (సంచిక) - పుట 6
30. వచన కవితా కాదంబిని - 'వెండిపూత'లో
31. వచన కవితా కాదంబిని - ముందుమాట
32. చక్రధ్వజం - పుట 10
33. పంచవటి - పుట 6
34. చక్రధ్వజం - పుట 10
35. చక్రధ్వజం - పుట 10
36. దివ్వెల మువ్వలు - పుట 9
37. చక్రధ్వజం - పుట 10
38. గేయనందిని - పుట 218
39. అమృత నేత్రాలు - పుట 63
40. అమృత నేత్రాలు - పుట 71
41. వచన కవితా కాదంబిని - పుట 317
42. MY LOVE OF LIVE - పుట 6
43. విద్యుల్లత - పుట 115
44. చక్రధ్వజం - పుటలు 39, 40
45. చక్రధ్వజం - పుట 40
46. చక్రధ్వజం - పుట 40
47. మణిపుష్పకం - పుట 2
48. పద్యప్రభాస - పుట 236
49. వచన కవితా కాదంబిని 214
50. చక్రధ్వజం - పుట 33
51. డా॥ ఆచార్య తిరుమల సాహితీ రజతోత్సవం (సంచిక) - పుట 6
52. డా॥ ఆచార్య తిరుమల సాహితీ రజతోత్సవం (సంచిక) - పుట 6
53. డా॥ ఆచార్య తిరుమల సాహితీ రజతోత్సవం (సంచిక) - పుట 6
54. వచన కవితా కాదంబిని - "వెండిపూత"
55. డా॥ ఆచార్య తిరుమల సాహితీ రజతోత్సవం (సంచిక) - పుట 6
56. డా॥ ఆచార్య తిరుమల సాహితీ రజతోత్సవం (సంచిక) - పుట 6
57. డా॥ ఆచార్య తిరుమల సాహితీ రజతోత్సవం (సంచిక) - పుట 6
58. చీకటి మెరుపులు చివరి అట్టపైన
59. పైలా పచ్చీసు - పుట 50
60. డా॥ ఆచార్య తిరుమల సాహితీ రజతోత్సవం (సంచిక) - పుట 6
61. మణిపుష్పకం - పుట 2
62. మణిపుష్పకం - పుట 2



అధ్యాయం-2

# తిరుమల రచనలు - పరిచయం

## 1. పద్యకావ్యాలు

### 1. యమునాతటి

తిరుమల పద్య కావ్యాలలో 'యమునాతటి' ఒక మధుర కావ్యం. గోపికాకృష్ణుల ప్రణయంలోని మాధుర్యాన్ని తెలిపే కావ్యం ఇది. ఇందులో నూట పదహారు పద్యాలున్నాయి. కావ్యం తొలి పద్యంలో కవి జయదేవుని, క్షేత్రయ్యను, లీలాశుకుని నుతించారు. రెండవ పద్యంలో బమ్మెర పోతన పాదపంకజాలకు ప్రణమిల్లారు. గోపికా కృష్ణుల ప్రేమతత్వాన్ని తిరుమల అనేక రీతుల్లో అభివర్ణించారు. గోపికలు కృష్ణుని కోసం నిరీక్షించడంలో తపించడం, తపించడంలో తన్మయత్వం పొందడం, కృష్ణ ప్రణయాన్ని అభిలషించడం ఈ కావ్యంలో మధురాతి మధురంగా వర్ణించారు. శృంగారం ఇందులోని ప్రధాన రసం. తిరుమల నవయౌవన శైశవం నడిమి వయసున సాహిత్య వ్యసనోద్రేకంలో రచించిన కావ్యం యమునాతటి. "ఇందున్నది శృంగార రసము కాదు. కామరసము ఆ శ్రీకృష్ణ పరమాత్మ మీకు సద్బుద్ధిని ప్రసాదించుగాక"[1] అని మహాకవి విశ్వనాథ సత్యనారాయణచే చురకలంటించు కున్న కావ్యం ఇది.

తిరుమల కావ్యాన్ని ముగిస్తూ -

ఇది అజ్ఞానమొ జ్ఞానమో యెఱుగ; శ్రీ కృష్ణుండునన్ మెచ్చునో
మది కోపించి శపించునో యెఱుగ; కామస్పర్శ నూహించితిన్
విదితానంద మరంద బిందువుల నీ విద్దూర ముల్లాసమై
ఉదయించన్ వలె మానవాళినని; విద్యుత్కేళి నా కావ్యమా![2]

అని చెప్పడం ఎన్నుకున్న ఇతివృత్తానికి చక్కని ముక్తాయింపులా వుంది. 1967లో శ్రీనివాస పబ్లికేషన్స్ ఏలూరు వారిచే ముద్రించబడింది. తన గురుపాదులు చల్లా కృష్ణమూర్తి శాస్త్రికి ఈ కావ్యాన్ని అంకితమిచ్చారు.

### 2. చక్రార పంక్తి

పశ్చిమ గోదావరి జిల్లా పెంటపాడులోని శ్రీనివాస పబ్లికేషన్స్ వారిచే 1971లో ప్రచురితమైన కావ్యం ఇది. తిరుమల తనకు ఆప్తులైన వేమూరి అంబికా చరణ శర్మకి ఈ కావ్యాన్ని అంకితం ఇచ్చారు. పది అధ్యాయాలతో, వస్తు వైవిధ్యంతో, మధురమైన శైలితో చవులూరిస్తున్న కావ్యం చక్రార పంక్తి. శతక స్వరూపంగా కన్పిస్తున్న ఈ రచనలో భక్తికి,

ఆధ్యాత్మిక చింతనకు ప్రాధాన్యత ఇవ్వబడింది. కావ్య నామం గురించి డా॥ దివాకర్ల వేంకటావధాని "మానవుల అదృష్టమెప్పుడు నొక్కమాదిరిగా ఉండదు. అది క్రిందు మీదులగు చుండును. అందుచే సంస్కృత కవులు భాగ్యమును చక్రార పంక్తితో బోల్చుచుందురు."[3] అన్న మాటలు యదార్థంగా ఉన్నాయి. తిరుమల ప్రాచీన సాహిత్యాన్ని బాగా అధ్యయనం చేసిన సాహితీ వేత్త కావడం చేత ఇందులోని పద్యాలన్నీ చక్కని పద ప్రయోగాలతో, చిక్కని భావుకతతో చదువరిని అలరిస్తున్నాయి. ఆధునిక కవితా కేదారం నుంచి పుట్టిన విలువైన కావ్యం చక్రార పంక్తి. "సంస్కృతాంధ్రములలో నిష్ణాతులైన ఆచార్యగారి మధుర కవితాధారకు శతక రూపమైన ఈ కావ్యం మచ్చుతునక"[4] అని ఆచార్య ఎస్.వి. రామారావు వెలుబుచ్చిన అభిప్రాయం ఔచిత్యంగా ఉంది. ప్రౌఢ కావ్యంగా పండితుల ప్రశంసలు అందుకుంది. 'చక్రారపంక్తిరివ గచ్ఛతి భాగ్య పంక్తిః' అని స్వప్నవాసవ దత్తలో భాసుడు చెప్పిన మాటలే ఈ కావ్య రచనకు ప్రేరణ అని తిరుమల చెప్పుకున్నారు.

## 3. హృదయ భారతి

కిన్నెర పబ్లికేషన్స్, హైదరాబాదు 1982లో ప్రచురించిన కావ్యం ఇది. 'ధార్మిక సేవా ధురీణ' బొండా నాగేశ్వరరావుకి అంకితం చేయబడింది. తిరుమల పద్యకావ్యాలలో ఒక విలక్షణమైన కృతి ఇది. కవి ఈ కృతికి 'హృదయ భారతి' అని పేరు పెట్టడానికి గల కారణాలను "బ్రహ్మ విష్ణు మహేశ్వరులనే ముగ్గురూ 'హృ-ద-యం' అనే మూడక్షరాల హృదయానికి హృద్యక్షరులు. వారితో అగ్ని - సోము అనే ఇరువురి కలయిక వల్ల 'అగ్నీ సోమాత్మకం జగత్' అని యీ జగత్ సృష్టి జరిగింది. వైదికంగా ఈ ఐదుగురిని పంచాక్షరులంటారు. అందుకే ఈ కవితా సృష్టికి కూడా 'హృదయ భారతి' అని పేరు పెట్టి 'యా పంచ ధా త్రీణిత్రీణి' అన్న సూత్రం ప్రకారం ఐదు ప్రకరణాల్ని మూడేసి విభాగాలు చేశాను. సమత్వంలోని విషమత్వ నిరూపణకు గాను శబ్దగత శ్లేషని, కాకు స్వరాన్ని పాటించాను. కవితాతత్త్వం తెలిసిన వారికి ఈ విషయాలేం కొత్తవి కావు"[5] అని చెప్పారు. ఈ కావ్యంలో కు-వలయం, కువలయం, అంతర్లయ-1, కు-రంగం, కురంగం, అంతరంగం-2, కు-చేలం, కుచేలం, అంతర్వేది-3, కు-చేరం, కుచేరం, అంతస్సూత్రం-4, కు-శలం, కుశలం, అంతర్వాణి-5 అనే పంచతంత్రులున్నాయి. తిరుమల ఆధ్యాత్మిక స్థితి ఈ కావ్యంలో కన్పిస్తుంది. జటిలమైన వేదాంత విషయాలు ఇందులో సరళంగా సుబోధకంగా ఉన్నాయి. పుస్తకం అట్ట చివర తిరుమలను ప్రశంసిస్తూ డా॥ దాశరథి, డా॥ దివాకర్ల వేంకటావధాని, డా॥ సి. నారాయణరెడ్డి, కరుణశ్రీ, ద్వా.నా. శాస్త్రి, వై. రామ కృష్ణారావు రాసిన పద్యాలున్నాయి.

## 4. శ్రీరామ నామసుధ

గుంటూరు శ్రీరామనామ క్షేత్ర సందర్శనంతో కలిగిన అనుభూతి విశేషానికి గుర్తుగా తిరుమల ఆశువుగా చెప్పిన శతకం ఇది. 1982లో భీమవరంనకు చెందిన 'శ్రీనివాస భారతి' సంస్థ ఈ కావ్యాన్ని ప్రచురించింది. తిరుమల ఈ శతక కావ్యాన్ని తమ జననీ



జనకులైన సుగుణావతి, శ్రీనివాసాచార్యకు అంకితం చేశారు. మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి శ్రీరామనామసుధకు 'సహృదయ భూమిక' సంతరించారు. రామదుగు వేంకటేశ్వర శర్మ 'అభినందనలు', ఎస్.టి.వి. రాజగోపాలాచార్యులు 'నుతిచందనము' అందించారు. వెంపిరాల ప్రభాకర సుబ్రహ్మణ్యం 'కవితా సమర్చన' చేశారు. "గురు పరంపరాగతమైన అట్టి ఆధ్యాత్మిక సంపదకు నిసర్గ మనోహర రమణీయ లలిత కవితా హృదయ రసార్ద్ర భక్తి భావ సంభరిత పద సంపదను, సామాజిక స్పృహను మేళవించి ఆశుగతి దీనిని రచియించి యిచ్చిన శ్రీ ఆచార్య తిరుమల"[6]కు శ్రీనివాస భారతి కృతజ్ఞతాభినందన చందనాలు అందించింది. ఈ శతకంలో అన్నీ కంద పద్యాలే. శ్రీరామ నామాన్ని వివిధ గతుల్లో స్మరించారు. శబ్దాలంకారాలలో అంత్య ప్రాస, అర్థాలంకారాలలో ఉపమ, స్వభావోక్తి అలంకారాలుఈ కృతిలో చాలాఉన్నాయి.

కార్యాన్ని ఆచరింపని మనిషితత్వాన్ని తిరుమల సహజోక్తులతో పరితల గుండెల్లో పదిలంగా దాచిపెట్టారు.

నీతులు చెప్పుట, చేయని
చేతలు చెప్పుట, విమర్శచేయుట, తనివిన్
కోతలు కోయుట తెలిక
చేతల పసలేని మానిసికెపుడు రామా[7]

తిరుమల శబ్ద విన్యాస వైచిత్రికి ఈ కింది పద్యం నిదర్శనం

వెలుగుకు పలుకులు నేర్పుట
పలుకులకు వెలుంగులిగుట పద్ధతికాగా
వెలిగి పలికిన మహాగ్నికి
కులదీపమవైతి వీవు కుశలత రామా[8]

తిరుమలయొక్క అపారమైన పాండిత్యానికి నిలువుటద్దం ఈ శతకం. ఆయన కీర్తి కౌముదులను నేలంతా వెదజల్లింది. కవి కవన మాధుర్యానికి పులకించి మధునాపంతుల వారు "శ్రీ ఆచార్య తిరుమల తన పలుకుబడికి వెలుగురేకలు ప్రసాదించు కుల దీపముతో స్నేహము నెరపుచున్న కవి కౌస్తుభము"[9] అని మెచ్చుకోవడం తిరుమలలో ఉన్న చిక్కని కవితా హృదయానికి చక్కని తార్కాణం.

## 5. పితృస్మరణ

తిరుమల సాహితీమూర్తిగా ఎదగడానికి ఆయన తండ్రి శ్రీనివాసాచార్యులు ప్రధాన కారణం. శ్రీనివాసాచార్యులు సంస్కృతాంధ్రాలలో మంచి విద్వాంసులు. ఆధ్యాత్మిక జ్ఞాన సంపన్నులు. అలాంటి మానవోత్తములు పరమపదించినపుడు కుమారుడుగా ఆచార్య తిరుమల హృదయం ఎంతగానో క్షోభించింది. జ్వలించిన గుండె బరువుతో ధారగా కురిసిన విషాదాశ్రువులు 'పితృస్మరణ'కు ప్రేరకమయ్యాయి. తిరుమల తమ జనకుణ్ని

స్మరించుకున్న కావ్యమైనప్పటికీ మనిషికీ, సమాజానికీ అవసరమైన చాలా విషయాలను కవితాత్మతో చిత్రీకరించారు. వస్తువును అనుసరించి ఛందస్సును మార్చి రచనను రసవాహినిగా నడిపించారు కవి. తండ్రి మరణం తిరుమలను తీవ్రమైన క్షోభకు గురిచేసింది.

గొంతు నొక్కినట్లు, గుండె చిదిమినట్లు
బళ్ళెమునకు గ్రుచ్చి పట్టినట్లు
కన్ను పొడిచినట్లు వెన్ను విరిచినట్లు
తోచె నీ మరణము తూలిపోతి[10]

పాఠకుల కళ్లవెంట నీరు తెప్పించే ఈ కావ్యాన్ని హైదరాబాదులోని 'భావన' 1983లో అచ్చువేసింది. కావ్య ప్రారంభంలో తిరుమల శ్రీనివాసాచార్యుల గురించి రాసిన ప్రశంస సంస్కృతంలో కూర్చబడింది. ఆచార్య తిరుమల నివేదన తరువాత 'విద్వజ్జన స్పందన' పొందుపరచబడింది. దివాకర్ల, దాశరథి, సినారె, దొణప్ప వంటి సుప్రసిద్ధ సాహితీ మూర్తుల అభిప్రాయాలున్నాయి. రంగకవి 'అరని మాట' కావ్యానికి పీఠికగా ఉంది. పి.ఎస్.ఆర్. ఆంజనేయ శాస్త్రి 'మామాట'లో తిరుమల శ్రీనివాసాచార్య వ్యక్తిత్వం, ఆచార్య తిరుమల సాహితీ వ్యక్తిత్వం చెప్పబడినాయి.

## 6. విశ్వ విభూతి

అచార్య తిరుమల ఈ శతకాన్ని రాయడానికి బలమైన ప్రేరణ వుంది. ఆయన కుటుంబ సభ్యులతో కలసి ఉత్తర భారతదేశంలో పుణ్యక్షేత్రాలను సందర్శించినప్పుడు ఆయన మాతృమూర్తి తీవ్రమైన అస్వస్థతకుగురయ్యారు. ఆమె స్థితి తిరుమల హృదయాన్ని బాగా కలవరపెట్టింది. ఆయన మనసు కాశీవిశ్వనాథాంకితమయ్యింది. స్వామి కరుణ వలన సుగుణావతి స్వస్థత పొందింది. అట్లా కన్న తల్లి ప్రాణాలను నిలబెట్టిన కాశీ విశ్వేశ్వరుణ్ని తిరుమల శతకం ద్వారా కృతజ్ఞతలు తెలిపారు. స్వామి ఎదురుగా వ్యాసపీఠం మీద కూర్చొని భక్త జనకోటికి, భక్తుల రూపంలో ఉన్న ఆలయ దేవతా కోటికి ఆశువుగా ఈ శతకం చెప్పారు. నాలుగు రోజుల్లో ఈ శతక పద్యాలు చెప్పారు. 1987 జూన్‌లో ముద్రణ రూపాన్ని పొందింది. 'విశ్వనాథ' మకుటంతో రాయబడిన ఈ శతకంలో శివ పార్వతుల లీలా విలాసాలు, భక్త వాత్సల్యం వంటి అద్భుత విషయాలను కవి చక్కగా చెప్పారు. గంగానది పవిత్రతను కూడా హృదయ ముప్పొంగ గానం చేశారు. ఈ శతకం పఠితల హృదయాలలో భక్తి భావాలను ప్రేరేపించేదిగా ఉంది. శివతత్వాన్ని వివరిస్తూ తిరుమల "తనకు శివుడంటే ఇష్టమని ఏది తప్పుకుంటే శరీరం శవమైపోతుందో అలాంటి ప్రాణ స్వరూపం శివుడనీ, పసువు శరీరం దీనికి పతి శివుడు. శివుని ఆరాధించకుండా విష్ణుతత్వం లేదు. విష్ణువును ఆరాధించకుండా శివతత్త్వంలేదు. ఆరోగ్యానికి, మృత్యుం జయత్వానికి, జ్ఞాన చైతన్యానికి శివుని ఆరాధన తప్పదని"[11] ఆయన తన విశ్వవిభూతి రచనకు ప్రేరణను చెప్పారు. ఆచార్యుల వారు ఈ కృతిని పావన గంగోదకలతో కాశీవిశ్వనాథునికి సజల నయనాలతో అంకితమొనర్చారు.



## 7. చక్ర ధ్వజం

శుభాంగి సాంస్కృతిక సమితి, హైదరాబాదు పక్షాన 1989 డిసెంబర్‌లో ప్రచురింప బడిన పద్యకావ్యం చక్రధ్వజం. తిరుమల ఈ కావ్యాన్ని 'సహజకవి' మల్లెమాలకు అంకిత మిచ్చారు. ఇందులోని ఖండికలన్నీ ఏకబిగిన రాసినవు కావు. ఆయా సందర్భాల్లో రాసినవి. వీటిలోని చాలా ఖండికలు వివిధ పత్రికల్లో అచ్చయినవే. చక్రధ్వజం అంటేభారత జాతీయ పతాకం అనే అర్థాన్ని విస్తృతమైన రూపంలో వాడుకున్నారు. ఆధ్యాత్మిక పరంగా అన్వయిస్తే - మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, విశుద్ధ అనాహత, ఆజ్ఞా చక్రాల వరుస క్రమమూ. ఆ చక్ర స్థానాలలోని పద్మాలూ గుర్తొస్తాయి. ఆ పద్మాలలోని దళాలే వివిధ శీర్షికల్లోని పద్యాలు. భక్తి, దేశభక్తి, మానవతావాదం, సంస్కృతీ సంప్రదాయాల ఔన్నత్యం, సంస్కరణాభిలాషిత్వం అనే గుణాలు మెండుగా ఈ పద్య కావ్యంలో ఉన్నాయి. సంస్కృత సమాసాల్ని గుప్పిస్తూ, తెలుగు పలుకుల జిగిని వెలయిస్తూ, ఉభయ భాషా సౌందర్యాలను ఇంపుగా పొందుపరచి, భావ ప్రకటనంలో సారళ్యాన్నీ, కాఠిన్యాన్నీ సమపాళ్లలో సమకూర్చి, భాషా వధూటిని విరిమల్లెల పాన్పు మీద శయనింపజేసి ద్రాక్షాపాకంతో పాటు కదళీపాకాన్ని కూడా మధురంగా అందించారు. చక్రధ్వజంలో వెలయించిన కొన్ని పద్యాలు భగవత్ తత్వాన్ని ఆవిష్కరించేట్లు ఉన్నాయి. కావ్యం అట్ట చివర ప్రముఖ సినీ గాయకుడు డా॥ పి.బి. శ్రీనివాస్ తిరుమల సాహితీ విరాట్ రూపాన్ని దర్శించి రాసిన పద్యం ఉంది.

## 8. యుగగీత

తిరుమల లేఖిని నుంచి వెలువడిన పద్యకావ్యం యుగగీత. సాధన స్రవంతి, హైదరాబాదు పక్షాన 1992లో తిరుమల సాహితీ రజతోత్సవ ప్రచురణలో భాగంగా అచ్చయ్యింది. తేటగీతి ఛందంలో రాయబడిన ఈ యుగగీత ముక్తక ప్రక్రియ నలభై రెండు పుటల్లో తిరుమల లోకరీతిని చక్కగా ప్రస్తావించారు. ఈ కావ్యానికి 'యుగరీతి' రాస్తూ ప్రముఖ సాహితీవేత్త డా॥ ఎన్. గోపి "ఆచార్య తిరుమల ప్రముఖ విద్వత్కవి, ఉత్తమ సాహిత్యాధ్యాపకుడు. పద్య రచన, వచన సృజనల్లో సవ్యసాచి"[12] అని అన్నారు. సుధామ తన అభిప్రాయాన్ని 'సుధామయోక్తి'లో తెలుపుతూ "కొలతలో చిన్నవి కావచ్చు కానీ కొరతలేని భావ శబ్దలతలో మిన్నవైన వెన్నో ఉన్నాయి. కొన్ని భావాలు కొందరికి మింగుడు పడక పోవచ్చు. అందుచేత ఇందులో చు'ఱుక్కుల'తో బాటు చురలకు, చమక్కులు కూడా ఉన్నాయి. అల్పాక్షరముల అనల్ప భావాలతో 'వెలుగుల గరికలు' వలె ఇవి ఒక పచ్చిక బయట పరచినట్లే పచ్చగా, విశాలంగా విశదమవుతాయి"[13] అన్నారు. ఈ కావ్యాన్ని తన సంస్థ తరపున ప్రచురించిన నరసింహాచార్య 'సాధనోక్తి'లో "ఇది డా॥ తిరుమల 'యుగగీత' నాటి 'భగవద్గీత' సర్వశాస్త్రమయి. అయితే నేటి ఈ 'యుగగీత' సర్వ జీవిత విషయ విశేషమయి. ఈ 'యుగగీతం'లో జీవితం నుండి పుట్టి జీవితానికి పనికివచ్చే విలువైన వజ్రాల్లాంటి సత్యసూక్తులెన్నో ఉన్నాయి."[14] అని ప్రశంసలు కురిపించారు. ఎందరినో స్పందింపజేసిన ఈ యుగగీత సుప్రసిద్ధ కవయిత్రి ఆచార్య నాయని కృష్ణకుమారికి అంకితం

చేయబడింది. కృష్ణకుమారి 'నుడిపూవు' అని భావ గర్భితమైన స్వీకృతి రాశారు. సూక్తిసుధా మాధుర్యంతో పదుగురుని అలరిస్తున్న గ్రంథం ఇది. తిరుమల అనుభూతి చంద్రిక ఈ యుగగీత.

## 9. తిరుమలోక్తి

1997 నవంబర్‌లో రత్నాశ్రీ టెక్నోప్రింట్స్ పక్షాన ముద్రింపబడిన శతకమిది. తిరుమల తిరుమలేశుని దర్శించడానికి వెళ్ళినప్పుడు అపారమైన జనవాహిని మధ్య ఇరుక్కుపోయి బాధపడుతున్నప్పుడు ఆయన మనస్సు నుంచి 'పరమ సత్య సూక్తి తిరుమలోక్తి' అనే మకుటంతో ఒక పద్యం వెలువడింది. ఈ మకుటం కవికి బాగా నచ్చింది. ఒక శతకం పూర్తయ్యింది. స్వామి సన్నిధిలో గుండెలో స్ఫురించిన భావానికి మనిషిని మనీషిగా నిలబెట్టగలిగే భావాలు, ఝుమ్మని చిమ్ముకొని వచ్చే కవితా ధార ఈ శతకంలో దర్శనమిస్తాయి. ఈ శతకానికి ముందట 'శ్రీకృష్ణదండకం' ముద్రింపబడింది. కష్టాలలో కనిపెంచిన తల్లిలా కనిపించే తమ పెద్దక్కయ్య శ్రీమతి వెంకట రాజ్యలక్ష్మికి ఈ శతకం అంకితం చెయబడింది.

జ్ఞానహీనమైన సన్యాస మదియేమి?
తత్త్వహీనమైన ధర్మమేమి?
శీలహీనమైన జీవిత మధువేమి?
పరమ సత్యసూక్తి తిరుమలోక్తి[15]

ఇలా పాఠకులు సదా మననం చేసుకునే రసరేఖలు ఎన్నో ఈ శతకంలో ఉన్నాయి.

## 10. మణిపుష్పకం

ఆచార్య తిరుమల భూత భవిష్యద్వర్తమానాలను దర్శించి సమాజ స్వరూపాన్ని అనుశీలించి రవ్వలు రాల్చుతున్న మహాకవి. ఆయన రాసిన పద్య కావ్యాలలో 'మణిపుష్పకం' భావ సౌందర్యంతో, అర్థగాంభీర్యంతో, వర్ణనలతో చాలా విశిష్టంగా ఉంది. అకృతి పబ్లికేషన్స్, హైదరాబాదు వారు సెప్టెంబర్ 1999లో ప్రచురించారు. ఈ కవితా సంపుటికి 'మణిపుష్పకం' అనే పేరు పెట్టడానికి హేతువులను కవి ఇట్లా తెలిపారు. ఒక విమానం పేరు కాదు, కడగొట్టు పాండవుడైన సహదేవుని శంఖంపేరు. పేరు ఉన్నదంటే దానికో చరిత్ర ఉంటుంది.'మణిపుష్పకం' మనో విజ్ఞాన విస్తరణాలకు ప్రతీక. సహదేవత్వాన్ని పొందిన వారు తప్పదాన్ని పూరించలేరు. ధార్మికుని అనంత విజయ సాధనకు ఇదొక రహస్య విద్యోపాసన. దీన్ని జీవితంలో దర్శించి, ప్రదర్శించవలసి ఉంది. ఆప్రేరణతోనే ఒకానొక సందర్భంలో 'మణిపుష్పకం' పేరుతో ఒక పద్య కవిత రాశాను. దాన్ని చూచి, మెచ్చుకుని మిత్రులు సుధామ ఆకాశవాణి ద్వారా ప్రచారానికి అవకాశం కల్పించారు. ఆ మణిపుష్పకమే ఈ సంపుటి శీర్షిక అయ్యింది."[16]

తిరుమల తెలిపినట్టు పేరుకు ఒక చరిత్ర ఉంటుంది. మణిపుష్పకంపేరులో ఒదిగి ఉన్న ఔచిత్యాన్ని వివరించారు. పాండవులలో కడగొట్టువాని శంఖం మణిపుష్పకం అన్నారు.



ఇదంతా విస్తారమైన మానవేతిహాసాన్ని తెలిపేది. పాండవులలో కడగొట్టువాడు మహామేధావి. రాజ కుమారుడైనప్పటికీ ఆర్ద్రమైన సౌశీల్యంతో నడవడికను రేపటి తరాలకు పాదేయంగా అందించిన బుద్ధిశాలి. పంచ పాండవులలో కులదీపకుని ధర్మవీరం ఎలాంటిదో చిన్నవాడైన సహదేవుని ఆదర్శవంతమైన జీవన దర్శనం అలాంటిది. మనిషి చైతన్యానికీ, మనోవికాసానికీ సహదేవుడు ప్రకటించిన అభిప్రాయాలు విజ్ఞాన రసరేఖలుగా ఉన్నాయని మహాభారతం తెలుపుతుంది. అలాంటి మానవోత్తముడూ, ఆత్మతత్త్వ విశారదుడూ అయిన సహదేవుని శంఖం మణిపుష్పకం. మణిపుష్పకం అనే పదబంధంలోనే ఎంతో ఔచిత్యం ఉంది. అలాంటి ఔచిత్యంతో జిగేలు మంటున్నది ఈ కవితా సంపుటి. జాతీయ దృక్పథం, సంస్కరణాభిలాష, మానవతావాదం, అభ్యుదయ వాదం, ఆధ్యాత్మిక భావం వంటి విలువైన లక్షణాలు ఈ కవితా సంపుటిలో ఉన్నాయి. వీటి తరువాత చాటువులు శీర్షికతో మరి కొన్ని పద్యాలు సంకలింపబడినాయి. ఈ చాటువులలో తిరుమల లోకజ్ఞత, విజ్ఞత బహుముఖాలుగా రేకులు విచ్చుకొని శోభిస్తున్నాయి. తిరుమల ఈ సంపుటిలో 27 కవితలద్దారు. 27 కవితలు నక్షత్రమాలికా ప్రక్రియను తెలుపుతాయి. ఇది శుభకరమైన దృక్పథం. ఇటీవల కాలంలో వెలువడిన పద్య కవితా సంపుటాల్లో ఈ 'మణిపుష్పకం' రసమయి కవితా తరంగిణి లాంటిది.

విదితానంద మరందము
హృదయంబులఁ బరిమళింప సృష్టించితి ని
య్యది; "మణిపుష్పక" నాదం
బిది బహిరంతః ప్రభావ వృత్తము దీనన్.[17]

## 11. వాత్సల్య వల్లిక (అముద్రితం)

మాతృమూర్తి ప్రేమానురాగాలు రంగరించి, స్తన్యమిచ్చి బిడ్డల్ని పెంచి చేసే వాళ్ళ కోసం ఏ త్యాగమైనా చెయ్యడానికి సిద్ధంగా ఉంటుంది. ఆమె ఒడిలో, లాలనలో, పాలనలో బిడ్డలు మైమరచి పోతారు. ఆమె సన్నిధిలో అమర సుఖాలు అనుభవిస్తారు. అందుకే తల్లిని గౌరవిస్తాం. తిరుమల తన మాతృదేవత మీద ఉన్న మమకారాన్నీ, భక్తినీ, ఆ తల్లి కలగజేసిన ప్రేరణను తలపోస్తూ రాసిన కావ్యం ఇది. ఇందులో యాభై రెండు పద్యాలున్నాయి. తిరుమల ఈ కావ్యాన్ని ఏలూరు సి.ఆర్.ఆర్. కళాశాలలో బి.ఏ. ద్వితీయ సంవత్సరం చదువుతుండగా రాశారు. "ఇది స్మృతి కావ్యం కాదు. ఆమె సవరించిన శ్రుతి కావ్యం. అందరి తల్లుల్లోనూ నేను నా తల్లిని చూస్తాను. నా తల్లిలో మీరు మీ తల్లిని దర్శించండి. ఆ వాత్సల్యవల్లికా సుమగంధాన్ని ఆశ్వాసించండ"ని[18] ఆచార్యుల వారు 'మాతృదేవోభవ'లో రాసుకున్నారు. కావ్యం అంతా అమ్మ హృదయంలా తియ్యగా ఉంది. ఇది అముద్రిత కావ్యం.

# 2. గేయ కావ్యాలు

## 1. స్వర వల్లరి

1975లో ప్రచురింపబడిన ఈ సంపుటి గేయ కవితా ప్రక్రియకు సంబంధించింది. తిరుమల నిండు యౌవనంలో రాసిన ఈ గేయాలలో భక్తి రస ప్రధానమైన రచనలే ఎక్కువగా ఉన్నాయి. సంగీత మర్మాలు తెలిసిన తిరుమల ఈ గేయాలను స్వరయుక్తంగా రాశారు. తెలుగు నాట లలితగేయాలుగా బాగా ప్రచారంలో ఉన్న 'వాణీ! నిగమాగమ రూపిణీ!' 'దయా జలధీ! దాశరథీ!', 'రావే నా మోహినీ', 'మబ్బులలో ఎగిరి పోవు కొంటె చూపు గోరింకా' అనే గేయాలు ఈ సంపుటిలో ఉన్నాయి. గాంధీజీని అహింసా మూర్తిగా భావించి ఆ మహాపురుషుని గురించి రాసిన 'బాపూజీ' గేయం ఆకర్షణీయంగా ఉంది. ఇందులో భక్తి, సమసమాజం, నివేదన, సందేశం, ప్రకృతి వంటి అంశాలు ఉన్నప్పటికీ అన్ని గేయాలలో తరగెత్తేది ఆర్ద్రమైన తిరుమల కవితా హృదయం. స్వరవల్లరిలో ఉన్న నలభై గేయాలు ఆకాశవాణి, దూరదర్శన్‌ల ద్వారా వినిపిస్తునే ఉంటాయి. అభివ్యక్తి సహజత్వాన్ని కలిగి ఉండడం వలన ప్రతి గేయం హృదయాన్ని స్పందింపజేస్తుంది. హైదరాబాదులోని 'స్వర తరంగిణి' ప్రచురించిన ఈ సంపుటికి ప్రముఖ సంగీత దర్శకులు 'సంగీత సామ్రాట్' సాలూరి రాజేశ్వర రావు 'తొలి పలుకులు' వినిపించారు. ప్రముఖ సాహితీవేత్త, న్యాయమూర్తి కొకా రాఘవరావుకి అంకితం చేయబడింది.

## 2. పల్లవి

1980లో 'కిన్నెర' పక్షాన ప్రచురింపబడిన ఈ లలిత గీత సంపుటిలో యాభై గేయాలున్నాయి. వీటిలో సామాజికమైన గేయాలే అధికంగా ఉన్నాయి. చాలా గేయాలలో కవిత్వపు జిగితో పాటు కవి సంగీత ప్రావీణ్యం కన్పిస్తుంది. వీటిలో 'ఏ పువ్వుకైన ఒకేసారి వికాసం', 'చదువు చదివించు', 'ఓహో! జగమే రమ్మందిలే', 'నీలో వున్నదేదో', 'అదే నేను కోరుకున్న నవ్య వసంతం', 'నా ముందు నీ వుంటే', 'నవ్వింది నాలో బృందావనం', 'ఈ ఉదయరాగం', వంటి శీర్షికలతో ఉన్న గేయాలు తిరుమలని 'శబ్ద శిల్పి' అనిపిస్తాయి. సంగీతంలోని రహస్యాన్ని అందుకున్న ఈ కవి రచన 'పల్లవి' గేయ కవితా జగత్తులో సుగంధాలతో పరిమళించిన పల్లవి. 'కిన్నెర' సంస్థ ఈ గేయ సంపుటి ఆవిష్కరణతో ప్రారంభమైంది. ఈ సంపుటి పెండ్యాల నాగేశ్వర రావుకి అంకితం ఇవ్వబడింది.

## 3. గీతా భాషిణి

'శుభాంగి' సాంస్కృతిక సమితి, హైదరాబాదు వారు 1988లో తిరుమల లలిత గీతాలను 'గీతాభాషిణి' పేర ప్రచురించారు. ఈ సంపుటిలో ఇరవైనాలుగు గేయాలున్నాయి. వీటిలో సమాజ శ్రేయస్సును ఆకాంక్షిస్తూ చెప్పబడిన అంశాలే అధికంగా ఉన్నాయి. ఈ గీతాలన్నీ ఆకాశవాణి, దురదర్శన్‌ల ద్వారా ప్రసారమయ్యాయి. ఈ గీతాలలో వస్తు



వైవిధ్యం ఆకర్షణీయంగా, అభివ్యక్తి మార్దవంగా ఉంది. 'గీతాభాషిణి' ప్రముఖ రచయిత, వాస్తుశిల్పి బి.ఎన్. రెడ్డికి అంకితం చేయబడింది. తన కూమార్తె గీత పేరును ఈ గేయ సంపుటికి నామంగా నిలిపినట్టు తిరుమల 'ఎదలయ'లో రాశారు. సంపుటి చివరి అట్టపైన డా॥ రామడుగు వెంకటేశ్వర శర్మ తిరుమల వ్యక్తిత్వాన్ని అభినుతిస్తూ రాసిన సీసపద్యం ఉంది.

## 4. స్వప్న వీణ

ఇందులో ముప్పైరెండు గేయాలున్నాయి. వీటి రూపంలో, భావంలో కొంత భేదం ఉంది. పల్లవి, చరణాల వంటివి ఇందులో లేవు. రూపం పద్యాన్ని తలపిస్తుంది. తిరుమల వస్తువును అనుసరించి ఇందులో భావాన్నీ, రూపాన్నీ నూతన పంథాలో నడిపారు. ఇది కొత్త ప్రయోగంలా కన్పిస్తుంది. ఈ సంపుటిలో దాదాపు అన్ని గేయాలు విప్రలంభ శృంగారం పోషింపబడింది. ఈ శృంగార వర్ణన కూడా ఆత్మీయంగా, అలౌకికానందంగా సాగింది. ఆర్ద్రమైన సంప్రదాయం, రసార్ద్రమైన సంస్కృతీ అన్ని గేయాలలో కన్పిస్తుంది.

చెలికోసం నిరీక్షించడం, నిరీక్షణంలో తపించడం తపన. "నీవు సాక్షాత్కరించు వేళ మకరాంక చాపమౌదు మకరంద దీప మౌదు నేను నాలోనే లీనమౌదు'[19]గా వెలువడడం జరిగింది. చెలి కనిపించే మధుర వేళలో నాయకుడు మన్మధుని ధనుస్సు అవుతాననడం, తేనె దీపం అవుతాననడం, కడకు నాయకుడు తనలోనే తాను లీలమవుతాననడం, హృదయాలను ఊగించేసే భావుకతకు తార్కాణం. 1992లో ప్రచురింపబడిన ఈ సంపుటి ప్రముఖ సాహితీవేత్త 'ఎల్లోరా'కి అంకితం ఇవ్వబడింది.

## 5. రాగానందం

ఇందులో యాభై ఎనిమిది గేయాలున్నాయి. 'కౌస్తుభ కళా కేంద్రం', హైదరాబాదు 1995లో అచ్చువేసింది. సుప్రసిద్ధ సినీ గాయకుడు పి.బి. శ్రీనివాస్‌కి అంకితం చేయబడింది. విలువైన సాహితీ మూల్యాలతో ఉన్న గీతాలు రావటం లేదని ఆవేదన పడుతున్న ఆకాశవాణి సంచాలకులు కొట్రా మల్లికార్జున శర్మ హృదయ భావన తనలో పాటల తోటలను సృష్టించిదని తిరుమల ఈ సంపుటికి రాసుకున్న 'ఆలాపన'లో అన్నారు.

# 3. వచన కావ్యాలు

## 1. మాట్లాడే మల్లెలు

తిరుమలకి బాగా పేరు తెచ్చిన రచనలలో మాట్లాడే మల్లెలు ఒకటి. మాధురీ పబ్లికేషన్, హైదరాబాదు వారు 1979లో ఈ కావ్యాన్ని ప్రచురించారు. ముప్పైనాలుగు కవితా తరంగాలున్న ఈ సంపుటి రావులపాటి కృష్ణారావుకి అంకితం చేయబడింది. ఈ సంపుటిలోని ప్రతి కవితా చిక్కని కవితాత్మను కలిగి పాఠకులను ఆలోచనా లోతుల్లోకి

తీసుకెళ్తుంది. మానవత్వం, జాతీయభావంతో సమ్మిళితమైన అపురూప విషయం ఈ సంపుటిలో పరవళ్ళు తొక్కుతుంది. 'మల్లెలు మాట్లాడాయి కవిత్వం కూడా మాట్లాడితే' అంటూ ముందు మాట రాస్తూ ఎల్లోరా "తెలుగు వచన కవితా నందనంలో హృదయాలను కుదుపగల మాట్లాడే మల్లెల్ని విరబూయించిన ఆచార్య తిరుమల"[20] ని అభినందించారు. సుధామ 'మల్లెలకో మంచు బొట్టు' రాస్తూ " ఈ సంకలన మంతటా పరచుకున్న కవితల మల్లెల వెలుగును, వెన్నెలను వేడిని, స్వచ్ఛతను, సౌకుమార్యాన్ని, సందేశాన్ని సమకూర్చుకొని మిమ్మల్ని కుదుపుతాయి. అరుదైన ఈ మాట్లాడే మల్లెల సౌరభాన్ని దోచుకోండి – గుండెల్లో దాచుకోండ"ని[21] అభిప్రాయపడ్డారు. సంపుటి వెనక అట్ట మీద ప్రఖ్యాత విద్వాంసుడు శనగన నరసింహ స్వామి "దైవదత్తమైన ప్రతిభ, బంధురమైన పాండిత్యం, సమ్యక్సమ్మేళనం పొందిన ప్రౌఢ కవితా మార్గం వీరిది. పద్యం అల్లినా, పాట కట్టినా, ప్రత్యక్షరంలోను పరువం పరిమళిస్తుంది"[22] అని తిరుమల కవితా మూర్తిత్వాన్ని మెచ్చుకున్నారు. 'మల్లెలు ఎన్నెన్ని రూపాలుగానో ఈయన ఆలోచనలో రూపుదిద్దుకున్నాయి. ఒక్క మల్లెను ఆధారం చేసుకొని సమాజాన్ని కళ్ళకు కట్టినట్లు చిత్రించటంలోనే కావ్యకర్త ఆచార్య తిరుమల ప్రతిభ ద్యోతకం అవుతుంది. ప్రతిభ ఉంటే కవిత అందంగా ఉంటుంది"[23]అని సినారె మాట్లాడే మల్లెలు గురించి ఆంధ్రప్రభలో రాశారు.

## 2. చీకటి మెరుపులు

ఈ వచన కవితా సంపుటిలో ఏభై ఒక్క కవితలు ఉన్నాయి. సంపుటి పేరుతో ఉన్న కవిత ఇందులో లేదు. అయితే సంపుటి నామం అన్ని కవితలలో పరచుకొని ఉందన్న మాట. చీకటి మెరుపులు ఎంతగా భయపెట్టినా కిరణాల ఖడ్గాలు ఈ మెరుపులను నిర్మూలిస్తూ లోకంలో కాంతిని నింపుతాయనే అర్థం ఇందులో దాగి ఉంది. సంపుటి లోని కవిత 'తెలుగు తేనె' ఆది నుంచి చివరిదాకా అమృతపు పొర్లింతలతో పఠిత హృదయంలో సుధా పూరితమైన ఆలోచనలను సృష్టిస్తాయి. ఈ కవిత అంతర్జాతీయ వేదికల మీద చదవబడి అభినందన చందనాలు అందుకుంది. అగ్నికిరీటం, అక్షర పరిమళం, అక్షరాల సెలయేరు, శేష కీర్తి, ప్రాణమండలం, మౌనాగ్ని బిందువులు, కిరణ ఖడ్గం, ఆశాజ్వాల, అగ్ని గర్భ, క్షతధాత్రి, అగ్నిగానం, సూర్యవనం అనే శీర్షికలు పదబంధాలుగా అర్థస్ఫూర్తి గంధాలుగా ఉన్నాయి. 'రూపా'ఇ, 'ఆరంభ శూరులం' అన్న శీర్షికలు భావస్ఫోరకంగా ఉన్నాయి. 'రహస్య వేదాంతి' కవిత ఆనాటి మహనీయులను సంస్మరించేది. ఈ కావ్యాన్ని తిరుమల మహాకవి డా॥ సి. నారాయణరెడ్డికి అంకితమిచ్చారు. కిన్నెర పబ్లికేషన్స్, హైదరాబాద్ వారు 1982లో ఈ కావ్యాన్ని ప్రచురించారు.

## 3. విద్యుల్లత

కవితా పబ్లికేషన్స్, హైదరాబాద్ వారు 1983లో ప్రచురించిన ముక్తక కవితా సంపుటి విద్యుల్లత. ఇందులో నూట పదహారు ముక్తకాలున్నాయి. ఛప్పున చదువరి గుండెని ఝల్లుమనిపించి ఆలోచన వైపు మళ్ళించే ఈ ముక్తకాలు ఆదర్శాన్ని లోకానికి



వెన్నెల దీపాలుగా అందిస్తూ సమాజాన్ని నిలువునా కడిగి వేయడానికి నినాదంగా, సమవాదంగా ఉపయోగపడతాయి. ప్రకృతినీ, మనిషిలో పడగ విప్పిన వికృతినీ తుడిచె పెట్టడానికి తిరుమల ఈ ముక్తకాలు ఎంతగానో దోహదపడతాయి. మెదళ్ళను చురుక్కుమనిపిస్తాయి. ఈ సంపుటికి 'కవితా వర్షం' శీర్షికతో ముందు మాట రాసిన డా॥ దాశరథి "ఈ కవితా విద్యుల్లత పూచిన జ్ఞానకాంతి పుష్పాలను దండలుగా అల్లుకుని నా వక్షస్థలం మీద ధరించి తరించదలిచాను"[24] అన్న మాటలు చాలు తిరుమల ముక్తక మణులు విశిష్టతను తెలపడానికి. ముక్తక ప్రక్రియలో ఈ విద్యుల్లత గుండెలోని తమస్సును కడిగివేసేది. ఉజ్వలమైన జీవన పథాలను అందించేది. అందరినీ కలిపేది. ఎప్పుడూ పచ్చదనాన్ని కురిసేది. సభా సామ్రాట్ కె.వి. భాస్కర రావు 'రాయని మాటలు' రాస్తూ "భాషలో, భావనలో, రీతిలో, నీతిలో ఒక్కొక్కటి అక్షర లక్షలు. ఆయన చేసిన దానానికి నిజంగా మనం యోగ్యులమైతే, వాటిని సక్రమంగా జీర్ణించుకొని మానసిక ఆరోగ్యాన్ని పెంపొందించుకోవా"[25]లన్నారు. ఈ మినీ కవితా సంపుటిని తిరుమల జి.ఆర్. రెడ్డికి అంకితమిచ్చారు.

## 4. శిలల పొదలు

'స్నేహపీఠం' పక్షాన తిరుమల ఆప్త మిత్రులైన కాట్రగడ్డ లక్ష్మీనరసింహారావు ఈ కావ్యాన్ని 1984లో ప్రచురించారు. ఇందులో ఇరవై కవితలు చేర్చబడినాయి. కావ్యం పేరుతో ఉన్న కవిత మాత్రం ఇందులో లేదు. దీన్ని బట్టి కావ్య నామం తాత్పర్యసారం అన్ని కవితలలో నేపథ్యంగా ఇమిడి ఉందన్న మాట.

శిలల పొదలు రాళ్ళ పొదరిళ్ళు అనీ, కొండల సమూహాలు అనీ, శిలలతో కప్పబడిన గుహలు అనీ అర్థం కాదు. సౌందర్యాన్ని ఎగజిమ్మేవాటికలూ, విపులాత్మను ప్రకటించే పేటికలూ, గడ్డకట్టుకు పోయిన సామాజాన్ని పలికించే వీణలూ, మనిషి మనిషికీ మధ్య రాగ మాధుర్యాన్ని ఒలకబోసే వేణువులూ అని అర్థం చెప్పుకోవచ్చు.

తిరుమల 1991లో గౌరవ డాక్టరేట్ అందుకోవడానికి ఇస్తాంబుల్ వెళుతూ మార్గ మధ్యంలో జోర్డాన్ రాజధాని అమ్మాన్ నగరాన్ని చూసినప్పుడు కలిగిన అనుభూతితో రాసుకున్న కవిత సంపుటిలో చివరన చేర్చబడింది.

ఈ సంపుటిలో సముద్ర పుష్పం, ఉద్యమ ఖడ్గం, విద్యార్థి సూర్యుడు, తూర్పు ఉయ్యాల, నేత్రస్పర్శ, వరదా వరద వంటి కవితలు సాహితికి నూతన ద్వారాలు తీస్తున్న చైతన్య కిరణాల లాంటివి. కొన్ని కవితలు తేనె ప్రవాహం లాంటివి. మరికొన్ని మనిషిని నిలబెట్టే కవితలు. ఇంకొన్ని మానవతకు పట్టం కట్టే కవితలున్నాయి. ఈ కవితల శైలి ఆర్ద్రంగా ఉంది. హంస నడకలతో సరస్సులో లేస్తున్న అలలు లతలను మృదువుగా స్పర్శిస్తున్నట్లుగా అందంగా ఉన్నాయి. ఈ కావ్య నామమే ఒక ఔచిత్యాన్ని ప్రకటిస్తుంది. ఈ కావ్యం ప్రముఖ సినీనటులు జె.వి. సోమయాజులుకు అంకితమివ్వబడింది.

## 5. అక్షరాగ్ని

1980లో కిన్నెర పబ్లికేషన్స్ హైదరాబాదు వారు తిరుమల 'అక్షరాగ్ని' కవితా సంపుటిని ముద్రించారు. అసాధారణ ప్రతిభాశాలి ఆచార్య డా॥ ఉండేల మాల కొండారెడ్డికి అంకితమిచ్చారు. ఇందులో నలభై కవితలున్నాయి. సంపుటికి పేరుగా ఉన్న కవిత పన్నెండవ కవితగా ఇందులో చేర్చబడింది. రెండు కవితలకు అక్షర విజేత, అక్షరాగ్ని అనే పేర్లు ఉన్నప్పటికీ సంపుటిలోని అన్ని కవితలలోనూ అక్షరాల ఆత్మలు పరిమళాస్తున్నాయి. ఈ సంపుటిలో సమాజం అనేక రూపాలలో చిత్రింపబడింది. అయితే మానవత్వానికీ, దీన్ని ఆర్ద్రపరిచే తత్వానికీ ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వబడింది. అక్షరాలు కవితాత్మను తొడుక్కొని ఉన్నప్పుడు జగమంతా, మనమంతా, మనసంతా జిగేలు మంటుందన్న తత్వాన్ని తిరుమల సందేశ స్వరూపంగా ఇందులో ఎలుగెత్తి వినిపించారు. ఇందులోని అన్ని కవితలూ విశేషంగా ఉన్నాయి. అక్షర విజేత, సూర్య లేఖిని, ఊపిరి తుఫాను, ధ్వని స్పర్శ, విశ్వాస కిరణం, ప్రజాప్రభాతం, కన్నీటి కొండలు, రుధిర ప్రభ, స్వల్ప శిల్పం, విశ్వనేత్రం, పిడుగులతో పూలవాన, హృదయంలో పునరుత్థానం, వంటి కవితలు రేపటి సమాజాన్ని, కవితాలోకాన్ని, శక్తిమంతంగా శాసించి నడిపించే ధోరణిలో ఉన్నాయి. శైలీ, కవితాత్మ ఈ రెండూ పందిరీలతలాగా పెనవేసుకొని సౌందర్యాన్నీ, సౌగంధ్యాన్నీ వెదజల్లుతున్నట్టుగా ఉన్నాయి. "ఈ సంకలనంలో కవితలను కూర్చిన క్రమంలో పైకి చెప్పిన ప్రణాళిక ఒకటి 'అక్షర విజేత' నుంచి అక్షరాగ్ని దాకా ఉన్న ఖండికలలో అంతర్లీనమైన భావం – ఆత్మీయత, 'చీకటి పంట' నుంచి 'ప్రజాప్రభాతం' వరకు ఉన్న కవితలను ముడి వేసే సూత్రం – జాతీయత. 'కన్నీటి కొండలు' మొదలు'నో' వరకు ఉన్న కవితలను కలిపేది – అంతర్జాతీయత. అయితే 'మనవి' నుంచి 'జఠరాగ్ని' వరకు ఉన్న కవితలలో కనిపించేది విశ్వజనీనత. చివరి ఆరు ఖండికలలో ప్రధానమైన పాత్ర – కాలాని"[26]దని దర్పణంలో చూపించారు పి.యస్. గోపాలకృష్ణ. డా॥ సంజీవ్ దేవ్ 'అగ్ని అక్షరాలు' అందించారు. ఈ అక్షరాగ్ని అంధాన్ని మాంద్యాన్ని క్షళనం చేసే జ్వాలాముఖి.

## 6. అమృత నేత్రాలు

తిరుమల సాహితీ జీవితం నుంచి వెలువడిన విశిష్టమైన మరొక కవితా సంపుటి అమృత నేత్రాలు. 1987లో విప్ల పబ్లికేషన్స్, హైదరాబాదు వారు ఈ కావ్యాన్ని ప్రచురించారు. ఇందులో ఉన్న ముప్పై రెండు కవితలు భారతి, ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, ఆంధ్రభూమి, ఆంధ్రజ్యోతి, శ్రీవాణి, జగతి ఇత్యాది పత్రికలలో ప్రచురింపబడినాయి. సంపుటిలోని మొదటి కవిత 'సమైక్య దర్శనం' 1986 రిపబ్లిక్ దినోత్సవం సందర్భంగా కొత్త ఢిల్లీలో ఏర్పాటైన జాతీయ కవిసమ్మేళనంలో చదివింది. ఈ కవిత తరువాత దీనికి హిందీ, ఆంగ్ల భాషల అనువాదాలు చేర్చబడినాయి. వాటి పిదప 'తెలుగు పిలుపు' కవిత ఉంది. తిరుమల 1985లో ఉత్తర అమెరికా ఐదవ ప్రపంచ తెలుగు మహాసభల ప్రారంభోత్సవంలో చదివిన ప్రత్యేకమైన కవిత. ఈ రెండు కవితలు రూపంలోను, అభివ్యక్తిలోను మాధుర్య



గుణాన్ని ఒలికిస్తున్నాయి. ఈ సంపుటిలో జాతీయ భావం, సమైక్యనినాదం, మానవతా వాదం, దేశభక్తి, పరిణామవాదం అనే లక్షణాలు నిండుగా ఉన్నాయి. ప్రతి కవితలోనూ ఒక చమక్కు, ఒక తళుక్కు ఉన్నాయి. కొన్ని కవితలలో ఆర్ద్రతా, మరికొని కవితలలో తీవ్రతా ఉన్నాయి. ప్రధానంగా వస్తు వైవిధ్యం – వైవిధ్యాన్ని చదువరుల గుండెలకు హత్తుకునేటట్టు చేసే నిపుణత్వం ఈ సంపుటిలో అంతటా కనిపిస్తుంది.

ప్రచురణ కర్త ఎం. విజయసేనా రెడ్డి 'మామాట'లో తిరుమల ప్రోత్సాహంతోనే, వారి రచనల ప్రచురణతోనే మా విప్ల పబ్లికేషన్స్‌ను ప్రారంభించామని చెప్పారు. కవితా సంపుటి చివరి అట్ట రెండో ప్రక్క వై. రామకృష్ణారావు "ఈ అమృత నేత్రాలులో ప్రతి అక్షరం ఒక జాబిలి మొలక, ప్రతి భావం ఒక వెన్నెల తునక"[27]అని తిరుమల కవితా తత్వానికి పరవశించి రాసిన పంక్తులున్నాయి. 'స్వాభిరుచి'లో తిరుమల "సామాజికాభ్యుదయ ప్రయోజన దృష్టిని, అంతర్గత తాత్త్విక దృష్టిని ఈ రచనలో గుర్తించుమని వినయ సూచన"[28]అని తెలియపరిచారు. సమాజంలోని బలమైన ఈ రెండు కోణాలను తిరుమల హ్లాదరమణీయంగా చిత్రించారు. ఈసంపుటి విద్యావేత్త సి. జగన్మోహన్ రెడ్డికి అంకితం చేయబడింది.

## 7. The Cosmos in my Eye

డా॥ ఆచార్య తిరుమల కలం నుంచి ఆంగ్ల భాషలో జాలువారిన మొదటి వచన కావ్యం 'ది కాస్మోస్ ఇన్ మై ఐ'. ఇంటర్నేషనల్ పోయెట్స్ అకాడమి వారిచే 1990లో విడుదల చేయబడింది. ఈ కావ్యంలో ముప్పై ఆరు కవితలున్నాయి. మనవతా పరిమళాలు, అభ్యుదయ కిరణాలు కావ్య మంతటా పరచుకొని ఉన్నాయి. ఇంటర్నేషనల్ పోయెట్స్ అకాడమి డైరెక్టర్ జనరల్, ప్రొఫెసర్ సయ్యద్ అమీరుద్దీన్, ఇంటర్నేషనల్ మంత్లీ 'పోయెట్' ఎడిటర్ డా॥ కృష్ణ శ్రీనివాస్ రాసిన ముందు మాటలున్నాయి.

## 8. My Love of Love

ఆంగ్లంలో తిరుమల రాసిన రెండవ కావ్యం ఇది. ఇందులో పదిహేను కవితలున్నాయి. 1991లో టర్కీ రాజధాని ఇస్తాంబుల్‌లో జరిగిన పన్నెండవ ప్రపంచ కవి సమ్మేళనంలో ఈ కావ్యం అవిష్కరింపబడింది. తిరుమల ఈ కావ్యాన్ని మిత్రుడైన ప్రొఫెసర్ సయ్యద్ అమీరుద్దీన్‌కి అంకితమిచ్చారు.

## 9. ధ్రువ కోకిల

తిరుమల రచలనలలో 'ధ్రువకోకిల' ఒక ప్రత్యేకమైన రూపానికి సంబంధించిన కావ్య సంపుటి. ఇది 1992లో 'భారతీ భారతి' సంస్థ పక్షాన ప్రచురింపబడింది. ఇందులో పదిహేడు భాగాలున్నాయి. అయితే శీర్షికలు లేవు. కావ్యనామం కలిగిన కవిత సంపుటి చివరలో ఉంది.

ధ్రువ కోకిల కవిత రాయడానికి, కావ్యానికి ఆ పేరు పెట్టడానికి కారణం ఉంది. ఆ హేతువును తిరుమల కావ్య ప్రారంభంలో 'ప్రదేశిని'లో ఇట్లా రాశారు. "సులక్షణసారం

అధ్యయనం చేస్తున్నప్పుడు ఈ 'ధ్రువకోకిల' అనే పేరు నా మనసుకు హత్తుకుంది. వృత్తం ఆవృత్తమవుతూవచ్చింది. నిజానికి కోకిల వసంత ఋతు విహంగం. మరి, దీనికి ధ్రువత్వమేమిటి? ఎలా దీన్ని సాధించాలి. అనేకానేక ఆలోచనలు. ఆత్మలో అనేకానేక ఆలాపనలు. ఒక శుభముహూర్తాన మనసులో ఒక మెరుపు మెరిసింది. దాని పర్యవసానమే ఈ కావ్యం! ఈ కావ్యం చివరి భాగం ధ్రువకోకిల వృత్తంలో ఉంది. అలా ఎందుకు ఉందో ధ్వనివేత్తలకు తెలుస్తుంది."[29]

ఈ సంపుటిలో వైవిధ్యమున్న రచనలున్నప్పటికీ ఒక భావ సూత్రం వీటన్నిటినీ ఏకం చేస్తుంది. ఆర్ద్రమైన తత్వం ఆత్మతత్వంగా ఈ కవితలలో ఉంది. "ఈ తాత్త్వికాభినివేశం బింబ - ప్రతిబింబ భావంలో ఆత్మాశ్రయ, పరాశ్రయ కవితా రీతుల్లో భౌతిక, అభౌతిక ఛాయలో అభివ్యక్తం"[30] అవుతుందని తిరుమల రాశారు. ఆయనే "వచన కవితా నా రచన అన్నిటిలోకి ఇదొక విభిన్నమైన రచన"[31]అని ప్రస్తావించడం తిరుమల రచనలో వచ్చిన మార్పును సూచిస్తుంది.

## 10. అమృతాన్వేషణ

తిరుమల ఆధ్యాత్మికానురక్తిని తెలిపే కావ్యం ఇది. శీర్షిక లేని నూట పది కవితలలో జగద్వ్యాపకుని అన్వేషిస్తూ తన బాధలను విన్నవించడంతో పాటు లౌకిక విషయాలను, అవి సమాజాన్ని కుంగదీస్తున్న తీరును తిరుమల కావ్యస్థం చేశారు. కవి చెప్పింది ఆధ్యాత్మిక విషయాలే అయినప్పటికీ ఆయన సుకుమారమైన శైలిలో పాఠకుని ఆకట్టుకొని క్రమశిక్షణతో కూడిన చింతన వైపు మళ్ళిస్తాయి. ఆధ్యాత్మికం, మానవత్వం, రెండూ ఈ కావ్యంలో తరగలెత్తుతాయి. వీటితోపాటు కవి పరిదేవ్యం కూడా కొన్ని చోట్ల కన్పిస్తుంది. తాను కేవలం జీవుడననీ, పరమాత్మ ఎలా ఉంటుందో తెలియని వాడనని - అయితే నాలోనే పరంధాముడు ఉన్నాడని, పరంధామునిలో తానున్నానని చెప్పడంలో పరాకాష్ఠ చెందిన కవి భక్త్యావేశం కన్పిస్తుంది. కావ్య ప్రారంభంలో ఆనందవర్ధనుని 'యత్రార్థ' అనే శ్లోకం తన హృదయంలో నిలిచి స్పందనలకు కారణమైన విషయాన్ని తెలిపారు తిరుమల. ఆయన సాహితీ జీవితంలో 'అమృతాన్వేషణ' ఒక మలుపు. ఒక శిఖరం. ఒక విచిత్ర మణి మంటపం. ఆత్మ - పరమాత్మ - లౌకికం - పారలౌకికం అనే విషయాలు ఈ కృతిలో సమ్యక సమ్మేళనం పొందాయి. అమృతాన్వేషణ అమృతం కోసం వెదకడమన్నమాట. అంటే దైవం కోసం ప్రయత్నించడమన్న మాట.

విలువైన ఈ కావ్యాన్ని విప్ల పబ్లికేషన్స్, హైదరాబాదు అక్టోబరు 1995లో ప్రచురించింది. బాలు గీసిన ముఖచిత్రం భావగర్భితంగా ఉంది.

## 11. రుద్రాక్షలు

తిరుమల కలం నుంచి జాలువారిన నూటపదహారు ముక్తకాల మణిహారం రు'ద్రాక్షలు'. అనితా పబ్లికేషన్స్ 2001లో ఈ కావ్యాన్ని ప్రచురించింది. తిరుమల సాహిత్య జీవితంలో



ఎన్నో మరుపురాని సంఘటనలు ఉన్నాయి. అందులో ఈ కావ్యం వెలుగు చూడటం ఒకటి. 93v ఆర్టీసి బస్సులో రోజూ తిరుమల కాలేజికి వెళ్తుండేవారు. ఆ బస్సు కండక్టరు అశోక్‌కు తిరుమలతో ఏర్పడ్డ పరిచయం క్రమేపి అతన్ని కవితాభిమానిగా మార్చింది. తిరుమలకు అభిమాని అయ్యాడు. ఆయా సభల్లో చదివిన ఇందులోని కవితల్ని విని ఈ కావ్యాన్ని నేనే ముద్రణ చేయిస్తానని పట్టుబట్టాడు అశోక్. ఆయన మాట కాదనలేక సరేనన్నాడు తిరుమల. ఈ కావ్యాన్ని ఆయనకే అంకితం చేశారు. ప్రముఖ కథా రచయిత ఇలపావులూరి మురళీమోహనరావు రాసిన అభినందన చివరి అట్టపైన ఉంది.

# 4. వ్యాస సంపుటాలు

## 1. తెలుగు తెమ్మెరలు

మహాకవి డా॥ దాశరథికి అంకితం చేయబడిన ఈ గ్రంథంలో పది వ్యాసాలున్నాయి. శ్రీదేవి పబ్లికేషన్స్, హైదరాబాదు 1981 ఆగస్టులో ఈ గ్రంథాన్ని ముద్రించింది. ఇందులోని వ్యాసాలన్నీ వివేచనా దృష్టితో రాయబడినాయి. మొదటి వ్యాసం 'శాస్త్ర పరిశీలన' శాస్త్ర శబ్ద నిర్వచన అనే అంశాలను తిరుమల విశదంగా ప్రదర్శించారు. శాస్త్రవిషయాలు కూడా కళాత్మకంగా చెప్పబడాలి అని అనడం ఔచితీస్ఫోరకంగా ఉంది. రెండో వ్యాసం 'కళ - అహంకారం' కళాకారుడు ఆత్మ విమర్శ చేసుకోవాలని, తమలోని దోషాలను కప్పిపుచ్చుకొని మరెవరి మీదనో నిందలు వేయడం సబబుకాదని, కళాకారునిలో దురహంకారం శ్రుతి మించిందని, కళాకారుడు తన కంటే గొప్ప వాళ్ళ ముందు తన ప్రతిభను చూపి తనను సంస్కరించుకోవాలని రచయిత సూచించారు. మూడో వ్యాసం "ఆధునిక కవితారీతులు' గురజాడ, కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ కవితా రీతులను సరళ శైలిలో విశ్లేషించి చూపారు. ఈ విమర్శ ధోరణి ఆధునికంగా కన్పిస్తుంది. నాలుగో వ్యాసం 'వైతాళికుడు గురజాడ' సమాజాన్ని మార్చడానికి కవితను, నాటక ప్రక్రియను గురజాడ వాడుకున్న స్థితిని ఈ ప్రక్రియలలో ఆయన ప్రవేశపెట్టిన కొత్త సంప్రదాయాలను రచయిత సోపపత్తికంగా విశ్లేషించారు. అయిదో వ్యాసం 'భావ కవితా యుగంలో రాయప్రోలు' ఇందులో రాయప్రోలు రాసిన తృణకంకణం ఆధునికాంధ్ర కవిత్వానికి ఆది కావ్యమని, మాధురీ దర్శనంలో సృష్టి రహస్యం, రతి, రసం, సంయోగం ఇమిడి ఉన్నాయని, ఆయన దేశభక్తిని ప్రత్యేకంగా గానం చేశారని రచయిత రాశారు. ఆరో వ్యాసం 'శబ్ద శిల్పి దేవులపల్లి' కృష్ణశాస్త్రి ప్రకృతినీ, మానవ ప్రకృతినీ, సమాజ ప్రకృతినీ పదాల పోహళింపుతో రక్తి కట్టించారని, సహృదయుడు ఆనందించదగిందని తిరుమల దేవులపల్లి శబ్ద నిర్మాణాన్ని ప్రశంసించారు. ఏడో వ్యాసం 'ఆంధ్ర నాటక చరిత్రలో ధర్మవరం'. ఆంధ్ర నాటక పితామహుడుగా పేరు తెచ్చుకున్న రామకృష్ణమాచార్యుల నట జీవితాన్ని రచనా జీవితాన్ని తిరుమల పరిశోధనా పద్ధతిలో రాశారు. ఆయన తెలుగు, ఆంగ్ల భాషలలో రాసిన నాటకాల ప్రత్యేకతను చక్కగా

వివరించారు. ఎనిమిదో వ్యాసం 'మానవతా యుగ ప్రవక్త వేమన'. వేమన జీవితాన్ని, మానవత్వాన్ని సర్వకాల సర్వావస్థలల్లోనూ సమన్వయపడే శాశ్వత సిద్ధాంతాన్ని అన్ని కోణాల నుంచి వివరించిన వ్యాసం ఇది. తొమ్మిదో వ్యాసం 'విశ్వనాథ వారి నవలలు ఒక పరిశీలన'లో విశ్వనాథ వారి నవలా ప్రక్రియ గురించి తిరుమల చక్కని పరిచయ వాక్యాలు రాశారు. నవలాకర్తగా విశ్వనాథ తత్వాన్ని ఆయన వ్యక్తీకరించిన తీరు బాగుంది. పదో వ్యాసం 'మొగ్గల్లో తేనె'. ఈ వ్యాసంలో చిన్నయ సూరి బాల వ్యాకరణమే ప్రౌఢమైందని, బహుజనపల్లి వారి ప్రౌఢవ్యాకరణంపై పండితులు పెదవి విరిచారని చెప్పారు. ఆనాటి ధ్రువుడు, ప్రహ్లాదుడు, మార్కండేయుడు, కుమార స్వామి, నాచికేతుడు, కుశలవులు చేసిన ఘనకార్యాలు, రామాయణంలో బాలకాండ ఇవన్నీ కూడా బాల సాహిత్యాన్ని తెలిపేవని తిరుమల తేలికమైన భాషలో రాశారు.

విషయ వైవిధ్యంతో ఉన్న ఈ వ్యాస సంపుటికి 'ఆకాంక్ష' రాస్తూ డా॥ ఇరివెంటి "అచార్య తిరుమల బోధకుడు కనుక ఆయన వ్రాసిన వ్యాసాలన్నీ పాఠకునితో మాట్లాడినట్టున్నవి. పాఠకుడేమైనా అడుగుతాడేమోనని తానే సమాధానం వ్రాసినట్లున్నవి"[32] అనడం ఔచిత్యంగా వుంది. ఆధునిక విమర్శ గ్రంథాలలో ఇది ఒక విశిష్టమైన వ్యాస సంపుటి.

## 2. కవి దర్శనం

ఈ వ్యాస సంపుటిలో ప్రాచీన, ఆధునిక సాహిత్యాలకు, పండుగలకు, దైవతాలకు సంబంధించిన పదునాలుగు వ్యాసాలున్నాయి. వ్యాసాన్ని మొదలు పెట్టడం, వివేచించడంలో తిరుమల నిపుణతకు ఈ సంపుటిలోని ప్రతి అక్షరం సాక్ష్యంగా నిలుస్తుంది. సాహిత్య విద్యార్థికీ, సాహితీవేత్తలకూ కరదీపికగా ఉంటున్న ఈ గ్రంథాన్ని విప్ల ప్రింటర్స్, హైదరాబాదు వారు 1986లో ప్రచురించారు. ప్రముఖ కవి డా॥ జె. బాపురెడ్డికి అంకితం చేయబడింది. సుప్రసిద్ధ కవి ఆచార్య ఉండేల మాల కొండారెడ్డి ఈ వ్యాసగుచ్ఛానికి 'సంస్పర్శనం' పేరుతో ముందుమాట రాశారు. 'నన్నయ నిత్య సత్యం వచనానికి దుష్యంతోపాఖ్యానం ఒక సజీవాక్షర సత్య దర్పణ' మని "నిత్య సత్య వచనుడు నన్నయ" అను వ్యాసంలో రుజువు చేశారు. ఆధునిక తెలుగు సాహిత్య కేదారంలో చేయి తిరిగిన కృషీవలులు గురజాడ, దేవులపల్లి. ఈ ఇద్దరు మహాకవుల ప్రేమతత్వాన్ని 'ప్రేమ తపస్వులు' వ్యాసంలో హృద్యంగా చిత్రీకరించారు. సంగీత సరస్వతిని 'సంగీత చరిత్ర'లో దర్శించారు. కళ ఈశ్వరీయమని దాని ఆనంద రసాస్వాదనమే పరమార్థమని విగ్గడించారు. జాతీయ సాంస్కృతిక వికాస రంగానికి జాతి యావత్తు పునర్వికాసానికి నాంది గీతం పాడాలని, ఇందుకు మేధావి వర్గం నిర్లక్ష్యవైఖరిని విడిచి భిక్షాపాత్రలు త్యజించి, అక్షయ పాత్రలు ధరించాలని 'సాంస్కృతిక రంగంలో ప్రచార సాధనాల పాత్ర' వ్యాసంలో ఉద్బోధించారు. సంగీత - సాహిత్య సరస విద్యామూర్తులు, యుగకర్తలు ఘంటసాల, దేవులపల్లి సాధించుకున్న ప్రత్యేకతను 'రెండు పారిజాతాలు'లో వివరించారు. "కవి'త" దర్శనాన్ని కూలంకషంగా 'కవి దర్శనం'లో



చూపించారు. కవితా గతమైన ఆత్మశక్తిని, శబ్దోపాసనతో కవి సాధించాలంటారు తిరుమల. కళ-కళాకారులు గంధపు చెట్టు లాంటివారు. నిజమైన కళాకారుడు తన కళా పరిమళాన్ని దాచుకుందామన్నా దాచుకోలేడు. 'కళ' విశిష్టతను తెలిపే చక్కని వ్యాసం 'కళానైపుణ్యం'. లోకం పోకడలను పెద్ద బాలశిక్షలో, కవుల ప్రవర్తనా రీతులను 'కవుల వినయ సంపద'లో, వచన కవితా పితామహుడు కుందుర్తి విశ్వరూపాన్ని 'వచన కవితా స్ఫూర్తి - కుందుర్తి'లో, కవి సాంఘిక న్యాయదృష్టిని, గృహిణి స్థానాన్ని 'కావ్యాల్లో భార్యా ప్రశంస'లో, తెలుగు పల్లెల సౌభాగ్య జీవితాన్ని 'ఋతు సంహారంలో తెనుగు గ్రామీణ వ్యవస్థ', 'సంక్రాంతి సౌరభం' వ్యాసాల్లో, పశు-మానవ రూపంగల గణపతి సర్వజన ప్రియుడైన దేవుడిగా 'కల్యాణ గణపతి'లో వివరించారు. ఈ సంపుటిలోని వ్యాసాలు వస్తు వైవిధ్యంతో, వస్తు విశ్లేషణతో ఉన్నాయి. చివరి అట్ట మీద డా॥ సి. నారాయణ రెడ్డి రాసిన 'పరిచయం' ఉంది.

## 3. ఆలోచ నా లోకం

తిరుమల ప్రచురించిన వ్యాససంపుటిలలో ఒకటి 'ఆలోచ నా లోకం'. పరిశోధనా మూల్యాలు సంతరించుకున్న పది వ్యాసాలు ఇందులో ఉన్నాయి.

సంపుటిలోని మొదటి వ్యాసం 'తెలుగు కావ్యాల్లో ఉదయ వర్ణన' అనేది. తిరుమల సంస్కృత కవి మయూరుని, శంకర కంకటి పాపరాజు, శ్రీనాథుడు, పోతన, ముక్కు తిమ్మన లాంటి ప్రాచీన కవులు, తిరుపతి వేంకట కవులు, కృష్ణశాస్త్రి, తిలక్ లాంటి ఆధునిక కవుల రచనలోని వర్ణనలను విశ్లేషించి చూపారు. కవులు సహజంగా వర్ణనా ప్రియులు కావటం వలన ప్రభాత సౌందర్యాన్ని పలు విధాలుగా భావించి రాశారని ప్రస్తావించారు.

'సాహిత్యంలో వృక్ష సంపద' అనే రెండవ వ్యాసంలో వేదంలో రావి, మర్రి, మేడి, మామిడి, అనేవి దేవ వృక్షాలుగా వర్ణింపబడినాయని, కృష్ణుడు గీతలో అశ్వత్థ వృక్షాన్ని అవ్యయ విభూతిగా ప్రకటించాడని, వృక్షం లేకపోతే జీవితం లేదన్న జగదీష్ చంద్రబోస్ అభిప్రాయాన్ని రచయిత ఉటంకించారు. ఇంకా వ్యాసుడు, భర్తృహరి, పోతన వంటి కవులు చెట్లను సంభావించిన వైఖరిని వివరించారు. వృక్షాలకూ మహాత్ములకు దగ్గరి అనుబంధం పెనవేయబడి ఉందని తెలుపుతూ ఆనాటి కావ్యాలకు తాటియాకులు పాదేయంగా నిలిచిన అంశాలను రచయిత విశ్లేషించారు.

మూడవ వ్యాసం 'మానవుడు - మత ప్రభావం' అనేది. మతాన్ని నిర్వచిస్తూ మతం అంటే 'తిరిగి బంధించడమని', విడిపోయిన జీవుని భగవంతునితో పునఃసంధానం కల్పించేదే మతమని రచయిత అభిప్రాయపడినారు. మానవ శ్రేయస్సు కోసం రూపుదిద్దుకున్న మతం మారణహోమంగా జ్వలించడాన్ని రచయిత ప్రస్తావించి దాని సహజ స్వరూపాన్ని మానవాళి అర్థం చేసుకోవటం లేదని రాశారు. మతం గురించి బెర్ ట్రండ్, రసెల్, గాంధీజీ, థామస్ పుల్లర్, మార్క్స్, ఫ్రాన్సిస్, బేకన్ వంటి మేధావుల అభిప్రాయాలను సోపపత్తికంగా

పొందుపరిచారు. ప్రపంచంలో అయిదు వందల మతాలున్నాయని అందులో పది ముఖ్యమైనవని హిందూ క్రైస్తవ మహమ్మదీయ అనే మూడు మతాలు మరీ ప్రధానమైనవని రాశారు. మతం శాస్త్రప్రమాణంగా ఉంటేనే సమాజం అజరామరంగా ఉంటుందని రాశారు.

'గాంధీజీ పై తెలుగు కవుల దృక్పథం' అనేది నాలుగవ వ్యాసం. తిరుమల ఈ వ్యాసాన్ని గీతలోని 'పరిత్రాణాయ సాధూనాం' అనే శ్లోకంతో మొదలుపెట్టి దాన్ని గాంధీజీ అవతరణకు ప్రాతిపదికగా రూపకల్పన చూసి ముందుగా సినారె కవితతో వివేచనను ప్రారంభించారు. గాంధీజీ ఆశించిన విదేశీ వస్తు బహిష్కరణ, సహాయ నిరాకరణ, సత్యాగ్రహం వంటి లక్ష్యాలు తెలుగు కవిత్వాన్ని ప్రభావితం చేశాయని రాశారు. తుమ్మల 'కవిని నేను గాంధీ కవిని'నని చెప్పుకున్న వైనాన్ని, అన్ని మతాల వారు గాంధీజీని తమ మతస్థుడని భావించుకున్న విధాన్ని జాషువా కవి 'బాపూజీ' కావ్యంలో చిత్రించిన రీతినీ, పింగళి కాటూరి కవులు 'సౌందర నందం'లో బాపూజీ విశ్వ కారుణ్య భావనను చర్చించి ఉల్లేఖించారు. ఇంకా రాయప్రోలు, శ్రీపాద, వెంకటప్పయ్య, బాపిరాజు, బసవరాజు, దాశరథి, నాయని, ఖండవల్లి, ముకురాల వంటి మహాకవులు గాంధీజీ వ్యక్తిత్వాన్ని, జాతీయోద్యమంలో గాంధీజీ భూమికను చక్కని విశేషణాలతో వర్ణించిన పద్ధతులను తిరుమల దర్శించి ఉదాత్తంగా రాశారు.

అయిదవ వ్యాసం 'కవితా కోకిల సరోజినీ నాయుడు'. సరోజినీదేవి బంగారు వాకిలి, కాల విహంగం, విరిగిన రెక్క, వేణు దండం, ప్రభాత తూలిక వంటి రచనలతో ఉత్తమ కవయిత్రిగా 'భారత గానకోకిల'గా విశిష్టత సంతరించుకున్న దృక్పథాన్ని, మెట్రిక్ పరీక్ష రాష్ట్రానికంతటికీ ప్రథమ శ్రేణిలో ప్రథమ స్థానంలో ఉత్తీర్ణత పొందిన ఆమె అధ్యయన శీలాన్నీ, ఆమె రాసిన 'మెహర్ మునీర్' అనే ఆంగ్ల నాటకాన్ని చదివి నైజాం నవాబు ముగ్ధుడై ఆమె ఇంగ్లాండు చదువుకు ఏటా 300 పౌండ్లు ఇచ్చిన సంఘటననీ చక్కగా ఉటంకించారు. ప్రపంచ కవయిత్రులలో సరోజినీదేవి కున్న ప్రత్యేకతనూ, బ్రిటన్‌లోని 'రాయల్ సొసైటీ ఆఫ్ లిటరేచర్'లో ఆమెకు ఇవ్వబడిన సభ్యత్వ నాణ్యతలను పరిచయం చేస్తూ సినారె అనువదించిన ఆమె కవితలలోని కొన్ని పంక్తులను ఉదహరించారు.

'యక్షగాన వైభవం' అనేది ఆరవ వ్యాసం. రచయిత యక్షగానాన్ని నిర్వచిస్తూ అది యక్షుల గానమనీ, మేఘ సందేశం, భీమ ఖండం, పండితారాధ్య చరిత్ర, బ్రాహ్మణ, బౌద్ధ, జైన సారస్వతాల్లో యక్షుల ప్రస్తావన ఉందని, జానపదం దేశిశాఖ అని, యక్షగానం 19వ శతాబ్దిలో పరిణతి చెందిందని రాశారు. తెలుగులో 400 యక్షగానాలుండగా తెలంగాణంలో 100కు పైగా ఉన్నాయని తెలుపుతూ సాభరిచరితం, సుగ్రీవ విజయం వంటి కొన్ని ప్రసిద్ధ నాటకాలను ప్రస్తావించారు.

ఏడవ వ్యాసం 'ఆత్మ విద్యాభ్యాసం'. ఏడు అంటే సప్తపది. ఇది కాల్యాణ కారకం. ఇందులో 'అమృత మృత్యు స్వరూప నిరూపణ చేసేదే ఆధ్యాత్మిక విద్య అనీ, ఇది భారత



దేశంలోనే పుట్టిందనీ, భగవత్ స్వరూపమనీ, అంతస్స్వరూపాన్నీ, అంతశ్శత్రువులను గెలిచే విధానాలనీ తిరుమల తన ఆధ్యాత్మిక జ్ఞానాన్ని చక్కగా ప్రస్ఫుటీకరించారు.

ఎనిమిదవ వ్యాసం 'సంఖ్యా సాహిత్యం' అనేది. రచయిత ఏకం అనేకం కావటానికి సంఖ్యలే కారణమంటూ మహర్షుల అభివ్యక్తులను వింగడించి చూపించారు. సంఖ్యాశాస్త్ర రహస్యభేదం మనుషుల బుద్ధి కుశలత మీద ఆధారపడి ఉంటుందని అంటూ త్రికరణాలు, ప్రస్థానత్రయం లాంటి సాంకేతికాలకు అర్థాలను చూపించి వేదాలలోని మంత్రాలను ఉదహరించి విశ్లేషించి రాశారు.

'సాహిత్యంలో సమైక్య భావన' అనేది తొమ్మిదో వ్యాసం. సమైక్య దృక్పథం ఇతిహాసపురాణాలలో భారత భాగవత రామాయణాలలో ప్రస్థావించబడిందని, నన్నెచోడుడు, బద్దెన సమైక్యతను గానం చేసిన విధానాన్ని, రాయలు శ్రీశైలంలో గాలి గోపురాన్ని నిర్మించిన తీరునూ, ఆధునిక కావ్యాలైన రాణా ప్రతాప సింగ చరిత్ర, శివ భారతం, ఆత్మకథ, విజయశ్రీ లలో ఐకమత్యాన్ని ప్రబోధించిన విధాన్ని అనేక విధాలుగా విశ్లేషించి దర్శింపజేశారు.

ఈ సంపుటిలో చివరి వ్యాసం 'శాంతి మార్గం' పదవది. తిరుమల ఇందులో శాంతి-బుద్ధికి సంబంధించిన విషయమనీ, వ్యాసుడు భాగవతమ్నాయాన్ని కల్పించి శుక మహర్షి చేత చదివించుకొని ప్రశాంత చిత్తతను పొందిన విధాన్ని, భగవత్ తత్వాన్ని తెలుసుకోవడం, ఆయనను దర్శించడం వల్లనే నిజమైన శాంతి మనస్సులో స్థిరపడుతుందని విశ్లేషించి చెప్పారు.

తిరుమల పరిశీలనా పటిమను ప్రకటిస్తున్న ఈ సంపుటి అక్టోబరు 2000లో ప్రచురింపబడింది.

## 4. వివేచని

సాహిత్య వాతావరణానికి తాత్వికతను ప్రధాన భూమిక చేసిన వైనం ఆచార్య తిరుమల 'వివేచని' వ్యాస సంపుటిలో కన్పిస్తుంది. ఈ వ్యాస సంపుటిలో ఆత్మ విద్యా వివేచన, భారతీయ భవ్య సంస్కృతి, భక్త కవుల దృష్టి, భారతీయ వాగ్గేయకారులు, విజయ రాఘవుని సాహిత్యసేవ, మధ్యాక్కఱల్లో విశ్వనాథ, కన్నీటి కైవల్యం, కొండదివ్వె అనే ఎనిమిది వ్యాసాలున్నాయి. ఈ వ్యాస సంపుటిలోని 'ఆత్మ విద్యా వివేచన' వ్యాసం చదివిన మహాకవి గుంటూరు శేషేంద్ర శర్మ 'ఎన్నో మహిమాన్విత విషయాలు చెప్పారు. దాన్ని చదివి గంగాస్నానం చేసినట్లు అనిపించింది' అని అన్నారు. లోతైన పరిశోధన దృక్కోణంలో రాయబడిన ఈ వ్యాసాలు 'వివేచని'గా 2003లో ప్రచురింపబడింది.

## 5. ధ్వని తరంగాలు (అముద్రితం)

ఈ వ్యాస సంపుటిలో ఆధునిక తెలుగు సాహితీ మూర్తుల, సాహిత్య ప్రక్రియల పరిచయాలున్నాయి. ఇవన్నీ ఆంధ్రభూమి దిన పత్రికలో ధారా వాహికంగా వెలువడినాయి.

## 6. పగడాలు (అముద్రితం)

'సమయం' దిన పత్రికలో వరుసగా అచ్చయిన ఆధునిక కవుల పరిచయ పరంపర ఇది. ఈ పరిచయాలలోని విశ్లేషణ సాహితిని మరింత పరిపుష్టం చేసింది.

# 5. విమర్శనా గ్రంథాలు

## 1. కవితాకళ

తిరుమల లేఖిని నుంచి వెలువడిన సిద్ధాంత గ్రంథం ఈ కవితాకళ. ఇందులో పద్దెనిమిది అధ్యాయాలున్నాయి. ప్రాచ్య పాశ్చాత్య సిద్ధాంతాల ప్రస్తావన - సమన్వయం - సిద్ధాంతం సోదాహరణంగా చర్చింపబడినాయి. తిరుమల చేయి తిరిగిన కవీ - రచయితా - పండితుడూ కావడం వలన సిద్ధాంత ప్రతిపాదన, సమన్వయం, ప్రయోజనం, ఫలితం వివేచనాత్మకంగా సాగాయి. తిరుమల అధ్యాయాల శీర్షికలే సాహిత్య సిద్ధాంతాల ప్రత్యేకతలను నిరూపిస్తున్నాయి. అధ్యాయాల పేరు ఇట్లా ఉన్నాయి.

| | |
|---|---|
| 1. కవి-లక్షణాలు | 2. పరిత-లక్షణాలు |
| 3. కళ | 4. లలిత కళలు-కవిత్వం |
| 5. కవిత్వం-ఛందస్సు | 6. కవిత్వ లక్షణ-ప్రయోజనాలు |
| 7. కవితా శిల్పం | 8. నా నృషిః కురుతే కావ్యమ్ |
| 9. కవితా వస్తువు | 10. కవితా సంప్రదాయం |
| 11. శబ్ద బ్రహ్మ సాక్షాత్కారం | 12. సరస్వతి ఎవరు? |
| 13. కవిత్వ ప్రాశస్త్యం | 14. కవితా శాఖలు - పర్యాయ పదాలు |
| 15. కవిత్వం - రసానందం | 16. కవితపై కవుల అభిప్రాయాలు |
| 17. కవిత్వం - తత్త్వం | 18. కవితా కళ - విశ్వ కళ్యాణం |

మొదటి అధ్యాయంలో కవి లక్షణాలను సిద్ధాంత పరుస్తూ రచయిత ప్రాచీనార్వాచీన కవులు ప్రతిపాదించిన కవి లక్షణాలను క్రోడీకరిస్తూ జ్ఞానవంతుడే కవిత్వం చెప్పాలి. అప్పుడు కవిత్వం వినూతన పద్ధతిలో వెలువడి సమాజహితం కోసం ఉపయోగపడుతుందని భావించారు.

రెండవ అధ్యాయంలో పరిత రసజ్ఞుడు అయి ఉండాలని అలాంటప్పుడు కవి వాక్కులోని అర్థాలని, ప్రయోజనాలని అందుకొని అనుభవించి సమాజ శ్రేయస్సును ఇతోధికం చేస్తాడని సిద్ధాంతీకరించారు.

'కళ' అనే మూడవ అధ్యాయంలో కళ స్వరూప స్వభావాలను అనుశీలిస్తూ కళలో రసం ఒదిగి ఉండి రసజ్ఞుణ్ని అలరించే విధానాన్ని రచయిత ఆంధ్రాంగ్ల సాహిత్య సిద్ధాంతాలను చర్చించి చెప్పారు.



'లలిత కళలు - కవిత్వం' అనే నాలుగవ అధ్యాయంలో లలిత కళలలో కవిత్వం స్థానాన్నీ, ప్రత్యేకతనీ రాశారు. లలిత కళల్లో ఉన్న లాలిత్యం, సౌందర్యం వంటి పదాలలో దాగిఉన్న తత్త్వాన్ని కాళిదాసు, జయదేవుడు లన్న మాటలను సవిమర్శకంగా చెప్పారు.

'కవిత్వం - ఛందస్సు' అనబడే అయిదవ అధ్యాయంలో కవిత్వానికి ఛందస్సు ఉండాలని తేట పరిచారు. "ఏ దేశంలోనైనా కవిత్వం మొట్ట మొదట పద్యంతోనే ఆవిర్భవించటం గమనార్హం" అన్నారు. కవితకు ఛందం ఊపిరిలాంటిదని రచయిత తెలిపారు.

ఆరవ అధ్యాయం 'కవిత్వ లక్షణ - ప్రయోజనం' అనేది. ఆనాటి నుంచి ఈనాటి దాకా వస్తున్న కవిత్వ పరిణామాలను, ప్రమాణాలను తెలుపుతూ కవిత్వం సమాజహితాన్ని కోరేదని, అది పదును కలిగినట్టిదని సూచించేదని సిద్ధాంత పరిచారు.

ఏడవ అధ్యాయం కవితా శిల్పం. ప్రాచీనుల నుంచి ఆధునికుల కవుల దాకా 'శిల్పం' అనే పదాన్ని ప్రయోగించిన తీరునూ, శిల్ప నిర్మాణం వలన కవిత్వానికి చేకూరే విశిష్టతను తెలుపుతూ 1. కావ్య లక్షణ సమన్వయం 2. కావ్య నిర్మాణ కౌశలం శిల్పానికి ఊపిరిగా ఉంటాయని చెబుతూ 'శీలి సంపన్నమైన ఆత్మ సౌందర్య దృష్టి కవితా శిల్పం' అని తాత్విక దృష్టితో ప్రవచించారు.

'నా నృషిః కురుతే కావ్యమ్' అనేది ఎనిమిదో అధ్యాయం. ఇందులో ఏ కాలంలోని కవికైనా సమాధి నిష్ఠ అవసరమని, ఈ స్థితి ఉన్నవాడే కవి అవుతాడని అతనికి శాస్త్ర దృష్టి ఉండాలని. సహజంగా మనిషి నిగమాగమ ఋషి లాంటి కవి అవుతాడని తిరుమల వ్యక్తీకరించారు. "ఋషి క్రాంతదర్శి. కాబట్టి యీ సృష్టి ప్రవర్తక ఋషి ప్రాణ ప్రాధాన్యం గల కవే కావ్య నిర్మాణ దక్షుడవుతాడు" అని అనుశీలించారు.

తొమ్మిదో అధ్యాయం 'కవితా వస్తువు'. ఇందులో కవితకు వస్తువు ముఖ్యమని, అది కాలాన్ని అనుసరించి మారుతూ ఉంటుందని, ఆలంకారికులు వస్తువును ప్రఖ్యాతం, మిశ్రబంధం, ఉత్పాద్యం అని చెప్పారని, ఆధునికులలో వస్తువును విశాలమైన రూపంగా గ్రహించారని, భగవంతుడే ఉత్తమ పురుషుడు, అతని చరిత్రే విశ్వకావ్యం అని అనుశీలించారు.

పదవ అధ్యాయం 'కవితా సంప్రదాయాలు'లో సంప్రదాయాన్ని సమర్థించిన కవుల ఆలోచనలను, వ్యతిరేకించిన వాళ్ళ అభిప్రాయాలను క్రోడీకరించి రచయిత సంప్రదాయం నిలుస్తుందని, ఆధునికతకు దోహద పడుతుందని, దృష్టి ముఖ్యం, దృష్టి భేదం ఉండకూడదని ఆయన సంప్రదాయాన్ని గౌరవించిన తీరు తెలియజేయబడింది.

పదకొండవ అధ్యాయం 'శబ్ద బ్రహ్మ సాక్షాత్కారం'. త్రిమూర్తుల తత్త్వాన్ని, శబ్దా విష్కారానికి హేతువులైన ధ్వని - స్ఫోట అనే అంశాలు ప్రోత్సాహకంగా ఉంటాయని, ధ్వని కావ్యం ఉత్తమమైందని, శబ్దానికి పూర్వరూపం భావం అని తేజోవంతమైన శబ్దాలను ప్రయోగించేవాడు కవి అని నిర్వచించారు.

పన్నెండవ అధ్యాయం 'సరస్వతి ఎవరు?' లో "సర్వ వివేకంతో నిండిన దశవాక్కు సరస్వతి"అని కాళిదాసు, రాజశేఖరుడు వాఙ్మయాన్ని దైవపరంగా ఆవిష్కరించిన రీతిని, పాశ్చాత్యులు వాఙ్మయాన్ని కళాధర్మాలతో నిండి వుండాలన్న విషయాన్ని సరస్వతి పదానికి లాక్షణికులు ఇచ్చిన వ్యాఖ్యానాన్ని బ్రహ్మ శబ్దతత్వం సప్త ప్రాణ సమిష్టి అని చెప్పారు.

పదమూడవ అధ్యాయం 'కవిత్వ ప్రాశస్త్యం'. కవిత్వం ఆనందానిచ్చేది. ప్రయోజనాన్ని చేకూర్చేది. భర్తృహరి 'సుకవితా యద్యస్తి రాజ్యేన కిం' అని కవిత ప్రాశస్త్యాన్ని చెప్పారు. మడికి సింగన శబ్దం విలువను ప్రకటించారు. పెద్దన కృతికి పెద్ద పీట వేశారు. భట్టుమూర్తి, శ్రీనాథుడు, గురువయ్య, శ్రీశ్రీ, దాశరథి, ఆరుద్ర వంటి వాళ్ళు కవితా ప్రాశస్త్యాన్ని వర్ణించారు. వీరి వర్ణనా చణత్వాన్ని తిరుమల ఈ అధ్యాయంలో క్రమంగా అనుశీలించారు.

పదునాలుగవ అధ్యాయం 'కవితాశాఖలు - పర్యాయ పదాలు' అనేది. వేదాలలో కవితా నిర్వచనాలు, కవితలు ఉన్నాయని, కావ్యానికి భోజుడు, వామనుడు ఇచ్చిన పర్యాయ పదాల రూపాలని, కావ్యం, వీరకావ్యం, కథాకావ్యం, ఉపదేశ కావ్యం, వర్ణన కావ్యం, గేయకావ్యం, అధిక్షేపకావ్యం అనే పేరుతో కావ్యాలొప్పుతున్న విధానాన్ని వాటి తత్వాన్ని తెలిపారు.

పదిహేనవ అధ్యాయం 'కవిత్వం-రసానందం'. ఇందులో కవితలో ఆనందాన్ని రసమంటారని, కాళిదాసు, తిక్కన, తెనాలి రామకృష్ణకవి, గంగాధర కవి, కందుకూరి, పింగళి, విశ్వనాథ, జొన్నలగడ్డ వంటి ఉత్తమ శ్రేణి కవులు రసప్రాధాన్యతను కవితలో తెలిపిన వైఖరిని రాశారు.

పదహారవ అధ్యాయం 'కవితపై కవుల అభిప్రాయాలు' అనేది. నన్నయకు పూర్వం తెలుగు భాష ఉందని, 'సారమతిం' అనే పద్యంలో ఆయన తన కవితా లక్షణాలను ప్రస్తావించాడని తెలుగు కవితా రంగంలో మొదటి విప్లవ కేతనాన్నెగరేసింది శివకవులని, నన్నెచోడుడు, పాల్కురికి, శ్రీనాథుడు, పెద్దన, రాయలు, భూషణకవి, సూరన వంటి ప్రాచీన కవులు కవిత మీద ప్రకటించిన వారి భావాలను, గురజాడ, శ్రీశ్రీ, సినారె తెలిపిన కవితా అభిప్రాయాలను సోపపత్తికంగా చర్చించారు.

పదిహేడవ అధ్యాయం 'కవిత్వం-తత్వం'లో కవిత్వతత్వం కవుల అభివ్యక్తిని అనుసరించి ఉందని, మతం అర్థమైతే తాత్వికత అర్థమవుతుందని తెలుగులో ప్రాచీన కవులు, ఆధునికుల్లో కొందరు ఈ తత్వాన్ని సమర్థిస్తూ రాశారని, కవిత్వం తత్వం రెండూ అవిభాజ్యమైన అంశాలని దర్శించి చెప్పారు.

పద్దెనిమిదవ అధ్యాయం 'కవితాకళ-విశ్వకళ్యాణం' అనేది. ఇందులో కవిత్వం శాశ్వతమైందని కవిత్వం మధుర జీవన కళ అని, ఛందస్సు అలంకారాల కలయిక వల్లే ఉచితమైన కవిత్వం ఉదయిస్తుందని ప్రాచ్యపాశ్చాత్య పండితుల అభివ్యక్తిని అనుశీలించి ఉదాత్తంగా రాశారు.



తిరుమల రచనలలో ఇది శిఖరం లాంటిది. తన జీవితంలో ఏడేళ్ళు శ్రమించి దాదాపు పదహారు వందల గ్రంథాలను దర్శించి ఈ 'కవితా కళ'ను రాశారు. ఇది ఉత్తమమైన సాహిత్య దర్శనం. సాహితీవేత్తలకు, ఉదీయమాన రచయితలకు ఉపయుక్త గ్రంథం. భావితరాలకు కరదీపిక.

# 6. నాటకాలు

## 1. మరీచిక (ముద్రితం)

ఆంగ్లేయుల కబంధ హస్తాలలో భారతదేశం చిక్కుకు పోయింది. ఉక్కు సంకెళ్ళ నుంచి ఆ మాతృమూర్తిని విడిపించి స్వేచ్ఛను కల్పించడానికి, పరదేశీయులను పొలిమేరల ఆవలికి తరిమివేయడానికి దేశ ప్రజలంతా ఒకే తాటి మీద ఒకే లక్ష్యంతో, ధ్యేయంతో ముందుకు సాగి ప్రాణాలను బలిదానం చేశారు. ఇది స్వాతంత్ర్యం వచ్చేదాక జరిగిన పరిస్థితి. ఇక స్వాతంత్ర్యం లభించిన పిదప ఆనాటి త్యాగశీలురను విస్మరించి, దేశ సౌభాగ్యాన్ని పెంచడం విడిచి పెట్టి నేటి యువతరం విశృంఖలంగా ప్రవర్తిస్తూ ప్రగతి వ్యతిరేకమైన సంస్కృతీ సభ్యతకు భిన్నమైన కార్యకలాపాలలో నిండుగా కూరుకుపోతూ ఆదర్శవంతమైన గమ్యాన్ని చేరుకోలేక ఎండమావులను చూచి భ్రమించి పతనమైపోతున్న జీవితాలను తిరుమల ఈ నాటకంలో చిత్రించారు. యువత పెడదారిన నడవక ముందు తరాలకు దిక్సూచిలా, మార్గదర్శకులుగా మనుగడ సాగించాలని రచయిత ఆకాంక్ష. ఈ నాటికలో ధర్మారావు, ప్రసాదరావు, పానకాలు, సత్యం, గిరిబాబు వంటి అయిదు పాత్రలున్నాయి. స్త్రీ పాత్ర లేని సాంఘిక నాటిక ఇది. గాయత్రీ పబ్లికేషన్స్, హైదరాబాదు వారు 1979లో దీనిని ముద్రించారు. తన ఆప్తమిత్రుడు విన్నకోట మురళీకృష్ణకి అంకితమిచ్చారు. "గేయ రచయితగా మంచి దక్షత కనబరుస్తూన్న ఆచార్య తిరుమల మంచి నాటకాన్ని రాసి ఆ ప్రక్రియలోనూ అనుభవాన్ని ప్రదర్శించడం అభినందనీయం"[33]అని ఎల్లోరా 'తిలకం' దిద్దారు.

హైదరాబాద్ ఏ.జి. ఆఫీస్ వారు నిర్వహించిన నాటకాల పోటీల్లో ఉత్తమ రచన, ఉత్తమ నటుడు, ద్వితీయ ఉత్తమ ప్రదర్శన బహుమతులు అందుకుంది ఈ నాటకం. కళాసాహితి, హైదరాబాదు వారు నిర్వహించిన నాటకాల పోటీల్లో ఉత్తమ రచన, ఉత్తమ సహాయ నటుడు బహుమతులు అందుకుంది.

## అముద్రితాలు

## 2. కీచకవధ

ఆచార్య తిరుమలకు విశిష్టమైన, విశేషమైన పేరు తెచ్చిన నాటకాలలో 'కీచకవధ' ఒకటి. వంశీ ఆర్ట్ థియేటర్, హైదరాబాదు కళాకారులు అమెరికాలో నలభైమార్లు ఈ నాటకాన్ని ప్రదర్శించి అక్కడి వాళ్ళ ప్రశంసలు పొందారు. ఒకనాటి ప్రదర్శనకు ప్రముఖ

సినీనటుడు నందమూరి బాలకృష్ణ ముఖ్య అతిథిగా వచ్చారు. 'నర్తనశాల, విరాటపర్వం వంటి పౌరాణిక సినిమాల్లో మా నాన్న గారు (యన్.టి.ఆర్) పోషించిన పాత్రలను ఇట్లా ఖండాంతరాల్లో ప్రదర్శిస్తూ తెలుగు తేజాన్ని మరింతగా ప్రజ్వలింప జేయడం గర్వంగా ఉందని' ప్రదర్శనను అభినందించారు. తిరుమల ఈ నాటకంలో శ్రీకృష్ణ పాత్రను కల్పించి సంప్రదాయంలో మార్పును తెచ్చి ఒక నవ్య సంప్రదాయాన్ని ప్రతిపాదించారు. పంచభీమ ప్రహసనంలో శ్రీకృష్ణుని ప్రమేయం లేని సన్నివేశం కీచకవధ. సంస్కృత భారతంలో చెప్పబడినట్టుగా శ్రీకృష్ణుడు ఒక అద్భుత శక్తి వలన పాండవులు అజ్ఞాతవాసంలో ఎలాంటి చిక్కుల్లో పడకుండా ప్రశాంతంగా, ప్రతిభావంతంగా బయట పడగలిగారన్నది ఈ నాటకంలోని అంతస్సూత్రం.

## 3. శక పురుషుని జననం (టి.వి. నాటకం)

ప్రభువైన ఏసుక్రీస్తు జననం శిలువ మీద ప్రాణాలు ధార పోయడం పరివర్తన తేవడానికేనన్నది ఈ నాటికలోని వస్తువు. ఇశ్రాయేలు దేశంలో దావీదు వంశీయుడైన యోసేపు మరియలకు యెహోవా దేవుని దయవల్ల గాబ్రియేలు దూత ప్రమేయం, సందేశం వల్ల లోక రక్షకుడు జన్మించాడు. రోమ్ చక్రవర్తి ఆదేశం మేరకు ప్రజా సంఖ్యలో తమ పేరును నమోదు చేయించుకోవడానికి యోసేపు తన భార్య మరియతో నజరేతు నుంచి యూదయలోని దావీదు పట్టణం అనబడే బెత్లహేము చేరుకుంటారు. పట్టణమంతా జనంతో కిక్కిరిసి పోవడం వలన వారికి పశువుల పాక ఆశ్రయమైంది. అక్కడే లోకోద్ధారకుడైన ఏసు జన్మించాడు. దేవదూత తెలపగా గొర్రెల కాపరులు క్రీస్తును దర్శించి, కానుకలర్పించి స్తుతిస్తారు. తూర్పుదేశపు జ్ఞానులు ఆకాశంలోని వింత నక్షత్రాన్ని అనుసరిస్తూ క్రీస్తును దర్శించి బంగారం, సాంబ్రాణి, బోళం వంటి ఘనమైన కానుకలు అర్పించి ఆరాధించారు. ఆ శిశువుకు 'యేసు'అని పేరు పెట్టారు. పరిశుద్ధాత్మతో పుట్టిన ఆయన మరణం లోకానికి రక్షణనిచ్చినట్లే ఆయన పునరుత్థానం కూడా మానవాళికి సౌభాగ్యాన్ని ప్రసాదించింది. ఈ నాటకాన్ని తిరుమల చక్కని సంభాషణలతో రక్తి కట్టించారు. సన్నివేశాన్ని అనుసరించి పాటలు కూడా రాశారు. ఈ నాటిక హైదరాబాదు దూరదర్శన్ ద్వారా ప్రసారమైంది.

## 2. అల్లుడూ పామొచ్చింది (నాటిక)

నవ్వుల పువ్వులతో తొణికిపోతున్న నాటిక ఇది. పల్లె వాతావరణం ఇందులో ప్రధానంగా చెప్పబడింది. కొత్తగా పెళ్లైన అల్లుడు తన అత్తవారింటికి వెళ్ళి అన్ని విషయాలు తనకే తెలుసునన్నట్లుగా ప్రగల్భాలు పలుకుతుంటాడు. తనంత ధైర్యవంతుడు ఈ లోకంలో లేనట్లుగా బీరాలూ, ఫోజులూ విసురుతుంటాడు. కొత్త అల్లుని అత్త చాలా గడుసరి. అల్లుణ్ని కాస్త ఆట పట్టించాలని అనుకొని ఒక పొడవైన గుడ్డను ఇటుకల కుప్పలో దాచిపెట్టి పామొచ్చినట్టుగా భయపడుతూ అరుస్తూ అల్లుణ్ని రమ్మనికేకలేస్తుంది. పాముని చంపమని తొందర చేస్తుంది. అల్లుడు పామును చూసి భయంతో వణికి పోతాడు. ఏవో సాకులు చెబుతూ వెనకడుగు వేస్తాడు. అత్త లోలోపల నవ్వుకుంటుంది. ఇంతలో పక్కింటి నుంచి



పెద్ద శబ్దం విన్పిస్తుంది. ఆ ఇంటి యజమాని ఓ పామును చంపి బయటకు తీసుకు వస్తాడు. ఈ నాటికలో అత్త, కూతురు, అల్లుడు మూడు ప్రధాన పాత్రలు. సుళువైన, చురుకైన సంభాషణలలో ఈ నాటిక వెల్లువెత్తి పోతుంది. నాటికలో సమున్నతంగా ఎదిగిన ఆకెళ్ళ, ఏకాంబరం, శారదా శ్రీనివాసన్ ఇందులో ముఖ్య పాత్రలను పోషించారు. ఆకాశవాణిలో ప్రసారమైన ఈ నాటిక 'ఉత్తమ హాస్యనాటిక' అవార్డును అందుకుంది.

## 5. తుమ్మ జిగురు

పట్టణంలో బతకడమంటే అంత తేలికైన పనికాదు. ఇక బంధువులొస్తే ఆ కుటుంబం ఎంతగా చితికి పోతుందో చెప్పలేం. ఆ రీతిని వివరిస్తుంది ఈ నాటిక. ఒకాయన పట్టణంలో ఉన్న ఒకరి ఇంటికి వెళ్ళి తాను వాళ్ళ దూరపు బంధువునని చెప్పి తిష్ట వేస్తాడు. అంటే తుమ్మ జిగురులా ఇంటికి అతుక్కుపోతాడు. ఒకే గదిలో పిల్లలతో కాపురముంటున్న ఆ కుటుంబానికి దూరపు బంధువు తుమ్మజిగురులా అంటుకుపోవడం చాలా ఆవేదనను కలిగిస్తుంది. కష్టాలను తెచ్చిపెడుతుంది. మూడు పాత్రలున్న నాటిక ఎదుటి వారి కష్టాలను అర్థం చేసుకొని ఆత్మీయంగా మెలగాలన్న సందేశాన్ని అందిస్తుంది. సంభాషణలు సన్నివేశాన్ని మరింత పరిపుష్టం చేసేలా ఉన్నాయి. ఇది చక్కని సందేశాత్మక నాటిక.

## 6. మారిన మనిషి

MLA వీరభద్రరావు చాలా కర్కశమైన మనస్సు ఉన్నవాడు. కఠినంగా ప్రవర్తిస్తుంటాడు. అవినీతి అతని ఊపిరి. ఎన్నుకున్న ప్రజల రక్తాన్ని కూడా జలగలా పీల్చేసే నియంత. ఉద్యోగం కోసం వచ్చిన జయరాంను అవమానించి పంపిస్తాడు MLA చేత అవమానింపబడిన ఆ యువకుడు పట్టుదలతో చదివి కలెక్టర్ అవుతాడు. గతంలో అవమానించిన విషయాన్ని విస్మరించి తాను పంచ ప్రాణాలుగా చూసుకుంటున్న తన ముద్దుల కూమార్తె సుజాతను జయరాంకు ఇచ్చి పెళ్ళి చేస్తాడు. వివాహమైన కొద్ది రోజుల పిదప తనను ఇంతకు ముందు అవమానించిన విషయాన్ని భార్య ముందు జ్ఞాపకం చేస్తాడు. వీరభద్రరావు హృదయంలో పరివర్తన తేవడానికి భార్యాభర్తలిద్దరూ పథకం వేస్తారు. ఈ నాటకంలో ముందుగా కలెక్టర్ తన భార్యను పుట్టింటికి పంపిస్తాడు. నిన్ను నాయకునిగా ఎన్నుకున్న నియోజకవర్గ ప్రజల బాధలను పట్టించుకోకుండా కన్న కూతురు మీద మమకారం చూపించడం ఉచితంకాదని హెచ్చరిస్తాడు అల్లుడు కలెక్టర్. ఇది నీ స్వార్థపూరితమైన గర్వానికి ప్రతీకయని మందలిస్తాడు. ఈ పలకరింపు వీరభద్రరావులో కొంత ఆత్మీయతను సృజిస్తుంది. దిగివస్తాడు. ఏమి చేయాలో చెప్పమంటాడు. మారాలని మామగారికి షరతు పెడతాడు. కూతురు సౌఖ్యం కోసం మారతాడు వీరభద్రరావు. పిదప ఇదంతా తన బిడ్డా అల్లుడు కలసి ఆడిన నాటకమని గుర్తిస్తాడు. ఉద్యోగం కోసం వచ్చి తన చేత అవమానింపబడిన వ్యక్తే తనకు అల్లుడయ్యాడని తెలుసుకొని ఆశ్చర్యపడతాడు. చేసిన తప్పుకు తలదించుకుంటాడు.

ఈ నాటకాన్ని ఏలూరు కలెక్టరేట్, రెవెన్యూ ఉద్యోగులు ప్రదర్శించారు. ఉత్తమ

ప్రదర్శనగా ప్రేక్షకుల ఆదరణ పొందింది. ఈ సీరియల్ నాటకాన్ని కళాసాహితి, హైదరాబాదు వారు యువవాణి ద్వారా సమర్పించారు.

## 7. మమత (Air Play)

డాక్టర్ శేఖరం మమతను ప్రేమిస్తాడు. ఆయన అంతర్యాన్ని మమత ఇష్టపడుతుంది. ఇద్దరి హృదయాలు ఏకమవుతాయి. కానీ, శేఖర్‌లో మార్పువస్తుంది. మమతను పెళ్ళిచేసుకోవడానికి అతడు ఆసక్తి చూపడు. ఒక్క మనస్సుగా, ఒక్క మాటగా, ఒక్క బాటగా ఉన్న శేఖర్ తనను పెళ్ళి చేసుకోవడానికి ఎందుకు నిరాకరిస్తున్నాడో ఆమెకు అర్థం కాదు. ఒకసారి మమత డాక్టర్ ఇంటికి వెళుతుంది. ఆయన రాసుకొని దాచుకున్న రహస్యాన్ని చదివి ఆశ్చర్యపడుతుంది. తనలో ఉన్న జబ్బును గమనించి తనతో పెళ్ళికి నిరాకరిస్తున్నాడని అర్థం చేసుకొని తనంత తానుగా డాక్టర్‌కు దూరం అవుతుంది.

## 8. పాలకోసం

ఉదయం పాల బూత్ దగ్గర జనం పాలకోసం పడిగాపులు పడుతూ క్యూలో నిలబడి అవస్థలు పడతారు. ఏవేవో సణుగుతుంటారు. మరి కొందరు కరుకుగా మాట్లాడతారు. ఇంకొందరు చతురోక్తులతో నవ్విస్తుంటారు. ఇవన్నీ ఈ హాస్యనాటికలో చిత్రింపబడినాయి. రతన్ ప్రసాద్, రేడియో అన్నయ్య, రవివర్మ ఈ నాటికలో పాత్రలను పోషించారు.

## 9. చిన్న మామయ్య

ఆకాశవాణి హైదరాబాదు కేంద్రం నుంచి ప్రసారమైన తిరుమల నాటకాలలో ఇదొకటి. ముఖ్యంగా పరిమిత కుటుంబాన్ని ప్రబోధించే నాటిక. అయిదుగురు ఆడపిల్లల తండ్రి పడుతున్న అవస్థను చూసి బావమరిది ఇచ్చిన సలహా మేరకు కుటుంబ నియంత్రణ పాటిస్తాడు. వంశోద్ధారకుడు కావాలన్న తపనతో అయిదుగురు ఆడపిల్లలను కని ఆవేదనను అనుభవిస్తున్న ఒక అధ్యాపకునిలో ఆయన బావమరిది మార్పు తెస్తాడు. జాతికి వెలుగులను ప్రసాదించవలసిన ఉపాధ్యాయుడు కొడుకు కావాలని నిరీక్షిస్తూ స్త్రీ సంతానాన్ని పెంచుకోవడం ఉచితం కాదని, ఒక వేళ కొడుకు పుట్టినా అతనికి మిగిలేదేముంటుందని అతని బావమరిది మందలిస్తాడు. సంఖ్యను పెంచడం అనర్థమని చెబుతాడు. బావమరిది హితోక్తులు ఆయనకు రుచిస్తాయి. ఆపరేషన్ చేయించుకుంటాడు. అప్పటికీ గర్భవతిగా ఉన్న ఆయన భార్య మగ శిశువుకు జన్మనిస్తుంది. కుటుంబంలో అందరూ ఆనందిస్తారు. తమ చిన మామయ్య కన్న తండ్రి కళ్ళు తెరిపించినందుకు ఆడపిల్లలు ఆయనను అభినందిస్తారు.

## 10. కేశవిజయం

విద్యార్థికి జుట్టు పెంచుకోవడం ఒక ఫ్యాషను. యువకులంతా అలా ఉంటే క్షౌరశాల యజమానికి గిరాకీ ఉండదు. అతని జీవితం సాగడం కష్టంగా ఉంటుంది. ఇదీ పరిస్థితి. ఈ సన్నివేశంలో విద్యార్థులకూ, మంగలికి, మంత్రికి, ఆయన పి.ఏ.కు మధ్య రసవత్తరమైన చర్చ జరుగుతుంది. హాస్యం తారాస్థాయిని అందుకుంటుంది. ఇందులో హాస్యంతో పాటు జుత్తు బాగా పెంచుకోవడం వలన ఏర్పడే వికృత రూపాన్ని కూడా రచయిత చిత్రీకరించారు.

## 11. వరకట్నం

వరకట్నం ఒక దురాచారం. కట్నాలనీ, కానుకలనీ, లాంఛనాలనీ, సంప్రదాయాలనీ, ముద్దుమురిపాలనీ ఆడపిల్లల తల్లిదండ్రుల ప్రాణాలను పీలుస్తూ వాళ్ళ కన్నీళ్ళతో దాహం తీర్చుకుంటున్న వాళ్ళ ఆశల అగ్నిగుండంలో మాధవి లాంటి అనామకులు ఎందరో బుగ్గిపాలు అవుతుంటారని ఈ నాటిక తెలుపుతుంది. సమాజాన్ని నిలువెల్లా వణికిస్తున్న ఈ దురాచారం కూకటి వేళ్ళతో నశించిపోవాలని తిరుమల బలంగా ఈ నాటికలో అభివ్యక్తీకరించారు.

## 12. సమత

శశికిరణ్ గొప్ప విజ్ఞాన శాస్త్రవేత్త. కోదండ రామయ్య కూతురు సమత అతడిని గాఢంగా ప్రేమిస్తుంది. మనస్సునూ, తనువునూ ఇచ్చుకుంటుంది. కానీ, కోదండ రామయ్య తాను స్వయంగా పెంచుకున్న విమల్‌కు సమతనిచ్చి వివాహం జరిపించాలనుకుంటాడు. సమత అందుకు నిరాకరిస్తుంది. శశికిరణ్ విమాన ప్రమాదంలో మరణిస్తాడు. ఒంటరిదైన సమతను ఓదార్చి తనను పెళ్ళిచేసుకోకపోయినా కడుపులో ఎదుగుతున్న బిడ్డ కోసమైనా బతకాలని విమల్ చెబుతూ ఒప్పిస్తాడు. రవీంద్ర, సమత, శశికిరణ్‌ల పవిత్ర ప్రణయానికి ప్రతీకగా ఎదిగి గొప్ప పరిశోధకుడిగా పేరు తెచ్చుకుంటాడు. విమల్ సంతోషిస్తాడు.

## 13. పుట్టింటికి

పరిమిత కుటుంబాన్ని ప్రబోధిస్తుంది ఈ నాటిక. శ్రీపతి భార్య మూడో కాన్పుకు పుట్టింటికి వెళుతుంది. అప్పుడు తన అయిదేళ్ళ కూతురు ఆలనా పాలనా చూడడం, కాశీపతి రాగాల నుంచి తప్పించుకోవడం ఆయనకు తలకు మించిన భారమైంది. ఇలా ప్రతి ప్రసవానికి భార్య పుట్టింటికి వెళితే తనకు ఇలాంటి బాధలు కలుగుతాయని, కుటుంబ నియంత్రణ పాటిస్తే తన ఆపదలు అంతరించిపోతాయని, ఇక ఎప్పుడూ తన అర్ధాంగి తనతో పాటే ఉంటుందని శ్రీపతి ఆలోచించి 'ఫ్యామిలీ ప్లానింగ్' ఆపరేషన్ చేయించు కుంటాడు. కుటుంబం పెరగడం వలన ఎన్ని అనర్థాలు మనిషిని వేధిస్తాయో ఈ హాస్య నాటికలో తిరుమల చక్కగా చిత్రించారు.

## 14. పరిచయం

పేర్లలో కూడా హాస్యాన్ని పోషించి తిరుమల రాసిన మరో మంచి నాటిక ఇది. ఆకాశవాణి చెణుకులు ఆధారంగా రాసిన ఈ నాటికలో 'పోరంబోకు' సాంస్కృతిక సమితి కార్యదర్శి, కవి పిచ్చిశ్రీ, చిత్రకారుడు చిత్రారావు, ఉపన్యాసకుడు చిత్రహింస, ఖడ్గచిత్ర, గాయకుడు రాగరాక్షస, నాయకుడు వీరబోడి అనేవి పాత్రలు. వీరి పరస్పర పరిచయం చివరిదాకా కడుపుబ్బ నవ్విస్తాయి. ఈ నాటిక చక్కని హాస్యరసానికి ప్రతీకగా ఉంది. ఈ

నాటికలో కవి పిచ్చిశ్రీ అనుభవాలలో ఇదొకటి.

నేనొక సుందరాంగి కదనిల్చి చివాలున పల్కరించి, చే

యానెదు నంతలోన దవడంతయు దెబ్బకు వాచిపోయె - నా

ప్రాణము పోయెనే అనుచు బావురు మంటిని లాభమేమి?

మానస మందేదో ధనేల్ మన్నది దవడ విలాప కావ్యమై"[34]

# 7. నృత్య నాటికలు

## 1. రతీ మన్మథ

కుమార సంభవం ఇతి వృత్తంగా మలచబడిన నృత్య నాటిక ఇది. విస్తృత స్వరూపంలో ఉన్న కథను సంక్షిప్త పరచి రాగతాళయుక్తంగా తిరుమల ఈ నృత్య నాటికను సంతరించారు. సంగీత సాహిత్యాల సమ్మేళనం ఈ కృతిలో కమనీయంగా కూర్చబడింది. ఈ నృత్యనాటిక కల్చరల్ అసోసియేషన్ VST వారిచే రవీంద్రభారతిలో ప్రదర్శింపబడింది.

## 2. అష్టవిధ నాయికలు

లక్షణ గ్రంథాలలో, కావ్యాలలో ఉన్న అష్టవిధ నాయికలు ఈ నృత్య నాటికలో వర్ణింపబడినారు. తిరుమల ఈ నాయికల తత్వాన్ని లలిత పదాలతో అపురూపంగా తీర్చిదిద్దారు. ఈ నృత్య నాటిక అంతా ఒక రసవాహినిలా సాగుతుంది. నృత్య కారిణి సరళకుమారి వైవిధ్యమైన లక్షణాలున్న ఈ అష్టవిధనాయికలను రవీంద్ర భారతిలో, ఢిల్లీలోనూ ప్రదర్శించి బాగా మెప్పుపొందారు.

## 3. తాండవలీల

లోకాద్భుతమైన శివతాండవాన్ని తిరుమల 'తాండవలీల' పేరుతో రాశారు. నృత్య ప్రధానంగా ఉండే ఈ కృతిలో సప్తవిధ తాండవాలను వర్ణించారు. ఈ భంగిమలను నృత్య కళాకారిణి సరళకుమారి అభినయించి ఉత్తమ కళాకారిణిగా రాణింపు తెచ్చుకున్నారు. ఇందులో శివపార్వతీ పరమైన పదబంధాలు సంగీత గమకాలు ఉదాత్తంగా చిత్రింపబడినాయి.

## 4. ప్రణయ వరూధిని

మను చరిత్ర వరూధినీ ప్రణయ ఘట్టమున్న రెండవ ఆశ్వాసంతో విఖ్యాతి పొందిందని విమర్శకులంటున్నారు. కృష్ణుని కోసం రాధ. గోపికలు - రాధ గోపికలను తలుస్తూ కృష్ణుడు అనుభవించే పారవశ్యం హృద్యంగా అభివర్ణితమైంది. ఈ సంగీత రూపకంలో రాధాతత్వం ఉదాత్తంగా చిత్రింపబడింది.

## 5. మనసుతో మాట్లాడితే

మనస్సులో మంచి చెడులకు మధ్య ఘర్షణ జరుగుతూనే ఉంటుంది. చివరకు



మంచి గెలుస్తుంది. కవి సామాజికమైన వృత్తాన్ని తీసుకొని మనస్సును కేంద్ర బిందువుగా మలచి ఈ కృతిని తీర్చిదిద్దారు. నిత్య జ్వలనమైన సమాజంలో మంచి మనస్సు అమృతం లాంటిది. చెడును కాల్చివేసే అనలం లాంటిది. మంచి మనస్సుకు ఉన్న అత్యున్నతమైన స్థానాన్ని సమాజాభ్యుదయం కోసం అది ప్రస్థానిస్తున్న విషయాన్ని ఇందులో తెలిపారు.

## 6. మహాత్ముడు

గాంధీజీ అహింసా సిద్ధాంతం, సత్యాగ్రహం వంటి అపూర్వమైన అంశాలను ఆయుధాలుగా మలచి భారతావనికీ స్వాతంత్ర్యాన్ని తెచ్చిపెట్టారు. ఒక్క నెత్తుటి చుక్క కూడా నేల మీద చిందకూడదని ఆయన అభిమతం. అలాంటి మానవీయమైన ఆశయాలతో, ఉజ్వలమైన ఆదర్శాలతో ప్రపంచ మానవాళిని ఆకట్టుకున్న మానవోత్తముడాయన. తిరుమల గాంధీజీ ఆశయాలను భవిష్యద్దర్శనాలుగా ఈ రచనలో పొందుపరిచారు. సరళమైన శైలిలో సంగీతాన్ని మేళవించి ఆయన కృతికి రసాకృతి కలిగించారు. ఈ వస్తువులో కవి గాంధీజీని మహాత్ముడిగా దర్శించారు.

## 7. చేతనా కేతనం

ఎన్నో వనరులున్న భారతదేశం వాటిని సద్వినియోగపరచుకొని అన్ని రంగాలలో ప్రగతిని సాధించాలని కవి ఆశయం, చేతనాకేతనంగా ఆవిష్కరింపబడింది. దేశభక్తి తత్వాన్ని ఎత్తి చూపే రూపకం ఇది.

## 8. సంక్రాంతి సంబరం

సంక్రాంతి అంటే అందరి హృదయాలు ఆనంద తాండవం చేస్తాయి. అన్ని పంటలు ఇళ్ళకు రావడంతో రైతులు, వీరితో పాటు మిగతా ప్రజలు ఉప్పొంగిపోతారు. వాకిళ్ళను ముగ్గులతో ఇళ్ళను పచ్చని తోరణాలతో, పూలతో అలంకరించడం తెలుగు నేలంతటా కన్పిస్తాయి. గొబ్బి పాటలతో ప్రతి ప్రాంగణం ఒక రసతరంగిలా కన్పిస్తుంది. పండగ వేళ సాతాను జియ్యరు, గంగిరెద్దుల వాళ్ళు, బుడబుక్కల వాళ్ళు మరెందరో జానపద గాయకులు తమ పాటలతో తెలుగు పల్లెలను పరవశింపజేస్తారు. ఆచార్య తిరుమల ఈ సన్నివేశాలను ఆహ్లాదకరంగా అభివర్ణించారు.

## 9. చైతన్య భారతి

ప్రతి మనిషి మనస్సులో దేశభక్తి ఉండి కష్టపడి పని చేస్తే దేశం ప్రగతి పథంలో ముందడుగు వేస్తుందనే సందేశాన్ని అందించే రూపకం ఇది.

## 10. పుష్ప కేతనం

వసంతోత్సవ ప్రాధాన్యతను తెలిపే రచన ఇది. వసంతం లాంటి శైలిలో తిరుమల ఈ రూపకాన్ని రచించారు. ఇది ఆకాశవాణి హైదరాబాదు కేంద్రం ద్వారా ప్రసారమై శ్రోతలను బాగా స్పందింపజేసింది.

# 8. సంగీత రూపకాలు

## 1. స్వేచ్ఛా భారతి (ముద్రితం)

హైదరాబాదు 'శ్రీనివాస సాహితీ సమితి' 1980లో అచ్చొత్తించిన సంగీత రూపకం ఈ కావ్యం. ఈ రూపకాన్ని సభా సమ్రాట్ కె.వి. భాస్కర రావుకు అంకితం చేశారు. ఈ రూపకం అంతటా దేశభక్తి పరచుకొని ఉంది. ఆయన

"తల్లి మనసులా భూమి ఎంత విశాలం!
అందుకే -
తను ఉదయించటానికి ఆధారమైన తల్లికంటే తను
కాలూనటానికి, తను నిలబడి మనుగడ సాగించటానికి
ఆధారమైన ఈ భూమి ఎంత గొప్పది"[35]

అని దేశానికి అంజలిస్తారు. ఇది లఘు కావ్యమైనా ప్రతి మనిషికీ దేశభక్తి పరమార్థాన్ని, ఔచిత్యాన్ని తెలుపుతుంది. 'అక్షర శిల్పం' పేరుతో పరిచయం చేసిన ప్రముఖ సంగీత వేత్త ఎం. చిత్తరంజన్ సాహిత్య రూపకం అని గౌరవించారు. ఇది సత్యసన్నిహితమైన మాట. 'స్వేచ్ఛా భారతి'లో తన మాట రాసుకుంటూ తిరుమల "ఇటువంటి దేశభక్తి పూరితమైన రచనలు చెయ్యాలంటే నిజాయితీ, నిజమైన స్పందన వుండాలి"[36]అన్నారు. ఆధునిక కవిత్వంలో దేశభక్తి ప్రేరకమైన కావ్యాలలో 'స్వేచ్ఛా భారతి' ఒక అందాల రసరేఖ. ఎప్పుడూ వెలుగులను పంచే మయూఖ.

### అముద్రితాలు

## 2. పారవశ్యం

ఈ సంగీత రూపకంలో రాధ, గోపికలు, కృష్ణుడు పాత్రలు. తిరుమల పెద్దన మను చరిత్ర నుంచి వరూధినీ ప్రవరుల ఘట్టాన్ని తీసుకొని రమణీయ భావుకతతో నృత్య రూపకంగా సంతరించారు. ప్రవరుడు సిద్ధుని పాదలేపన ప్రభావంతో హిమగిరికి వెళ్ళడం, అక్కడి ప్రకృతి అందాలను చూసి ముగ్ధుడవడం, నీహారంపై అడుగులు పడడంతో పాదలేపనం కోల్పోడం, వరూధిని అర్థించిన ప్రణయాన్ని తిరస్కరించడం, అగ్నిహోత్రుని సహకారంతో తన జన్మస్థలం అరుణాస్పదపురం చేరడం వంటి సన్నివేశాలను కవి హృదయంగమంగా అభివర్ణించారు. తిరుమలకు బాగా పేరు తెచ్చిన నృత్య రూపకాల్లో ఇదొకటి. ఈ నాటిక ఆంధ్రదేశంలో చాలా ప్రాంతాలలో ప్రదర్శింపబడింది.

## 3. నాగబంధం

సహజ ప్రేమికులు, మధుర భావుకులు నాగదంపతులు. వాళ్ళది ఆర్ద్రమైన ప్రణయం. ప్రణయం నుంచి కట్టలు తెంచుకున్న విరహం ఇందులోని కథా వస్తువు. ప్రకృతి అందాలలో



రెండు హృదయాలను ఏకం చేసుకొని జీవితాలను సుకుమారంగా పండించుకున్న నాగదంపతుల పవిత్ర బాంధవ్యాన్ని కవి నిసర్గ రమణీయంగా కీర్తించారు.

## 4. సర్వజ్ఞ శంకర

జగద్గురు శంకరాచార్యుల అవతారం ఎంతో విశిష్టమైంది. మానవాళి ఆదర్శాలను రాల్చేసుకొని అమానుషకృత్యాలను ఆదరిస్తున్న తరుణంలో శంకరులు అవతరించి భారతదేశం అంతటా పర్యటిస్తూ భారతీయ సంస్కృతినీ, సంప్రదాయాన్ని జాతికి అందించారు. ఆయన దివ్యవాణి ఈ దేశానికి మాత్రమేకాక నిఖిల విశ్వానికి శ్రేయస్సును కలిగించేది. ఆ స్వామి అవతారం లోక సంరక్షణార్థమే. తిరుమల స్వామి వారి జీవిత వృత్తాన్ని, ఆయన తత్వాన్ని ఉదాత్తంగా రాశారు.

## 5. భవానీ రసవిలాసం

ఇదొక ప్రయోగాత్మక నృత్య నాటిక. కవి నవ రసాల్లో పార్వతీ దేవి లోకోత్తర తత్వాన్ని ఔచితీ స్ఫోరకంగా ఇందులో వర్ణించారు. ఇలాంటి వస్తువును రసాలలో మూర్తి కట్టించడం అసాధారణమైన విషయం. ఇది జటిలమైన విషయమైనా దీన్ని సర్వజనామోదంగా సంతరించారు తిరుమల.

## 6. నారాయణ గురుదర్శనం

కేరళ రాష్ట్రంలో ఆశ్రమాలు ఏర్పాటు చేసి, దైవత్వాన్ని మానవత్వంలో చూడమంటూ ప్రబోధిస్తున్న ఆధునిక ప్రవక్త శ్రీ నారాయణగురు గూర్చి తిరుమల రాసిన సంగీత రూపకం ఇది.

# 9. గేయ కథలు

## 1. గాడిద గర్జించింది

సింహం, గాడిద ఈ రెండూ జంతువులైనప్పటికీ స్వభావంతో స్వరూపంలో వేర్వేరుగా ఉంటాయి. సింహం గర్జించడాన్ని విని గాడిద తాను కూడా అలా అనాలనుకుంటుంది. ప్రయత్నించి నవ్వులపాలవుతుంది. అనుకరణం మంచిదే అయినప్పటికీ అది అన్ని వేళలా పని చేయదు. తన జాతి ధర్మాన్ని తాను అనుసరించి ఆచరిస్తే అదే తృప్తిని, ఆనందాన్ని, చివరకు ఆదర్శాన్ని ఇస్తుంది. ఈ కథలో గాడిద అపహాస్యం పాలవడాన్ని సమాజం గుర్తించి ఆ మార్గంలో పయనించకూడా ఉండాలని తిరుమల పరవస్తు చిన్నయసూరిలా సమాజానికొక సందేశాన్ని ఈ గేయ కథ ద్వారా అందించారు.

## 2. ఐకమత్యం

ఐకమత్యం అనేది అన్నింటికన్నా విలువైంది. పోట్లాడుకుంటే మానవ విలువలు

నశిస్తాయి. కలహాలు కాదు స్నేహం కావాలి. స్నేహం పవిత్రంగా ఉంటేనే ఐక్యత వర్ధిల్లుతుంది. అలాంటప్పుడు ఎంతటి విపత్తునుంచైనా తప్పించుకోవచ్చు. ఇది మనుషులకు మాత్రమే కాక పశుపక్ష్యాదులకు కూడా ఉంటుంది. ఎలుక కాకి ఐకమత్యంతో ఉంటూ వేటకాని సొంతంకానున్న తాబేలును ఆదుకోవడం అనే విషయాన్ని తిరుమల రసజ్ఞులు పొంగి పోయే విధంగా రాశారు.

## 3. కోతి-మొసలి

మోసగాళ్లతో స్నేహం చేయడం వలన వచ్చే ఆపదను వివరిస్తుంది ఈ గేయ కథ. మొసలి భార్య కోతి గుండె కాయ తనకు కావాలని తన భర్తను అడుగుతుంది. మొసలి తన భార్య కోరికను తీర్చడానికి కోతితో చెలిమి చేస్తుంది. కోతి మొసలి అంతర్యాన్ని గమనించి ఉపాయంతో ప్రాణాపాయం నుంచి తప్పించుకుంటుంది. వంచకులతో స్నేహం చేయడం వల్ల ఎదురయ్యే అనర్థాన్ని, ఆపదలు ఎదురైనపుడు తనను తాను కాపాడుకునే చతురతను ఈ కథ వివరిస్తుంది.

## 4. పిచ్చుక-ఏనుగు

కండబలం, బుద్ధిబలం ఈ రెండూ అవసరమే. అయితే సమయాన్ని అనుసరించి వీటిని వాడుకోవలసి ఉంటుంది. ఒక పిచ్చుక తనకు అపకారం తలపెట్టిన ఏనుగును తన మిత్రులైన వడ్రంగి, పిట్ట, తుమ్మెద, కప్ప సహాయంతో చాకచక్యంగా బుద్ధిబలంతో ఒక గోతిలో పడేసి చంపేస్తుంది. కండబలం ఉన్న ఏనుగు ఎంత గర్విస్తే ఏమిటి? అల్ప ప్రాణుల చేతులలో ఘోరంగా ఓడిపోయి మరణించింది. కండబలం కంటే బుద్ధిబలం గొప్పదని ఈ గేయ కథ చెబుతుంది.

## 5. మాయాదీపం

అల్లావుద్దీన్ మాయల ఫకీర్ చేతికి దొరుకుతాడు. అతడు చాలా చురుకైనవాడు. తన తెలివితేటలను చూసి అతని మోసాన్ని జయిస్తాడు. మాయాదీపాన్ని తన సొంతం చేసుకుంటాడు. దాని సహాయంతో అల్లావుద్దీన్ గొప్ప ధనికుడవుతాడు. పిదప ఆ దేశాన్ని పరిపాలించే రాజు కుమార్తెను వివాహమాడి సుఖంగా జీవిస్తాడు. ఇది ఈ గేయ కథలోని స్థూల వస్తువు. తిరుమల ఇందులో అల్లావుద్దీన్ చతురతనూ, పట్టుదలనూ చక్కగా వర్ణించారు.

## 6. బాల వీరుడు

రాము అంగవికలుడు. అతని తండ్రి రైల్వే శాఖలో గ్యాంగ్‌మెన్‌గా పని చేస్తూంటాడు. ఒకనాడు రాము తండ్రికి ఆహారం తీసుకొని వెళుతుంటాడు. దారిలో తెగిపడిన రైలు పట్టాలు కన్పిస్తాయి. అదే సమయంలో రైలు బండి వస్తుంటుంది. అది కాసేపటిలో ప్రమాదానికి గురవుతుందని భావించి తన అంగవైకల్యాన్ని కూడా లెక్క చేయక పరుగులు పెడుతూ తాను ధరించిన ఎర్ర చొక్కాను చూపిస్తూ రైలును ఆపివేయిస్తాడు. ప్రమాదం నుంచి ప్రయాణికులను రక్షిస్తాడు. డ్రైవరు, ప్రయాణికులు రామును అభినందిస్తారు.



అవిటితనంతో ఉన్నప్పటికీ రాములో పట్టుదల, పరోపకార బుద్ధి బాగా ఉన్నాయి. ఇలాంటి విలువైన గుణాలు ఉంటే చాలు - అంగవైకల్యం అడ్డుకాదని ఈ గేయ కథ తెలుపుతుంది.

## 7. మేలు మరవని సింహం

క్రూర జంతువులకు కూడా హృదయముంటుందని నిరూపించే గేయకథ ఇది. బానిసగా జీవితం గడుపుతున్న ఒక వ్యక్తి యజమాని ఇంటి నుంచి తప్పించుకొని అడవికి వెళతాడు. అడవిలో కాలికి ముల్లు దిగి బాధపడుతున్న సింహాన్ని చూసి జాలిపడి ముల్లు తీసి ఉపశమనం కలిగిస్తాడు. పిదప అతడు కొంత కాలానికి యజమానికి దొరికిపోతాడు. సింహానికి ఆహారంగా వేయబడతాడు. సింహం తనకు గతంలో సహాయం చేసింది ఇతడేనని గుర్తించి అతని కాలును స్పృశించి వెనక్కు తగ్గుతుంది. ఇట్లా తనను ఆపద నుంచి ఉద్ధరించిన ఆ వ్యక్తికి కృతజ్ఞతలు తెలుపుకుంటుంది.

# 10. కథా సంపుటి - కథలు

## 1. రాళ్ళ గాజులు (కథా సంపుటి)

1968లో ప్రభు పబ్లికేషన్స్, ఏలూరు వారు ముద్రించిన ఈ కథా సంపుటిని ఆచార్య తిరుమల తన ఆప్తమిత్రులైన వట్టి వెంకటరంగపార్థసారధికి అంకితమిచ్చారు. ఈ సంపుటిలో వృత్తలేఖిని, శాంతాకారం-భుజగశయనం, వర్షించని మేఘాలు, రాళ్ళగాజులు అనే కథలు ఉన్నాయి.

### (అ). వృత్తలేఖిని:

మనిషి వృత్తంగా కనిపిస్తూ పలువిధాలైన మోసపూరితమైన కోణాలను గీస్తూ ఇతరుల జీవితాలతో ఆడుకుంటాడు. అంతేకాక మనిషి బలహీనతలు కొన్ని సన్నివేశాలలో, ఎదుటివాళ్ళ హృదయాలను గాయం చేస్తుంటాయి. ఈ అంశాలను 'వృత్తలేఖిని' కథలో రచయిత ఉదాత్తంగా పొందుపరిచారు.

### (ఆ). శాంతాకారం-భుజగశయనం

పూర్ణ హృదయం, తొణకని ప్రేమ, ఆత్మీయత ఎప్పుడూ చెడును కోరుకోవు. తమను గుర్తించే వరకూ బాధతో కుమిలిపోతుంటాయి. ఇందుకు శాంతమ్మ భూమిక ప్రత్యక్ష సాక్షం. చెవిటిదైన శాంతమ్మ తన భర్త పరాయి స్త్రీ వ్యామోహంలో పడి తనను నిర్లక్ష్యం చేస్తున్నప్పటికీ ఓర్చుకుంది. చివరకు నాగన్న వాస్తవాన్ని తెలిసికొని ధర్మారావు చొరవతో భార్యను చేరదీస్తాడు. సుఖమయమైన జీవితాన్ని గడుపుతాడు. అనామకుల జీవితాలలో నుంచి తొంగిచూసే అనేక కోణాలు ఈ కథలో ఆవిష్కరింపబడినాయి.

(ఇ). వర్షించని మేఘాలు

వృత్తాన్ని ఎక్కడి నుంచి మొదలు పెట్టినా ఒక్కటే స్థానం. ఏ కోణం నుంచి చూసినా ఒకే గమనం. ఒకే గమ్యం కూడా. ఊర్ధ్వ అధో కోణాలు, వాటి ఘర్షణలు ఎదురుగా రావడం అంతలోనే పక్కకు తప్పుకొని పోవడం వాటి లక్ష్యం. అయినప్పటికీ ఈ రేఖల పరిభ్రమణం అంత ఒక విశాలమైన గోళంలోనిదే. ఘర్షణలూ తప్పవు. ఇవన్నీ ఒక హృదయంలోని నిశ్శబ్ద భావనలే. జీవితంలోని వెలుగు నీడలకూ, సుఖదుఃఖాలకూ ఇదే సూత్రం పాదు అవుతుంది. ఇందులో నుంచి చివుళ్ళు వేస్తూలేస్తున్న లత పందిరికి సాగుతుంది. లేదా సుడిగాలి చరుపులకు ముక్కలై మట్టిలో కలుస్తుంది. ఈ ప్రతారణ సహజమే. ఇందుకు శేఖర్ జీవితం ఒక ఉదాహరణ. ఆయన సాధారణమైన స్థితి నుంచి అత్యున్నత స్థానానికి ఎదుగుతాడు. అనురాగమయి అయిన భార్యను పోగొట్టుకుంటాడు. పసికందు మశూచి విషపుకోరలలో చిక్కి మరణిస్తాడు. అంతకు ముందే వాసెక్టమి చేయించుకున్నాడు శేఖర్. ఇవన్నీ అతణ్ని అధఃపాతాళానికి తోసివేశాయి. కాంతి ప్రవాహం చీకటి అనే సముద్రంలో అడుగు పెట్టినప్పుడు దాని ఉనికి ఎంత విహీనంగా ఉండిపోతుందో ఎత్తు పల్లాలను రుచి చూస్తున్న శేఖర్ జీవితం అలా ఉందని తిరుమల ఈ కథలో చిత్రించారు.

(ఈ). రాళ్ళగాజులు

ఆశయాలను విడిచి పెట్టినప్పుడు మనిషి ఎలాంటి స్థితికి దిగజారిపోతాడో ఈ కథలో చక్కగా చిత్రింపబడింది. మురళీకృష్ణ లంచగొండి. తన అవసరాల కోసం లంచాలను లాగడాన్ని పై అధికారి గమనిస్తాడు. తన కుమార్తె పెళ్ళికి రాళ్ళగాజులు తెమ్మంటాడు. లేకుంటే ఉద్యోగం నుంచి తీసివేస్తానని బెదిరిస్తాడు. నీపై ఎన్నో ఫిర్యాదులున్నాయని హెచ్చరిస్తాడు. చేసేదిలేక మురళీకృష్ణ తన భార్య రాళ్ళగాజులను తన పై అధికారికి అందజేస్తాడు. జీవితంలో తప్పుడు పనులు చేస్తున్న మనిషి అందరికీ లోకువేనన్న సత్యాన్ని తెలుసుకుంటాడు. కొత్త జీవితాన్ని ప్రారంభిస్తాడు. ఇంతలో పెళ్ళి కావలసిన అధికారి కుమార్తె మేడపై నుంచి పడి మరణిస్తుంది. తిరిగి రాళ్ళగాజులు మురళీకృష్ణ భార్య చేతులను అలంకరిస్తాయి. తరగని తీయని వలపు, తలపు, వయసు, మనసు, భావం, జీవం, రాగం, త్యాగం, గానం, ధ్యానం, సేవనం వాటి మధురమైన రూపమే తన భార్య ఆ రాళ్ళ గాజులలో రవళిస్తుండేదని, అలాంటి గాజులు తన జీవితంలో ఒక మార్పును తెచ్చాయని మురళీకృష్ణ భావిస్తాడు. మనిషిలోని బలహీనతలు కల్లోలాలను సృష్టిస్తాయని ఈ కథలో అంతస్సూత్రంగా ఒదిగి ఉంది.

## 2. వెన్నెల వేట

కాలేజి చదువులు ముగించుకొని కొత్తగా ఉద్యోగంలో అడుగుపెట్టిన మంచి మనసున్న మనిషి జ్వలిస్తే ఎలాంటి పరిణామాలు కలుగుతాయో ఈ కథ తెలుపుతుంది.



## 3. నాపచేప పండింది

గ్రామ కరణం ప్రగతి భావాలున్న మనిషి. ఆయన తన ఊరి వాళ్లైన రావులమ్మ సోమయ్యల కొడుకు శివయ్యను పట్నంలో ఉన్నత విద్యను చదివిస్తాడు. సోమయ్య మనస్సులో తన గ్రామం కన్పిస్తుంది. ఆ ఊరిలో బడి లేకపోవడం వలన ప్రజలు అజ్ఞానంతో ఉండిపోతారన్న భావం ఆయన మనస్సులో కదలుతుంది. ఆశ వికసిస్తుంది. అది ఎందుకు నిజం కాకూడదని రచయిత తిరుమల ప్రశ్నిస్తారు. ఈ ప్రశ్న నుంచే ఎన్నో ఆలోచనలు మనిషి మస్తిష్కాన్ని కుదిపివేస్తాయి.

# 11. ఇతరాలు

## 1. వచన భగవద్గీత (ముద్రితం)

సంస్కృత భగవద్గీతకు తెలుగు వచన రూపం ఇది. అయితే కేవలం అనువాదం కాదు. వ్యాఖ్యాన రూపమైన గ్రంథం. తిరుమల 'వెలుగు తలుపు తెరవండి'లో "శ్లోకాలు, పద్యాలు అంటే చాల మందికి భయం, అర్థం కావని కష్టపడి తెలుసుకోవటానికి యిష్టంలేని వాళ్లు కొంత మంది వుంటే, తెలుసుకోవటానికి యిష్టముండి తీరక లేని వాళ్లు చాలా మంది ఉన్నారు. అందుకని, అందర్నీ దృష్టిలో పెట్టుకొని యీ సాహసం చేశాను"[37] అంటూనే "భగవద్గీత పారాయణ గ్రంథం కాదు. ఆచరణ గ్రంథం. అలాగే మత గ్రంథం కాదు. మానవాభ్యుదయ బంధం. కాబట్టి నా జాతి మరో అడుగు ముందుకు వేయాలనే కోరికతోనే నేనీ పని చేశాను"[38] అని తన అభిప్రాయాన్ని వెలిబుచ్చారు తిరుమల. ఈ 'వచన భగవద్గీత'ను 1984 డిసెంబర్‌లో 'కిన్నెర ఆర్ట్ థియేటర్స్' వారు ప్రచురించారు.

## 2. సాహితీ పీఠం

తెలుగులో వచ్చిన సిద్ధాంతాలకు, ప్రక్రియలకు సంబంధించిన వ్యాసాలు ఇందులో సంకలింపబడినాయి. ఈ వ్యాసాలన్నీ వివిధ ప్రత్రికలలో ప్రచురితమైనట్టివే.

## 3. శబ్ద శారద

ఇది ఆలోచనాత్మకమైన గ్రంథం. సంస్కృతాంధ్ర శబ్దాలకు ఉన్న పర్యాయ పదాలను సాహితీ మూల్యాలతో పరిచయం చేయడం ఇందులోని విశేషం. ఇది ఆంధ్రప్రభ దిన పత్రికలో ధారా వాహికంగా అచ్చుయింది.

## 4. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర

'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర' విశ్వవిద్యాలయాలలో ప్రయివేటుగా ఎం.ఏ. చదువుతున్న విద్యార్థుల కోసం రాయబడిన గ్రంథం. సులభశైలిలో సంక్షిప్తంగా, ఉపయుక్తంగా ఉంది. ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనం, ఆచార్య దివాకర్ల వేంకటావధాని, ఆరుద్ర వంటి సారస్వత మూర్తుల రచనలను పరిశీలించి ప్రాఙ్నన్నయ యుగం, నన్నయ యుగం,

శివకవి యుగం, దక్షిణాంధ్రయుగం, క్షీణయుగం, ఆధునికయుగం అనే యుగ విభజన చేసి విశ్లేషించి వివరించారు.

## 5. క్రీడాభిరామం

ఈ రచనకి శ్రీనాథుని క్రీడాభిరామం మూలం. కాకతి రెండవ ప్రతాపరుద్రుని కాలంలో ఓరుగల్లు స్థితి, అనాటి సాంఘికాచారాలు, సంప్రదాయాలు ఇందులోని ఇతివృత్తం. మూలం ప్రాచీనమైన్పటికీ తిరుమల అభివ్యక్తి నవ్యంగా, సహృదయ సంస్పదంగా ఉంది.

# పాద సూచికలు

1. పద్య ప్రభాస - ముందు మాట - పుట 11
2. పద్య ప్రభాస - పుట 26
3. చక్రార పంక్తి - పుట - ఆచార్య దివాకర్ల వేంకటావధాని ముందుమాట
4. చక్రార పంక్తి - చివరి అట్టపైన
5. హృదయ భారతి - 'మొఱ'లో
6. శ్రీనివాస భారతి కార్యదర్శి - ముందుమాట (శ్రీరామనామ సుధ)
7. శ్రీరామనామ సుధ - పుట 15
8. శ్రీరామనామ సుధ - పుట 10
9. 'సహృదయ భూమిక'లో మధునాపంతుల (శ్రీరామనామ సుధ)
10. పితృస్మరణ - పుట 22
11. తిరుమలతో ముఖాముఖి
12. 'యుగగీత'కు ముందుమాట 'యుగరీతి'లో డా॥ ఎన్. గోపి
13. సుధామ 'యుగగీత'కు రాసిన ముందుమాట 'సుధామయోక్తి'లో (యుగగీత)
14. సాధన సాహితీ స్రవంతి అధ్యక్షులు నరసింహాచార్య 'సాధనోక్తి'లో (యుగగీత)
15. తిరుమలోక్తి - పుట 20
16. మణిపుష్పకం - 'అంతర్నాదం'
17. మణిపుష్పకం - పుట 2
18. వాత్సల్య వల్లిక (అముద్రితం) - 'మాతృదేవోభవ'లో తిరుమల
19. గేయ నందిని - పుట 276
20. 'మాట్లాడే మల్లెలు' ఎల్లోరా ముందుమాట
21. 'మాట్లాడే మల్లెలు' సుధామ ముందుమాట
22. 'మాట్లాడే మల్లెలు' చివరి అట్టపైన
23. డా॥ ఆచార్య తిరుమల సాహితీ రజతోత్సవ సంచిక - పుట 14
24. విద్యుల్లత ముందుమాట 'కవితా వర్షం'లో డా॥ దాశరథి
25. 'విద్యుల్లత' ముందుమాట 'రాయని మాటలు'లో కె.వి. భాస్కర రావు
26. అక్షరాగ్ని ముందుమాట 'దర్పణం'లో పి.ఎస్. గోపాలకృష్ణ
27. 'అమృత నేత్రాలు' చివరి అట్టపైన
28. 'అమృత నేత్రాలు' 'సాభిరుచి'లో తిరుమల
29. వచన కవితా కాదంబిని - పుట 313
30. వచన కవితా కాదంబిని - పుట 313
31. వచన కవితా కాదంబిని - పుట 314
32. 'తెలుగు తెమ్మరలు' - ముందుమాట - 'ఆకాంక్ష'లో డా॥ ఇరివెంటి
33. 'మరీచిక' ముందుమాట 'తిలకం'లో ఎల్లోరా
34. ఆచార్య తిరుమలతో ముఖాముఖి
35. స్వేచ్ఛా భారతి - పుట 1
36. స్వేచ్ఛా భారతి - 'సింహద్వారం'లో తిరుమల
37. వచన భగవద్గీత - ముందుమాటలో తిరుమల
38. వచన భగవద్గీత - ముందుమాటలో తిరుమల



# అధ్యాయం-3

# తిరుమల కవితా దృక్పథానుశీలనం

## 1. భక్తితత్త్వం

మనస్సు పలుగతుల్లో సాగుతుంది. హృదయాన్ని చీడ పురుగుల్లాంటి ఆలోచనలు ఎక్కువగా తొలిచివేస్తుంటాయి. దూరాలోచనలకు బదులుగా దురాలోచనలు పుడుతుంటాయి. వీటి వల్ల మనిషి పతనమవుతాడు. అతని జీవితం తెగిన గాలిపటంలాగా, పరిమళాలు ఇంకిపోయిన ప్రసూనంలాగా, శిల్పమంజరులు రాలిపోయిన శిలలాగా, పువ్వులు పూయని వసంతంలా, వసంతం తొంగి చూడని మోడులా ఉండిపోతుంది. అంతకంటే మరో విషయమేమంటే అహంభావం, దురహంకారం లాంటి అసుర భావనలతో మానవుడు క్రమంగా దానవుడవుతాడు. ఇలాంటి ఆకతాయిల వల్ల సమాజం నిలువునా నాశనమైపోతుంది. వేళ్ళు తెగిపోయిన తరువులాగా, నీళ్ళింకి పోయిన ఝరిలాగా సమాజం తేజం నశించి వికృతంగా మారిపోతుంది.

అమానుష భావాలు మనిషి అంతరంగంలోకి ప్రవేశించకుండా జాగ్రత్తపడాలి. అతని హృదయాంతరాళాలలోంచి మానవత్వం కొత్త కాంతులను వెదజల్లుతూ రావాలి. అది సాధుత్వాన్ని, సాద్గుణ్యాన్ని, సత్సంప్రదాయాన్ని అంకురింపజేసి, వికసింపజేసి సువాసనలను వెదజల్లాలి. అప్పుడే మానవ సమాజం రుచిరమైన భవిష్యత్తును సిద్ధం చేసుకుంటుంది. సత్సంప్రదాయం మనిషి క్రమశిక్షణ మీద ఆధారపడి ఉంటుంది. ఈ చిత్త స్థైర్యం భక్తివల్ల సాధ్యమవుతుంది. భక్తి అనేక రూపాలతో మనస్సులో పుట్టి వలయంగా పరిభ్రమిస్తూంటుంది. "భక్తి అనేది ఒక విధమైన చిత్త పరిపాకం. ఆకలి అవుతున్న పసిబాల అమ్మపాల కోసం అలమటించినట్టుగానే మానవుని అంతరాత్మ అఖండ చిన్మయ్యానందం కోసం ఆరాటపడుతుంది. తియ్యని పాలకై తల్లి పాలిండ్లకోసం పసికూనలాగానే అంతరాత్మ ఆ అనిర్వచనీయానందానుభూతి కోసం అన్వేషణ ప్రారంభిస్తుంది. ఆ అన్వేషణలోనే అంతరాత్మ ఎంతో ఎదుగుతుంది. యౌవనంలో ఉన్న యువతి మనోహరుని మధురానురాగం కోసం ఎలా రతిభారాన్ని భజిస్తుందో, అన్వేషణలో ఆర్తియైన అంతరాత్మ అలా ఆ పరంజ్యోతి పరిష్వంగం కోసం పారవశ్యంతో పలకరిస్తుంది. ఇలా భగవద్రతిలో పారవశ్యాన్ని చెందే పరిణతమైన చిత్త పరిపాకమే భక్తి"[1] అని జీవియస్ నిర్వచించారు. భక్తియనగా సేవించుట, ఆరాధించుట[2] అని యర్థం. భక్తిని గురించి అందులోని వివిధ రూపాల గురించి అనాటి నుంచి ఎన్నో సిద్ధాంతాలు వచ్చాయి. ఆ సిద్ధాంతాలకు ప్రతీకలుగా కొందరు భక్తులు కన్పిస్తున్నారు. భగవంతుణ్ని సాక్షాత్కరింపజేసుకోవడానికి అంటే పరమాత్మను ఆత్మ సందర్శించుకోవడానికి అవసరమైన అనుగుణమైన మార్గాలతో భక్తి వితతి ఆరాటపడటం కన్పిస్తుంది. ఆత్మ పరమాత్మతో సంలీనం కావడానికి సాగే తపన, మహావృత్తంగా పరిణామ

రూపంగా ఉంటుంది. పరమాత్మ అన్వేషణలో ఆత్మ ఎంతగా ఘోషిస్తుందో అంతకంటే మిన్నగా అది ఆనందాతిశయాన్ని అనుభవిస్తుంది.

'భక్తి'ని పోతన్న నవవిధభక్తులుగా విస్తరించారు.

తను హృద్భాషల సఖ్యమున్, శ్రవణమున్, దాసత్వమున్, వందనా
ర్చనముల్, సేవయు, నాత్మలోనెఱకయున్, సంకీర్తనల్, చింతనం
బను నీ తొమ్మిది భక్తి మార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స
జ్జనుడై యుండుట భద్రమంచు దలతున్ సత్యంబు దైత్యోత్తమా[3]

భక్తి మానసిక ఏకాగ్రతను సమకూర్చి నిశ్చలమైన జీవన మనుగడను సాధించడానికి ఉపకరిస్తుంది. తద్వారా మానవుని ప్రజ్ఞాపాటవాలు లోక కల్యాణానికి ఉపయోగపడతాయి. భక్తి ద్వారా ముక్తిని పొందవచ్చు. అట్లా ముక్తిని పొందిన పౌరాణిక భక్తులైన గజేంద్రుడు, ప్రహ్లాదుడు, చారిత్రక వ్యక్తులైన త్యాగరాజు, భక్త రామదాసు, కబీరు, మీరాబాయి మొదలైన వారు ఇందుకు ఒక నిదర్శనం.

ప్రహ్లాదుని నోటి నుంచి పలికించిన ఈ నవవిధ భక్తి మార్గాలను తెలుగు కవులలో కొందరు కొన్నిమార్గాలను ఎంపిక చేసుకొని అనుసరించారు. "భజ్-సేవాయామ్"[4] అను ధాతువు నుంచి నిష్పన్నమైన భక్తి శబ్దం సౌజన్యభావనకూ, సౌమనస్యచేతనకూ ఆవలంబంగా అమరింది.

భక్తి కవిత గురించి జీవియస్ "భక్తి - కవితలో రక్తి కట్టాలంటే శ్రవణం, సంకీర్తనం, చింతనం అనే భక్తి మార్గాలకది పరిపోషకంగా ఉండాలి. కవితకు లలిత శబ్ద సంయోజనం వల్లా, రాగ రంజితమైన శైలి వల్లా అలవోకగా అవధానం చేయగలిగే పద్య విద్యవల్లా కవితలో సంకీర్తనకు సౌలభ్యం ఏర్పడుతుంది. భావ గంభీరాలైన అర్థాలంకారాల వల్లా, ఆలోచనామృతాన్ని, వర్షించే సార్థక పద ప్రయోగం వల్లా, వ్యంగ్య సౌరభాన్నీ చేసే తాత్త్విక తాత్పర్యం వల్లా కవిత్వం పఠితలలో చింతనను రేకెత్తిస్తుంది"[5]అని అన్నారు.

ఈ తాత్త్విక చింతనకు వాస్తవమైన సంప్రదాయ సిద్ధాంతానుయాయి. అయిన్పటికీ ఆయన సమాజ సహజ పురోగమనానికి రచయితగా చింతనాక్రాంతమైన సందేశసారాన్ని వెదజల్లుతున్నారు.

ఆయన భక్తికవిత్వాన్ని (అ). భగవద్భక్తి
(ఆ). మాతృ భక్తి
(ఇ). పితృ భక్తి
(ఈ). గురు భక్తి
(ఉ). దేశ భక్తి అని అయిదు విధాలుగా వింగడించవచ్చు.



## (అ). భగవద్భక్తి

త్రిమూర్తులలో నారాయణుని భూమిక చాలా విశిష్టమైంది. ఆయన మానవాళి దౌష్ట్యాన్ని తుదముట్టించి వాళ్ళకు సాయుజ్యాన్ని ప్రసాదించాడు. తలచిన భక్తులకు కోరుకున్న రూపాలలో దర్శనమిచ్చి సౌఖ్యాలను ప్రసాదించే పరంధాముడు. వేదాలు, పురాణాలు, ఇతిహాసాల వంటి సాహిత్యాలలో ఆ మూర్తి అవతార ధర్మాలు, స్వరూప స్వభావాలు విశేషంగా వర్ణింపబడినాయి. ప్రధానంగా వ్యాసుడు విష్ణుతత్త్వాన్ని సాకల్యంగా తన రచనలలో దివ్యంగా చిత్రించారు. అనంతర భారతీయ సాహిత్యాలలో కూడా వైకుంఠుని లీలా విలాసాలు భక్తి భావంతో వర్ణింప బడడం కన్పిస్తుంది. తెలుగులో కూడా వైష్ణవ కవులు శ్రీ నారాయణ దివ్యమైన మహిమలను భక్తి హృదయంతో గానం చేశారు.

ఆధునిక కాలంలో కూడా కొందరు కవులు లక్ష్మీశుని సౌభాగ్య గరిమను అభివర్ణించడం కన్పిస్తుంది. సహజంగా భక్తి తత్త్వం ఉన్న తిరుమల తన సరళమైన శైలిలో బదరీ నారాయణుడిని సుతించడం పాఠకులలో భక్తి భావాలను ప్రేరేపించే విధంగా ఉంది. అంతేకాక భగవత్సాన్నిధ్యంలో గడపాలనే ఆకాంక్ష కూడా పుడుతుంది.

ధనమా సుంతయు చెంతలేదు, బలమాతగ్గెన్ మనోధైర్యమూ
చనియెన్ దీరె సమస్త భోగములు సంసారాబ్ధిలో మున్గితిన్
జననంబున్ మరణంబు నొల్లనిక నీ సాన్నిధ్యమున్ జేరదన్
నను నీలో మరి జేర్చుకొమ్ము బదరీ నారాయణ! మాధవా[6]

ధనం కొంచెం కూడా దగ్గరలేదు. దేహంలో శక్తి నశించింది మనోధైర్యం తగ్గిపోయింది. సమస్త భోగాలు అనుభవించడం జరిగింది. సంసార సాగరంలో మునిగిపోయాను. జనన మరణాలను వాంఛించడం లేదు. నీ సాన్నిధ్యాన్ని చేరాలనే తపన ఉంది. నీలో విలీనం చేసుకోమని కవి అర్థించారు. ఇందులో భక్తుడైన కవి శరణాగతి తత్త్వం ఉంది. జీవన సంధ్యాసమయంలో భవరోగాలు కాటువేస్తున్నప్పుడు ఆశాపాశాలు కట్టివేసినప్పుడు జీవాత్మ పరంధాముణ్ని చేరుకోవడానికి సాగించే అన్వేషణ, చేరే గమ్యం శరణాగతి అనబడుతుంది. ఇది జీవాత్మ యొక్క కడసారి అన్వేషణం. తిరుమల ఈ తాత్త్వికతను పద్యంలో అంతర్వాహినిగా మలచి చదువరుల మానసాలకు అందించి తన ఉదాత్తతను చాటుకున్నారు.

తిరుమల భక్తి హృదయంతో కీర్తించిన మరొక దైవం వేములవాడ రాజరాజేశ్వరుడు. ఆర్ద్ర హృదయుడైన అభవుడు భక్తుల కొంగు బంగారంగా ఉంటూ సాయుజ్యాన్ని అనుగ్రహిస్తున్నాడు. ఈ దైవాన్ని చాళుక్యులు ప్రతిష్టించారని ప్రతీతి. సదయ హృదయుడైన ఆ రాజరాజేశ్వరుణ్ని కవి పూర్ణ హృదయంతో స్తుతించారు.

ఆలయాన పరమాత్మ మూర్తివే
అశ్రు నయనాల చూపనీ

వేద వినుత శ్రీ వేములవాడ
విభుని మనసార వేడనీ![7]

వేంకటేశుని దయాదృష్టి తన మీద ప్రవహించడానికి కవి మనఃపూర్వకంగా స్వామి విశేషగుణాలను వర్ణించారు. శ్రీగిరీశుడు సురగణాల నతులందుకుంటున్నవాడు. పూర్ణ జ్ఞానంతో వెలుగులను విరజిమ్ముతున్న వైదిక దివ్యభావాల నిండైన మానసం కలవాడు. సర్వలోకాలను సంతృప్తి పరుస్తున్న కళాఘనుడు. పంకజ నేత్రుడు. అలాంటి దివ్యమూర్తిని కవి హృద్యంగా చిత్రించారు.

సురగణ వందితుండు, రసశోభిత వైదిక దివ్య భావ బం
ధురమతి, సర్వలోక పరితోషకుడాత్మ కళాఘనుండు, భీ.
కర భవ రోగ నాశకుడు, కంజ దళాక్షుడునైన వేంకటే
శ్వరుడు దయార్ద్ర దృష్టి బరుపన్ ప్రణుతింతు సతంబు నెమ్మదిన్,[8]

తిరుమల భగవద్భక్తి తన కవితల్లో శ్రీకృష్ణపరమైంది ప్రత్యేకంగా రాశారు.

ప్రేమ యనగ నీవు ప్రేమించగా నీవు
ప్రేమించబడు తత్త్వ విత్త మీవు
జీవ మాలలు నీవు భావ కీలలు నీవు
జీవ భావ విచల చిత్ర మీవు
మదన శస్త్రము నీవు మదన శాస్త్రము నీవు
సృష్టి కార్యము నీవు సృష్టి నీవు
పురాషార్థ సాధనా మూల కామము నీవు
కామ శత్రుచ్ఛేద· ఖడ్గ మీవు
గోప భావ మీవు వ్రేపల్లెయే నీవు
మధుర దృశ్యమైన మధుర నీవు
వేద మీవు రాసె బృందావనం బీవు
సర్వ మీవె కృష్ణ! సర్వమీవె[9]

తిరుమల వ్రేపల్లె కృష్ణుణ్ని ప్రేమలతో నుతించారు. కృష్ణుడు ప్రణయ మూర్తి. విష్ణుమూర్తి అవతారాల్లో కృష్ణావతారం మరీ విశిష్టమైంది. కృష్ణస్వామి ఈ అవతారంలో ప్రణయ తత్వాన్ని లోకానికి అందించి ప్రకృతికీ, పురుషునికీ ఉన్న సాన్నిహిత్యాన్ని బలవత్తరం చేశాడు. ఆయన వ్రేపల్లెలో పుట్టడం వల్లే ఈ దివ్యకార్యాన్ని సాధించగలిగాడు. విష్ణుమూర్తి వైకుంఠంలో ఉంటాడు. అక్కడ ఉండి ఆ ప్రభువు లోకపాలనం చేస్తుంటాడు. అదంటా ఒక రాచరీవి. అక్కడ – ఆ మూర్తి ప్రేమ భావన అర్జన సంరక్షణా స్వరూపంగా ఉంటుంది. గోపకుల స్వామి వీరత్వాన్ని ప్రదర్శించినప్పటికీ ప్రేమతత్త్వమే ప్రచురంగా అభివర్ణితమయింది. డా॥ లీలాజ్యోతి ఇలా అభిప్రాయపడినారు.



"సఖ్య, వాత్సల్య, కాంతా ప్రేమల కొరకై గోలోక మేర్పడెను. వైకుంఠము రాజ సభా సదనము వంటిది. అందలి భక్తిలో గౌరవ భయములు సమ్మిళితములు. గోలోక ప్రేమ విశేషములలో భయ గౌరవములుండవు. బృందావన గోపములు గాని నంద యశోదా దేవులు గాని గోపాలుని యెడ గౌరవ భయాలు చూపరు. కావుననే వైకుంఠము కంటే భిన్నమైన గోకులము భగవంతుని యంతఃపురము వంటిదని తత్వజ్ఞుల భావన అంతః పురము నందు రాజసభ భవనము నందు వలెనొక చక్రవర్తిదైన యైశ్వర్య కళద్యోతకము కాదు. ప్రేమ కళద్యోతకమగును. ఆయన ప్రియ సఖులును దలిదంద్రులును కాంతలును యధేచ్ఛముగా నందు మెలగుదురు వారు తమ ప్రాణప్రియతమునకు సేవలు చేయుదురు. తల్లోకము నిత్యము. తల్లోక వాసులెల్లరు నిత్యులు; తల్లోక క్రీడలన్నియు నిత్యములే. అచ్చటి రూపములుగ నుండును. అచ్చటి జీవుల దేహములు ప్రాకృత దేహములు గావు అని భావదేహములు అనగా ఈ భావదేహముతోడనే యావత్ప్రేమ కలాపమును సాగుచుండును. అందలి ప్రతిభావమును బరిపూర్ణము; చిన్మయము; ప్రేమ రసప్రపూరితము".[10] ఇది తిరుమలపై పద్యానికి నేపథ్యంగా కన్పిస్తుంది. తిరుమల కృష్ణుణ్ని గోప భావం నీవే అన్నారు. వ్రేపల్లె నీవే అన్నారు. ఈ మాటల్లో రాధా కృష్ణతత్వం ఒదిగి ఉంది.

"త్రిమూర్తులకు పరమేశ్వరి కారణమనియు, ఆమె తనలోని సృజన శక్తి, పోషణశక్తి, లయశక్తి అను మూడు శక్తులచే త్రిమూర్తులను తొలుత సృజించి వారితో పై మూడు శక్తుల వారి నాయా కార్యముల నప్రమత్తతతో చేయుచుండుడని యాజ్ఞాపించి తాను పర్యవేక్షణ చేయుచుండును. ప్రళయాంతమున మరల త్రిమూర్తులలోని శక్తులను తనలో లీనము చేసికొని మరల సృష్టి రచన ప్రారంభించును"[11]అనీ 'త్రిమూర్తులలో పోషణ శక్తి యుక్తుడు విష్ణువు. ఆయన కృష్ణుడుగా గోలోకంలో అవతరించాడు. పరమేశ్వరి రాధగా గోపాంగనగా భూలోకంలో అవతరిస్తుంది. వెను వెంటనే ఆమె రోమకూపము నుండి అనంత కోటి గోప సుందరీ మణులుద్భవించిరి"[12] అని దేవీ భాగవతంలో ఉన్నది. కృష్ణుడు రాధను మాత్రమే కాక గోపస్త్రీలను రాస క్రీడలో తేల్చడానికి భావమిదేనని చెప్పవచ్చు. తిరుమల పురాణాలలో దాగిఉన్న రాధాకృష్ణతత్వాన్ని గోపభావంగా వర్ణించి గోప భావానికి నిలయంగా నిలిచిన వ్రేపల్లెను నుతించారు. కౌటిల్యం అంతరించి కారుణ్యం అల్లుకున్న మధురను రాసబృందావనాన్ని కృష్ణుడుగా అభివర్ణించడంలో విస్తృతమైన తాత్త్వికత పరచుకొని ఉంది.

కుల రూపమ్ములె లేవుగాని యల వైకుంఠంబు నీ గేహము
జ్జ్వల రూపాన్విత పాలవెల్లి సుత నీ చంకెక్కు నిల్లాలు పి
ల్లలు వాగ్వల్లభ మీన కేతనులు కళ్యాణాదికంబుల్ గుణా
వళి లోకత్రయ చక్రవర్తి వగుదేవా! పాహిమాం మాధవా[13]

వైకుంఠుని తనియను ఉజ్వల రూపాన్విత పాలవెల్లి అంటూ లలితమైన సమాసంలో ఆమె సౌందర్యాన్ని చిత్రించారు. అయితే నారాయణుని వక్షస్థలంలో నివసించే ఆయన

ఇల్లాలు లక్ష్మీదేవిని 'నీచంకెక్కునిల్లాలు' అని మార్చి రాశారు. ఈ మార్పు కూడా విశిష్టంగా ఉంది. హృదయ పీఠి వసించడం అనేది ప్రేమ భావనకు ప్రతీకగా ఉంటుంది. 'చంకెక్కడం' అనేది అనురాగానికి వాత్సల్యానికి గుర్తుగా ఉంటుంది. ఈ పద ప్రయోగం కూడా ఔచితీ స్ఫోరకంగా ఉంది.

తిరుమల శివశంకరుణ్ని అభ్యర్థిస్తూ రాసిన పద్యంలో దాస్య భక్తి కన్పిస్తుంది.

సుజన శ్రేణికి తల్లిదండ్రి పగిదిన్ జూపట్టి నీహార శై
లజ సామేన ధరించి దిగ్విలయ మెల్లన్గోకగా నందిపై
రజతాద్రిన్ విహరించు సాంబశివ! సర్వజ్ఞా భవత్పాద పం
కజముల్ మ్రొక్కితి బ్రోవరా హరహరా! గంగాధరా! శంకరా![14]

పద్యం అంతా వర్ణనా వైశద్యంతో ఉంది. ఇందులో రెండు విశేషాలు ఉన్నాయి. ఒకటి అర్ధనారీశ్వర తత్త్వం. రెండవది విశ్వవ్యాపకత్వం. ఈ రెండింటిలో ఈశ్వర తత్త్వం ఇమిడి ఉంది. 'నీహార శైలజ సామేన ధరించి' అన్న పదావళిలో అర్ధనారీశ్వర తత్త్వం, 'దిగ్విలయమెల్లన్ గోకగా' అన్న పద సంపుటిలో విశ్వవ్యాపకత్వం రెండూ దాగి ఉన్నాయి. తిరుమల పరమేశ్వర తత్త్వాన్ని బాగా అవగాహనకు తెచ్చుకొని పద్యం రాసినట్టుగా కన్పిస్తుంది.

రాముడు నీల మేఘశ్యాముడు. సౌందర్యమూర్తి. కవులు ఆ దాశరథిని 'పుంసాం మోహన రూపాయ' అంటూ కవితా గానం చేశారు. ఆ రూపం కేవలం భౌతికమైనది కాదు. ప్రత్యగాత్మ స్వరూపం. 'నీటిలోని రాజీవమురా రామా నిను నమ్ము బ్రతుకు జీవమురా' అంటూ త్యాగయ్య రామ స్మరణమే ఉచ్ఛ్వాస నిశ్వాసాలుగా భావించారు. మునులకు సైతం మోహం పుట్టించునటువంటి రూపం శ్రీరామునిది. అలాంటి దివ్యమూర్తి సర్వాంగ సౌందర్యాన్ని తనవిదీర ననుభవించడానికి పది వేల కన్నులు చాలవు. పాపాన్ని ప్రక్షాళించే పావన మూర్తిమత్వం అతనిది.

నిను జూచిన చాలును నా
మనమున గల పాపమెల్ల మాయంబగు పా
వన రూపుండ వెదదనిదు
కొని భజయింతు నెపుదు నిను గుణగణ రామా![15]

అనే ఈ పద్యంలో జానకీనాథుని పవిత్ర రూప సందర్శనం సర్వపాప నాశకంగా అభివర్ణించడంలో తిరుమల భక్తి హృదయం ప్రకటితమవుతుంది. ఇంకా ఆయన

కలికాలంబున రామరామయని వక్కాణించి సద్భక్తు లి
మ్ముల వైకుంఠము జూఱ గొందురటయే పుణ్యవ్రతంబుల్ జపం
బులు యజ్ఞంబులు దాన ధర్మములు నోముల్ సేయనీ మాననీ
యిలపై రాముని వంటి వేల్పు కలడే యీరేడు లోకంబులన్[16]



అని, రాముని వంటి వేలుపు ఇలలో లేదని చెప్పారు. అంతేకాదు, తారక మంత్రాభి రామ, భూతల పుణ్యావతార, రామాయణ వాగ్ధామా, సార మహాపాశనాశ సద్గుణగ్రాత్రా, మహాజ్ఞాన సాగరామృత రూప, వాసవ వందిత పదాబ్జ, సౌందర్య రసాలంకృత బృందారక నినుత రూప, సూక్ష్మాగమవార్ధి పూర్ణసోమా, గంగా మధు పద్మ పాద, సత్యపాల, రాజతిలకా అంటూ స్తుతించారు. అంతేకాదు, ఆ శ్రీరాముని గుణగణాలను కీర్తిస్తూ 'శ్రీరామనామసుధ' శతకాన్ని రాశారు.

దేవతలలో గణేశ్వరుని స్థానం మరింత విశిష్టమైంది. ఆయనను ఆరాధిస్తూ ఉంటేనే విఘ్నాలు అంతరించిపోతాయి. జీవితంలో శ్రేయస్సు ప్రకాశిస్తుంది. ఆ స్వామి ఆది దంపతులైన ఉమామహేశ్వరుల పుత్రుడు కదా! ప్రాచీన కవులు నిండైన భక్తితో విఘ్ననాయకుణ్ని స్తుతించారు. ఆధునిక కవులలో కొందరు స్తుతిస్తున్నారు. అల్లసాని వారి 'అంకముజేరి' అన్న పద్యం ప్రసిద్ధమే కదా!

తిరుమల గీతికా ప్రక్రియలో ఏకదంతుణ్ని ఇట్లా వర్ణించారు.

ఎన్ని రూపాల నిన్నెంచి పూజింతురా
ఏకదంతా! ఓయి విఘ్నహంతా!
అల్పజ్ఞుడను నేను అణువైన కాబోను
పాహి రక్షింపవే – పరమాత్మ – వరదా!

అభయ హస్తము జూపు ఆది గణపతివో
అగస్త్యనుత వాతాపి గణపతివో
సంగీత స్వర హేల వేణు గణపతివో
సప్త తాండవలోన నాట్య గణపతివో

శక్తి గణపతివో – సమర గణపతివో
సిద్ధి గణపతివో – సద్బుద్ధి గణపతివో
సత్య గణపతివో భావ స్వర్గ గణపతివో
సృష్టి ధార ధార సంతాన గణపతివో

ఉచ్ఛిష్ట హారద్ర నవనీత రీతుల
కనపించు మంగళ మహా గణపతివో
ఎవ్వరే విధి గొలువ వారి కా రూపుతో
కోరికల నీడేర్చు గుజ్జు గణపతివో[17]

విఘ్నేశునివి భిన్న రూపాలు. ఒక్కొక్క స్వరూపానికి ఒక్కొక్క మహత్తు ఉంది. ఆ స్వామి ఏకదంతుడు. అభయ హస్తాన్ని అందించే ఆది గణపతి. అగస్త్య మహర్షి చేత నుతులందుకున్న వాతాపి గణపతి. సంగీత స్వరహేల వేణు గణపతి, సప్త తాండవ

లోలుడైన నాట్య గణపతి, శక్తి గణపతి, సమర గణపతి, సిద్ధి గణపతి, సద్బుద్ధి గణపతి, సత్యం గణపతి, భావ స్వర గణపతి, సంతాన గణపతి, మంగళ మహా గణపతి, గుజ్జు గణపతి ఈ సమాసాలన్నింటిలో ఉమా తనయుని లీలలు ఒదిగి ఉన్నాయి.

ముగ్గురు జగన్మాతలలో లక్ష్మీదేవి ఒకరు. పురుషోత్తముడైన శ్రీనారాయణుని అర్ధాంగ లక్ష్మి. ఆమె సదా విష్ణు మూర్తి వక్షస్థలాన నిలిచి ఉంటుంది. ఆమె సముద్రుని కూతురు. జీవితం అనే సముద్రాన్ని ఈదడంలో అలసిపోయిన వాళ్లకు శక్తినీ, శ్రీశక్తినీ ప్రసాదించే లోకేశ్వరీ. ఎనిమిది రూపాలతో జగత్తును సంపన్నం చేస్తున్న ఆ నారాయణుని తిరుమల సహజమైన భక్తితో వర్ణించారు.

నీ చూపులతో పండును చేలు
నీ నవ్వులతో కురియు వరాలు
నీ వున్నావని నమ్మితి మమ్మా
మరువకు తల్లీ; మేమున్నామని[18]

నారాయణుడు దుష్టశిక్షకుడు. శిష్టరక్షకుడు. పురాణ పురుషుడు. వేద స్వరూపుడు. ఆ పరంధాముడు లోకాలను రక్షించడానికి అనేక కాలాలలో అనేక రూపాలతో అవతరిస్తుంటాడు. ఆ అవతారాలలో నృసింహావతారం ఒకటి.

విదిత పురాణ సారమవు, వేద రహస్య రస స్వరూప మీ
వదితి సుతాళిగాచు పరమాత్మవు, దుష్ట నిశాచరాగ్రణీ
హృదయ తమః పతంగవు, హేమాద్భుత రూపధుర్య ఓ
కదిరి నృసింహ! పాహి నను గాంచవె బోవలెస్తంభ కాంతులన్[19]

నరసింహుడు విలువైన పురాణసారం. వేద రహస్య రసస్వరూపుడు. దేవమాత అదితి సుతాళిని కాపాడిన పరమాత్ముడు. దుష్టులైన రాక్షసుల హృదయాలలో చీకట్లను పరుగులు పెట్టించే సూర్యుడు. సువర్ణమయ స్వరూపంతో దీపిస్తున్న వాడు అని కదిరిలో వెలసిన నరసింహస్వామిని కవి వర్ణించారు. అయితే తిరుమల నృసింహుని భీకర రూపాన్ని కాక అందులోని అసలైన గుణాలను వర్ణించారు. సమాసాలున్నా, పద్యమంతా నందినీ ధేనువు నడకలాగా ప్రశస్తంగా ఉంది.

సూర్యస్తుతి అనాది కాలం నుంచీ పురాణాలలో, ఇతిహాసాలలో ఉంది. కావ్య ప్రబంధాలలోనూ శతకాలలోనూ ఉంది. ఆదికవి వాల్మీకి సూర్యునికీ, సూర్య కిరణాలకీ విశేష ప్రాధాన్యతను కల్పించారు. ఈ విషయాన్ని శేషేంద్ర ఇట్లా చెప్పారు. "సూర్యుడు ఆకాశంలో ఎగిరే పక్షి. "ఖగఃపూగభస్తిమాన్" అని ఆదిత్య హృదయం సూర్యామాయామోహ మూర్ఛితుడై వాల్మీకి రామాయణం నిండా సూర్య కిరణాలు పోసి నింపాడు. దాన్ని సూర్య కావ్యం చేశారు. ప్రతి సహస్ర శ్లోక నికాయానికి అగ్రాక్షరంగా ఒక్కో సూర్య మంత్రాక్షరాన్ని నిక్షేపించారు. సర్వత్రా సంధ్యానాదం వినిపిస్తుంది రామాయణ పుటల్లో; "రామస్సంధ్యా



ముపాగమత్" "అన్వాస్య పశ్చిమాం సంధ్యాం తత్ర వాసమ కల్పయత్" ఉషా స్పృశత్ సుశీతేన జలేనోత్పల గంధినా" ఇలా ఎన్నో... అందులో ఉన్న సూర్య మండల వ్యామోహం చెప్పడానికి అలవికాదు".[20]

తిరుమల కూడా దివాకరుణ్ణి భక్తి ప్రపత్తులతో దర్శించారు.

ఉదయగిరిపైన నిను జూచి అదిరి వడుచు
పారిపోవును చీకటి పాయలగుచు చీలిపోయి
కొండ గుహల, స్త్రీల జడల సుడులు దిరుగు
భళిర! కాంతి శూల ధారి నీవు - భాస్కరా![21]

ఉదయాద్రి మీది నుంచి వస్తున్న సూర్యుణ్ని చూస్తూ చీకట్లు పారిపోతాయి. అదీ సమూహంగా, బింబంగా కాదు. పాయలు పాయలుగా చీలి పరుగులు పెడతాయి. ఎక్కడికి? కొండ గుహలలోకి. స్త్రీల జడలలోకి. సుడులు సుడులుగా తిరుగుతూ కారణం, ఇనుడు కాంతి శూలధారి కనుక కవి పద్యంలో భక్తిని చూపిస్తూనే 'స్త్రీల జడల సుడులు తిరుగు' అనే పదసంపుటిని ప్రయోగించి చమత్కారాన్ని చేర్చారు.

లోకాలకూ, మనోలోకాలకూ కాంతిని ప్రసాదించే ఆదిత్యునికి గ్రహణం పట్టడమనేది అనాచార భావమని చెప్పారు.

నిన్నొక పాము మ్రింగుటయ నిక్కమ యేని మహోగ్నికుండ మా
నన్నొక దోమ చంపుటయ న్యాయము, ఈ గ్రహతార కాళికిన్
కన్నువు నీవు నీ వెలుగు గాక మరేమియు లేదు. విశ్వమం
దన్నియు నీవు, నీ గ్రహణ మేమి? ప్రభాకర! దృష్టిదోషమా![22]

ఆయన సూర్య గ్రహణాన్ని సంశయించి అఖిలాన్ని వెలుగులతో ముంచెత్తే స్వామిని పాము మింగడమేమిటని ఆధునిక దృష్టితో ఆలోచిస్తారు. ఈ ఆధునిక దృక్పథంలోనే అతని లీలలూ దాగి ఉన్నాయని కూడా నేపథ్యంగా భావించారు.

పోతన్న శబ్దాలంకార గుబాళింపులతోనే తన పద్య విద్యను పరిమళ భరితం చేసుకున్నారు. ఆయన "క్షోణి తలంబునన్ నుదురు సోకక మ్రొక్కి నుతింతుసైకత శ్రోణికి"[23] అన్న పద్యం తెలుగులో వచ్చిన సరస్వతీ స్తుత్యాత్మకమైన పద్యాలలో చాలా గొప్పది. ఈ పాదులో నుంచే కొందరు తెలుగు కవులు తమ శారదాస్తుతి పద్యాలకు పందిళ్ళు వేశారు. తిరుమల ప్రాచీన సాహిత్యాన్ని చాలా వరకు స్వంతం చేసుకోవడం వలన ఆయన పద్యాలు కొన్ని ప్రాచీన కవుల మార్గంలోనే వచ్చాయి. నడక అదే అయినప్పటికీ నాణ్యత, ప్రావీణ్యత ప్రశంసింపదగినవిగా ఉన్నాయి.

చదువుల తల్లి వీవు, దివి సంతతి కల్పక వల్లి వీవు, సం
పదలకు మూల మీవు, ప్రణవ స్వర మాధురి వీవు, చిత్కళా

సదనమ మీవు, శాశ్వత యశః ప్రభ వీవు, నమోస్తు దేవి,
నా హృదయ మలంకరించ గదె హృద్య రవామృత రూప భారతీ![24]

ఆ విద్దెల రాణిని తన హృదయ సీమను అలంకరించుమని తిరుమల ప్రార్థించారు. ఆ కలువరాణి హృదయ మందిరంలో ఉంటేనే కదా! కలం నుంచి విశ్వశ్రేయమైన కావ్యాలు వెలువడేది.

తిరుమల ఏ దైవాన్ని స్తుతిస్తూ కవిత రాసినా అర్థస్ఫూర్తిలోనైనా, అక్షర దీప్తిలోనైనా, పద సంయోజనంలోనైనా నవ్యత్వాన్ని చూపిస్తారు. రామ భక్తుడూ, ఆ రామ హృదయుడూ అయిన ఆంజనేయుణ్ని ఆయన భావన చేసిన విధం విశిష్టంగా ఉంది. దాస్యభక్తికి ఆదర్శం ఆంజనేయుడు. అలాంటి హనుమంతుడిని తిరుమల

స్తన పాయిత్వము నాడు బింబమనుచున్, సప్తాశ్వు మ్రింగంగ జొ
చ్చిన రుద్రాంశుడ వాంజనేయ విలురత్సింధున్ విలంఘించి సీ
తను శ్రీ రాముని జేర్చినట్టి హనుమంతా! పాహిమాం పాహి! కు
క్షుని రామక్షర కోటి దాల్చిన కవి శ్రేష్ఠా! నమస్తే నమః[25]

అంటూ స్తుతించారు. కవి హనుమ ఔద్ధత్యాన్ని పద్యం ప్రారంభంలోనే చూపించారు. పాలు తాగుతున్న శైశవదశను 'స్తన పాయిత్వము నాడు' అన్న పద సమాహారంలో చూపించి సూర్యుణ్ని మింగి వేయడానికి ప్రయత్నిస్తున్న వైఖరిని 'సప్తాశ్వు మ్రింగంగ' అంటూ అతని ప్రత్యేకతను చెప్పి హనుమంతుని లంఘనశక్తిని పరిచయం చేశారు. అనంతరం ఆ శక్తితో అతడు సాధించిన సీతాన్వేషణ అనే ఉత్తమ కార్యాన్ని పేర్కొన్నారు.

తెలుగునాట అయ్యప్ప ఆరాధనం క్రమక్రమంగా అందరినీ ఆకట్టుకుంటుంది. శబరిమలపై వేంచేసిన ఆ హరిహర తనూజుని దర్శనం సర్వపాప వినాశన కారకమని తిరుమల ఇలా గానం చేశారు.

18 మెట్ల మీద గద్దె మీద కూర్చున్న
పొద్దులాంటి స్వామిని అద్దుకో! కళ్ళకద్దుకో
హద్దు మీరి పొందులెత్తి ఆనందం ఏమిటో
చెప్పే అయ్యప్ప పేరు దిద్దుకో! ఎదలో దిద్దుకో[26]

లోకంలో ధర్మాన్ని కాపాడడానికి నేను అనేక రూపాలలో అవతరిస్తానని యోగీశ్వరుడైన శ్రీనారాయణుడు గీతలో చెప్పాడు. అట్లాగే కృతయుగం నుంచి కలియుగంలో ఈనాటి దాకా అనేక అవతారాలెత్తుతూ ప్రజావళిని వేధిస్తున్న తిమిరాన్ని ఛేదిస్తూ చక్కని వెలుగులను ప్రసరింపజేస్తూ సాధుజన మానసాలను ప్రమోద భరితం చేస్తున్నాడు. ఆ స్వామి దివ్యావతారాలలో 'సాయి' అవతారం ఒకటని భక్తుల నమ్మకం. తలచిన వెంటనే దీనుల బాధలను తొలగిస్తూ జగమంతటినీ శుభ్రజ్యోత్స్నలా రూపుదిద్దుతున్న కరుణామూర్తి శ్రీ



సత్యసాయి దేవుడు. ఆయన ఆశ్రితవత్సలుడూ, శరణాగతవత్సలుడూ కావడం వల్లనే అశేష భక్తులు ఆ దేవదేవుణ్ని నిరంతరం ఆరాధిస్తూ జీవన్ముక్తులవుతున్నారు. కవులు కీర్తించి తమ రచనకు ధన్యతను ఆపాదించు కుంటున్నారు. తిరుమల కూడా స్వామి దివ్యావతార మహిమను ఆపాత మధురంగా వర్ణించారు. సత్యసాయి అవతార ధర్మాన్ని కవి భక్తి ప్రపూరితమైన మనస్సుతో సంకీర్తించారు.

భగవదవతారములనెల్ల ప్రస్ఫుటించు
సాధు జనరక్ష, ధర్మ సాంస్థాపనమ్ము
లవని జీవిత గతులా యయ్యీశ్వరాత్ము
సత్య సాయిని గొల్లు విశ్వాస రుచుల[27]

సత్యసాయి దేవుడు సామాన్యమైన మానవునిగా భౌతిక నేత్రాలకు కన్పిస్తాడు. ఆలోచనాలోచనాలకు ఆది దేవుడిగా దర్శన మిస్తాడు. అనేక అవతారాలను ఎత్తి ప్రగతి నిరోధకులైన అసురావళిని గర్జించి నిర్మల చరితులను సంరక్షించాడు. యుగానికి అవసరమైన ధర్మాన్ని ప్రతిపాదించిన, బోధించిన ఆచార్యునిలా మనస్సులో నిలిచిపోతాడు. శ్రీవిష్ణువు ఎత్తిన అన్ని అవతారాలు తానుగా కన్పిస్తాడు. ధర్మాన్ని స్థాపించడం, సాధుజనులను సంరక్షించడం వంటి విశేషగుణాలు స్వామి వారిలో నిండుగా దర్శనమిస్తాయి. అదే ఆయన అవతార గుణాలు. అలాంటి సాయీశ్వరుని ఆరాధిస్తారు కవి.

సాయి మహోన్నతమైన సుగుణాలను కవి భక్తి భావంతో చిత్రించారు.

సముద్రై యెవ్వడు సర్వ భూత తతులన్ సంరక్ష గావించుచున్
విమలాత్ముల్ వినుతింప ప్రాక్కళల గాంభీర్యంబు బోధించు నా
'స్వ' మతోద్ధారకు వేద వాఙ్మయ కళా సంయోగ సత్కారకున్
అమితోత్సాహ నమస్కృతుల్ నిగమ విద్యాశాయి సత్యాత్మకున్

ఆంధ్రమే కాదు విశ్వమే అబ్బురపడు
దివ్య మహిమల నిత్యంబుదేజరిల్లు
సత్యసాయి మహాత్ముని సాధు చరిత
కీర్తనీయంబుగాదె భక్తి ప్రపత్తి[28]

బాబా వారు సమభావంతో సమదర్శనంతో సమస్తజీవులను ఆదుకుంటున్నాడు. విమలమైన హృదయమున్న వాళ్ళ వినుతిస్తూ ఉండగా ప్రాక్కళల గాంభీర్యాన్ని బోధిస్తున్నాడు. ప్రాక్కళల అంటే అనాటి భారతీయ సంస్కృతికి మూలకందాలైన వేదాలలో భారత భాగవత రామాయణాలలో, ఉపనిషత్తులలో నిర్దేశింపబడిన జీవన సౌందర్యం అన్నమాట. అలాంటి సంస్కృతీధారను మనోజ్ఞంగా బోధిస్తూ లోకంలోని సంకటాలను హరించివేస్తున్నాడు. ఆ స్వామి 'స్వ' మతోద్ధారకుడట. 'స్వ' మతం అంటే ఆయనదైన ఒక పవిత్ర మార్గం. అదే సాయి మార్గం. దాన్ని రూపొందింపజేశాడు. భక్తులను నడిపిస్తున్నాడు. తరింపజేస్తున్నాడు.

స్వామి వేద వాఙ్మయ కళా సంయోగ సత్కారకుడు. సత్యాత్ముడు. అలాంటి పరంధామునికి కవి అమితోత్సాహంతో నమస్సులు తెలుపుకున్నారు.

## (అ). మాతృభక్తి

'అమ్మ' అనే రెండక్షరాలలో ఎంతో తీయదనం కన్పిస్తుంది. తేనెలోని తీయదనం, అమృతంలోని మాధుర్యం అమ్మ ముందు ఓడిపోతాయి. మధురసాన్ని, అమృతాన్ని ఎక్కడనుంచో తెచ్చుకోవాలి. ఎంతో ఆరాటపడాలి. ఎంతో పోరాటం చేయాలి. అప్పుడు కానీ - ఈ రెండు లభిస్తాయి. అయినప్పటికీ, మనిషి చేతనలోంచి సంపాదితమైన ఈ రెండింటిలో ఉన్న కమ్మదనం ఎప్పుడూ ఉండేది. అమ్మపిలుపులో, పలుకులో, లాలనలో ఎంతో ఆత్మీయత ఉంటుంది. అనురాగం ధారగా కురుస్తుంది. దేహానికి చిన్న గాయమైనా హృదయానికి చిన్న దెబ్బ తగిలినా ఛప్పున 'అమ్మ' అనే మాట పెదాల నుంచి వస్తుంది. జీవితంలో చతికిలపడిపోయినా, పతనమయిపోయినా, భవిష్యత్తు చీకటిలా భయపెట్టినా అమ్మ హృదయం నిండా కన్పిస్తుంది. పచ్చదనాన్ని కప్పుకున్న ద్వేషం బతుకును కాల్చివేసినా, అమృత రూపంలో ఉన్న పచ్చి విషం మనుగడను కలుషితం చేసినా అమ్మ మదిలో, మేధలో ఒకేసారి కన్పిస్తుంది. అమ్మ ప్రేమకు మూల్యం చెల్లించలేం. దూరంగా వెళ్ళిన తన సంతతి కోసం ఆమె నిరీక్షిస్తుంది. అన్నపానాదులను విడిచిపెట్టి తపిస్తుంది. ఆమె కళ్లనుంచి వేడి కన్నీరు ధారలుగా కురుస్తాయి. అమ్మ మనసులో ఎంత ఆత్మీయం! ఎంత అనురాగం!

"ఉపనిషత్తులు మాతృమూర్తిని దేవతగా వర్ణించాయి. అంతేకాక ప్రథమదైవంగా కీర్తించాయి".[29] తిరుమల కవితలో మాతృమూర్తి సంకీర్తన హృదయ ద్రావకంగా ఉంది.

అమ్మ అంటే ఇంటిలోని అందం ఆనందం
అమ్మంటే నిండు బ్రతుకు గంధం మకరందం
అమ్మంటే జ్ఞానబలం సత్యధనం స్పందనం
అమ్మను మించినదేదీ లేదమ్మకు వందనం[30]

ఇంటిలో ఆనందం వెల్లివిరిస్తే అది ఇంటికంతా అందాన్నిస్తుంది. అది అమ్మ ఆత్మీయతలోంచి, అనురాగపు లాలనలోంచి వస్తుంది. ఇంటిలో భర్త, కొడుకులు, కుమార్తెలు, కోడళ్ళు, అల్లుళ్ళు, మనుమలు, మనమరాళ్ళు వీళ్ళంతా ఆనందంగా మనుగడ సాగిస్తారంటే అది అమ్మ పోషణలో నుంచే. అమ్మ అనే మాటను నిర్వచించలేం. ఇంకా తిరుమల ఇలా అంటారు. అమ్మంటే నిండు బతుకు. కన్న తల్లి కరువైన వాళ్ళు ఎంతో వెలితిగా దీనంగా దిగులుతో కన్పిస్తారు. వాళ్ళు జీవితంలో ఎంతో విలువైన వస్తువును పోగొట్టుకున్నంతగా ఆవేదతో కుమిలిపోతారు. కాని ఆ అమ్మే ఎప్పుడూ పరిమళిస్తున్న గంధంలా, ఎప్పుడూ మకరందంగా ఉంటుంది. అమ్మ అనే మాట సాధారణమైంది కాదు. ఆమె సంతానాన్ని పొందటంతో మాత్రమే తృప్తిపడదు. ఆమె జ్ఞాన బలాన్ని ఇస్తుంది. చిన్నప్పటి నుంచే గోరుముద్దలు తినిపిస్తూనే చల్లని చిరునవ్వులతో త్యాగమూర్తుల గురించి చెబుతుంది.



సత్యం కోసం, ధర్మ కోసం, నీతి కోసం, నియమం కోసం జీవితాలను సమిధలుగా వెలిగించిన మానవోత్తముల మహిత గాధలను పరిచయం చేస్తుంది. మంచి వైపు నడిపిస్తుంది. ఇంకా ఎన్నో మంచి విషయాలను ప్రబోధిస్తుంది. అందుకే తిరుమల అమ్మను జ్ఞానబలంగా అభివర్ణించారు. ఆమె సత్యధనమట. జీవితానికి స్పందనమట. వాస్తవంగా అన్నీ అమ్మనే. అంతా అమ్మనే. లోకంలో అమ్మకు మించిన వస్తువేది లేదు.

మరో కవితలో తిరుమల

అమ్మలోనే అన్నీ వున్నాయిలే జగతిలో
అమ్మలేక ఏమున్నది ఈ బ్రతుకులో
స్త్రీగా కనిపించే రసబ్రహ్మ
దైవానికి ప్రతి రూపం అమ్మ[31]

కన్నతల్లి లేకపోతే జీవితమంతా శూన్యమని, ఆమెలోనే సంతతి జీవన సౌభాగ్యం ఉందని అంటారు. ఆమెను రసబ్రహ్మతో పోల్చారు. ఇట్లా ఉపమించటంలో భవ్యార్థం దాగి ఉంది. బ్రహ్మ సృష్టికర్త. సృష్టి గమనానికి ఆయన రకరకాల జీవన మార్గాలను ప్రవేశపెడతాడు. జీవితాలను పలికిస్తాడు. కానీ, అమ్మ మాత్రం అలాకాదు. ఆమె రసబ్రహ్మ. తన వాళ్ళు ఎదగడానికి సదాకాలాలు కీర్తి మూర్తులవడానికి ప్రయత్నిస్తుంది. బ్రహ్మసృష్టిలో చీకటి వెలుగులు సమంగా ఉంటాయి. కాని, ఆమె సృష్టిలో వెలుగులు మాత్రమే ప్రసరిస్తాయి. చీకట్లు ఆమె వైపు తొంగిచూడవు. ఆనందానికి మూల కందమైన అమ్మను తిరుమల రసబ్రహ్మగా సంకేతించడం ఔచిత్యంగా ఉంది. ఆమె దైవానికి ప్రతి రూపమని చెప్పడంలోనూ ప్రత్యేకత ఉంది.

మనిషిలోని ఆశయాలకు ప్రేమ, ప్రేరణ, పెన్నిధి అంతా అమ్మ అని తిరుమల అన్నారు.

మన ఆశల ఆశయాల కలల కోరికల
మన మాటల మన మనసుల మరుల శారికల
ప్రేరణవరు? ప్రేమయెవరు? పెన్నిదెవ్వరు?
కరుణామయి త్యాగమయి అమ్మగాక!![32]

అమ్మ కరుణామయి. త్యాగమయి. ఆమె తన సంతతి మీద కరుణను కురిపిస్తుంది. కొడుకు లేమన్నా, భర్త గద్దించినా మౌన ముద్రను పాటిస్తూ సంసార శకటం సాఫీగా సాగడానికి శ్రమిస్తుంది. ఆమె త్యాగమయి. ఇంటిలోని బాధలన్నీ తానే భరిస్తుంది. ఇంటిలో ఎవ్వరు అనారోగ్యంతో ఉన్నా, ఏ ప్రమాదానికి గురైనా అమ్మగుండె తల్లడిల్లి పోతుంది. నిద్రాహారాలు మానివేసి దినం దినం కృశించిపోతున్నా తన వారి సౌభాగ్యాన్ని కాపాడుతుంది. భోజనం దగ్గర నుంచి అన్ని విషయాలలో అమ్మ చూపేది త్యాగమే. ఆమె త్యాగమయ జీవితం పవిత్రమైంది. ఆమె విశ్వాసం అచంచలమైంది. ఆలోచనాత్మకమైంది.

జీవిత చుక్కానియేవి? అమ్మ నవ్వు
అమ్మ ఓర్పు ఇడుములమే తరమును దవ్వు
బిడ్డలపై అమ్మకున్న నమ్మకాలు ప్రేమలు
ఎంతటివో చాటలేవు దిగంతాల సీమలు[33]

అమ్మ సహనాన్ని, శాంతాన్ని, ఆశయాన్ని దిగంతాలు కూడా నిర్వచించలేవంటారు తిరుమల. ఆయన అమ్మ ఆత్మీయతను, విశాల ప్రేమభావాన్ని హృదయంగమంగా అభివర్ణించారు.

తిరుమల తెలుగు కవితాక్షేత్రంలో మనోహర మైన కావ్యఫలాలు పండించడానికి, ఉత్తుంగ హిమ శిఖరంలా నిలబడడానికి కారకులు ఆయన అమ్మానాన్నలు.

తిరుమల మాతృమూర్తి సుగుణావతి. ఆమెకు సంస్కృతాంధ్రులు కరతలామలకాలు. శ్రావ్యంగా పాటలు పాడేవారు. తిరుమలతో పాడించేవారు. ఆధ్యాత్మిక విషయాలను పాఠాలుగా బోధించేవారు. ఆనందించేవారు. కొడుకును ముద్దు ముద్దు మాటలతో ప్రోత్సహించేవారు. తీయటి ఆత్మీయతతో తిరుమల కవితా హృదయాన్ని కదిలించింది ఆ తల్లి. "మా నాన్న గారి అనుశ్రుత వైజ్ఞానిక ధార ఆమెకు హృదయ వాహిని. అంతటి పుణ్యశీలి. ధన్యజీవి ఆవిడ. నేను పాట మీద కుదురుగా నిలవటానికి, లయ నాలో లహరులెత్తటానికి ఆమె పాటే కారణం. ఆమె ఎంతటి మధురాతి మధుర గాయనో చెప్పటానికి నేనేర్చిన మాటలు చాలవు. ఆమె పాడుతుంటే తన్మయత్వం కలిగేది"[34] అని తిరుమల స్వయంగా రాసుకున్న మాటల్లో సుగుణావతి ఔన్నత్యం బోధపడుతుంది. కన్న తల్లి కవి కవితా హృదయానికి స్పందన ఇచ్చినట్టుగానే కన్న తండ్రి శ్రీనివాసాచార్యులు ఆయనలో అపరిమితమైన చైతన్యాన్ని కలిగించారు. కవితా సృజనకు అవసరమైన ప్రేరణనూ, కవితా యాత్రకు విశిష్టమైన మార్గాన్ని నిర్దేశించి అధ్యయనం ఆత్మీయంగా, ఉన్నతంగా సాగడానికి ఆధారంగా నిలిచారు. తిరుమల అంతర్జాతీయ స్థాయిలో కూడా అశేషమైన గౌరవాదరాలను అందుకోవడానికి జనకుని బోధన బలీయంగా, శక్తిమంతంగా ఉంది. అమ్మానాన్నల గురించి తిరుమల ప్రత్యేకంగా రాశారు. అమ్మ అనురాగాన్ని 'వాత్సల్య వల్లిక'లో గానం చేస్తే, తండ్రి అనురాగాన్ని 'పితృస్మరణ' కావ్యంలో నుతించారు.

లోకంలో అందరికీ అమ్మలు ఉన్నారు. కానీ, తన తల్లి వంటి మాతృదేవత చాలా అరుదుగా ఉంటుందని తిరుమల ఈ పద్యంలో భావించారు.

ఎందరు లేరు జన్మలకు హేతువులై దనరారు తల్లులీ
సుందర దృశ్య కావ్యమగు క్షోణిని!?! ఎందరు లేరు బిడ్డ లిం
పొందగ కోర్కెలన్ కరిగి పోయెదు తల్లులు!?! ఎవ్వరేని నీ
ముందర నిల్తురే జనని! పూర్ణ దయా మయ వీక్షణ ప్రభన్!![35]

అట్లా ఆత్మీయతను అక్షరాలుగా హృదయంలో కుసుమింపజేసిన ఆమె వాత్సల్య



దీధిలను తిరుమల కమ్మని పదాలతో వర్ణించారు.

నవ మాసంబులు మోసి నన్నుగని యానందంబునన్ బెంచి, నా
భవమెల్లన్ చరితార్థ మొంద న భవున్ బ్రార్థించి, వాత్సల్యమే
రవళింపన్ పలుకాడి, నన్ననయమున్ రక్షించు తల్లి! నినున్
భువి నా ప్రాణములుండు దాక విరులన్ పూజింతు సద్భక్తితోన్[36]

కన్నతల్లి ఔన్నత్యాన్ని తిరుమల దర్శించిన తీరు సామాన్యమైంది కాదు.

విశ్వమంతయు నిండిన ప్రేమ నిధులు
తల్లి! నీ చూపు నుండి ప్రఫుల్లమయ్యె
సర్వ జీవాంతరాళ విజ్ఞాన సుధలు
జనని! నీ మనోజ్ఞము నుండి జాలువాఱె!![37]

విషతుల్యమైన ఈ ప్రపంచంలో అనేకమైన వింతలు, భ్రాంతులు, అసత్యపువాదాలు, దుర్మార్గపు ఆలోచనలు, చిలుం పట్టిన బుర్రలు ఉండగా అటువంటి అమానవీయ మైన పరిస్థితుల్లో తన కన్న తల్లి గుండెల మీద చేర్చుకొని ప్రేమను పంచి పోషించి పెద్దచేసినట్టు కవి చెప్పడం ఉదాత్తంగా ఉంది. ఇంటిలో అనుదినం అమ్మ పాడుకునే పాటలు కవి హృదయంలో చిరంతరమైన అనంద నాట్యాలను ఆవిష్కరించాయని ఉప్పొంగుతున్న మానసంతో కవి గానం చేశారు. ఆ తల్లి కడుపులో ఉదయించడం ఒకనాటి సుకృత విశేషంగా భావించారు.

ఏనాడే సుకృతం బొనర్చితినో! నేడీ రీతి నే నిల్చి నీ
జ్ఞానాంభోధర ధారలన్ దడిసి ధన్యాత్ముండ నైతిన్ సుధా
పానంబయ్యెను జీవితంబు; వచియింపన్ లేను నీ మానసో
ద్యానోద్భూత పరీమళంబు, లవి ఓ తల్లి! రసానందముల్!![38]

ఆమె నోటి నుంచి వెలువడే మాటలు, బోధలు పంచదార గుళికలలా చవులూరిస్తాయట. ఆ తల్లి చూపులు సుధామాలికలు. ఆమె శక్తియుక్తులన్ని కేవలం పారమార్థిక కళా జ్వాలలట. ఇవన్నీ ఆమె హృదయ సౌభాగ్యములట. ఆమె రక్తస్పర్శలో అంతటి మహత్యం ఉందట. ఇంకా ఆ తల్లిని 'ప్రజ్ఞాన వాశిష్ఠమా' అనే పదబంధంలో కీర్తించారు. ఆచార్య వశిష్ఠుని జ్ఞాన తేజస్సులాంటి తేజస్సు ఆమెలో ఉందట. ఇది తిరుమల హృదయనేత్రాలకు అమ్మ కన్పించిన తీరు.

అన్ని విజయాలకు కన్న తల్లి కారణమని ఆమెను పూజించని తలపులెందుకని కవి తనను తాను ఇలా ప్రశ్నించుకున్నారు.

సకల జయములకు సకల సౌఖ్యములకు
సకల పుణ్యవ్రత స్వస్తి శబ్దములకు

తల్లి! నీ రక్షయే మూల ధనము గాదె
తొలుత నిను పూజ సేయని తలపు లేల[39]

పరమార్థాన్ని పొందడానికి అమ్మను ధ్యానం చేస్తానంటారు.

కమ్మని పేరు త్రిజగమ్ముల నేకము సేయు సూత్ర వా
కృమ్ములు నీవి, ప్రేమ మయ గాన సుధారస వాహినీ సమూ
హమ్ములు నీవి, నిర్మల సుహాసిని నీవు మదంబ! నిన్ను ధ్యా
న మ్మొనరింతు నీ భవమునన్ పరమార్థం ఫలంబులందగన్[40]

తల్లి బిడ్డకు జోల పాడడం, గోరు ముద్దలు తినిపించడం, ఆడించడం, పాడించడం వంటివి ఒక తరహా అనురాగ దీపాలు. కుమారుడు ఉన్నతుడుగా ఎదగాలని దీవించడం సర్వసాధారణం. కానీ, సాధ్వి అయిన తల్లి ఆశీస్సుల్లో తనయుడు అన్నింటినీ సాధిస్తాడు. అందని వాటిని కిందకు దింపి వాటిని అందరికి రుచి చూపించి పుణ్య పురుషుడు అవుతాడు. సుగుణావతి పుణ్యశీలి. అనురాగ దేవత. ఆ మాతృశ్రీ దీవెనలు తిరుమలను వాఙ్మయ శిఖరంగా నిలబెట్టాయి. అందుకే,

చల్లగ చూచి నన్ను, మనసార శిరంబున చేయివైచి రం
జిల్లెడు భోగభాగ్యములు చేకురు ముద్దల నాయనా! రమా
వల్లభు రక్ష నీ కమరు వర్ధిలు మంచు తలంటినా వహో!
తల్లి! భవత్కృపా విభవ ధార్మిక శక్తి వికాస మొందగాన్[41]

అంటూ అమ్మ దయా విశేషాలను కొనియాడారు.

విశ్వంలోని అన్ని వస్తువులనూ నిర్వచించవచ్చు. అంచనా వేయవచ్చు. కానీ, తల్లి హృదయాన్ని విశ్లేషించలేం. వివేచనకు అందనంత ఎత్తుగా పవిత్రంగా ఉంటుంది. ఏ అక్షరాలూ ఆ మానసానికి కొలమానాలు కాలేవు. 'మాతృదేవోభవ' అన్న మాటలు ఇందుకేనేమో!

సకల జీవరాశుల విశేషంబు లెంచి
పలుకవచ్చును తల్లి ! కావ్యంబులల్లి
కాని యెవ్వరు పలుకాడలేనిదమ్మ
ఆ కడుపు తీపి యది యసిర్వాచ్యమమ్మ!![42]

కవిగా, కొడుకుగా తన హృదయభావనలను రమ్యాక్షరాల్లో కూర్చి తిరుమల తన వినయ విధేయతలకు, వాత్సాల్యాను రాగాలకు ప్రతీకలుగా ఈ పద్యాన్ని రాశారు.

ఏ శక్తి మహిమచే ఈ విశ్వచక్రమ్ము
శూన్య మందు తిరుగుచుండు నెపుడు



ఏ శక్తి మాయచే నేర్పడె సర్వేశు
దవని విభిన్న జీవాత్ములగుచు
ఏ శక్తి గరిమచే నెగయు భావములన్ని
జన్మ కర్మలకు బీజంబులగుచు
ఏ శక్తి దృష్టిచే ఈ దేహ వనమున
ప్రాణ రవంబులు ప్రస్ఫుటించు

నట్టి సర్వ బలాన్వయమైన శక్తి
సతము నీయెద నుండి సంచాల మగును
తల్లి నిను బల్క వేదాలె తల్లడిల్లు
నింక మమువంటి బిడ్డల నెంచనేల!?![43]

మాతృమూర్తిని కీర్తించిన కవులెందరో ఉన్నారు కానీ, తిరుమలలా తల్లిని కీర్తించిన వారు చాలా అరుదు. ఆయన తన కన్న తల్లిని దైవం కన్నా మిన్నగా భావించారు. బలవత్తరమైన సర్వశక్తులూ ఆమె హృదయం నుంచి సంచలిత మవుతాయట. విశ్వమనే చక్రం ఎలాంటి ఆధారం లేకుండా పరిభ్రమిస్తుంది. సర్వేశ్వరుడు సమస్త జీవాత్మలుగా అవతరిస్తాడు. ఎగసిన కొన్ని భావనలు జన్మకర్మలకు బీజాలవుతాయి. కొన్ని దేహంలో ప్రాణనాదాలుగా రవళిస్తాయి. ఈ శక్తులన్ని కూడా అమ్మ నుండే ఉత్పన్నమయ్యాయని అంటారు. అమ్మను పొగడడానికి వేదాలు కూడా తల్లడిల్లుతాయట. తనవంటి కొడుకులెంత అని తన మాతృవాత్సల్యాన్ని ప్రదర్శించారు.

## (ఇ). పితృ భక్తి

అమ్మ అంటే ఉప్పొంగి పోయే మనస్సులో నాన్న అంటే ఒక మధుర భావన. అమ్మకు ఉన్నంత హృదయ వాత్సల్యం నాన్నకూ ఉంటుంది. కాని, అభివ్యక్తిలో కొంతభేదం ఉంటుంది. అమ్మ లాలనామూర్తిగా కన్పిస్తే ఆత్మీయ శాసనకర్తగా నాన్న మనస్సులో మెదలుతాడు. జీవన వ్యాపారంలో జననీ జనకుల భూమిక సమంగా ఉంటుంది. అమ్మలో ఒక ఆర్ద్రమైన తత్వం, నాన్నలో రసార్ద్రతను స్పందింపజేసే గుణం ఉంటుంది. అమ్మ హృదయాంతరంగంలో సౌజన్యం ఉంటే, నాన్నలో చైతన్యోద్దీపమైన కదలికలు ఉంటాయి.

ఉపనిషత్తులు జనకుణ్ని 'పితృదేవుడు' అని నుతించాయి. మరో విధంగా అనుశీలిస్తే,

ఆకసము బీజ ప్రదాతగ
అవనియే ఒక ఆది మాతగ
కాన గల్గిన మానవునికి
జగజ్జనాళి ఒకే కుటుంబము[44] అని చెప్పుకోవచ్చు.

సహజంగా జనకుడు బీజ ప్రదాత. మాతృమూర్తి ఆ బీజాన్ని ఫలింపజేసే క్షేత్రం. బీజం క్షేత్రం సర్వమేళనం పొందినప్పుడే కుమారోదయం జరుగుతుంది. ఈ భావాన్ని

మహాకవి సినారె సమైక్య భావం బలపడడం కోసం ఆకసం బీజం ఇచ్చేదని, అవని ఆదిమాత అని మాతాపితరుల కార్యకారణ సంబంధాన్ని తెలుపుతూ ఇదే భావంతో దర్శిస్తే జగమంతా ఒకే కుటుంబంగా కన్పిస్తుందని చెప్పారు. పితృదేవుడు తాను సంతతిని పొందడమే కాదు. ప్రేరణగా కూడా ఉంటాడు. కుమారుడు గానీ, కుమార్తెగానీ ఎత్తుకు ఎదిగినప్పుడు నాన్నను తలపోస్తారు. తమ అభ్యుదయానికి నాన్న కారణమని చెబుతారు. ఔను – తనవాళ్ళు జీవితాలలో విజయాలు సాధించాలని నాన్న పడే తపన, కృషి ఇంతా కాదు. అయితే, తన సంతతిలో కొందరి మీద నాన్న ప్రభావం ఉంటే మరి కొందరిలో అమ్మ ప్రభావం ప్రగాఢంగా ఉంటుంది. తిరుమల జీవితం మీద వారి నాన్న ప్రభావం బాగా ఉంది.

తిరుమల తెలుగు మాగాణంలో సాహిత్య తేజస్సులను కురిపించడానికి ఆయన పితృదేవులు శ్రీనివాసాచార్యులు ప్రధాన కారకులు. ఆయన వేదాలనూ, వేదాంగాలనూ, ఉపనిషత్తులనూ, పురాణాలనూ తాత్త్విక దృష్టితో అధ్యయనం చేసి వాటిలోని తాత్పర్యసారాన్ని లోకానికి అందించిన మహా విద్వాంసులు. సంస్కృతంలోనూ, తెలుగులోనూ కంఠదఘ్నమైన అభినివేశం వారికి ఉండేది. జటిలమైన ఏ విషయానైనా అలతి అలతి మాటలతో వివరించి రసజ్ఞలోకం ప్రశంసలు అందుకున్న మహా పండితులు. అలాంటి విరాణ్మూర్తి జనకులుగా తన సాహితీ జీవితానికి ప్రేరణనూ, ప్రదీప్తినీ, స్ఫూర్తినీ అందించటం వల్లనే తాను బాగా ఎదిగిపోయానని తిరుమల భావిస్తూ తన పితృదేవులకు అనేక సన్నివేశాలలో వందన శతాలు కవిత ద్వారా తెలుపుకున్నారు. అంతేకాక శ్రీనివాసాచార్యులు పరమపదించినపుడు ప్రత్యేకంగా ఒక లఘు కావ్యాన్ని పద్య ప్రక్రియలో 'పితృస్మరణ'గా రాశారు. ఇది స్మృతి కావ్యం.

"స్మృతి కవిత్వం ఆంగ్ల సాహిత్య స్పర్శతో వచ్చిందని స్పష్టంగా చెప్పలేం. వేదాలలో కూడా స్మృతి సన్నివేశ ధోరణులు కన్పిస్తాయి."[45] మరణం అనేది అన్ని ప్రాణులకు అనివార్యంగా వస్తున్న స్థితి. అయితే మనుషుల స్థితి వేరు. తనకు విడదీయరాని అనుబంధం ఉన్నవారు మృత్యువుకు గురి అయితే హృదయం ద్రవీభూతం అవుతుంది. విలవిలలాడి పోతుంది. అశ్రువులు ధారగా రాలుతాయి. కాలం అనేక గమ్మత్తులు చేస్తూ వెళ్ళిపోతున్నా, వెళ్ళిపోయిన ఆత్మీయుల తలపోత మాత్రం మానసాన్ని కుదిపివేస్తుంది. లోకంలో శోక సంతాపాలు రకరకాలుగా వస్తాయి. కానీ, సన్నిహితుల మరణం వల్ల ఉత్పన్నమయ్యే శోకం అన్ని రకాల దుఃఖాల కంటే భిన్నంగా ఉంటుంది. ఆ దుఃఖం మరపునకు లొంగిపోనిది. అంతదాకా ఆ వ్యక్తితో గడిపిన క్షణాలు, అల్లుకున్న అనుబంధాలు, పెల్లుబికిన అనురాగాలు ఒక్కటేమిటి అన్ని విధాలుగా ఉన్న బాంధవ్యాలు అలలు అలలుగా గుండెకు తాకుతాయి. ఇవి దుఃఖానికి ప్రేరకాలవుతాయి.

పురాణకాలం నుంచి ఒక విషయం ప్రస్ఫుటంగా దర్శనమిస్తుంది. మనిషి చావును జయించాలని, తాను శాశ్వతత్వం పొందాలని, సావిత్రి తన పతి సత్యవంతుని పునర్జీవితుని



చేయడానికి యమునితో కడదాకా పోరాటం సాగించి భర్త ప్రాణాలను నిలబెట్టుకుంది. అర్థాయుష్కుడైన మార్కండేయుడు శివారాధనతో మృత్యువును ఓడించి చిరంజీవి అయినాడు. మరి కొంత మంది పురాణ పురుషులు తపస్సుతో పునీతమై మృత్యువు దరిదాపులకు రాకుండా జాగ్రత్తపడినారు.

కావ్యం మనిషిలోని అన్ని దశలనూ చెబుతుంది. స్మృతి పార్శ్వం ఉన్న కావ్యం మానవ హృదయాన్ని మరింత విచలితం చేస్తుంది. భవభూతి 'ఉత్తర రామ చరిత'లో శ్రీరామచంద్రుని శోకాన్ని వర్ణించారు. ఈ ఘట్టాన్ని స్మృతి కవిత అని అనకుండా ఉండలేం. ఈ నాటకంలో ఛాయాంకాన్ని చదువుతున్న పాఠకుడూ, ప్రదర్శనను తిలకిస్తున్న ప్రేక్షకుడూ సమంగా కంట నీరు పెడతారు. అందుకే భవభూతి 'ఏకోరసః కరుణయేవ' అన్నారు.

'స్మృ ఆధ్యానే స్మృతి' అన్న శబ్దోత్పత్తి స్మృతి. అంటే స్మరణం అనే అర్థాన్నిస్తుంది. తల్లి, తండ్రి, తోబుట్టువులు, భార్య మరణించినపుడు శాశ్వత వియోగం కలుగుతుంది. ఇలాంటి సంఘటనలు సంభవించినపుడు కలిగే దుఃఖావేశంలో వారిని స్మరించుకుంటూ రాసే రచనలు స్మృతి కావ్యాలనబడుచున్నవి.

ప్రాచీన సాహిత్యంలో కూడా స్మృతి రేఖలు కన్పిస్తున్నాయి. మహాకవి శ్రీనాథుడు తన చరమజీవితంలో దయనీయమైన జీవితాన్ని గడుపుతూ తనకు ఆశ్రయమిచ్చి శివైక్యం పొందిన రాజన్యులను 'కాశికా విశ్వేశు గలిసె వీరారెడ్డి'[46]అన్న పద్యంలో స్తుతించారు. ఈ పద్యం స్మృతి కవితా ప్రక్రియకు స్ఫూర్తిదాయకంగా ఉందని చెప్పవచ్చు. శ్రీనాథుడు స్మృతి కావ్యాలకు ఆద్యుడిగా[47] నిలిచినప్పటికీ కావ్య ప్రబంధయుగాలలో ఇవి బహుతక్కువే.

పాశ్చాత్యుల ఆత్మాశ్రయ కవిత్వం స్మృతి కావ్యాలు (Elegy) ప్రధానమైనవి[48]. గ్రే, మిల్టన్, షెల్లి, టెన్నిసన్, గోల్డ్‌స్మిత్, బ్రౌనింగ్ వంటి పాశ్చాత్య కవులు అనేక స్మృతి కావ్యాలు రాశారు. "ఒకానొక ప్రత్యేకమైన వ్యక్తికి సంబంధించిన మరణ దుఃఖమును నిశితముగా వర్ణించు కావ్యములను మరియు మానవ జీవితము యొక్క మానవీయతను, అల్పత్వమును కాల గర్భములో కలిసిపోవుటను గూర్చిన తాత్త్వికముగా విచారించుచు వ్రాయబడిన కావ్యములను ఏలిజీ[49]లని చెప్పబడుచున్నవి.

పాశ్చాత్య కవుల ప్రభావంచే తెలుగు కవితా వృక్షానికి విరగకాసిన ఫలాలే స్మృతి కావ్యాలు. పందొమ్మిదో శతాబ్ది చివరన వావిలాల వాసుదేవశాస్త్రి, వడ్డాది సుబ్బరాయుడు స్మృతి కావ్యాలు రచించినా, ఆ కావ్యాలలో నవ్యత లేదన్న విమర్శ సాహితీ లోకాన నెలకొంది. అయితే ఆధునిక తెలుగు కవులలో మొట్టమొదటి స్మృతి కావ్యాన్ని రచించినది రాయప్రోలు వారు. పిదప దువ్వూరి, నాయని, జాషువా, విశ్వనాథ, బసవరాజు అప్పారావు, కుందుర్తి, రావూరి భరద్వాజ వంటి కవులు స్మృతి రచనలు చేశారు. మరి కొందరు ఆధునిక కవులు కొన్ని ఖండ కావ్యాలు రాశారు. తిలక్ రచన 'నెహ్రూ' సాహితీలోకంలో బాగా ప్రచారం పొందింది. సినారె తన సతీమణి పరలోక గతురాలైనపుడు రాసిన 'నాలుగు నదుల తల్లి' కవిత ఆయన హృదయ సమార్ద్రతను ప్రకటించేదిగా ఉంది.

తల్లిదండ్రులు, సోదరీసోదరులు మొదలైన వారిని స్మరించుకుంటూ రాసిన గీతాలు ఆప్త స్మృతి కావ్యాల కోవలోకి వస్తాయి. ఆప్తులను స్మరించుకుంటూ రాసిన కావ్యాలలో మాతృ స్మృతి కావ్యాలే ఎక్కువ. వావిలాల వాసుదేవశాస్త్రి 'పిత్రారాధనము' తెలుగులో మొదటి పితృ స్మృతి కావ్యంగా చెప్పుకోవచ్చు. పితృ వియోగానికి వగచి రాసిన స్మృతి కావ్యాలు అరుదు. బసవరాజు తన తండ్రి మరణానికి వగచి 'పితృ స్మృతి' అనే గీతం రాశారు. మోటూరి వెంకట రావు కూడా పితృ మరణాన్ని 'ఆహుతి'[50]లో స్మరించుకున్నారు.

ఆత్మ వినాశనమైనది.[51] ఆత్మను పంచభూతాలు ఛేదించజాలవు. ఆత్మకు మరణం లేదు. కేవలం భౌతికమైన శరీరం మాత్రమే నశిస్తుంది.[52]అని ఎంత తెలిసినా విషాద భరిత దృశ్యాలకు దుఃఖించని మనిషుండడు. దుఃఖం మానవనైజం. అందుకు కవి మినహాయింపు కాదు.

తన తండ్రియైన శ్రీనివాసాచార్యుల మరణం తిరుమల హృదయాన్ని కదిలించివేసింది. ఆయన భావ జలధిలో తరగలెత్తిన ఊహలన్నీ విషాదాన్ని సమ్మిళితం చేసుకొని కవితగా జాలు వారింది. ఆ విషాద పూరితమైన కుదుపు నుంచి కన్న తండ్రి పవిత్ర జీవితం కవి హృదయనేత్రాలకు ఎంత ఆత్మీయంగా దర్శనమిచ్చిందో ఈ పద్యాన్ని విలోకిస్తే తెలుస్తుంది.

ఎన్ని దినాలకేని, మరియెన్ని ఋతు భ్రమణాలకేని, యిం
కెన్ని తరాలకేని మరియెన్ని యుగంబులకేని, యెన్ని సం
పన్న భవాలకేని రసభావ జగద్ధిత బుద్ధి నొప్పు నీ
కన్న పవిత్ర జీవనుని గాంచుట సాధ్యమే తండ్రి! నాకికన్[53]

విచలితమైన మానసం నుంచి వెలువడిన అంత్యప్రాసలు పద్యంలో పరచుకొని ఉన్నాయి. ఇవి తిరుమల గుండెలో కరళ్ళెత్తుతున్న వ్యథా భరితమైన ఆత్మస్థితిని ఆవిష్కరించాయి. తన దేహంలో తరగలెత్తుతున్న ఆత్మశక్తికి ప్రేమికుడూ, భావకుడూ అయిన తండ్రి తరలిపోవడం కవి గుండెల్లో మంటలను ప్రజ్వలింపజేసింది. ఆ మంటలను ఏవి చల్లార్చుతాయి! చల్లారడానికి అవి మామూలు మంటలు కావుగదా! గుండెలోని మంటలు కదా!

గుండెకు మంట వెట్టితివి, కోటలు పేటలు దేశదేశముల్
మండలముల్ మహానదులు మార్మిక ధార్మిక భావసీమలున్
కొండలు గుట్టలున్ నిగమ కోవిద వాక్యములున్ మరెన్నిటన్
మండుచు పర్వులెత్తితినొ మంటలు నార్పుకొనంగ వెర్రినై[54]

పితృదేవుడు అనుక్షణం తన మనసు కళ్ళకు కన్పిస్తున్నాడు. ఇన్నాళ్ళూ ఆ తండ్రితో సాగిన నేస్తం వలన చేకూరిన ఫలితాలు కూడా పదే పదే హృదయంలో కదలాడుతున్నాయి.

అవి అలా మనస్సులో స్వరిస్తుంటే కళ్ళ నుంచి భాష్పధారలు పొంగి వస్తుంటాయి.



అవి మంచు తెరలలా కళ్ళకు అడ్డుగా నిలుస్తాయి. చూపు అంత స్పష్టంగా తోచదు. అయినా లోచూపుల కిరణాలకు అందుతున్నది కన్న తండ్రి రూపమే ఆత్మస్వరూపమే.

తండ్రి భౌతిక స్వరూపం మట్టిలో విలీనమైపోతున్న బాధాకరమైన సన్నివేశంలో

మట్టికినాడు ఆకలి పుట్టెనేమొ
నిన్ను పొట్టను పెట్టుకొనెన్ మహాత్మ[55]

అని కంట నీరు పెట్టారు. పుట్టిన ప్రతి ప్రాణీ మట్టిలోకి వెళ్ళవలసినదే. అయినా పితృవియోగం మనస్సును తొలచివేస్తూ విషాదంలో ముంచిన సమయంలో కవి ఇలా భావన చేయటం సహజం.

శ్రీనివాసాచార్యుల వారు చితిమంటలలో దహింపబడుతున్న దృశ్యం తిరుమలను మరెంతగా కంపింపజేసిందో, కలవరింపజేసిందో ఈ పద్యాన్ని చూస్తే తెలుస్తుంది.

ఎండిన కంపలు కాల్చుచు
మండెడు ఆ మంటకేమి మనసున్నది? తా
నెండియు సువాసనలు తరు
షండంబున కిచ్చు గంధ సాలము గాల్చెన్[56]

అంటూ వాటికి సచ్చరిత్రం లేదని నైచ్యమే సన్నుతికెక్కుతుందని తిరుమల అంటారు.

కన్న తండ్రి తన సంతతిని అనేక విధాలా లాలిస్తాడు. ఆత్మీయతను కురిపిస్తాడు. అనురాగాన్ని పంచుతాడు. తన వాళ్ళ ఆనందాన్ని చూచి మరీ పొంగిపోతాడు. తన ఆశయాలు తన సంతతిలో పరిమళిస్తుంటే, ఉవ్వెత్తుగా ఎగిసివస్తుంటే పట్టరాని సంతోషంతో ఊగిపోతాడు. మురిసిపోతాడు. ఆదమరచి నిదురపోతాడు. అలాంటి నాన్న ఉపలాలన, అందించిన చేయూత తిరుమల ఎడదలో ఎన్ని ప్రకంపనాలను కలిగిస్తున్నాయి. ఎన్ని వలయాలను గిర్రున తిప్పేస్తున్నాయి.

నీతో నవ్వుచు నాడినట్టి పలుకుల్ నేడిట్లు నాలోన మా
ర్మోతన్ నిప్పుల కుప్పలై రగిలినన్ ముంచెత్తుచుండెన్ వ్యథా
పాత బందున, ఏమి సేతు? వినిపింపరావు ఏ మాటలన్
నాతోఁబల్కవు, దించినావు తెర నాన్నా! అంక మధ్యంబునన్!![57]

తండ్రి మరణం కవిని ఎన్ని విధాలుగా కుంగదీసిందో తలచుకుంటే గుండె అనేది ఉంటే మోయలేనంత బాధగా అనిపిస్తుంది.

గొంతు నొక్కినట్లు, గుండె చిదిమినట్లు
బళ్ళెమునకు గ్రుచ్చి పట్టినట్లు
కన్ను పొడిచినట్లు, వెన్ను విరిచినట్లు
తోచె నీ మరణము తూలిపోతి!![58]

గొంతు నొక్కబడితే మిగిలేదేమిటి? గుండె చిదమబడితే జరిగేదేమిటి? దేహం బల్లానికి గుచ్ఛబడితే, కన్ను చిదమబడితే, వెన్ను విరవబడితే ఎంత బాధగా ఉంటుందో కన్న తండ్రి మరణిస్తే అంతే ఆవేదనగా ఉంటుందంటారు. అంతే కాదు, ఆయన అడుగు ముందుకు పడదం లేదు. ఎడద శూన్యంగా మిగిలిపోయింది. తన అనంతావేదనను అక్షరాల కుప్పలుగా పోశారు తిరుమల.

తిరుమల తండ్రి వేదవిదుడు. అమరభాషను తరచిన మహాభావకుడు. అలాంటి ఉపనిషత్‌వేత్తకు అమరిపురి ఇట్లా స్వాగతం పలుకుతుందట.

వేద విజ్ఞాన ఘంటా నినాదములను
మారు మ్రోగించు నీ గుండె మాటు మణగు
నప్పు డెన్నెన్ని గంటలు అమరపురిని
మ్రోగెనో! నీదు రాకకు స్వాగతముగ[59]

తన తండ్రి మరణించిన తరుణంలో తిరుమల ఆయన సన్నిధిలో లేరు. కారణాంతరాల వలన దూరంగా ఉండిపోయారు. ఆ దౌర్భాగ్యాన్ని తలచుకొని కవి ఇట్లా చింతించారు.

నీ నిర్యాణము నాడు లేనయితి తండ్రీ! నీకు పుత్రుండనై
ఈ నా పుట్టువు మాసిపోను, విధినన్ సృష్టించి, వంచించె, దూ
రానన్ భుక్తికి వృత్తి జేసుకొను దౌర్భాగ్యంబుఁ గల్పించి నీ
తోనే నుంటిని కొన్ని నాళ్లయిన? ఏ దుర్యోగమా! శాపమో![60]

ఆచార్యులకు అయిదుగురు కూమారులు. తండ్రి పరమపదం చేరడంతో ఆ కుమారుల జీవితం సరియైన మార్గంలో నడవక పోవచ్చు. ఈ విధానాన్ని కన్న తండ్రి ఎలా భరిస్తాడు అని కవి ఈ దిగువ పద్యం రాశారు. ఇది ఆయనదైన ఒక విశిష్టమైన పంథాకు నిదర్శనం.

పుట్టిన పుత్ర పంచకము పోడిమి దక్కి చరింతు మింక, నీ
వెట్టుల నోర్చుకొందువా! మరెక్కడనో ఎటులుందువో! సరే
అట్టిటు గాని చూచెదను, హాయిగ నుండెన మింటిదారి నీ
కట్టిన రాజ సౌధముల కంటె? ఎడాటము నీకు వేడుకే!![61]

తిరుమల తండ్రి జీవించి ఉన్నప్పటి స్థితి, ఆయన అస్తమించినపుడు ఏర్పడిన పరిస్థితులను కవి హృదయవిదారకంగా ఆవిష్కరించారు.

నీవు దీపమై నట్టింట నిలిచికాంతు
లీనునపుడు చీకటి మాట లేదు మాకు
ఆరి పోతివి నీవు గాఢాంధకార
బంధురంబయ్యె నాన్న! సర్వమ్మునేడు!![62]

సంపుటిలో ఉన్న అన్ని పద్యాలు కవి హృదయాన్ని చీల్చుకొని అపూర్వమైన భావనా



సృష్టిగా అవతరించాయి. శ్రీనివాసాచార్యులు కేవలం కన్న బిడ్డలకు తండ్రి మాత్రమే కాదు. ఆయన సర్వులకూ ఆరాధనీయమైన వారు. కారణం ఆయన బ్రహ్మజ్ఞాని, ఆత్మ స్వరూపాన్ని వింగడించి చురుకుగా అందించే వేత్త. ఆధ్యాత్మజ్ఞాన సంపన్నులు. విద్వాంసులు. వివేక నిధులు అయిన అట్టి మహాత్ముల సన్నిధిదవ్వగుట మనకు తెలియని లోటు విధిర్వానమ సంహార్య" అని మధునాపంతుల అన్నట్టు ఆచార్యులు ఆధ్యాత్మను సుశోభితం చేసిన మహనీయులు. ఆ పుణ్యమూర్తి అస్తమయంతో తిరుమల హృదయం ఎట్లా క్షోభిస్తున్నదో ఈ పద్యంలో చూడవచ్చు.

నీవు నవ్వుల పువ్వుల తావు లీను
వేళ యిల్లు వసంతమై వెల్లి విరిసె
వెడలి పోయితి వీవు మా యెదదలన్ని
మ్రోడులైపోయి శిశిరంపు నీడలయ్యె[63]

అని మానసాలు బద్దలయ్యే విధంగా వర్ణించారు. ఇంకా

కప్పులేని యింట కాపురంబున్నట్లు
నీవు లేని యింట నిలిచినాము
నీవు తా నయిన వినీలాభ్రమే మాకు
సర్వ విషయములకు ఛత్రమింక!![64]

అని తండ్రి ప్రాముఖ్యాన్ని తలపోశారు. తిరుమల తన అమ్మానాన్నల మధ్య ఉన్న అనురాగబంధాన్ని అనేక విధాలుగా తలపోశారు. అమ్మను ఒంటరి చేసినందుకు ఆవేదనను ప్రకటించారు.

తావియు పూవువోలె, నెల తాలుపు పార్వతివోలె, తీవెయున్
పూవును బోలె, నిండునెల - పున్నమి వెన్నెల వోలె, చిత్తమున్
భావము వోలె, శ్రీహరియు వారధి నందనవోలె, అమ్మయున్
నీవును గాదె, ఎట్లు విడి నిల్చితి వొంటిగ మింటి పంట వై[65]

ఆలుమగల మధ్య పెనవేయబడిన అనుబంధాన్ని ఆధునిక కవులు ఎంతో గాఢంగా వర్ణించారు. స్వర్ణకమలానికి సువాసనలు, వీణకు పాట తోడైనప్పుడు ఆ దాంపత్యం ఉదాత్తంగా ఉంటుందని గానం చేశారు. అయితే తిరుమల వర్ణనలో ఒక ప్రత్యేకత ఉంది. తన తల్లిదండ్రులను ఆది దంపతులతో పోల్చుకోవడం, విడిపోని ఆ దంపతుల వలె ఉండక ఎట్లా ఒంటరిగా పోయాడని ప్రశ్నించటం విశేషం. ఆ తండ్రి ఎలాంటి వారంటే శేషేంద్ర శర్మ మాటల్లో 'ఒక విజ్ఞాన సాగరం'.[66] అలాంటి పుణ్య పాదోధి ఇంకిపోవడం వలన కలిగే ఆవేదనను తెలపడానికి అక్షరాలు చాలవు. తిరుమల ఎంతో గుండెనిబ్బరంతో అమ్మానాన్నల మధ్య పవిత్రంగా అల్లుకొని ఉన్న అనుబంధాన్నీ, ఒంటరిదైపోయిన అమ్మ అంతరంగ క్షోభనూ పై పద్యంలో చిత్రించారు.

శ్రీనివాసాచార్యులు పుణ్య పురుషులు. ఆయన ఆధ్యాత్మిక, భౌతిక స్థితిగతులను సొంతం చేసుకున్న ద్రష్ట. ఆ సాహిత్య మూర్తిని గురించి డా॥ నందూరి రామకృష్ణమాచార్య "ఆయన అనుష్ఠాన వేదాంతి. జీవన్ముక్తుడు. మేటి మేధావులలో మేరు శిఖరి. అతిలోక తేజస్వి. ఆయనతో గడిపిన కొన్ని ఘడియలు నేను విశ్వవిద్యాలయంలో గడిపిన నెలల కంటే విలువైనవి"[67] అన్న మాటలు చాలు వారి పాండిత్యాన్ని తెలుసుకోవడానికి అందుకే తిరుమల

తిరుమల వంశాబ్ధి మహా
పురుషుండవు తండ్రి! నీదు పుట్టువు వలనన్
తరములె తరించును యశః
కరుడవు నిన్ దలచుకొన్న కలుగును శుభముల్[68]

అని అభివర్ణించారు. అలాంటి పవిత్ర మూర్తి వల్ల

భవ్య భవదీయ చరణ సంస్పర్శజేసి
పల్లవించెను మోడులు పల్లవించె
బీడులు తుదకు నేనును పేరుకెక్కి
నాడ భవదీయ పుత్ర జన్మంబు నొంది!![69] తినని శ్లాఘించారు.

'మహావిద్వాంసులు మీ పితృపాదులు'[70] అని దాశరథి, 'వారు పరమ వేదాంత నిష్ఠులై జీవితం గడిపినారు. వారి జీవితం ధన్యం'[71] అని వేదుల సూర్యనారాయణ శర్మ అన్నట్టుగానే శ్రీనివాసాచార్య ధీశాలి. 'చతుర్వేద సారమైన భారతంలోని వైశిష్ట్యాన్ని, పంచమ వేద పరమతత్వాన్ని అపూర్వ పరిశీలన పరిశోధనలతో గ్రంథస్థం చేస్తూనే మోక్షప్రాప్తినందారు"[72] అని పి.ఎస్.ఆర్. ఆంజనేయ శాస్త్రి ఆచార్యుల పరిశోధనా తత్పరతను కొనియాడారు.

వేదము సర్వమున్ ఎఱిగి, విశ్వ పదార్థ విశేషమెంచి జ్ఞా
నోదయ మిశ్ర మార్గమును నూతన రీతి వెలార్చ, దివ్య సం
పాదన నెల్లరే పవలు పంచి తపించెడు నిన్ను చూడగా
రాదని ఆన వెట్టి విధి, రక్షణలేదు బుధాళికిమ్మహిన్!![73]

ఆచార్య తిరుమల తన కన్న తండ్రి ప్రతి కదలిక సమాజానికి, తమకూ ఎలాంటి శ్రేయస్సును కలిగించిందో అభివర్ణించారు. తండ్రి అస్తాదిని చేరుకోవడం వల్ల వ్యాపించిన చీకట్లలో లోకం తపించిపోతున్నట్టుగా, వేదజ్ఞానాన్ని ప్రసాదించి లోకం అంతరంగంలో తిష్టవేసిన చీకట్లను తుదముట్టించడానికి అక్షరజ్యోతులను దానం చేసి పోయిన కన్న తండ్రి రుణాన్ని కవి కొంత వరకు ఈ రచన ద్వారా తీర్చుకున్నారు. అంతే కాదు.



చుక్కలలోన చుక్కవయి శోభిలుచుండిన యెట్టులైన నిన్
చక్కగ జూడ నేర్చెదను సర్వకళామయ! మిన్నుమిన్నుమన్
చుక్కవు కావు నీవు రవి సోముల తేజము ధిక్కరించు నీ
వెక్కడ? చుక్కలెక్కడ? అతీంద్రియ శక్తివి మాట లేటికిన్[74]

అంటూ కీర్తించిన తిరుమల ధన్యజీవులు. శ్రీనివాసాచార్యులు అరువది నాలుగు సంవత్సరాల మూడు మాసాలు జీవిస్తే, తిరుమల ఈ కావ్యంలో అరువది నాలుగు పద్యాల పిదప ఒక పాదం రాశారు. ఇదొక విశేషంగా విమర్శకులు భావిస్తున్నారు. ఇది ఆయన పవిత్రమైన పితృభక్తికి చక్కని తార్కాణ.

## (ఈ). గురు భక్తి

జననీ జనకుల పిదప ఆచార్యునికి పవిత్రమూ, ఉత్తమమూ అయిన స్థానం ఉంది. మరొక విధంగా చెప్పాలంటే మాతాపితల కంటే కూడా 'గురువు' ఆరాధనీయమవుతున్నాడు. 'గురుబ్రహ్మ', 'ఆచార్యదేవోభవ' అనే ఉపనిషద్వాక్యాలను సాలోకించినప్పుడు దేవుని పిదప అంతటి స్థానాన్ని అలంకరించిన పుణ్యపురుషుడు గురుదేవుడు. ఆయన బోధన నుంచి ఎందరు దిక్కులను వెలిగించిన చైతన్య మూర్తులయ్యారో చరిత్ర సాక్ష్యం చెబుతుంది.

తెలుగులో ఆనాటి నుంచి ఈనాటి వరకు చాలా మంది కవులు తమ కవితా శక్తితో గురుదేవులను ఘనంగా కీర్తించిన వారే. ముఖ్యంగా కృష్ణశాస్త్రి తమ గురుదేవులను 'దివ్యర్షి' అని వర్ణించడం ప్రత్యేకంగా ఉంది. "ఈ జడ జీవితమ్ము బ్రతికించితివీ యఘ పంకమందు నంభోజము మొల్వజేసితి"[75] వని అంటూ కరుణశ్రీ తమ గురుదేవులను కీర్తించారు. అంతే కాదు, "సాక్షాత్పాణినివో పతంజలివో అస్మద్దేశిక స్వామివై దాక్షిణ్యంబున చేరదీసి అనవద్యంబైన విద్యాధనం బక్షయ్యంబగు భిక్ష పెట్టితివి"[76] అని శ్లాఘించారు. ఇంకా కొందరు ఆధునిక కవులు తమ భావనా సీమల్లో ఆచార్యులను దైవంగా తలపోశారు.

తిరుమల తమ గురుపరంపరను కీర్తించారు. ఆ స్తుతిలో దాస్యభావం కన్పిస్తుంది.

పరమ రహస్య విద్యలకు పట్టిన గంధ పరీమళంబువై
వరలు మహాత్మ! నీ పదము బట్టితి దివ్య రసావతారమా
సురుచిర వేద రూప! మధుసూదన ఓర్చు జగద్గురూత్తమా!
కరుణను జ్ఞాన ధారలిడివావుము నన్ను నమస్కరించెదన్[77]

అక్షరాలతో కవితాక్షరాలతో స్వేచ్ఛగా విహరించడానికి దోహదపడిన గురువు పదాలను కవి ఆశ్రయించిన తీరు బాగుంది. ఒజ్జ మధుసూదనులు తొలుత కవి హృదయ సీమల్లో వర్ణించిన తీరు కమనీయంగా ఉంది.

తిరుమల గురు పరంపరలో చల్లా కృష్ణమూర్తిని ఘనంగా భావించారు.

స్మరియింతున్ కరుణాన్వితు
వరణీయ గుణాఢ్య వేద వాఙ్మయ కలితున్
గురుదేవున్ నా హృదయే
శ్వరు చలా కృష్ణమూర్తి శాస్త్రి పవిత్రన్[78]

తిరుమల తన గురువైన శాస్త్రిని హృదయేశ్వరుడన్నారు. ఇదొక పవిత్ర ప్రయోగం. గురువును తండ్రిగా, దైవంగా భావించిన వాళ్ళున్నారు. కాని, తిరుమల హృదయేశ్వరుడు అని ఒక వినూత్న ప్రయోగం చేశారు. ఇది మధుర భక్తికి తార్కాణం.

చదువు నేర్పే గురువులకిదె మా వందనం
జ్ఞాన దాతల చరణధూళికి వందనం
శాంతి మూర్తులు - స్వచ్ఛకీర్తులు
సుజన చంద్రులు - సుగుణ సాంద్రులు
గురులు సుర తరులు
.................................
ఎంత ఘనులకు నైనా గాని
గురువులే ప్రత్యక్ష దేవులు
.................................
కోటి సూర్యులున్నా - కోటి చంద్రులున్నా
గురువు మాట లేకుండ ఎద చీకటి పోతుందా?
జ్ఞాన జ్యోతి వెలిగించి మము ప్రగతికి నడిపించే
గురువే బ్రహ్మ - గురువే విష్ణువు గురువే మహేశ్వరుడు
ఆ త్రిమూర్తి రూపున కిదె వందనం
ఆ దయాంత రంగున కిదె వందనం[79]

అంటూ 'గురువు' శబ్దానికున్న విశిష్టతనూ, పవిత్రతనూ కీర్తించారు. తిరుమల గురువు ఎడల చాలా వినమ్రమైన మనస్సు కలవారు. తనకు అబ్బిన సాహితీ సంపద అంతా గురువుల ఆత్మీయత, అనురాగం వల్లనే చేకూరిందని, తాను ఎదగడానికి వ్యక్తిత్వాన్ని సుజన విధేయంగా పండించుకోవడానికి గురువులే ప్రధాన కారణమని చెప్పారు. కవితలో సంకీర్తించి కృతజ్ఞతలు చెప్పుకున్నారు.

## (ఉ). దేశ భక్తి

భారతదేశం మన మాతృభూమి. మాతృమూర్తి. మాతృమూర్తిని గౌరవించడం, ప్రేమించడం, కీర్తించడం, గొంతెత్తి పాడడం అనే వన్నీ దేశభక్తి ప్రేరకాలు. మన సంప్రదాయ లక్షణాలు. ఈ సంప్రదాయం రామాయణ కాలంలోనే ఉన్నట్లు చెప్పవచ్చు. అందుకనే 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి' అని రాముడి చేత లక్ష్మణుడికి చెప్పించాడు మహాద్రష్ట వాల్మీకి.



మాతృమూర్తి ప్రేమానురాగాలు రంగరించి, స్తన్యమిచ్చి బిడ్డల్ని పెంచి పెద్ద చేసి వాళ్ళ కోసం ఏ త్యాగమైనా చెయ్యడానికి సిద్ధంగా ఉంటుంది. ఆమె ఒడిలో, పాలనలో, లాలనలో వాళ్ళు మైమరచిపోతారు. ఆమె సన్నిధిలో అమర సుఖాలు అనుభవిస్తారు. అందుకే తల్లిని గౌరవిస్తాం. అలాగే మాతృదేశ ప్రాంగణంలో ప్రాణం పోసుకున్న ప్రజలు అక్కడి వాతావరణాన్ని జీర్ణించుకొని, ప్రకృతి సంపదలో పరవశిస్తూ తమ జీవితాన్ని తీర్చిదిద్దుకొంటారు. అందుకే దేశాన్ని తల్లిగా భావిస్తాం. కీర్తిస్తాం. తమ మనుగడకు ఆధారమైన దేశంమీద పౌరులందరికీ అభిమాన మమకారాలుండడం సహజం. ఈ అభిమాన మమకారమే దేశభక్తి. జాతిని నిద్రలేపడం, జాగృతిని కలిగించడం, ఆచరణలో ఉన్న విశిష్టతను చాటడం దేశభక్తే అవుతుంది.

ప్రతి దేశానికీ ప్రముఖంగా ఒక సంస్కృతి ఉంటుంది. నిర్దిష్టమైన సంప్రదాయాలు, ఆచార వ్యవహారాలు, ఒక జీవన విధానమూ ఉంటాయి. ఈ జీవన విధానమే ప్రజలలో ఒక అంతస్సూత్రంగా ఏర్పడి భిన్నత్వంలో కూడా ఏకత్వాన్ని కలిగిస్తుంది. సమైక్య భావాన్ని సమాజ నిష్టం చేస్తుంది. ఈ సమైక్య భావమే ఇది నా దేశం, ఇది నా జాతి, ఇది నా జీవిత పథం అని ప్రతి పౌరుడిలోనూ కలిగే భావనమే జాతీయత. జాతీయతలోని ముఖ్య లక్షణం దేశభక్తి.

తమ జీవితాలను మట్టిని మణిగా దిద్దడానికి అర్పించిన క్రాంతి పురుషుల కదలికలు అన్నీ దేశభక్తిని శక్తిమంతం చేయడానికి ఉపయోగించిన భిన్న పార్శ్వాలే. దేశభక్తి సర్వకాలికమైంది. అక్షర రూపం దాల్చిన పదాలలో ఉన్న శబ్దశక్తి చెప్పే ధోరణి, సరళిని బట్టి ఉంటుంది. విపత్కాలలో మాత్రమే తాత్కాలికంగా దేశభక్తిని ప్రదర్శించడం సరిపైన విధానం కాదు. దేశాభిమానం నాకు కద్దని వట్టి గొప్పలు చెప్పుకోకుండా, పూనియేదైన ఒక మేలు జనులకు చేకూర్చుతూ, దేశమంటే మనుషులే కాబట్టి మనిషికోసం శ్రమిస్తూ మాతృభూమి సేవ చేయడమే నిజమైన దేశభక్తి. మహాభారతంలో నన్నయ్య గోదావరి నదీ తీరంలోని వేంగి దేశాన్ని[80] వర్ణించి తన మాతృభూమిపై గల ప్రేమాభిమానాన్ని చాటుకున్నారు. పాల్కురికి సోమనాథుడు, తిక్కన, ఎర్రన, పెద్దన వంటి ప్రాచీన కవులు తమ కావ్యాల్లో ఆయా చోట్ల తమ దేశభక్తిని చాటుకున్నారు.

ఆధునికాంధ్ర కవిత్వంలో దేశభక్తి రెండు పాయలై ప్రవహించింది. జాతీయాభిమానం ఒకటైతే, ఆంధ్రాభిమానం రెండవది. జాతీయాభిమానంలోని ముఖ్య లక్షణం దేశభక్తి. "జాతీయతకు దేశం పునాది; జాతి కాదు, ధర్మం కాదు, మరింకేదుయు గాదు; కేవలము దేశమే జాతీయత యొక్క మిగిలిన ఉపకరణములన్నియు గౌణములు, ఉపకారకములు మాత్రమే. దేశమే ముఖ్యమయినది. అవశ్యకమయినది"[81] అని అరవిందులూ, "The principle of nationality depends upon the fact that the supreme organic circumstances in moulding the destiny of man, is place.... In the realm of thought.... each man must recognise his birth land as the supreme fact in

his life, and must consciously bow him self to her influence, glorying in it, and striving to rediscover and realise it in its essentials. In the realm of feeling, he must relate himself to the birth land and to all those who, with him, are born of her"[82] అని సిస్టర్ నివేదిత అభిప్రాయ పడినారు. ప్రజల అంతరంగాలలో దేశభక్తి సహజ సిద్ధంగా గూడుకట్టుకొని ఉంటుంది. దేశం ఏదైన విపత్కర పరిస్థితికి లోనైనప్పుడు ఆ దేశభక్తి వెల్లువలాగా ఉప్పొంగి ప్రవహిస్తుంది. ప్రజలలో నవచైతన్య తాండవిస్తుంది. కవులు కవితాత్మకంగా స్పందించి ఆ చైతన్యాన్ని ఉత్తేజపరుస్తారు.

పరాయివాళ్లు అమ్మ నుదుటి కాశ్మీర తిలకాన్ని సొంతం చేసుకోవాలని దురాక్రమణ చేసినపుడు మాతృభూమి సౌభాగ్యాన్ని కాపాడుకోవడానికి సాగించిన సమరం కూడా దేశభక్తే. తనకు జన్మనిచ్చిన మట్టిని గురించి మాత్రమే కాక తన మతంలోని మంచిని ఎలుగెత్తడం, భక్తి భావనను ప్రవహింపజేసి భిన్నత్వంలో ఏకత్వం అనే చెట్టుకు మరింత హరిత శోభను చేకూర్చడం దేశభక్తి కవితలోని విభిన్నాంశాలుగా కన్పిస్తాయి. స్వార్థాన్ని దూరంగా విసిరేసి సంకుచితత్వాన్ని గెంటేసి అలసత్వాన్ని తరిమేసి కాలం కన్నా ముందుగా పరుగులు తీసే పుణ్య పురుషుల జీవితాలు దేశభక్తికి ఊపిరులుగా భాసిస్తాయి.

పరదేశీయుల వంచనను తొలుత పసిగట్టని భారత జాతి ఎందరు అన్యదేశీయులు ఈ గడ్డ మీద కాలుపెట్టనప్పటికీ ఆత్మీయంగా తమలో చేర్చుకుంది. అది అనంతర కాలాల్లో అంత పవిత్రంగా ఉండి పోయింది కాదు. వాళ్ళు ఏ లక్ష్యం కోసం వచ్చారో వాటిని సాధించుకోవడానికి అఖండ భారతజాతిని వేరు చేసి అసూయాద్వేషాలను మండించి సొంత లాభాన్ని పొందారు. భారత సంస్కృతీ సంప్రదాయాలను కించపరచడం, స్వీయాచారాలను ప్రజల మీద బలవంతంగా రుద్దడం వంటి మానవేతర కృత్యాలకు పూనుకున్నారు.

పందొమ్మిదో శతాబ్దినాటికి భారతదేశం అంతా శ్వేత జాతీయుల పతాక నీడల్లోకి వచ్చింది. వాళ్ళకోసం ఏర్పాటు చేసుకున్న తంతి తపాలా, రోడ్డు నిర్మాణం వంటివి భారత జాతిని ఒకే బాట మీద నిలవడానికి దోహదపడ్డాయి. విశాల భారతం ఒకే మాతృమూర్తిలా దేశీయులకు దర్శనమిచ్చింది. ఈ భావన భారతజాతిని సమైక్య పరచింది. పోరాటానికి ఉసిగొల్పింది.

ఆనాడు సాగిన జాతీయ సమరానికి కవులు, స్వాతంత్ర్యేచ్ఛగలిగిన గాయకులు ఆలపించిన వీరగీతాలు ప్రజల్లో చైతన్యాన్ని కలిగించాయి. బంకించంద్రుని వందేమాతరం అసేతుహిమాచలం దాకా కదిలించివేసింది. తెలుగు కవులు కూడా ప్రజావళిని జాగృతం చేసే రచనలు కోకొల్లలుగా వెలయించారు. ఇవి అనేక ప్రక్రియలలో వచ్చాయి. తమ దేశభక్తిని చాటి చెప్పడంలో తెలుగు కవులు ఏనాడూ ఎవ్వరికి తీసిపోలేదు. స్వాతంత్రోద్యమ కాలంలో మన కవులు కవితాస్త్రాలు సంధించి వీర విహారం చేసారు. ఈ ఉద్యమం కవి కుమారుల్లో నిద్రాణమై ఉన్న జాతీయ భావాలను జాగృతం చేసింది. ఊహాప్రేయసిపై



మధుర గీతాలనాలపించే ప్రేమ జీవులను వీర పురుషులుగా తీర్చిదిద్దింది. తమ కలం బలాన్ని లోకానికి చవి చూపారు కవి వరేణ్యులు. ఆవేశంతో, ఆవేగంతో, ఆవేదనతో హృదయాన్ని చీల్చుకొని వచ్చిన ఈ స్వాతంత్ర్య భావ పూరిత గీతాలు యావదాంధ్రులను ఉత్సాహపరిచాయి. ఉద్రేక పరిచాయి. ఉద్వేగ పరిచాయి. ఎముకలు కుళ్ళి వయస్సు మళ్ళిన వారి నరనరాల్లో సైతం నెత్తురు నిండిన శక్తులను పండించాయి. ఆధునికుల్లో చిలకమర్తి, గురజాడ, రాయప్రోలు, విశ్వనాథ, తుమ్మల, జాషువా, కొడాలి – మాటలను ఈటెలుగా, బాకులుగా మార్చుకున్నవారే. "కరుణశ్రీ భారతమన్న మాట వినగానే నిలువెల్ల కరిగేపోయే దేశభక్తుడే. జాతీయ భావాలు గుబాళించే కవితా గుచ్ఛాల్ని లెక్కకు మిక్కిలిగా కైసేసినవాడే"[83] భావకవుల్లో కృష్ణశాస్త్రి దేశభక్తి ప్రేరకమైన రచనలు అనేకం సృజించారు.

జాతీయోద్యమ ప్రభావితుడైన చిలకమర్తి –

భరత ఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ
తెల్లవారను గడుసరి గొల్లవారు
పితుకుచున్నారు మూతులు బిగియ గట్టి[84]

అనే పద్యంలో తెల్లవారి ఆగడాల్ని ప్రజల దృష్టికి తెచ్చారు. 'ఏ దేశమేగినా ఎందు కాలిడినా' అనే గేయంలో రాయప్రోలు తెలుగు జాతిని దేశాభిమానంతో ఉర్రూతలూగించారు. గురజాడ 'దేశమును ప్రేమించుమన్నా' తెలుగు వాళ్ళ రసనాలపై ఆనాటి నుంచీ ఈనాటి దాకా నర్తిస్తూనే ఉంది. 'మాకొద్దీ తెల్లదొరతనం' అంటూ గరిమెళ్ళ, 'వీరగంధము తెచ్చినారము వీరుడెవ్వడో తెల్పుడీ' అని కవిరాజు, 'మముగన్న భారత మాత మందిరమున దివ్వెలై మనముందామా, పైడి దివ్వెలై మనముందామా, అని దువ్వూరి తమ గేయాలతో ప్రజల హృదయాలను పరవళ్ళు తొక్కించారు. 'కొల్లాయి గట్టితేనేమి మన గాంధి కోమటై పుట్టితేనేమి' అనే బసవరాజు గేయం ప్రతి నోటా నానిపోయింది. జాషువా దేశభక్తి సంస్మరణాభిలాషతో మిళితమై ఉంది. ఇవి కాకుండా అనేక ఖండకావ్యాలు, మహాకావ్యాలు, దేశభక్తుల చరిత్రలు వెలసి జాతిని ప్రబోధించాయి.

సాతంత్ర్యం వచ్చిన తర్వాత కూడా అనేకంగా దేశభక్తి కవితలు, గీతాలు విరివిగానే వచ్చాయి.

జయ జయ జయ ప్రియ భారత జనయిత్రి దివ్యధాత్రి
జయ జయ జయ శత సహస్ర నరనారీ హృదయ నేత్రి[85]

మాతృదేశం మీద శత్రువులు దండెత్తి వచ్చినపుడు కవుల కలాలు కత్తులైనాయి. కవుల గళాలు యుద్ధ భేరిలైనాయి. చైనా దురాక్రమ సందర్భంగా

గిరి మేల్కొన్నది పురి మేల్కొన్నది.
గిరి గుహలో కేసరి మేల్కొన్నది.

గిరి పుర వనముల ధర మేల్కొన్నది
నర నారీ సంతతి మేల్కొన్నది[86] అని హుంకరించారు దాశరథి. 'కదనంబున ధర్మము తెలిపోవలెన్' అని ఘీంకరించారు పుట్టపర్తి. దాశరథి, పుట్టపర్తి దేశభక్తి దేశ ప్రజల్లో ఐక్యతను బలోపేతం చేసేదిగా ఉండి. ప్రజాస్వామ్య సిద్ధాంతాన్ని బలీయం చేసేదిగా ఉంది. సినారెలో తరగలెత్తిన ఈ భావన పలపల విరిసిందని చెప్పవచ్చు. ఆయన తన కవితాత్మతో దేశ బహిర స్వరూపాన్ని, అంతరమైన గతులను హృదయాలు చలించిపోయేలా ఆయన కలం నుంచి అక్షర ధారలు దూకాయి.

జాతీయోద్యమ కాలంలోనూ, శత్రుదురాక్రమణ సమయంలోనూ ఉజ్జ్వలించిన జాతీయ భావన ఈనాడు కొరవడిందని చెప్పవచ్చు. దేశంలో విచ్ఛిన్నకర ధోరణులు విజృంభించాయి. కొన్ని స్వార్ధశక్తులు ఇరుగు పొరుగు దేశాల అండదండలతో స్వదేశానికి ద్రోహం చేస్తున్నాయి. ఇది క్షమార్హం కాదు. దీన్ని ఎదుర్కోవాలంటే ప్రజా హృదయాలలో సుప్తమై ఉన్న దేశభక్తికి జాజ్వల్యమానం చెయ్యాలి. జాతీయతను జాగ్రదవస్థలోకి మళ్ళించాలి. ఇలా జాతిని జాగృతం చేసే బాధ్యత కవుల భుజస్కంధాల మీద ఉంది. ఈ బాధ్యతను గుర్తించే తిరుమల దేశభక్తి పూరితమైన ఎన్నో గేయాలు, పద్యాలు, వచన కవితలు వెలయించారు. ఇవే కాక స్వేచ్ఛా భారతి, చైతన్య భారతి అనే సంగీత సాహిత్య రూపకాల్ని రాశారు. దేశభక్తి ప్రపూరితమైన కవితలు అసంఖ్యాకంగా రాశారు. ఆయన రచనల్లో ప్రాచీన వైభవాన్ని స్తుతించడం, ఆధునిక స్థితులను పరిశీలించడం, ఆగామి కాలాన్ని మననం చేసుకోవడం వంటి దృక్పథాలు కన్పిస్తాయి.

మహాభారత కాలంలో వీరాధివీరుల రథాలకు పతాకాలు ఉన్నట్లు తెలుస్తుంది. కొందరు కౌరవ వీరుల పతాక చిహ్నాలను గూర్చి తిక్కన విరాట పర్వంలో వివరించారు.

కాంచన మయ వేదికా కనిత్కేతనో
　　జ్జ్వల విభ్రమము వాడు కలశజుండు
సింహలాంగుల భూషిత నభోభాగ కే
　　తుప్రేంఖణము వాడు ద్రోణ సుతుడు
కనక గోవృష సాంద్ర కాంతి పరిస్ఫుట
　　ధ్వజ సముల్లాసంబు వాడు కృపుడు
లలితకంబు ప్రభా కలిత పతాకా వి
　　హారంబు వాడు రధాత్మజుండు
మణి మయోరగ రుచి జాల మహితమైన
పడగవాడు కురుక్షితపతి మహోగ్ర
శిరఖ ఘన తాళతరువగు సిడము వాడు
సురనదీ సూనుదేర్పడ జూచికొనుము[87]

ఈ ధ్వజ చిహ్నాలు ఆయా వీరుల గుణ గణాలకు ప్రతీకలని భావింపవచ్చు. అవి వారి వ్యక్తి తత్వాన్ని సూచిస్తాయి. మనస్తత్వ శాస్త్ర దృష్ట్యా కూడా ఇది సత్య దూరం కాదు. అలాగే వజ్రశరీరుడు, వజ్రసంకల్పుడు, మహావీరుడు, స్వామి భక్తి పరాయణుడు అయిన 'కపిరాజు' అర్జునుడు ధ్వజావాసి. క్రమంగా మన దేశాన్ని పాలించిన రాజుల రథాలకు కూడా పతాకాలుండేవి. ఆ పతాకాలలోని గుర్తులు రాజుల వ్యక్తితత్వాన్ని, దేశతత్వాన్ని, జాతితత్వాన్ని చాటి చెప్పేవిగా ఉండేవి. అదే విధంగా ఈ ఆధునిక కాలంలో కూడా ప్రతి దేశానికి ఒక పతాకం, దానికొక చిహ్నం ఉండడం మనం చూస్తూనే ఉన్నాం. ఈ పతాకాల వర్ణాలు, చిహ్నాలు ఆయా దేశాల ప్రత్యేక లక్షణాన్ని లేక ఆయా దేశాలు అధికంగా ప్రాధాన్యమిచ్చే విషయానికి సంబంధించినవిగా మనం ఊహించుకోవచ్చు.

త్రివర్ణ పతాకం మన దేశానికి చిహ్నం. కాషాయ శ్వేత హరిత వర్ణ సంశోభితమైన ఈ పతాకం మధ్య చక్రం ఒకటి ఉంటుంది. ఆది నుంచీ మనదేశం త్యాగానికీ, పావనత్వానికీ పెట్టింది పేరు. కాషాయ రంగు ఈ గుణాలను సూచిస్తుంది. శ్వేత వర్ణం స్వచ్ఛతకీ, భావనైర్మల్యానికీ, శాంతికీ గుర్తు. హరిత వర్ణం కృషికీ సంకేతం. చక్ర ధర్మానికి ప్రతిబింబం. ధర్మాచరణం ద్వారా ప్రజా సంక్షేమం జరుగుతుందని ఇది తెలియజేస్తుంది. దేశానికీ, దేశ లక్ష్యానికీ సంకేతమైన పతాకానికీ భేదం లేదు కాబట్టి పతాక ప్రశస్తి కూడా దేశ ప్రశస్తిగానే పరిగణింపబడుతుంది.

'చక్రధ్వజం' ఖండికలో తిరుమల మొట్టమొదటగా పతానికి

అమ్మా! భారత వీర కేతనమ! దివ్య స్వాంత శాంత ప్రభా
తమ్మా! త్యాగ మహాద్భుత ప్రచుర గాథారత్న సంశోభితా!
సమ్మోహాంచిత మాధురీ కిరణ సచ్చారిత్ర నేత్ర ప్రభా
సమ్మానింతు నమస్కరింతు జననీ! సద్భక్తి నీ కెప్పుడున్!![88]

అంటూ వందనం చేస్తారు. ఇది భారతీయ సంప్రదాయ పద్ధతి. అలా చేసి 'విశ్వ కళ్యాణ భావనా వేత్తనగుచు, పంచి పెట్టెద నీ కీర్తి పరిమళంబు' అని వాగ్దానం చేస్తారు. 'లోకాఃసమస్తాః సుఖినోభవంతు' అన్న విశ్వభావనకు నిలయమైన ఈ దేశం యొక్క ఆదర్శాన్ని అందరికీ పంచి పెట్టాలనే ఆకాంక్ష ద్వారా కవి హృదయం ఏమిటో తెలుసుకోవచ్చు.

ఆకాశంబున నీ శిరంబు గని ప్రేమోద్ధత్య భావంబుతో
శ్రీకారంబును చుట్టుదున్, విజయ భేరి ధ్వాన దిఙ్మండల
ప్రాకారార్ణవ గర్భరత్న రుచిర ప్రాశస్త్య పాదోజ్జ్వల
ద్దీ కంజాత పరీమళోల్లసిత విస్తీర్ణాగ్ని కావ్యాత్మకున్[89]

పతాకం శిరస్సు ఎత్తి అంతరిక్షంలో ఎగురుతుంటే 'ప్రేమోద్ధత్య' భావంతో కావ్యాత్మకు శ్రీకారం చుడతానంటారు. పతాకానికీ తనకూ తల్లీ బిడ్డల అనుబంధాన్ని ఆపాదించుకొని పులకించిపోతానంటారు. రాకా శశాంక దర్శనంతో కడలి పొంగినట్లుగా పతాక దర్శనంతో

తన హృదయం పొంగులు వారుతుందంటారు. 'నిండు జాబిలి గన్న కదలి వోలె పొంగు నెదద నాకు'. మహోన్నత త్యాగానంతరం లభించిన స్వాతంత్ర్యఫలాన్ని దేశానికి ప్రసాదించుమని పతాకాన్ని వేడుకుంటారు. ఈ వేడుకోలులో స్వాతంత్ర్య ఫలం అందరికీ అందడం లేదని భావం. ఇది పాలకుల్ని ఉద్దేశించి నర్మగర్భంగా చెప్పిన మాట.

అట్లాగే భారతదేశం యొక్క ప్రాశస్త్యాన్ని ఉగ్గడిస్తూ ఆచార్య తిరుమల

వర్ణభేదమె కాని వర్ణ భేదము లేదు
నా దేశ జనుల మనమ్మునందు
అర్థ శూన్యమె కాని అర్థశూన్యము కాదు
నా తాత్త్వికుల భావనా బలమ్ము
అదు వారలె కాని ఆడవారలు గారు
నా వీర భటులు రణమ్మునందు
కృష్ణ మూర్తులె కాని కృష్ణమూర్తులు కారు
నా బుధ వర్యులు జ్ఞాన బోధ
బహు మతులె కాని బహుమతుల్బట్ట బోరు
నా లలిత కళారాధకుల్ న్యాయబుద్ధి
అహహ! నా పూర్వ పుణ్య ఫలంబు గాదె
భారతీయుండ నగుట ప్రపంచ మందు!![90] అంటారు.

రాజ్యాంగం ప్రసాదించిన 'వర్ణభేద' రాహిత్యాన్ని భారతీయ తాత్త్వికుల భావనా బలాన్ని, సైనికుల పరాక్రమాన్ని, విబుధల జ్ఞానబుద్ధిని, లలిత కళాకారుల న్యాయబుద్ధిని ప్రస్తావించి తాను భారతీయుడు కావడం పూర్వపుణ్యఫలం అంటారు కవి. శత్రువుల్ని నిలువరించే హిమాలయాన్ని భద్రదంతిగానూ, రాతిగుండెల్ని కూడా కరిగించే గంగమ్మ తల్లిని కన్న తల్లిగానూ, అపూర్వ కళాఖండాలైన తాజ్‌మహల్ని, అజంతా శిల్పాల్ని శ్లాఘించారు. కృష్ణానదిని 'చైతన్య దృక్స్రవంతి గానూ, మంగళగిరిని 'మానస మక్కటకాంతి' గానూ ఊహించి పొంగిపోయారు. విశ్వమంతా పల్లవించిన భారత సంస్కృతిని మానవ హృదయాంగణాల్లో నినదించిన నిగమాగమ స్వరాల్ని, నైష్ఠిక భావాల్ని మనసారా స్మరించారు.

ఆచార్యుల వారు ప్రాచీన వైభవాన్ని రకరకాలుగా కీర్తించారు. భారత పౌరుషాన్ని దిక్కులకు చాటిన వీరత్వాన్ని ఆయన తలపోశారు. మననం చేసుకున్నారు. వీరయోధుల పేర్లను ప్రస్తావించకుండానే విజయ ఫలితాలను గొంతెత్తిచాటారు.

వీర భారత జాతి మనది
విజయ కేతన కాంతి మనది
అడుగు వేస్తే అవని హర్షం
చిటిక వేస్తే సిరుల వర్షం[91]



అంతరంగంలో హింసా ప్రవృత్తి లేనిదీ, సదాశయాలతో, సమభావంతో ప్రపంచాన్ని ఆకట్టుకున్నదీ భారతదేశం. ఈ దేశ ప్రజ ఎక్కడ అడుగుపెట్టినా అక్కడి నేల హర్షిస్తుంది. చిటిక లేస్తే సిరుల వర్షాలను కురిపిస్తుంది. ఎప్పుడూ జయకేతనం ఎగురవేస్తుంది. అలాంటి దేశాన్ని కవి ప్రేమించి ఆదరించమంటున్న వైఖరి ఆయన గుండెలో పొంగులెత్తిన దేశ వాల్లభ్యానికి గుర్తు. కవి మన భారత పురావీరులకు ఎక్కువ విలువనిచ్చారు. భారత వీరులు జెండాలను చేతుల్లో పట్టుకోవడం, తమ రథాలపై వాటిని అలంకరించుకోవడం వంటివి చేసేవారు. కరుణశ్రీ 'జండా జాతికి జీవగఱ్ఱ' అంటూ పతాకం జాతికి ప్రాణం లాంటిదని చెప్పారు. దాశరథి 'జండా ఒక్కటే మూడు వన్నెలది' అంటూ భారత పతాక ఔన్నత్యాన్ని చిత్రించారు. వానమామలైవారు జాతీయ పతాకాన్ని విజయధ్వజంగా అభివర్ణించారు. తిరుమల 'విజయ కేతన కాంతి మనది' అని చాటారు. విజయకేతనం ప్రవరిస్తున్న కాంతిలో తడిసి అడుగువేస్తే అవని హర్షిస్తుందని, చిటికవేస్తే సిరుల వర్షం కురుస్తుందని అన్న ఈ మాటలలో కవి జండాకు ఇచ్చిన గౌరవం ప్రత్యేకంగా కన్పిస్తుంది.

కవికి దేశం అమ్మలా కన్పిస్తుంది. ఆ దర్శనం ఆత్మలోతుల్లోంచి చీల్చుకొని వచ్చినంత ఆత్మీయంగా, అపురూపంగా అనిపిస్తుంది. ఆ అమ్మను మరీమరీ చూడాలని పిస్తుంది. అమ్మను గూర్చి పాడాలనిపిస్తుంది. తిరుమల ఈ భావనను మధుర మధురంగా ఆవిష్కరించారు.

ఇదే మన తల్లి
జయ భారత కల్పవల్లి
ఎంత చూసినా - ఎంత పాడినా
తనివి తీరని బంగరు తల్లి[92]

దేహాన్ని, హృదయాన్నీ, సదాచరణనీ ఇచ్చే ఆ దేశమాత పవిత్రతను ఎంత ఆలపించినా అలసట అనేది ఉండదు. ఆ ఆరాధనలో అలసత్వం అనేది తొంగిచూడదు. ఆమె బంగరు తల్లి అని వర్ణించటంలో కవి ఆత్మసౌందర్యం కన్పిస్తుంది.

ఇది భారతి
ఇది మనదేశం భారతి
ప్రగతి కాంతికి ప్రజాశాంతికి
ప్రభవించినదీ జ్ఞాన హారతి[93]

భారత మాత తన జ్ఞాన హారతితో విశ్వమానవాళి హృదయాంతరాళాలలోని చీకట్లను కడిగివేస్తుంది. కల్మషాన్ని చిమ్మివేస్తుంది. వెన్నెలను చిలికిస్తుంది. జ్ఞాన పథంలో నడిపిస్తుంది. కవి ఈ కవితా పంక్తుల నేపథ్యంలో అలనాటి భారతీయ సంస్కృతి కన్పిస్తుంది. ముఖ్యంగా న్యాయశాస్త్ర, అర్థశాస్త్రం వంటి వాటిని ఆదిమ రుషులు రాసి ప్రపంచానికందించారు. ఇంకా ఇతిహాసాలు, ఉపనిషత్తుల వంటివెన్నో జ్ఞాన భిక్షను ప్రసాదించే గ్రంథాలు ఇక్కడ

వెలువడ్డాయి. ఇవన్నీ ప్రపంచానికి జ్ఞానాన్ని అందిస్తాయని కవి భావన. దేశభక్తి భావనతో ప్రగతికి మార్గాన్ని సూచించారు కవి. అది ఒక గొప్ప సందేశంగా ఆవిష్కృతమవుతుంది.

ఇది నా దేశం భారతదేశం
సత్య హింస ధర్మాగారం
భిన్న జాతుల భిన్న మతాల
సుందర సురుచిర మణిహారం[94]

సత్యం, అహింస ఈ రెండింటిని సబర్మతి రుషి ప్రపంచానికి అందించిన మార్గాలు. ఆయన ఈ రెండు ఆశయాల తోనే నియంతల పద్మవ్యూహాలను అతి చాకచక్యంతో భేదించగలిగారు. ఆయన రణరీతికి, కౌశల్యానికి ప్రపంచం దిగ్భ్రమ చెందింది. ఆయన సూక్తికి పదును ఎక్కువ. మరీ విశాల విశ్వాన్ని చకితం చేస్తున్నదేమంటే మత సామరస్యం. ఈ దేశంలో ఎన్నో జాతులు, ఎన్నో మతాలు ఇవన్నీ సుందర సురుచిర మణిహారంలా కవికి తోస్తున్నాయి.

సమాజం మానవ సామాహారం. హెచ్చుతగ్గులు మనిషి తత్వానికి సరితూగనివి. హారంలోని పువ్వులు వివిధ వర్ణాలు కలిగినప్పటికీ వింత శోభను కలిగించునట్లుగానే మానవులు కూడా సమైక్యంగా ఉంటే ప్రగతికి నిచ్చెనలు వెయ్యొచ్చు. పచ్చగ కలకాలం జీవించొచ్చు.

అందమైన దేశం మనది అపార భూ సంపద మనది
అందరం ఒకటిగ వుంటే ఆనంద స్వర్గం మనది[95]

తిరుమల వేర్పాటు వాదాన్ని తీవ్రంగా వ్యతిరేకించారు. సువిశాల భారతావనిపై జీవించే ప్రజలంతా సమైక్యతా గీతాన్ని ఆలపిస్తూ సుఖసంతోషాలతో తులతూగాలన్నది ఆయన ఆశ. అట్లా జీవించే మానవాళికి స్వర్గంతో పనేముంటుందని ప్రశ్నిస్తారు. సిరిసంపదలకు కొదవలేని దేశం మనది. మానవ వనరులను ఇందుకు జోడించి శ్రమిస్తే ప్రపంచానికే తలమానికమౌతుంది మనదేశం. తిరుమల మాటల్లో చెప్పాలంటే

ఎంతో సుందర భారతదేశం
ఇది మనదేశం - సువర్ణ కోశం
ఈ దేశానికి మనమందరం
కావాలెప్పుడు చెరగని హాసం[96]

జన్మభూమి రుణాన్ని తీర్చుకోవడానికి ప్రతి ఒక్కరు తమ వంతు కృషిని అందించి భరతమాత కంఠానికి శోభితులమై నిలవాలన్న తపన పై పంక్తుల్లో కన్పిస్తుంది.

సుతుడవై శూరుడవై ప్రేమించుదేశాన్ని
గురుడవై గుణవంతుడవై రక్షించుదేశాన్ని



ఇది నీ భూమి - మాతృభూమి
శాంతి యాత్రలో అగ్రగామి[97]

తిరుమల స్వీయదేశాన్ని ప్రేమించడానికి రెండు మార్గాలు చూపుతున్నారు. ఈ రెండు కూడా ఒకదాని బిందువులో మరొకటి ఉదయిస్తుంది. ఈ రెండు భావనలు ఒకే మార్గాన్ని ఆశ్రయిస్తూ గమ్యాన్ని చేరుకుంటాయి. సుతుడు, శూరుడు ఈ రెండు పదాలు రూపంలో వేరుగా కన్పిస్తాయి. అర్థస్ఫూర్తిలో కూడా తారతమ్యం గోచరిస్తుంది. కానీ, ఒకదాన్ని ఆశ్రయించుకొని మరొకటి వెలుగులను విరజిమ్ముతుంది. కొడుకు అమ్మని ఆరాధిస్తాడు. పరాయివాడు తలెత్తినప్పుడు శూరుడుగా చెలరేగి బుద్ధి చెబుతాడు. ఈ కవితలో మరో రెండు పదాలు గురుడు. గుణవంతుడు. గురుడు కాలలీలలను చెబుతాడు. జనాన్ని జాగృత పరుస్తాడు. దేశాన్ని రక్షించడానికి ప్రేరేపుతాడు. సంగ్రామంలో విజయం లభించేలా వ్యూహాలను హృదయాల మీద అక్షరాలు రాస్తాడు. వాటి మేధ నుంచి రవ్వలుగా చిమ్ముకొని వచ్చేట్టుగా అవి అజ్ఞానమనే చీకట్లను కరగించి దేశాన్ని జ్యోతిర్మండలం చేసేట్టుగా కృషిచేస్తాడు. అలాంటి గురువు బోధనలో ఆత్మీయంలో నిలువెల్లా తడిసిన వ్యక్తి తన దేశ గౌరవాన్ని నిలబెట్టుకొనే గుణవంతుడవుతాడు. ఈ రెండు పదాల రూపాలు వేరుగా ఉన్నప్పటికీ ఈ రెండూ ఒకే బింబం. బింబం నుంచే వెలువడే కిరణాల వంటివి. తిరుమల ఇలాంటి పదాలను ప్రయోగిస్తూ దేశభక్తి భావాన్ని ప్రేమనాదంగా అందిస్తూ తమ కవితా పరిమళాలను మరింత సుమధుర విలసితం చేశారు. దేశాన్ని ప్రేమించు అనే ఆర్ద్రమైన పోరాటాన్ని శాంతియాత్రగా అభివర్ణించారు. ఈ పోరాటం సాగేటప్పుడు కొన్ని అపశ్రుతులు గమనాన్ని నిలిపి వేస్తాయి. ఆశయాలను చిందర వందరం చేస్తాయి. అనురాగాన్ని వెక్కిరిస్తాయి. ఆనందంలో విషాన్ని పుక్కిలిస్తాయి. అడ్డుగోడలు లేస్తాయి. అలాంటి వైపరీత్యం జాతిని హింసిస్తున్నప్పుడు కవి సందేశమిచ్చారు.

దేశభక్తిని ప్రబోధిస్తున్న తిరుమల ఆశయం ఇలా ఉంది.

నా పవిత్ర భారత దేశ దీప కాంతి
ఎంత దూరము సోకునో అంత వరకు
నేను నడతును ధార్మిక నిష్ఠబూని
కర్మ వీరుండనై; భోగ కాంక్ష విడిచి[98]

భారతీయుడు కేవలం వీరుడు మాత్రమే కాదు. కర్మవీరుడు. గీతాచార్యుడు 'కర్మణ్యేవ్యాధికారస్తే మా ఫలేశు కదాచన' అనే శ్లోకంలో ప్రకటించాడు. వీరుడు కర్మవీరుడై నప్పుడే పూర్ణ విజయం సిద్ధిస్తుంది. అట్లా కర్మవీరుడైన భారతీయుడు ఆనాటి యశస్సునూ, ఆశయాన్ని అందుకొని విశ్వకల్యాణ భావాన్ని గుండెలో పొదివి పట్టుకొని తల్లి భారత కీర్తిని చాటుతాడంటారు తిరుమల.

గతులను మార్చుకుంటూ కవితకు చదివించే గుణాన్ని ప్రేరేపిస్తూ, పురాణ ప్రతీకలను

వాడుతూ దేశభక్తిని ప్రకటించడం ప్రత్యేకంగా తిరుమల రచనలో కన్పిస్తుంది.

ఇచ్చోటనే కదా ఇనుకుల తిలకుని
బ్రతుకు వాల్మీకి కావ్యమ్ము చేసె
ఇచ్చోటనే కదా ఇంద్రనందనునకు
గీతామృతము పోసె కృష్ణమూర్తి
ఇచ్చోటనే కదా ఏకదంతుని పిల్చి
బాదరాయణి చెప్పె భారతమ్ము
ఇచ్చోటనే కదా ఎలిమీ నుహాగీతి
కలు నిక్క మనిపించె కాళిదాసు

ఇచ్చోటనే కదా శ్రీనాథుడు చతురగతి
కంచుఢక్క బ్రద్దలు కొట్టె కవితలల్లి
అట్టి సత్కవీశ్వర వంశమందు పుట్టి
పెరిగినందులకేను గర్వింతు సతము[99]

వాల్మీకి రామాయణాన్ని రచించిందీ, కృష్ణుడు గీతామృతాన్ని పంచిపెట్టిందీ, వ్యాసుడు భారతాన్ని విరచించిందీ. కాళిదాసు కవితలల్లిందీ, శ్రీనాథుడు కంచుఢక్కను బ్రద్దలు కట్టిందీ ఇక్కడే గదా! అని గత వైభవాన్ని నెమరువేసుకుంటూ, అలాంటి గడ్డపైన జన్మించినందుకు ఎల్లప్పుడు గర్విస్తూన్నానంటూ తన దేశంపై ఉన్న భక్తిని చాటుకున్నారు.

భరత జాతి రెండున్నర శతాబ్దాలు పారతంత్ర్య పంకంలో కూరుకొని పోయింది. సంస్కృతీ సంప్రదాయాలు నిస్తేజమైపోయాయి. స్వేచ్ఛా వాయువుల ప్రసరణ జాడలు కూడా ప్రసరించడం లేదు. భారతీయుల కళ్ళల్లో దైన్యం ఆవహించింది. పీడితులుగా ఆవేదనను అనుభవిస్తున్న తరుణంలో బానిస సంకెళ్ళను తుంచివేయడానికి ఎందరో యోధులు పరాక్రమించారు. ప్రాణాలు సమిధలను చేశారు. అలాంటి దేశభక్తుల త్యాగశీలతను తిరుమల మనఃపూర్వకంగా అభినందించారు.

స్వార్థ మొకింతలేని ఋజువర్తన శీలురు సత్యవాక్య వే
దార్థ వికాస మానసులు ధర్మ పరాయణులాత్మతేజులున్
పార్థివ లోక మంగళ రవామృత మూర్తులు త్యాగ భావ సం
వర్థిత దేశికోత్తముల స్వాదు ఫలంబిది స్వేచ్ఛ నా బడెన్[100]

దేశమే గృహమైన వాళ్ళకు, ప్రజలే సొంత కుటుంబీకులైన వాళ్ళకు స్వార్థం అనే సంకుచిత భావం గుండె దాపులకు చేరవు. నిరంతరం ప్రజావళి హృదయాలలో ప్రమోద పరిమళాలను వెదజల్లడానికే ప్రయత్నిస్తారు. జీవితాలను కొవ్వొత్తులను చేసుకుంటారు. చిద్విలాసాలు ఆడుతున్నా బతుకులోని చీకట్లను తొలగించి. వాళ్ళ జీవితాలలో వేకువ వెలుగులను ప్రసరింపజేస్తారు. వికసించిన వాళ్ళ సౌభాగ్యాన్ని చూసి ఉప్పొంగిపోతారు.



తమ సర్వస్వాన్ని దేశీయులకు సమర్పించి ఆనందిస్తారు. అలాంటి వాళ్ళు ఋజువర్తనులు. అలాంటి పుణ్యపురుషుల వాక్యాలు ఆర్ద్రంగా ఉంటాయి. వాడిగా ఉంటాయి. సూటిగా నీటుగా ఉంటాయి. ఒలుకుతున్న అనురాగంతో కదలుతున్న రాగమాధురివలె కవ్విస్తున్నట్టుగా, పిలుస్తున్నట్టుగా గుండెలను లాలిస్తాయి. అలాంటి వాళ్ళు 'సత్య వాక్య వేదార్థ వికాస మానసులు' కాకమరెవరు! వాళ్ళు ధర్మ పరాయణులు కూడా. ముందుగా తాము ధర్మాన్ని ఆచరించి ఆ పిదప ప్రజలను ప్రవర్తింపజేసేవారు ఆత్మ తేజులు కూడా. అంటే బోధించడానికి ముందు తమ ఆత్మలను చూసుకునే క్రాంతిమూర్తులు. పార్థివ లోక మంగళ రవామృత మూర్తులు. పార్థివలోకాన్ని తమ అమృత కిరణాలతో ప్రవర్ధిల్లజేసే ప్రాణదాతలు. గుండెనిండా, మేధ నిండా త్యాగభావం ఉట్టి పడుతున్న వాళ్ళు జీవితాలను పలికించి నిలబెట్టే దేశికోత్తములు. అలాంటి మానవోత్తముల, సమరయోధుల పుణ్యఫలం నేడు భారతీయులు అనుభవిస్తున్న స్వాతంత్ర్య ఫలం.

తిరుమల ఏది స్వేచ్ఛా భావం కాదో ఇట్లా చెప్పారు.

పలుకుల స్వేచ్ఛ లేక నడువన్ పదమాడగ చోటులేక సం
కెలలు బిగించుకొంచు మదికిన్ బిగి సమ్మెట పోటులైన బా
ధల పిడికిళ్ళఁజిక్కి బహుధా పెనుజీకటి గ్రోలు చుండి క్రొ
వ్వెలుగుల నుంటి మంచు మురిపెంబున దేలుట స్వేచ్ఛ యెట్లగున్[101]

శ్వేత జాతీయుల కరకుపాలనంలో భారతీయులకు మాట స్వేచ్ఛలేదు. భావ ప్రకటనకు కూడా స్వేచ్ఛలేదు. అడుగు పెట్టడానికి చోటులేదు. సంకెళ్ళు బిగించబడ్డాయి. మనస్సు మీద సమ్మెట పోట్లు గుచ్చుతున్నాయి. పరాయి కిరాతకత్వపు పిడికిళ్ళ చిక్కి భరత ధాత్రి నిస్తేజమైంది. ఎల్లప్పుడూ కటిక చీకటిని అనుభవించింది. భారత జాతి చీకటిలోనే తడుస్తూ వెలుగులలోనే ఉన్నామని భావించింది. ఇలాంటి భారతీయులను చూసి కవి ఇది స్వేచ్ఛకాదని ఎలుగెత్తి చెప్పారు. నిజమైన స్వచ్ఛసుందరమైన వెలుగులను చూడమని పారతంత్ర్యంలో మగ్గుతున్న స్వీయ భారత జాతికి హెచ్చరికలు చేశారు. ఇది ఆయన ఉదాత్తమైన దేశభక్తి భావనకు ఎత్తిన కనక పతాక.

My country is my light
I walk as far as it spreads
I darely walk as a man of action
With righteousness as my weapon
relinquishing all mundane desires
all happiness and enjoyment earthly
'Life is a three day's enjoyment
and few day's play
But the Self is perfect and eternal

My country is my light
In it I walk and shine
and shine and walk
with those that move with light
with those that focus light[102]

ఆచార్య తిరుమలకి తన దేశంపైన ఉన్న భక్తి, ప్రేమ పై కవితా పంక్తుల్లో ప్రస్ఫుటమవుతుంది. స్వార్థాన్ని విడిచి, కోరికలను పక్కకు పెట్టి దేశభక్తితో ముందుకు నడవడం ఒక గొప్ప లక్షణం. దేశమే కాంతిలా వెలగాలని కవి ఆకాంక్ష.

తిరుమల దేశభక్తి విశిష్టమైంది. పొరుగున ఉంటూ మిత్ర వాత్సల్యాన్ని ప్రకటిస్తూ ఆదమరచిన వేళలో మారణాయుధాలతో అగ్ని వర్షాన్ని కురిపిస్తూ పచ్చని జీవితాలను జ్వలింపజేస్తున్న దుశ్చర్యలను తీవ్రంగా దుయ్యబట్టారు. అయితే ఆయన కార్గిల్‌ను ప్రధానమైన వస్తువుగా తీసుకొని

ఎవడురా వాడు తుహిన పర్వత నిధిని
దోచుక పోజూచు దుండగీడు?
ఎవడురా వాడు కాశ్మీర కస్తూరిలో
బురద కలుప జూచు మోసగాడు?
ఎవడురా వాడు శాంతించు సింహపు జూలు
పట్టుకులాగు చివ్వాటగాడు?
ఎవడురా వాడు వక్రించి భారతదేశ
సరిహద్దు చెఋపు దుశ్శానుండు?
ఎవడు లాహోరు యాత్ర ముగింపు గాక
మున్నె కార్గిలు వెనుపోటు పొడిచినాడు?
వాని చెండాడి శాంతించ వలదె నేడు
రండు! విక్రమింపుడు జయలక్ష్మిగొనుడు!![103]

తిరుమల ఉద్వేగపూరితమైన హృదయం పైన పద్యంలో అనలాన్ని చిమ్ముతుంది. పద్యాన్ని 'ఎవడురా'అనే ప్రశ్నతో ప్రారంభించడమే కాక మిగతా అన్ని పాదాలను అదే పదంతో మొదలు పెట్టారు. వాడు - నమ్మిన మన దగ్గరివాడు. తుహిన పర్వతనిధిని దోచుకొని పోవడానికి ఉద్యమించిన దుండగీడు. తుహిన పర్వతం మన నిధి. మన సర్వస్వం. భారతీయ సంస్కృతికి నిలయమైంది. ముఖ్యంగా శివశంకరులకు ఆవాస ప్రాంతంగా అనేక పురాణ కావ్య ప్రబంధాలకు ఆత్మలాగా ఒప్పింది. అంతేకాక ఉత్తర దిశలో మన దేశ రక్షణకు పెట్టని కోటలాగా నిలిచినదీ ఈ మంచుకొండయే. అట్లా ప్రపంచానికి భవ్యమైన సందేశాన్నందిస్తున్న మన హిమశైల సంపదను హరించాలని



ప్రయత్నించడం అనేది కవి హృదయాన్ని కలిచివేసింది. వాడు కాశ్మీరు కస్తూరిలో బురద కలపాలని యత్నించిన వంచకుడు. కస్తూరి అంటే మృగ్యమదం. సుగంధ ద్రవ్యం. కాశ్మీర దేశం నిండా ఈ పరిమళం తొణుకుతుంది. అలా హృదయాలను ఝమ్మని అలరించి పరవశింపజేసే కస్తూరిలో వాడు బురద కలపాలని ఎత్తు వేశాడు. శాంతంతో ఉన్న సింహం జూలు పట్టుకొని లాగుతున్న చివ్వాట గాడు. వక్రబుద్ధితో భారతదేశం సరిహద్దు రేఖలను చెరిపివేస్తున్న అధముడు. లాహోరు స్నేహయాత్ర ముగింపు కాకముందే కార్గిలు వెన్నుపోటు పొడిచిన ధూర్తుడు. అలాంటి దుశ్శాసనుణ్ని చీల్చి చెండాడి జయలక్ష్మిని సాధించి శాంతి వహించుమని ఉపదేశాన్ని అందించారు.

తిరుమల దేశభక్తి రచనలు చాలా ఉన్నాయి. చాలా ప్రక్రియలలోనూ ఉన్నాయి. అవన్నీ కూడా ఉదాత్తంగా ఉన్నాయి. పఠితల హృదయాలలో ప్రవేశించి దేశభక్తిని ప్రేరేపించే తీరులో ఉన్నాయి. ఆయన రచనల ద్వారా దేశం అంటే ఏమిటో సహృదయులకు మరింత తెలిసివస్తుంది.

భరత మాతకు వందనం
భరత జాతికి వందనం
వందనం మేమందరం
మీ ముందు నిలిచిన నందనం[104]

అంటూ ఆచార్య తిరుమల తన దేశభక్తితో భరతమాతకు వినమ్ర పూర్వక వందనాలను సమర్పించుకొన్నారు.

తిరుమల సహజంగా దేశభక్తి కలవారు. ఇదే తత్వాన్ని తన కవితలో గొంతెత్తి వినిపించారు. దేశాన్ని తల్లిగా, దైవంగా ఇంకా పలువిధాలుగా భావించి, ఆ భావనను వివిధ ప్రక్రియలలో జాలు వారించి తన మాతృదేశాభిమానాన్ని ప్రకటించుకొన్నారు.

## 2. ప్రేమతత్వం

ప్రేమ అనే మాటకు ప్రణయం, ప్రేముడి, వాత్సల్యం, అనురాగం, ఆత్మీయత, వ్యామోహం, వలపు అనే అర్థాలు వాడుకలో ఉన్నాయి. ప్రాచీన భారతీయ సాహిత్యంలో వాల్మీకి, వ్యాసుడు, కాళిదాసు, భవభూతి వంటి కవులు వారి రచనలలో ప్రేమకున్న దివ్యత్వాన్ని ఆరాధనీయంగా ప్రదర్శించారు. ప్రేమ అనే పదార్థానికి ఉన్న విలువ, శక్తి ఎలాంటివో వారు ఉదాత్తంగా గానం చేశారు. ఒకరి నొకరు ప్రేమించుకోవడం అన్నది భారతీయ సంప్రదాయంగా మిగిలిపోయింది.

ప్రేమ అనుబంధాన్ని అనుసరించి ఉంటుంది. భగవంతుడు - భక్తుడు, గురువు - శిష్యుడు, భార్య - భర్త, అన్న - చెల్లెలు, అన్న - తమ్ముడు, తల్లి - తండ్రి, వీళ్ళ మధ్య ఉన్న ప్రేమ ఆరాధనకూ ఆత్మీయతకూ ప్రతీకలుగా ఉంటాయి.

ఆధునిక కవిత్వం చివుళ్ళు వేస్తున్న తొలి దశలో ప్రణయభావం తొణకడాన్ని గమనించిన గురజాడ "నేడు ఉదాత్త శృంగార కల్పనలో శృంగార కథావస్తువు అదృశ్యమవుతున్నది. లేదా అది ద్వితీయ స్థానాన్ని పొందగలుగుతున్నది".[105]అని విమర్శించి ఆయన సహజమైన ప్రేమతత్వానికి చక్కని నిదర్శనాన్ని చూపించారు.

మరులు ప్రేమని మది దలంచకు
మరులు మరలును వయసుతోడనే
మాయమర్మములేని నేస్తము
మగువలకు మగవారి కొక్కటే
బ్రతుకు సుఖమునకు రాజమార్గము
ప్రేమ నిచ్చిన ప్రేమ వచ్చును
ప్రేమ నిలిపిన ప్రేమ నిలుచును[106]

అని మానవసంబంధాలను శక్తిమంతంగా నిలపడానికి ఆయన విలువైన సిద్ధాంతాన్ని ప్రకటించారు. 'మరులు' 'ప్రేమ' అనే మాటలలో ఉన్న తాత్పర్యాన్ని వివరించారు. భేదాన్ని వివేచించారు. ఆధునిక మహాకవి రాయప్రోలు తమ రచనలలో అమలిన శృంగారాన్ని ప్రవేశపెట్టి స్త్రీ మూర్తికి పూజనీయ స్థానాన్ని కల్పించారు. అమలిన శృంగారం తత్వ వివేచన చేసిన విమర్శకులు రాయప్రోలు తన ఆలోచనా సరళిని ఆశయాన్ని వివరించారు. డా॥ సి. నారాయణ రెడ్డి

వియోగశృంగారములో నున్న పావిత్ర్యమును దృష్టినిడుకొని వీరు 'అమలిన శృంగారము' అను కొత్త సిద్ధాంతమును లేవనెత్తిరి. ఇది అలవోకగా లేవదీసినది కాదు. ఉపనిషత్తులు మొదలు కొని అలంకారికుల లక్షణ గ్రంథముల వరకు రససిద్ధాంతములన్నింటి నవలోకనము చేసి మథించి తీసిన నవ్య నవనీతమిది.

ప్లెటోనిక్ లవ్ కన్న ఈ సిద్ధాంతము ఉత్తమమైనదనుటలో కూడా సందేహము లేదు"[107] అని విశ్లేషించారు. రాయప్రోలు ప్రవేశపెట్టిన అమలిన శృంగార తత్వం అనంతర కవుల భావనల మీద ప్రభావాన్ని చూపింది. అమలిన శృంగారానికి ఆత్మ స్వరూపంగా ఉన్న ప్రేమను ఆయన మూడు విధాలుగా భావించారు.

పరమ ధర్మార్థమైన దాంపత్య భక్తి
స్తన్య మోహనమైన వాత్సల్య రక్తి
సాక్షి మాత్ర సుందరమైన సఖ్య సక్తి
పొందు నాదిమమగు ప్రేమ యందె ముక్తి[108]

ఈ పద్య తాత్పర్యాన్ని వివేచిస్తూ 'ప్రేమ అన్నది ఒక అఖండమైన పదార్థం. అది మూడు విధాలుగా అభివ్యక్తిమవుతున్నది. ఒకటి భక్తి రెండు రక్తి. మూడు సక్తి అని



తెలిపారు. ఈమూడు పదార్థాలు కూడా ప్రేమకు బలీయమైన పార్శ్వాలు. భక్తి రక్తి సక్తి పద స్వరూపంలో భేదం కన్పిస్తుందే కాని, అవి త్రివేణి సంగమంలా కలిసిపోయి అలౌకికమైన ఆనంద మాధవాన్ని జీవితాలలో పండిస్తాయి. మానవుని జీవిత దశలలో "ప్రేమ అనేది శిఖర స్థాయికి చెందిన అంశం. అక్కడి నుంచి అది ఒక్కొక్క మెట్టుగా జీవితంలోకి అవతరిస్తుంది. ఈ అవతరిస్తున్న దశలలో భిన్నభిన్నమైన నామ రూపాలను పొందుతున్నది"[109] అని డా॥ యాదగిరి రాయప్రోలు ప్రేమకు ఇచ్చిన నిర్వచనాన్ని విశ్లేషించి చూపారు.

ఆచార్య తిరుమల కవితలో ప్రేమతత్వం ప్రత్యేకమైన స్వరూపంలో ఆవిష్కరింపబడింది.

ప్రేమ అన్నది కాల సర్పము
ప్రేమ అన్నది విశ్వతత్వము
వేయి పడగల దేవతా ఫణి
ప్రేమ, మానవ రోదసీ ఘృణి
వేయు చుండును కాటు, జీవిని
మాతృ గర్భోదయం నందే
కాటుతిని అవ్యక్త బంధన
కదలుటే విశ్వాత్మ భావన[110]

ప్రేమ అనే వస్తువును వాడుకోవడంలో ఉంటుంది ఆనందం, వేదనం. మనిషి తనలోని తనాన్ని విడిచిపెడితే ప్రేమను త్యజించినట్టే. అప్పుడది కాలసర్పంలా కాటువేస్తుంది. బుద్ధిశాలికి ప్రేమతత్వం బాగా అవగాహనకు వస్తుంది. అతడు ఆచరణంలో దీన్ని దీపంగా వెలిగిస్తాడు. ఒక తత్వంగా ఆవిష్కరిస్తాడు. ప్రేమ వేయి పడగల దేవతా ఫణి. అంటే ఆదిశేషుడు. అంతేకాదు, హృదయంలో వెలుగు కూడా. అప్పుడప్పుడు ప్రేమ ఆత్మీయంగా కాటువేస్తుంది. అయినప్పటికీ ఈ విషపు కాట్ల పోట్ల నుంచి ఎదగడమే మనిషి పని. ఇది విశ్వాత్మ భావన.

భూమినెల్లడ మోయుచున్నది
ప్రేమయను శేషాహి మాత్రమే[111]

అని తిరుమల పోల్చారు. ప్రేమ అనేది శేషాహిలాంటిది. శేషాహికి వేయి పడగలున్నాయి. వీటి సహకారంతో భూమిని మోస్తున్నాడు. అంతేకాదు, శేషుడికి వేయి మోములున్నాయి. ఇన్నింటితో ప్రేమను పాడుతున్నాడు. వెదజల్లుతున్నాడు. అలా ఉన్నప్పుడే నేల నవ వధువులా శోభిస్తుంది.

తిరుమల ప్రేమను వ్యక్తి వరకు పరిమితంగా దాచరు. దేశం వరకూ పెంచారు. ఖండాంతరాలకు విస్తరింపజేశారు. ఈ ఖండాలు, ఖండాతరాలు ఎల్లలు లేని హృదయమే.

జనని గర్భపు పుట్టలో
బీజమగు నిశ్శేష జీవము
ప్రేమ స్పందన గ్రోలి కదిలి
ప్రేమ సౌరభమాని మెదిలి
శేష ప్రేమగ దీపమై
ప్రేమ శేష స్వరూపమై
అవ్యక్త జలధిని వ్యక్తమై
సంస్కార సాగర ఘోషయై
ఖండ ఖండాంతర జీవుని
ప్రాణశక్తగ వ్యక్తమై
పరిధిలో పరమాత్మయై
తంత్రిలో స్వరమంత్రమై
చేతనాకృతి చిన్మయోధృతి
క్షీర సాగర తరంగాలను
జీవితంబయి తేలి తేలి
భావనా జగదంతరంగ
రత్నకాంతుల శిరము దాల్చి
భద్ర శాంతుల వరము దాల్చి[112]

ప్రపంచాన్ని ముందుకు నడిపిస్తుంది. ప్రేమ మానవులకు, మిగతా ప్రాణులకు మాత్రమే పరిమితమై ఉండదు. మనిషి కాపురముంటున్న ప్రకృతిలోనూ, అతణ్ని లాలిస్తోన్న సహజ ప్రకృతిలోనూ ప్రేమ నిండి ఉంటుంది.

నదులు పారును - నిధులు పొంగును
నింగిలో హరి విల్లులొంగును
మెరుపు మెరియును - దారి తెలియును
ప్రేమలో జగమెల్ల సాగును[113]

నదులు ప్రవహిస్తాయి. అవి ఎక్కడోపుట్టి ఎన్నో మలుపులు తిరుగుతూ రకరకాల మట్టి పరిమళాలను తనలో కలుపు కొని, వృక్షాలలో పువ్వుల పడవలను తమ గుండెల మీద మోస్తూ వాటి సౌరభాలను ఆస్వాదిస్తూ మరింత పులకించిపోతూ, లోయలను ముంచెత్తుతూ, ఎదురుగా కొండరాళ్ళను ఢీకొంటూ కడకు కడలిరాయని కౌగిళ్ళలో బందీలవుతాయి. తన జీవితాలను మధుర వసంతాలను చేసుకుంటాయి. ఇది ప్రేమతత్వాన్ని గాఢంగా పలికించే ప్రకృతి ధర్మంలోని ఒక ప్రధానమైన అంశం. ప్రేమ వల్ల నిధులు పొంగుతాయి. నిధులు అంటే ధనం, సువర్ణం లాంటివి మాత్రమే కావు. మనిషిని మనీషిగా



చేస్తున్న సత్ప్రవర్తన. సదాచరణ, సౌశీల్యం, సౌజన్యం వంటివి. ఇవన్నీ వ్యక్తి వికాసానికీ తద్వారా సమాజ చైతన్యానికీ దోహదపడతాయి. నింగిలో హరివిల్లులొంగడం అనేది ప్రకృతి పరమైన ప్రేమ భావానికి గుర్తు. విశాలమైన వినీలాకాశం ప్రేమతత్వాన్ని గాఢంగా చూపుతుంది. చుక్కలూ, సూర్యుడూ, చంద్రుడూ ఇవన్నీ అనందంగా నింగిదారులలో సాగుతాయి. ఈ పయనం అంతా ప్రేమ భావం వల్లనే. వీటి కన్నా మరింత అందాన్ని ఉసిగొల్పేది హరివిల్లు. హరివిల్లుకు తెలుసు నింగి తత్త్వం ఏమిటో, ఆ తత్త్వం ముందు లొంగిపోయి హరివిల్లు సప్తవర్ణాల రాగాలను సప్తస్వరాలుగా పలికిస్తుంది. ఈ పలకరింతలో మనస్సు కళ్ళకు కనిపించేది వలపుల సరాగాలే. మెరుపులు ఉన్నాయి. అవి మెరుస్తాయి. తొలకరి అడుగు పెట్టినప్పుడు గగనంలో నల్లని మేఘాలు వ్యాపిస్తాయి. రకరకాల రూపాలతో ఉంటాయి. గాలి పలకరింతలతో తమ రూపాలను మార్చుకుంటాయి. సాగుతాయి. ఆ వేళ మెరుపులు వస్తాయి. కళాత్మకంగా దర్శించినప్పుడు మేఘాల సిగలలో తళుక్కుమనడానికీ, గగన సతి పెదవుల మీద చిరనవ్వులుగా తళుక్కుమనడానికి కాదు. ఆకాశం లాంటి అగాధమైన జీవితాలలో, మేఘాల వంటి బతుకులలో రసరేఖలను తీర్చిదిద్దడానికి విశిష్టమైన మార్గాలను చూపించడానికి ప్రేమ రూపాంతరం పొందుతూ ఉంటుంది.

ప్రకృతి అంతా రాగబంధమే. ఈ రాగం లేకపోతే అంతా శూన్యమే. విశ్వమోహిని అనంద తాండవం చేయడానికి ప్రేమతత్వం ఎంతో అవసరం. తిరుమల ప్రేమ తత్వాన్ని ఆర్ద్రంగా అందించడం ఎంతో ప్రత్యేకంగా ఉంది.

ప్రేమ కలిగిన తెలివిదేనికి?
ప్రేమ లేదో కలిమిదేనికి?
ప్రకృతి అందము ప్రేమబంధము
ప్రేమతో రసవీణ మ్రోగును
కళలు పలుకును - మధువు చిలుకును
చూపులో శుభరాగ మొలుకును
విశ్వ మోహిని ప్రేమవాహిని
ప్రేమతో బ్రతుకెల్ల పండును[114]

ప్రేమ చురుకైనది. అది ఉంటే చాలు. తెలివి లేకున్నా సరిపోతుంది. ప్రేమ సామర్థ్య స్వరూపంగా వికసిస్తుంది. మనిషిని సమర్థుణ్ని చేసి సమాజం ముందు మార్గదర్శకుడిగా నిలబెడుతుంది. ఎన్ని సంపదలను సమకూర్చుకొని గొప్పగా జీవించినా ప్రేమ అనేది లేకపోతే ఆ సిరిసంపదలు అర్థరహితాలే. ప్రయోజన శూన్యాలే. ధనం ఉన్నంత మాత్రానా సరిపోదు. ప్రేమధనంతో తులతూగితే చాలు. అదే పరమార్థం. ప్రకృతి అందంగా ఉండటానికి ప్రేమయే కారణం. మనకు కనిపించని రాగం ప్రేమ స్వరూపంగా ప్రకృతిలో తన స్వరాలను వినిపిస్తుంది. అది రసవీణ. కళలు అరువది నాలుగు. అవి పలుకుతాయి. పాడతాయి. మధువు చిలుకుతాయి. చూపులో శుభరాగాలను ఒలికిస్తాయి. విశ్వం

ప్రేమమోహిని. ప్రేమతో బతుకంతా పచ్చదనంతో ఉప్పొంగిన ఆనంద కేదారం అవుతుంది. ఇది తిరుమల ప్రేమతత్త్వంలో ఒక రసరేఖ.

ప్రేమ శబ్దం వినబడగానే పురాణ ప్రేయసీ ప్రియులు రాధాకృష్ణులు హృదయనేత్రాలకు కన్పిస్తారు. వాళ్ళ ప్రణయం మాలిన్యం అంటనిది. రాధాకృష్ణుల ప్రేమ భావాన్ని చాలా మంది కవులు రకరకాలుగా వర్ణించారు. తిరుమల వర్ణన కవితాత్మకంగా, ఆనంద మహితాత్మకంగా ఉంది.

ఒకటి రెండగుటయును రెండొనొటియగుట
గణితమున జెల్లు, ఒకటి అగణిత రీతి
రెండుగా కానిపించుట ప్రేమతత్త్వ
మదియె రాధికా మాధవ హృదయ సృష్టి[115]

గణితశాస్త్రంలో ఒకటి రెండవుతాయి. రెండు ఒకటిగా మారిపోతాయి. అయితే రాధాకృష్ణుల హృదయ సృష్టి అగణితమైంది. ఒక్కదానిలో రెండు కన్పిస్తాయి. అదే ప్రేమతత్వం. తిరుమల మొదట గణిత శాస్త్రాన్ని ప్రస్తావించి రాధాకృష్ణ తత్వాన్ని ప్రవేశపెట్టారు. రాధ గోపాంగన మాత్రమే కాదు. ఆమె లోకేశ్వరి. ఈ సృష్టిని సృజించింది ఆమెయే. సృష్టికార్యం నిర్విఘ్నంగా సాగడానికి పరమేశ్వరి త్రిమూర్తులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను సృష్టించింది. ఆమె సరస్వతి, లక్ష్మి, పార్వతి అనే మూడు రూపాలుగా వేరుపడి త్రిమూర్తులకు సతులుగా ఉండిపోయింది. విష్ణువు శ్రీకృష్ణుడుగా అవతరించినప్పుడు ఆ కృష్ణావతారం పూర్ణావతారంగా భాసించడానికి లోకేశ్వరి రాధగా గోకులంలో అవతరించింది. ఆమె వ్రేపల్లె గోపాంగనలను సృజించింది. రాధ, వేల వేల గోపాంగనలు కృష్ణ ప్రణయంలో తడిసిపోయిన వారే. అయితే ఈ ప్రణయం విప్రలంబ, సంభోగ శృంగారాలు కాక ఆత్మపరమాత్మల మధుర కలయిక మాత్రమే. రాధా మాధవ హృదయ సృష్టి విశాలమైంది. పవిత్రమైంది. వాళ్ళ హృదయాలలో భౌతికమైన అనురాగ స్రోతస్వినుల పరుగులకు అవకాశమే లేదు. ఆధ్యాత్మికమైన మధుర వాసనా పరంపరలే ధ్వనిస్తాయి.

ప్రేమ పేరుతో కామి పరుగులు
కామ యాత్రలో ప్రేమ పరుగులు[116]

కామం, ప్రేమ అనేవి ఒకే పాదులో పుట్టిన లతలే. స్వరూపాలు, అర్థాలు ఒక్క విధంగా తోచినప్పటికీ 'కామం' అనే పదం రతికి సంబంధించిన తీవ్రమైన భావావేశాన్ని ప్రకటిస్తుంది. ఈ పదానికి కోరిక, మోహం, రేతస్సు అనే అర్థాలున్నాయి. ఇవి కూడా కామ భావనను ప్రకటించేవిగా కన్పడతాయి. ప్రేమ అనే మాట సౌకుమార్యాన్ని, ఆర్ద్రతను భజిస్తుంది. అయినప్పటికీ ఈ రెండు మాటలూ – రేకత్తే ప్రణయానికి రెక్కలు అవుతాయి. పరుగులు తీయిస్తాయి. ఆనందకేళిలో విహరింపజేస్తాయి. తిరుమల ఇక్కడ ప్రేయసీ ప్రియమైన వలపునే కాక దంపతీ నిష్ఠమైన అనురాగాన్ని కూడా చెప్పారు.



ప్రేమ వేసే తీపి కాటును
స్వీకరించని బ్రతుకు వ్యర్థము[117] అని కవి భావన.

యమునాతటి, బృందావనం, మధుర, వ్రేపల్లె అనే మాటలు వినబడితేచాలు, కనబడితే చాలు హృదయం రసమయం అవుతుంది. ఈ ప్రదేశాలలో చల్లని నల్లనయ్య గోపాంగనలతో, రాధాదేవితో హాయిగా, తీయగా మురళిపై వలపు పాటలను ఆందిస్తూ, నర్తిస్తూ భాగవత లీలా మాధుర్యాన్ని చవి చూపించాడు. ఇవన్నీ కవులకు వస్తువులుగా మారి మహాకావ్యాలు, ఖండకావ్యాలూ, దృశ్యకావ్యాలూ మరెన్నో ప్రక్రియలుగా రూపుదిద్దుకున్నాయి. తిరుమల 'యమునాతటి' ప్రదేశాన్ని కమనీయ పద్య కావ్యంగా సంతరించారు. ఒక గోపనితంబిని స్వామి అలింగన సౌభాగ్యాన్ని కోరుతుంది.

చిరము నీ ప్రేమ సీమలో చింతదక్కి
నిన్ను కౌగిలించుకొని నేనున్నచాలు
అదియె నాకిల కోటి స్వర్గాల పులము
అనుచుబ్రతిమాలె నొకతె కృష్ణుని దలంచి[118]

తిరుమల ఇట్లా తమ రచనలలో ప్రేమ తత్త్వాన్ని విశ్వతత్వంగా, జీవనవేదంగా అభివర్ణించి ఆధునికులలో చక్కని వైవిధ్యాన్ని ప్రదర్శించారు.

ప్రేమ తత్వాన్ని ఇలా చెప్పారు.

ప్రేమతో తిరుగు భూగోళం
ప్రేమతో తిరుగు ఖగోళం
అంగడి వస్తువు కానే కాదు
ప్రేమ సత్య శీలం[119] అని సత్యాన్ని ప్రకటించారు.

ప్రపంచం అన్ని విధాలా ప్రవర్ధిల్లడానికి ప్రేమతత్వం బాగా దోహదపడుతుంది. రకరకాలుగా ఉన్న ప్రేమ, వాటి అస్తిత్వాన్ని పవిత్రంగా చూసినప్పుడే విశ్వకల్యాణం అవతరిస్తుంది. తిరుమల ఈ ప్రేమ తత్వాన్ని ఎన్నో ప్రవాహాలుగా పరుగులు తీయించి ఆత్మీయత అనే సాగరంలో విలీనం చేశారు.

I walk slowly over the piles of letters
to reach the diamond mines of Human Love
I write the Songs of light
On the foreheads of people's Sight
I see in the drops of love
the trees, Hills and rivers
Proclaiming liberty in loud voice

---

the wind's quite with love
the water's sweet with love
And the mind's chaste with love
I know not anything without universal love[120]

కుప్పలు కుప్పలుగా ఉన్న ఉత్తరాల మీద నుంచి వజ్రపు గని అనే ప్రేమను వెతుక్కుంటానంటారు. ప్రేమలోనే అన్ని ఉన్నాయి. చెట్లు, గుట్టలు, నదులు ప్రేమను చాటి చెప్తూ కన్పిస్తున్నాయి. ప్రేమ అనేది లేకపోతే పుష్పాలు వాడిపోతాయి. ఆకులు గడ్డి పేలికల్లాగా వేలాడుతాయని కవి భావన. ప్రేమ ఉంటే మానవుని మేధ పరిశుద్ధంగా ఉంటుందంటారు కవి. కవికి ప్రేమపై ఉన్న ప్రేమ పై కవితలో స్పష్టంగా కన్పిస్తుంది.

తిరుమల ప్రేమను విశ్వకల్యాణ కారకంగా గుర్తించి ఎదలో నిలుపుకొని కవిత్వంగా జాలువారించారు. విశ్వశ్రేయాన్ని కోరుకునే అచ్చమైన కవి లక్షణాలలో ఒకటైన ఈ ప్రేమ తత్వాన్ని తిరుమల ఉదాత్తంగా రాసి సాహితీ ప్రపంచంలోనికి ప్రవహింపజేశారు.

## 3. ఆధ్యాత్మికత

సహజంగా మానవుడు జ్ఞానిగా వెలుగొందడానికి ప్రయత్నిస్తాడు. జ్ఞానం అంటే ఒక పరిధిలో ఇమిడి వుండే పదార్థం కాదు. అది అనేక రంగాలలో అనేక రకాలుగా విస్తరించి ఉంటుంది. నేల రహస్యాలను అర్థం చేసుకోవడం, నింగితత్వాన్ని అవలోకించి సొంతం చేసుకోవడం, ఖగోళాన్ని దర్శించడం, గ్రహగతులను అందుకోవడం, భౌతికాన్ని అభౌతికాన్ని విశ్లేషించడం, గిరులూ, ఝరులూ, తరులూ, విరులూ - వీటి అంతర్మథనాన్ని బుద్ధితో వశం చేసుకోవడం, సామాజికమైన అన్ని పార్శ్వాల అంతస్తత్వాన్ని సమగ్రంగా అధ్యయనం చేయడం, మారుతున్న మనిషి జీవన విధానాల రూపురేఖలను స్పర్శించడం, విశ్లేషించడం, విమర్శించడం, అక్షరాలలో ఒదిగి వున్న విద్వత్తును మేథకూ, హృదయానికీ అనుసంధింపజేయడం, చైతన్యం వైపు పరుగులు తీయించడం, సృష్టికి మూలాధారమైన దైవత్వం, సృష్టిలోని అన్ని అంగాలను కలిపి వేసే ఆత్మతత్వం ఇవన్నీ జ్ఞాన సముదాయంలోని తళుకులే. అయితే ఆత్మ సంబంధమైన జ్ఞానం, దైవీయమైన జ్ఞానం ఈ రెండూ ప్రబలమైన జ్ఞానమండలాలుగా కన్పిస్తాయి. మానవుడు సమస్త విజయాలను సాధించాలంటే ఆత్మ పరమాత్మ సంబంధమైన అన్ని రేఖలను అధ్యయనం చేయవలసి ఉంటుంది. ఈ అధ్యయనం బలీయంగా, ఆకర్షణీయంగా, తాత్వికంగా, త్యాగస్ఫూర్తిగా ఉంటే చాలు - సృష్టిలోని అన్ని జ్ఞానమూలాలూ, మూల్యాలు వశమవుతాయి. ఈ ఆత్మ పరమాత్మ సంధానం అనేది అసాధారణమైనది. అయితే మానుషధర్మంతో వశం చేసుకోవచ్చు. దానికి యోగ సమాధి అవసరమై ఉంటుంది. యోగ సమాధి అంటే ఏ కోనలోనో, ఏ గుహలోనో ఉండిపోయి జపించడం కాదు. పరమాత్మను అన్వేషించడం కడకు అందులో విలీనం కావడం కూడా కాదు. మానవ సమాజంలో సంసార బంధనంలో ఉంటూ ఆత్మను పరమాత్మతో మమేకం



చేసుకోవచ్చు. ఈ రెండు మార్గాలు కూడా అనుసరణీయమే. ఈ రెండు విధానాలలో ఆత్మ పరమాత్మ జ్ఞానమే విశిష్టమైనది. "ఆత్మజ్ఞానమే అన్ని జ్ఞానములకు ఆధారమని"[121] బృహదారణ్యకం తెలుపుతుంది. జీవాత్మకును పరమాత్మకును భేదములేదని ఉపనిషత్తులు తెలుపుతున్నాయి. ఉపనిషద్భాషలో "సాక్షీచేతా కేవలో నిర్గుణశ్చ"[122] అని ఆత్మస్వరూపం ఈ అధ్యయనాన్ని ఆధ్యాత్మికం అంటారు. అధ్యాత్మం, అధ్యాత్మికం దీనికి పర్యాయ పదాలే. ఈ పదాలన్నీ ఆత్మజ్ఞాన విశిష్టతను ప్రకటిస్తాయి. ఇవి పలురూపాలలో ఉన్నప్పటికీ స్ఫురింపజేసే అర్థమొకటే. ఈ ఆధ్యాత్మికతను ఒక్కొక్కరు ఒక్కో విధంగా అధ్యయనం చేసి అనుభవిస్తారు. అనుభవించి స్వేచ్ఛగా విహరించి ఆధ్యాత్మిక పరిమళాలను రకరకాల రూపాలలో పంచుతారు. అధ్యయనం, దర్శనం, అనుభవం అనేవి అందరికి పట్టుపడవు. కొందరికే స్వంతమవుతాయి. ఇవి ఆధ్యాత్మికతలో ఒదిగివున్న ఆకర్షణీయమైన పార్శ్వాలు.

ఆచార్య తిరుమల తమ రచనలో ఆధ్యాత్మికతను సత్యనిష్ఠతో వర్ణించారు. వేదాలనూ, ఉపనిషత్తులనూ, సమాజాన్ని సమగ్రంగా చదివిన కవి అవడం వల్ల ఈ మూడింటి మధ్యం అల్లుకొని ఉన్న ఆత్మ పరమాత్మతత్వాన్నీ గుణాన్ని సాకల్యంగా తీర్చిదిద్దారు. ఆధ్యాత్మికస్థితులను కావ్యస్థం చేసినప్పుడు ఆయన వాడుకున్న భాష, కవిత్వ భాష ఎంతో ఆర్ద్రంగా ఉంది. తిరుమల ఆధ్యాత్మికత తొలుత సంప్రదాయ నిష్ఠగా అనిపిస్తున్నా సమాజ శ్రేయస్సుకు మనిషి మథనం నుంచి ఉప్పొంగి దూకి వచ్చిన పరమాత్మ స్వరూపమే కన్పిస్తుంది. ఆయన 'అమృతాన్వేషణ'కు రాసుకున్న ముందుమాటలో "గురుపరంపరాగత తత్త్వ భావ స్ఫురణతోనే తప్ప ఏదో లౌకిక కాంక్షతో నేనీ రచన చేయలేదు. ఆత్మనిష్ఠతో, శ్రద్ధా సూత్రంతో జీవిత పరమార్థానికి చేసిన అక్షర ప్రయత్నమిది. తత్వ గర్భిత కవితా సౌందర్య కిరణాల విలువను గూర్చి రసజ్ఞ శేఖరులకు వేరుగా ఏమీ చెప్పవలసిన పనిలేదు" అన్నారు. ఇది సత్యమే. అయితే కవి ఈ మాటలు 'అమృతాన్వేషణ'కు మాత్రమే పరిమితం కాదు. ఆయన అన్ని రచనలలోనూ ఈ భావన సాదరంగా ధ్వనిస్తుంది. పరమాత్మ తత్వాన్ని హృదయ సౌందర్య తత్వంగా సంభావించుకొని అట్లాగే రచనలు చేసి సమాజాన్ని దేవళంగా మలచడానికి ఆత్మను అంకితం చేసుకున్న పుణ్యశీలి తిరుమల.

నేను నీ కోసం
గుహలన్ని గాలిస్తున్నాను
చీకటి తప్ప
వెలుగు జాడలేదు
ఘోష తప్ప
ఆత్మ భాషలేదు
ఆర్భాటం తప్ప
అనుభూతి లేదు
ప్రభూ!

ఒక్క కిరణాన్ని
ప్రసాదించు
దారి చూపించు
మాతృ గర్భాల్ని
మరు భూముల్ని
దాటించి
నన్ను నడిపించు[123]

ఇది తిరుమల అన్వేషణ. అభ్యర్ధన. ఈ రెండూ ఆత్మసంబంధమైనవి. అన్వేషణంలో భగవంతుని రూపం కన్పిస్తే, అభ్యర్ధనంలో ఆయన తత్వం మనోనేత్రాలకు గోచరిస్తుంది.

గుహలను గాలించాడు. చీకటి ఎదురుపడింది. వెలుగు జాడ కనిపించ లేదు. ఘోష బాధ తప్ప ఆత్మ భాష వినిపించలేదు. ఆత్మభాష అనేది పరమాత్మ స్పర్శనంతో దర్శనంతో వచ్చేది. ఆ భాష పుడితే అంతరాత్మ పులకిస్తుంది. అంతరాత్మను దాచుకున్న హృదయం ఉప్పొంగుతుంది. హృదయం తరంగితమవుతే ఆనందం రెక్కలు విప్పుకుంటుంది. ఆనందం అంతా కదలాడితే భువి దివిలా అలంకృతమవుతుంది. దాన్ని అందుకోవడం కోసమే తిరుమల తపన. ఒక్క కిరణాన్ని ప్రసాదించమని, దారి చూపించమని అభ్యర్ధన. "మాతృ గర్భాల్ని మరు భూముల్ని దాటించి" తనను నడిపించమని కోరారు. మాతృగర్భాల్ని, మరుభూముల్ని దాటించడమంటే మరో జన్మ లేకుండా సాయుజ్యాన్ని ప్రసాదించమని. మోక్షం లభిస్తే ఎప్పుడూ భగవంతుని సాన్నిధ్యంలో ఉండడమే కదా! అంతకన్నా మరో సౌఖ్యం ఉండదు కదా జీవికి. పుట్టిన ప్రతి ప్రాణి గిట్టక తప్పదు. మళ్ళీ పుడుతుంది. ఈ జన్మ వాసనాబంధాన్ని తుంచివేయమని కవి ఆశించడంలోనే ఆత్మజ్ఞానం కన్పిస్తుంది.

కష్టాలు వెంటాడి వేటాడి కాటు వేసినప్పుడు మనస్సు రక్షణ కోసం ఈశ్వరుణ్ని అర్థించదానికి ఆరాటపడుతుంది. సుడులు సుడులుగా తిప్పబడుతున్న జీవితంలోని అనేక మలుపులను లోక నాయకుని ముందు ఏ కరువు పెట్టడం జరుగుతుంది. అలా చేసినప్పుడు మనస్సును చితక బాధేస్తున్న భారం కొంత తగ్గి కొంత ప్రశాంతత ఏర్పడుతుంది. ఆచార్య తిరుమల ఈ భావనను కవితాక్షరాలుగా రాసులు పోశారు.

కష్టాలు సైన్యాలతో
మాటి మాటికి
నా పూల తోట మీదికి
దాడి చేయిస్తున్నావు
నేను
ప్రకృతి - జీవితం
అందంగా ఉంటాయని
నమ్మిన వెర్రివాణ్ణి



ఘీంకారాలు, సకిలింపులు
ఝుళిపింపులు తప్ప
నా పూల రెక్కల మీద
చల్లగాలుల సయ్యాటలు లేవు
అవి, ఎడ తెరపి లేని కన్నీటిలో
దగ్ధమవుతున్న భావాలు
నా వేదన నీకు
వినోదమే అయితే - కానీ
ఆనందించు!
హాయిగా వినోదించు
ఇంతకీ నేను నిన్నేమన్నానని?
సజావుగా రమ్మంటున్నాను
అంతేగా[124]

బాధను భగవంతుడే కలిగించాడని భావిస్తారు. గాయపడ్డ మనస్సు జీవితం ఈ రెండూ ఆక్రోషిస్తాయి. ఎలుగెత్తి అరుస్తాయి. భగవంతుణ్ని ప్రశ్నిస్తాయి. కష్టాలు మామూలువి కావు. అవి సైన్యం లాంటివి. సైన్యం ఏ ఒక్క ఆయుధంతోనో దాడి చేయదు. సమస్త మారణాయుధాలను గుప్పిస్తూ శత్రు పక్షాన్ని చీల్చి వేస్తుంది. అట్లాగే కష్టాలు అనేవి ఒక్క రూపంలో ఒక్క తీరులో ఉండవు. అనేక విధాలుగా ఉంటాయి. ఈ కష్టాల సైన్యాలతో పూల తోటలాంటి జీవితం మీద దాడి చేయడమేమిటని ప్రశ్న కష్టాలకు ముందు మనిషి అనుకుంటాడు. ప్రకృతీ అందంగా ఉంటుందనీ, జీవితమూ అందంగా ఉంటుందని. నిజమే. అయితే, ప్రకృతి ఎల్లప్పుడూ అందంగా ఉండదు. అప్పుడప్పుడు అందవిహీనంగా మారిపోతుంది. అట్లాగే జీవితం కూడా. ఒకప్పుడు సొగసుగా ఉంటుంది. మరొకప్పుడు శోకాశ్రువులతో తడిసిపోతుంది. తోసుకొని వచ్చిన వినోదంతో క్రీడిస్తుంది. సౌఖ్యాల పరంపరలలో ఈదులాడుతుంది. అంతలోనే మారిపోతుంది. తాను తెచ్చిపెట్టుకున్న గాయాలతో, ఎదుటి వాళ్ళు కలిగించుకున్న గాయాలతో పరితపించిపోతుంది. ఒకప్పుడు సౌందర్య సౌభాగ్యంతో ఉప్పొంగిన జీవితం నిస్తేజంగా మారి చతికిల బడిపోతుంది. అందుచేత ప్రకృతీ జీవితమూ నిరంతరం పచ్చదనంతో శోభించవు. చీకటి వెలుగుల మధ్య తిప్పబడుతూనే ఉంటాయి. కొందరు ఈ రెండూ అందమైన వస్తువులనే భావిస్తారు. బాధలతో నలిగిపోతారు. జీవితం అనే పూల రెక్కల మీద ఏనుగుల ఘీంకారాలు, గుర్రాల సకిలింపులూ, సైనికుల కత్తుల ఝుళిపింపుల హోరు కన్పిస్తుందే కాని, చల్లగాలుల ప్రవాహాలు తరగెత్తవని జీవి ఆవేదన పడతాడు. అవి ఎడతెరపి లేని కన్నీళ్ళలో దగ్ధమవుతున్న భావాలని కుమిలిపోతాడు. ఈ ఆవేదన వినోదమే అయితే ఆనందించుమని భగవంతుణ్ని ప్రశ్నిస్తాడు. సజావుగా రమ్మంటాడు. ఈ ఆహ్వానం అతని హృదయంలోని భావ పరంపరలను ప్రకటించే తీరులో ఉంది.

ఆశలు భయంకరంగా మనిషిని చుట్టేస్తాయి. మేధనూ పట్టేస్తాయి. మనస్సును ఆక్రమిస్తాయి. ఆ స్థితిలో జీవుడు సాగించే అన్వేషణా అనుభవించే దైన్యమూ, పరివేదనా ఇట్లా ఉంటాయి.

అపాద మస్తకం
నన్నొక కాల సర్పం
చుట్టుకొని ఉంది
నా జ్ఞానేంద్రియాల్లో
కర్మేంద్రియాల్లో
బుద్ధిలో, మనసులో
భయంకరమైన
విషపు బుసలు[125]

అపాద మస్తకం కాలసర్పం చుట్టేయడం అంటే దేహం నిండా ద్వేషం జ్వలించడమే. అలాంటప్పుడు మనిషి ఎంత ఉన్నతుడైనా అతని జ్ఞాన కర్మేంద్రియాలలో, బుద్ధిలో, మనస్సులో భయంకరమైన విషపు బుసలు పొంగుతాయి. ఆ బుసలు వ్యక్తి జీవితానికి, సమాజ గమనానికి ఆటంకంగా పరిణమిస్తుంది. అడుగడుగునా విఘ్నాలు ఎదురుపడి పచ్చని జీవితాన్ని కూడా బీడుగా మారుస్తాయి. ఆ వేళ జీవుని అన్వేషణ బాధాకరంగా ఉంటుంది.

దాస్య విముక్తి కోసం
అమృతాపహరణానికి
రెక్క విప్పిన ఏ గరుడుడూ
నన్ను చూడటం లేదు
విషమ విషయ వ్యూహంలో
వికృత విశ్రుత మోహంలో
నిర్విరామంగా నా యాత్ర
నీవు మెచ్చని నాటకంలో
నాదొక పనికి మాలిన పాత్ర[126]

భగవంతుని దర్శించాలన్న భక్తుని హృదయావేశం రోజురోజుకూ అధికమవుతుంది. ఆవేదన అంతకన్నా మిక్కుటంగానే ఉంటుంది. తన ఆత్మ నివేదనను భగవంతునికి చేర్చడానికి ప్రయత్నిస్తాడు. కన్న తల్లి దాస్య విముక్తి కోసం పక్షీంద్రుడు గరత్మంతుడు అమృతాన్ని పొందడానికి రెక్క విప్పి దేవలోకం వెళతాడు. కార్యాన్ని సాధిస్తాడు. విష్ణుమూర్తిని మోసేవాడు అయన. ఆ వైనతేయుడు తనను చూడటం లేదని భక్తుడైన కవి ఆవేదనను వ్యక్తపరుస్తున్నాడు. ఆయన సమాజం అనే విషమ వ్యూహంలో చిక్కిపోయాడు. విషయకూపంలో జారిపడిపోయాడు. వికృతమైన, విస్తృతమైన వ్యామోహంలో మునిగిపోయాడు. ఆ భావనలోనే నిర్విరామంగా జీవనయాత్ర సాగిస్తున్నాడు. విషయలంపటుడైన జీవుని దేవుడు కనికరించడు. అందుచేత, తన జీవితం భగవంతుడు మెచ్చని నాటకంలో పనికి మాలిన పాత్ర అంటారు. ఔను! మరి విషయాలోలుడైన జీవునికి జీవిత పరమార్థం బోధపడదు. దైవం కోసం సాగే అన్వేషణ సంపూర్ణం కాదు. గతించిన యుగాలలో జితేంద్రియులమని మొదట చెప్పుకొని తపస్సులో లీనమైన విశ్వామిత్రుల వంటి మునీశ్వరులు కూడా కామవాసనలలో తగుల్కొని తపస్సుతో సాధించిన పరమార్థాన్ని పోగొట్టుకున్నారు. కడకు అర్థంచేసుకున్నారు. కామక్రోధాది అరిషడ్వర్గాలను గెలిచి మహర్షులూ, బ్రహ్మర్షులూ అయ్యారు. ఇట్లా వాంఛలను గెలిచిన ఉత్తములకు మాత్రమే భగవంతుడు కనిపిస్తాడు. తనలో చేర్చుకుంటాడు. సాయుజ్యాన్ని అనుగ్రహిస్తాడు. మహాకవి ధూర్జటి కాళహస్తీశ్వర శతకం[127]లో లౌకిక సౌఖ్యాల వలన జీవునికి కలిగే అనార్థాలను ఏకరువు పెట్టారు.

దైవాన్ని పొందడానికి భక్తుని ఆరాధన అనేక రూపాలలో ఉంటుంది.

తీర్థస్నానాలు - క్షేత్ర దర్శనాలు
దానాలు - ధర్మాలు
ఉత్సవాలు ఊరేగింపులు
అన్నీ నా భయం చేసే
అల్లర్లు - ఆందోళనలు
నీ ఆయుధాలన్నీ ప్రక్కన పెట్టి, రా!
ఒక్కడవే రాజీకి రా
నా శబ్దాన్ని నీవు తీసుకొని
నీ నిశ్శబ్దాన్ని నా కియ్యి!
ఎక్కడో వుండి బెదరించకు
ఏమీ ఎరుగనట్టు నటించకు[128]

దైవం సన్నిధిలో ఉండటానికి జీవుడు సాగించే ఆరాటం అనేక విధాలుగా ఉంటుంది. కొండపైకి వెళతాడు. దూరంలో ఉన్న నదులలో స్నానం చేస్తాడు. క్షేత్రాలను, ఆలయాలను దర్శిస్తాడు. దానాలు ధర్మాలు చేస్తాడు. ఇవన్నీ ఎందుకు చేస్తాడు. జీవునిలోని భయం వల్లనే. జీవునిలోని భయం ప్రవేశించి ఎందుకు పీడిస్తుంది. అతడు జీవన యాత్రలో అనేక దోషాలూ చేయడం వల్లనే. దీన్ని మనస్సు నుంచి తుడిచి పెట్టడానికే ఈ జపతపాలూ, దానధర్మాలునూ. భయం వలన పుట్టిన అల్లర్లను ఆందోళనలను అణచివేయడానికి నిరాయుధుడవై రమ్మంటారు. అంతేకాదు, రాజీకి రమ్మంటారు. కష్టాల నుంచి తనను ఉద్ధరించుమని భక్తుడు దైవాన్ని ప్రార్థిస్తూ తన దీనత్వాన్ని అడుగడుగునా ప్రకటిస్తాడు. ఆక్రందిస్తాడు. వేదనతో తపించిపోతాడు. అలా చేస్తాడే కాని రాజీకి రమ్మని కవి రాయడంలో అసలు అర్థం ఏమిటి? రాజీ అనే మాట సంధి, సమత, శమం అనే అర్థాలను ప్రకటిస్తుంది. ఒక్కొక్కమారు భక్తుని అంతరంగం నుంచి భక్తితత్పరతలు పెల్లుబుకుతాయి. అప్పుడు ఆ

వేగిరపాటులో భగవంతుణ్ని రకరకాలుగా పిలవడం, అనేక విన్యాసాలు చూపడం జరుగుతుంది. 'రారా', 'అందుకోరా', 'ఆదుకోరా' అనే మాటలు భక్తుని నోటి నుంచి వస్తాయి. ఇదంత ఒక విధంగా భగవంతునికి, భక్తునికి మధ్య సాగుతున్న పోరాటమే. ఈ తరహా సమరాన్ని ఆపేసి రాజీకి రమ్మని కవి రాయడంలోని ఔచిత్యం ఇదే. మరొక విధంగా చూస్తే బంధువూ, భక్తుడూ అయిన అర్జునుడు తనను శరణు వేడిన గంధర్వరాజు గయున్ని కాపాడడంలో శ్రీకృష్ణ భగవానుడిని రాజీకి రమ్మని, తమను ఆదుకోమని అర్థిస్తాడు. కడకు యుద్ధమే జరుగుతుంది. ఫలితంగా శంకరుడు ప్రత్యక్షమై కృష్ణార్జునులను నరనారాయణులని చెప్పి ఇద్దరూ ఒక్కరే అని సమ భావాన్ని గుర్తు చేసి మళ్ళీ నేస్తాన్ని ఉద్ధరిస్తాడు. మహాభక్తుడూ నిరంతర రామనామ ధ్యాన తత్పరుడు అయిన ఆంజనేయుడు రాజైన యయాతి ప్రాణాలను నిలపడానికి శ్రీరామునితో భక్తి అనే ఆయుధంతో తలపడతాడు. రామభక్తిలో ఉన్న శక్తిని ప్రయోగించి భగవంతుడిని గెలుస్తాడు మారుతి. తిరుమల మనస్సు సహజమైన భక్తి భావంతో నిండి ఉంటుంది. అందువల్లనే ఇలాంటి పదాలను ప్రయోగించి అభివ్యక్తికి నాణ్యత కలిగించారు. అంతేకాక తన శబ్దాన్ని తీసుకొని, దేవుని నిశ్శబ్దాన్ని తనకు ప్రసాదించమని ప్రాధేయపడతారు. ఎక్కడో ఉండి బెదిరించకుమని, ఏమీ ఎరుగనట్టు నటించకుమని అర్థిస్తారు. రచనాభివ్యక్తి ఆధునికమైనప్పటికీ ఈ కవితలో సనాతన ధర్మ ప్రతిపాదన పవిత్రంగా ప్రకటితమవుతుంది.

ఆధ్యాత్మికం అంటే కేవలం ఆత్మపరమాత్మల తత్త్వాన్ని ప్రకటించే శబ్దం మాత్రమే కాదు. మానవీయమైన అనేక ధర్మాలనూ, విజ్ఞానాన్ని తెలిపేది కూడా. అయితే ఆదర్శమైన ఈ మానుష ధర్మాలు ఆత్మపరంగా కొనసాగితే లోకంలో అశాంతి, అమానుషం దౌర్జన్యం లాంటివి అసలు తలెత్తవు. నేలంతా నాక లోకంగా మన గలుగుతుంది. భగవంతుడు అంతటా ఉంటాడు. లేదు అనే వాని రసన మీద నర్తిస్తూనే ఉంటాడు.

గావు కేకలు పెడితే
గగనంలో నక్షత్రాలు
నేలరాలి పోతాయా!
ఉన్నావో - లేవో
నీ ఆకారాలేమిటో
నీ వికారాలేమిటో
ఆలోచించకుండా
లేవు లేవంటే లేకుండా పోతావా?
వైరుధ్యాల మధ్య
వైపరీత్యాల మధ్య
ఏ సూత్రం మెరుస్తుందో
ఆ సూత్రాన్ని సృష్టించే నేత్రం నీది
కరుణారస గాత్రం నీది[129]



ద్వేషరూపులకు దేవుడూ, దేవుడు లాంటి లోకం కనిపించదు. తామే దేవతలమని అహంకరించి పతనమైపోతారు. పురాణకాలంలో రావణుడు, నరకుడు వంటి దానవులు గర్వించి భగవంతుణ్ని దూషించి ఎదిరించి నశించి కడకు ఆ స్వామిలో లీనమై తమ పాపాలను క్షాళనం చేసుకున్నారు. అలాంటి దుష్టులలాంటి వాళ్ళు వర్తమానంలో ఉన్నారు. రూపురేఖలు అలా ఉండకపోవచ్చు. కానీ, చేసే పనులు దనుజుల కృత్యాలను తలపిస్తాయి. కొన్ని సమయాలలో అంతకన్నా దారుణంగా ఉంటాయి. వాళ్ళు గొంతెత్తి అరుస్తారు. స్వామిని ఎద్దేవా చేస్తారు. అయితే వారి అసంబద్ధమైన శబ్దాలకు చుక్కలు నేలరాలిపోతాయా? లేదులేదూ అంటే లేకుండా పోతాడా? అలా జరుగదు. హృదయాలలో అసురభావాలు దండిగా ఉన్నవాళ్ళకు స్వామి ఆకార వికారాలు కనిపించవు. వైరుధ్యాలు, వైషమ్యాలు, వైపరీత్యాల వంటివి ఎన్ని ప్రజ్వలించినా వీటిని చల్లబరచి మరి తలెత్తకుండా అణచివేసే ప్రేమతత్త్వం ఆ స్వామిలో ఉంది. ప్రేమతత్త్వానికి మూలమైన ప్రేమసూత్రంతో అందరినీ కట్టేస్తాడు. లోకాలను ప్రశాంత సుందరంగా తీర్చిదిద్దుతాడు. ఆయన నేత్రాలు అలాంటివి. గాత్రకరుణరసభరితమైంది. ఆ గాత్రంలో పిలిస్తే భక్తుడు తననుతాను మరచిపోతాడు. ధ్రువుడు లాంటివాళ్ళు కూడా భగవత్ సాక్షాత్కారంతో పిలుపుతో పులకించిన వాళ్ళే.

దప్పికతో ఉండి
నీటిని చీదరించుకునే వెర్రివాడు
నిన్ను గమనించలేడని తెలుసు!
నావి కేకలు కావు
నీవు ఎత్తుకు పోయిన కోకలు!
పొన్న చెట్టుకు వ్రేలాడుతున్న
జన్మల, జన్మల రహస్యాల మూకలు[130]

దప్పిక ఉన్నవాడు నీళ్ళను చీదరించుకుంటే దాహం తీరదు. కడకు ప్రాణం మీదకి వస్తుంది. అలాంటి వాళ్ళు భగవంతుణ్ని గమనించలేరు. సదాశయాలు ఉండి కూడా ఆచరణలో చూపించకపోతే అతని మానుష ధర్మం ప్రయోజన శూన్యమే అవుతుంది కాని ఫలవంతం కాదు. ఇక కృష్ణుడు ఉన్నాడు. అతనివి నిజంగా బాల్య చేష్టలు కావు. ఆ శైశవ క్రీడలలో ధరణిని పులకింపజేసే సిద్ధాంతాలు ఉన్నాయి. మన్ను తినలేదని నోటిని తెరిచి తల్లి యశోదకు చూపించిన గోపబాలకుని దైవంగా దర్శించింది ఆ మాత. "కలయో వైష్ణవమాయయో"[131]అని ఆశ్చర్యంతో చలించిపోయింది. అట్లాగే సరస్సులో జలక్రీడలాడుతున్న వ్రేపల్లె యాదవ వనితల చీరెలను దొంగిలించి చెట్టుపై కూర్చోవడం. అర్థించిన గోపాంగనలతో లేచి నిలబడి రెండు చేతులు జోడిస్తే కోకలు ఇస్తాననడం ఇవి నల్లనయ్య తుంటరి పనులు అనిపిస్తాయి. స్థూలదృష్టికి. కాని అసలైన పరమార్థం చీరలనే వాసనా పరంపరలను తొలగించి నిత్యం ప్రకాశితమైన సాయుజ్యం అనే సౌఖ్యాలను అందివ్వడమే. దేహం మీద మమకారం వదిలినప్పుడు, మనస్సుకు భగవంతునిలో రమింపజేసినప్పుడు

మాత్రమే భగవంతుని నిజతత్త్వం బోధపడుతుంది. అందుకే తిరుమల 'నీవు ఎత్తుకు పోయిన కోకలు పొన్న చెట్టుకు వ్రేలాడుతున్న జన్మల, జన్మరహస్యాల మూకలు'అని అనడంలోని రహస్యం ఇదే. భగవానుని అనంతమైన లీలలను అంత సులభంగా అందుకోలేం. కడకు గోపికలు నందనందనునికి ప్రణమిల్లి మనస్సునూ, దేహాన్ని చుట్టు వేసిన భవబంధాల నుంచి విముక్తి పొందారు. భారతీయంలో, కృష్ణతత్త్వంలో ఉన్న ప్రత్యేకత మరెందులోనూ కనిపించదు. అన్నింటికన్నా తానే ముఖ్యుడనని కృష్ణుడు గీతలో[132] చెప్పారు.

అనంతతత్త్వాన్ని కలిగి ఆత్మతత్త్వాన్ని ప్రబోధిస్తూ అర్థించిన దీనావళిని ఆదుకునే దేవదేవుణ్ని కవి స్మరిస్తూ

కంచెకు నమస్కరిస్తున్నాను
పంటను కాపాడమని
కంచి వరదా! వరదా! నీకు
నమస్కరిస్తున్నాను
నా కంటిని కాపాడుమని
శ్వాసతో వాడిపోయే పూలు
గాలికి రాలిపోయే ఆకులు
పక్షులు కొట్టిపారేసే పళ్ళు
కడకు కుళ్ళిపోయే నీళ్ళు
నీకు సమర్పించలేను
ఆత్మ భావాల్ని
అంతశ్శరీరాల్ని
కర్మఫలాల్ని
కన్నీళ్ళని
నీకు నైవేద్యం చేస్తాను[133]

పంటను కాపాడే కంచెకు కవి నమస్కరిస్తున్నారు. సస్యం ఎదగడానికి ఫలించడానికి కంచె ముఖ్యమైంది. కంచె రక్షణ కవచంగా ఉండి పంటను కాపాడుతుంది. అయితే కవి భావించిన కంచె పైరు చుట్టూ ఉన్నది మాత్రమే కాదు. అది దైవానికి కూడా వర్తిస్తుంది. దైవాన్ని చేరుకోవడానికి భక్తుడు చేస్తున్న ఆరాధనకూ తపస్సుకూ ఆ దైవమే రక్షణగా ఉండి ఆదుకోవాలని కవి కంచి వరదరాజ స్వామిని ప్రార్థించారు. ఈ ఆరాధనంలో కవి అభివ్యక్తి భక్తిరస భరితంగా ఉంది.

ఆత్మ సమస్త విజ్ఞాన సంహిత. జ్ఞాన ప్రదాయిని. ప్రదాత కూడా. ఆత్మ ఔన్నత్యం వర్ణనకూ, ప్రశంసకూ అందనంత ఎత్తుగా ఉంటుంది.



ఒకడు మహా విద్వాంసుడు
అయితే నా కేమిటి?
ఒకడు వేద వేదాంగ వేత్త
అయితే నా కేమిటి?
ఒకడు సర్వశాస్త్ర నిష్ణాతుడు
అయితే నా కేమిటి?
ఒకడు మహా గాయకుడు
అయితే నా కేమిటి?
ఒకడు మహా నాయకుడు
అయితే నా కేమిటి?
ఒకడు అగర్భ శ్రీమంతుడు
అయితే నా కేమిటి?
ఒకడు మహా మహిమోపేతుడు
అయితే నా కేమిటి?
ఏదో ఎవరిదో గొప్పదనం
నన్నేమి చేయగలదు?
నన్ను గురించి ఘనంగా
చెప్పుకునేటంత మాట
నీవింకా సృష్టించలేదని
నాకు బాగా తెలుసు![134]

లోకంలో విశిష్టమైన విషయాలు చాలా ఉన్నాయి. అట్లాగే వ్యక్తులలోనూ ఉన్నతమైన అంశాలు ఎన్నో ఉన్నాయి. కొందరు స్వతహాగా ఎదిగితే మరికొందరు మరోదారిలో పయనిస్తూ కీర్తిమంతులు అవుతారు. విద్వాంసుడు, వేదవేత్త, శాస్త్రవేత్త, మహాగాయకుడు, మహానటుడు, ఆగర్భశ్రీమంతుడు, మహిమోపేతుడు వీళ్ళందరూ వాళ్ళ రంగాలలో మహోన్నతులే. అయితే వీళ్ళకు ఆ గొప్పదనం రావడానికి ఎంచుకున్న మార్గాలు వేరుగా ఉంటాయి. కొందరు కీర్తికోసం ఆరాటపడితే, మరి కొందరు సదాశయాలను అనుసరిస్తూ జీవితంలోని విలువలకు ప్రాధాన్యమిస్తే, మరి కొందరు ఆధ్యాత్మిక తత్త్వాలకు గొడుగుపడతారు. ఎవరైనా కానీ, ఏ సన్నివేశంలోనైనా కానీ, తత్త్వాన్ని విస్మరిస్తే వాళ్ళు అందుకున్న జయాలన్నీ సాధారణంగా అనిపిస్తాయి. అన్నింటికన్నా ఎత్తైనదీ, విలువైనదీ, ఏ కాలం లోనూ చెరిగిపోనిదీ ఆత్మ. ఆత్మ అంటే జ్ఞాన రాశి అని ముందే చెప్పాను. ఆత్మతత్త్వాన్ని సమగ్రంగా తెలుసుకున్నవాడు యుగపురుషుడవుతాడు. పురుషోత్తముడవుతాడు. ఇక ఆత్మను తూచే సాధనం ఏదీ లేదు. ఆత్మకంటే ఉన్నతమైందీ మరొకటి లేదు. ఇంతకంటే లోకంలో ఘనమైన వస్తువేదీ లేదు.

కృష్ణుడు భగవద్గీత చరమశ్లోకంలో "సర్వధర్మాన్ పరిత్యజ్య మమేకం శరణం వ్రజ అహం త్వా సర్వపాపేభ్యో మోక్ష యిష్యామి మాశుచ"[135] అని అన్ని ధర్మాలను విడిచిపెట్టి తనను ఆశ్రయించమని బోధిస్తాడు. లోకంలోని అన్ని అవస్థలూ అతనివే. ఇదంతా సాంప్రదాయికంగా దర్శిస్తున్న తిరుమల

నీవు ధర్మానివి
అర్థం నీ ధర్మపత్ని
కామం నీ కన్న కొడుకు
మోక్షం నీ స్వగృహం
నీ కోసం నన్ను
అన్నీ వొదులు కోమంటున్న నీవు
నా కోసం వీటిలో
దేన్ని వొదులుకో గలవో
తెలియం లేదు
పురుషార్థాలు సాధించుమని
ఆంక్షలు విధిస్తావు
పురమే లేని, ఉన్న పురం నాది కాని
పురుషుణ్ని నేను
అన్ని పురాలూ పురాణాలూ
నిరాఘాటంగా ఏలుతున్న
పురుషోత్తముడవు నీవు[136]

సృష్టీ - సృష్టిలోని ప్రతి అంగమూ పరమాత్మ రూపమేనంటూ, జీవుడు తనలోని అపరాధాలను ఆయనకు నివేదిస్తాడు.

భగవంతుని తత్వాన్ని తెలిసికోవడానికి ఆయనను చేరుకోవడానికి భక్తుడు పరిపరివిధాలా ప్రయత్నిస్తాడు. ఆచార్య తిరుమల భక్తుని హృదయంలో వికసించిన భావనను సహజంగా చెప్పారు.

కడలిని కలిసిన నదిలా నా మది
కలిసి పోయినది నీ మౌనంలా
కలువలలో తుమ్మెదలా నా యెద
పులకరించినది నీ కన్నులలో
అందుకోవయా హారతి కాంతి
అందించవయా సుఖము శాంతి[137]

భగవంతుని కోసం భక్తుడు అన్వేషణ సాగిస్తాడు. ఆ అన్వేషణలో భక్తుని హృదయంలో



అనేక భావనలు పుడతాయి. నది పరుగులు పెట్టి సముద్రంలో కలిసిపోతుంది. అలాగే అతని మనస్సు పరాత్పరుని మౌనంలో విలీనమైపోతుంది. అంతేకాదు, కలువలలో తుమ్మెదలా భక్తుని హృదయం పరమాత్మ కన్నుల్లో పులకరించింది. అంటే భక్తుడు అన్ని విధాలా భగవంతునిలో మిళితమైపోయానని ఉత్తేజితుడవుతాడు. ఆ తీవ్రమైన భావావేశంతో హారతి కాంతిని అందుకొని సుఖశాంతులను ప్రసాదించమని అర్థిస్తాడు.

శ్రీకృష్ణుడు సాగించిన రాసక్రీడలూ, బృందా విహారాలూ, యమునా నౌకయానాలూ, వెన్నెల రాత్రుల సమాగమాలు ఇవన్నీ భౌతిక నేత్రాలకు కామక్రీడలుగా తోస్తాయి. అలాకాదు. అదొక అంతరంగ మధనం. జీవునికీ దేవునికీ మధ్య అంతర్యాన్ని తగ్గించేదీ, మానవ కల్యాణానికి దోహదపడేదీ, మనిషిలోని మనిషిని దేవునిగా నిలిపేది ఆయన మధనం.

పొంగే వాగులలో మురళీస్వనము
పూచే తీవెలతో బృందావనము
సిరివెన్నెల రాత్రులు
మన నౌకా యాత్రలు
మరచిపోదునే? నిను
విడిచిపోదునే?[138]

మురళీ స్వనం చల్లని నల్లనయ్య లలిత పెదాల మీద అలంకరింపబడిన పిల్లనగ్రోవి నుంచి పరవళ్ళు తొక్కుతున్న ఆ మధురనాదం పొంగే వాగులలో కలిసిపోయింది. అక్కడపొంగే వాగు యమున. కాళింది, కృష్ణుడు, గోపాంగనలు ఈ ముప్పురి మధ్య పెనవేసుకొని ఉన్న అనుబంధం అనాది నుంచీ వస్తున్నది.

కవిత్రయంలో ఒకరైన ఎర్రన కాళియ మర్దనాన్ని "యమునా వీచి మృదంగ వాద్యముల్ మ్రోయన్"[139] అనే పద్యంలో కృష్ణుని నాట్యాన్ని హృదయాహ్లాదంగా వర్ణించారు. పోతన్న "ఘన యమునా నదీ కల్లోల ఘోషంబు సరస మృదంగ ఘోషంబు గాగ"[140] అనే పద్యంలో గోపబాలుని కమనీయ నాట్యాన్ని కళ్ళముందు చూపించారు. ఆధునిక కవులెందరో ఈ అనుబంధాన్ని ఆత్మీయంగా చిత్రించారు. ఇక తిరుమల నాదమయంగా ఆవిష్కరించారు. వాగులలో మురళీ స్వనం కలిసిపోయినప్పుడు పూచే తీవెలలో బృందావనం ఎంత అందంగా ఉంటుంది. సిరివెన్నెల రాత్రులు, నౌకాయాత్రలు ఎంత మధురంగా ఉంటాయి. అవి మరుపుకు అందవు. అదే పరమాత్మ జీవాత్మను పునీతం చేయడానికి వర్షిస్తున్న నాద పరిమళం.

నీవే నిత్యము సత్యము
నీవే యీ యిహము, పరము నీవే, నీవే
జీవము దైవము, నీవే
భావము భావ్యంబటంచు పల్కెద రామా![141]

విశ్వాన్ని వెలిగించగల జ్ఞాన సముదాయం ఎంత ఉన్నప్పటికీ అదంతా ఆధ్యాత్మికంగా ఎదగాలి. అప్పుడే సమస్త విద్యలకు విలువ పెరుగుతుంది. అది మానవాళికి శ్రేయాన్ని కలిగిస్తుంది. ఆధ్యాత్మికత భగవంతుని ఆశ్రయించి ఉంటుంది. ఆ స్థితిని తెలుసుకోవడానికి నిత్యుడూ, సత్యస్వరూపుడూ అయిన భగవంతుణ్ని మనస్సు మీద నిలపాలి. ఇహపరాలన్నీ ఆయనే అని గ్రహించాలి. జీవమూ, దైవమూ అని తెలిసికోవాలి. భావం భావ్యం అని చేతులు జోడించాలి. అప్పుడు కానీ జీవాత్మ పరమాత్మలో విహరిస్తుంది.

ఈ విధంగా తిరుమల తన రచనలలో ఆధ్యాత్మిక చింతనను ఉదాత్తంగా అభివర్ణించారు. ఆధ్యాత్మిక చింతన ఉన్నప్పుడే మానవుడు పరిపూర్ణుడు అనిపించుకుంటాడని ఆయన భావించడం సముచితంగా ఉంది.

## 4. మానవతావాదం

మనిషి పుట్టినప్పుడు జంతువులలో ఒక జంతువులాగా, పర్వత గుహలలోనో, చెట్ల కొమ్మలలోనో ఉండిపోయాడు. ఆకలివేసినప్పుడు జంతువులాగే వేటాడి ఆహారాన్ని సంపాదించుకునేవాడు. తోటివారితో విచక్షణా రహితంగా ప్రవర్తించేవాడు. మారుతున్న కాలాన్ని అనుసరించి క్రమంగా అతడు పరిణతిని సంతరించుకొని సామూహిక జీవనానికి ఆరాటపడ్డాడు. గుహలలోనో, చెట్ల మీదనో నివసించిన మనిషి క్రమక్రమంగా విలాసవంతమైన గృహాలను కట్టుకోవడం, సుఖమయ జీవనం కోసం ప్రయత్నించడం చేశాడు. బుద్ధిబలాన్ని పెంచుకొని అవసరమైన మేరకు భుజబలాన్ని వినియోగిస్తూ మనస్సులో పుట్టిన ఒక్కొక్క కోరికను సాధించాడు. అయితే – ఆనాటి నుంచీ నేటి వరకు పరిశీలిస్తే మానవుడు ఎప్పుడో ఒకప్పుడు ఏదో విషయాన్ని సాధించడం కోసం దేన్నో సంప్రాప్తింపజేసుకోవడం కోసం పోరాటం చేయడం కన్పిస్తూనే ఉంది. నీతి నియమాలను ప్రబోధించడం, మంచితనంతో బతకడం, ప్రశాంతంగా సమాజాన్ని సరిదిద్దుకోవడం కూడా జరుగుతుండేవి. మనిషి మనస్సులో మంచి అంకురించడమే మానవతావాదానికి ఊపిరి అని చెప్పవచ్చు. ఇది మనిషి మలి దశ నుంచే కన్పిస్తుంది.

మనిషిలోని మంచితనం మానవత్వం అనే పేరుతో, మానవతావాదం అనే రూపంతో చరిత్రలో రూఢికెక్కింది. మహా సిద్ధాంతంగా ఈనాడు పాశ్చాత్య దేశాలలో ఒక ఆకృతిని సంతరించుకుంది. పారలౌకిక విలువల స్థానంలో ఇహలోక లక్ష్యాలకు ప్రాధాన్యత ఇచ్చే ధోరణే మానవతా వాదం. "మానవుని సర్వశక్తి మత్వాన్ని, స్వాతంత్ర్యాన్నీ, పరమ ప్రమాణంగా భావిస్తూ; అతని ధార్మిక, వైజ్ఞానిక, కళాత్మక, ఆధ్యాత్మిక రంగాల వికాసానికీ; మానవాభ్యుదయానికీ; సంఘ శ్రేయస్సుకూ మానవ సామర్థ్యాన్నే మూలంగా ప్రతిపాదించే వాదం"[142]ఇది. మానవుని గూర్చిన సమగ్రమైన విశ్లేషణను మానవతావాదమనవచ్చు. మానవతావాదం వేదకాలం నుంచే ప్రచారంలో ఉంది కానీ, అది ఆరాధనలలో, దానధర్మాది పుణ్యకార్యాల మాటున ఒదిగి ఉండేది. పిదప ప్రపంచ సాహిత్యాలలో ప్రారంభమైన పారిశ్రామిక విప్లవం తదనంతర కాలాలలో ఇతర దేశాలకు వ్యాప్తి చెందటం వల్ల ప్రజల



జీవన విధానంలో వచ్చిన మార్పులు కొత్త కాంతులను విరజిమ్మింది. భూతలాన్ని స్వర్గదామం చేయాలన్న కోరిక, స్వదేశం పట్ల భక్తి, విముక్తి కొరకు పోరాటం, సమానత్వం, సౌభ్రాత్రం వంటి మానవతా లక్ష్యాలు ఐరోపా రాజ్యాలకు కొత్త రూపాన్నిచ్చాయి. మానవ వికాసంతో పాటే మానవతావాద ఆదర్శాలు ముందుకు వచ్చాయి. మనిషితనం మానవతావాదంగా ఇరవయ్యో శతాబ్ది ఆరంభం నుంచి ప్రత్యేకతను సంతరించుకొన్నది. గ్రీకు దేశంలో ఈ వాదానికి కొత్త ద్వారాలు తీయబడినాయి. మానవతావాదానికి ప్రవక్తగా పేరుగాంచిన గ్రీకు తత్త్వవేత్త ప్రొటాగరస్ "Man is the measure of all things of things that are that they are, and of things that are not that they are not"[143] అని మానవతావాదాన్ని మొదటగా వ్యాఖ్యానించారు. మానవుడే అన్నిటికి ప్రమాణం అని నిర్వచించారు. మరి కొందరు తత్త్వవేత్తలు మానవతావాద స్వరూపాన్ని మరికొన్ని అంశాలతో విస్తృతపరిచారు.

మానవతావాదాన్ని గూర్చి 'A Glossary for the study of English' లో

"Humanism was based on the premise that the fullest development of the individual is an end in it self apart from reward of an after life, that the intelligent, satisfaction of the body is almost as important as the development of the mind, and that man can attain truth through the critical use of his intelectual powers. Humanism has been generally used to describe any ethical system. Which sees as man's highest duty the fullest possible development of human potential"[144] అని చెప్పబడినది.

మూఢ విశ్వాసాలను ఎదిరించటానికి మానవతా దర్శనం మౌలిక కారణంగా నిలిచింది. భారతదేశంలో మానవతావాద వ్యాప్తికి కృషిచేసిన మహనీయుడు యం.యన్. రాయ్. అయితే భారతీయ సాహిత్యాలలో తొలిదశలలో మానవతావాదం అంతగా చిత్రించబడలేదు.

తెలుగు సాహిత్యంలో మానవతా దృక్పథం నన్నయతోనే మొగ్గ తొడిగింది. ఆయన తన భారత భాగంలో రాజరాజునిదని, నిత్య సత్య వచనను పలుచోట్ల కీర్తించడంలోనే ఈ స్థితి కన్పిస్తుంది. విదురుడు, ధర్మజుడు వంటి పాత్రలలో ఈ దృక్పథం బహుళంగా అభివ్యక్తం చేయబడింది. తరువాత భక్తకవులు వారికంటే ఎక్కువగా తత్త్వకవులు ఈ వాదాన్ని తమ ఆశయాల ప్రసారానికి భూమికగా వాడుకున్నారు. వేమన కవితలో మానవతావాదం అంతటా విస్తరించి ఉంది. అభివ్యక్తి కూడా అందుకు బాగా సహకరించింది. కులమతాలను నిరసించడం. హెచ్చుతగ్గులను ఎద్దేవా చేయడం సమాజాన్ని బాగు చేయడం కోసమే.

ఉర్వి వారికెల్ల నొక్క కంచము బెట్టి
పొత్తు గుడిపి కులము పొలియజేసి
తలను చెయ్యిబెట్టి తగనమ్మ జెప్పరా[145]

అని వేమన మనిషి మనిషిగా సమైక్యభావంతో మనుగడ సాగించడమే శ్రేయస్కరమనే భావనను ప్రకటించారు. కుల, మత, జాతి, దేశ వివక్షత లేని సర్వమానవాళి అభ్యుదయాన్నే మానవతావాదం కాంక్షిస్తుంది.

"రఘుపతి వెంకటరత్నం నాయుడు, కందుకూరి వీరేశలింగం పంతులు, చిలకమర్తి లక్ష్మీనరసింహం, ఉన్నవ లక్ష్మీనారాయణ, గురజాడ అప్పారావు వంటి మహాకవులూ రచయితలూ ఆంధ్రదేశంలో మానవత నిధులు".[146] గురజాడ మానవతావాదానికి ప్రత్యేక రూపాన్ని ఇచ్చారు. ఆయన తన అన్ని ప్రక్రియలలో దీన్ని శక్తిమంతంగా రాశారు. అయితే లవణరాజుకలలో ఈ స్థితి మరింత పరాకాష్ఠను అందుకొన్నది. గురజాడ ఆదరించిన సంస్కరణాభిలాషలో కులాంతర వివాహం ఒకటి. ఈయన లవణరాజు మాలెతలకు పెళ్ళి జరిపించి సమభావాన్ని సమాజంలో స్థాపించడానికి యత్నించారు.

మంచిచెడ్డలు మనుజులందున ఎంచి చూడగ రెండె కులములు, మంచియన్నది మాలయైతే మాలనే అగుదున్[147] అంటూ అస్పృశ్యతను నిరసిస్తూ, మానవతావాదాన్ని బలంగా చెబుతూ సామాజిక స్పృహను కలిగించారు.

మానవతా దృక్పథాన్ని శ్రీశ్రీ ఇలా చెప్పారు.

సరిహద్దులు లేని
సకల జగజ్జనులారా
మనుష్యుడే నా సంగీతం
మానవుడే నా సందేశం[148]

మానవ పురోగమనం, ప్రపంచ శాంతి, విశ్వకళ్యాణం, సుఖమయ జీవనం వంటి లక్ష్యాలను ప్రబోధిస్తూ విశ్వ మానవతావాదాన్ని బలపరుస్తున్నారు శ్రీశ్రీ. ఇట్లా ఆధునికుల్లో మానవతావాదాన్ని బాగా ప్రచలితం చేసిన వారున్నారు. వారిలో ఆచార్య తిరుమల పేర్కొనదగిన వారు.

ఆచార్య తిరుమల తమ రచనలలో మానవతా దృక్పథాన్ని హృద్యంగా ప్రవేశపెట్టి రచనలను సార్వజనీనం చేశారు. సమాజంలో అంతరాలను చూచి పరితపించిపోయారు. మనిషి గుండెలో మూగిన కాలుష్యాన్ని చూచి బాధ పడ్డారు. ఈ అకృత్యాలు అంతమవడానికి కవితను సాధనంగా వాడుకున్నారు.

తిరుమల మంచి మాటను మానవతలో ఒక పార్శ్వంగా ఎంచారు. మనిషి మంచిగా మాట్లాడితే లేదా మాట్లాడకుంటే సమాజంలో ఆ వ్యక్తి స్థానం ఎట్లా ఉంటుందో ఇలా చెప్పారు.

మాట మనిషిని సంఘాన మహితుజేయు
అదియె వక్రించెనా! వాని నధము జేయు[149]



'ఒక మంచి మాట మాట్లాడు లోక మంతా హర్షిస్తుంది నీ సొమ్మేం పోయింది'[150] అంటారు భవభూతి. చల్లగా మాట్లాడే, కల్లలు లేకుండా మాట్లాడే మనిషి ఉత్తముడవుతాడు. అందరి మన్ననలు పొందుతాడు. ఎల్లకాలాలు కీర్తిమంతుడవుతాడు. విలువైన వ్యక్తిత్వంతో విరాజిల్లుతాడు. సమాజంలో మరి కొందరుంటారు. వాళ్ల మాటలు గుండెకు ముళ్ళలా తగులుతాయి. హృదయాన్ని బాధకు గురిచేస్తాయి. జగడాలకు దారి తీస్తాయి. కొందరి మాటలు మల్లెలలో దాగిన నాగులలా ప్రమాదాన్ని తెచ్చిపెడతాయి. విషం అవరించిన తేనెలా మనిషిని కడతేర్చే పని చేస్తాయి. తిరుమల ఈ బింబ ప్రతిబింబ భావాలను సహజంగా పై వాక్యాలలో తెలిపారు.

ఇదే విషయాన్ని మరో విధంగా ఆయన ఇలా అభివ్యక్తీకరించారు.

మంచి తనమున్నచో ముల్లు మల్లెయగును
మాట వెగటైన మణియైన మట్టియగును[151]

నిజమే. మనిషన్నవాడు మంచి మాటలతో మంచితనాన్ని ప్రాణంలా పోషించుకోవాలి. అలాంటప్పుడు గుండెలను చితక పొడిచే ముళ్ళు మల్లెలవుతాయి. మానసాలను సేదతీరుస్తాయి. జీవితం నిండా ఆర్ద్రతనూ, హాయినీ పంచుతాయి. మాట వికటిస్తే మణి మట్టిలా మిగిలిపోతుంది. అంటే మణి లాంటి మనిషి కూడా సమాజం దృష్టిలో మట్టివలె విలువలేని వాడవుతాడు. 'వాగ్భూషణమే సుభూషణం'అని భర్తృహరి చెప్పింది ఇందుకే. కనుక మనిషి వ్యక్తిత్వానికి గీటురాయి మాట అని చెప్పవచ్చు. 'నోరు మంచిదైతే ఊరు మంచిదవుతున్నద'ని నానుడి ఏర్పడింది కూడా ఇందుకే.

అభివ్యక్తి ఏ కోవకు చెందినప్పటికి కవితాత్మ పరిపూర్ణంగా ఉంటే వస్తువు అందాన్ని సంతరించుకుంటుంది. వచన కవితా ప్రక్రియలో ఎన్నో సోయగాలు ప్రదర్శించిన తిరుమల మానవతా దృక్పథాన్ని ప్రతీకాత్మకంగా చెప్పారు.

నేను
చితిమంటల్లో శయనించి
మౌనంగా భస్మమౌతున్నప్పుడు
నన్ను మోసుకొచ్చిన నలుగురూ
స్నానాలకు వెళ్ళినప్పుడు
నా మీద
కన్నీటి వాన కురిపించే
ఒక హృదయం కావాలి నాకు
ఆ నీటి లోంచి
నేను ఈ లోకంలోకి కొట్టుకు వచ్చి
ఆ హృదయాన్ని

బీజంగా నాటి
ఈ భూమి మీద
మానవతని పండిస్తాను
నలుగురి ఋణం తీర్చుకుంటాను
ఒక్కసారి భుజం మార్చుకుంటాను [152]

మనిషినీ - మనిషిలోని మంచినీ కాలరాచివేసే వాళ్ళుంటారు. ఆ విషమ వేళ మానవత మౌనంగా కాలుతూ ఉంటుంది. కురుసభలో భంగపడ్డ ద్రౌపది హృదయంలా. అయినప్పటికీ ఏ ఒక్కరో ఉంటారు మనస్సులో తేమ ఉన్నవాడు శ్రీకృష్ణునిలా. అతడు చాలు మానవతకు వేయి జన్మలిస్తాడు. ఇదే తిరుమల ఆవేదనా పూరితమైన హృదయ వలయాలలో నుంచి ఎగసి వచ్చిన అక్షర సంపుటి.

'చితి మంటలో శయనించి మౌనంగా భస్మమవుతున్నప్పుడు' అనే మాటలు నిజమైన చితి మంటలు కావు. సమాజంలో ఎక్కువ పార్శ్వాలు మనిషిని కాల్చివేస్తాయని భావన. ఈ కవితా సారాన్ని దర్శిస్తున్నప్పుడు గుండెలో ఏదో ఒక దగ్గర సినారె

మనిషి జీవితం
అనుభవాంకితం[153] అనే మాటలు కదలాడుతాయి.

పువ్వులు నలిపివేయబడినా పరిమళాల చిరునామాలు అలాగే ఉంటాయి. వెన్నెలలను భూమి ఉపరితలం ఆవిరి చేస్తున్న ఆ తాలూకు సౌకుమార్యం పరిమళిస్తూనే ఉంటుంది. మనిషి పుట్టినప్పటి నుంచి ఎందరో కర్కోటకులు గాయం చేస్తున్నా మానవత నిత్యం పునీతమై భాసిస్తూనే ఉంది. చీదరించుకున్నంత మాత్రాన, నలిపి వేయబడినంత మాత్రాన పువ్వూ - పరిమళాలు తమ వ్యక్తిత్వాన్ని వదులుకోవు. కాలదన్నినంత మాత్రాన వెన్నెలలు మళ్ళీ రాకుండా ఆగిపోవు. తరాల నుంచి ఆటుపోట్లకు తట్టుకొని వస్తున్న మానవత ఎప్పుడూ నవనవంగానే ఉంటుంది.

మానవతా ప్రగతి ప్రస్థానం కోసం
విచ్చుకొన్న నా కళ్ళకి గుచ్చుకొని
శతాబ్దాల చరిత్ర గమనాన్నింకా శిలలే చెప్తున్నాయి
ఐనా - ముళ్ళల్లో పువ్వు 'వాడటం' లేదు
కళ్ళల్లో ఆశ వీడటం లేదు[154]

'ముళ్ళల్లో పువ్వు వాడటం లేదు' అన్నది కఠోర సత్యమే. ఈ సత్యం ఏ పైశాచికత్వానికి దాసోహం అవదు. ఏ వెక్కిరింతలకీ జడుసుకోదు.

మనిషికి అన్నీ ఉండి ఎదో లేదన్న బెంగ ఏర్పడినప్పుడు మనిషితనం లేదన్నట్టే. మానవత వైయక్తిక త్యాగానికి, ఔదార్యానికి విలువనిస్తుంది. "రేపటి మనిషి కోసం, రేపటి ఉజ్జ్వల ప్రతిభా వికాసం కోసం; మనిషి మనిషితనాన్ని కోల్పోరాదనీ, సాటి మనిషి ఉనికిని



మరచి పోరాదనీ, చేయిచేయీ కలిపి సంకుచిత ధోరణులు - అవి ఏ రూపంలో వున్నా మలిపేసి-ఒకే ఒక్క మానవసంఘం, ఒకే ఒక మానవాత్మగా మలగాల"ని[155] మానవతావాదం ప్రబోధిస్తుంది.

అనంతమైన మనిషి భావుక సీమలో ఉదయించే పరంపరలు ఒక అనిర్వచనీయమైన అనుభూతిని కలిగిస్తాయి.

ఆకాశం హృదయంలో మెరిస్తే కవిత
ఆనందం ఆలోచనలో విరిస్తే మానవత[156]

ఆకాశం ఎంతో విశాలం. అది పిడికెడంత హృదయంలో మెరిస్తే అది ఓ మహా కావ్యాన్ని పలికిస్తుంది. రేకులు విచ్చి ఆనందం ఆలోచనలలో మంచి విరబూస్తే అది మానవతాగా నిలుస్తుంది. తిరుమల మానవతను గూర్చి ఎంత మార్మికంగా చెబుతారో పై కవితా పంక్తులు రుజువు చేస్తాయి.

తిరుమల లోకనీతిని సోదాహరణంగా ఆవిష్కరించిన తీరు అద్భుతంగా ఉంది.

సముద్రం చిన్ని గడ్డిపరకనైనా
చేరనీయదు
అగ్ని తనను వెలిగించిన చేతినైనా
కాల్చక విడువదు
సముద్రంలా అల్పుల్ని చేరనీయకు
అగ్నిలా నిస్వార్థంగా వెలుగు[157]

తిరుమల ఈ అభివ్యక్తిలో అల్పులను చేరనివ్వకపోవడం, నిస్వార్థంగా మనగలగడం మనిషిని మనీషిగా నిలబెట్టే తత్వాన్ని ఆయన పై కవితా పంక్తుల్లో సూచించారు.

మనిషి మనస్సును మంచి ఆవరిస్తే ఆ మనిషి మాటా, చేతా అమృతతుల్యంగా ఉంటాయి. పదుగురిని ఆలోచింపజేస్తాయి. స్పందింపజేస్తాయి. సాఫల్యతను సిద్ధింపజేస్తాయి. తిరుమల మనిషి నుంచి మహదాశయాలను కాంక్షించారు.

ఆశా ఆదర్శాలను
దివ్వెలుగా వెలిగిస్తాం
సమతా సహనాలను
జువ్వలుగా విసిరేస్తాం[158]

ఆశలు ఉంటాయి. ఆదర్శాలు ఉంటాయి. వాటిని ప్రజ్వలింపజేసే బలమైన పట్టుదల ఉన్న మనిషి కావాలి. మనిషికి అవసరమైన ఆశలను, ఆదర్శాలను, సమతా సహనాలను దివ్వెలుగా, తారాజువ్వలుగా చీకటి గుండెల మీద విసిరి వేసి కాంతిని ప్రజ్వలింపచేయాలని తిరుమల భావించారు. జనులలో జ్ఞాన కాంతులు నింపాలనే తాపత్రయం ఆయనలో

కన్పిస్తుంది. "రక్తసిక్త పటుకేటక తాటకలా/ మానవత్వపు కూడలిలో/ విలయతాండవం చేసే నీవెవరు"[159] అని మానవత్వం కోసం సాగుతున్న యజ్ఞాన్ని ధ్వంసించే రాక్షసత్వాన్ని ప్రశ్నిస్తారు. వికట రూపాన్ని ప్రదర్శిస్తే విలయం తప్పదని, దానవత్వం సొంతంగా అంతమవుతుందని హెచ్చరించారు.

"ఆధునిక కవితలో మానవుడే నాయకుడు. అతని బ్రతుకులలోని మంటలే వస్తువు. మానవ ధర్మం ఒకనాడు సాహిత్యాన్ని జీవింపజేస్తే, మానవ జీవిత సంఘర్షణ ఈనాడు సాహిత్యాన్ని ముందుకు నడిపిస్తున్న"[160]దని జీవియస్ అన్నట్టుగా తిరుమల మనిషి జీవితంలోని సంఘర్షణల వలయాలను కవితాత్మకంగా చిత్రించారు. మనిషి భవిష్యద్వాణిగా వినిపించారు. తమను కమ్ముకొని వస్తున్న సంఘర్షణ లాంటి అఖాతాల్లోంచి వెలువడిన మానవుడే ఉన్నతుడవుతాడని ఆయన విశ్వసించారు. అలాంటి వాళ్ళ జీవితాలే జాతికి ఉపాదేయమవుతాయని భావించారు.

మహామహుల జీవితాలే
మానవతకు ఇతిహాసం
మనిషి మనిషి త్యాగ నిరతి
మన ప్రగతికి ఆవాసం[161]

ఇలాంటి మానవోత్తముల జీవితాలే జాతిని ముందుకు నడిపించే ప్రగతి పథాలుగా మిగిలిపోతాయి. వారు వెళ్లిపోయినా ఆశయాలు భవిష్యత్ దర్శనాలుగా నిలుస్తాయి.

మనిషి పోయాక మాట మిగలాలి
మిగిలి రగల గల మాటలే పలికి
మనిషి మనిషిగా బ్రతకాలి
మనిషి పోయాక మంచి మిగలాలి
మంచితనముతో వంచనల్ త్రుంచి
మనిషి మనిషిగా నిలవాలి
మనిషి పోయాక మమత మిగలాలి
జనత నడవగల బాటలే వేసి
మనిషి మమతగా వెలగాలి
మనిషి పోయాక మనసు బ్రతకాలి
లలిత కళామయ అక్షరాకృతుల
మనిషి భావమై రగలాలి.
మనిషి పోయాక స్మృతులు కురవాలి
కురిసిపారగల చంద్రికా స్మృతుల
ప్రగతి శాంతినే వండాలి



మనిషి పోయాక మట్టి గలవాలి
కలిసి మట్టిలో మట్టికే పసిడి
తల్లిగా పేరు తేవాలి[162]

ఇవి అక్షర సత్యాలు కదా! మతాలు మానవత్వాన్ని వెలిగించే సాధనాలు మాత్రమే. కానీ, కొందరు దుర్నీతిపరులు మతాన్ని తమ స్వార్థానికి, సంకుచితమైన ఆశయాలకు అనుగుణంగా వినియోగించుకోవడం కన్పిస్తుంది. ఇలాంటి వైక్లబ్యాల వల్లనే జాతి పతనమైపోతుంది. మతాలు వేరైనా సమత్వం కలిగి ఉంటే మానవత పచ్చగా వికసిస్తుంది. ఈ భావనను తిరుమల ఇలా ప్రతీకాత్మక దృక్పథంతో వ్యక్తీకరించారు.

పంజరంలోని చిలుక లాంటి
మతం మీద మమత్వంతో
సమానత్వానికి - మానవత్వానికి
గోరికడుతున్న
గత కాల ప్రియుల్ని కళ్ళారా చూడు[163]

మానవతను గురించి రాస్తున్న కవులు ఎందరున్నా "మానవత నగ్నంగా ఉద్విగ్నంగా - నూతన వ్యక్తీకరణ కోసం చూస్తోంద"ని[164] శేషేంద్రఅన్నట్టుగా తిరుమల ఆ దిశలోనే మానవతా వాదాన్ని బలపరిచే కవిత రాస్తున్న కవి. లోకంలో అందరూ అదృష్టజాతకులు కారు. కొందరు పెట్టి పుడతారు. మరి కొందరు పుట్టి పెడతారు. ఇంకా కొందరు కనీస సౌకర్యాలకు కూడా నోచుకోరు. అలాంటి అనాథల కోసం నీకున్న దాంట్లో ఏ కొంతైనా దానం చెయ్యి. చేయూతనందించి సమాదరించి మానవతా పరిమళాలను విశ్వవ్యాప్తంగా వీచేట్లు కృషిసల్పి జన్మ సార్థకత చేసుకోమంటున్నారు.

నీవు తినే అన్నంలో ఒక ముద్ద దానం చెయ్యి
నడవలేని లోకానికి నిండుగా చేయూత నియ్యి
మింటి కొసలు తాకేదాకా మానవతని నడిపించు
కంటిలోని వెలుగు రేకలతో కేతనమై ఉదయించు[165]

మనిషి ఉన్నంతకాలం మానవత బ్రతికే ఉంటుంది. మానవతాభరణం ద్వేషాల మోసాల వలయంలో మనిషి చిక్కుకోకుండా కాపాడి మనిషిని మనిషిగా నిలుపుతుంది.

ద్వేషాలు మోసాలు ఉండనీకు గుండెలో
సాటిలేని సత్తువ ఎప్పుడూ నింపుకో కండల్లో
మంచితనం వాడిపోదు - అది గంధపు దండ
మానవతకు చలనం లేదు అది తూరుపుకొండ[166]

విద్వేషం, మోసం మనిషితనానికి మచ్చవంటివి. అలాంటి నీచ గుణాలను హృదయ పొలిమేరల నుంచి దూర తీరాలకు పారద్రోలి మానవత్వాన్ని ఆహ్వానించాలి. సాటి

మనిషిని ప్రేమించే సత్తువ కళ్ళల్లో నింపుకోవాలి. అలాంటి మంచితనం ఎన్నటికీ వాడిపోదు. మంచి గంధంలా పరిమళాలను వెదజల్లుతుంది. అది ఎన్నటికీ తరగనిది. పై పంక్తుల్లోని మానవతా సహజ గుణాలు, విశిష్టత మనసులేని పాషాణ హృదయాలను కూడా ద్రవీభూతం చేసేట్లు ఉన్నవి. మానవత వైపు పురమాయించేవిగా తోస్తున్నవి.

మానవతా పతాకాన్ని ఎగరవేయటానికైనా
కావాలి ఒక శిఖరం ఒక చైతన్య శిఖరం[167]

వానరత్వానికి స్వస్తి చెప్పి మానవత్వానికి వారసులుగా నిలిచి ప్రతి వ్యక్తి హృదయం మమతా మందిరం కావాలన్నది కవి ఆకాంక్ష. సమాజాన్ని పట్టి పీడిస్తున్న రుగ్మతలు తొలిగి నూతన సమాజావిర్భావం కోసం తహతహలాడుతున్న ఆయన వైనం ఈ కింది మాటల్లో వ్యక్తమవుతుంది.

కల్లోలాలు, వైషమ్యాలు తొలిగి
నిట్టూర్పుల ఎడారి తుఫానులు తొలిగి
మానవత్వం పతాకంగా సూర్యుడు ఉదయిస్తున్నాడు.[168]

మానవత్వాన్ని తిరుమల ఆత్మీయత ధ్వనిస్తుండగా ఈ రీతిగా ఆహ్వానించారు.

రా!
ఇలారా
వందలాది సంవత్సరాలుగా నీ కోసం
అణువు అణువు గాలించే
నా విజ్ఞాన నేత్రానికి
విందుగా రా[169]

మనిషితో మానవత్వం పుట్టింది. అయితే, అది అలాగే మనిషిలా మనిషి నుంచి ఎదగలేక పోయింది. ద్వేషం, కపటం, కలహం వంటి చీకటి కోణాలు ఆయుధాలుగా మారి మనిషి హృదయాన్ని గాయం చేశాయి. ఆయన గుండెలో పురివిప్పిన శాంతి, క్షమ, సచ్ఛీలం అనే వాటిని పడగ విప్పిన దౌర్జన్యం ధిక్కరిస్తుంటే భయపడి ఎక్కడో ఒదిగిపోయాయి. వాటికి ఊపిరిగా అమరిన మానవత్వం అలాగే చీకటి తెరల వెనుక దాగిపోయింది. అలాంటి ఆ మానవతను కవి గొంతెత్తి పిలుస్తున్నారు. తన జ్ఞాన చక్షువుతో అణువు అణువూ శోధిస్తున్నారు. తన కళ్ళకు విందుగా రమ్మని గళమెత్తి ఆహ్వానిస్తున్నారు.

మంచిని ఆస్వాదించి దాన్నే అందించడంలో మనిషికున్న తృప్తి విశిష్టమైంది. ఈ రెండూ అంత సులభమైనవి కావు. ఒకవేళ మంచిని ఆస్వాదించినప్పటికీ దానిని పంచడం అనేది కష్టమైంది. కవి ఈ ద్వంద్వాన్ని ఒక హారంగా మానవత కంఠసీమలో అలంకరిస్తానంటారు.



ఆనంద మలయ మారుతాన్ని
అమేయంగా ఆస్వాదిస్తూ
ఈ చీకటి కురుల్లో
మల్లెలా కవ్వించే
ఈ చుక్కల్ని హారంగా చేసి
నీ కంఠసీమను అలంకరిస్తాను రా![170]

మనిషికి ముందు ఆనందం అంటే ఏమిటో తెలియాలి. అది మలయమారుతంగా అనిపించాలి. దాన్ని అమేయంగా ఆస్వాదించగలగాలి. అప్పుడు చీకటి కురుల్లో మల్లెల్లా చుక్కలను హారం చేసి మానవతా గళానికి సింగారిస్తానంటారు.

మూఢాచారాలు మనిషి మనుగడను ఆటంకపరుస్తాయి. ఇవి అమానవీయమైన అంశాలు. ఇవి మనిషి నుంచి తప్పుకున్నప్పుడే మానవత్వం అడుగుపెడుతుంది.

అలా కాకాపోతే మనిషి మనస్సు పొదులో ఈ అంధ విశ్వాసాలు భూమికగా మలచుకొని దానవత్వం పెచ్చరిల్లిపోతుంది. అప్పుడు సమాజం భయాందోళనలతో తపించిపోతుంది. ఈ వైపరీత్యాలను చూచిన తిరుమల మానవత్వాన్ని గాయం చేసే మూఢ విశ్వాసాలు అంతరించిపోవాలని కాంక్షిస్తున్నారు.

ఈ నేలను నీడలా వెన్నాడే
మూఢ విశ్వాసాన్ని
మన ప్రచండ వీక్షణా కిరణంతో
ఉరితీద్దాం - రా!
కాంతి వర్షిద్దాం - రా!![171]

పై పంక్తుల్లో మూఢ విశ్వాసం నీడలా వెన్నాడుతుందని తిరుమల అంటారు. ఈ నీడ రూపం ప్రతిబింబం వంటిది కాదు. మూఢ విశ్వాసం వల్ల మనిషి ఒక్కొక్కప్పుడు తన ఉనికిని మరిచిపోతాడు. తాను నిలబడ్డ నేలను మరిచిపోతాడు. ఆచరణకు ఎంతో దూరంగా ఉండిపోతాడు. దాన్ని స్వంతం చేసుకోవడానికి యోచించడు. తానే మనిషినని భావించుకుంటాడు. కాని, అందుకు విరుద్ధంగా నడచుకుంటాడు. ఈ అంధ విశ్వాసాలు మనిషిని పతనం చేస్తాయి. కాబట్టే, కవి దారుణమైన మూఢత్వాన్ని ప్రచండమైన చూపుల కిరణాలతో ఉరితీద్దాం రమ్మని పిలుస్తున్నారు.

కవి ఆశయం సమాజాన్ని ఉద్ధరించడానికే. అంటే సమాజానికి ఆత్మగా ఉన్న మనిషిని సంస్కరించడానికే.

ఉవ్వెత్తుగా పెరిగి ఊడలు దిగిన
నిరాశా వట వృక్షాల్ని

మన వజ్ర సంకల్పంతో నరికి
కళా కల్ప తరువులు పెంచుదాం రా[172]

మనిషి జీవనయానంలో అప్పుడప్పుడూ అడుగులు తడబడుతుంటాయి. కరదీపికలుగా ఉన్న ఆశయాలు ఆరిపోతాయి. నీడలా అనిపించిన ఆదర్శాలు తప్పుకుంటాయి. అంతటా వైఫల్యాలు ఎదురు పడి ప్రశ్నిస్తాయి. కుంగదీస్తాయి. అప్పుడు మనిషి హృదయాంతరాళాల నుంచి నిరాశపుడుతుంది. క్రమక్రమంగా నేలకు దిగిన ఊడలతో విశాలంగా విస్తరించిన మర్రి వృక్షంలా ఎదుగుతుంది. వటవృక్షం ఎంతగా నింగివైపు నేలవైపూ తన కొమ్మలను చూస్తుందో అంతగా దాని వేళ్ళు భూమి లోతుల్లోకి చొచ్చుకొని పోతాయి. నిరాశ కూడా అలాగే మనిషి గుండెలోతుల్లోకి వెళ్ళిపోయి మనిషిని బలహీనున్ని చేస్తుంది. ఇక భవిష్యత్తు ఎన్నటికీ అందదు అనేలా చేస్తుంది. ఇట్లా వటవృక్షం లాంటి నిరాశను మనిషి వజ్ర సంకల్పంతో నరికి వేయాలి. ఆ స్థలంలో కల్పతరువులు మాత్రమే కాదు, కళాకల్పతరువులు నాటాలి. పెంచాలి. అప్పుడు లోకం ప్రకాశిస్తుంది. ఆ కళాకల్పతరువులే మానవతకు సంబంధించిన రేఖలు. వాటి నుంచి కమ్మ తెమ్మెరలు రావాలి అని కళాత్మకంగా తన ఆశయాన్ని ప్రకటించారు తిరుమల. ఆయన మరో చోట ఇలా అన్నారు.

కంచంలో విషం కలుపుకుతినే
అవివేకానికి తెలివి తేటల గోరుముద్దలు
తినిపిద్దాం రా![173]

కంచంలో విషం కలుపుకు తినే అవివేకులు జీవితంలో విషతుల్యమైన పనులు చేస్తుంటారు. అహంకారంతో కూడిన దుశ్చర్యలకు పాల్పడతారు. ఇటువంటి వారు అదే పనిగా ఎదిగితే మానవత కాలిపోతుంది. అట్లా కాలిపోకుండా మనిషి గుణాన్ని జాగ్రత్తగా చూడవలసిన బాధ్యత మనిషికే ఉంది. అలాంటి అవివేకాన్ని తొలగించి మనిషి తెలివి తేటల గోరు ముద్దలు మనిషి నోటికి మాత్రమే కాదు, హృదయానికి కూడా అందించటానికి రమ్మని కవి పిలుస్తున్నారు.

తిరుమల ఏ దృక్పథంతో కవిత రాసినా మానవతా వాదాన్ని మిగతా అన్ని ధోరణుల కన్నా విరివిగా రాశారు. ప్రతి వస్తువులో ఏదో ఒక రూపంలో మానవతను వర్ణించడమో, దాని ఆత్మతత్వాన్ని చిత్రించడమో చేస్తూనే వచ్చారు.

తెల్ల కాగితం మీద
సిరా ఒలికిపోయింది
క్షణం జారిపోయింది
సారీ![174]

అంటారు. తెల్లకాగితం స్వచ్ఛమైన మానవతకు ప్రతీక. దాని మీద సిరా ఒలికితే అంటే స్వచ్ఛమైన మానవతకు మలినం అంటితే జీవితం మసకబారుతుంది. తెల్ల కాగితం అనే



స్వచ్ఛమైన మానవత మరిన్ని కాంతులతో సమాజ భవిష్యత్తును కాంతిమయం చేస్తుంది.

కవిత చెబుతాను
ఇది తెల్ల కాగితం కాదు
ఈ లోకం మనసు
ఒలికింది సిరా కాదు
ఈ సమాజ స్వార్థం
రాయాలనుకున్నది
కవిత కాదు
మానవత[175]

సమాజం స్వచ్ఛంగా లేదని తిరుమల భావించారు. సమాజంలోని కుళ్లును తన కవితలో ఎత్తి చూపుతానన్నారు. అదే స్వార్థం. దాన్ని తన కవిత్వం ద్వారా తొలగించి మానవతను నిలపాలని భావించారు.

కవి ముందుగా తనను తాను మనిషిగా ఎంచుకోవాలి. తన హృదయాన్ని పరిశీలించుకోవాలి. తన హృదయాన్ని పరీక్షించుకోవాలి. ప్రశ్నలు వేసుకోవాలి. సూటిగా సమాధానాలను రప్పించుకోవాలి. అలాంటి దృక్పథం ఉన్న కవి రచనలు ఏ ప్రక్రియలోనైనా కళాఖండాలు అవుతాయి. జాతి భవిష్యత్తులోనికి పంపించే రస కిరణాలు అవుతాయి. తిరుమల కవితలో ఈ తత్వం గాఢంగా కన్పిస్తుంది.

ప్రత్తి కాయల వంటి నా ప్రజల మనసుల నుండి
అగ్ని భావాల దారాలు తీసి
కాలం మగ్గం మీద వేసి
సిగ్గు దాచుకునేందుకు ఓ చీర నేస్తాను
ఆ చీర చెంగు మీద
చెరిగిపోని విధంగా
నా విజ్ఞాన సువర్ణకోశాన్ని కరిగించి
నా కలంలో నింపి
'మానవత' అనే కవిత
సువర్ణాక్షరాలతో రాస్తాను
ఆ కవితా గానంతో తరిస్తాను
అప్పటి వరకు నేను కవిని కాను[176]

తిరుమల మానవత ప్రధానంగా రాసిన కవితలలో ఇది మరింత విశిష్టంగా ఉంది. ప్రజల మనస్సులు ప్రత్తికాయల వంటివట. వాటి నుంచి అగ్ని భావాల దారాలు తీసి కాలం మగ్గం మీద నేసి సిగ్గు దాచుకోవడానికి ఓ చీర నేసిస్తానంటారు. అంత మాత్రంతోనే

ఆగిపోలేదు. తన విజ్ఞాన సువర్ణకోశాన్ని కరిగించి ఆ కవితను చిత్రిస్తాడట. అంతవరకే ఆగిపోలేదు కవి. ఆ కవితాగానంతో తరించిపోతానంటారు. అప్పటి దాకా కవిని కాదని చెప్పుకోవటంలో కవి అనేవాడు మానవతావాదాన్ని తన కవితలో తప్పనిసరిగా రాయాలనే భావం స్పష్టమవుతుంది.

Sure:
The down comes
And unites all poles
of birth and death
And make them kiss
Each other
with its rays of love
then there remains
one race
one flag
Humanity[177]

కవి మనిషిని శాశ్వతుడిగా భావించారు. అతడు నిత్యుడవడానికి అతనిలోని మానవత ప్రధానమైందని చెప్పారు. మనిషి మనస్సులో మానవత ఎదగడానికి పురులు విప్పి పరిమళించడానికి కవి అనేక భావనలను సూచించారు. మనిషి చేతనత్వం నుంచి పుట్టిన కాంతి చీకటి అనే పొగ మంచును కరిగించి వేస్తుంది. అలాంటి కాంతి మనిషిలో ప్రవహించడానికి అతనిలో అజ్ఞానం కరిగిపోయి ధైర్యం పెరిగి నమ్మకం కుదురుకోవాలి. ప్రపంచంలో ఏవీ మిగలవు మానవజాతి నిలుస్తుంది. మానవతా పతాకం ఎగురుతుంది. సూర్యకిరణాల ఉదయాస్తమయాలను ఏకం చేస్తూ మానవతా ప్రవర్ధిల్లుతుంది.

Wealth lits not lamp
Society bears not Sin
Animality doesn't consider humanity
Precepts don't embrace stones[178]

'ధనం దీపాన్ని అంటించదు' పాపాన్ని సమాజం భరించదు. జంతు ప్రవర్తనను మానవత్వం క్షమించదు.అనేది కవి భావుకతను ఎత్తి చూపిస్తుంది. దీనితో పాటు ఆయన దీపం లాంటి మానవత్వాన్ని చెప్పారు. నీతి సూత్రాలు రాళ్ళను కౌగిలించుకోలేవు అనేది కూడా మానవత విశిష్టతను తెలిపేదే.

మనిషికీ - సమాజానికీ బలమైన చేతనను చక్కని జీవన విధానాలను అందించేది మానవత. దీన్ని అన్ని పార్శ్వాలతో దర్శించి కవిత్వంగా రాశారు తిరుమల. ఆయన కొన్ని రచనలలో మానవత్వాన్ని దైవత్వంగా ప్రకటించారు. మానవతను కేవలం కవితాక్షరాలుగా



మాత్రమే కాకుండా జీవన గమనాన్ని ఉత్తేజంగా, ఉదాత్తంగా నడిపించే పవిత్ర సాధనంగా మానవాళికి అందించారు. కవిగా ఆయన లక్ష్యాన్ని ఆదర్శంగా నిర్వహించారు.

## 5. అభ్యుదయ దృక్పథం

సాహిత్యం సంఘాన్ని అనుసరించి మారుతూ ఉంటుంది. ఆదికవి కవితాభివ్యక్తి ఆనాటి నుంచి నేటి దాకా అలాగే ఉండి పోలేదు. అనేక పరిణామాలకు గురి అవుతూ నవ్య తేజస్సును ప్రసరింపజేస్తూ 'విశ్వశ్రేయం కావ్యమ్' అన్న ఆర్యోక్తికి అనుగుణంగా ప్రవర్ధిల్లుతూ వస్తున్నది. ఆధునిక కాలంలో సాహిత్య స్వరూపం బాగా మారిపోయింది. కారణం ప్రపంచంలో అనూహ్యమైన మార్పులు రావడమే. ఆధునిక సాహిత్యం అడుగుపెట్టి సమాజ చలనాన్ని మౌఢ్య దశ నుంచి కొంత మళ్ళించ గలిగింది. ఇదే కాలంలో సంఘంలోనూ, సాహిత్యంలోనూ చాలా ఉద్యమాలు ఉవ్వెత్తుగా వీచాయి. ప్రజావళిలో చైతన్య రేఖలను ప్రసరింపజేశాయి.

ఆధునిక తెలుగు సాహిత్యంలో భావకవిత్వోద్యమం పిదప శక్తిమంతమైన ఉద్యమంగా అభ్యుదయ కవిత్వోద్యమం వచ్చింది. ఇలా రావడానికి ప్రపంచంలో రాజకీయమైన, ఆర్థికమైన, సాంఘికమైన పరిస్థితులే బలమైన కారణాలుగా కన్పిస్తాయి. ఈ ఉద్యమాన్ని భారతదేశ భాషా సాహిత్యాలు సమాదరించాయి.

మహాకవి సినారె ఈ ఉద్యమాన్ని గురించి –

"ముఖ్యముగా ఆధునిక కాలమున వెలువడిన అభ్యుదయ కవిత్వము పూర్తిగా భౌతికవాదపు పునాదులపై నిర్మితమైన మార్క్సిజము చేత ప్రభావితమైనదే; దీనిలో ఆముష్మిక చింతనకు ప్రసక్తి లేదు. కర్మ సిద్ధాంతమునిది నమ్మదు. విధినిది పూజించదు. అదృశ్య శక్తులు మానవుని జాతక రేఖలను చిత్రించునను విశ్వాసమునిది నిరసించును. మానవుడు తన అస్తిత్వమునకు తానే కారకుడు. అతని మంచి చెడ్డలకతడే బాధ్యుడు. మానవులలోనే అధికార తృష్ణ, అర్థపిపాస, సమర కాంక్షగల వర్గ మొకటి యున్నది. ఈ వర్గము పెట్టుబడిదారులతో, సామ్రాజ్య వాదులతో కూడుకొని యున్నది. ఇది సామాన్యులను తన గుప్పిట పెట్టుకొన్నది. సామాన్యులలో కార్మిక కర్షకాది పీడిత జనులున్నారు. ఇది శ్రామిక వర్గము. ఈ శ్రామిక వర్గము యొక్క భౌతిక శ్రేయస్సును గోరునది అభ్యుదయ కవిత్వము. పాశ్చాత్య విజ్ఞానము, ఆధునిక నాగరికత, నానా జాతిసమ్మేళనము, వసుధైక కుటుంబ భావన మున్నగు నవ్య సిద్ధాంతముల ద్వారా పరిశీలించినపుడు అభ్యుదయ కవిత్వమును సరిగా అర్థము చేసికొనుటకు వీలున్నది. మన దేశములోని అభ్యుదయ కవిత్వము ఇన్ని ప్రభావముల సమిష్టి ఫలితముగా రూపుదిద్దుకొన్నది. కావున దానిని నిర్వచించుటకు ఈ పరిస్థితులను ప్రభావములను దృష్టిలో పెట్టుకొనక తప్పదు"[179] అని అభ్యుదయ కవిత్వం మార్క్సిజం మూల సూత్రాలతో ఏర్పడిందని, అసమానతలను తొలగిస్తుందని, పీడిత వర్గాల అభ్యున్నతికి కృషిచేస్తుందని దీనికి బలమైన చారిత్రక భూమిక పునాదిగా ఉంది.

భావించారు. ప్రఖ్యాత పత్రికా రచయిత డి. రామలింగం "తెలుగు సాహిత్యంలో అభ్యుదయ కవిత్వోద్యమం ఒక ప్రత్యేకత, ఒక వైశిష్ట్యము కలిగిన ఉద్యమం. పరపీడనకు గురి అవుతూ వచ్చిన సామాన్య మానవుని కష్టాలనూ, అవస్థలనూ దీనివలె పట్టించుకున్న ఉద్యమం ఇంతకు మునుపు మరొకటి లేదు. వాటిని నిర్మూలించడానికి సాహిత్యాన్ని ఒక సాధనంగా ఉపయోగించడం దీని ప్రధాన ధ్యేయం. ఆ దృష్ట్యా ఇది ఆరోగ్య వంతమైన దృక్పథం గల ఉద్యమం. ఇది సాహితీలోకంలో ఒక నూతన భావ జగత్తును సృష్టించి తెలుగు సాహిత్య చరిత్రలో ఒక వినూత్న కవితారీతికి కారకమైంది"[180] అన్నారు. సామాన్య మానవునికి అందగా ఉండేది, సాహితీ లోకం కొత్త ఆలోచనలను రేకెత్తించేది, అభ్యుదయ కవిత్వోద్యమమని వివేచించారు.

సుప్రసిద్ధ సాహితీ వేత్త డా॥ ఆవంత్స సోమసుందర్ అభ్యుదయ కవిత్వాన్ని, ఉద్యమాన్ని బలపరుస్తూ ఇలా అన్నారు.

"అభ్యుదయ సాహిత్యోద్యమం తెలుగు జాతికి ఎన్నో అమూల్య సంపదలు చేకూర్చింది. వేయేళ్ళ తెలుగు సాహిత్య స్వరూప స్వభావాలనే సంపూర్ణంగా మార్చివేసింది. తెలుగు భాషలో నైసర్గికంగా పెంపొందిన కవిత్వానుకూల వాతావరణాన్ని మరింత పటిష్టమొనర్చింది. భాషను మరింత నాగరీకం చేసింది. అంతర్జాతీయ కవిత్వ స్థాయికి తెలుగు కవిత్వాన్ని ఉన్నతీకరించింది. రక్తనిష్ఠమైన సంప్రదాయాన్ని అమేయ వారసత్వాన్ని పోకార్చుకోకుండా కాపాడుకోవడమే కాక శైథిల్యతను తొలగించుకుంది. మత బంధాల సుడిగుళ్లనుంచి సముద్ధరించుకొని, మానవతా ధర్మాలను పతాక సన్నిభ మొనర్చుకుంది. తెలుగు భాషకు సహజంగా లభించిన మాధుర్య గుణాల్ని పెంపొందించుకొని, ఎంత క్లిష్టమైన భావాన్నైనా అవలీలగా అభివ్యక్తం చేయగల నిశిత సాధనంగా రూపొందించుకుంటూ పురోగమిస్తుంది. తెలుగు భాషా పరిధిలో ఆధునిక కవిత్వమంటేనే అభ్యుదయ కవిత్వానికి పర్యాయపదమన్నంత ప్రబలశక్తిగా స్థిరపడి రూపు రేఖలను వెలార్చుకుంటోంది"[181] ఈ ఉద్యమం వేయి సంవత్సరాల సాహిత్య గతిని మార్చివేసిందని భాషకు కొత్త అభివ్యక్తినీ సంతరించిందని బరువైన భావాన్ని అలవోకగా చెబుతుందని అభిప్రాయపడినారు.

కురువంటి సీతారామయ్య –

"మన దేశములో స్వాతంత్ర్య ప్రాప్తికి పూర్వరంగమొక మహా విప్లవము చేత ప్రకాశించినట్టిది. ఈ కాలానికి సంఘములో శాంతివర్గ వైషమ్యాలు – అవిశ్వాసము – అధికంగా పెరిగిపోతూ వచ్చినవి. పర ప్రభుత్వ–దౌర్జన్యానికి శిరసొగ్గే దౌర్బల్యము – ఉపేక్ష వహించే సహనము ప్రజలలో నశించిపోయినవి. భారత ప్రజాశక్తి ఎంతటిదో బ్రిటిషు వారికి తెలిసిన దినాలవి, రాజకీయాలు ప్రజా జీవితాన్ని దట్టించిన రోజులవి. "ప్రభుత" పైన "జనత"కు నైరాస్యం, స్వాతంత్ర్య సంపాదనంలో దీక్షా ప్రబలిన సందర్భం! మానవ సామ్యం, కృషి ఘనత్వమనే సిద్ధాంతాల పైన దేశీయుల దృష్టి పడిందపుడు. ఇంపీరియలిజాల్నీ ఫాసిజాన్నీ, ఎదుర్కోగలందులకు విప్లవ శంఖం పూరించిందపుడు.



రష్యా దృక్పథాన్ని యువకులలో కొందరు విద్యార్థులు మోజుపడి అభిలషింపబూనినారు. జమిందారులపైన – పెట్టుబడిదారులపైన – సనాతనులపైన – తిరుగుబాటు ప్రారంభమైనది. ఆర్థిక వ్యత్యాసాలను, అధికార దౌర్జన్యాన్ని సహించలేని ఆత్మాభిమానము, వారి దుస్థితికి సానుభూతి క్రమంగా హెచ్చినవి; మతము పేరిట, వర్ణముల పేరిట, జాతి పేరిట సంఘములో జరుగుతున్న అన్యాయాలను అరికట్ట వలెననే సంస్కార వాంఛ తీవ్రమైనది. ఇవన్నీ ప్రజాభాషలో తెలిపి కళలను ప్రజలకు సన్నిహితం చేయవలెనని ఒక ఉద్యమం బయలుదేరినది; బ్రతుకే ఒక సమస్య అయిన సందర్భాన జనులను పీడిస్తున్న ఆకలి – దారిద్ర్యము –పరాధీనత– మొదలైన విషయాలు కావ్య వస్తువులు కావలెనని అభిలషించినారు. ఆదేశించినారు కూడా."[182] ఇట్లా కురువంటి వారు ప్రోగెసివ్ రైటర్స్ అసోసియేషన్ వారి మానిఫెస్టోలోని అంశాలను ఉటంకించారు. స్వాతంత్ర్యానికి ముందు దేశ ప్రజలలో నెలకొని ఉన్న వర్గ వైషమ్యాలు, పరిపాలన, రాజకీయాలు ఇవన్నీ దేశీయులను బాధపెట్టాయని విద్యార్థులలో కొందరు రష్యా అనుసరించిన విధానాలకు ప్రభావితులై సమత్వాన్ని స్థాపించడానికి పూనుకున్నారని, ఆకలి–దారిద్ర్యం పోవడానికి ఉద్యమించాలని అభ్యుదయ సంఘ స్థాపన ధ్యేయాలను ప్రస్తావించారు.

ప్రముఖ రచయిత కాంచనపల్లి చినవెంకటరామారావు అభ్యుదయ సాహిత్యాన్ని నిర్వచిస్తూ "భావ కవిత యొక్క కాల్పనిక సాహిత్యంపై ఒక విప్లవాత్మకమైన తిరుగుబాటుగా అభ్యుదయ సాహిత్య యుగం ఆవిర్భవించింది. ఇదేదో ఆకాశం నుంచి ఊడిపడిందేమీ కాదు. కాల్పనిక కవితలోని దేశభక్తి విభాగం, మానవతావాదం యొక్క గుణాత్మక పరిణామమే అభ్యుదయ వాదం"[183] అన్నారు. అభ్యుదయ కవిత్వం భావ కవిత్వం మీద ఒక ఉద్యమంగా ఉధృతాన్ని చూపిందని అంటూనే భావకవిత్వంలోని దేశభక్తి, మానవతా వాదం వంటి వాదాల గుణాత్మక పరిణామమే అభ్యుదయ కవిత్వోద్యమ స్వరూపమని ఒక కొత్త నినాదాన్ని సూచించారు.

"అభ్యుదయ కవిత్వం రెండు దశాబ్దాల పాటు (1935–55) తెలుగు సాహిత్యాన్ని సంపన్నం చేసింది. సంఘం ఏర్పడిన తర్వాత ఒక దశాబ్దం అభ్యుదయ కవిత్వం ఉద్యమవేగాన్ని అందుకొని తెలుగు నేల నాలుగు చెరగులా సాహిత్య వ్యాప్తికి, సామాన్యుని జీవితపు స్థితిగతుల్ని బాగు పరచడంలో ప్రజల్ని చైతన్యవంతుల్ని చెయ్యటానికి కృషి చేసిందని"[184] కడియాల రామమోహన్‌రాయ్ అన్న ఈ మాటలు అభ్యుదయ కవిత్వ దృక్పథాన్ని వెలువరిస్తున్నాయి.

అభ్యుదయ కవిత్వం అంతకు ముందు సమాజంలో, సాహిత్యంలో ఉన్న స్తబ్దతను చెదరగొట్టింది. సమాజాన్ని నిలువెత్తునా కుంగదీస్తున్న అంధ విశ్వాసాలనూ, తిరోగమన విధానాలనూ సంస్కరించింది. ఆధునిక సాహిత్య ప్రక్రియలైన వచన కవిత్వం, గేయ కవిత్వం, కథానిక, నాటిక, నవల వంటి వాటికి వినూత్నమైన చేవను ప్రోది చేసింది. ప్రశ్నించడం, ప్రగతికి ప్రాణం పోయడం, ఎత్తు పల్లాలు లేని సమాజాన్ని స్థాపించడం, మనిషిని నిత్య చైతన్య దీప్తితో వెలిగింపజేయడం – ముఖ్యంగా శాస్త్రీయ విజ్ఞానాన్ని

అందించడం భవిష్యత్తులోకి నడిపించడం వంటి విలువైన అంశాలను అభ్యుదయ కవిత్వం ప్రేరేపించింది.

అభ్యుదయ కవితోద్యమం ప్రారంభదశగా మొదట 1935లో లండన్‌లో భారతదేశ అభ్యుదయ రచయితల సంఘం స్థాపించబడింది. డా॥ ముల్కరాజ్ ఆనంద్, డా॥ జె.సి. ఘోష్, ప్రమోద్ సేన్ గుప్త, సజ్జాద్ జహీద్, డా॥ ఎం.డి. తాసీర్ వంటి మేధావులు అందులో ఉన్నారు పారిస్‌లో కూడా అంతర్జాతీయ అభ్యుదయ సాహిత్య కేంద్రంగా కూడా ఒకటి ఏర్పడింది. 1935 డిసెంబర్‌లో భారత అభ్యుదయ రచయితల సంఘం అలహాబాదులో ఏర్పడింది. అయితే, 1936 ఏప్రిల్‌లో లక్నోలో ప్రేమ్‌చంద్ అధ్యక్షతన ప్రథమ సమావేశం జరిగింది. ముల్కరాజ్ ఆనంద్, సజ్జాద్ జహీర్, కైఫీ ఆజ్మీ, కె.ఏ. అబ్బాస్ వంటి ప్రముఖ రచయితలచే సంఘం స్థాపించబడింది. అదే సంవత్సరం ఫిబ్రవరిలో తెనాలిలో తాపీ ధర్మారావు అధ్యక్షతన ప్రథమ మహాసభ జరిగింది. ఆ తరువాత చాలా సమావేశాలు జరిగాయి. తెలుగులో అభ్యుదయ కవితోద్యమానికి శ్రీశ్రీ ఆద్యుడని విమర్శకులు భావించారు.

తిరుమల రచనలలో అభ్యుదయ అంశాలు చాలా ఉన్నాయి. అయితే ఆయన రచనలలో అభ్యుదయం సమాజ పరమైందీ, దేశీయ పరమైందీ. అంతేకాని, ఒక ఇజాన్ని సమర్థించి ప్రచారం చేసేదికాదు. సంఘం రూపొందించిన నియమావళికి అనుగుణంగా ఉండేది కాదు. అందుకే ఆయన ఇట్లా అంటారు.

నలిగిపోయిన పూలనే ఏరుకుంటాను
పగిలిపోయిన గుండెనే కోరుకుంటాను
ఆవేదనా అశ్రుకణాల మీదుగా
అంతరంగానికి పయనించి
అస్పష్ట జీవిత చిత్రాల్ని చేరుకుంటాను
ఆర్తనాదాలు - నైరాశ్య గీతాలు - దైన్య సందేశాలు
కటిక చీకటి సిరాతో
నీ కనురెప్పల మీద
కవిత్వ రూపంలో రాస్తాను[185]

నలిగిపోయిన పూలు అంటే జీవిత పోరాటంలో అలిసిపోయిన నిరుపేదల దైన్య జీవితాలు. పగిలిపోయిన గుండెలు అంటే పరాభవాలను పులిమి సమాజం నుంచి దూరంగా విసిరివేయబడ్డ నికృష్టపు బతుకులు. వీటినే ఏరుకోవడం, కోరుకోవడం ఆయన హృదయంలో పొంగులెత్తుతున్న అభ్యుదయ కాంక్షకు ప్రతీక. అయితే అంత వరకు మాత్రమే ఆగిపోలేదు. నిరుపేదల ఆవేదనను అశ్రుకణాల మీద నుంచి అంతరంగంలోకి అడుగుపెడతారు. అస్పష్టమైన దయనీయమైన జీవిత చిత్రాలను చేరుకుంటారు. అంతటితో ఆగిపోలేదు. అంతరంగంలో ఆత్మీయతను నింపుతారు. తనలోని మానవత్వం అనే అమృత జల్లులను కురిపించి ఆర్తనాదాలు పోయేటట్టుగా, నైరాశ్య గీతాలు ఆగిపోయేట్టుగా, దైన్య



సందేశాలు లేకుండేటట్టుగా మనిషి అన్నవాని కనురెప్పల మీద కవిత్వరూపంలో అక్షర చిత్రలు వేస్తారు. నిరాశ కుంగదీస్తున్న నిరుపేదల బతుకులలో ఆశాకిరణాలను వెలిగిస్తానన్న కవి ఆశయం మానవీయతతోనూ, అభ్యుదయ చేతనతోనూ ఉన్నట్టిది. ఇంకా

ఈ లోకంలో ఆకలితో
మాడుతున్నప్పుడు
"అడుక్కు"తిని ఎండుటాకుల్లా
బ్రతుకులు రెపరెపలాడుతున్నప్పుడు
కళ్లారా చూస్తే - నాలో
కవిత్వం రాయడానికి ఇన్స్‌పిరేషన్ వస్తుంది.[186]

ఈ కవితా పంక్తులు చాలు తిరుమల ఎదనిండా అభ్యుదయ భావన పొర్లుతుందని చెప్పడానికి. పడచుదనపు పరువంతో ఒత్తిగిల్ల నుడుస్తూన్న సెలకన్నెను చూసినప్పుడో, ధాతువులతో నిండి నింగి దాకా ఎగసి శ్రేణులు శ్రేణులుగా విస్తరించిన గిరి శిఖరాలను చూసినప్పుడో, నిండుగా విరబూసి వివిధ కుసుమాలతో కళకళలాడుతున్న పూదోటను తిలకించినప్పుడో, అలా నాజూకుగా తనలోని తరంగాలను తీరానికేసి వయ్యారంగా విసురుతూ భావుకుని గుండెలో ఎన్నో నాదాలు పలికిస్తున్న గంభీర సాగరాన్ని చూసినప్పుడో, అందాలు కుప్పలుగా పోస్తున్న అపూర్వ సౌందర్య రాశి అందాన్ని అందుకొని ప్రణయంలో తేలిపోతున్నప్పుడో కవికి కవిత్వం రాయడానికి ఇన్స్‌పిరేషన్ రావడం లేదు. లోకం ఆకలితో మాడుతున్నప్పుడు, అడుక్కుతిని ఎండుటాకుల్లా రాలి నేల మీద పడుతున్న బిచ్చగాళ్ళ నికృష్టపు జీవితాలను చూసినప్పుడు మాత్రమే ఇన్స్‌పిరేషన్ వస్తుంది.

సామాజంలో అవినీతి అక్రమాలు ఝెళ్ళున విరుచుకుపడుతున్నాయి. వ్యాపారం దోపిడి రూపాన్ని ధరించి సంఘాన్ని బేలగా మార్చేస్తుంది. ఇట్లా సమాజ శ్రేయాన్ని కుదిపివేస్తున్న దోపిడి వ్యవస్థను తిరుమల ఘాటుగా ఎండగట్టారు.

పసిపిల్లల పాలడబ్బాల సైతం దాచేసి
సంఘాన్ని నిలువునా దోచేసే
బందిపోటు వ్యాపారుల
ఇళ్లల్లో - ఇనుప పెట్టెల్లో కట్టుబడి
పెట్టుబడికే కాని గిట్టుబాటులేని
నోట్ల కట్టల జోల పాటలతో
మగత నిద్ర పోతున్న
కలుముల తల్లి భారత భాగ్యేందిరను చూడు[187]

నిజంగా భారతి కలుముల తల్లే. భాగ్యేందిరనే. కానీ, బందిపోటు వ్యాపారం రాసక్రీడలో కొల్లగొట్టబడుతున్నదని కవి బాధపడుతున్నారు. ఈ పాశవిక చర్యలను చూడమని సహృదయానికి చెబుతారు.

ఈ దేశంలో నిరుపేద బతుకు ఎంత దయనీయంగా ఉందో కవి మనకు చూపిస్తారు.

పట్టెడు అన్నం కరువై
రెప్పలు కొండంత బరువై
మానవాకార నిర్భాగ్యంలా కనిపించే
కొటానుకోట్ల మందిని చూస్తూ
వేలకు వేలు విందులు చేస్తూ
పారేసిన మధురాన్నాల మీదికి
కుక్కల్ని ఉసిగొల్పుతున్న
కర్కోటక వంశోద్ధారకుల్ని
ముక్కు మీద వేలేసుకొని చూడు![188]

పిడికెడు అన్నం డొక్కకు అందకపోతే శరీరం నిస్సత్తువతో చతికిల బడిపోతుంది. కళ్ళరెప్పలు కొండంత భారంగా అనిపిస్తాయి. అలాంటి మమకారాలు నిర్భాగ్యుల రూపంలా కనిపిస్తాయి. ఇలాంటి దౌర్భాగ్యుల సంఖ్య రెండు మూడూ కాదు. కోటానుకోట్లు. ధనవంతులు తిని డస్ట్‌బిన్‌లో పారేసిన విస్తళ్ళలోకి మెతుకుల్ని తినడానికి ఎగబడుతున్న ఈ నిరుపేదల మీదికి పెంపుడు కుక్కలను ఉసిగొల్పి వినోదాన్ని తిలకించే వంశోద్ధారకులు ఈ దేశంలో ఉన్నారు. అలాంటి ధన మదాంధుల విలాస క్రీడలను కలియ చూడమంటారు. ఈ సన్నివేశం గుండెలను కుదిపివేసేది. యాభై సంవత్సరాల వయస్సు దాటిన స్వేచ్ఛా భారతంలో ఇంకా ఇలాంటి అమానుష చర్యలు రగులవలసినదేనా! అన్న కవి ప్రశ్న ప్రతి గుండెనూ కలవరపెడుతుంది.

కార్మిక, కర్షక కవిత్వం అభ్యుదయంలోకి బలమైన పార్శ్వాలే. తిరుమల వీరిద్దరి జీవితాల గురించి చాలా కవితలు రాశారు. జాతి భాగ్యోదయానికి చెమటలను కాల్వలు కట్టిస్తున్న శ్రామికుని ఆకలి రూపాన్ని కవి గుండెలు కరిగి పోయేలా చిత్రించారు.

ఎముకల కణకణ
ప్రేగుల ఫెళఫెళ
చెవుల్లో మ్రోగుతున్నా
కొండలు బ్రద్దలు కొడుతున్న మల్లెలు
నిట్టూర్పుల మేడలు కడుతున్న మల్లెలు[189]

అన్నం దొరకక ప్రేగులు ఫెళఫెళమాన్నా, ఎముకలు కణకణ కాలిపోయినా ఆ శబ్దం చెవుల నిండా ప్రతిధ్వనిస్తూన్న కొండలు బద్దలు కొడుతూ, నిట్టూర్పుల మేడలు కట్టే హీనమైన జీవన విధానాన్ని తలచుకొని కవి సానుభూతి చూపారు.

మనిషి - ఆధునికంగా ఎదిగిన మనిషి ఉంటున్న సమాజం ఇంకా మూఢత్వాన్ని తొడుక్కొని ఉండడం కవికి సుతారామూ ఇష్టంలేదు. ఈ వైక్లబ్యం పూర్తిగా అంతరించి పోవాలన్నది కవి ఆకాంక్ష.



ఈ నేలను నీడలా వెన్నాడే
మూఢ విశ్వాసాన్ని
మన ప్రచండ వీక్షణా కిరణంతో
ఉరితీద్దాం ! రా![190]

అన్న కవి మాటలలో తీవ్రత్వం ఉవ్వెత్తునా ధ్వనించింది. మనిషి పుట్టి యుగాలు వెళ్ళిపోతున్నా అతడూ, అతనికి ఆత్మలా సమాజం చీకటి తెరలను చీల్చుకొని అంతగా అడుగు ముందుకు వేయడం లేదు. రాకెట్ యుగంలోంచి కంప్యూటర్ యుగంలోకి ప్రస్థానించినా మనిషి మేధ మౌఢ్యాన్ని విడిచిపెట్టడం లేదని కవి ఆవేదన పడుతున్నారు. ఈ మాంద్యాన్ని ఉరితీయడానికి, లోకానికి సౌభాగ్యపు సిరులను అందించడానికి అభ్యుదయం వైపునకు సాగాలని మనిషికి పిలుపు నందించారు. పై కవితా పంక్తులలో సంస్కరణాభిలాష ఎంతో గాఢంగా కన్పిస్తుంది. కవి మార్గదర్శి కదా!

కవి శబ్దాలు అలంకారాలనిస్తాయి. భావుకత అర్థస్ఫూర్తిని యిస్తుంది. తిరుమల హృదయంలో కవితాత్మ ఒడ్డులొరుసుకుంటూ ముందుకు సాగే ఝరిలా ఉంది. అందుకే అభ్యుదయంలోని అనేక విభాగాలను కాంతిమయంగా తీర్చిదిద్దారు.

ఎన్ని బంజర్లు? ఎన్నెన్ని బండరాళ్ళు
వాటి గుండెల్లో ఎన్నెన్ని అపశ్రుతులు
ఏడ్పులు పెడబొబ్బలు[191]

బంజర్లూ, బండరాళ్ళూ అంటే బతుకులు పచ్చగిల్లని అనామకులు, దళితులు. వాళ్ళు అన్ని విధాలా అణచబడుతూనే ఉన్నారు. బలికాబడుతూనే ఉన్నారు. నలిపివేయబడుతూనే ఉన్నారు. అలాంటి వాళ్ళ పెదవుల మీద ఏనాటికీ చిరునవ్వులు ప్రవహించవు. వాళ్ళ హృదయాలలో ఏనాటికీ ఆనందం వికసించదు. వాళ్లు సమాజ భారాన్ని మోసే విశిష్ట వ్యక్తులన్న విషయం ధనికస్వాముల హృదయాలకు అందదు. కవి ఆశించిందేమిటంటే వీళ్ళల్లో నవ్యాశలు వసంతంలా పరిమళించాలని.

"పీడింపబడే వాళ్ళు, పీడించేవాళ్ళు వున్న ఈ వర్గ సమాజం ఉండాలని ఎవరూ కోరరు. రానున్న విధానంలో సాధారణ మానవుడే మకుటధారి. పురోగమిస్తున్న లోకాన్ని ప్రతిఘటించేవారు ఎప్పుడూ అభ్యుదయ వాదులు కాజాలరు. ఈ ధనిక సమాజం పోవాలనుకోవటమే అభ్యుదయం. ఇది మనసులో పెట్టుకొని వ్రాసేది అభ్యుదయ రచన"[192] అని కృష్ణశాస్త్రి అన్నట్టుగా తిరుమల అభ్యుదయ రచనలు చేస్తున్నారు.

కైమోడ్చి అడుగుతున్నాను ఈ శూన్యాన్ని
ఇన్ని లక్షల కోట్ల పుస్తకాలూ
ఈ మానవ మేథోవనంలో
పువ్వులై ఎందుకు వికసించటం లేదని?

దోయిలించి అడుగుతున్నాను
ఈ ఉదయ కిరణాల్ని
ఈ అనంత భావ జగత్తులో
ఇంత చీకటి ఎలా వ్యాపించి ఉందని!
అవనత శిరస్కుణ్ణయి అడుగుతున్నాను
యి మట్టి తల్లిని
తరతరాల చరిత్ర రక్తపుటల
హృదయాల్ని జీర్ణం చేసుకున్న
ఈ జాతి శిశువుకి
అభ్యుదయ క్షీరధారా పానం ఎప్పుడని"[193]

కవి శూన్యాన్ని కైమోడ్చి అడుగుతున్నాడు. కవి భావ జగత్తులో నుంచి పుట్టిన శూన్యం అంటే సమాజం. మనుషులున్న సమాజం. ఈ సమాజంలో లక్షల కోట్ల పుస్తకాలు అంటే జ్ఞానం ఉన్న జీవాలు అని అర్థం. వీటి మేధో మండలం నుంచి ఇవన్నీ పువ్వుల్లె విరబూయడం లేదని కవి సూటి ప్రశ్న. అంటే – అభ్యుదయాన్ని పొందడం లేదని కవి నీటైన ప్రశ్న. ఇంకా తిరుమల ఉదయ కిరణాలకు దోయిలించి అడిగారు. ఇంకా ఈ సమాజం అంతరాళంలో చీకటిలాంటి అజ్ఞానం వేరూనుకొని పోయిందని కవి జన్మనిచ్చిన మట్టి తల్లిని అడిగారు. తరాల చరిత్ర ఆత్మగతులను అర్థం చేసుకున్న ఈ జాతి శిశువుకు అభ్యుదయ క్షీరధారలు అందించడం ఎప్పుడని మౌనాన్ని కప్పేసుకున్న శూన్యం లాంటి సమాజాన్ని ప్రశ్నించారు. ఈ కవితలో కవి చిత్రించిన భావ జగత్తు రెండు బాటలను తెలుపుతుంది. ఒకటి సమాజపరమైన అభ్యుదయం. రెండోది అభ్యుదయ కామన పొర్లుతున్న హృదయతలం. ఈ పథాలను బలమైన తన అభివ్యక్తికి సాధనంగా మలచుకొని అభ్యుదయమైన ఆశయాన్ని ప్రకటించడం జరిగింది.

అభ్యుదయమన్నది సమాజంలోనూ, సాహిత్యంలోనూఅనాదిగా వస్తున్నదే. కాలాన్ని అనుసరించి దాని స్వరూప స్వభావాలలో భేదం ఉంటుంది. నన్నయ్య కంటే ముందు ఉన్న సమాజంలోనూ, నన్నయ్య నాటి సమాజంలోనూ, అనంతర కాలాలలోనూ అభ్యుదయం ఉంది. అది సమాజం గమనాన్నీ, అనురక్తినీ అనుసరించి వస్తున్నట్టిదే. ఆధునిక సమాజంలో ఈ దృక్పథం ఉంది. ఆధునిక కవులలో కొందరు అభ్యుదయ భావనతోనే రచనలు చేసినవాళ్ళున్నారు. కొందరు అభ్యుదయంతో అనేక దృక్పథాలను సమాదరించి కావ్యాలు రాసిన వాళ్ళున్నారు. ఈ అభ్యుదయ కవులలో కొందరు పురాణ ప్రతీకలను తీసుకొని రచనలు చేసి తమ అభివ్యక్తిని వెలార్చిన వారున్నారు. తిరుమల భారతీయ సంప్రదాయాలకు సంబంధించిన ప్రతీకలను గ్రహించి కలకండ వంటి కవిత చెప్పారు.

అగ్గి పెట్టెలో
అగ్గి పుల్లలు నా ప్రజలు
మంటను దాచుకున్న అగ్ని ముఖాలు వాళ్ళు
సింహాసనాలే కనిపిస్తాయో
సింహనాదాలే వినిపిస్తాయో
ఒక్క పుల్లను గీసి చూడు
నీకే తెలుస్తుంది
ముందుగా ఓసారి అటు చూడు!
అరుణ పతాకాన్ని ఆవిష్కరిస్తూ
చీకటి సమస్యలు
పరిష్కరిస్తున్న
సూర్యుణ్ణి మోస్తున్న
ఆ తూర్పు కొండ
ఓ అగ్గిపుల్లలా లేదూ?
ఇప్పుడు గియ్యి!
'గీత'కి అర్థం తెలుస్తుంది.[194]

అగ్గిపెట్టె జ్వలన జ్వాలికలకు నిలయమైంది. ఒక్కో అగ్గిపుల్ల ఒక్కో మంటను రగిలిస్తుంది. అయితే కవి ఈ అగ్గిపుల్లలను ప్రజలతో పోల్చారు. ప్రజలు మంటలను దాచుకున్న అగ్గిపుల్లలు. గీస్తే చాలు ముందుగా సింహనాదాలు విన్పిస్తాయి. పిదప సింహాసనాలు అందుతాయి. గీయడమనేది తిరుగుబాటుకు ప్రతీక. గీయడంతోనే మంటలు వస్తాయి. విప్లవం తేవడంతోనే నిరంకుశత్వం పడిపోయి ప్రజలకు సింహాసనం అందుతుంది. అంటే సౌఖ్యమూ, గౌరవమూ అందుతాయి. అయితే అభ్యుదయాన్ని తేవడానికి సాగే, చెలరేగే విప్లవానికి అందరూ ముందునడవరు. ఒక్కడు ముందు నడుస్తాడు. ప్రజలు ఆయన అడుగుజాడల్లో నడుస్తారు. అట్లా సమాజానికి నేతృత్వం వహించేవాడు కవి భావించిన సూర్యుడు. సూర్యుడు జ్వలనానికీ, ప్రకాశానికీ ప్రతీక. ఆయన ఆరిపోవడమన్నది ఉండదు. ప్రజా సంక్షేమం కోసం బతికే వానికి ఓటమి ఉండదు. పతనమూ ఉండదు. ఆయన జీవితం చరిత్ర పుటలలో వినూత్న కాంతులను వెదజల్లుతూ నిస్తేజమైన దీప్తిని ప్రసరిస్తుంది. యుగాలు ఉదయిస్తూ అస్తమిస్తూ వెళ్ళిపోయినా ఆ సూర్యుని జీవితం ఎప్పుడూ పతాకంలా శిరస్సు ఎత్తుకొని రెపరెపలాడుతుంది. అట్లా చీకటి సమస్యలను కరిగించి వేస్తున్న ఆ సూర్యుణ్ని తూరుపుకొండ మోస్తుంది. నిజమే మరి. ఉద్యమానికి ముందున్న సూర్యుణ్ని ఉద్యమం మోస్తుంది. కవి గ్రహించిన 'తూరుపుకొండ' అనే పురాణ ప్రతీకలో ఉద్యమ ఊపిరి ధ్వనిస్తుంది. ఆ కొండ కూడా ఒక అగ్గిపుల్లలా ఉందంటారు కవి. అలాంటి అగ్గిపుల్లను ఒక్కసారి గీసిచూడు. ఆ గీతలోంచి ఎన్ని ధ్వనులూ, ప్రతిధ్వనులూ పుడతాయో ఎన్ని మాటలను విసిరివేస్తాయో! ఈ కర్కశత్వాన్ని కూల్చడానికి, ఈ నిరంకుశత్వాన్ని తుడిచిపెట్టడానికి కవి తీసుకున్న అరుణపతాకం అభ్యుదయ భావానికి ప్రాణం వంటిది. తిరుమల ఈ కవితను చదివిని పిదప ప్రముఖ సాహితీవేత్త పి.వి. రాజమన్నారు అభిప్రాయం

హృదయంలో మెదలుతుంది. "అభ్యుదయ రచన సమకాలికమైన జీవిత పరిస్థితులకు, రాజకీయ వాతావరణానికి, ఆర్థిక సమస్యలకు, సమాజ సంఘర్షణలకు, నైతిక సందర్భాలకు ఐహిక ఆముష్మిక సిద్ధాంతాలకు, వైజ్ఞానిక విశేషాలకనుగుణ్యంగా అనుకూలంగా తగినట్టి, అవసరమైన మార్పులతో విలసిల్లవలెను".[195]

పేదవారిని పొదుపుగా వుండమనకు
ఉపవాసం ఉన్నవారిని తిండి తగ్గించమనకు[196]

అని పేదల పక్షాన నిలబడతారు కవి.

తిరుమల కవితలో పాఠకుని చదివించి స్పందింపజేసే లక్షణాలే ఎక్కువ. ఆయన ఏ దృక్కోణంతో రాసినా అది పట్టు నుంచి వెలువడుతున్న తేనెలా మధురంగా, ఆత్మీయంగా ఉంటుంది. ఆయన అభ్యుదయ కామన ఏ తీరులో ఉంటుందో పరిశీలించండి.

కడలిలో ఎన్ని స్వేద బిందువులో
కన్నీటిలో ఎన్ని స్వేద సింధువులో
ఊహించ గల మనిషి
ఉర్విలో ఋషి[197]

కవి ఎన్నుకున్న వస్తువులోని కడలి సమాజమే. సమాజంలో ఎక్కువ మంది నిరుపేదలు. వాళ్ళు లేచింది మొదలు సూర్యాస్తమయందాకా చెమటను చిందిస్తూనే ఉంటారు. వాళ్ళు కడలిలోని స్వేద బిందువుల లాంటి వాళ్ళు. అలాంటి నిరుపేదల కన్నీటికి అంతు అనేది ఉండదు. ఆ కన్నీళ్ళు స్వేద సింధువులతో నిండి ఉన్నట్టివి. వీటిని ఊహించిన మనిషి నిజంగా అభ్యుదయాన్ని తెచ్చిపెట్టే ఋషిలాంటి వాడు.

బడుగువాడు, ఆడుగున ఉన్నవాడు అలాగే ఉండిపోతే సమాజం నీరవంగా నిశీథంగా ఉండిపోతుంది. అన్యాయం జరిగినప్పుడు, దోచబడుతున్నప్పుడు, ఆవలికి తోయబడుతున్నప్పుడు అంతటా అవమానం వేధిస్తున్నప్పుడు నిరుపేద ప్రశ్నించాలి. ముష్కర సమాజాన్ని నిలదీయాలి. అప్పుడు కాని సమాజం పచ్చని సింగారాలను తొడుక్కొని అడుగుముందుకు వేస్తుంది. అభ్యుదయం అనే భవంతిని నిర్మిస్తుంది. అచేతనంగా పడివున్న జీవాలకు కవి అండగా నిలుస్తారు. వాళ్లకు బతుకు పాఠాలు చెబుతారు. ప్రగతి భావాలు ప్రేరేపుతారు. పరిశీలించండి.

ప్రశ్నించే కళ్ళల్లో ప్రగతి కాంతి పోస్తాను
శిశిరంలో రాలిన ఆకుల్ని శిలాశాసనాలు చేస్తాను!
నేను భవిష్యత్తుకు దూసుకుపోతున్న బాణాన్ని
వికసించే పువ్వుల్లో పరిమళించే ప్రాణాన్ని
ఎగిరే జండాకు ఎనలేని గీర్వాణాన్ని
నిజానికి అక్షరాల చుక్కల దివాణాన్ని[198]



ప్రశ్నించే కళ్ళల్లో ప్రగతి కాంతి పోయడం, శిశిరంలో రాలిన ఆకుల్ని శిలాశాసనాలు చేయడం అనేది అభ్యుదయ కామన. మనిషినీ, నిరుపేద మనిషిని నిలబెట్టడమన్నమాట. అభ్యుదయ ధ్యేయం దండిగా ఉన్న తిరుమల తాను భవిష్యత్తులోకి దూసుకుపోతున్న బాణంలాంటివారు. అయితే ఆయన ప్రయోగించిన బాణం పేదలను ఉత్తుంగ శిఖరాల మీద చేర్చడానికే, అక్కడ వాళ్ళను ప్రతిష్ఠించడానికే. మొగ్గనుంచి పువ్వులా విస్తరిస్తున్న జీవితాలతో మానవత్వాన్ని ఊపిరిగా ఎగరేయడానికే ఈ దిశలో – దశలో – కవి జండాను ఎగరేస్తారు. రెపరెపలాడే జండా ఎల్లకాలాలూ జాతిని పిలవడానికి కవి గీర్వాణంలా అంటే దైవత్వంలా నిలబడతాడు. ఆనందంగా ప్రతి గుండెలో అక్షరాల చుక్కల దివాణాన్ని దించడానికే. కవి ఆశయం ఎంత పవిత్రమైందో కన్పిస్తుంది.

ఏ ఉద్యమమైనా
ఏ ఒక్కని సొత్తూ కాదు
అది చైతన్యం ప్రసాదించే అగ్ని ఖడ్గం
ఆ ఖడ్గానికి
అరణ్యాలు కూలిపోతాయి
క్రూరమృగాలు రాలిపోతాయి
సముద్ర హృదయాలు చీలిపోతాయి.[199]

అగ్ని ఖడ్గం నుంచి వచ్చే ఉద్యమం అనడంతోనే మానవీయమైన అభ్యుదయ దృక్పథం అని అవగతమవుతుంది. ఆ ఖడ్గం మనిషిని ప్రేమిస్తుంది. రేపటిలోకి ప్రేరేపిస్తుంది. ఆ ఖడ్గం ముందు భయానకమైన అడవులలాంటి అమానుష లోకాలు కూలిపోతాయి. అకారణంగా భయపెట్టే క్రూరమృగాలు రాలిపోతాయి. ఉప్పెన వేళ ఘీంకరించి భయపెట్టే సముద్ర హృదయాలు చీలిపోతాయి. అలాంటి హృదయాలు బద్దలైపోతాయి.

ఒకడు ఒంటె మీద ఎడారిలో
ఒకడు ఓడ మీద సంద్రంలో
ఒంటెకు దూరంగా నీరు కాని నీరు
ఓడకు దూరంగా తుఫాన్ కాని తుఫాన్ హోరు!
ఒంటె కాలిడెక్కల్లో విప్లవం
ఓడ చీల్చిన నీటిలో అభ్యుదయం!
ఒంటెని ఓడని చూడని గడ్డి పువ్వుల్లో
కాంతి గీతాల పరిమళం[200]

ఎడారి, సంద్రం – వీటిలో ప్రయాణం; ఒక విధంగా జీవన పోరాటంలోని ప్రథమ ఘట్టం. ఒంటె నడిచేది ఎడారిలో. దానికి దూరంగా నీరు కాని నీరు అని కవి అనడంలో ఇసుక నీరుగా పరిణమించడమే. అంతేకాదు, దూరం నడిచిన పిదప చేకూరేది సౌఖ్యామృత సారమే. నడుస్తున్న ఓడకు దూరంగా తుఫాను కాని తుఫాను అని అనడంలో కష్టాలు

కనిపించి అంతలోనే మాయమైపోవడమన్నమాట. ఇసుక దిబ్బల మీద నుంచి అడుగులు వేసుకుంటూ ముందుకు సాగే ఒంటె డెక్కల్లో నుంచి పుట్టుకొచ్చేది విప్లవం. ఓడ చీల్చిన నీటిలో అభ్యుదయం అనేది ఒక శక్తివంతమైన పార్శ్వమే. ఇసుక తుఫానులు ఒంటెను చరిచివేస్తాయి. సంద్రంలోని తుఫానులు ఓడను కల్లోలితం చేస్తాయి. అయినా పయనం ఆగిపోదు. సాగిపోతూనే ఉంది. ఓడ, ఒంటె - ఈ రెండూ వాహనాలను చూడని గడ్డి పువ్వులలో కాంతి గీతాల పరిమళం ఉంటుంది. గడ్డి పువ్వులు అంటే చదువుకూ దూరంగా ఉండి కూడా ఎవరికీ కీడు కలిగించకుండా ఉండే అనామకులు. వాళ్ళ శ్రమ నుంచే అభ్యుదయం కాంతి గీతాలు పరిమళాలుగా ఒప్పుతుంది.

డా॥ సోమసుందర్ "సామాజికుల హృదయాలను కవిత్వం కలుపుతుంది. మనిషి మనస్సును రసభావ ప్లావితం చేస్తుంది. జీవితాన్ని జీవనీయంగా మలుస్తుంది. రమణీయ కాంతి రేఖగా భాసింపచేస్తుంది. ఉత్తమ కవిత కాలీన కాలుష్యాలను జయిస్తుంది సామాజికుల నిద్రా జాగృతులతో ప్రత్యక్ష ప్రమేయం నెరపుతుంది"[201] అని సామాజికుల చైతన్యానికి ప్రేరణగా అభ్యుదయ కవిత్వం ఉంటుందన్నట్టుగా తిరుమల

తూర్పు ఉయ్యాలలో
వెచ్చగా నవ్వే సూర్య బాలుడు
చీకటిని చూస్తే మండిపడే
ఏకైక లోక పాలకుడు
గుండెలో గూటిలో
చీకటి మూగితే
కోరిక రేగితే -
అంతా అయోమయం
అందుకే - నా గుండె వత్తిని
సూర్య బాలుడు వెలిగించటానికి
పడమటి కడలి కెరటాల
పొత్తిగుడ్డలు తన్నుకుంటూ
బయట పడుతున్నాడు
నీ యిల్లు కావాలి తూర్పు ఉయ్యాల
నీ జోల కావాలి జ్వాల [202]

అనే ఈ కవితా పంక్తులు తార్కాణంగా ఉన్నాయి. సూర్యుడు చీకటిని చూసి మండిపడతాడు. తన కిరణాల కరవాలాలతో నిర్దాక్షిణ్యంగా ఖండిస్తాడు. గుండెలోకానీ, గూటిలో కానీ చీకటి మూగితే బతుకంతా అమావాస్యలు కాపురం చేస్తాయి. అప్పుడు అయోమయ అనిశ్చిత పరిస్థితులు పెటిల్లుమంటాయి. ఆ వేళ సూర్యుని లాంటి మనిషి మానవత్వాన్ని వత్తిగా వెలిగించడానికి పడమటి పొత్తి గుడ్డలను తన్నుకుంటు వస్తాడు.



అప్పుడు మనిషి ఇల్లు తూర్పు ఉయ్యాలగా మారుతుంది. జోల జ్వాలగా రగులుతుంది. కవి అభ్యుదయాన్ని మానవత్వపు పదాల మాటున పొదిగి జాతికి సందేశాత్మకమైన, ప్రగతి శీలకమైన దృక్పథాన్ని రేకెత్తించారు.

ప్రజల పేరు చెప్పి వచ్చు ప్రభుత్వాల
ప్రజల భాగమెంత? ప్రగతి యెంత?
నీతి బీరకాయనేయంతో ప్రజలంత[203]

ప్రజల పేరుతో వచ్చిన ప్రభుత్వాలలో ప్రజల భాగం, ప్రగతి ప్రశ్నార్థకం. అయితే ప్రజలు నేతిబీరలోని నేయిలా ఉంటే అభ్యుదయం తిరోగమన పథాలలోకి వెళ్ళిపోతుంది.

మంతనాలు, గదుల మంత్రుల చర్చలు
ప్రజల కొరకా? నిధుల స్వాహా కొరకు
ఏ.సి. రూములందు ఏత్రాసులుందురా[204]

ప్రగతి నిరోధకుల మంతనాలు, చర్చలు ఎలా ఉంటాయో పై కవితలో తెలిపారు.

ధరలు పెరిగి పెరిగి దారి తెన్నులు లేక
జనులలోన నీతి చచ్చునేడు
పిండవలదు పాలు కండాలు పడుదాక[205]

ధరలు పెరగడం ప్రజావళిలో భవిష్యత్ ఆశలు అంతరించడం బాధాకరమైన విషయంగా గుర్తించారు. అలా జరిగితే తిరుగుబాటు వస్తుంది. ప్రగతి తెరచాటుకు నిష్క్రమిస్తుంది.

తరలిరారా! తరలిరారా!
తరుణమిది నీ జాతి ఖ్యాతికి
పరిమళమ్మును పూయగా
అభ్యుదయ మాలిక వేయగా[206]

అంటూ అభ్యుదయ సాధన జీవిత లక్ష్యంగా రూపించుకున్న మంచి మనిషికి కవి స్వాగతం చెప్పిన తీరు విశిష్టంగా ఉంది.

తిరుమల అభ్యుదయ దృక్పథంతో రాసిన రచనలు రాశిలోనూ, వాసిలోనూ చాలా ఉన్నాయి. ప్రతి రచనా సాహితీ స్పృహతో ఉండి పాఠకుని అంతరంగంలో అనేకమైన ఆలోచనలను ప్రేరేపిస్తుంది. ఆధునిక తెలుగు సాహిత్యంలో అభ్యుదయం ఒక శక్తిమంతమైన పార్శ్వంగా ఉండిపోయింది. ఈ దృక్పథం చాలా మంది రచయితలను ఆకట్టుకుంది. "ఆ ఉద్యమం మా పాలిట జీవనది. ఆ మంచి నీటికి చేపల్లా మేము ఎదురువెళ్ళి స్వాగతం చెప్పాం. కవితా సముద్రం లోంచి జీవన ప్రవాహంలోనికి, ప్రపంచ వాహినిలోంచి సాహిత్య సాగరంలోనికి ఇటూ అటూ మేము ఈ దిన ఈత ఇవాళ ఒక తియ్యని తలపోత".[207]

మనిషి ప్రగతి గురించి రాయబడిన రచన అంతా అభ్యుదయమే అవుతుంది. అయితే తిరుమల దేశీయమైన అభ్యుదయాన్ని మాత్రమే కామించి రచనలు చేశారు. మనిషిని సర్వోత్తమునిగా తీర్చిదిద్దే అభ్యుదయ సూక్తాలను ఆయన కవితా గానం చేశారు. ఇవి ప్రజావళి ఆమోదాన్ని పొందాయి.

## 6. సామాజిక స్పృహ

"యుగధర్మ ప్రతిపాదకమైన సాహిత్యము నధ్యయనము చేయుటలోనొక నూతనమైన యాసక్తి జనించుచుండును. ఈ యధ్యయనమొక జాతిలోని ప్రజలయొక్క గాని, యొక శకములోని ప్రజల యొక్క గాని భావభంగిమల నవగాహన చేసికొనుటకుఁ దోడ్పడగలదు. అందుచే నట్టి యధ్యయనమొక విధమైన సామాజిక దృష్టిపథము గలదియు, చరిత్రకను బంధమును వ్యాఖ్యానమును అనదగినదిఁగాఁ గలదు".[208]

– డా॥ బొడ్డపాటి కుటుంబరాయశర్మ

మానవ సమాజం విశాలమైంది. పరిణామశీలమైందీను. సమాజం అవతరించిననాటి సంఘటనలు, సన్నివేశాలు, మారుతూ ఉంటాయి. పురాణకాలంలో రూపొందింపబడిన ఆచారాలూ, కట్టుబాట్లూ అనంతర కాలాలలో మార్పు చెందుతూ కొత్త అభిరుచిని కూడగట్టుకొని నవ్యఫణతిలో అడుగు ముందుకు వేస్తుంది. పాలనా సంబంధమైన సూత్రాలు పాలకులకు పాలితులకు మధ్య ఉన్న సాన్నిహిత్యం, దూరం ఇవన్నీ సమాజ జీవనంలో ప్రగాఢమైన భూమికను కలిగిఉన్నాయి.

ఒక యుగంలో ఉన్న మానవ మూల్యాలకు, అనంతర కాలాలలో వచ్చే విలువలకు ఎంతో వ్యత్యాసం ఉంటుంది.ఈ వైరుధ్యం మానవ సంబంధాల మీద ప్రగాఢ ప్రభావాన్ని చూపుతుంది. కవి సామాజికుడు అవడం వలన చలనశీలమైన సంఘ పరిస్థితులను తన రచనలలో చిత్రించడం అనివార్యమవుతుంది. ఒకనాటి కౌటుంబిక జీవితంలో ఉన్న పావిత్ర్యం ఈనాడు అంతగా కన్పించకపోవచ్చు. ఒకనాడు ధర్మార్థకామ మోక్షాలు అనే చతుర్విధ పురుషార్థాలకు ఉన్న ప్రత్యేకత ఈనాడు నామమాత్రంగా ఉండవచ్చు. అనేక దృక్పథాలు వాటి అంతస్తత్త్వాలు వైరుధ్యాలు మానవ సమాజాన్ని కల్లోలితసాగరం చేయడం కన్పిస్తుంది. మనుషులమధ్య అంతరాలు, మనిషికీ మనుస్సుకీ మధ్య అందని దూరాలు పెరగడం, వైపరీత్యాలు చెలరేగడం, పచ్చని సమాజం హృదయంలో చిచ్చు ప్రజ్వరిల్లడం వంటివి సాంఘిక స్వరూపాన్ని విచలితం చేస్తాయి. రౌడీ మూకల అమానవీయ చర్యలు, దుష్టశక్తుల అహేతుక అహంభావపు దౌర్జన్యం సమాజపు మూల్యాలను తుడిచిపెట్టే ప్రాసక్రీడలు. ఇవన్నీ కవి హృదయంలో అడుగుపెట్టి చిద్విలాసంగా పనిచేస్తాయి. ఫలితంగా సమాజ స్వరూపాన్ని సంస్కరించే రచనలు అతని కలం నుంచి వస్తాయి. డా॥ అవంత్స సోమసుందర్ "మానవ సమాజంపట్ల అభిమానమూ, మానవతా శక్తుల సమైక్యంపై అభినివేశమూ గల రచయిత తన మనోధర్మ ప్రేరణగా బాధ్యత వహించగలడు. తనంతట తానుగా సామాజిక పరివర్తనకు దోహదం కలిగిస్తాడు. తన సమాజంలో తానొక భాగస్వామి అయినా ద్రష్టగా



లోకవృత్తాన్ని దర్శిస్తున్నప్పుడు క్లేశభరిత సమాజం తన కెదురుబదురుగా నిలిచినట్లు అనుభవం పొందుతాడు. అట్టి సమాజాన్ని ప్రతిబింబప్రాయంగానైనా తన రచనలో చిత్రించకమానడు. ఉన్న స్థితిని చూపుతూనే పొందవలసిన గతిని సైతం ప్రేరేపిస్తాడు. ఉత్తమ దర్శనం లేని రచయితకు ఉత్తమగతీ గమ్యమూ లభించవు"[209] అంటూ సమాజాన్ని కావ్య వస్తువుగా వర్ణించిన కవికి ఉత్తమగతే గమ్యం లభిస్తాయని అంటారు.

సమాజం విస్తృతమైందే కాదు. అగాధమైంది కూడాను. దీన్ని రచనలో సంవదించడానికి కవికి సృజనశక్తి కావాలి. సృజనశక్తి వల్లనే సమాజం బాహ్యాంతర రూపాలు అతని కవితా చక్షువులకు కన్పిస్తాయి. "సామాజిక హృదయాన్ని ప్రేరేపించగలిగేది మౌలికంగా రచయిత సృజనశక్తి. అదే అంతరంగాలను వివశీభూతం చేస్తుంది. వ్యక్తి హృదయశక్తిగా రూపాంతరం చెందుతుంది. తిరోగమన వాదుల బారి పడి సుడిగుళ్ళు పొందే ముందు మనస్తత్వం నుంచి కాపాడుతుంది. జాతిని కదలించడమూ, నడిపించడమూ తన ప్రాథమిక అవసరంగా మౌలిక సృజన స్వీకరిస్తుంది. వినూత్న అక్షర లోకాలను ఆయుత్తపరుస్తుంది. మరో లోకంలో ప్రదర్శిస్తుంది. సామాజిక ప్రబోధం ద్వారా జాతి చైతన్యాన్ని జాగృతం చేస్తుంద"ని[210] డా॥ సోమసుందర్ అభిప్రాయపడినారు. కవిలోని సృజనశక్తి సామాజిక నేపథ్యం నుంచి వచ్చి ఆధునిక చైతన్య భూమికవైపు నడిపిస్తుందని అన్నారు. టి.యల్.కాంతారావు కూడా సమాజపరమైన ఆధునికతను విశ్లేషించారు. "ఏ కాలంలోనైనా కవిత్వ జననానికి రెండు కారణాలు కనబడతాయి. మొదటిది వ్యవస్థాగతమైన జీవనసూత్రాలు, రెండవది కవియొక్క అంతర్జగత్తు. ఈ రెండింటి సంఘర్షణలోంచి, వైరుధ్యాల్లోంచి కవిత్వం ఆవిర్భవిస్తోంది. కవి త్రికాలజ్ఞాని అయిఉంటాడు. భూత భవిష్యద్వర్తమానాల సమన్వయం అతని కవిత్వంగా రూపు కడుతుంది. గత సామాజిక సంప్రదాయం వర్తమాన సామాజిక స్థితికి అతకనపుడు కొత్త సంప్రదాయాన్ని సృష్టించుకొనవలసిన అవసరం కలుగుతుంది. ఆ నూతన సృష్టికి ఒకవైపు నుంచి సమాజశాస్త్ర మేధావులు, రెండోవైపు నుంచి కవిత్వ శిల్ప మర్మజ్ఞులైన మహాకవులు ప్రయత్నం చేస్తారు. మొదటివారిది ప్రత్యక్ష పోరాటం కాగా రెండవవారిది పరోక్ష పోరాటం అవుతుంది. అంటే సిద్ధాంతపరంగా జరుగుతున్న ప్రత్యక్ష పోరాటానికి కవులు పరోక్ష పద్ధతిలో సాంస్కృతికంగా కవిత్వరూపంలో మద్దతునిస్తారు. ఈ ప్రత్యక్ష, పరోక్ష పోరాటాల ఫలితమే అటు సమాజంలోనూ ఇటు కవిత్వంలోనూ సంపూర్ణమైన ఆధునికతగా రూపుదిద్దుకుంటుందని"[211] రావు కవిత్వ జననానికి హేతువులు రెండుగా చెప్పి కవి పరోక్ష పోరాటాన్ని ప్రేరేపిస్తాడని చెబుతూ సమాజం ఉద్యమానికి భూమికగా ఊనికగా అమరిన విషయాన్ని రాశారు.

ఆచార్య తిరుమల రచనలో సామాజిక ప్రయోజనం పాలు ఎక్కువే. సమాజంలో ఎక్కడ అలసత్వం పేరుకుపోయినా, హింస ప్రజ్వలించినా, మానవతకు గాయం తగిలినా మానుష ధర్మాలు పక్కదారులు పట్టినా తిరుమల తీవ్రంగా అభిశంసిస్తారు. సమాజం ఎప్పుడూ అంతరాల అఘాయిత్యాలు లేకుండా ఆనందమయమైన మనుగడ సాగించాలని

ఆయన తపించారు. రుచిరమైన మార్గాన్ని నిర్దేశించి అందరూ చల్లగా భవిష్యత్తులోనికి సాగడానికి స్వేద మధువులను చిందించిన మానవోత్తములు సుఖమయమైన జీవితాలను అనుభవించి సదా సమాజ భవనానికి శక్తిమంతమైన స్తంభాలుగా ఉండాలని కవి భావించారు. ఆయన లేఖిని నుంచి వెలువడిన కవితా పూర్ణ వారాశిలో సమాజం స్పష్టంగా దర్శనమిస్తుంది. తిరుమల భావుకత దండిగా ఉన్న మహాకవి కాబట్టి ఆయన కవితావిష్కారం 'సాహితీస్పృహ'లో భాసిస్తాయి. సామాజిక స్పృహ, సాహిత్యస్పృహ ఆయన రచనలలో మమేకం పొందుతూ తరంగితమవుతుంది. ఇదొక జీవనది. ప్రజావళి మానసాలను శ్యామలాభిరామం చేసే అక్షర భగీరథి.

తిరుమల మానవతకు స్వాగతం పలుకుతూ,

మన ధ్యేయాన్ని
మంధరగిరి చేసి
అపార కాల సాగరాన్ని మధించి
అమూల్య జాతిరత్నాలతో బాటు
అమరానంద సుధని సాధిద్దాం- రా[212]

అన్న కవితా పంక్తులు సమాజాన్ని పవిత్రంగా నిలపడానికే. మన ధ్యేయాన్ని మంధరగిరి చేయడం అంటే గుండెలో పురివిప్పిన సదాశయాలను స్థిరంగా నిలపడమని అర్థం. అపారమైన కాలమనే సముద్రాన్ని మధించడం అంటే విశాలమైన సమాజాన్ని చిలకడం. జాతిరత్నాల వంటి మానవోత్తముల ఆగమనంతో సమాజం కాంతిని తోడుకుంటుంది. వాళ్ళ రాకతో సమాజం గుండెలో ఆనందమనే సుధ పొంగుతుంది. అలాంటి అమరమైన మధురమైన స్థితి సమాజం అంతస్సులో సృజింపజేసి దేశ సౌభాగ్యాన్ని కలిగింపజేయాలని కవి ఆకాంక్ష.

సమాధి వద్ద ఉంచిన దీపం లాంటి
నిజాయితీని
సూర్యబింబంగా మలచి
ముళ్ళడొంకల్లో
మల్లెలు పూయించాలనే
దురహంకార అధికారాన్ని
రహదారికి మళ్ళిద్దాం-రా!
రాష్ట్ర దంష్ట్రలాంటి
స్వార్థం దిగబడ్డ
శాంతి శీతాంశుని
మన విజయనాద క్షీరాబ్దిలో కడిగి
అంతరంగాల్లో కీర్తి చంద్రికలు కాయిద్దాం-రా![213]



సమాజాన్ని సంస్కరించేది నడిపించేది ప్రభుత్వం. అధికారం జన మానసంలో దీపాలు వెలిగించాలి. అప్పుడు కాని సంఘం వినూత్న కాంతిలో తడిసి చైతన్యం పొంది పచ్చగా ప్రవర్ధిల్లుతుంది. అలాకాక సమాధివద్ద ఉంచిన దీపంలాంటి నిజాయితీ సూర్యబింబంగా మలచి ముళ్ళడొంకల్లో మల్లెలు పూయించడం అనేది దురహంకార పూరితమైన ప్రభుత లక్షణం. ఆరుబయట సమాధి దగ్గర వెలిగించిన దీపం గాలిదెబ్బలకి ఆరిపోతుంది. అంటే నిజాయితీ లుప్తమైపోతుంది. అలాంటి ఆరిన నిజాయితిని సూర్యబింబంగా మలచడం అనేది సాధ్యమైన పనికాదు. దాని తోడ్పాటుతో జీవితపు మల్లెలను పూయించడం అంతకన్నా సాధ్యమయ్యేది కాదు. అలాంటి దురహంకార ప్రభుత్వాన్ని పడగొట్టాలి. సమాజం గుండెల మీద మరో సూర్యుణ్ని నిలపాలి. అప్పుడు కాని సమాజం నవచేతనను సంతరించుకొని ఆదర్శంగా అడుగు ముందుకు వేస్తుంది.

ఆచార్య పేర్వారం జగన్నాథం

స్వామీ
ఈ మొగుడొద్దు
వీడసలే తుమ్మమొద్దు
గడ్డం మీసాలకన్నా
గడ్డపారలే కాస్త నయం
భరించడం మహాకష్టం[214]

అని సెటైర్ ధోరణిలో సమాజ చలనానికి అసలైన నేత అవసరమని భావించారు. తిరుమల కూడా అరచేతిలో స్వర్గాన్ని చూపే ప్రభుత్వాన్ని దురహంకార పూరితమైందని అధిక్షేపించారు.

నాగరికత ఎదిగినా సంస్కారం వికసించినా సమాజం అంతస్సులో అజ్ఞానం గడ్డ కట్టుకుపోవడాన్ని తిరుమల బాధపడుతూ ఈ అనాగరికమైన స్తబ్దతను జ్ఞానకాంతులతో బద్దలుకొట్టే ఒక యుగపురుషుని కోసం నిరీక్షిస్తారు.

ప్రతి అణువులో అజ్ఞానం భద్రపరచబడింది
ప్రతి అక్షరంలో అవివేకం నిద్రపోయింది
ఈ అక్షరాల పేకాటలో
సంఘ చైతన్యం దివాలా తీసి దిగంబరి అయ్యింది
అన్ని గ్రహాలు ఉడుకుతున్న
బరాణీ గింజాల్లా
కుతకుతలాడిపోతున్నాయి
దారుల్లో నక్కలు-కుక్కలు
గాడిదలు-గుడ్లగూబలు అరుస్తున్నాయి

వేసుకున్న 'చెప్పు'లు కరుస్తున్నాయి
అందుకే- నాకీవేళ కర్మవీరుడొకడు కావాలి
అతను రాజకీయ గర్జనలకి బెదరక
కీకారణ్యాన్ని- కాకారణ్యాన్ని చొచ్చుకుంటూ
ధర్మజ్యోతి ఆరిపోకుండా పట్టుకొని
నిర్విరామంగా నడవగలగాలి[215]

అణువులో అజ్ఞానం, అక్షరంలో అవివేకం ఉండటమంటే సంస్కారం శూన్యమైన నాగరికత అన్నమాట. పేకాటలో సంఘచైతన్యం దివాళా తీసింది. దిగంబరిలా మారిపోయింది. అన్ని గ్రహాలు ఉడుకుతున్న బఠాణీ గింజలా కుతకుతలాడిపోతున్నాయి. ఇక్కడ గ్రహం అంటే శాస్త్రరీత్యా ఉన్న నవగ్రహాలు కావు. మనుషులలో ఉండే గ్రహాలలాంటివాళ్ళు. అలాంటి గ్రహాలలాంటివాళ్ళు అవమానంతో ఉడికిపోతున్నారు. మానవతను పంచిపెడుతూ మనిషి సాగుతున్న దారులలో నక్కలు, కుక్కలు, గాడిదలు, గుడ్లగూబలు అరుస్తున్నాయి. ఈ అరుపులన్నీ మనిషి అభియానానికి విరుపులలా తోస్తున్నాయి. కడకు నమ్ముకున్న చెప్పులు కూడా కరుస్తున్నాయి. ఇలాంటి విషమ వేళలు మనిషి తీంఢ్రించి విసిరివేసినప్పుడు ఆ దృశ్యాన్ని చూసిన కవి హృదయం విచలితం అయ్యింది. ఈ వైక్లబ్యాన్ని, వైపరీత్యాన్ని సాంతంగా తుడిచిపెట్టే కర్మవీరునికోసం నిరీక్షిస్తున్నానంటారు కవి. ఆ యోధుడు రాజకీయ గర్జనలకు బెదరకుండా కీకారణ్యాన్ని చీల్చుకుంటూ ధర్మజ్యోతి ఆరిపోకుండా పట్టుకొని నిర్విరామంగా సాగిపోయే మనిషి కావాలంటారు. ఇక్కడ కవి ప్రయోగించిన కీకారణ్యం అంటే దట్టమైన అడవి అని అర్థం కాదు. క్రూరమైన మానవ మృగాలతో నిండిన సమాజం అన్నమాట. కాకారణ్యం అంటే వ్యక్తి తన స్వార్థాన్ని పండించుకోవడానికి ప్రభువులను కానీ, ఆ తాలుకు అధికారమున్న వాళ్ళ వెంబడి ఉంటూ స్తుతిచేస్తూ సొంత లాభాన్ని సాధించుకునే మనుషులతో నిండి ఉండే సమాజం అన్నమాట. ఈ కీకారణ్యం, కాకారణ్యం లాంటి సమాజం అంతరించిపోయి ప్రశాంతమూ, సుందరమూ అయిన సమాజం అవతరించాలని కవి తపన. ఇదే విషయాన్ని డా॥ మిరియాల రామకృష్ణ

సకల నరులను ఒక్క నీడకు
చేర్చు ఉత్తముడిపుడు లేడా
వసుధనొక సామ్రాజ్యమట్టుల
తీర్చిదిద్దే నేత లేడా
వర్తమానపు విషమ రూపము
మార్చగలిగే మాట లేదా
హిమాచలమే శీర్ష మైక
న్యా కుమారి పదమ్ముగా గల
భరతమాతా లేదటమ్మా
జనగణాత్మరాధ్యుడొక్కడు[216] అని అన్నారు.



"కవి సమాజంలో ఒక వ్యక్తి. న్యాయం జరిగినప్పుడు తన హృదయం నుండి జారిన సంతోషబాష్పాలతో మేఘాలు సృష్టించి అందరిమీద ఆనందపు జల్లులు కురిపించగలడు. అన్యాయం వల్ల తన గుండెకు కలిగిన గాయం నుంచి స్రవిస్తున్న రక్తాన్ని మషీరసంగా మార్చి అందరి గుండెల మీద వ్రాయగలడు. అందుకే అతడు సమాజ వ్యవస్థనే మార్చగల ఒక విచిత్రశక్తి"[217] అని సాహిత్య విమర్శకుడు పి.యస్.యస్.రాజు అన్నట్టుగా తిరుమల సామాజికుడుగా ఆనందాన్ని, అనురాగాన్ని సమంగా రాయగలిగిన ధీశాలి. తన కవితా మకరంద ధారలతో సమాజాన్ని తనియించగలరు. అగ్నికణాల లాంటి శబ్దాల విసురులతో జాడ్యాన్ని వదిలించగలరు.

పండుగల మైలురాళ్ళ నడుమ
గుట్టలు గుట్టలుగా పడివున్న
కారు చీకటిని అంజనం వేసి
దేశాన్ని చూశాను
ఎవరు మనసారా నవ్వుతున్నారు?
ఎవరు సంతృప్తిగా బ్రతుకుతున్నారు?
అధికార మత్తుల చేతుల్లో
పేకముక్కలుగా మారిన ప్రజలు
ఎలా నవ్వగలరు? ఎలా బ్రతుకగలరు?
... ... ...
అక్రమ విషసర్పానికి హృదయం పుట్టయ్యింది
నయవంచన జంబుకానికి మనసు ఎముకయ్యింది
కపట భ్రమరానికి నాలుక పువ్వయ్యింది
అపకీర్తి పక్షికి ఈ జగమే గూడయ్యింది
ఇలా దేశం ముళ్ళబాటల మీదుగా
చీకటి లోయల్లోకి పడిపోతున్నప్పుడు
ఇలా సంతోషం బీటలు వారిన బీడు భూముల్లో
కసవు మేస్తున్నప్పుడు
నాయక చిత్తు కాగితాల
చెత్తబుట్టల్లా అసెంబ్లీలు కనిపిస్తున్నప్పుడు
కత్తులు పలకరిస్తున్నప్పుడు-పూ
గుత్తులు నెత్తురులో తేలుతున్నప్పుడు
నా చూపు జండా మీద పడింది[218]

దేశం అనేక సమాజాల వేదిక. నాగరికత ఎదిగి గ్రహాలను గెలిచినప్పటికీ సమాజంలో వ్యత్యాసాలు మనిషి మేధను ప్రశ్నిస్తూనే ఉన్నాయి. ఒకరి బతుకులో ప్రతిరోజు పండగ

నవ్వులు పంచుతుంటే మరొకరి బతుకులో చీకట్లు వెక్కిరిస్తూనే ఉన్నాయి. అంతేకాదు, మైలురాళ్ళవంటి చరిత్ర పురుషులు వెలసినప్పటికీ సమాజం తిమిరావృతం అవుతూనే ఉంది. వైతాళికుల జాగృద్గీతాలు వినపడుతున్నా ఇంకా ప్రజావళి అంధత్వంలో మగ్గుతూనే ఉన్నది. పరిస్థితులు వికటిస్తున్నప్పుడు సమాజం నిస్తేజంగా ఉండిపోతుంది. ఎందరు మనః పూర్వకంగా నవ్వుతున్నారు. ఎందరు మధురంగా, తృప్తిగా బతుకుతున్నారు. ఏదో కాలుష్యం ఏదో కాపట్యం ద్వేషాగ్నులను పుక్కలిస్తూనే ఉంది. మానవతను కాటు వేస్తున్న వికృతహేల కవి హృదయాన్ని విచలితం చేసింది. అక్రమ విషసర్పానికి మనస్సు పుట్టగా ఉంటే, నయవంచనను ఊపిరిగా మలచుకున్న నక్కలకు మనసు ఎముకగా మిగిలిపోతే, కపటపు తుమ్మెదకు నాలుక పువ్వు అయితే, అపకీర్తి నక్షికి ఈ జగమే గూడుగా మిగిలిపోతే- దేశం అంటే సమాజం ముళ్ళబాటల మీద నడవలేక చీకటి లోయల్లోకి దభాలున పడిపోతే మానవతకు అర్థం లేకుండాపోతుంది. సంతోషం బీటలు వారిన భూముల్లో గడ్డితింటే, ప్రజాసంక్షేమం కోసం పాలనాసూత్రాలను రాయించుకునే అసెంబ్లీలు నాయకుల చిత్తు కాగితాల చెట్టబుట్టల్లా మిగలిపోతే, మనస్సులకు బదులు కత్తులు పలకరించుకుంటే, పూగుత్తులు నెత్తురులో తేలిపోతుంటే సమాజ స్వరూపం దారుణంగా పరిణమిస్తుంది. ఇదంతా కవి హృదయాన్ని చిలికివేస్తుంది. సమాజం నిత్యశుభంగా ప్రవర్ధిల్లాలని ఆయన కోరుకుంటారు.

సుప్రసిద్ధ రచయిత ఆర్.ఎస్.సుదర్శనం "రచయితలో చైతన్యశక్తి అంటే ప్రతిభ (క్రొత్త ఊహలు చేసి క్రొత్తదారులు త్రొక్కే చొరవ) ఎప్పుడూ వ్యక్తం అవుతూ ఉండాలని నా ఆకాంక్ష. నిజాయితీ ధైర్యం వంటి గుణాలు జీవితానికే కాదు రచనకూ అవసరమే. అప్పుడే ఆ రచన సమాజానికి రచనగా (ప్రసార సాధనంగా) ఉపయోగిస్తుంది. సమాజం యొక్క జీవ లక్షణమైన మార్పులే నిజంగా దోహదం చేస్తుంది"[219] అన్నట్టు ఆచార్య తిరుమల సమాజం యొక్క జీవలక్షణాలను కోరుకుంటూ మార్పుకోసం కవితను రాస్తున్న ఉత్తమోత్తమ కవి.

అక్షరంలోంచి, మాటలోంచి, వాక్యంలోంచి
సూర్యుడు ఉదయిస్తున్నాడు
దుస్సంధులు వైరి సమాసాలు లేని
ఆలంకారిక భావ మండలం లోంచి
సూర్యుడు ఉదయిస్తున్నాడు
జాతి జాడ్యాన్ని, కుళ్ళుని యింకింపజేసి
ఉక్కు పిడికిళ్ళకి నింగిదారి చూపిస్తాడు
చీకటి బజార్లకి చీకటి తప్పులకి
సంకెళ్ళుగా తన కిరణాలు మలచి
మంచిని రహదారికి మళ్ళిస్తాడు



పాడి పంటలతో, పరిశ్రమల ఫలితాల పచ్చని పందిళ్ళతో
ఆరిపోని నవ్వుల దీపాలు వెలిగించి
శాంతి ప్రసాదాన్ని అందరికీ పంచే హృదయంతో
సూర్యుడు ఉదయిస్తున్నాడు[220]

కవి విద్యార్థి అనే సూర్యుని రాక గురించి చెబుతూ అతడు అక్షరం- మాట- వాక్యం వీటిలోంచి ఉదయిస్తాడు అన్నారు. అక్షరం, మాట, వాక్యం అనేవి మనిషి జీవితాన్నే కాక సమాజ జీవితాన్ని కూడా పలికించే సుస్వరాలు. అలాంటి గుణత్రయం నుంచి ఉదయించిన విద్యార్థి ముందుగా మనిషిగా రూపొందుతాడు. అలా భావించుకున్న పిదప తనచుట్టూ పరచుకొని ఉన్న సమాజ గమనాన్ని దర్శిస్తాడు. సమాజం మూఢత్వం వైపు అడుగులేస్తున్నప్పుడు తాను పుట్టిన అక్షరాన్ని, మాటనీ, వాక్యాన్ని తలపోస్తాడు. గుండెలో ఉదయిస్తున్న తలపులతో జాతిజాడ్యాన్ని, కుళ్లునీ వదలగొడతాడు. అంతేకాదు, ఉక్కు పిడికిళ్ళకి నింగిదారి చూపిస్తాడు. అంటే ఏమిటి? ఉక్కు పిడికిళ్ళకి నింగిదారులకూ ఉన్న వైరుధ్యాలు కానీ, అనుబంధాలు కానీ ఏమిటి? కవి ప్రయోగించిన 'ఉక్కు పిడికిలి' సంకుచితత్వానికీ, క్రూరత్వానికీ ప్రతీక అయితే కవి ఆశించిన నింగిదారులు అక్కడివి ఎక్కడివో కావు. ఆత్మలోని దారులు, సదాశయాలు స్ఫుర్శించిన జాడలు. సమాజ తలం మీద చిందులాడే క్రూరులకు ఆత్మదర్శనం చేయించితే అతడు సాధువుగా మారిపోతాడు. సత్సంగత్యాన్ని పెంచుకొని సమాజం ఆనందకేదారంగా ఉండటానికి జీవితాన్ని సమర్పిస్తాడు. ఇంకా సంఘ సౌశీల్యాన్ని తుడిచిపెట్టే చీకటి బజార్లు, చీకటి తప్పులు- ఇలాంటి అవాంఛనీయమైన భావాలకు కవి కిరణాల సంకెళ్ళు వేసి మంచిని రహదారికి మళ్ళించి సమాజ అస్థిత్వాన్ని కాపాడతారు. పాడిపంటలు, పరిశ్రమల ఫలితాలు వెచ్చని పందిళ్ళలో ఆరిపోని నవ్వుల దీపాలను వెలిగిస్తారు. శాంతి ప్రసాదాన్ని అందరికీ పంచి అంటే సమాజానికి పంచి ఆనందిస్తాడు. ఇక్కడ కవి భావించింది బడిలో చదివే విద్యార్థి మాత్రమే కాదు. సమాజంలో జీవిస్తున్న ప్రతి మనిషీ ఒక విద్యార్థిగా ఆయన భావించారు.

సమవాదం నుంచే సమాజం పచ్చగా ఎదుగుతుంది. తేడాలను తలపోయడం వల్ల కాదు. సమాజ శ్రేయస్సును అక్షరాల కామించిన తిరుమల గేయ ప్రక్రియలో విశిష్టమైన రచనలు చేశారు.

కులమతాలతో కుమ్ములాటలా?
స్వార్థ విద్వేషాలా? ప్రాంతీయాభిమానాలా?
హింసా భావగానాలా?
మాట మనసు ఒక్కటిగా మసలుకో
నాది-నాది అంతా మనదని తెలుసుకో[221]

కవి వ్యక్తికి సందేశమిస్తూనే సమాజ శ్రేయాన్ని కాంక్షించడం సముచితంగా ఉంది. కులమతాల కుమ్ములాటలు, స్వార్థ విద్వేషాలు, ప్రాంతీయాభిమానాలు ఇవన్నీ తొలగిపోవాలని

కవి భావించడంలోని ఔచిత్యం స్పష్టంగా బోధపడుతుంది.

సంఘంలో కొందరు వ్యక్తులు సదా యుద్ధంలాంటి హింసా ప్రవృత్తిని కాంక్షించి ప్రశాంతమైన సమాజాన్ని కాలుష్యంతో నింపివేస్తారు. ఇలాంటి తిరోగమనవాదులను కవి తీవ్రంగా హెచ్చరించారు.

ఏలా యుద్ధము లాచరింతురు జనుల్ హింసా పిశాచాకృతుల్
ఈలాగన్యులఁ జంపి గెల్చు సిరి తామెన్నాళ్లు భోగింతురో
కాలంబందర నేడు రేపట పరిష్కారంబు గావింపదో
యాలోచింపరు మానవత్వ మకటా యజ్ఞామలో కేశవా!![222]

ప్రజలు యుద్ధాలు చేయడం, హింసా పిశాచులుగా మారడం ఎదుటివాళ్ళను చంపి వాళ్ళ సిరులను భోగించడం వంటి దురాశలున్న మనుష్యులున్నప్పుడు సమాజ పురోగతి ఎలా ఉంటుందో ఊహించవచ్చు.

మనిషన్నవాడు ఇతరుల జీవన సౌఖ్యాలను కోరుకోవాలి. సతతం మంచిని స్థాపించడం కోసం బతుకును కొవ్వొత్తి చేయాలి. ఈ త్యాగనిరతినుంచే శాశ్వత సుఖవంతమైన సమాజం అవతరిస్తుంది.

ఒకరి కన్నీరు తుడుపుగా నుంటివేని
నీకు కన్నీరు లేదు ఏ నిమిషమందు[223]

కన్నీళ్లను తుడవటమంటే- కళ్ళ నుంచి దుముకుతున్న బాష్పబిందువులను తుడవడం కాదు. కన్నీళ్లు కాలువలు గట్టడానికి గల హేతువులను పరిశీలించాలి. గుండెకు ముళ్ళు తగలకుండా చూడాలి. పాదాలకు పల్లేరులు గుచ్చుకుండా చూడాలి. గుండెల మీద బండలు పడకుండా చూడాలి. ఆకలి అగ్గిలా కాల్చివేస్తున్నప్పుడు చిటికెడు అమృతం లాంటి మెతుకులను అందించాలి. అప్పుడు కాని కన్నీళ్ళు రావు. తుడవడమనేది ఉండదు.

సంఘానికి సాహిత్యం కరదీపికగా ప్రవర్తించవలసి ఉంటుంది. సమాజంలో పేరుకుపోయిన అమానుష ప్రవృత్తులను సంపూర్ణంగా కడిగివేసి పండు వెన్నెలలా సమాజం చల్లని కాంతులతో మనుగడ సాగించవలసి ఉంది. తిరుమల రచన సమాజాన్ని సంస్కరించి భవిష్యత్తులోనికి నడిపించే విధంగా ఉంది.

## 7. ఆధునికత

నిత్యం నవ్యత్వాన్ని పొందుతూ, అనేక రీతులను శక్తిమంతంగా చూపడమే ఆధునికత. నవ్యత్వం సమకాలీనమైన అంశాలతో ఆలోచనాధారకు పదును పెట్టడం దీని ప్రధాన లక్షణంగా కన్పిస్తుంది.

ఆధునికత ఎప్పుడూ అనివార్యమైన విషయం. ఇది సమాజంలోని అన్ని పార్శ్వాలలో



చోటు చేసుకుంటుంది. సాహిత్యాది కళలలో కూడా ఈ రసరేఖ అనేక మార్పులతో కన్పిస్తుంది. కవిత్వం పుట్టిన తొలినాళ్ళ నుంచి నేటిదాకా ఆధునికత వస్తూనే ఉంది. తెలుగు కవులలో కొందరు ఛందస్సులో, కొందరు వస్తువులో, కొందరు భాషలో, ఇంకొందరు శైలి నిర్మాణంలో ఆధునికతను సాధిస్తూ వచ్చారు. కొద్దిమంది కవులు మాత్రం అనేక కావ్య వస్తువులలో ఆధునికతను చూపించారు. ఇలాంటి ఆధునికతను నోరి నరసింహశాస్త్రి "ఫ్యాషన్స్"[224] అన్నారు. కవితకు తొలి వాహిక భాష. ఆధునికత రూపొందడానికి భాషలో హేతువులను చూపిస్తూ పెమ్మరాజు వేణుగోపాలరావు "భాషను ఉపయోగించేవారి సంస్కృతి, విజ్ఞానముల నవ్యత సహజంగా భాష యొక్క ఆధునికత్వానికి దోహదం యిస్తుంది"[225] అంటే రచయితలో సంస్కృతి జ్ఞానసంపద ఉంటే ఆధునికత రచనలో చోటు చేసుకుంటుందని తెలిపారు.

పి.యస్.ఆర్.అంజనేయశాస్త్రి "ఆధునికత-ప్రక్రియలో, భావంలో, భావ ప్రకటనలో అలంకారాల్లో. కండ గల ప్రతి రచయిత ఈ ఆధునికతను సంతరించుకొని తీరుతాడు. ప్రజల నాడిని బాగా గుర్తెరిగే నేర్పు గల రచయిత ఈ ఆధునికతలో వింత సోయగాలు వెల్లివిరుస్తాడు"[226] అని ఆధునికత ప్రక్రియ, భావం, అలంకారం వీటిలో ఉంటుందని చెప్పారు. రచయిత శక్తిమంతుడైతే తన రచనలో ఆధునికతను సొగసుగా చిత్రిస్తాడని అభిప్రాయపడ్డారు.

ఆధునికతను అందరు సాహితీమూర్తులు ఒక్కరీతిలో నిర్వచించినవారు కారు. ఎన్నో కోణాల నుంచి ఆధునికతను దర్శించి ఆ పిదప తమ రచనల లోనికి స్వాగతం పలికారు. ప్రముఖ సాహితీవేత్త డా॥ ఆవంత్స సోమసుందర్ "ఆధునికత విశిష్ట నిర్వచనాత్మకమే తప్ప, నవ్యత్వానికి కూడా పర్యాయపదంగా నేనంగీకరించడం లేదు. ఆధునిక శబ్దం నిర్దిష్ట లక్షణ లక్షితమైన గుణవాచిగా మాత్రమే మనం స్వీకరించాలని నేను మనవి చేస్తున్నాను. హేతువాదానికి లోబడేది, అంధ విశ్వాసాన్ని ప్రతిఘటించేది, సర్వజీవన రంగాలలోనూ పరిణామాన్ని ప్రయోగాన్ని ఆశించసాగే సాహిత్యాన్ని ముఖ్యంగా కవిత్వాన్ని మాత్రమే మనం నిర్వచించుకుంటున్నప్పుడు అలాంటి లక్షణం గలది ఏ యుగంలో ఉన్నదైనా ఆధునికమే కాగలదు. మధ్య యుగాలలో సైతం వేమన యోగి వంటి మేరునగధీరులు ఎందరో ఆధునికులుగా దర్శనమిస్తారు"[227]ని అన్నారు.

తెలుగులో భిన్న సిద్ధాంతాలు కలిగివున్న రచయితలు ఆధునికత గురించి విపులంగా వివేచించినప్పటికి చివరకు ఆధునికత అనేది కాలాన్ని అనుసరించి ఉంటుందనే అభిప్రాయాన్ని గట్టిగా సమర్థించారు.

ఆచార్య తిరుమల తన రచనలలో ఆధునికతను విపులంగా పరిపూర్ణంగా ప్రతిష్ఠించారు. సహజంగా ఆయన కవి, పండితుడు, విమర్శకుడు, తాత్త్వికుడు కావడంవల్ల ఆయన సాధించిన ఆధునికత ప్రత్యేకంగా దర్శనమిస్తుంది.

నీ కోసం
అవకాశపు ఆకాశపు విస్తరిలో
ఆశయాలు వడ్డించటానికి
ఆనందాశ్రుధారలతో
అనంత విశ్వంలోకి
ఆవిర్భవిస్తాను[229].

'నీ కోసం' అనే శీర్షిక కంటపడగానే అది ప్రణయ కవిత అవుతుందని కొందరు భావిస్తారు. కాని, అలా కాదు. 'నీ కోసం' అన్నది మానవతకు అంతరంగంగా అమరిన సమానత్వం. ఈ సమదృష్టిని ఆయన సూటిగా చెప్పరు. పాఠకుని ఆలోచనకు విడిచి పెడతారు. అవకాశపు ఆకాశ విస్తరిలో ఆశయాలను వడ్డించడం, ఆనందాశ్రుధారలతో విశ్వంలోకి ఆవిర్భవించడం అనే వస్తువులు ఆధునికమైనవి. ఏదో ఒక్క ప్రదేశంలో పుడతాననకుండా విశ్వంలో ఉదయిస్తానంటాడు. అట్లా అనడంలోనే సమభావన కొత్త సంప్రదాయకంగా అంటే ఆధునికంగా ఉండి చదువరులను స్పందింపజేసి ఆకట్టుకుంటుంది.

రాజకీయపరమైన వస్తువును ఎంపిక చేసుకొని ఆధునికతను చెప్పడంలో కవి సాధించిన ఆధునికత చూడండి.

నేటి రాజకీయ గర్భంలోని చీకటిలో నా చేతులు కడిగి
నా ఆశాంగ నా శిరోజాల తెల్లదనానికి తుడుచుకుంటే నాలో
కవిత్వం రాయడానికి ఇన్‌స్పిరేషన్ వస్తుంది
కానీ రాయను, ఎందుకో?
ఆమె ఎప్పుడో విడాకులిచ్చి వెళ్ళిపోయింది- పైగా
నిస్పృహ నిప్పులా దహిస్తుంది[230]

నేటి రాజకీయ క్షేత్రంలో కృత్రిమత్వం, కాలుష్యం లాంటి ధూర్త లక్షణాలు చోటు చేసుకున్నాయని, ఈ కాపట్యాన్ని తుడిచిపెట్టడానికి కవితను వాడలేనని చెప్పడం- దీన్ని ఇదే దృక్పథంతో చెప్పరు. 'కప్పి చెప్పేది కవిత్వం' అన్న సినారె కవితోక్తిని అనుసరించి చెప్పారు. నేటి రాజకీయం అనే కడుపులో కవి చేతులు కడుక్కొని తన ఆశయం అనే స్త్రీ కురుల తెల్లదనానికి తుడుచుకుంటే కవిలో ఇన్‌స్పిరేషన్ వస్తుందట. కానీ, రాయలేడట. ఎందుకంటే, కవిత ఆయనకు విడాకులిచ్చి వెళ్ళిపోయింది. అట్లా దూరమవడం వలన కవిలో రాజకీయ క్షాళనానికి అవసరమైన మరో మార్గంలేదు కదా! ఇది తిరుమల మానసంలో మెరిసిన ఆధునిక భావ పుంజం.

ఇప్పుడు జీవితాల్ని పాలించేది విజ్ఞానం కాదు- విధి!
చీకటే మన పెన్నిధి! అందుకే చెప్తున్నాను
నూనెతో వెలిగే దీపం నువ్వులతో వెలగదు



నవ్వులతో నిలిచే ప్రగతి గుడి గవ్వలతో నిలవదు
బానిస భావాల కలుపు మొక్కలు పీకేస్తే
ప్రచండ జ్ఞాన కిరణ సస్యం హస్తగతమవుతుంది
అందుకే నేను కిరణమవుతున్నాను
చీకట్లోంచి, కలుపు మొక్కల కళ్ళల్లోంచి
చొచ్చుకొనిపోతున్నాను[231]

ప్రతి వస్తువుకు ఓ తత్వం ఉంటుంది. ఒక వస్తువుతో మరో వస్తువును అన్ని వేళల్లో వినియోగానికి తేలేం. దీపాన్ని నూనెతో వెలిగిస్తాం కానీ, నువ్వులతో కాదు కదా! దేశంలో ప్రగతి పెరగాలంటే సమాజాన్ని పీడించే దుష్టశక్తులు అంతరించిపోవాలి. అలా జరగడానికి మనసున్న ప్రతి మనిషీ మమేకమై అడుగు ముందుకు వేయాలి. అంతరాల తెరలను తొలగించుకోవాలి. చెట్టపట్టాలు పట్టుకొని చిరునవ్వుల సిరులతో కదలితే ప్రగతి కొత్త కాంతులను ప్రసరిస్తుంది. నవ్య జగతిని ఆవిష్కరిస్తుంది. అలా ప్రగతి వృక్షం విరగబూస్తుంది కానీ, గడ్డి గువ్వల లాంటి చైతన్యహీనులైన వ్యక్తుల నుంచి కాదు. బానిస భావాల కలుపు మొక్కలను వేళ్ళతో పీకేస్తేనే ప్రచండమైన జ్ఞానకిరణ సస్యం చేతికందుతుంది. జాతి మనుగడ వెలుగుతో నిండుతుంది. అందుకోసమే కవి కిరణమై చీకట్లోంచి కలుపుమొక్కల కళ్ళల్లోంచి దూసుకుపోతానంటారు. కవిగా తిరుమల తన కర్తవ్యాన్ని ఆధునికంగా, సొగసుగా తీర్చిదిద్దారు.

కవి క్రాంతదర్శి. సత్యాన్వేషి. నిత్యాన్వేషి. విశ్వశ్రేయాన్ని ఆకాంక్షించిన కవితలో ఈ లక్షణాలు ఉండాలి. వాటిని అక్షరాలుగా, కవితాక్షరాలుగా సంధించే నిపుణతా ఉండాలి. ఆయన కాంతినీ, శాంతినీ, సమతనీ వెల్లువెత్తించాలి. అలాంటి కవి వల్లే విశ్వశ్రేయం సిద్ధిస్తుంది.

నా సూర్యుడు హిమాలయాల్లో ఉదయిస్తాడు
సముద్రాల నుండి నా గుండెను నేను పిండుకొని
'కాచి' 'తోడుపెట్టి' 'పెరుగు' చేసి
చిలికి చిలికి వెన్నె తీసి-వెన్న ముద్దలా చేసి
ఆకాశపు కడవలో దాచుకున్నాను జాబిల్లిలా!
నా వెన్న వెన్నెల బాట పరచింది నా కోసం
నేను నా హిమాలయ సూర్యుని కోసం నడుస్తున్నాను
నడిచాను నడిచాను నా సూర్యుణ్ణి నేను ఆక్రమించాను
ఇప్పుడు కాంతి నా బానిస[232]

ఈ కవితా పంక్తులలో శ్రామికుడు వర్ణింపబడినాడు. అతడు హిమాలయల్లాంటి వ్యవస్థను కరిగించి వెన్నముద్దలా వెన్నెలలా చేసి కాంతిధారను కురిపిస్తాడు. ఆ వేళ కాంతి

అతనికి బానిసలా ఉంటుంది. శ్రామికశక్తి ఎలాంటిదో కవి చెప్పడంలో ఆధునికత సుస్పష్టంగా ద్యోతకమవుతుంది.

భూమి చుట్టూ సాగరాలున్నాయి
సాగరాల చుట్టూ సాహిత్యం ఉంది[233]

భూమి చుట్టూ సాగరాలుండడం శాస్త్రసమ్మతమైన అంశం. సాగరాల చుట్టూ సాహిత్యం ఉందన్నది ఆధునికమైన విషయం. సాగరమంటే సముద్రమనే భౌతికనేత్రాలకు సంబంధించింది. సాగరానికి సంసారానికి దగ్గరి సంబంధం ఉంది. ఆనందం పున్నమి అనే ఆనందం గుండెలో తళుకెత్తినప్పుడు జీవితం అనే సాగరం ఉప్పొంగుతుంది. విషాదం కబళించి వేస్తున్నప్పుడు బతుకంతా చితికిపోతుంది. మనిషిని అంటిపెట్టుకున్న ఆనంద విషాదాలు బింబ ప్రతిబింబాలుగా ఉంటాయి. ఈ చీకటి వెలుగులన్నీ సాహిత్యమవుతుంది కదా! తిరుమల ఈ రెండు పాదాల్లో మనిషి జీవితంలోని బొమ్మా బొరుసు లక్షణాలను చూపించారు. ఈ దర్శనంలో ఆధునికత పచ్చగా మనసు కళ్ళకు కనిపించి పాఠకుని హృదయంలో అనేక ఆవర్తాలను సృజిస్తుంది.

'నేత్రస్పర్శ' అనే కవితలోని ఈ పంక్తులు ఆధునికత చిత్రణకు పరాకాష్ఠ.

చూపు
సూర్యాగ్నికి గుచ్చుకుంటూ ఉంది!
కరిగి, మట్టిపాటలా విచ్చుకుంటూ ఉంది!
పల్లవించిన పాట
అందాల అద్దాల మీద వాలి
నిరాశ నిర్వేద వలయాల్ని తుడిచి
మస్తిష్క నగ్న వృక్షానికి
వసంతాన్వేషణలోని
మాధుర్యాన్ని పూస్తూ ఉంది[234].

చూపు సూర్యాగ్నికి గుచ్చుకోవడం, కరగడం అనేది వికాసానికి చిహ్నం. మట్టి పాటలా విచ్చుకోవడం అనేది సహజత్వానికి సంకేతం. అట్లా పల్లవించిన పాట అందాల అద్దాలు అనే మనస్సు మీద వాలి అంతరంగం పొరలలో ఉన్న నిరాశా నిర్వేదాలను తుడిచిపెడుతుంది. మస్తిష్కం అనే నగ్న వృక్షానికి వసంతాన్ని అన్వేషించడంలో ఉన్న తపనను మాధుర్యాన్ని యిస్తుంది. నేత్ర స్పర్శలో కవి భావన ఆధునికతను ఇమిడించుకొని పరాకాష్ఠ దశను చేరుకుంది.

తిరుమల వచన కవితా ప్రక్రియలోనే కాక గేయ ప్రక్రియలో కూడా ఆధునికతను చూపారు. వస్తువు పౌరాణికమైనప్పటికీ పదునైన అభివ్యక్తితో ఆధునికతకు రెక్కలు కట్టించారు.

పొంగే వాగులలో మురళీస్వనము



పూచే తీవెలతో బృందావనము
సిరివెన్నెల రాత్రులు
మన నౌకా యాత్రలు
మరచిపోదులే? నిను
విడిచిపోదునే?!![235]

గోపాంగన మదిలో మెదిలిన రాసకేళికా భావన ఈ గేయంలో ప్రముఖంగా వర్ణితమైనా కృష్ణస్వామి సర్వాంతర్యాలు కవితలో నవనవంగా వర్ణింపబడ్డాయి. గోపస్త్రీలు కానీ, రాధ కానీ నల్లనయ్యతో విహరించేది యమునా తీరం మీదనో, బృందావనంలోనో. ఆ యదుస్వామి వ్రేపల్లె పడచులను మురళీగానంతో పిలుస్తాడు. అది సమ్మోహన మంత్రంతో వాళ్ళ గుండెలలో అడుగుపెట్టి చకచకా కాళిందీ తీరానికో, బృందడెందానికో నడిపిస్తుంది. అయితే కృష్ణుడు యమునా తీరం నుంచి వేణువును పలికిస్తున్నప్పటికీ ఆ పాట యమున నీళ్ళల్లోనే కాక మిగతా వాగులలో కూడా వినిపిస్తుందట. ఇది ఆధునిక భావన. రాసకేళినీ, రాధాకృష్ణ ప్రణయతత్వాన్ని కవి ఆధునికతతో అభివ్యక్తీకరించారు.

కవిలో సుప్రభాత వేళ ఎన్నో భావాలను ప్రేరేపిస్తుంది.

తూరుపు మొగసాల నుండి సూర్యరథం కదిలింది
లే గరికల మంచుపైన రవి కిరణం మెదిలింది
భావి కాల శుభసీమకు సాగరా
భావంలో అనుభవాల నూగరా!
రథంలా రవి కిరణజాల పథంలా
వెలుగు నీడలల్లిన యీ
సజీవ వేణుగీతి పాడరా[236]

సూర్యోదయాన్నీ, ఆ వేళనీ పూర్వం నుంచి నేటి వరకూ కవులు అనేక విధాలుగా వర్ణించారు. కొందరి వర్ణనలలో నవ్యత్వం తొణికింది. తిరుమల సూర్యుడు ఉదయించాడని అనకుండా 'తూరుపు మొగసాల నుండి సూర్యరథం కదిలింద'ంటారు. ఇది నవ్య భావన. అట్లాగే లేగరికల మంచుపైన రవి కిరణం మెదిలిందనడం అలాంటిదే. ఇంకా భావికాల శుభసీమకు సాగడం, భావంలో అనుభవాలు ఊగడం అనే పద సంపుటి ఆధునిక వృత్తాన్ని తెలిపే పదబంధాలే. పరిమళగంధాలే.

తిరుమల వసంతాన్ని వర్ణించే చోట-

పావురాల తెలిరెక్కల సవ్వడిలో
ఫణిరాజులు మైమరచి ఆడాలి
ఆ ఆటల జాబిల్లి నవ్వు పండాలి[237]

శాంతిని గూర్చి వర్ణించే సందర్భంలో తెలుగు కవులు పావురాల్ని శాంతికి ప్రతీకగా

తీసుకొని వర్ణనలు చేసిన సన్నివేశాలు చాలా ఉన్నాయి. కొందరు పడికట్టు మాటలతో ఒకే భావాన్ని వర్ణించి కవితను కురూపి చేస్తారు. మరికొందరు కొత్త రుచులను అందిస్తారు. తిరుమల నవ్యులలో నవ్యుడు. కాబట్టి వారి రచన ప్రసన్నంగా, ఆధునికంగా ఉంటుంది. 'పావురాల తెల్లని రెక్కల సవ్వడిలో ఫణిరాజులు మైమరచి ఆడాలి' ఇది నవ్యత కాక మరేమిటి? ఫణిరాజుల లాంటి మనుషులతోనే శాంతికీ, సమైక్య జీవన విధానానికి విఘాతం ఏర్పడుతుంది. అలాంటి ముష్కరులు పావురాల తెల్లని రెక్కల నాదాలలో తమను తాము మరిచిపోయి నర్తించాలంటారు. అలా జరిగితే లోకం నాకంగా పవిత్రమవుతుంది. తిరుమల పద్యరచనలో రవ్వలు కుప్పలు పోసిన రస నీరధి.

రసిక చక్రవర్తి రాత్రి యీ వేళలో
ఏమి తపము జేతు ఎవరికొరకు?
నాదు పొందు కొఱక! నంద నందన! యంచు
ధ్యాని కృష్ణునొకతె యడుగ సాగె[238]

సాయుజ్యాన్ని లక్షించిన రుషులు అహర్నిశలు తపస్సు చేస్తారు. అది పరమేశ్వర సాక్షాత్కారం జరిగే వరకూ భయానకంగా కొనసాగుతూనే ఉంటుంది. కాని పై పద్యంలో రసిక చక్రవర్తి తపస్సు రాత్రివేళ జరుగుతోందని ఈ కవి తాను ఎంచుకున్న ఇతివృత్తానికి ఆధునిక భావనను ప్రేరేపించి చెప్పారు.

ఇట్లా తిరుమల తన కవితలో ఆధునికతను ప్రవేశపెట్టి రసవన్మధురంగా వర్ణించారు.

## 8. విశ్వజనీనత

'విశ్వశ్రేయం కావ్యం' అని పెద్దలన్నారు. విశ్వంలోని సర్వజనులకూ అది శ్రేయాన్ని కలిగించాలి. మనస్సుల్లో కాలుష్యం అడుగుపెట్టకుండా, మాటల్లో కాపట్యం చొరబడకుండా ఆచరణలో సదాశయాలు నిండుగా విరబూసి మానవతను పెంచి గుండె గుండెకూ పంచేదిలా ఉండాలి. కావ్యం కాల లీలలను తెలిపేదిగా ఉండాలి. మనిషికి అవసరమైన అన్ని కోణాలను పచ్చపచ్చగా తీర్చిదిద్దాలి.

ప్రపంచ ప్రజావళి మానస క్షేత్రాలలో నీతి, నిజాయితి, సత్యం, ధర్మం, సదాచరణం, స్వార్థత్యాగం, ఔదార్యం, సమత, మమత అనేవి అందరికి అన్వయించే విధంగా ఉంటే దాన్ని విశ్వజనీనత అంటారు. తెలుగు నిఘంటువులో విశ్వజనీనం పదానికి సర్వజనులకు హితమైనది[239] అనే అర్థం ఉంది. భోజుడు, విద్యానాథుడు పేర్కొన్న ఇరవై నాలుగు గుణాలు[240] విశ్వజనీనతను ప్రకటించే అంగాలుగా కన్పిస్తాయి. ఆధునిక సాహిత్య విమర్శకులు డా॥ తిరుమల శ్రీనివాసాచార్య "ప్రాచీనుల దృక్పథంలో ఒకవైపు కాంతా సమ్మితంగా వ్యంగ్య సుందరంగా కావ్యంలో గోచరించే సార్వకాలీన ఉపదేశధర్మమే విశ్వజనీనత అనబడుతుంది. మరొకవైపు రసానుభూతికి మూలహేతువైన సాధారణీకరణం విశ్వజనీనత అనిపించుకుంటుంది. ఒకటి ఆర్షదృష్టి. మరొకటి అలంకారిక దృష్టి. ఆధునికుడు విశ్వజనీనతను మరో దృక్కోణంతో చూస్తున్నాడు. సమ సమాజ నిర్మాణం నేటి ప్రపంచాన్ని పాలిస్తున్న సాంఘిక న్యాయం పరపీడన పరాయణత్వం లేని ప్రజా జీవితం ప్రతి ఖండంలోనూ ప్రతిష్ఠించాలని ప్రజాశక్తిని మేల్కొల్పి కర్తవ్యాన్ని బోధించి కలాన్ని ఝుళిపిస్తున్నాడు ఆధునిక కవి. విశ్వవ్యాప్తమై ఉన్న ఈ సామాజిక స్పృహను సంకేతాల ద్వారా సన్నివేశాల ద్వారా సూక్తుల ద్వారా శబ్దశక్తుల ద్వారా సాహిత్య రంగంలో సమీకరింపజేయడమే ఈనాడు కనవస్తున్న నూతన దృక్పథం[241] అని అన్నారు.

ప్రాచీనాలంకారికుల, నిఘంటుకారుల, ఆధునిక విమర్శకుల రాతలను పరిశోధిస్తే వాటిలో కొన్ని మలుపులు ఉన్నప్పటికీ అందరి హితాన్ని కాంక్షించేదే విశ్వజనీనం అని ప్రస్ఫుటమవుతుంది.

రామాయణం, భారతం, భాగవతం వంటి పురాణాలు మానవాళికి ధర్మోపదేశం చేస్తూ నీతినియమాలతో బతకండనే దృక్పథాన్ని నేటికీ చాటుతున్నాయి. భవిష్యత్తులో కూడా నాటి అమరవాణిని ఆకర్షణీయంగా, శక్తిమంతంగా ప్రకటిస్తాయి. భర్తృహరి లేఖిని నుంచి ఉప్పొంగిన కవిత్వంలో విశ్వజనీనమైన అంశాలు విస్తృతంగా ఉన్నాయి. ఆధునిక కాలంలో వచ్చిన కొన్ని రచనలు విశ్వజనీనతను ఉదాత్తంగా చెప్పాయి.

అక్షరాలు పలుకుతున్నాయి
అమృతాన్ని చిలుకుతున్నాయి
జీవితాన్ని చిలుకుతున్నాయి
జీవితాలు గ్రంథాలవుతున్నాయి
శిల్ప సౌందర్యాలు బంధాలవుతున్నాయి
ప్రేమానురాగాలు పీఠికలవుతున్నాయి
అభిమానాలు ఆశ్వాసాంత వాటికలవుతున్నాయి
మేఘాల శాలువాలు సవరించుకొని
సూర్యచంద్రులు కాంతి సందేశాలిస్తుంటే
మొగ్గల్లాంటి దేశాలన్నీ
ముగ్ధమోహనంగా విచ్చుకుంటున్నాయి
యుగాల చరిత్ర పరిమళాన్ని
తరాల భ్రమరాలు ఆస్వాదిస్తుంటే
పుటల్లోని అనుభూతులన్నీ
పూర్ణత్వానికి హారతులవుతున్నాయి[242]

తిరుమల ప్రతీకాత్మకంగా, ధ్వనిగర్భితంగా రాసిన కవితలో విశ్వజనీన భావన విదితమవుతుంది. అక్షరాలు పలకడమంటే మంచి ఆశయాలు గుండెలకు అందించడమే. అమృతాన్ని చిలకడమంటే దైవత్వాన్ని బోధించడమే. ఇలాంటి సన్నివేశాల స్పర్శలు పరస్పరం ఆత్మీయంగా, ఆర్ద్రంగా సమ్మిళితమై అవి జీవన గ్రంథాలవుతాయి. శిల్పసౌందర్య

బంధాలవుతాయనడంలో కూడా విశేషమైన భావార్థం ఒదిగి ఉంది. ఇక్కడ శిల్పాలు, అందాలు శిల్పి ఊహల్లోంచి పుట్టినవి కావు. శిల్పి అంటే మనిషి. అతని హృదయంలోని సత్యం, ధర్మం, సమత్వం, మమత్వం, ఔదార్యం వంటి లక్షణాలు మూర్తీభవిస్తాయి. శిలల ఎదల మీది చిత్రాలను చూచినప్పుడు మనిషిలో తన్మయత్వం కలుగుతుంది. అదొక నిత్యమైన, సత్యమైన గుర్తుగా నిలిచి ఉంటుంది. అట్లాగే మనిషిలో ఉన్న విశేష లక్షణాలు సమాజాన్ని చకితం చేస్తాయి. ఇట్లా సాగినప్పుడు అతని హృదయం ప్రేమానురాగాల పీఠిక అవుతుంది. ఇదంతా ఏమిటి అంటే మనిషి హృదయమే ఆతని జీవన కావ్యానికి మూలం. ఈ మూలంలో సంక్షిప్త స్వరూపంలో భాసిస్తున్న అంశాలు ఆయన జీవన కావ్యంలోని విశిష్టతను తెలియజేస్తాయి. అభిమానులు ఆశ్వాసాంత వాటికలు కావడమనే అక్షర సమామ్నాయంలో విలువైన అర్థం ఉంది. కవి ఇక్కడ చెప్పిన ఆశ్వాసాంతాలు కావ్యంలో వచ్చేవి కావు. మనిషి జీవన కావ్యంలో వచ్చేవి. మనిషిలో అభిమానం, ఆత్మీయం ఎన్ని రాపిళ్లకైనా తట్టుకొని వెలుగులు విరజిమ్మితే అవన్నీ అతని చరమాంకంలో అతణ్ని అమరుణ్ని చేస్తుంది. యుగ పురుషుణ్ని చేస్తుంది. యుగగీతంగా పాడిస్తుంది. అదే విశ్వజనీన భావనకు ఊపిరిగా నిలుస్తుంది. మేఘాలు శాలువలను సవరించుకొని సూర్యచంద్రులు కాంతి సందేశాలిస్తారట. సూర్యుడు, చంద్రుడు కాంతిని ప్రసరిస్తారు. ఇది సహజమైనదే. కాని కాంతి సందేశాలు అనే పదసంపుటిని పరిశీలిస్తే సూర్యుడు, చంద్రుడు అంటే మనిషన్నమాట. ఆ గగనచారులు ఇద్దరూ మేఘాల అడ్డుతెరలను సవరిస్తూ లోకాలకు ఎలా కాంతిని ప్రసరిస్తున్నారో అలాగే సూర్యుడు, చంద్రుడు లాంటి మనుషులు అడ్డంకులనే తెరలను చీల్చుకొని లోకాలకు కాంతి సందేశాలిస్తారనేది విశేషార్థం. అలాంటప్పుడు మొగ్గల్లాంటి దేశాలు అంటే కళికలలాంటి హృదయాలు నిండుగా విచ్చుకుంటాయి. ఇట్లా యుగాల నుంచి వస్తున్న మానవీయ సుధా రసాన్ని తరాల భ్రమరాలు ఆస్వాదిస్తాయి. అప్పుడు కానీ మానవ జీవన కావ్యంలోని స్పందనలూ, అనుభూతులూ మనిషిని పూర్ణ మానవునిగా తీర్చుతాయి. అతని కీర్తిని ఆనందగీతికలుగ ఆలపిస్తాయి. తిరుమల ప్రతీకలతో రాసిన గాఢమైన ఈ కవితా పంక్తులలో విశ్వజనీనత ఎంత ఉత్కృష్టంగా ఉందో తెలుస్తుంది.

విశ్వజనీనతను సిద్ధాంతపరిచే రచయితలో ప్రత్యేకమైన అభినివేశం ఉంటుంది. పటుత్వమైన ఆలోచనాధార ఉంటుంది. ఆ పటుత్వం చురుకుగా రచనలో ప్రవాహ సదృశంగా ముందడుగు వేస్తుంది.

సమైక్యారాధనం విశ్వజనీనమైన భావంలోని ఒక రేఖ. కవి ఈ దర్శన మూల్యాలను కవితా స్వరూపంగా వెలువరించారు.

నగరాల మేడల మీద- నిరుపేద వాడల మీద
కల్లోల జలనిధి మీద - పిల్ల కాలువల మీద
సూర్యచంద్రుల చూపు ఒకటే-ఒకటే
గాలి అందరికొక్కటే-జ్వాల అందరికొక్కటే
రెండు కనులకు చూపు ఒకటే



భావ వీధిని దీపమొకటే
సమతను, నవతను పరిమళించే మానవత
కథ అందరికి ఒకటే[243]

సూర్యచంద్రులు అన్నింటి మీదా- అంటే నగరాల మేడల మీద, నిరుపేదల వాడల మీద, పిల్లకాలువ మీద, కల్లోల జలనిధి మీద అంతటా సమంగా తమ కాంతిని ప్రసరింపజేస్తారు. వాళ్ళచూపు ఒకటే. గాలి ఒకటే. జ్వాల ఒకటే. భావవీధికి దీపమొకటే. ఇవన్నీ సమతను, నవతను ప్రసారించి మానవతకు మరింత జీవం పోస్తాయి. విశ్వంలోని ప్రజావళి గుండెల్లో ఈ భావన అల్లుకుపోతే ఆనందం పరిమళద్రవ్యాలుగా పదికాలాలు మానవ సమాజాన్ని శోభింపజేస్తాయి.

విశ్వనరుని సత్ లక్షణాలను ప్రస్తావించి తిరుమల

అంతమే లేని నింగి తానెంత నాకు
నా హృదయమందది చిరు సందడియె కాని
బిందువందున సింధువు బింబమట్లు
నాదు కంటను విశ్వమ్ము నటనమాడు[244]

నింగి కానీ, నేల కానీ లేక చరాచర సమ్మిళితమైన సృష్టి కానీ నిండు మనస్సు ముందు చాలా చిన్నవే. నింగి నక్షత్రాలతో, సూర్యచంద్రులతో అందంగా కన్పించవచ్చు. భావుకుని అంతరంగంలో అనేక అనుభూతులను చిత్రాలుగా ముద్రింపవచ్చు. తీయని స్పందనకు ప్రేరణ ఇవ్వవచ్చు. నేల గిరులతో, దరులతో, ఝరులతో, విరులతో సౌందర్యాన్ని పంచిపెట్టవచ్చు. హృదయంలో ఆర్ద్రమైన రసావేశాన్ని అలలెత్తించవచ్చు. వీటికి మాతృమూర్తి అయిన ప్రకృతి ఈ నాదాలను తనలో సంగమింపజేసుకొని ఒక అపూర్వమైన నిశ్శబ్ద రసరేఖలను అందించవచ్చు. అయితే ఒక్కోమారు ఇవి వికటిస్తాయి. నిఖిల విశ్వాన్ని కలవరపెడతాయి. కానీ, ఉత్తముని మనస్సు ముందు ఓడిపోతాయి.

Who am I!
only a small particle
in flow of creation I may alive or not
It has no gain or loss. Who am I!

Only a finite being
before the infinite sky
But it is a small sheet
in my heart
the huge cosmos
dances on my retina
Like an image of sea on its drop[245]

మనిషి భౌతిక స్వరూపం, జీవితం ఎప్పుడూ ఉండేది కాదు. అయితే క్షణభంగురమైన జీవితం నుంచే విశాల విశ్వాన్ని తన సొంతం చేసుకుంటాడు. సొంతం చేసుకోవడమనేది బుద్ధిబలంతోనూ, భుజబలంతోనూ అయినా కావచ్చు. అయితే కవి అనంతమైన విశ్వాన్ని తనకంటి రెటీనా మీద నాట్యం చేయించుకుంటానన్న మాట ఆయన విశ్వజనీన దృక్పథాన్ని ప్రకటిస్తుంది.

There is not discrimination in sun-light,
rain, coldness, way, tree,
mountain and hire
where ever the flower may be
the fragrance belong to all
and the bondage is the same for all!
The essence of philosophy the soul
Is one to all
the realisation of that oneness is the
meaning of life!
appear like Dawn!
and Awaken the Breathren![246]

తిరుమల విశ్వజనీన భావన అందరికీ ఆమోదయోగ్యమైంది. ఆయన విశ్వంలోని ప్రతి అంశమూ అందరిదని గళమెత్తారు. మనిషి అన్నింటిలో కాంతి ప్రవాహంగా సాగిపోవాలని ఉద్బోధించారు. కాంతిలో, వర్షంలో, బాటలో, చెట్టులో, తేనెపట్టులో, పరిమళంలో, అందరిలో నినదించే ఆత్మలో భేదం. ఈ విషయాన్ని తెలుసుకుంటే జీవిత పరమార్థాన్ని తెలుసుకున్నట్టేనని కవి భావన. అందుకు ప్రతి మనిషి అరుణోదయంలా కనిపించి మానవాళిని మేల్కొల్పాలి. అంతేకాదు, సృష్టి రహస్యాల్ని తెలుసుకొని అందరి గుండెల్లో ప్రతిష్ఠించాలని కోరుతున్నారు.

ఆచార్య తిరుమల తనదైన శైలిలో విశ్వజనీనతా భావాన్ని చక్కగా పాఠకుల హృదయక్షేత్రాలలోకి మళ్ళించి తన స్థానాన్ని ఉన్నతంగా నిలబెట్టుకున్నారు.

## 9. వాస్తవికత

వాస్తవికతను ఆంగ్లంలో 'Realism' అంటారు. తెలుగులో వాస్తవికతకు సత్యం, సహజత్వం, స్పష్టత, సూటిదనం పర్యాయపదాలుగా ఉన్నాయి. ఇదొక బలమైన దృక్పథంగా ఆధునిక కాలంలో ప్రచారాన్ని కలిగి పలువురిని బాగా ఆకర్షిస్తుంది. అయితే దీని పునాదులు పూర్వం నుంచే ఉత్పన్నమైనవని చెప్పాలి. ఈనాడు బాగా పరవళ్ళు తొక్కుతున్న ఈ వాస్తవికతా స్వరూపం ఒకప్పుడు సత్యస్వరూపం, ధర్మపరంగా, దైవలక్షణంగా ఆనాటి సమాజానికి ఇది చక్కని వెలుగుబాటలను వేసింది. ఒక క్రమ జీవన విధానాన్ని అందించింది.



పురాణ పురుషులైన శ్రీరాముడు, ధర్మరాజు వంటి మానవోత్తములు అన్ని కష్టాలను తొలగించుకుంటూ ముందుకు నడిచారు. తమకు ద్రోహం తలపెట్టిన వాళ్ళకు సైతం మేలు కలిగించారు. తమదైన విశిష్టమార్గాన్ని లోకాలకు దానం చేశారు. అట్లాగే శిబి చక్రవర్తి, కర్ణుడు, బలిచక్రవర్తి దాతృత్వంలో ప్రపంచానికి దివ్యమైన పాఠంగా నిలిచిపోయారు.

ఆధునిక కాలంలో గౌతముడు, గాంధీజీ వంటి వాళ్లు జీవితంలోని సత్యాలకు ప్రతీకలుగా నిలిచారు. మనిషిని ఉన్నతునిగా చేయడానికి అవసరమైన అన్ని కోణాలను వాళ్ళు పవిత్రం చేశారు. కరుణతో, అహింసాయుధంతో నిఖిల విశ్వాన్ని గుండెలోని కదలికలుగా చేయవచ్చని వాళ్ళు ప్రబోధించారు.

ఇలాంటి క్రాంతదర్శనుల జీవితాలు అనంతర కాలాలలో బహుముఖాలుగా విస్తరించాయి. అన్ని రంగాలలో మొలకెత్తి చివుళ్ళు వేసి చక్కని వృక్షాలుగా ఎదిగాయి. తీయని సువాసనలను పంచాయి. మధుర ఫలాలను అందించాయి. వాస్తవికత అనేది ఎంత బలవత్తరమైన సాధనమో విదితమవుతుంది.

కవిక్రాంతదర్శి అని, మార్గదర్శి అని అంటారు. ఈ రెండు పదబంధాలు కవి తత్వంలో ఉన్న సహజత్వాన్ని ప్రకటిస్తాయి. ఆయన తన చుట్టూ ఉన్న సమాజం బహిరంతరాలను తన కవితా జ్ఞానచక్షువులతో సంవీక్షిస్తాడు. అలాంటి దర్శనం అతనికి కలిగినపుడు గుండెలో కదలిక ఏర్పడి మెదడులో భావపరంపరల దొంతరలు ఉద్వేగభరితంగా దుముకుతాయి. ఆ ఘర్షణ రచనకు మాత్రమే కాక వాస్తవికతకు కూడా ప్రేరణగా ఉంటుంది.

పూర్వ సాహిత్యంలో కొందరు తెలుగు కవులు వాస్తవికతను చిత్రించిన తీరు సహజంగా ఉంది. వస్తువు ఏదైనప్పటికీ అభివ్యక్తి ఏ కోవకు చెందినప్పటికీ వారి రచనలలో వాస్తవికత సహజత్వాన్ని సంతరించుకొని భవిష్యత్ దర్శనానికి నేపథ్యాన్ని కూర్చింది.

ఆధునికులలో వాస్తవికతను పలు విధాలుగా తిలకించిన సాహితీవేత్తలు చాలామంది ఉన్నారు. మారుతున్న కాలాన్ని అనుసరించి వెలువడుతున్న ప్రక్రియలలో ఈ నూతనోత్తేజాన్ని హ్లాదరణీయమైన రీతిలో వర్ణించి సమాజ చైతన్యానికి సాహిత్యం ఊపిరిగా నిలుస్తుందన్న సత్యాన్ని ప్రకటించిన కవి పండితుల ఆలోచనా సరళి ఆమోదయోగ్యమైంది. ఒకరు సంప్రదాయాన్ని తలకెత్తుకున్నా, ఒకరు అభ్యుదయానికి స్వాగతం చెప్పినా, మరొకరు మరో విప్లవ భావాలను ప్రకటించినా వాస్తవికత సూటిగా చోటు చేసుకుంది.

ఆచార్య తిరుమల రచనలలో వాస్తవికత స్పష్టంగా కన్పిస్తుంది. ఆయన ఏ ధోరణిని అవలంబించినా అది సమాజ శ్రేయాన్ని ఆకాంక్షించి ఉంటుంది. కాబట్టి, ఈ మార్గం ఆయన రచనలలో పరచుకొని ఉంది.

కడలి దాటి తూర్పుకొండ మీటి
శూన్యాన్ని కొలుచుకుంటూ

చుక్కల దారి పట్టిన వాడిని
నా వెన్ను తట్టిన వాడివి
వెనుదిరిగి చూడకు
వెనుక వంత పాడకు
నవ్వుతూ సాగిపో
నా అక్షరాల మల్లెలపై నడిచిపో[247]

పై కవితా పంక్తులలో 'కడలి దాటడం' అంటే కష్టాలను చీల్చుకుంటూ పోవడం. తూర్పుకొండ మీటడం అంటే వెలుగులను సృష్టించడం. శూన్యాన్ని కొలవడం అంటే నిస్తేజంగా ఉన్న సమాజాన్ని జాగృతం చేయడం, చైతన్య భావనను పలికించడం. చుక్కలదారి పట్టేవాడు చంద్రుడూ, సూర్యుడునూ. ఇవన్నీ ఉత్తమునిలో ఉన్న విశేష విషయాలు. మహాపురుషునిలో చంద్రాంశ, సూర్యాంశ రెండూ ఉంటాయి. అవసరమైనప్పుడు ఈ రెండింటిలో ఏది ప్రయోజనాన్ని కలిగిస్తుందో ఆ అంశాన్ని ప్రయోగిస్తూ లోకాన్ని ఆత్మీయం చేసుకొంటాడు. అనురాగ రంజితం చేస్తాడు. నిరామయమైన ఆత్మీయతను, వాతావరణాన్ని సృజిస్తాడు. దాని వికాసానికి, విస్తృతికి చకచకా అడుగులు ముందుకు వేయిస్తూ జీవితంలోని ప్రతి పార్శ్వాన్ని జ్యోతిర్మయం చేయిస్తాడు. అయితే అలాంటి మహాపురుషులు కూడా మార్గాన్ని తప్పే పరిస్థితులొస్తాయి. ఆ వేళ కూడా ఆ మానవోత్తముడు వంత పాడకుండా వంతలలో చిక్కకుండా ఉండాలని కవి నిర్దేశిస్తాడు. చెరిగిపోని చిరునవ్వులతో మల్లెలు అనే మానవత్వపు దారులలో నడిచిపోవాలని ఆయన ఆశిస్తాడు. మనిషన్నవాడు సదా అలాగే ఉండాలని కవి ఆకాంక్ష. ఇదంతా వాస్తవికతే. వాస్తవమైన అంశాలే.

ఆ సెలయేటి గట్టున
ఎన్ని బంజర్లు? ఎన్నెన్ని బండరాళ్ళు?
వాటి గుండెల్లో ఎన్నెన్ని అపశ్రుతులు
ఏడ్పులు? పెడబొబ్బలు
యుద్ధాలు? రక్తాలు?
ఎందుకని? ఎందుకని?[248]

సమాజంలో సిరిసంపదలతో బతికేవాళ్ళూ- వాళ్ళ దాపున పిడికెడు బువ్వ అందనివాళ్ళు ఉంటారు. ఇవి అంతరాలు. వీటిమధ్య ఘర్షణలు రక్తపు నదుల ఉరకల పరుగుల హోరు ఇవన్నీ ఎందుకు? ఈ దృశ్యాలన్నీ వాస్తవికతకు ప్రతీకలుగా నిలుస్తాయి ఇవి యదార్థాన్ని ప్రకటించే అక్షర విహంగాలు.

ఏ విమర్శా పట్టించుకోకుండా
పని చేసేవాడు చేరగలడు గమ్యం
గమ్యం చేరినవాడు ఏం చెప్పినా
కాళిదాసు ఉపమలా రమ్యం[249]



మానవులలో కొందరు పొగడ్తలకు పొంగిపోతారు. తెగడ్తలకు కుంగిపోతారు. మరి కొందరుంటారు. ఎన్ని విమర్శలు వర్షంలా మీద పడుతున్నా అడుగు ముందుకువేస్తూ గమ్యం చేరుకుంటారు. అభ్యుదయాన్ని సమాజం ముంగిళ్ళ ముందు నిలబెడతారు. ప్రజాశ్రేయో రాజ్యాన్ని సాధిస్తారు. అలాంటివాళ్ళు ఏం చెప్పినా కాళిదాసు ఉపమలా మధురంగా ఉంటుంది. కాళిదాసు కవిత్వంలో ఉపమలు కొత్త సింగారాలతో చవులూరిస్తాయి. సంస్కృతంలో ఎందరు కవులు రమ్యమైన కవిత్వాన్ని రాసినప్పటికీ కాళిదాసులా ఉపమానాలు చేర్చి కవిత్వానికి ప్రసాద గుణాన్ని అందించినవాళ్ళు తక్కువే. అందుకే 'ఉపమా కాళిదాసస్య' అన్న సత్యోక్తి ప్రచారంలో ఉంది.

నిజమైన నాయకుడు ఎలాంటివాడో తిరుమల ఇలా చెప్పారు.

ఒక్క సత్యాన్ని పల్కటానికి
ఉండాలి ఉక్కు నాలుక!
ఆ నాలుక ఉన్నవాడే
జనానికి నిజమైన ఏలిక[250]

'వాస్తవం' అనే పదానికి 'సత్యం'తో సన్నిహిత సంబంధమే ఉంది. వాస్తవికత గురించి చర్చించేటప్పుడు 'సత్యం' మీద ఆధారపడటం అనివార్యమవుతుంది"[251] అని డా॥ నందిని సిధారెడ్డి వాస్తవికతకు సత్యానికి మధ్య ఉండే సాన్నిహిత్యాన్ని చెప్పారు. ఆచార్య తిరుమల ఇదే అంశాన్ని శక్తిమంతంగా ఆకర్షణీయంగా పై కవితా పంక్తులలో తీర్చిదిద్దారు. సత్యం పలకడం అంటే అంత సులభమైన పని కాదు. నాలుకను ఉక్కులా మార్చుకోవాలి. అంటే సత్యాన్ని ఆచరించడంలోనూ, పంచడంలోనూ స్థిరమైన గుణాలుండాలన్నమాట. అలాంటి ధీరుడు ప్రజలకు ప్రభువు అవుతాడు. ప్రగతిదారులు వేస్తాడు.

పుస్తకాల గలవు బోలెడు విద్యలు
ఒంట బట్టినంత యొడిసి చూడు
వ్యర్థమెట్టి విద్య అనుభూతి రానిచో
పరమసత్యసూక్తి తిరుమలోక్తి[252]

పద్యానికున్న మకుటంలోనే వాస్తవికతకు మరో పేర్లుగా సత్యం, సూక్తి అనే మాటలు కూర్చుబడినాయి. పుస్తకాలలో మనిషి దేవునిగా మలిచే విద్యలు చాలా ఉన్నాయి. కాని అవి ఒంటబట్టకపోతే నిరర్థకమే కదా! వాటిని హృదయాంకితం చేసుకోవడానికి అనుభూతి ఉండాలి. అనుభూతి స్పందింపజేస్తుంది. అవగాహనకు హృదయాన్నీ, మేథనూ అర్పిస్తుంది. ఫలితాన్నిస్తుంది. అనుభూతి హృదయంలో వలయాలుగా పరిభ్రమించకపోతే అంతా నిరర్థకమే అవుతుంది.

వాస్తవికతను అందరూ సహజంగా చిత్రించలేరు. సమాజాన్ని చూసిన కవీ, సమాజంలోని పలు రకాల సంఘర్షణలను దర్శించిన కవీ, అనుభూతి ఉన్న కవి మాత్రమే వాస్తవ వాదాన్ని ఆకర్షణీయంగా చిత్రిస్తాడు. తిరుమల అలాంటి కవి.

## 10. ప్రతీకలు

ఒక శబ్దం కాని, శబ్ద సముదాయం కాని, ఒక వస్తువునో, క్రియనో, సంఘటననో సూచిస్తూ, అది 'తిరిగి' వేరొక అంశాన్ని సూచించినప్పుడు అది ప్రతీక అవుతుంది. ఆ శబ్దాలు ఏ సాధారణార్థాన్ని సూచిస్తాయో ఆ ఆవరణను దాటి ఉన్న అంశాలను అది ధ్వనింపజేస్తుంది[253] హెచ్.ఎమ్.అబ్రహమ్స్.

ఆంగ్లంలోని "సింబాలిజం" అనే పదాన్ని తెలుగులో ప్రతీక అంటారు. ఈ దృక్పథం ఆంగ్ల సాహిత్య స్పర్శతో తెలుగులో అడుగు పెట్టిందని సాహిత్య విమర్శకులు చెబుతారు. అయితే దేశీయమైన మన తెలుగు సాహిత్యంలో ప్రతీక దృక్పథం ఉంది కాని అంత విస్తృత స్వరూపాన్ని కలిగిలేదు. అక్కడక్కడా క్వాచిత్కంగా మాత్రమే కన్పిస్తుంది. ఆధునిక తెలుగు సాహిత్యంలో కొందరు విమర్శకులు ఈ ప్రతీకవాదాన్ని గురించి విస్తృతంగా ప్రస్తావించారు. ఇది మొదట సంగీతం చిత్రలేఖనం లాంటి లలితకళలకు పరిమితమై ఆ తరువాత సాహిత్యంలో అడుగు పెట్టిందని విమర్శకులు చెబుతారు[254].

ఎడ్మండ్ విల్సన్ ఈ ప్రతీకవాదాన్ని ప్రత్యేకంగా నిర్వచించి సాహితీ ప్రపంచానికి అందించాడు[255]. ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యం ఆంగ్ల పండితులు ప్రతీకల గురించి చర్చించిన అంశాలను సుస్పష్టంగా వివేచించి వ్యాఖ్యానించారు. "పాశ్చాత్య ప్రపంచములో వెలువడిన యీ ప్రతీకవాదము శబ్దమునకు భావప్రకటనము కాక సూచనయే ప్రధానమని, వాతావరణ కల్పనయే ప్రధాన లక్షణమని భావించినది. అందుకు ప్రతీకవాదులు వెలుతురును జ్ఞానమునకు, చీకటిని అజ్ఞతకు, వసంతమును జన్మకు, శిశరమును మృత్యువునకు ప్రతీకలుగా స్వీకరించిరి. ఈ వాదము తాత్విక దృక్పథముతో ముడిపడియుండుట గమనింపదగినది[256] అన్నారు.

మల్లార్మే అనే ఆంగ్ల పరిశోధకుడు "భావ ప్రకటనకు వాతావరణ కల్పనకు తోడ్పడే శబ్దాలు ప్రతీకలని" [257] చెప్పారు. ఈ విమర్శకుల అభిప్రాయాలలో కొంత వ్యత్యాసం ఉన్నప్పటికీ ఒకే అర్థాన్ని సూచిస్తుంది. "ప్రతికలనర్థము చేసికొన్నచో అపూర్వానందము కలుగును. లేనిచో అయోమయమనిపించును"[258] అన్న పద సంపుటి సత్యసన్నిహితమైంది.

జీవితం కానీ సాహిత్యం కానీ సమాజం కానీ అర్థం చేసుకోవడం మీద ఆధారపడి ఉంటుంది. ఆలోచన ప్రయోజనాన్ని కలిగి ఉన్నప్పుడు అందుకు తగిన అధ్యయనం ఉన్నప్పుడు చక్కని వ్యక్తిత్వం తోడైనప్పుడు ప్రతిదీ సాకల్యంగా సుబోధకమవుతుంది. ఈ ప్రతీకలూ అంతే.

ఆధునిక తెలుగు కవులలో కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ, ఆరుద్ర, దాశరథి, సినారె, శేషేంద్ర, వేగుంట మోహనప్రసాద్, నందిని సిధారెడ్డి, సుమనశ్రీ వంటి కవులు ప్రతీకలను తమ కవితలలో సంయోజన చేశారు.



ఆచార్య తిరుమల తన కవితా సర్వస్వంలో ప్రతీకలను ఔచితీమంతంగా వాడుకొని సాహితీ జిజ్ఞాసువులకు హృదయానందాన్ని కల్పించారు.

బిక్కు బిక్కుమంటున్న విశ్వం
తడిసిన ఇసుక తిన్నెలు-నగ్న సమాజం
కనుల కాంతిని, హృదయ కవాటాల్ని
ఆశాపాశాన్ని, ఆర్ద్రభావాల్ని
దైనందిన జీవితాన్ని ప్రతిబింబిస్తాయి
కవితను ఆమ్రేడించి
కాషాయాంబరాన్ని చుంబిస్తాయి
నీలో నిజమైన కవిలేస్తాడు
నిప్పులా అప్పుడే చెలరేగుతాడు[259]

ఈ కవితకు సంఘటనలు, సమస్యలు వస్తువులయినాయి. విశ్వం అందంగా లేదు. అనేక సంఘటనలతో, సంఘర్షణలతో దిక్కుచెడి బిక్కుబిక్కుమంటుంది. ఈ ప్రాపంచిక నిర్వేదాన్ని చూచి మనిషి కుంగిపోకూడదు. శిరసెత్తుకొని ఎత్తుగా నిలబడాలి. అప్పుడు విశ్వానికి కొంత ఊరట కలుగుతుంది. ఉద్వేగాన్ని దాటివేసి ప్రయోజనాన్ని చేకూర్చే ఉపదేశం మిగులుతుంది. పుడమి అంచున తడిసిన ఇసుకతిన్నెల కుచ్చిళ్ళు అనడం సాభిప్రాయం కాక అది పచ్చదనానికీ సౌభాగ్యానికీ సంకేతంగా తీసుకోబడింది. పుడమి అంచున ఇసుకతిన్నెల కుచ్చిళ్ళు తడిస్తే అది ఎప్పటికీ తడి ఆరిపోని విధంగా ఆర్ద్రంగా అందంగా ఉంటుందని కూడా సంకేతితమైంది. ఈ పద సముదాయం ప్రతీకను శక్తిమంతంగా ఆకర్షణీయంగా హత్తుకొని ఉంది. పతిత మనస్సుల మీద భావ చిత్రాలను కూడా వేసి పెడుతుంది. ఈ ఆనందహేలను తలచుకొని పొంగిపోకూడదని పొలికేక వేయకూడదని కవి అభివ్యక్తి. శిశిరాన్ని హరితచందనాన్ని సమంగా మోసినప్పుడే జీవితానికి అర్థం ఉంటుంది. ఔన్నత్యం సిద్ధిస్తుంది. సమాజం డబ్బుకి శరీరాన్ని పరిచే స్త్రీ నవ్వులా కృత్రిమంగా ఉంది. డబ్బు అందేవరకే ఆమె హోయలంతా. నవ్వంతా. కవ్వింత అంతా. అసహజతత్వం, అమానవీయ తత్వం గూడుకట్టుకొని ఉన్న సమాజ దృశ్యాన్ని యదార్థంగా చూడమంటారు కవి. ఆ వాస్తవాలను చూపులలోనే బంధించిపెట్టమంటారు కవి. 'బిక్కుబిక్కుమంటున్న విశ్వం – తడిసిన ఇసుకతిన్నెలు – నగ్న సమాజం – కనులకాంతిని – హృదయ కవాటాల్ని-ఆశాపాశాన్ని- ఆర్ద్రభావాన్ని దైనందిన జీవితాన్ని ప్రతిబింబిస్తాయి' ఇవన్నీ మనస్సు సమాజంలోని కదలికల స్వరూపాలే.

పేదవాడు కవితావస్తువు అవుతూ ఉన్నాడు. అతడు ఎన్నో విధాలుగా పీడింపబడుతూనే ఉన్నాడు. వంచింపబడుతూనే ఉన్నాడు. ఈ వస్తువును అనేకమంది కవులు తమ చార చక్షువులతో దర్శించి పొర్లుతూ వస్తున్న భావుకతతో ఒక రమణీయ చిత్రంలా రసలోకానికి అందించారు. తిరుమల పేదవాడు అనే దృశ్యాన్ని ప్రతీకలతో వర్ణించారు.

కొండలు
కడలి కోసం చాచిన చేతుల్లాంటి నదీ నదాలు-
ఆనకట్టల హార్మోనియం మీద నర్తిస్తూ
'ఆనందభైరవి' ఆలపిస్తుంటే-
విరహంతో కడలిరాయుడు ఉప్పబడి-చప్పబడి
విదేశ నాగరికతా నౌకల
వీర విహారాలు చప్పరిస్తూంటే
ఆవేశం- అనుకరణ తప్ప సృజనాత్మక శక్తి
విపణిలో చెల్లుబాటు కాకుంటే-
కోణార్కలో సూర్యుడు సైతం తన
గర్భగుడిలో చీకటినే చీల్చలేకపోతుంటే-
ఉదయించే విజ్ఞాన కిరణాల విచ్చిన్న కరస్పర్శతో
శాంతిదేవి మేధస్సులో అజీర్ణవ్యాధి ముదురుతుంటే
ఎండినచెట్టు మీద నోరెండిన కాకుల్లాంటి
పేదచూపుల బంజరు భూములు
నీటి చుక్క కోసం నిక్కి చూడక చేసేదేమిటి?
ఎవరీ దాహాన్ని తీర్చేది?
ఎవరీ మౌనాన్ని చీల్చేది?
ఎవరీ బంజర్లలో బంగారు కాంతులు పండించేది?
నాలో నువ్వా? నీలో నేనా?
ఇద్దరిలో మనమా? మనమా??[260]

కొండలు, నదీనదాలు కడలికోసం చేతులు చాచినట్టుగా ఉన్నాయి. ఆనకట్టలనే హార్మోనియం తంత్రుల మీద నర్తిస్తూ ఆనందభైరవి పాడుతుంటే కడలిరాయుడు నిరీక్షించి నిరీక్షించి నిరీక్షణలో కాగివేగి ఉప్పబడి చప్పబడి నిస్తత్తువగా మారిపోయాడు. నదీనదాలు కొత్తగా అవతరించిన ఆనకట్టలు అనబడే హార్మోనియం మీద అంటే సరికొత్త ప్రియుని అంకపీఠం మీద ఆడుతూ ఆనందభైరవి పాడుతున్నాయని కవి భావన. అయితే కవిత ప్రారంభంలో 'కొండలు' అనే పదాన్ని కవి దేనికి ప్రతీకగా సంయోజన చేశాడనే శంక ఉదయిస్తుంది. నదీనదాలు పుట్టడం ప్రవాహ వేగాన్ని సంధించుకోవడం ఈ కొండల వల్లనే. నిజంగా ఈ కొండలు నదీనదాలకు తల్లీతండ్రీనూ. అయితే ప్రియురాళ్ళు లేకపోయేసరికి సముద్రుడు చప్పబడిపోయాడు. నిండుతనాన్ని కోల్పోయాడు. నిస్తేజంగా ఉండిపోయాడు. ఇక్కడ కడలిరాయుడు అంటే సమాజమే. విదేశీ నాగరికత నౌకల వీరవిహారం చప్పరించడమంటే పరదేశీయమైన సంస్కృతిని మోహించడం, అనుసరించడం అన్నమాట. ఈ ప్రభావం అనుకరణని వృద్ధి చేస్తుందే తప్ప సృజనాత్మకమైన శక్తినీ, సహజమైన జీవన విధానాన్నీ



సంధించదు. ప్రయోజనమంతమైన ఆలోచనా సరళిని ప్రేరేపించదు. ఈ స్థితి సమాజం ఎదుగుదలకు ఎంతమాత్రమూ సహకరించదు.

ఆచార్య తిరుమల ఇదే కవితలో మరొక ప్రతీకను ప్రయోగించారు. సూర్యుడు తన కోణార్క గర్భగుడిలో ఉన్న చీకట్లను చీల్చివేయలేకపోవడం. ఇక్కడ సూర్యుడు మేధావి అయిన మనిషికి ప్రతీక. గర్భగుడి సమాజానికి ప్రతీక. మానవుడు తన విస్తృతమైన శక్తి సామర్థ్యాలను తనవరకే పరిమితం చేసుకుంటున్నాడు. విలువైన కాంతిమంతమైన తన మేధోజ్ఞానాన్ని తనవరకే పరిమితం చేసుకుంటున్నాడు. అలాంటప్పుడు వ్యక్తి ప్రయోజనంతో పాటు సమాజశ్రేయస్సు కూడా విచ్ఛిన్నం అవుతుంది. తద్వారా మనిషి సృజించుకున్న ఆశయాలు మలినమవుతాయి. మనుగడ అంధకార బంధురం అవుతుంది. అంతేకాక అదుపు తప్పిన అమానుష శక్తులు వ్యక్తినీ సమాజాన్ని కలవరపెడతాయి. కవ్విస్తాయి. ఆడిస్తాయి. ఒక్కొక్కప్పుడు నామరూపాలను సైతం తుడిచిపెడతాయి. ఇదంతా మనిషి పొలిమేరలను సృష్టించుకోవడమే కాకుండా తన వలయాన్ని కూడా ప్రభావితం చేయలేకపోవడం వల్లనే జరుగుతుంది. అప్పుడు జీవనధాతువులు ఉడిగిన చెట్టులా సమాజం మిగిలిపోతుందే తప్ప శోభలను వెదజల్లదు. పోతే- ఆ చెట్టుకొమ్మల మీద కాకులు నోరెండిపోయి ఉన్నాయి. నోరెండి దాహంతో తపించిపోతున్న కాకులు, ఆర్తితో జీవననాదాన్ని బరువుగా పలికిస్తూన్న కాకులు నిరుపేదలకు ప్రతీకలు. వాళ్ళ జీవితాలు బంజరుభూముల లాంటివి. నీటిచుక్కలు అనబడే సౌభాగ్యం కోసం ఎదురుచూస్తుంటారు. వాళ్ళ దాహాన్ని ఎవరు తీరుస్తారు. ఆవేదనతో కుములుతున్న మౌనాన్ని ఎవరు పలికిస్తారు. ఎవరు వాళ్ళను ప్రశాంతమైన జీవనతీరాల మీద ఆనంద మందిరాలలో జీవింపజేస్తారు. మళ్ళీ వాళ్ళ మనుగడలో బంజరుభూముల లాంటి విషమ పరిస్థితులు అడుగు పెట్టకుండా చూస్తారు. ఎవరు? ఎవరు అనే మాటలో దాగిఉన్నది ఎవరు? నిజంగా ఇది ఎప్పుడూ ప్రశ్నార్థకమే.

అక్షరాల అంతస్తత్వాన్ని అనుకున్నంత సులభంగా అందుకోలేం. కవితాక్షరాల విరాట్ రూపాన్ని క్షణంలో పరిశీలించి హృదయంలో సంధించుకొని ఆనందించుకోలేం. గాఢంగా యోచించినప్పుడు, హృదయం కవితామయ మయినప్పుడు దర్శన దృక్పథం ఆలోచనాలోచనాల అలలమీద సాగినప్పుడు వ్యక్తిత్వంలో పూర్ణత్వం తరంగితమయినప్పుడు. భావుకత్వం చిమ్ముకొని వచ్చినప్పుడు ఆర్ద్రహృదయం అనురాగంలో తడిసినప్పుడు కొన్ని భావాలు అలజడి రేపినప్పుడు ప్రకృతిలోని నాదం చిత్రాలుగా కనిపించినప్పుడు మాత్రమే కవితాక్షరాలకు కనిపిస్తాయి. అప్పుడు అవి అక్షరచిత్రాలు అవుతాయి. రేపటి దర్శనాలవుతాయి. మనిషిని దేవునిగా రూపు కట్టించే ఆగమసూక్తులవుతాయి. ఈ అక్షరాల విశిష్టతను తిరుమల ప్రతీకలతో అభివర్ణించి తన ప్రత్యేకతను చాటుకొన్నారు.

ఇక్కడ సరస్వతీ తీర సభాసీమలో-
రాళ్ళు కవిత్వపు జవరాళ్ళవుతాయి

ముళ్ళు విమర్శల చూపుడు వ్రేళ్ళయి లక్ష్యాలు నిరూపిస్తాయి
హిమాలయాలు మేఘ సందేశాల్లో కరిగి ప్రవహిస్తాయి
చీకట్లు కోకిళ్లుగా మారి
పంచమశ్రుతి శృతులు సవరిస్తాయి
ఇక్కడి అక్షర భిక్ష స్వీకరించటానికి
ఆది భిక్షువే తరలి వస్తాడు
వర్ణాలు లేని స్వర్ణయుగాల
ఆత్మశంఖాలు పూరించి
సత్యసుందరంగా తరిస్తాడు[261]

సరస్వతి అంటే ఉత్తర భారత భూముల్లో ప్రవహిస్తున్న నది కాదు. చదువుల తల్లి అని అర్థం. అక్షరాల స్వరూపాన్ని అంతస్తత్వాన్ని సమగ్రంగా అవగాహనకు తెచ్చుకొని ప్రయోజనాన్ని సాధించడమని అర్థం. ఆమె అక్షర భారతి. కవితా భారతి. ఆమె సన్నిధిలో రాళ్ళు అందాల రమణులుగా మాత్రమే కాదు; కవిత్వపు జవరాళ్ళుగా మారుతాయి. ముళ్ళు ముళ్ళుగా తాకుతూ దేహాన్ని బాధపెట్టవు. అవి సద్విమర్శలుగా చూపుడు వేళ్ళుగా లక్ష్యాలను చూపించడమే కాక నడిపిస్తాయి. ఈ పంక్తులలో కవిత్వపు జవరాళ్ళు, ముళ్ళు విమర్శల చూపుడువేళ్ళు అనేవి ప్రతీకలు. సహజంగా మంచు వేడికి కరిగిపోతుంది. హిమాలయమూ అంతే. కాని కవి భావనలో అలా జరగడం లేదు. అవి మేఘ సందేశాలలో కరిగిపోతున్నాయి. అయితే– మేఘసందేశాలలో కరిగిపోవడం అనేది ఏమిటి? ఔను! మేఘసందేశం హృదయాన్ని ద్రవింపజేసే కావ్యం. మేఘుని ద్వారా పంపబడిన యక్షుని సందేశం కాళిదాసుని కనకవాహినిలో తడిసి ఆర్ద్రీకృతమయింది. అనురాగ స్నానం చేసింది. ఆ కావ్యం శిలలాంటి హృదయాన్ని కూడా చెమ్మగిల్లజేస్తుంది. అంతేకాదు, వలపు జ్వాలలను కూడా జ్వలింపజేస్తుంది. ఇక హిమాలయాల సంగతి వేరే చెప్పవలసిన పనిలేదు. ఈ దృశ్య సన్నివేశం పులకితం కావటానికి అక్షరమే కదా నేపథ్యం. ఔచిత్యమైన స్వరరాగం ప్రతీకాత్మకతను భజించుకొని ఒక రసలోకాన్ని అవతరింపజేస్తుంది. ఇక చీకట్లు– అవి భయానికి సంకేతాలు. అవి కోకిలలుగా మారి పంచమంలో గళమెత్తి స్వరరాగాన్ని స్వరిస్తాయి. అప్పుడు– ఇక్కడ అక్షరభిక్షను స్వీకరించడానికి ఆదిభిక్షువైన శివుడే కైలాస శిఖరాల నుంచి తరలివస్తాడు. ఆ స్వామి వర్ణాలు లేని స్వర్ణయుగాల ఆత్మశంఖాలను పూరిస్తాడు. సత్యసుందరంగా తరింపజేస్తాడు. కవి అక్షరానికి ముఖ్యంగా భారతభారతికి ఆత్మలాంటి అక్షరాల విశిష్టతలను ప్రతీకాత్మకంగా అభివర్ణించారు.

తిరుమల కవికి అందజేస్తున్న సందేశాన్ని ప్రతీకలతో అపురూపకంగా చిత్రించారు.

ఓ కవీ!
ఉగ్గు గిన్నెలాంటి యీ సమాజంలో
అనుభవాల చనుబాలు రంగరించే
కవితా మాతృత్వాన్ని కోరుకో
శిశు హృదయ నైర్మల్యంతో
అమృత పథాన్ని చేరుకో[262]

ఇందులో సమాజానికి ఉగ్గుగిన్నె, అనుభవాలకు చనుబాలు, కవితకు మాతృత్వం అనేవి ప్రతీకలు. ఉగ్గుపాలలాంటి సమాజంలో అనుభవాల చనుబాలు రంగరించే కవితా మాతృత్వాన్ని ఎంచుకోమంటున్నాడు. ఆ వెనుక శిశు హృదయం లాంటి నిర్మలత్వంతో అమృతపథాన్ని అందుకొని ఆనందశిఖరాలు చేరుకోమంటారు.

చైతన్య రక్తాన్ని
తూర్పుకన్నె పాదాలకు
అరుణసంధ్య పారాణిగా పులిమి
సూర్యపద్మంగా
ఉదయిస్తున్న నా కలం
దుర్బల జాతికి అందే ఫలం[263]

“ఉపమానం ప్రతీక అవదు. అలాగే రూపకం కూడా అవదు. అది కేవలం అలంకారం. ఒకానొక వస్తుస్థితిని ఎరుకపరచడానికొక సాధనం” అని మందేశ్వరరావు ప్రతీకల సహజమైన స్థితిని వ్యాఖ్యానించారు. అయితే తిరుమలపై కవితా పంక్తులు పదబంధాలుగా, అలంకార బంధురాలుగా మాత్రమే కాక ప్రతీకలుగా కవితా సౌందర్యాన్ని ఇనుమడింపజేస్తున్నాయి. చైతన్యరక్తం, తూర్పుకన్నె, అరుణసంధ్య, సూర్యపద్మం ఇవన్నీ ప్రతీకలతో ధ్వనిస్తున్న పదబంధాల అందాలు. తిరుమల సన్నివేశానికి అనువైన ప్రతీకలను తమ కవితలో చిత్రించి రచనకు సార్వజనీనత్వాన్ని కల్పించారు.

‘ప్రేమ’ అనే రెండక్షరాలలో ఈ విశాల విశ్వం ఇమిడి ఉంది. ఆ ప్రేమ అనుభవ స్థితి రూపాలు అనేకంగా ఉన్నాయి.

ప్రేమ బాష్పాలతో సత్య ద్వారాన్ని అలంకరించు
నీ ఉనికిని ఈ నిరాశల ఎడారుల మీద చిలకరించు[264]

కన్నీళ్లు రెండు రకాలు. ఎగిసిన ఆనందం వల్ల కురిసేవి. గుండె మీది గాయాల వల్ల రాలేవి. ఈ రెండు విధాలైన బాష్పాలకు ఎన్నో నిర్వచనాలున్నాయి. నిర్వచనాలను వివరించే స్థితి జిగి బిగి ఉండడానికి ప్రతీకలు బాగా దోహదపడతాయని తిరుమల తెలుసు. పై కవితా పంక్తులలో ‘ప్రేమ బాష్పాలు’ ‘సత్యద్వారాలు’ అనేవి సమాసంగా కనిపించినా తరువాత పాదంలో ‘నిరాశల ఎడారులు’ అనే పదబంధం ఉన్నా వస్తువునూ, అభివ్యక్తినీ పరిశీలిస్తే వీటిని ప్రతీకలుగా భావింపవచ్చు. నిరాశ ఎడారికి ప్రతీక. నిరాశ మనిషిని బాగా కుంగదీస్తుంది. విచలితుణ్ని చేస్తుంది. మానసికంగా, శారీరకంగా బలహీనున్ని చేస్తుంది.

భవిష్యత్తును నిరోధిస్తుంది. ఎడారి కూడా అంతే. అడుగు ముందుకు సాగనీయదు. గమ్యాన్ని చేరనీయదు. అనేక ఇసుక తుఫానులు గాయాలను చేస్తాయి. ఒక్కమారు ప్రాణాలను తీసివేస్తాయి. ఇదంతా తెలిసిన కవి ఎడారిని నిరాశకు ప్రతీకగా ఎన్నుకొని ఆయన భావించుకున్న ఆశయాన్ని స్పష్టంగా ప్రకటించారు.

అల్పాక్షరాలలో అనల్పార్థ రచన చేసేవాడు నిజమైన కవి అని పాల్కురికి చెప్పారు. తిరుమల ఈ కవితోక్తికి తానే స్వయమైన ప్రతీక అయినవారు-

బాల్యం-పాఠ్యపుస్తకం
కౌమారం-కథల పుస్తకం
యౌవనం-సెక్సు పుస్తకం
వార్థక్యం-రిఫరెన్స్ పుస్తకం[265]

ఇది నాలుగు పొట్టి పాదాల కవిత. విప్పి చూస్తే ఈ నాలుగు పాదాలూ నాలుగు మహావిమర్శ గ్రంథాలు అవుతాయి. సమాజంలోని ప్రజాస్వామ్య విలువలతో పాటూ, పారమార్థికాంశాలతో పాటూ, మానవ ధర్మశాస్త్రానికి సంబంధించిన భావనలు నిండుగా ఉన్నాయి. ప్రతీకలు వీటిని మరిన్ని సాహిత్య మూల్యాలతో భాసించేటట్టు చేసింది. బాల్యం పాఠ్యపుస్తకానికీ, కౌమారం కథల పుస్తకానికీ ప్రతీకలుగా గ్రహించారు కవి. మనిషి జీవితంలోని ఈ దశలన్నీ చాలా విలువైనవి. చక్కటి మూల్యాలతో ఒప్పుతున్న జీవితాన్ని కవి ప్రతీకలతో నింపివేశారు. వ్యక్తి జీవితం సామాజిక జీవితం ఈ రెండూ పెనవేసుకొని పోయాయి. ఈ సమ్మేళనంలో ఒక దార్శనికమైన పూర్ణస్థితి కన్పిస్తుంది. ఈ విశాల భావాల స్పర్శతో మనోలోకం ఉన్మత్తతనూ, ఉద్వేగాన్నీ, సౌజన్యాన్నీ సంతరించుకొని సమారాధనా తత్పరతతో బాహిరమూ, ఆంతరమూ అయిన లోకాన్ని ఆగామి కాలానికి కరదీపిక చేస్తుంది. ఇదంతా కవి పోహళించిన ప్రతీకల వలన సమాహితమైందని భావింపవచ్చు..

భగవంతుణ్ని స్తోత్ర పాఠాలతో ముంచెత్తితే, రథాల మీద ఊరేగిస్తే భక్తి అనబడదు. వాస్తవమైన భక్తిరూపాలూ, వాటి అర్థాలూ వేరుగా ఉంటాయి. అయితే జీవుడు భగవంతుని ధ్యానంలో లీనమైనప్పుడు అతని స్థితి మరొక విధంగా ఉంటుంది. దీని పరాకాష్ట స్థితినీ, రూపాన్నీ కవి ప్రతీకలతో కవితాక్షరాలను చేశారు.

నేను నీ జ్ఞానఖడ్గం మీద
నడుస్తున్న నీ లక్ష్యాన్ని
ఆలయంలోని శిలాంతర్గత
అక్షర గమ్యాన్ని[266]

జ్ఞానఖడ్గం అనేది లక్ష్యాన్ని చేరుకోవడానికి ఏర్పరచుకొన్న సాధనం. సహజంగా లోహంతో చేయబడిన ఖడ్గం మీద నడచినప్పుడు ఏర్పడే గాయాలూ, వాటివల్ల పుట్టే బాధలూ దేహాన్ని వివశం చేస్తాయి. కాని జ్ఞానం అనే ఖడ్గం అంత పదునైంది అనిపిస్తుంది



కాని అది ప్రసరింపజేసే వెలుతురు ఇచ్చే ప్రశాంతత చేకూర్చే సౌఖ్యం జీవితానికి హాయిని కలిగిస్తుంది. వర్తమానంలోనూ, భవిష్యత్తులోనూ మూగిన కరుడు గట్టిన చీకట్లను అది కోసివేస్తుంది. అక్షరాల ప్రభాతకాంతులను మేధలోకి చేరుస్తుంది. మనస్సును మందిరంగా నిర్మాణింపజేస్తుంది. ఇక్కడ కవి భావించిన ప్రతీక నిగూఢంగా ఉంది. ఆలయంలోని శిలాంతర్గత అక్షరగమ్యం అనే వస్తువులో అక్షరగమ్యం ప్రతీక. శిలాంతర్గత గమ్యంలో ఉన్న అక్షరావళి సమస్తమైన జీవన వేదాలకు సంకేతమైనది. అసాధారణమైనది. తపస్సు అనే మిషతో ఆ అక్షర గమ్యాన్ని అందుకోవడం సాధ్యమవుతుంది. ఈ ప్రతీకలో ఆధ్యాత్మిక విలువల ప్రత్యేకత సంధింపబడింది.

ఆర్తిని భజిస్తున్న భక్తుని ఆత్మ అన్వేషణ, ఆరాధన అనే అంశాలతో నిండి ఉంటుంది. ఇవి అనేక విధాలుగా ప్రవహిస్తాయి. ఆ తపస్సులో ఎన్నో విఘాతాలు నిలదీస్తాయి. ప్రశ్నిస్తాయి. దాడి చేస్తాయి. ఆకర్షిస్తాయి. స్థిరచిత్తం ఈ విఘాతాలకూ, ప్రలోభాలకూ లొంగిపోకుండా నిశితంగా ఉంటుంది. కవి ఈ భావనను ప్రతీకమయం చేశారు.

శృంగార భావాల్లో ఏరులు పొంగుతాయి
విత్తనాలు భూమిని చీలుస్తాయి
వియత్తలం ఎర్రగా నవ్వుతుంది
ఆత్మ సముద్రంలో ఎక్కడో ఒక
మహా వాయుగండం బయలుదేరుతుంది[267]

ఏరులు శృంగార భావాలకు ప్రతీకలు. అయితే కవి భావించిన శృంగార భావాలు దేహపరమైనవి కాక ఆత్మపరమైనవి. శారీరక సౌందర్యం క్షణికమైనది. హృదయగతమైన అందం శాశ్వతమైనది. హృదయలాలిత్యమే. నిజమైన సమాజ అవతరణకు ఆధారంగా నిలుస్తుంది. ఆకర్షణీయమైన, బలమైన సంస్కారధారను ప్రసరింపజేస్తుంది. శృంగార భావాలను ఏరులకు ప్రతీకగా గ్రహించడం వల్లనే నాణ్యమైన అర్థస్ఫూర్తి వస్తువుకు చేకూరింది. కవి మరొకచోట వియత్తలం ఎర్రగా నవ్వుతుంది అనటం ప్రతీకలోని ఒక అంశం. ఎరుపు త్యాగానికీ, సహనానికి గుర్తు. ఉదయిస్తున్న సూర్యుడు ముందుగా నింగివైపు ఎరుపు రంగును పులుముతాడు అది- పిదప నేలను స్పర్శిస్తుంది. ఆ వర్ణం క్రమక్రమంగా తెల్లగా మారుతూ జగాన్ని జ్యోతిర్మయం చేస్తుంది. కవి అనేక దృశ్య పరంపరలను ప్రతీకకు భూమికగా పరిణామంగా ఆవిష్కరించారు. ఆత్మను సముద్రానికి ప్రతీకగా భజిస్తారు. ఆత్మ అమానవీయమైన పోట్లతో కల్లోలమైనట్టుగానే సముద్రం తుఫానులూ, అగ్నిపర్వతాల పేలుళ్ళతో పొర్లుతూ చెలరేగుతుంది. మేలిమి గుణాలతో ఒప్పిన ఆత్మ ఎట్లా పరవశిస్తుందో తనలోని మేలిమి రత్నాలతో సాగరం ఆనంద తాండవం చేస్తుంది. వాటితోనే కీర్తిమూర్తి అవుతుంది. సముద్రం లక్ష్మికి పుట్టిల్లు అవటం వలన ఆధ్యాత్మిక స్థితిని సంతరించుకుంది.

సూర్యుడొక అగ్ని గ్రంథం
చంద్రుడొక వెన్నెల కావ్యం

నక్షత్ర మండలమొక
అగణిత గణిత శాస్త్రం[268]

అగ్నిగ్రంథం సూర్యునికి ప్రతీక. వెన్నెల కావ్యం చంద్రునికి ప్రతీక. అగణిత గణితశాస్త్రం నక్షత్ర మండలానికి ప్రతీక. అగ్నిగ్రంథం, వెన్నెలకావ్యం ఈ రెండూ భగవంతుని రూపాలలోనివే. ఇవి భగవంతుని చేత లోకానికి అందింపబడినవే. మానవాళికి ఈ రెండూ సమ్యక్ జీవన విధానాలే. ఈ వాత్సల్యతత్వాన్ని ప్రతీకలతో మరింత సౌందర్య విలసితం చేశారు.

తిరుమల తాను చేపట్టిన అన్ని ప్రక్రియలలో ప్రతీకలను ప్రయోగించి కవితకు చైతన్య గుణాన్ని కల్పించారు.

## 11. అధిక్షేపం

సాహిత్యంలో అభివ్యక్తి ధోరణులు కొన్ని ఉన్నాయి. వాటిలో అధిక్షేపం చాలా విశిష్టమైంది. ఆకర్షణీయమైంది కూడా. శక్తివంతమైంది. చమత్కారపూరితమైంది. వాడి మాటలతో హృదయాన్ని గాయం చేయడం కంటే సుకుమారమైన శబ్దజాలంతో ఎదుటివాని మనస్సులో పరివర్తనం కలగజేయడం దీని ప్రత్యేకత. ప్రముఖ సాహిత్య సిద్ధాంతకర్త డా॥ కె.గోపాలకృష్ణారావు "కీలెరిగి వాతపెట్టినట్లు అధిక్షేప కావ్యముల ధోరణి యిదియే"[269] అని నిర్వచించారు. ఆధునిక తెలుగు కవిత్వంలో అధిక్షేప రచయితగా విశిష్టులైన ఆచార్య పేర్వారం జగన్నాథం "ఎదుటివాన్ని మెత్తని మాటలతో ఎత్తిపోవడం దీని లక్షణం. ఆయా సన్నివేశాలకు తగినట్లుగా సందర్భోచితంగా కవి తన అభిమతాన్ని పూలకొరడాగా పేనికొట్టడం దీని ప్రత్యేకత. సాంఘిక దురాచారాల్ని పరిహసిస్తూ కవి కత్తిలాంటి పదాలతో శరీరానికి గుచ్చుకోకుండా, గుండె నొచ్చుకోకుండా శస్త్రచికిత్స చేయడం దీని వైలక్షణ్యం"[270] అన్నారు.

సమాజాన్ని మార్చడానికి, వ్యక్తుల మనస్తత్వాలలో మార్పు తేవడానికి తీవ్రమైన ధోరణులు ఉపయోగపడవు. అప్పుడప్పుడు సుకుమారమైన మాటలు ఉండాలి. హెచ్చరికను మోసే పదజాలమూ ఉండాలి. సుతిమెత్తని మాటలతో వాడియైన భావాలను మేళవించి చెప్పే ఆవేశ దృక్పథాలూ ఉండాలి. ఎంతటివాడైనా సరే పూలకొరడా లాంటి మాటల దెబ్బలతో సంతోషిస్తాడే కాని ఆవేశపడడు. అందులో కొరడాముదులు కరకుగా తాకినా మురిసిపోతాడే కాని మిడిసిపడడు. సాహిత్యంలో అధిక్షేప భావానికి ప్రత్యేకమైన స్థానం ఉంది.

'అధిక్షేపం' అనే శబ్దాన్ని చాలామంది పండితులు తరచిచూశారు. అధిక్షేప శతకాలను వ్యాఖ్యానించిన డా॥ కె.గోపాలకృష్ణారావు "అధిక్షేపమునకు నిరసనము- విమర్శనము- ఉపాలంభనము- విడంబనము- హేళనము- దూషణము- అనునవి ఛాయామాత్రముగ పర్యాయవాచి పదములు"[271] అని తెలిపారు. ఇవి మాత్రమే కాక చమత్కారం, పేరడి, వ్యంగ్యం అనేవి కూడా అధిక్షేపాన్ని తెలిపేవే.



అధిక్షేపం మానవుని వ్యావహారిక జీవితంలో సర్వసాధారణంగా ప్రయుక్తమయ్యేదే. సాహిత్యాన్ని పరిశీలిస్తే అనాదినుంచీ అమర సాహిత్యం నుంచీ అక్కడక్కడా అధిక్షేప ధోరణులు కన్పిస్తున్నాయి. గీర్వాణ సాహిత్యంలో భాగమైన వేదాలూ, పురాణాలూ, ఉపనిషత్తులూ వీటిలోనూ అధిక్షేపభావనలు ఉన్నాయి.

తెలుగులో వేములవాడ భీమకవి, శ్రీనాథుడు, తెనాలి వంటి కవులు తమ చాటువులలో ఈ ధోరణిని ప్రవేశపెట్టారు. ముఖ్యంగా శ్రీనాథుడు పల్నాడుకు వెళ్ళినప్పుడు 'రసికుడు పోవడు'[272] చిన్న చిన్నరాళ్ళు[273] 'దంబు సూపి ధరాతలంబున'[274] 'ఎనిమిది సెపితిని కవితము'[276] వంటి పద్యాలు తెలుగులో విస్తృత ప్రచారాన్ని పొందాయి. వేములవాడ భీమకవి పద్యాలు కూడా తెలుగు రసనలపై నేటికీ ఆడుతున్నాయి. ఆధునిక కవితాయుగంలో అధిక్షేపం ప్రధానవృత్తంతో వెలువడిన రచనలు చాలా తక్కువే అని చెప్పాలి. శ్రీశ్రీ సిరిసిరిమువ్వ, పేర్వారం జగన్నాథం వృషభ పురాణం వంటివి కొన్ని మాత్రమే ఉన్నాయి. మధ్యయుగంలో వేమనను మనం మరచిపోలేం.

ఆధునిక కవిత్వంలోని అన్ని అభివ్యక్తరీతులను సొంతం చేసుకున్న తిరుమల తమ రచనలలో అధిక్షేపాన్ని సన్నివేశానికి ఔచితిని అతిశయింపజేసే విధంగా వాడుకున్నారు.

నిలువుటద్దం లాంటి దేశాన్ని
ముక్క ముక్కలుగా బ్రద్దలు కొట్టి
ప్రతి ముక్కలోనూ ముచ్చటగా
ముఖం చూసుకోవాలనుకొనే
ప్రాంతీయాభిమాన దుర్యోధనుల
ఆలోచనల కపట కిరీటాన్ని చూడు[277]

కవి క్రాంతదర్శి. సమాజ హితైషి. ఆయన సమత్వం మమతత్వం కోరుకొని జాతిని నడిపించే మార్గదర్శి. అయితే దేశంలో కొందరు ప్రాంతీయతత్వాన్ని ప్రేరేపించి నిలువుటద్దం లాంటి స్వచ్ఛమైన దేశాన్ని బద్దలు కొట్టి ప్రతిముక్కలోనూ ముచ్చటగా తమ ముఖాలను చూసుకొని సంబరపడతారు. విశాలమైన జాతీయ భావ సంపన్నమైన దృక్పథాన్ని విచ్ఛేదించే మనుషులను కవి దుర్యోధనులతో పోల్చి, వాళ్లు ధరించిన కపట ఆలోచనల కిరీటాన్ని అధిక్షేపించారు. ఇలాంటి అభినవ దుర్యోధనుల స్వార్థం సంకుచితత్వం కారణంగా దేశప్రజల మధ్య అల్లుకోవలసిన ఆత్మీయతానుబంధాలు తెగిపోవడం కవికి ఇష్టం లేదు.

చమత్కారం అధిక్షేపంలో ఒక పార్శ్వం. చమత్కారం అనేది లేకపోతే వ్యక్తిగత జీవితం, సాహిత్య జీవితం నిస్తేజంగా ఉండిపోతాయి. తిరుమల చమత్కారం నాజూకుగా ఉంటుంది.

ఆదాయం లేకపోయినా
అదేపనిగా పిల్లల్నికని

దేశం మీదికి విసిరేసే
ఆదర్శ దంపతుల
ప్రణయఘాతుకాన్ని చూడు[278]

కవితలో ఆదర్శ దంపతుల ప్రణయఘాతుకం అనే మాటలలో మనస్సుకు బాధ కలిగించని చమత్కారం ఉంది.

ఆర్ద్రంగా అధిక్షేప భావుకతను చెప్పడంలో కవి నిపుణత కన్పిస్తుంది.

వీడు- మీసమున్నవాడు
స్వేచ్ఛగల బానిసీడు
కరకు చూపులున్నా- ఒరలో
కత్తిలాంటివాడు
బుట్టలో త్రాచులాంటివాడు
వీడు మా వాడు!
కాళ్ళు ముడుచుకున్న కడలిలాంటివాడు
వీడి చేత తెలియదు వీడి కూత తెలియదు
వీడి లోతు తెలియదు
భలే అందగాడు[279]

కరకు చూపులున్నా ఒరకత్తిలాంటివాడు. బుట్టలో త్రాచులాంటివాడు. కాళ్ళు ముడుచుకున్న కడలిలాంటివాడు అనడంలో తీవెలాంటి సుకుమారమైన అధిక్షేపం తొంగిచూస్తుంది. మధ్య తరగతి జీవితం చిత్రింపబడినప్పటికీ అధిక్షేపం ఉండడం వలన కవి అభిప్రాయం పాఠకుల హృదయంలో చేరింది. ఈ కవితను చూచినప్పుడు తిలక్ 'అమృతం కురిసిన రాత్రి'[280] హృదయనేత్రాలకి కదలినప్పటికీ అభివ్యక్తిమార్గం, వస్తువరణం వేరుగా కన్పిస్తుంది. ఆచార్య పేర్వారం జగన్నాథం కవిత 'స్వయంవరం'[281] కూడా కళ్ళముందు నిలుస్తుంది. అయితే తిరుమల వ్యక్తీకరణం మరొక విధంగా ఉంది.

కవిత్వం రాసేవాళ్ళందరూ ఉత్తమ కవులు అనుకోలేం. కొందరి కవిత్వం ఎప్పుడూ కొత్తగా ఉంటూనే జాతికి మార్గాన్ని నిర్దేశిస్తుంది. జనజాగృతికీ, వికాసానికీ కరదీపికగా ఉంటుంది. మరికొందరి రచనలు మనిషిలో మూఢాచారాలను ప్రేరేపించి జాతిని గతంలోకి తోసివేస్తాయి. ఇలాంటి కవులను తిరుమల సున్నితంగా హెచ్చరించారు.

ఎందుకింత అశాంతి తాండవిస్తుందని?
నిలకడలేని అక్షరాల సెలయేటి
గట్టుకు గండికొట్టేవాడు లేదు-
గుండెల పొలాల్ని తడిపే
ఒక నిస్స్వార్థపు కవి బిడ్డడు లేడు



అందరూ ఎవరి గుండెని వాళ్ళు
ఆ ఏటిలో ముంచి తీస్తున్నారు
గట్టున ఆరేస్తున్నారు[282]

కొందరి రచనల వలన అశాంతి తాండవిస్తుంది. హింసా ప్రవృత్తి పెరిగి విస్తరిస్తుంది. నిలకడలేని అంటే స్థిరత్వాన్ని కలిగించని అక్షరాల సెలయేరు వలన నిష్ప్రయోజనమే ఎదురవుతుంది. దానికి గండికొట్టి గుండెపొలాల్ని తడిపే నిస్స్వార్థపు కవిబిడ్డడు లేడనే బాధలో అధిక్షేపం కూడా ఉంది. ఆ ఏటిలో ముంచి తీయడమంటే స్వార్థపు పొలిమేరలను సృష్టించుకోవడమే. ఈ ప్రతారణను కవి మెల్లగా మందలించారు.

నన్ను నొప్పించి నువ్వు నవ్వకు
నన్ను ముల్లును చేసి
నా మీద గులాబీ అవ్వకు
పెదవుల నవ్వుల మీద మాత్రమే వాలే నీకు
గుండెలు చీల్చే ప్రాణకంటకమవుతాను[283]

కొందరు హృదయంలోనే నివాసముంటున్నంత ఆత్మీయంగా ఉంటూనే ద్రోహం తలపెడతారు. అలాంటి భ్రష్టులు మనిషికీ సమాజానికీ శత్రువులు. అమానుష లక్షణాలున్న మనిషి గుండె చీల్చే ప్రాణకంటకమవుతానని హెచ్చరించడంలో అధిక్షేపం ధ్వనిస్తుంది.

నీ చేతిలో
నాగస్వరం ఉంది
పన్నాగస్వరం ఉంది
నువ్వు ఏస్తున్నావు ఎత్తులు
చేస్తున్నావు గమ్మత్తులు
అయినా-
నీ ముందు ఈ సమాజం
పడగ విప్పి ఆడుతూనే ఉంది
ఎందుకో తెలుసా!
పాట ఆపితే
కాటు వేద్దామని[284]

నాగస్వరం- పన్నాగస్వరం, నాగస్వరం ఊదడం ఆపేస్తే పడగవిప్పి ఆడుతున్న పాము కాటువేసి విషాన్ని గుప్పిస్తుంది. పన్నాగ స్వరాన్ని పలికిస్తే గమ్మత్తుగా ఎత్తులు వేస్తే సర్పంలా ఆడుతున్న సమాజం కాటువేస్తుంది. ఇది మనిషిని మార్చివేయడానికి కవి అధిక్షేప రూపంలో సంస్కరిస్తున్న విధానం.

నాయకులు అనిపించుకుంటున్న వాళ్ళందరూ దేశంకోసం, దాని సౌభాగ్యంకోసం ఆరాటపడుతున్నవాళ్ళు కారు. కొందరు సొంత ఆస్తులను దేశంకోసం తృణప్రాయంగా

వెచ్చిస్తే, మరికొందరు పదవి అందగానే ప్రజాధనాన్ని కొల్లగొట్టి నీటుగా కులుకుతుంటారు. ఇలాంటి కుహనా నాయకుల ప్రవర్తనతో దేశపురోగమనం స్తంభించిపోతుంది. కవి తిరుమల ప్రజాకంటకులైన నేతలను తీవ్రంగా దుయ్యబట్టారు.

నోట్లో చక్కెర కడుపులో కత్తెర వున్న
ఈ నాయకులు వచ్చిన తర్వాత
మన దేశానికి అర్థమే మారిపోయింది
ఇప్పుడిది- ద్రాక్షారామ, శ్రీశైల...
పరమైన త్రిలింగదేశం కాదు
స్త్రీ లింగ, పులింగ, నపుంసకలింగ పరమైన త్రిలింగం
మొదటి రెండూ ఎక్కడైనా కనిపిస్తే
మూడోరకం ఎన్నికల్లో కన్పిస్తుంది[285]

ఈ నేల పావిత్ర్యాన్ని ఆదుకోని నేతలను కవి నపుంసకలింగం ఔచితిలో చేర్చి ఎద్దేవా చేశారు. హేళన చేశారు. హేలన అనేది అధిక్షేపంలో ఒక కిరణమే.

ఓ కోయిలా! నువ్వు కూస్తే పీక నులిపేస్తాను
ఓ గులాబీ! నువ్వు పూస్తే రేకు నలిపేస్తాను
అంతా వినండి-
నా పాలనలో వెన్నెల వేడిగా వుండాలి
నా పాట నల్లగా వుండాలి
చెట్టు పూత లేకుండా కాయలు కాయాలి
గర్భధారణ లేకుండా అర్భకులు పుట్టాలి.[286]

కవి విచిత్ర విజ్ఞానిని పరిచయం చేస్తున్న ఈ కవితలోని కొన్ని పాదాలలో చమత్కారం చెప్పబడింది. కోయిల పాడితే పీక నులిపేస్తాననడం, గులాబీ పూస్తే రేకులు నలిపేస్తాననడం, అహంకారాన్ని సూచించే విషయాలుగా కన్పిస్తున్నప్పటికీ అలా కావు. వెన్నెల వేడిగా ఉండాలనడం, పాలు నల్లగా ఉండాలనడం వంటివన్నీ హాస్యాన్ని సూచించే అంశాలుగా కన్పిస్తాయి. కవి వస్తువును ఎన్నుకున్నప్పుడు అభివ్యక్తిలోనికి తీసుకున్నప్పుడు కన్పడే దృశ్యమంతా మనస్సుకు అహ్లాదాన్ని కలిగిస్తాయి. దాశరథి "రావణవనం"[287] అనే కవితలో ఇదే విధానాన్ని వ్యక్తీకరించారు.

తిరుమల విస్తారమైన కావ్యావరాశిలో అధిక్షేపం ఔచితీమంతంగా వర్ణింపబడింది. ఇది ఆయన ప్రజ్ఞనూ, విజ్ఞతనూ, కవితా మర్మజ్ఞతనూ ప్రకటిస్తుంది.

## 12. సమతావాదం

విశాల భారతం మనది. భిన్న సంస్కృతులకు, సంప్రదాయాలకు నిలయమిది. ఈ భిన్నత్వం నుంచి పరిమళించే ఏకత్వం ఒక్క స్వరూపంగా, ఒక్క హారతిగా ప్రదీప్తమవు



తున్నప్పుడు దేశం అంతా ప్రశాంతమైన మనుగడను సాధిస్తూ ఉంటుంది. తనమట్టూ విస్తరించి ఉన్న వివిధ సమాజాలకు ఆదర్శాన్ని కేతనంగా చూపుతుంది. కులాలు, మతాలు వీటిమధ్య సంఘర్షణలు పెచ్చరిల్లితే ఐకమత్యం నశిస్తుంది. పరస్పర హననంతో జాతి అంతా క్షుభితమైపోతుంది. ఈ దారుణాలను చూస్తూ విజ్ఞులు, త్యాగశీలురు దేశీయుల గుండెలలో సమతాభావ బీజాలను నాటడానికి తమ జీవితాలను కొవ్వొత్తులుగా జ్వలింపజేసుకొని సమైక్య వారధిని నిర్మిస్తారు. పగిలిన హృదయాలలో ఆత్మీయతా నినాదాన్ని పలికిస్తారు. ఐక్యతా ప్రాధాన్యతను గళమెత్తి చాటుతారు.

కవులు కూడా తమ గీతాలతో, ఆశయాలతో ప్రాంతాలు వేరైనా అంతరంగాలను కలపడానికి, సంస్కృతులు ఏవైనా వాటి మూలసూత్రం ఒకటేనని కలసి ఉండటంలోనే సౌఖ్యం, పరమార్థం ఇమిడి ఉన్నాయని గీతాలు ఆలపించారు. ఆలపిస్తున్నారు.

తెలుగు సాహిత్యంలో కూడా ఇలాంటి సమతావాద రచనలు వెలువడుతున్నాయి. అయితే, జాతీయోద్యమం తీవ్రరూపం ధరించినప్పటి నుంచీ ఈ సమైక్యతాభావం సేతువు నుంచి మంచుకొండ దాకా దేశాలను ఉజ్వలితం చేసింది. అందరినీ సమైక్యపరచి దేశ పురా వైభవాన్ని తెలిపి వారు పురోగమించేటట్టు ప్రయత్నం చేసింది. సమవాదం నవనాదంగా నినదించింది. మహాకవి శ్రీశ్రీ

ఐక్యం అదీ మనకి ముఖ్యం
అందులోనే ఉంది సౌఖ్యం
లేనిపోని చీలికలు
రెండు రెండు నాలికలు
ఛీ యిదా బతుక్కి
ఫాయిదా[288]

అంటూ వేర్పాటు ధోరణిని తీవ్ర స్వరంతో నిరసించారు. ఐకమత్యాన్ని గౌరవించారు. డా॥ దాశరథి "నా కులమెద్దియో యెరుగ నా మతమెయ్యదియో"[289] తెలియదని సమతావాదాన్ని శక్తిమంతంగా చాటారు. ఈ సమదృష్టిని అనేక విధాలుగా అందించిన డా॥ సినారె -

బొగ్గువలె కన్పించు చర్మపు పొరలలో తరగెత్తు నెత్తురు
పాలవన్నెల మేనులందున లీలగా తరగెత్తుగదా"[290]

అని రంగులు ఎన్ని ఉన్నా మనుషుల దేహాలలో అలలెత్తే రక్తం ఒకే రంగులో ఉంటుందని సమవాదాన్ని తాత్త్వికంగా బలపరిచారు.

ఆచార్య తిరుమల మార్గదర్శి. దేశవృక్షం కొత్త చివుళ్ళతో, రెమ్మలతో, కొమ్మలతో, పూలతో, పరిమళాలతో కళకళలాడాలని ఆయన భావించారు. ఆ సౌభాగ్య సాధనం కోసం దేశ ప్రజలను ఒక్క వేదిక మీదికి రమ్మని గొంతెత్తి పిలిచారు. ఆ పిలుపులో సమదృష్టి, నవభావన జాలు వారినట్టుగా అనిపిస్తుంది.

దేశమే దేవాలయం
జ్ఞానమే దైవం
చీకటన్నది లేదురా- రా
రమ్ము ముందుకు సోదరా
కులాలో కొండలో- మతాలో మహానదులో
వేటినైనా దాటి రారా సమత వీణను మీటరా[291]

దేశాన్ని దేవాలయంగా, జ్ఞానాన్ని దైవంగా భావించి కొండలలా అడ్డు నిలిచే కులాలను, మహానదులలా దాటనివ్వని మతాలను దాటి ఒక్కచోట చేరి సమతా వీణను మీటుమని చెప్పారు. 'కులాలో, కొండలో, మతాలో, మహానదులో' అనే పాదంలో కవి ఆశించిన భావతీవ్రత పాఠకుని, శ్రోతని ఉత్తేజితం చేస్తుంది.

తిరుమల సామ్యవాదాన్ని
స్వర్ణకాంతులు కురియు
ఈ కాలమే త్రేత
ఈ సామ్యవాదమే
మనకు భగవద్గీత[292]

అని నిర్వచించారు. ఈ నిర్వచనం త్రేతాయుగంలోని మానుషధర్మాన్ని వర్తమానానికి అన్వయించడం, భగవద్గీతగా అభివర్ణించడం కన్పిస్తుంది. ఈ పదాలను పోహరించడం వల్ల కవి హృదయంలో విరిసిన భారతీయత సమైక్య స్వరూపంగా దర్శనమిస్తుంది. ఈ సమదర్శి నుంచి

ప్రవహించు మమతలో గాంధర్వ రాగాలు
ప్రభవించు సమతలో స్వర్గభోగాలు[293] లభిస్తాయి.

తిరుమల సమత మరింత దృఢంగా పెనవేసుకుపోవడానికి హేతువులను సూచించారు.
మంచితనమే మనిషి మనిషికి బంధము
మమత నిండిన మనసు వుండే అందము[294]

అందరు మానవులలో మంచితనం ఉంటే చాలు అదొక ఆత్మీయ బంధంగా అందరినీ ఒకచోట అల్లించేస్తుంది. ఇంతచాలు మానవత్వం పరిమళించడానికి, సమత వికసించడానికి, సరాగం కురియడానికి. ఇదే కవితలో అందం అనే శబ్దాన్ని ప్రయోగించారు. ఇది భౌతికమైన అందం కాదు. మాటల యొక్క సొగసు అంతకన్నా కాదు. దేహాన్ని అందంగా సింగారించుకుంటే మాటలకు తేనె పూసి వెలువరిస్తే ప్రయోజనం శూన్యమే. మనస్సు కావాలి. ఆ మనస్సు నిండుగా మమత ఉండాలి. మమతలు నిండిన హృదయం పాషాణ హృదయాలను సైతం కరిగించివేస్తుంది. పైశాచికత్వాన్ని, కోరలు సాచిన విశృంఖలత్వాన్ని



అదుపు చేస్తుంది. ఆ మానసంలో కరుణ తోడి ఆర్ద్రతను పొంగిస్తుంది. 'మనిషి' అన్న పదంలో ఉన్న దివ్యత్వాన్ని తెలుపుతుంది. సమస్త అంతరంగాలలో సమదృష్టిని సృష్టిస్తుంది. అలాంటి మనస్సే అందం. ఆ మనస్సున్న మనిషే అందం. మనిషి కురూపిగా ఉంటే మనస్సు కూడా అలాగే వికృతంగా ఉంటుందనుకోవడం ఒక భ్రమ. డా॥ మిరియాల రామకృష్ణ

సుధాగంధములున్న పూలకు
సోయగంబుల రంగులెందుకు
స్వేచ్ఛగా కదలాడు వాయువు
వీడదెందుకు సుగంధాలను
వంకరలు గల మ్రోడులో గల
దంకుర ప్రాయముగ అందము
తొలకరించే మబ్బు నలుపన
మెరుపువలె కనిపించు నందము
పొగలు చిమ్మేవంట చెరుకున
పొంచి ఉన్నది జ్వాల అందము
జంటలగు దంపతుల మధ్యను
కంటబడకయె తిరుగునందము[295]

అందాన్ని కవితారేఖలలో వర్ణించారు. అయితే తిరుమల మనిషి అందాన్ని మనస్సు ద్వారా ఆశించారు. హృదయానికి అందాల గంధాలు ఉంటే ఈ ధరాగోళం దేవలోకాన్ని మరిపిస్తుంది. ఆగామి కాలాలను మురిపిస్తుంది. ఇదీ తిరుమల సమత కవితాభివ్యక్తిలో ఉన్న విశిష్టత.

లోకంలో కొందరి మాట తీరు ఒకటిగా, మనసుగతి మరో విధంగా ఉంటుంది. ఈ విరుద్ధ భావాలున్న మనుషుల ప్రవర్తన వలన సమాజం బలహీనమైపోతుంది. ఒక విధంగా పరిశీలిస్తే అరిషడ్వర్గాలు ఈ సమాజం నుంచే కోరలు సాచుతుంటాయి. ఈ వైపరీత్యాలను దర్శించిన తిరుమల మానవజాతిని

మాట మనసు ఒక్కటిగా మసలుకో
నాది-నీది అంతా మనదని తెలుసుకో[296] మని సందేశమిచ్చారు. 'మనదనడం'లోనే నిజమైన ఆత్మీయత ధ్వనిస్తుంది. ఆత్మీయత ఉంటే చాలు అన్నీ ఉన్నట్టే. ప్రగతి ఇంటిముందు వాకిట్లో నిలిచినట్టే.

ప్రగతికి ప్రాణం సమత
చరితకి జీవం యువత

ఆ తరుణ భావమే రవళిస్తే
అదే జాతి ఘనత[297] అని ఆశించారు.

ఆ ఔన్నత్యం కోసం
ధనవంతులు-పేదవారనే తేడాలొద్దు
కులమతాల తెరలు పొరలు అసలే వద్దు
పిలవండీ! శాంతిదేవిని రా రమ్మని
తెలపండీ! ఐకమత్యం మా సొమ్మని[298]

ఈ భావన మనస్సులో నిండుగా ఉన్నప్పుడే సమత సజీవంగా జాతీయతకు ఊపిరిగా అమరుతుంది.

అప్పుడు కానీ
విశ్వచరితకు వెలుగురేకగ
సామ్యవాదపు శాంతిలేఖగా
చెలిమి పలికే ఏకతారగ
చిరము నిలిచే జాతిపేరుగ[299] అని కవీ, కవితో పాటు సమస్త భారతీయులూ, భారతీయులతో పాటు ప్రపంచ ప్రజావళి పాడుకుంటూ ఆనందిస్తారని తిరుమల ఆశించడంలో ఎంతో పవిత్రత దాగి ఉంది. కవిగా ఆయన ప్రసరిస్తున్న సందేశం ఉజ్వలం. ఆయన మానసమూ రసోజ్వలం.

తిరుమల 'సహజీవనమొక బింబం సమభావన మొక బింబం'[300] అని సహజీవనాన్ని, సమభావనాన్ని సూర్యచంద్రులతో పోల్చారు. వీళ్ళిద్దరూ కావాలి లోకాలను కాంతిలో స్నానమాడించడానికి. ఇద్దరిలో ఏ ఒక్కరు లేకపోయినా భూగోళం కృషించిపోతుంది. అట్లాగే మనిషికి సహజీవనం. సమభావనం రెండూ ఉండాలని అంటున్నారు.

ప్రకృతి నుంచి వచ్చిన చెట్టూ, చేమకూ, పుట్టకూ, గట్టుకూ భేదాలు లేనట్టుగానే ప్రకృతి నుంచి ఉదయించిన మానవులకు భేదాలు ఉండకూడదని ప్రకృతి నుంచే జీవిత పాఠాలను నేర్చుకొమ్మని ఆయన సందేశమిస్తున్నారు.

లేదు భేదం ఎండకు వానకు చలికి త్రోవకు
లేదు భేదం చెట్టుకు గట్టుకు తేనె పట్టుకు
కుసుమం ఎక్కడున్నా-సుమ
గంధం అందరిదీ-అను
బంధం అందరిదీ[301]

కలసి మెలసి అందరూ సమైక్యంగా ముందడుగు వేస్తే అదే ప్రగతికి తొలిమెట్టు అవుతుంది. ఆ మానవ హృదయాలే అనురాగపు మందిరాలై నిలుస్తాయి. సమాజ శ్రేయాన్ని నలుదిక్కులకు ప్రసరింపజేస్తాయి. భేదమన్నది సమసిపోతుంది. అందుకే తిరుమల "కులం



లేదు మతంలేదు/మానవులంతా ఒకటి/సమత మమత స్వేచ్ఛ/న్యాయబంధమొకటి"[302] అన్నారు. సమత మనిషికి ఊపిరి. దేశానికి సిరి. కనుక కులమతాలకు అతీతమైన సమతా ప్రపంచాన్ని తిరుమల ఆశిస్తున్నారు.

## 13. ఆంధ్రాభిమానం

ఆంధ్ర భాషకు, ఆంధ్ర సాహిత్యానికి, ఆంధ్ర దేశానికి ఒక ప్రత్యేకమైన స్థానం ఉంది. తెలుగు భాషా సారస్వతం మంచి విలువైన రచనలతో ప్రారంభమైంది. వీటి ఔన్నత్యాన్ని ఆంధ్రేతరలూ శ్లాఘించారు.

ఆంధ్రత్వమాంధ్ర భాషాచ
నాల్పస్య తపసః ఫలమ్[303]

అని తమిళుడైన అప్పయ్యదీక్షితులు ఆంధ్రత్వం, ఆంధ్రభాష గొప్ప తపఃఫలమని భావించారు.

సంస్కృత కవి సుధాకరుడు తెలుగుభాష తీయదనాన్ని ప్రీతితో ఆస్వాదించి అనుభవించారు.

యో వేత్త్యాంధమయీం వాణీం
శిరీష కుసుమ పేశలామ్
కిం తస్య సుధాయా కార్యం
మాధుర్య రస నిర్ణయే[304]

తెలుగు శిరీష పుష్పంలా కోమలమైందట.

శ్రీనాథుని పద్యంగా ప్రచారంలో ఉన్న
జననీ సంస్కృతంబు సకల భాషలకును
దేశ భాషలందు తెలుగు లెస్స
జగతిదల్లికంటే సౌభాగ్య సంపద
మెచ్చుటాడు బిడ్డ మేలు గాదె[305]

ఈ పద్యంలో 'దేశభాషలందు తెలుగు లెస్స' అన్నది ఎంతో ఔచితితో కూడుకున్న నానుడి అయ్యింది.

శ్రీకృష్ణదేవరాయలు
తెలుగదేలయన్న దేశంబు తెలుగేను
తెలుగు వల్లభుండ తెలుగొకండ
యెల్ల నృపులు గొలువ నెఱుగవే బాసాడి
దేశభాషలందు తెలుగులెస్స[306] అన్న పద్యంలో తెలుగు కంద చక్కెరలా మధురమైందని వర్ణించారు. కన్నడంలో ప్రచారంలో ఉన్న "కన్నడ కత్తురి తెలుగుతేట"[307] మాటలు చాలు

తెలుగు విశిష్టతను గుర్తించడానికి.

'భారతదేశం' అనే గేయంలో తమిళ నవయుగకవి సుబ్రహ్మణ్య భారతి ఆంధ్రభాషా ప్రాశస్త్యాన్ని ఇట్లా ప్రశంసించారు.

సింధు నదియిస్ మిశై నిలవినిలే
చేరనన్నాట్టళం పెన్ గళుడనే
సుందర తెలుంగి విళ్ పాట్టిశైత్తు
త్తోణి గళోట్టి, విళెయాడి వరువోం[308]

దేశంలో ఆంధ్రభాషకు, ఆంధ్రత్వానికి, ఆంధ్ర దేశానికి ఉన్న స్థానం పరిమళ భరితమైంది. తెలుగు కవులలో చాలామంది ఆంధ్ర రాష్ట్రాన్ని పలు విధాలుగా కీర్తించినా కొందరి రచనలు మాత్రమే చవులూరిస్తాయి. తిరుమల ఈ కోవలోనివారే. ఆయన తెలుగు భాషనూ, ఆంధ్రదేశాన్ని కీర్తిస్తూ చాలా కవితలు రాశారు. తిరుమల ఈ కవితలను పరిశీలించినప్పుడు వాల్మీకి 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపిగరీయసి' అనే శ్లోక పాదం గుండెలో మెదలుతుంది.

ఆంధ్రప్రదేశ్ అవతరించిన దినాన్ని తలపోస్తూ తిరుమల

తమిళ కన్నడ మరాఠీ ఒరియా
భాషా భావమే అంచుగా
సహనమే శ్రుతిగా-సమతయే లయగ
పలికే ఆత్మ విపంచిగా
కనిపించే-వినిపించే దివ్యనాద ఝురి[309]

సహనం, సమత శ్రుతిలయలుగా ఆత్మ విపంచి మీద పలికే దివ్యనాద ఝురి ఆంధ్రప్రదేశం అంటారు.

ప్రేమ సౌరభం - ఆత్మగౌరవం
పండే ఖ్యాతికి వేదికగా
తిమిర సమరాన విజయ పతాకం
పట్టే నీతి నివేదికగా
తెలుగై - ఎదల వెలుగై నిత్య శుభంకరి [310]

ప్రేమ సౌరభం, ఆత్మగౌరవం కలసి పండే పంటకు ఆంధ్ర ధరాస్థలి వేదికగా అమరి ఉందంట. తిమిరాన్ని అంతరింపజేయడానికి జరిగిన సమరంలో వెలుగుల విజయపతాకం వంటిదట. అది ఎదల వెలుగై నిత్యం శుభాన్ని కలిగించేదట. తిరుమల భావుకత ఈ చరణాలలో నిండుగా తరగలెత్తుతున్నది.

ఆంధ్ర ప్రాంతం ఎవరికి ఎలాంటి నిలయమో ఇలా చెప్పారు.



సిరులకు పుట్టినిల్లు శ్రమజీవుల కున్విరిజల్లు-సత్కవీ
శ్వరులకు పూలవిల్లు-పగవారల కుందగ తుమ్మముల్లు ఖే
చరులకు తీపికల్లు-మతిస్వార్థపరులకున్ రణభీమమల్లు-సు
స్థిర నిగమాంతరంగులకు శ్రీధరునిల్లన జెల్లునాంధ్రమున్[311]

ఆంధ్రదేశం సిరిసంపదలకు నిలయం. శ్రమ పడేవారికి సుఖాన్నిచ్చు ప్రదేశం. కవులకు ప్రేరణిచ్చునట్టిది. ప్రహర్తను బాధించునది, దుర్మార్గులను అడించేది. స్వార్థపరులకు బుద్ధి చెప్పేది. తాత్త్వికులకు వైకుంఠధామం వంటిది. అంత్యానుప్రాస, ఉల్లేఖనలంకారాలు అమరడం వల్ల కవితకు మరింత వన్నె వచ్చింది. తిరుమల ఆంధ్రాభిమానం ఆర్ద్రతను అంటిపెట్టుకొని ముందుకు సాగిన భవ్యావేశంగా ఉంది. తిక్కన భవ్యావేశం నుంచే కదా! ఆంధ్ర భారతం ఆవిర్భవించింది.

ఈ మహేంద్ర ధరాస్థలికి మరే ప్రాంతాలు సాటిరావట. అంత ఉన్నతంగా ఆంధ్రను కీర్తించడానికి హేతువులను ఇలా చెప్పారు.

పాషండ మతముల ప్రాబల్యముంద్రుంప
ప్రార్థించె నన్నయన్ రాజరాజు
శైవ వైష్ణవ మార్పి సామ్యవాదము నేర్ప
మనిచె తిక్కన కవిన్ మనుమసిద్ధి
ఆంధ్ర జాతీయతాఖ్యాతి దిశల బూయ
పేర్మొనె శ్రీనాథు వేమ విభుడు
తెలుగు నెలత పలుకుల జిగిదెల్పగ
రంగాంబను దనిపె రాఘవుండు
ప్రజలకు ప్రగతికి సద్భావ పరిమళాల
పథములను తీర్చిదిద్దిన ప్రభులగన్న
జ్ఞానరత్న ప్రభాగర్భ-సవనదర్భ
మన మహేంద్రమ్మునకు సాటి మాట కలదె[312]

రాజరాజు, మనుమసిద్ధి, వేమారెడ్డి, విజయరాఘవనాయకుడు ఆంధ్రాన్నీ, ఆంధ్రభాషనీ ఉన్నత స్థానంలో నిలిపి గౌరవించారు. తిరుమల సీసపద్యం నడక కూడా సొగసుగా నడిచింది.

కవులలో కొందరు ఉద్యమోపజీవులుంటారు. ఉద్యమం అంటే తిరుగుబాటు. తనదాకా సాగుతూ వచ్చిన విధానాన్ని అనుసరించకుండా, ఆదరించకుండా నూతన పంథాను ఆవిష్కరించే కవులను ఉద్యమ కవులంటారు. సంస్కరణాభిలాష కలిగిన కవులు మనకు పాల్కురికి సోమనాథునితో మొదలవుతారు. ఉద్యమం అన్నప్పుడు అది కవిత్వపరమైనదీ కావచ్చు, సంస్కృతీపరమైనదీ కావచ్చు, సంస్కరణ పరమైనదీ కావచ్చు, సాంఘికపరమైనదీ

కావచ్చు. కొందరు తెలుగుకవులు ఈ నాలుగు ఉద్యమాలను నిర్వహించిన వాళ్ళున్నారు. తిరుమల ఇలాంటి దార్శనికులైన కవులను ఉద్యమ ప్రణతలుగా సంభావించారు. అలాంటివాళ్ళ లేఖిని నుంచి వెలువడిన కావ్యాలు భవిష్యత్తులో సమాజాన్ని వెన్నుతట్టి నడిపించేవిగా చరిత్రలో ఉంటాయి. తిరుమల పై పద్యంలో అదే తాత్పర్యాన్ని చెప్పారు.

ఆద్యుల్, సంస్కృతాంధ్ర కవితామృత తత్త్వనిషేవ్యులున్ బుధా
రాధ్య కళాభి వంద్యులనురాగ రసార్ణవ సార వీచికా
హృద్య సరాగ మానసుల హీన యశోధనులౌ కవుల్ గదా
ఉద్యమ సారథుల్ మన మహోజ్జ్వల మనవతా చరిత్రకున్[313]

పద్యం అంతా దీర్ఘ సమాసాలతో ఉన్నప్పటికీ లలితపదాలవటం చేత శైలి సుకుమారత్వాన్ని సంతరించుకుంది. హృదయాలను పరవశింపజేసేదిగా ఉంది.

తిరుమల తెలుగుభాష మార్దవాన్ని, తియ్యదనాన్ని ఇలా సొగసుగా చిత్రించారు.

పూలలోని మధువు, పున్నమి వెన్నెల
చిట్టిపాప నవ్వు, పుట్టతేనె
కలిపిచూడు తెలుగు పలుకులై భాసించు[314]

కవి భావనా ప్రపంచంలో అహ్లాదకరమైన తెలుగు పలుకుల తీయదనం, కమ్మదనం ఎలా ఉన్నాయో పై వాక్యాలలో తెలుస్తుంది.

రసవాదియైన తిరుమల తెలుగు ఎక్కడ ఏ రూపంలో ఉందో రమణీయంగా చిత్రించారు.

నింగి తోటలో
చుక్కల కనురెప్పల్లో
తలుక్కున ఊగే
తలపుల చిలిపి మెఱుగు నా తెలుగు
తరాలపై-హృదయాంతరాలపై
వరాల స్వరాలపై-రాగాల సరాలపై
వెన్నెలవాన కురిపించే
శుక్ల-కృష్ణ పక్షాల
జాబిల్లి కోయిల పులుగు-నా తెలుగు[315]

నింగి ఒకతోట. ఆ ఉద్యానంలో చుక్కలున్నాయి. ఆ చుక్కల కళ్ళరెప్పలలో తలపుల చిలిపి ఊహలు తళుక్కున మెరిశాయి. ఆ మెరుపంతా తోటనిండుగా ప్రసరించింది. ఆ వలపుల మెరుపులో వనమంతా పులకిస్తుంది. అలాంటిదే తెలుగు. తరతరాలుగా మనిషి ఎంచుకున్న భావనలపైనా, భావనలతో పులకించే హృదయాంతరాల పైనా, హృదయం ఆవిష్కరించే స్వరాలపైనా, రాగాల సరాలపైనా, వెన్నెలవాన కురిపించే శుక్ల కృష్ణ పక్షాల వెన్నెల కోయిల గొంతులోని మార్దవం, తనువులోని లావణ్యం తెలుగని తిరుమల అభివర్ణించారు.

అంతేకాక

నానా సముద్భాస భావనా లోకాలు
పావనం చేయగా ప్రవహించే నా తెలుగు
నా తెలుగు నాది
ఇది మధురిమకు పునాది
నవరసాల శబ్ద ధనస్సు నా తెలుగు
నవ యుగాల కాంతి సరస్సు నా తెలుగు
వేదానికి భాష్యం నా తెలుగు
నాదానికి భాష నా తెలుగు
ఈ దేశం భాషా సతికి
నొసటి తిలకం నా తెలుగు
సంస్కృతీ-సభ్యతలకు
చరిత్ర వనంలో వేసిన
శాసన ఫలకం నా తెలుగు
నా తెలుగు నాది
ఇది మానవత్వానికి పునాది'[316] అన్నారు. ఈ పంక్తులలో "వేదానికి భాష్యం నా తెలుగు/నాదానికి భాష నా తెలుగు" అన్న పాదాలు 'తెలుగు పలుకులు వేదముల కొలది చూడు' మన్న పాల్కురికి మాటలను తలపింపజేస్తున్నాయి.

తెలుగు తేనె వుంటే-
స్వర్గాలెందుకు? దుర్గాలెందుకు?
తెలుగు పలుకు వింటే
పదవులెందుకు? మదవతుల
పెదవులెందుకు?
ఆత్మశక్తి నా తెలుగు
అమృతకీర్తి నా తెలుగు
ఈ దీప్తిని నిలుపుకో!
ఈ కీర్తిని పులుముకో[317]

తిరుమల ఆశించినట్టుగా తెలుగులోకం దీప్తిని, కీర్తిని అందుకుంటే అంతకన్నా మరో గొప్ప విషయమేముంది.

తిరుమల విదేశాలలో పర్యటించినప్పుడు కూడా ఆయన గుండెలోతులలో తెలుగును గూర్చిన కలవరింతలు పొర్లుతూనే ఉన్నాయి.

అమెరికాలో ఐదవ తెలుగు సభలు
తెలుగుదనానికి ఐదవతనం ప్రభలు
కాలిఫోర్నియా బంగారు కంచంలో
కమ్మని ముచ్చట్లు తెలుగు పచ్చళ్లు
ఈ లాస్ఎంజెలిస్‌లో తెలుగుచూపుల
పలకరింపుల వెచ్చని కౌగిళ్లు
కడుపు ఆకలితో మండి
ఆశయాల నీళ్లు స్వదేశపు చెరువుల్లో ఎండి
ఖండాలు సముద్రాలు దాటినా
గుండె వీణియలు
నవ్య నాగరికతా తంత్రుల మీద
కలిమి పాటలు పాడుతున్నా
ఎక్కడో- ఎక్కడో లోలోపల
పేగు మాత్రం
తెలుగు- తెలుగు అంటూ
కలవరిస్తూనే వుంది[318]

అమెరికాలో జరిగిన అయిదవ తెలుగు మహాసభలు తెలుగుతనానికి అయిదవ తన ప్రభలుగా ఉన్నాయట. పిదప తెలుగు పచ్చళ్ల నిగారింపును గుబాళింపును ఆయన కాలిఫోర్నియా బంగారు కంచంలో అనుభవించారు. తెలుగు సీమలను వదిలిపెట్టి అమెరికాలో ఉంటున్నప్పటికీ మన తెలుగువాళ్ళు తాము ప్రత్యేకంగా, రుచికరంగా, అపురూపంగా తయారుచేసుకునే పచ్చళ్లను మరచిపోకుండా అనుభవిస్తున్నారని వాళ్ళ వాత్సల్యం అలా ఉందని భావించారు. ఇక లాస్ఎంజెలిస్‌లో ఉంటున్న తెలుగువాళ్ళ చూపుల పలకరింతలు వెచ్చని కౌగిళ్ళలాగా మురిపిస్తాయని అంటారు. ఆకలితో కడుపు మండినప్పుడు ఆశయాలను స్వదేశపు చెరువుల్లోనే ఎండించి ఖండాలు దాటివచ్చి ఆధునిక నాగరికతలో పాటలు పాడుకుంటూ నాణ్యంగా బతుకుతున్నప్పటికీ లోలోపల పేగుమాత్రం తెలుగు అంటుందనే అభిమానాన్ని కవి ప్రశంసించారు.

తెలుగునేల నుండి తెలుగు జ్వాలకు వాలాను
పిడికెడు అనుభూతిని తెలుగునేల మీద
వెదజిమ్మాలని కోరాను
మీ ఆలోచనల రత్నాల హారాలు



తెలుగుతల్లికి వేయండి.
మీ చెలిమి కలిమి వెలుగును
తెలుగు మేనికి గంధంలా పూయండి
మీ కోసం పుట్టింటి తలుపులు
ఎప్పుడూ తెరిచే వుంటాయి రండి
ఈ డాలర్లు గాక,
రూపాయల్లాంటి తెలుగు పాపాయిల్ని తెండి!
మా కనుపాపల అద్దంలో మీ ముఖాలు చూచుకోండి
మీ ఎదపొరల్లో తెలుగుదనాన్ని దాచుకోండి[319]

అమెరికాలో ఉన్న తెలుగువాళ్ళను ఉద్దేశిస్తూ తిరుమల అక్కడి తెలుగు ప్రజానీకానికి విలువైన సందేశాన్నిచ్చారు. తెలుగునేల మీద ఆత్మీయతను విరజిమ్మమని, ఆలోచనల రత్నహారాలను తెలుగుతల్లి గళసీమలో అలంకరించమని, చెలిమి కలిమి వెలుగును తెలుగు దేహానికి గంధంలా పూయండని, పుట్టింటి తలుపులు మీ కోసం ఎప్పుడూ తెరిచి ఉంటాయని అన్నారు. డాలర్లుగా కాక రూపాయలలాంటి తెలుగు పాపాయిల్ని తెమ్మంటారు. మా కనుపాపల అద్దంలో మీ ముఖాలను చూసుకొండని, ఎదపొరల్లో తెలుగుదనాన్ని దాచుకొమ్మని అంటున్నారు. ఇది తిరుమల ఆంధ్రాభిమానాన్ని ప్రకటిస్తుంది. అంతేకాక ఆధునిక అమెరికా సంస్కృతిలో ఆచార వ్యవహారాలను మరిచిపోతున్న తెలుగు ప్రజల హృదయాలలో పరివర్తనను తెచ్చి తెలుగునేల మీద మమకారాన్ని పెంచేవిధంగా ఉంది.

ఇతర భాషలెన్ని ఎంత మాట్లాడినా
ఉడుకులేదు నాకు గొడవ లేదు
అయ్యలారా! ఎప్పుడైన నే నెదురైన
తెలుగు పలుకరింపు తెలివి చాలు[320]

తిరుమల అచ్చంగా తెలుగుకవి. ఆయన చాలా రచనల్లోనూ, విదేశాలలోని విద్వద్గోష్టులోనూ ఆయన ఆంధ్రాభిమానం ఆత్మీయంగా దర్శనమిస్తుంది. ఏ కవి అయితే మాతృభూమినీ, మాతృభాషనూ గుండెలుప్పొంగగా కీర్తిస్తాడో అలాంటి కవి మాత్రమే దారిని చూపే, వెలుగును పంచే కవిత్వాన్ని రాస్తాడు. తిరుమల ఇదే మార్గంలో పయనించారు. ఆయనకు తెలుగునేల, తెలుగుభాష, తెలుగు సంస్కృతి, తెలుగుపాట, తెలుగుపద్యం అన్నా ఎంతో ప్రీతి. ఆయన చాలా ప్రక్రియలలో ఈ ఆత్మీయతను ప్రకటించారు.

## 14. సూక్తిసుధ

'వాగ్భూషణమే సుభూషణం' అనేది భర్తృహరి సూక్తి. మనిషి అందాన్ని పెంచే అలంకారాలు ఎన్ని ఉన్నా మంచిమాట ఒక్కటే విలువైన భూషణం. అదే మనిషిని

సమాజంలో ఉన్నతునిగా నిలబెడుతుంది. "ఒక్క మంచిమాట మాట్లాడు నీ సొమ్మేం పోయింది లోకమతా హర్షిస్తుంది"[321] అంటాడు భవభూతి. తీయనమాట ఆత్మీయతను పెంచుతుంది. అనురాగాన్ని సారిస్తుంది. అప్పుడు మనుషులమధ్య ఉన్న దూరాలు చెరిపివేయబడతాయి. అగాధాలు అదృశ్యమవుతాయి. అప్పుడు మానవతా దీపాలు ప్రతి ముంగిట్లో కాంతులను వెదజల్లుతాయి. మనస్సుకూ, మేధకూ ఉన్న అనుబంధం వల్లనే ఇది సాధ్యపడుతుంది. మనస్సు సూచించినదాన్ని మేధ నిరాకరిస్తే, మేధ ఆదేశించిన అంశాన్ని మనస్సు తిరస్కరిస్తే ఈ రెండు ఇట్లాగే ఘర్షణ పడితే అప్పుడు మనిషి నుంచి కఠినోక్తులు వస్తాయి. కలహాలు పెరుగుతాయి. పూలతోటలాంటి బతుకు శ్మశానవాటికలా మిగిలిపోతుంది. మంచిమాట మనిషికి ఆత్మలా కుదురుగా ఉన్నప్పుడు లోకమంతా సౌభాగ్యంతో కళకళలాడుతుంది.

ఆనాటి రచనలైన మహాభారతం, భాగవతం, రామాయణం వంటి మహాకావ్యాలు సూక్తులకు గనులుగా విమర్శకుల మన్ననలను అందుకుంటున్నాయి. అవి వేల సంవత్సరాల పూర్వం రాయబడినప్పటికీ నేటికి నవనవంగా ఉన్నాయి. చైతన్యాన్ని ప్రజ్వలింపజేసే విధంగా ఉన్నాయి. అనుశీలించినకొద్దీ విశేషార్థాలను కాలాన్ని అనుసరించి అందిస్తున్నాయి.

పురాణ పురుషులలో శ్రీరాముడు, హరిశ్చంద్రుడు, ధర్మజుడు వంటి లోకోత్తర చరిత్ర కలిగివున్న మహనీయులంతా పరిమితమైన మాటలతో ఆనాటి సమాజాన్ని బాగా ఆకట్టుకోగలిగారు. అదే కాలాలలో బతికిన ధూర్త నాయకులు పరుషపదజాలాలను వాడి సమాజంచేత, బంధువర్గంచేత తిరస్కరింపబడ్డారు. మాట తేనె ఊటలా ఉబికివస్తే అంతటా ప్రశాంతత ప్రవహిస్తుంటుంది. మాట వెగటైన కనిపించినంతమేరా అరాచకం కరాళనృత్యం చేస్తుంది.

తెలుగు సాహిత్యంలో ఆదికవిగా ఆరాధింపబడుతున్న నన్నయ తమ కవితా లక్షణాలను ప్రకటిస్తూ "సారమతీం గవీంద్రులు"[322] అనే పద్యంలో 'ప్రసన్నకథా కలితార్థయుక్తి' అనే పదబంధంలో ఉక్తికి ఉన్న విశేషాన్ని తెలిపారు. కవిత్రయంలో కడపటివాడూ, ప్రబంధపరమేశ్వరుడు అనిపించుకున్న ఎర్రన "ఉన్నత సంస్కృతాది"[323] అనే పద్యంలో 'చతురోక్తిపదంబుల' వాడినారు. శ్రీనాథుడు కూడా ఎర్రన ఉక్తిలాలిత్యానికి ముగ్ధుడై ఆయన కవిత సూక్తి వైచిత్రితో ఉంటుందని ప్రశంసించారు. అల్లసాని పెద్దనవి శిరీష కుసుమపేశల సుధామయోక్తులు కదా! అయితే కావ్య ప్రబంధాలలో సూక్తులు క్వాచిత్కంగానే వాడబడినాయని చెప్పవచ్చు. భర్తృహరి సుభాషిత త్రిశతి బాగా ప్రచారంలో ఉంది. పదకవులూ, శతకకవులూ, యక్షగానకవులూ సూక్తులకు ప్రత్యేక స్థానాలను ఇచ్చారు. తెలుగు వాఙ్మయంలో అమితంగా పేరు సంపాదించుకున్నవి సుమతి శతకం, వేమన శతకం. ఈ శతకాలలోని సూక్తులు సంఘసంస్కరణానికి బంగారుబాటలు. జీవితసారంలోంచి అక్షరరూపంలో వెలువడిన రసగుళికలు. అవి ఎల్లవేళలా జనుల రసనాగ్రాల మీద నడయాడుతూ ఉంటాయి. భాషా సారళ్యంతో కూడిన ఈ శతకపద్యాలు జన సామాన్యంలోకి సూటిగా చొచ్చుకుపోయి



జడుల్ని సైతం స్పందింపజేస్తాయి. అందుకే వాటికంత ఆదరణ. గౌరవం.

ఆధునికుల్లో చాలామంది సూక్తులను రాశారు. కొందరి రచన అంతా సూక్తిప్రాయంగా అనిపిస్తుంది. తెలుగు కవుల్లో కొందరు సూక్తులను పురాణ ఇతిహాసాల నుంచి తీసుకుంటే, మరికొందరు తనచుట్టూ విస్తరించి ఉన్న సమాజం నుంచి సంగ్రహించి వాటికి చక్కని రూపాన్ని, ఆత్మనిచ్చారు. మరికొందరు తామే సృష్టించారు. అయితే దార్శనికుడైన కవి కలం నుంచి వచ్చిన సూక్తులే ప్రజావళి మానసాలలో దూరి చిద్విలాసం చేస్తున్నాయి.

సూక్తికి హితోక్తి, హితోపదేశం, సుభాషితం, తెలివైనమాట, జాతీయోక్తి అనే అర్థాలు చెప్పవచ్చని[324] డా॥ దివాకర్ల వెంకటావధాని అభిప్రాయం. ఏదైన ఒక నీతినో, ధర్మమునో, న్యాయమునో, సూటిగా సూత్రప్రాయముగా చెప్పినప్పుడు వాటిని సూక్తులని వ్యవహరించుట పరిపాటి... అర్థాంతరన్యాసాలంకారములు, నీతి బోధకములు, లోకానుభవ సూచకములగు పదములు, పదబంధములు, లోకోక్తులు, జాతీయములు అన్నియు సూక్తులనబడుచున్నవని[325] డా॥ జి.నాగయ్య అంటారు. 'సూక్తి' అంటే మంచిమాట. విలువైన మాట. తేనె ఊటలా చవులూరించేమాట. ఆత్మీయతను పెంచేది. అనురాగాన్ని పంచేది. మమతను వెదజల్లేది మంచిమాట. సూక్తిని సుభాషితం అని కూడా అంటారు. అమరవాణి అనడంలో కూడా విప్రతిపత్తి ఉండదు. అందంగా అభివ్యక్తీకరించిన నీతివాక్యం లేదా ధర్మబోధ లేదా లోకనీతి సూక్తి[326] అని జీవియస్ చెప్పారు.

సూక్తులు కవి కలం నుంచి రావచ్చు. ఉత్తముని హృదయం నుంచి రావచ్చు. కాలాన్ని శాసించే మేధావి ఆలోచనల నుంచీ వెలువడవచ్చు. సూక్తులు అనేవి ఏ ఒక్కరి సొంతమూ కాదు. సమాజాన్ని రూపొందించడంలో తమ జీవితాలను అర్పించిన మానవోత్తముల ప్రతి మాట సూటిగా ఉంటుంది. నీటుగా ఉంటుంది. అది సమకాలంలోనూ, అనంతర కాలాలలోనూ సూక్తిగా పరిణమిస్తుంది. సమాజంలోని సమాంతర రేఖలను కలపడానికి ఒక సుందరమైన ఆవరణను ఏర్పరచడానికి దోహదపడుతుంది. దీనినిబట్టి లోకహిత ప్రబోధకమై, ఉపదేశాత్మకమైన ఉక్తిని సూక్తి అని మనం రూఢిగా భావింపవచ్చు.

ఆచార్య తిరుమల పసితనం నుంచే కవిత పలుకుతున్న కోకిల. సాహిత్య దృక్పథాల అంతస్తత్త్వాలను బాగా ఆకళింపుకు తెచ్చుకున్న సాహితీమూర్తి. ఆయన హృదయం నుంచి ప్రతి ఊహా అక్షరరూపంగా, కవితాక్షర స్వరూపంగా రవళిస్తుంది. నిరంతర అధ్యయన శీలి అవడంచేత తిరుమల కవితాసూక్తి సుధామయంగా చవులూరిస్తుంది.

'చక్రధ్వజం' కావ్యంలోని బలభద్రం అనే ఖండిక తొమ్మిది కందపద్యాల సూక్తి ముక్తాహారం. ఈ హారంలోని ముక్తి స్వచ్ఛత చూడండి:

తిట్టుట అల్పునకు బలము
కొట్టుట రౌడీకి బలము, కుటిలాత్మునకున్
కుట్టుట బలము, విరోధికి

గుట్టెరుగుట బలము, ములికి కోలకు బలమౌ[327]
పరుగే లేడికి బలమగు
పరువే కాంతకు బలమగు, పటు సాక్ష్యమె లా
యరునకు బలమగు, నిండగు
చెరువే చేపకు బలమగు, సిరి హరి బలమౌ[328]

ఈ ఖండికలోని కంద పద్యాలన్నీ నిజంగా కంఠస్థం కావలసినవే. జీవితంలోని అనుభవాలను, సత్యాలను పద్య నిబద్ధం చెయ్యడంలో ఒక నేర్పు కనిపిస్తుంది. ఒక సొగసు కనిపిస్తుంది. కొన్ని సూక్తులు ప్రసన్న మధురాలు. కొన్ని ఆలోచనాత్మకాలు.

సమరము వీరుని బలమగు
సమయము భీరుని బలమగు[329]

వీరుడు ధైర్య ప్రతాపాలను ప్రదర్శించి సమరంలోనే తన బలం నిరూపించుకుంటాడు. తన మీద కాలు దువ్విన వాళ్ళని గడ్డికరిపిస్తాడు. సమరరంగమే అతనికి సరైన ప్రదేశం. భీరువు అలా కాదు. ఎదురుపడిన శత్రువుల్ని గెలవలేడు. అందుచేత చాటుగా వెన్నుపోటు పొడుద్దామని అనుకుంటాడు. అటువంటి సమయం కోసం నిరీక్షిస్తూ కక్ష తీర్చుకునేందుకు ప్రయత్నిస్తాడు. అతను స్వయంశక్తి మీద కాక సమయం మీదే ఆధారపడతాడు. కాబట్టి అదే అతనికి బలం.

'నిర్మాణ నిపుణ రచనమె నేతకు బలమౌ'. నేత అంటే రాజకీయ నాయకుడు. అతని ధర్మం ప్రజాసేవ. ప్రజాపాలన. నిజాయితీ గల నాయకుడు ప్రజల హితం కోరి మంచి పథకాలు చేపట్టాలి. స్వల్పకాలిక, దీర్ఘకాలిక కార్యక్రమాలు రూపొందించాలి. అవి నిర్మాణాత్మకంగా ఉండటానికి తన సునిశిత బుద్ధిని ఉపయోగించి ఒక వ్యూహాన్ని లేక ఒక పథకాన్ని సిద్ధంచేసి అమలుపరచాలి. అప్పుడతనికి ప్రజలు అండదండగా నిలుస్తారు. అతనికి బ్రహ్మరథం పడతారు. అదే నాయకుడికి కొండంత బలం.

తిరుమల కొన్ని సూక్తులు భావదీప్తితో పరిపుష్టమై ఉన్నాయి.

కండబలము కన్న గుండె బలము మిన్న
సింహమేన్గు కన్న చేవనొప్పు
హృదయకేంద్ర శక్తి ఈశ్వరీయంబౌను
స్పర్ధలేని జ్ఞానశక్తి అదియ[330]

ఈ పద్యంలోని మొదటి రెండు పాదాలకూ చివరి రెండు పాదాలూ వ్యాఖ్యానం. ఏనుగు కండ బలానికీ, సింహం గుండెబలానికీ ప్రతీకలు. హృదయం ఆత్మశక్తికి ప్రతీక. సింహం మృగరాజు. దానికి పౌరుషమూ, గుండెబలమూ ఎక్కువ. గుండె బలంగానూ, దిటవుగానూ ఉన్నప్పుడు బుద్ధిబలం ప్రదీప్తం అవుతుంది. అది స్పర్థలేనిది. పోటీ లేనిది.



మన శరీరంలోని సప్త కమలాల మధ్య భాగాన్ని హృదయ కమలం ఆక్రమించి ఉంటుంది. ఇది ఈశ్వర స్థానం. ఈశ్వరీయం. అనాహత చక్రనిలయం. జ్ఞానశక్తి (కుండలిని) ప్రబోధానికి ఇది కేంద్ర స్థానం. అందుకే గుండెబలం మిన్న.

బాహ్య జగతికన్న భావనా విశ్వమే
తన యధీనమందు దనరుచుండు
భావమెంత కాంతివంతమైన బ్రతుకు
అంత కాంతిమంత మగుచునుండు[331]

ఇక్కడ బాహ్యాభ్యంతరాలకు గల తేడాను గమనించాలి. బాహ్య జగత్తు ఒక రకంగా ఉంటుంది. దానిని మనకు అనుకూలంగా మార్చుకోవడం, దాని మీద ఆధారపడి బతుకును పండించుకోవడం సాధ్యంకాదు. అది మన చెప్పుచేతుల్లో ఉండదు. దాని మార్గంలో నడిస్తే మనం అస్తిత్వాన్ని కోల్పోయే ప్రమాదం ఉంది. అయితే భావనా ప్రపంచంలో మాత్రం మనిషికి సంపూర్ణమైన స్వేచ్ఛ ఉంది. ఎవరి బతుకును వారు తీర్చిదిద్దుకునే అవకాశం ఉంది. ఈ అవకాశాన్ని వినియోగించుకొని కాంతిమంతమైన భావవీధిలో ధ్యేయాలను నిర్ధారించుకొని, వాటిని స్వేచ్ఛాయుతంగా అమలుపరచుకొని జీవితాన్ని కాంతి వలయంగా రూపొందించుకోవచ్చు.

తిరుమలలో ధర్మనిష్ఠ, తత్త్వచింతన ఎక్కువ. ఆడంబరం మీద, భోగకాంక్ష మీద మక్కువ తక్కువ. తనకున్నదానితో తృప్తిపడే గుణం ఎక్కువ. అందుకే ఇలా అన్నారు.

తృప్తి నొందని వాడెపో ధీనుడగును
తీప్తినందెడు వాడెపో ధీరుడగును
గడ్డిపోచయే మేరు శిఖరము నాకు
నను జయించుట కష్టమే మనుజునకును[332]

పద్యంలోని మొదటి రెండు పాదాలు జీవితసత్యాలు. చివరి రెండు పాదాలు ఈ సత్యాలకు భాష్యాలు. కవి ఆత్మ విశ్వాసానికీ నిదర్శనాలు. అసంతృప్త జీవనుడు అత్యాశాపరుడై, ఆత్మస్థైర్యానికి దూరుడై అధోగతి పాలౌతాడు. సంతృప్త జీవనుడు దురాశాపాశీ వినర్ముక్తుడై ఆత్మబలాతిరేకుడై మేరుశిఖరాన్ని కూడా అధిరోహించగలడు. అంటే అంత మహోన్నత స్థితికి ఎదిగిపోతాడు. ఇంకా అతనికి పతనం ఎక్కడిది? పరాభూతి ఎక్కడిది? అందుకే అతను అజేయుడు. ఇది అతిశయోక్తిగా కనిపించే స్వభావోక్తి.

ప్రతిమనిషి తన కాళ్ళమీద తానే నిలవాలనీ, ఒట్టి మాటలతో కాలయాపన చెయ్యడం ఆత్మహత్యా సదృశమనీ, లేనిపోని గొప్పలు చెప్పుకుని 'లేమి పురులు విప్పి' నటించేవాడంటే తనకిష్టం లేదనీ తిరుమల కొన్ని సూక్తుల ద్వారా స్పష్టం చేశారు. ఇవి ఆయన వ్యక్తిత్వ వికాసానికి తార్కాణాలే కాకుండా సమాజానికి సందేశాత్మకాలు కూడా.

ఈ ప్రపంచంలో నోరున్నవాడిదే రాజ్యమని, ఏ ఎండకా గొడుగు పట్టే వాడికే గౌరవం దక్కుతుందని కవి ఆవేదన చెంది, అడుగడుగునా అన్యాయాలకు గురౌతున్న సజ్జనావళికి జరుగుతున్న అక్రమాలను ఇలా ప్రశ్నిస్తారు.

సాధుమూర్తుల బ్రతుకులు సాగనట్టి
సాంఘిక న్యాయమది యేమి? సంఘమేమి?
పరమ దుష్టులకు గొడుగు పట్టుకాల
మేమి? కల్పనా విజ్ఞానదృష్టి కాంతి!
... ... ... మహాత్ముడైన
వాని నాదరింపలేని ప్రభుత యేల?
దాని విభవమేల? ధర్మమేల?[333]

కవి ఈ ఆవేదన ఆగ్రహంగా ఎలా మారిందో ఈ కింది పద్యం చెబుతుంది.

స్త్రీల కన్నీరు నట్టింట శ్రీహరించు
గాని, పరమ సాత్త్విక భావగాములైన
వారి కన్నీరు దేశ సంపదలె కాల్చు
ప్రకృతి వైపరీత్య క్రియా పాటవమున[334]

అలాగే అలనాటి తారకాసుర సంహార విషయాన్ని ప్రస్తావిస్తూ

నాటి తారకాసురు ద్రుంప నడుము కట్టి
నిల్చి పోరిన ముక్కోటి నిర్జరులును
నేటి విషనేత్ర తారకా నిగ్రహంబు
సల్పనేమైరి? నరులకు జంకినారె![335] అని ఆశ్చర్యపడతారు.

తిరుమల సూక్తులు భవిష్యత్ ఊష్మలతను భావిస్తాయి.

చీకటిగా ఉందని చిరాకుపడకు
చిరుదివ్వెను వెలిగించు[336]

అన్న సూక్తి వ్యక్తి చైతన్యాన్నీ, సమాజ వికాసాన్నీ పురికొల్పుతుంది. చీకటి కమ్ముకొచ్చినప్పుడు, దారి కనిపించనప్పుడు, బతుకులను చీకట్లు చుట్టేసి రూపు అన్నది కనిపించనప్పుడు మనిషి చిరాకు పడతాడు. వెలుగుతీరం అందడం లేదని ఆక్రోశిస్తాడు. పిచ్చిగా చిందులేస్తాడు. కడకు కుంగిపోతాడు. అలాంటి విషమవేళలో కవి రాసిన కవితా పంక్తులు మనిషికి ఊరటను కలిగిస్తాయి. చిన్న దీపాన్ని వెలిగించమని చెబుతాయి. అదొక్కటే చాలు గాఢమైన చీకట్లను తరిమికొట్టడానికి. పై సూక్తిలో ఇంత భవ్యార్థం దాగి ఉంది.

కొందరికి మేధ ఉన్నా అది సరిగా పనిచేయదు. ఏదీ తోచనివ్వదు. తిరుమల అలాంటి మందబుద్ధులకు ఇలా సలహానిచ్చారు.



గాలి లేక ఉక్కపోతున్నానని గంతులు వేయకు
గది తలుపులు తెరువు[337]

ఇంతమాత్రం చేయకుంటే అలాంటి మనుషులు సమాజానికి పనికిరారు. అంతెందుకు తమకు తామే పనికి రారు. అటువంటి వాళ్ళకు తిరుమల సూచన కరదీపిక వంటిది.

ఎవరు గుణవంతుడో ఎవడు భగవంతుడో కవి సూక్తిలోని చమత్కారం స్పష్టంగా కన్పిస్తుంది.

ఉపకారం చేసేవాడు గుణవంతుడు
అపకారం చేయనివాడు భగవంతుడు[338]

ఇది ఒక రకంగా యదార్థం. మంచి గుణాలున్న మనిషిని గుణవంతుడంటారు. గుణవంతుని పని ఉపకారం చెయ్యడమే. అడిగించుకోకుండానే సాటివాళ్ళ సౌఖ్యానికి తోడ్పడతాడు గుణవంతుడు. మరికొందరు ఎట్లా ఉంటారంటే ఉపకారం చేయకపోయినా అపకారం తలపెడతారు. "ఊరక సజ్జనుండొదిగి" ఉన్నప్పటికీ కీడు కలిగిస్తారు. మేలు చేయకపోయినా కీడు కలిగించకుంటే చాలు. అలాంటివాళ్ళు దేవుడితో సమానమని, తిరుమల ఉపకారంకంటే అపకారం చేయనివాళ్ళే గొప్ప అనే భావాన్ని వ్యక్తం చేశారు. ఇది సమకాలీన జీవన విధానాన్ని స్పష్టంచేసే సూక్తి. తిరుమల గుణవంతుడు, భగవంతుడు అనే ఈ రెండు మాటలను పాదాల చివర ప్రయోగించి అంత్యప్రాసతో సూక్తి మాధుర్యాన్ని మరింత పెంచారు.

అనాది నుంచి లాక్షణికులు, కవులు కవితకు నిర్వచనాలు ఇస్తూనే వస్తున్నారు. ఎవరికి నచ్చింది వాళ్ళు చెబుతున్నారు. ప్రాచ్య పాశ్చాత్య పండితుల నిర్వచనసారాన్ని చూస్తే అందం, ఆనందం, ప్రయోజనం అనే మూడంశాలు కవితలో కన్పిస్తాయి. వర్తమానంలో కూడా కవులు కవితకు నిర్వచనాలు ఇస్తున్నారు.

ఆకాశం హృదయంలో మెరిస్తే–కవిత
ఆనందం ఆలోచనలో విరిస్తే–మానవత[339] అని అన్నారు.

ఆకాశం హృదయంలో మెరవడమంటే విశేషమైన విషయం. ఆకాశం అంతా ఒకేవిధంగా ఉండదు. సూర్యచంద్రుల నడకలు, నక్షత్రాల విలాసాలు, మేఘాల పరుగులు, గ్రహాల గమనాలు, హ్యోమనౌకలు మొదలైనవాటి అలజడులతో ఆకాశం కన్పిస్తుంది. మనిషి జీవితం కూడా ఆకాశం లాంటిదే. మనిషి ఆకాశం లాంటి స్థితిని అనుభవిస్తే చాలు. అతడు ఉత్తముడవుతాడు. ఆ ఉత్తమత్వం నుండే వచ్చిన కవిత ఆనందాన్నిస్తుంది. మనిషిలో చిగురెత్తిన ఆనందానికి ఉదాత్తమైన ఆలోచన తోడైతే అది మానవత అవుతుంది. మనిషిలో కొన్ని వేళల పైశాచికానందం తరముకొస్తే అతడు ఇతరులకు కీడు చేయడానికి వెనుకడుగు వేయడు. తన సంతోషాన్ని మరొక గుండెకు ఆయుధంగా రువ్వుతాడు. ఇతరుల బతుకుల్లో కల్లోలాలు సృష్టిస్తాడు. అయితే, ఆ ఆనందాన్ని ఉదాత్త ఆలోచనలతో మిళితం చేస్తే

అతనిలో మానవత పరిమళిస్తుంది. మనిషిని సౌఖ్యాలలో ఓలలాడిస్తున్న అన్ని పరిస్థితులకన్నా మానవత మిన్న. ఈ రెండు కవితా పంక్తులలో తిరుమల ఈ భవ్యార్థాన్ని నిర్వచన స్వరూపంలో మనిషిపరంగా అందించడం ప్రత్యేకంగా ఉంది.

మనిషి జీవనది
మానవతా మహాసముద్రం[340] అన్న కవితా పంక్తులు సూక్తిరూపాలు. వీటిలో మనిషికంటే మానవత గొప్పదిగా చెప్పబడింది.

ఆచార్య తిరుమల సహజకవి. సంఘం అవినీతి కూపంలో దిగబడిపోకుండా ఉండటానికి మనిషిలో రుష్యాత్మను ప్రతిష్ఠించడానికి ఆయన సుభాషితాలను విరివిగా రాశారు.

మంచితనమున్నచో ముల్లు మల్లెయగును
మాట వెగటైన మణియైన మట్టియగును[341]

మనిషిలో మంచితనం ఉదయించడం మామూలు విషయం కాదు. మాటచేత, నడత ఇవన్నీ పవిత్రంగా ఉన్నప్పుడు, అందరినీ గుండెకు చేర్చుకున్నప్పుడు, అనురాగాన్ని అల్లించినప్పుడు, కష్టాల్లో నష్టాల్లో ఆదుకొని వాళ్ల సౌఖ్య జీవనానికి బాటలు వేసినప్పుడు అలాంటి మనిషిలో మానవత్వం సురభిస్తుంది. అప్పుడు అలాంటి రాగసుధలలో తడిసినప్పుడు ముళ్ళలాంటి హృదయాలు కూడా మారిపోయి మల్లెలలా విరబూసి సౌరభాలను వెదజల్లు తాయి. అలా కాక మాట వెగటుగా మారిపోతే బతుకంతా బాధలతో రగిలిపోతుంది. విరబూసిన ఆశయాలు ముడుచుకుపోతాయి. మణిలా జ్వలించినవాళ్ళు కూడా మట్టిలా మిగిలిపోతారు.

గుణములను మెచ్చుకొనుటయే గొప్ప కాదు
దోషముల కోర్చుటే గొప్ప దొరతనంబు[342]

మనిషి మంచి చేసినప్పుడు అతణ్ని పైకెత్తుతారు. మెచ్చుకుంటారు. పూలతో ముంచెత్తుతారు. సత్కార సన్మానాలతో అభిషేకిస్తారు. ఆవేళ- ఆ పురస్కారాలకు మనిషి పరవశిస్తాడు. మంచిదే- అయితే మేలు చేసినప్పటికీ కొన్ని సన్నివేశాలలో మనిషి అపనిందల పాలౌతాడు. దోషిగా ఎంచబడతాడు. అవమానపు పోట్లతో నలిగిపోతాడు. దూరం విసిరివేయబడతాడు. అయినప్పటికీ ఈ ఆగడాలను తట్టుకోవాలి. నిలబడాలి. అప్పుడే మనిషిలోని దొరతనం తెలుస్తుంది. సహజంగా కొందరు వ్యక్తులు పొగడ్తలకు పొంగిపోయి తెగడ్తలకు కుంగిపోతారు. ఆ దృక్పథం ఉచితం కాదు. తగులుతున్న నిందలకు దోషాలకు తట్టుకోవడంలోనే అతని ప్రత్యేకత ఉంటుంది.

అంతరాలు తెలియాలి. అలా కాకపోతే వ్యవస్థ పతనమవుతుంది.

గురువు నిలబడి శిష్యులు కూరుచున్న
చదువు చతికిలబడినట్టే గదరబడులు[343]



గురువు స్థానం బడిలో, సమాజంలో విశిష్టమైంది. పూజనీయమైంది. అయితే విద్యార్థులలో కొందరు గురువును సాక్షాత్తు దైవంగా ఆరాధిస్తారు. అందలాలలో కూర్చోబెట్టి ఊరేగిస్తారు. మరికొందరు తెలిసి కూడా గురువును నిర్లక్ష్యం చేస్తుంటారు. పూజ్యభావాన్ని చూపరు. గురువులు నిలబడి ఉన్నా వాళ్ళు కూచుంటారు. ఎక్కడో కాదు గుడిలాంటి బడిలో. గురువులు లేని సమయంలో వాళ్ళు కూర్చునే కుర్చీలో కూర్చొని చెడుగా ప్రవర్తిస్తారు. మందలించిన అధ్యాపకుణ్ని వెకిలి మాటలతో నొప్పిస్తారు. ఇలాంటి శిష్యుల ప్రవర్తనను గమనించిన డా॥ మిరియాల రామకృష్ణ "ఓనమాలు రానివానికి ఒజ్జ భయపడు విషమసంధ్యల"[344] మానవత్వం లేదని తెలిపారు. అట్లా విద్యార్థుల ప్రవర్తన కొనసాగితే బడులలో చదువులు చతికిలపడిపోతాయి. అలా చదువులు చతికిలబడితే విద్యార్థుల జీవితాలు చితికిపోతాయి. ఇది శ్రేయస్సు కాదంటారు తిరుమల.

మనిషికి కొన్ని లక్షణాలు పరిమితంగా ఉండాలి. అలా కానప్పుడు అతడు మనిషి కాకపోవచ్చు.

కోపమే లేని బ్రతుకొక శాపమగును
కోపమే గల బ్రతుకొక శాపమగును[345]

మన పూర్వీకులు కోపాన్ని అరిషడ్వర్గాలలో చేర్చారు. ఇవి మనిషిలో ఉంటే అతనిలో మానవత్వం ఉండదని వాళ్ళు భావించారు. కాని, కొన్ని సందర్భాలలో కోపాన్ని చూపవలసి ఉంటుంది. అనాదికాలం నుంచి పరిశీలిస్తే సాధువులు, సత్పంగులు, ఉదాత్తజీవులు కూడా కొన్ని సమయాలలో కోపాన్ని చూపి పరిస్థితులను మానవత్వంగా మలచివేశారు. ధర్మానికి ప్రతీకగా ఎంచబడుతున్న పాండవాగ్రజుడు దాయాదులు కల్పించిన పరాభవాగ్నులలో కాల్చివేయబడుతున్నప్పటికీ కోపాన్ని చూపలేదు. అహంకారాన్ని ప్రదర్శించనూ లేదు. కాని, కురుక్షేత్ర రణాంగణంలో తన మేనమామ శల్యుణ్ని హతమార్చాడు. తిరుపతి వేంకటకవులు ఆయన తత్త్వాన్ని "అలుగుటయే యెఱుంగని మహాను గతాత్ముడజాత శత్రుడే యలగిననాడు సాగరములన్నియునేకము గాక పోవునే"[346] నన్న మాటలు సత్యసన్నిహితాలు. సినారె "నువ్వసలు అలగనే అలగవట, అలిగితే సాగరాలు కలుగునట"[347] అని ధర్మరాజు అసలు రూపాన్ని తాత్త్వికంగా చెప్పారు. అంతటి సాధుమూర్తిలో కూడా అవసరమైనవేళ క్రోధసాగరాలు గర్జించిన వైనం కన్పిస్తుంది. కొన్ని పనులు, ఫలితాలను అందుకోవాలంటే మనిషిలో కొంత కోపగుణం కూడా ఉండాలి. కాని, మరికొందరు కోపమే జీవితంగా ఉంటారు. ఇందుకు మహర్షి దుర్వాసుడు ప్రతీక. ఆతిథ్యంలో కొద్దిపాటు వెసులుబాటు కనిపించినా శాపాయుధాన్ని విసిరి వాతావరణాన్ని కలుషితం చేయడం ఆయన గుణం. వర్తమానంలో కూడా కొందరు కోపిష్ఠులను దుర్వాసునితో పోల్చటం మనం చూస్తూనే ఉన్నాం. కృష్ణుని అష్టభార్యలలో సత్యభామ ఈ కోవకు చెందిన స్త్రీ మూర్తి. ఆమెలో కోపం, అహంకారం పాదుగా పుట్టుకొచ్చింది. తులాభారం పిదపగానీ ఆమెలోని క్రోధావేశాలు చల్లబడిపోయాయి. కోపం కొన్ని పాళ్ళల్లో ఉంటే బతుకు శోభిస్తుంది. అది జీవిత లక్ష్యమైతే బతుకంతా నరకమవుతుంది.

మనిషికి ఏవి అలంకారాలుగా ఉంటే జీవితం భాసిస్తుందో తిరుమల స్పష్టంగా చెప్పారు.

మానసిక శోభ జీవిత మహిమ యగును
మహిమ గలవారి మాటలే మాన్యమగును[348]

అందాలు రెండు విధాలు. ఒకటి బాహిరమైంది. రెండవది ఆంతరమైంది. బాహిరమైనది కేవలం దేహ సౌందర్యాన్ని తెలిపేది. ఆంతరమైనది మనస్సుకు సంబంధించినది. దేహ సౌందర్యం అశాశ్వితమైంది. మానసిక సౌందర్యం పది కాలాలు నిలిచేది. దేహం అందంగా శోభిల్లడానికి విలువైన వస్తువులను అలంకరిస్తారు. సుగంధ ద్రవ్యాలను పులుముకుంటారు. ఇవన్నీ కూడా స్వల్పకాలం సంతోషాన్ని పంచిపెట్టేవి. కొద్దికాలం మురిపించేవి. దీనికంటే భిన్నమైంది, శాశ్వతమైంది మానసిక శోభ. మానసిక శోభకు వెండి, బంగారం లాంటి ఏ నగలనూ సింగారించవలసిన పని లేదు. మాట, చేత, నడక ఆదర్శంగా ఉంటే చాలు. అదే సౌందర్యం. సౌభాగ్యం. వీటివల్లనే మానవుడు మాధవుడవుతాడు. మహనీయుడు అవుతాడు. అప్పుడు అతని జీవితమంతా మహిమలతో భాసిస్తుంది. అలాంటి మహిమ గలవారి మాటలే మాన్యమవుతాయి. కలకాలం ఉంటాయి. కాలాన్ని కూడా శాసిస్తాయి.

ప్రాణమున్నంత వరకె దేహంబు విలువ
ధనమున్నంత వరకె బాంధవుల చలవ[349]

శరీరానికి ప్రాణం ఉంటేనే విలువ. అది ఉంటేనే దేహం కదలిక. అందం, చందం అంతాను. ఊపిరి వెళ్లిపోతే ఆ దేహం శ్మశానవాటికలో బుగ్గికావలసిందే. అట్లాగే ధనమున్నవాళ్ళ పరిస్థితి కూడా. ధనవంతుల దగ్గరకే బంధువులు, మిత్రులు వస్తారు. ప్రేమను చూపుతారు. అదీ కాస్తపోయి పేదవాళ్ళయితే ఎవ్వరూ సమీపించరు. ఈ తత్త్వాన్ని సుమతిశతకకారుడు "తెప్పలు చెఱువు నింపిన కప్పలు పదివేలు"[350] చేరినట్టు వర్ణించారు. నిలకడ ఉన్న మనస్సులోనే హాయి ఉంటుందని తిరుమల భావన.

కలసి కలవని మనసులో కలదు హాయి
అంత దగ్గరునున్న చూపానదోయి[351]

అన్నింటిలో ప్రధానమైంది మనస్సు. మనిషి దీన్ని అంతగా పట్టించుకోడు. అతనిలో ఆనందం పురులు విప్పినప్పుడు, ఆత్మీయం విరగబూసినప్పుడు తననూ, తన హృదయాన్నీ తానే మెచ్చుకుంటాడు. తనంతటివాడు లేడని గర్విస్తాడు. హద్దులు మీరిన అహంకారంతో మరొకరితో కలసి జీవించడానికి ఆసక్తి చూపడు. ద్వేషిస్తాడు కూడా. మరికొందరెలా ఉంటారంటే ఎదుటివాళ్ళతో కాసేపు హృదయాన్ని మమేకం చేసి, ఏవో కొన్ని స్పర్థలు రావడంతో తన మనస్సును మళ్ళించుకుంటాడు. ఇంకొందరు మరీ ఆత్మీయతను చూపి తత్క్షణమే వాదులాడుతారు. హత్తుకొనిపోవడం, ఐక్యంగా సాగడం మంచిదే. అది కలకాలం కొనసాగితేనే పరమార్థం. అలాకాక, కాసేపు హృదయాలను కలిపి మరికాసేపు వాదులాడి



విడదీసి బతకడంకంటే కలసీ కలవకుండా అంటే మరీ చేరువుగా, ఆ పిదప దూరమవడం కంటే అందీ అందకుండా ఉండడంలో ఆత్మసౌఖ్యం ఉంటుంది. వస్తువును ఎంత దూరం నుంచి చూడాలో అంత దూరం నుంచే చూడాలి. మరీ దగ్గరగా చూస్తే వస్తు స్వరూపంగా స్పష్టంగా కనిపించదు. దేనికైనా పరిమితం ఉండాలి.

ఆత్మీయం అందివచ్చిన వాళ్ళతోనే స్నేహం నెరపాలని కవి భావన.

చెప్పు నిన్ను కరచిన నీవు చెప్పు గరతు
వే! విడిచిపెట్టు మూర్ఖుల వావి వరుస[352]

ఆత్మీయతను, అనురాగాన్ని మంచివాళ్ళతోనే పంచుకోవాలి. అనుభవించాలి. అందులోనే జీవితం తళుకొత్తుతుంది. పరిమళిస్తుంది ఆశయం. మంచివాళ్ళను పిలవడంలోనే మాధుర్యం, మహత్యం మనసు వాకిళ్ళలో నిలిచి మనీషను మురిపిస్తుంది. చెడ్డవాళ్ళను ఆత్మీయమైన వావివరుసలతో పిలిస్తే వాళ్ళ హృదయాలలో ఉన్న కాపట్యం చెరిగిపోదు. మానవత్వం వికసించదు. మంచితనాన్నీ, మంచిమాటనూ మూర్ఖులు ఖాతరు చేయరు. పైగా దూషిస్తారు. కడకు కలహానికి కూడా సిద్ధమవుతారు. మానవత్వాన్ని బతికించే ఐక్యతను, సంధానించే వావివరుసలను దుర్జనుల సమక్షంలో వాడితే కీడు మాత్రమే మిగులుతుంది. అక్కడ కాలుష్యం మాత్రమే తాండవిస్తుంది. కాలికి ఉన్న చెప్పు అప్పుడప్పుడు పాదాన్ని కరచినట్లు తోస్తుంది. అలా అని మనిషి ఆ చెప్పును కసితో, కక్షతో కొరికివేయడు కదా! మనిషన్నవాడు సజ్జనులతోనే ప్రియభాషలు పలకాలి. కాని దుష్టులతో కాదు. ఇలాంటి మూర్ఖులను వేమన్న "చెప్పు దినెడి కుక్క చెరుకు తీపెరుగునా"[353] అని ఈసడించారు.

ఆలుమగలలో ఎవరు ఎలాంటివారో కవి స్పష్టంగా తేల్చి చెప్పారు.

మగని చెడునైన భరియించు మగువ, కాని
ఆలి మంచైన చెప్పుకోడేల మగడు?[354]

భార్యాభర్తలు ఇద్దరూ ఒకే లక్షణాలు కలిగి ఉండరు. అయితే మగడు అనేక దురలవాట్లకు బానిసగా మారి ప్రవర్తిస్తుంటే అతని అర్ధాంగి చూస్తూ మిన్నకుంటుందే కాని ఇతరులకు చెప్పదు. మరీ అతని దుర్జనత్వాన్ని భరిస్తుంది. ఇతరకులకు మాత్రం తన భర్త గొప్పవాడిగానే చెబుతుంది. అయితే తన భార్య ఉత్తమ గుణాలు కలిగి సాధ్విలా ఉంటున్నప్పటికీ భర్త ఆమె పాతివ్రత్యాన్ని గూర్చి ఎక్కడా చెప్పడు. ఆమెను ప్రియభావనతో ఆదరించి 'తల్లిని మరిపించే ఇల్లాలి ఆదరణ'ను భర్త మెచ్చుకోవడంలో దోషం లేదు. మనిషి తన మనస్సును నమ్మితేనే పరమార్థం ఉంటుందనేది కవి ఉవాచ.

హృదయమును నమ్మి చేసినదేదియైన
సత్ఫలితమిచ్చు సజ్జన సభ్య జగతి[355]

మనిషికి మనస్సుకు ఉన్న సంబంధం పువ్వుకూ పరిమళానికీ ఉన్న అనుబంధం

లాంటిది. ఒకటి విడిచి మరొకటి ఉండలేదు. మనిషికి జీవనమూల్యాలను విశదంగా తెలిపేది మనస్సు. అన్ని విషయాలను మనస్సు సాకల్యంగా విలోకిస్తుంది. విరుద్ధ భావాలను వివేచిస్తుంది. మనిషి వికాసానికి దోహదపడే అన్ని కోణాలను పరిశీలిస్తుంది. మంచి విషయాలను కరదీపికగా అందిస్తుంది. మనిషి తన మనస్సు అందిస్తున్న ఆ దివ్వెను అందుకొని అడుగు ముందుకు వేయాలి. అప్పుడే జీవితంలో సత్ఫలితం లభిస్తుంది. సజ్జన సభ్యజగతిలో అతణ్ని ఉన్నతునిగా నిలబెడుతుంది.

ఉత్తముని మనుగడ ధన్యమైనట్టిదని కవి చెప్పారు.

"మంచితనము పనిచేయు మనుషులున్న
వాని జన్మంబె జన్మంబు వసుధలోన"[356]

ఊరికే వచ్చేది కాదు మంచితనం. పిలిచితే పలికేదు కాదు మానవత్వం. అహంకరిస్తే మనస్సులో పువ్వై విరబూసేది కాదు మనిషితనం. మంచితనం- మానవత్వం- మనిషితనం అనేవి మనిషి హృదయం పాదు నుంచి పుట్టిన ఒకే చందన వృక్షం. మనిషి ద్వేషాగ్నిని రగిలించుకోకుంటే, అమానుషాన్ని ఆశ్రయించకుంటే, దౌర్జన్యాన్ని పోషించకుంటే అతనిలోని అంతరంగం దేవళంగా ఉంటుంది. ఆ ఆలయంలోని విగ్రహ స్వరూపుడే మానవుడు. తానే మనిషీ, మంచితనం ఉదాత్త చరిత్రగా రూపొందించుకున్న మనిషి జీవితమే పవిత్రమైంది. ఆ పవిత్రజీవనుల వల్లనే పుడమి పులకిస్తుంది. లోకం హర్షిస్తుంది. అది నాకంగా భాసిస్తుంది.

చెట్టు తన కాయ తానె భక్షించదెపుడు
నరుడు తనవారినే తాను నమలజూచు[357]

చెట్టు పచ్చదనానికీ, మానవత్వానికీ ప్రతీక. అది తన పచ్చదనాన్ని కొమ్మలు రెమ్మలుగా చాచుతుంది. పూలుగా, పళ్ళుగా దానం చేస్తుంది. కొంటెకుర్రాళ్ళు తన దేహం మీదికి రాళ్ళనూ, రప్పలనూ విసిరినా గాఢయోగ సమాధిలో ఉన్న ఋషిలాగే ఉంటుంది. కాని, ఎవరినీ ఏమీ అనదు. తన ఫలాలను ఇచ్చుకుంటూనే ఉంటుంది. కడకు తనను తానూ సమర్పించుకుంటుంది. సాటివాళ్ళ సౌఖ్యానికి ఇంధనంగా మారిపోయి జీవితాలను పరిమళింపజేస్తుంది. కొవ్వొత్తికి ప్రతీకగా నిలుస్తుంది. ఏ విషయమవేళలలోనైనా తన ఆత్మీయతా తత్త్వాన్ని ప్రదర్శిస్తుందే కాని తన ఫలాలను తాను తినివేసే క్రౌర్యానికి పూనుకోదు. నరుడు అలా కాదు. అతడు వేదాలు చదువుతాడు. సంస్కారాన్ని ఎలుగెత్తి చాటుతాడు. కాని, మనిషిలా ప్రవర్తించడు. మానవతా శిఖరాలను చూస్తూనే ఆ దిశగా నడవడు. తాను సుఖంగా ఉండడానికి ఆదర్శాలను విడిచిపెడతాడు. అనురాగాన్నీ, ఆత్మీయతనీ తన గుండె నుంచి తరిమికొడతాడు. తన చుట్టూ ఉన్న సమాజాన్ని పీల్చుకుతింటాడు. కడకు ఇంటి తగాదాలను పెంచి రాజకీయం చేసి తోబుట్టువులను నిలువునా దోచుకొని వాళ్ళను క్రూరంగా హతమార్చివేస్తాడు. చెట్టు అలా చేయదు. చెట్టు ఆదర్శం అనే అద్దంలో నరుడు తన అంతరమైన జీవితాన్ని సరిదిద్దుకోవాలి.



మూర్ఖులకు సద్గుణాద్భుత బోధలేల
చవిటినేలల బీజముల్ చల్లుటేల?[358]

సూక్తులను, మధురోక్తులను సజ్జనులకే వినిపించాలి. ప్రయోజనం చేకూరుతుంది. అది రెట్టింపై లోకానికి శుభాన్ని చేకూరుస్తుంది. మూర్ఖులకు అందిస్తే బూడిదలో పోసిన పన్నీరవుతుంది. శ్రేయానికి మాలిన్యం పులిమినట్టవుతుంది. ఏ విధంగానైనా అతని మనస్సులో పరిణతి తేలేము. చవిటినేలలో నాటిన విత్తనం మొలకెత్తదు. అథవా, మొలిచినా మహావృక్షంగా ఎదగదు. ఫలాలను ఇవ్వదు. దాని ఎదుగుదలకు చిందిన చెమట వృథా అవుతుంది. మూర్ఖుని హృదయం, చవిటినేల ఈ రెండూ ప్రయోజన శూన్యాలే. మూర్ఖుని హృదయాన్ని ఏ బోధనలూ మార్చలేవని భర్తృహరి 'తివిరి యిసుమున'[359] అనే పద్యంలో తెలిపారు.

శ్రేష్ఠమైనది కొంచమైనా అది ప్రయోజనాన్ని కల్గిస్తుంది.

ఏడనో వంద యెకరాల బీడుకన్న
ఒక్క యెకరమ్ము పంట భూమున్న మేలు[360]

బీడునేలలోకి నీళ్ళు మళ్ళించినా, ఎరువులు వేసినా నిరుపయోగమే. చేసిన శ్రమకు అవసరమైన ఫలితం పంటరూపంలో లభించదు. దానివలన కలిగే శ్రేయస్సు శూన్యమే. అలాంటి బీడునేల వంద యెకరాలున్నంత మాత్రాన ఏమి తెచ్చిపెడుతుంది. వంద యెకరాలు అన్న తృప్తి తప్ప. శ్రేష్ఠమైన పంటనిచ్చేది ఒక యెకరం ఉంటే చాలు ఇంటివాళ్ళందరికీ అన్నం పెడుతుంది. అది ప్రయోజనానికి ప్రతీకగా ఉంటుంది. వేమన్న ఇదే అర్థాన్ని "నిక్కమైన మంచినీల మొక్కటి చాలు, తళుకు బెళుకురాలు తట్టడేల, చదువపద్య మరయ చాలదా ఒక్కటి"[361] అంటారు.

ఈ లోకంలో అందరూ సమానులే.

ఎవరికెవ్వరు యజమాని యీ జగాన
అందరును 'కూలి' పోయెరదనులోన[362]

సహజంగా యజమాని అని, సేవకుడని, రాజని, మంత్రని హెచ్చుతగ్గులుంటాయి. ఈ ఎత్తుపల్లాలు అన్నీ భౌతిక వ్యాపారం కోసమే ఉద్దేశింపబడినాయి. దేవుని సృష్టిలో. దృష్టిలో వీళ్ళంతా సమానులే. ఒక్కొక్కమారు యజమానికన్నా సేవకునికి, రాజుకన్నా మంత్రికి గౌరవాదరాలు ఎక్కువగా లభిస్తుంటాయి. ఊపిరున్నంత వరకు ఈ తేడాలుంటాయి. శవమై శ్మశానికి వెళ్ళినప్పుడు ఈ అంతరాలుండవు. యజమాని, సేవకుడు, రాజు, మంత్రి వీళ్ళంతా సమానంగా ఆ మరుభూమిలో, మట్టిలో కలసిపోవలసినవాళ్ళే. ప్రాణమున్నంత వరకే ఈ అహంభావమంతా.

కవి పేదతనాన్ని ఇట్లా నిర్వచించారు.

ధనము లేకుంటయే పేదతనము కాదు
ఆదుకోలేని ధనముంట పేదతనము[363]

ధనం లేకపోవడం వల్లనే పేదతనం వస్తుంది. అయితే అది పేదతనం కాదు. కొందరికి సంపదలు పుష్కలంగా ఉంటాయి. అయితే దారిద్ర్యంతో అల్లాడిపోతున్న దీనులను ఆదుకోరు. వాళ్ళను దూరం చేస్తారు. చీదరిస్తారు. గర్వంతో ఊగిపోతారు. సాటివాళ్ళ సౌఖ్యాలకు ఉపయోగపడని ధనం ఎందుకు? అది ఆదుకోలేని ధనం. నిజమైన పేదరికం అంటే ఇదే.

తిరుమల మనిషికిచ్చే సందేశాలు విశిష్టంగా ఉంటాయి. వినడానికి, మననం చేయడానికి, ఆచరించడానికి అనువుగా ఉంటాయి.

ప్రేమ బాష్పాలతో సత్యద్వారాన్ని అలంకరించు
నీ ఉనికిని ఈ నిరాశల ఎడారుల మీద చిలకరించు[364]

అప్పుడు బతుకంతా వసంతం అవుతుంది.

క్షణం క్షణం కష్టపడి విజ్ఞానం సాధించు
కణం కణం కూడబెట్టి ధన దీపం వెలిగించు[365]

అన్న గేయ పంక్తుల్లో కూడా మనిషి సాధించవలసిన జ్ఞానాన్ని, ధనాన్ని, కూర్చుకోవలసిన మార్గాన్ని తిరుమల నిర్దేశించారు.

శబ్దాల పోహళింపు లేకపోతే కావ్యం రసాత్మకంగా ఉండదు. పదం వాక్యానికి రూపాన్ని మాత్రమే ఇవ్వడం కాకుండా రసౌచిత్యానికి దోహదకారిగా ఉండాలి. అలా కానప్పుడు ఆ శబ్దానికి ప్రయోజనం అనేది ఉండదు. దేశంలో ఉంటూ జాతీయ దృక్పథం లేని వ్యక్తి అంతే. తిరుమల ఈ భావాన్ని సూక్తిప్రాయంగా అభివర్ణించారు.

వాక్యానికి పనికిరాని పదం ఎందుకు?
జాతీయతా భావం లేని వ్యక్తి ఎందుకు?[366]

మనిషి మనుగడ సాఫీగా సాగడానికి కొన్ని నియమాలు అనేవి విధిగా ఉండాలి. అవి లేకపోతే మనిషి జీవితం ఎగుడు దిగుళ్ళతో నిస్సారంగా ఉండిపోతుంది.

దేశం అనేది ఒక్కరిది కాదు. అది అందరి సమైక్యశక్తి. నీవు నేను అనే పడికట్టు మాటలు వదిలి దేశం అన్న పదానికి మన అనే పదంతో స్ఫూర్తినివ్వాలి.

దేశానికి నేనూ నీవూ వున్నా
'మన'దన్నదొకే అంచు
మంచినే నలుగురికి పంచు[367]



అన్న సమైక్య భావనకు తిరుమల విలువనిచ్చారు.

పక్షికి కావలసింది గూడు కాదు-రెక్క
మనిషికి కావల్సింది భ్రమ కాదు-శ్రమ[368]

పక్షులకు గూడు లేకపోయిన బతుకుతాయి. కాని ఎగరడానికి రెక్కలు ప్రధాన కారణాలు. రెక్కలు లేకపోతే వాటి బతుకులు శూన్యమైనవే. అట్లాగే మనిషి భ్రమలో జీవిస్తే ఉన్నచోటే ఉండిపోతాడు. శ్రమ ఉంటే వెలిగిపోతాడు. ముందుకు సాగిపోతాడు.

తిరుమల రచనలలో అలంకార ప్రయోగం అనేకచోట్ల కన్పిస్తుంది. ఆయన మనిషి జీవితాన్ని కావ్యంతో పోల్చి చెప్పారు. అది చిన్నదైనా చాలు మహత్తర సందేశాన్నిస్తుంది.

'జీవితం ఒక కావ్యం
అది చిన్నదైనా ఫర్వాలేదు
చక్కగా ఉంటే చాలు'[369]

ఆచార్యులవారి సూక్తులన్నీ మనిషిని కేంద్రంగా చేసుకొని వెలువడినట్టివే.

మనిషి పోయాక మాట మిగలాలి
మనిషిపోయాక మంచి మిగలాలి
మనిషి పోయాక మనసు బతకాలి[370]

అన్నవి విలువైన సూక్తులు. సమాజ ప్రయోజనాన్ని ఆశిస్తున్న కవి లక్ష్యం ఇలానే ఉంటుంది. సమాజానికి కేంద్రంగా ఉంటున్న మనిషి విశిష్టమైన జీవితాన్ని అనుభవించడానికై కవి చేసిన ఈ ప్రయత్నం సర్వజనామోదంగా ఉంది.

పుస్తకాలు యదార్థ జీవితాన్ని మన కళ్ళముందుంచుతాయి. ఎన్నో భావనలను, ఆవర్తాలను సృష్టిస్తాయి. కమనీయ భావనల సమ్మేళనం పుస్తకరూపం. పుస్తకాన్ని చదివి పుణ్యమో పాపమో మూటగట్టుకోవడం కాకుండా వృధా కాలయాపన చేయడం ఆత్మహత్యా సదృశ్యం. తిరుమల అందుకే

పది మంచి పుస్తకాలైనా లేని
మేడకంటే స్మశానం నయం[371]

అని అంటారు. 'దేశాన్ని రక్షించేది చదువు' అన్న మాటలు అక్షర దీపం యొక్క కాంతుల ప్రాముఖ్యాన్ని ప్రకటిస్తున్నాయి. అక్షరజ్ఞానం కలిగిన ప్రతిమనిషి మనీషిగా నిలబడి తిమిరంలో సమరం చేస్తున్న నిరక్షర జనావళి జీవితాలలో వెలుగురేఖలను వెదజల్లటం కనీస కర్తవ్యం.

నిటారుగా నిలవటం నేర్చుకో
హుషారుగా నడవడం నేర్చుకో

పాత పద్ధతులు మార్చుకో
నీ ఎదలో వెలుగులు పేర్చుకో[372]

తిరుమల చెప్పిన మాటలు సూక్తిపూర్వకమైనవి. ఇది మనిషిని మహామనీషిగా నిలబెడుతున్నది. మహోన్నతుడిగా ఉన్నత శిఖరాలనధిరోహింపజేస్తున్నాయి. భవిష్యత్తుకి బంగారుబాటను వేస్తున్నాయి. మనిషిని ఆత్మగౌరవంతో బతకమని, చైతన్యవంతంగా ఉండమని, మూఢనమ్మకాలను విడువమని, జ్ఞానసముపార్జన చేయమని తిరుమల పై వాక్యాల్లో నిర్దేశించారు.

నమ్మకమనేది ప్రపంచాన్ని ముందుకు నడిపిస్తుంది. విశ్వాసం లేకుంటే మనుగడ వికసించదు. అందుకే తిరుమల ఇలా

పాడేవారిని బట్టి
పాటలు కమ్మగా వుంటాయి
పెట్టేవారిని బట్టి
వంటకాలు రుచిగా వుంటాయి
చెప్పేవారిని బట్టి
విషయాలు ఇంపుగా వుంటాయి
చూచేవారిని బట్టి
దృశ్యాలు అందంగా వుంటాయి
పాలించేవారిని బట్టి
రోజులు హాయిగా వుంటాయి
నమ్మకాన్ని బట్టి
రోగాలు కుదరుతుంటాయి[373]

అంటూ నమ్మకాల్లోని 'కిటుకు'ను విశదీకరించారు.

కష్టాల్లో ఉన్నవారి
సలహా వినకు
సుఖాల్లో తేలిపోయేవారికి
సలహా ఇవ్వకు[374]

అంటూ మాట సలహాను ఎవరికివ్వరాదో, మాట సలహా ఎవరిది వినరాదో తిరుమల సూచించారు. ఇదెంతో లోకానుభవంతో కూడిన సూక్తి. ఇలా తిరుమల రచనల్లో సూక్తులు విరివిగా చోటు చేసుకున్నాయి. ఆయన 'యుగగీత' కావ్యం సంపూర్ణ సూక్తిగీత. ఆణిముత్యాల్లాంటి సూక్తులు, అక్షరహారాలు, కవితాక్షర చిత్రాలెన్నో ఉన్నాయి. లోకజ్ఞతను, విజ్ఞతను సంతరించుకొని సార్వకాలికమై, సార్వజనీనమైన తిరుమల ఈ సూక్తులు సమాజానికి అంధకారంలో దివిటీలవలె మార్గదర్శనం చేస్తున్నాయి.



## 15. మినీ కవిత

సమాజం మారుతున్నట్టుగానే సాహిత్యమూ మారుతుంటుంది. సమాజం అనేక నూతనావిష్కారాలను అందిస్తున్నట్టుగానే సాహిత్యం కూడా నవ్య ప్రక్రియలను సమాజ హృదయానికి చవిచూపిస్తుంది. కొత్త ఆలోచనలకు ప్రేరణను ఇస్తుంది. పురాణం, కావ్యం, ప్రబంధం, కీర్తనం, యక్షగానం ఇవన్నీ కూడా ఏ కాలానికవే నవ్య ప్రయోగాలుగా సమాజాన్ని కళాత్మకంగా మానవీకరించడానికి యత్నించాయి. మరికొన్ని ప్రక్రియలు కూడా తమ కర్తవ్యాన్ని నెరవేరుస్తూ వస్తున్నాయి.

ప్రాచీన సాహిత్యంలో చాటువు మాదిరిగా[375] ఆధునిక సాహిత్యంలో విశేష ప్రక్రియగా సాహితిని పరిపుష్టవంతం చేస్తున్నది మినీ కవిత. ఈ శతాబ్దం ఏడో దశకంలో అడుగుపెట్టి ఎనిమిదో దశకం తొలినాళ్ళలో మరింత ఆకర్షణీయంగా, శక్తిమంతంగా రూపుదిద్దుకొంది. ఒక వెల్లువై ఉప్పొంగింది. తెలుగు కవితా సీమలో ఒక దశాబ్దం కాలంపాటు అందరినీ ఆకర్షించి ఒక ప్రత్యేకతను సంతరించుకుంది. వాఙ్మయ శిఖరాలుగా చిరకీర్తులైన వారు కూడా మినీ కవితను సమాదరించి చవులూరించే రచనలు చేశారు. చేస్తున్నారు. ఉదీయమాన కవులు కూడా రసరేఖల వంటి రచనలు చేస్తూ తమ ప్రత్యేకతను సాధించి 'సమాజ సంస్కరణకు క్రాంతదర్శులలా దోహద పడుతున్నాయి.

మినీకవిత స్వరూపంలో చిన్నదిగా కనిపించినా అభివ్యక్తిలో విశాల సమాలోచనం ఒదిగి ఉంటుంది. 'ఒక్క సిరాచుక్క లక్ష మెదళ్ళకు కదలిక' అన్న బైరన్ మాటలలో పూర్ణ యదార్థం దాగి ఉన్నట్టుగానే మినీకవిత సాహితీస్ఫోరకంగా, వాస్తవికతా దర్శనంగా భాసిస్తుంది. పాల్కురికి సోమనాథుడు అల్పాక్షరాలలో అనల్పార్థ రచన అన్నది ఈ మినీ కవిత స్వరూపానికి అనుబంధించిందేమో!

మినీ కవితా ప్రక్రియ పదేళ్ళపాటు బాగా విజృంభించి కదను తొక్కింది. కవులు, విమర్శకులు దీని రూపాన్ని, చలనాన్ని, జ్వలనాన్ని, జనాకర్షణనీ మెచ్చుకున్నారు. అభివ్యక్తి ఎలా ఉన్నా ఆత్మీకరించిన తీరు ఉత్తేజంగా ఉంది. మహాకవి డా॥ సి.నారాయణరెడ్డి

మినీ కవిత ఆయుస్సు
మెరుపంత
కాని అది ప్రసరిస్తుంది
కాలమంతా[376]

అని మినీ కవితను చిరంజీవిగా వర్ణించారు. మెరుపు తళుక్కుమనేది ఒక్క క్షణమైనా దాని ప్రకాశం ఎప్పుడూ ప్రసరిస్తున్నట్టుగానే అనిపిస్తుంది. ఎన్నో భావజాలాలను అది సృష్టించి హృదయాన్ని చకితం చేస్తుంది. మినీకవిత కూడా అలాంటి శబ్ద ప్రకాశాన్ని, ధ్వని మాధుర్యాన్ని కలిగినట్టిదే. అయితే మినీకవిత అభివ్యక్తి అంతవరకు మాత్రమే పరిమితమైనట్టిది కాదు. అది కాలమంతా ప్రసరిస్తుంది. పరిణామస్థితి కలిగిన కాలం ఎన్ని ఆవిష్కారాలను

ప్రదర్శిస్తుందో ఈ మినీ కవిత కూడా అన్ని రూపాలను పొందుతూ 'సహితస్యభావం సాహిత్యమ్' అన్న నానుడికి ప్రతీకగా నిలిచింది.

మినీ కవిత అంటే చిన్న కవిత. సూక్ష్మంలో మోక్షాన్ని చూపిస్తుంది. అనంతతత్వాన్ని దర్శింపజేస్తుంది. సూటిదనం దీని ప్రత్యేకత. మెరుపుతీగ వంటి అనుభూతులకు ధ్వనిపూర్వకంగా అలతి పదాలతో భావ ప్రకటన గావించుటకు ఈ ప్రక్రియ ఎంతో ఉపయోగపడుతుంది. సంక్షిప్తత, భావగాఢత, చమత్కారం, శ్లేష, శీర్షికలో నవ్యత్వం, ఉరుములు, మెరుపులు, మినీ కవితా లక్షణాలు. "సంక్షిప్తత మినీ కవిత ముఖ్య లక్షణం. వీటినే కొందరు పొట్టి కవితలు అంటే బాగుంటుందనీ, మరికొందరు చిన్న కవితలు అనాలనీ అంటున్నారు. అయితే మినీ కవిత అనేది ఇప్పటికీ కొంత ప్రచారంలోకి వచ్చింది"[377] అని విహారి అభిప్రాయపడినారు.

"సున్నితమైన భాషలో సుందరమైన భావ వ్యక్తీకరణలో సామాన్యుని మనస్సును హత్తుకునేటట్లు చేసే వ్యంగ్య లక్షణం ఉన్న ప్రక్రియ మినీ కవిత"[378] అని యం.చంద్రిక వివేచించారు. "మినీ కవితలో ఒక చమత్కృతి ఉన్నది. ఒక మెరుపు ఉన్నది. ఒక మినీ భావ ప్రకాశనం ఉన్నది"[379] అని టి.యల్.కాంతారావు మినీ కవితకు చమత్కృతి, మెరుపు, భావ ప్రకాశనం అనే త్రిగుణాలు ప్రధానమైనవని చెప్పారు. అద్దేపల్లి రామమోహనరావు "ఒకే ఒక్క భావాన్ని దానికి సమగ్రమైన బలమైన అభివ్యక్తినివ్వడంలో సూటిగా చెప్పడాన్ని గాక ధ్వని నాశ్రయించేది మినీ కవిత. కవితలోని ప్రతి పదమూ ఒక సమిష్టి వ్యంగ్యంవైపు దారి తియ్యకపోతే అది మినీ కవిత కాదు"[380] అంటారు. అద్దేపల్లివారు ధ్వనిని ఆశ్రయించి సమిష్టి వ్యంగ్యంవైపు సాగిపోయేది మినీ కవిత అని భావించారు. "బ్రివిటీ, నేటివిటీ, ఇండివిడ్యువాలిటీ వున్న కవులు మినీ కవిత రాస్తున్నవాళ్ళు"[381] అని ఎమ్వీయల్ మినీ కవిత రాస్తున్న వాళ్ళ తత్వాన్ని పరిశీలించారు. డా॥ సినారె ఈ మినీ కవితను 'సౌదామిని' కవిత అంటే, రావి రంగారావు సూక్ష్మకవిత (Micro Poetry) అన్నారు. పేర్లేవయినా దాని లక్షణం ఒకటే. మరికొందరు కవులు, విమర్శకులు మినీ కవిత్వాన్ని చర్చించి వివిధ నిర్వచనాలిచ్చారు. అభివ్యక్తిలో భేదం కన్పిస్తున్నప్పటికీ రూపం, ధ్వని, చమత్కృతి, శైలి, శబ్ద సంయోజనం, వ్యక్తీకరణం ఇవన్నీ మినీ కవితకు మరికొన్ని లక్షణాలుగా చెప్పుకోవచ్చు.

ప్రతి రచన కవినుంచి కానీ, రచయిత నుంచి కానీ రావడానికి ఒక ప్రేరణ, ఒక ఉద్యమం, ఒక సంఘర్షణ ఉన్నట్టుగానే మినీ కవితావిర్భావానికి సామాజిక సమస్యలు ప్రధాన హేతువులుగా కన్పిస్తున్నాయి.

ఆచార్య తిరుమల మినీ కవితా ప్రక్రియను చేపట్టి విరివిగా రచనలు చేశారు. ఆయన భావాంబర వీధిలో చెలరేగిన గర్జనల నడుమ మెరిసిన కాంతుల ధారే ఆయన రచించిన మినీ కవితా సంపుటి 'విద్యుల్లత'. ఇందులో నూట పదహారు శీర్షికలున్నాయి. ఇంకా తన వచన కవితా సంపుటాలలో అక్కడక్కడ ఈ మెరుపులు మనకు కన్పిస్తాయి. ఆయన



దీర్ఘకవితలు ఎన్నో రాశారు. మినీ కవితా ప్రక్రియలో కూడా అంతగా కావ్యఖండికలను సృజించారు. తిరుమల నిరంతరం చలనశీలత్వం, నవ్యత్వం కలిగి ఉన్న కవి కావడంచేత అన్ని ప్రక్రియలను సమాదరించి రసస్ఫోరకమైన రచనలు చేసినట్టుగానే మినీ కవితను కూడా పరిపుష్టమంతంగా తీర్చిదిద్దారు.

వస్తువును బట్టి మినీ కవిత వైయక్తికం, సామాజికం అని రెండు విధాలు. స్వపరంగా చెబితే అది వైయక్తికం. దేశానికో, సమాజానికో అన్వయించేట్టు చెబితే అది సామాజికం. తిరుమల మినీ కవితలన్నీ పరిశీలిస్తే మనకు పై రెండు లక్షణాలు కన్పిస్తాయి. ప్రేమ, నీతి, విప్లవం, ఏకత, మృత్యువు, విమర్శ, బాధ, రాక్షసత్వం, త్యాగం, యువత, హాస్యం, మానవత్వం, శాంతి, వాస్తవికత, సాంఘిక సమస్యలు, అభ్యుదయం, సూక్తులు, తాత్వికత ఇత్యాది వస్తువులను తన మినీ కవితా ప్రక్రియకు వస్తువులుగా ఉపయోగించుకున్నారు.

'మనిషి' అక్షర సంపుటిలోనే మంచితనం చోటుచేసుకుంది. చెడుకు దూరంగా, ఆత్మీయతకు ఆభరణంగా అందరికీ అందుతూ, ఆప్యాయతను పంచుతూ, మమతలను పెంచుతూ అడుగు ముందుకు వేస్తున్నవాళ్ళను మంచి మనుషులు, దేవుళ్ళు అంటారు. మనిషికి ఎన్ని ఉన్నప్పటికీ మానవత్వం అనేది మృగ్యమైన అతడు సమాజం నుంచి దూరంగా విసిరివేయబడతాడు. మానవత్వం అనే సమాహారానికి త్యాగతత్వం అనేది ఒక పార్శ్వం. అది మరీ ప్రభావితమైంది.

ఒక హృదయం బాధతో నలుగుతుంటే
ఒక హృదయం నిండుగా నవ్వుతుంటే
దాని పేరు రాక్షసత్వం
తాను కష్టాల్లో కాలిపోతున్నా
ఎదుటివారికి వెలుగునివ్వటం
త్యాగతత్త్వం[382]

వాస్తవమైన విషయాలు ఎప్పుడూ అగ్నిజ్వాలల్లా మండుతాయి. అలా జరిగినప్పుడే నీతి, న్యాయం, ధర్మం అనే పవిత్రాంశాలు రక్షింపబడతాయి. వాటికి ప్రత్యేకమైన స్థానం స్థిరమవుతుంది. అలాంటి మానవ జాతిని తిరుమల ఇలా చూపించారు.

మంటలు మాట్లాడగలిగితే నీతి
మల్లెలు మబ్బుల్లోకి ఎగరగలిగితే ఖ్యాతి
మనసులోని మాధుర్యానికి
మత్తెక్కిపోయేదంతా మానవజాతి.[383]

కవులు మంటలను రకరకాలుగా నిర్వచించారు. పరాభవపు వలయంలో నలిగిపోతున్నప్పుడు, అకారణంగా అణచబడుతున్నప్పుడు, అన్యాయంగా దోచబడుతున్నప్పుడు, అంధకారం నియంతృత్వంగా మారి జనజీవితాన్ని నలిపివేస్తున్నప్పుడు, శ్రమశక్తి

దోచబడుతున్నప్పుడు, క్రౌర్యం పంజా విప్పి మనిషితనాన్ని చిత్రవధ చేస్తున్నప్పుడు, దౌర్జన్యం పంచాస్యమై గర్జిస్తున్నప్పుడు– మనిషి అన్నవాని గుండెల్లోంచి మంటలు జ్వలిస్తూ బయలుదేరుతాయి. ఎదురుతిరిగి ప్రశ్నిస్తాయి. నీతిని నిలబెడతాయి. ఆచార్య తిరుమల మంటలు మాట్లాడగలిగితే నీతి ఉంటుందన్నారు. అట్లాగే మల్లెలు మబ్బుల్లోకి ఎగరగలిగితే ఖ్యాతి ఉందన్నారు. మల్లెలు అంటే హిమస్వచ్ఛ సుందరమైన హృదయాలన్నమాట. నిర్మలంగా కాంతిమంతంగా ఉన్న సహృదయుడే అంత ఎత్తుకు చేరుకోగలుగుతాడు. నీతి, ఖ్యాతి అనేవి మనస్సును ఆశ్రయించి ఉంటాయి. తీయతీయగా మనస్సులో మెదలుతుంటాయి. ఆ మధురమైన స్పందనతో ఉన్నదే మానవజాతి అంటారు కవి.

నలుపూ, తెలుపూ అనేవి ఒకదాని వెంట ఒకటి ఉంటూనే ఉంటాయి. మంచీ చెడు అనేవి కూడా ఆ పరిభ్రమణమే. ఇవన్నీ కూడా మనిషిచుట్టూ తిరుగుతుంటాయి. మనిషి ఈ రెండింటి అంతరాలను ఆలోకిస్తాడు. ఆత్మతత్త్వాలను పరిశీలనగా చూస్తాడు. సమాజ సౌభాగ్యానికి దోహదపడేలా చేస్తాడు.

దౌష్ట్యం అనేది ఏ రూపంలో ఉంటుందో, సౌజన్యం ఏ వ్యక్తీకరణంలో ఉంటుందో తన నిసర్గమైన భావనతో తిరుమల దర్శించారు.

దుష్టుడు తన కళ్లల్లో
కాల నాగులను నిలుపు
మంచివాడు సంద్రంలా
నింగి నేలలను కలుపు[384]

సహజంగా సముద్రం నింగి నేలలను కలపదు. కాని దాని విస్తృతి అలా భావన చేయిస్తుంది. ఆ భావన మనిషికి ఊరటనూ, ఉత్సాహాన్నీ, విశ్వాసాన్నీ ఇస్తుంది.

మనిషి వికసించాలంటే కొన్ని ధర్మాలను, దర్శనాలను విధిగా పాటించాలి. కొన్ని ఆశయాలను పవిత్ర లక్ష్యాలుగా ఎంచుకోవాలి. ఎదురుదెబ్బలు తగిలినా, అసూయాద్వేషాలు అగ్నిని కురిపించినా, అపనిందలు నిలువునా చరిచినా మనిషి తల వంచకుండా ముందుకు సాగవలసి ఉంటుంది. తన మాటలతో, చేతలతో, చేతనత్వంతో అడుగు ముందుకు వేయవలసి ఉంటుంది. అలా చేస్తే అది యదార్థతకు చిహ్నంగా ఉంటుంది. ఏది ఉన్నా, ఎన్ని ఉన్నా వాస్తవ జీవన విధానం లేకపోతే మనిషి మాధవుడు కాలేడు. అందుకోసం మనిషి ఆవేశమూ, ఆశయ సంపన్నమూ అయిన జీవితాన్ని అందించి సఫలీకృతుడు కావలసి ఉంది. మనిషి వికాసానికి, సమాజాభ్యున్నతికి సాహిత్యం ప్రేరణగా ఉంటుంది. అది సందేశదాయి కాబట్టి కొందరు కవులు వాస్తవ జీవనానికి మరింత స్ఫూర్తిమత్వాన్ని, దీప్తిమత్వాన్ని ఇవ్వడానికి యత్నించారు.

తిరుమల యదార్థవాది. ద్వేషరహితమైన మనిషి దేవతాతత్త్వాన్ని కలిగిన మనిషి అవతరణ జరగాలని ఆరాటపడతారు. ఆశతో నిరీక్షిస్తారు.



'అంతా నాదంలోనే ఉంది'
–నేను నాదం కాదు
'అన్నీ వేదంలోనే ఉన్నాయి'
–నాకు వేదం రాదు
'అంతా మాయ'
–నేను అమాయకుణ్ణి
'అన్నీ శూన్యం నుండే పుడుతున్నాయి'
–ఐతే నేను శూన్యాన్ని[385]

జగమంతా నాదమయమని ఆధ్యాత్మవిదులు భావిస్తారు. అన్నీ వేదంలోనే ఉన్నాయని ఆత్మతత్త్వజ్ఞులు చెబుతారు. 'అంతా మాయ' అని పారలౌకికులు అంటారు. ఇవన్నీ శూన్యం నుంచే పుట్టాయి. ఎందరికో శూన్యం అగుపించకపోయినా కొందరికి ఛప్పున కన్పిస్తుంది. హృదయానికి అందుతుంది. కొందరి ఎదుట రమ్యాక్షర క్షేత్రంగా సాక్షాత్కరిస్తుంది. ఈ భావరేఖలను తిరుమల హృదయైక వేద్యంగా నిర్వచించారు.

సర్వభోగాలకి మూలం
శృంగార వీధి
సకల రోగాలకి మూలం
అజీర్ణవ్యాధి[386]

ఈ మినీ కవితను వివరించ పనిలేదు. అందరికీ అర్థమయ్యే విధంగా సరళంగా ఒక సూత్రంలాగ, నిర్వచనంలాగా ఉంది.

అనుభవానికి మించిన
వాదం లేదు
అనుభూతికి మించిన
వేదం లేదు
అభిమానానికి మించిన
సంపద లేదు[387]

అనుభవం, అనుభూతి, అభిమానం, అవమానం వేనికవే ప్రత్యేకమైన సిద్ధాంతాలు. ఇవి అన్ని మనిషి బహిరంతరాలలో విస్తరించి ఉంటాయి. వీటిని సమంగా ఆదరించిన వ్యక్తి యదార్థ మానవుడుగా మనగలుగుతాడు. ఉన్నత వ్యక్తిగా రాణించగలుగుతాడు.

తిరుమల మరో యదార్థ దృశ్యాన్ని పాఠకుని హృదయ నేత్రాలకు ఇలా అందించారు.

తనంత తానుగా
బీదవాడితో పలకడు ధనవంతుడు

తనంత తానుగా
దుర్మార్గుడితో పలకడు భగవంతుడు

నిరుపేదను ధనవంతుడు తనకు తానుగా పలకరించడు. అలాగే భగవంతుడు కూడా తనంత తానుగా దుర్మార్గుణ్ని పలకరించడు. ఇవి నిజంగా అక్షర సత్యాలు.

ఇట్లా తిరుమల మినీ కవితా ప్రక్రియను ఆదరించి విలువైన, చైతన్యస్ఫోరకమైన రచనలు చేసి చదువరుల హృదయాలలో పదిలంగా నిలిచారు.

## 16. చాటు కవిత

"తీరుతీయములు గల భాషావాహినియందు సుకవుల కవితామృతము ప్రబంధ రూపమున జాలువారును. వీనులకు విందులైడెందమును దనుపార్చును. చాటు రచనము లొక్కొక్కయెడ ప్రబంధ రచనముల సయితము మీాఱియుండును"[389] అని సుప్రసిద్ధ విమర్శకులు వేటూరి ప్రభాకరశాస్త్రి 'చాటువు'కు నిర్వచనమిచ్చారు.

హృదయం నిండుగా కవిత్వం ఉప్పొంగుతున్న కవి ప్రబంధం రాసినా, లఘుకావ్యం వెలయించినా, అభినందన చిలికినా, దండకం రాసినా, మరే ప్రక్రియను ఎన్నుకున్నా అవి రమణీయంగా చవులూరిస్తాయి. రసజ్ఞుల మేథలో ప్రవేశించి అనేక ఆవర్తాలను సృజిస్తాయి. మహాకావ్యం రాసిన కవీ, మహా ప్రబంధాన్ని రాసిన కవీ చాటువులను కూడా అదే తీరులో సాహితీ స్ఫూర్తితో తీర్చిదిద్దుతారు. ఒక్కొక్కప్పుడు మహాప్రబంధం మనస్సులో తలుక్కుమనకపోయినా ఒక్క చాటుపద్యమే ఆనంద పరవశత్వాన్ని కలిగిస్తుంది. ఆచార్య తిరుమల "ఏదో ఒక శీర్షికతో కాకుండా సందర్భానుసారంగా ఆశువుగా చెప్పే అందమైన పద్యాన్ని చాటుపద్యమంటారు. ఈ పద్యాలకు ఏకసూత్రత ఉండదు. ఇవి విడిపూలు. ఒక్కో పూవుకు ఒక్కో వాసన"[390] అని చాటుపద్య లక్షణాన్ని వివేచించారు. నిఘంటుకారుడు మహాకాళి సుబ్బరాయుడు 'చాటువు' అనే శబ్దానికి- (స.వి) ప్రియమైన మాట, మిథ్యా ప్రియ వచనము, సందర్భోచితముగా కవి యప్పుడప్పుడు ఆశువుగా జెప్పెడు పద్యము, రాజాదిప్రియ వాక్యము, పసుల కడుపు,త్రెడ్డు, త్రెడ్డు చివర"[391] అనే అర్థాలనిచ్చారు. వీటిలో ఎక్కువ పదాలలో ప్రియమైన మాటనే ప్రకటిస్తున్నాయి. అట్లాగే సూర్యరాయాంధ్ర నిఘంటువులో "ప్రియమైన మాట, మిథ్యా ప్రియవాక్యము, వట్టి ఇచ్చకము, రాజాదిస్తుతి వాక్యము, పశుపిచండము, పసుల కడుపు, త్రెడ్డు చివర, దర్వ్యగ్రము, దర్వితెడ్డు"[392] అనే మాటలలో చాలావరకు చాటువు అంటే ప్రియమైన మాట అనే అర్థాలున్నాయి.

ప్రాచీన కవులలో వేములవాడ భీమకవి, తెనాలి రామకృష్ణుడు, శ్రీనాథుడు, అడిదం సూరకవి లాంటి వాళ్ళ చాటుపద్యాలు చాలా ప్రచారాన్ని పొందాయి. వీటిలో ఆయా కవుల కవితా ప్రాగల్భ్యం జలపాతంలా దూకి చదువరులను ఆనందడోలికలలో ఊగింపజేస్తుంది.

ఆధునిక కవులలో తిరుపతి వేంకటకవులు, వేంకట రామకృష్ణ కవులు, వేంకట



పార్వతీశ్వర కవులు, విశ్వనాథ, జాషువా, శ్రీశ్రీ వంటి సాహితీ మూర్తులు 'చాటు' రచనలు విరివిగా చేసి తమ ప్రతిభను ప్రదర్శించారు. ఆచార్య తిరుమల చాటుకవితను సమాదరించి శిల్పాభిరామం లాంటి పద్యాలను సాహితీ ప్రపంచం మీద వెదజల్లారు. వాటి మధురిమలను హృదయాలకు అందించారు.

సుగుణశీలి అర్ధాంగిగా లభిస్తే జీవితమంతా పువ్వులు నిండుగా విచ్చుకొని కళకళలాడుతున్న బృందావనిలా శోభిస్తుంది. గయ్యాళి దొరికితే బతుకంతా శాపంగా మిగిలిపోతుంది. తిరుమల గయ్యాళి భార్య సాహచర్యంతో కలిగే అనర్థాలను ఇట్లా తెలిపారు.

గయ్యాళి భార్య దొరికిన
కయ్యాలే విందులగును కష్టసుఖాలన్
కుయ్యోమనెదరు పిల్లలు
కొయ్యగ మాది మారి తుదకు కొంపే మునుగున్[393]

ఈ పద్యం శ్రీనాథుని చాటువులలోని పూజారి వారి కోడలు తాజారక' అనే పద్యం నడకను స్ఫురణకు తెస్తుంది.

కవికి పక్కింటి రౌడీ పెళ్ళాం కవితా వస్తువైన తీరు చూడండి.

గంటల తరబడి వాగుడు
గంటలు నీళ్లాట గంట గంటకు కాఫీ
వంటా వార్పులు మాత్రం
బింటమ్మకు రావు మొగుడు వెధవా యగుటన్[394]

తాను డబ్బున్నవారి సంతానమగుట
ఏ పనీ చేయదెప్పుడు నెక్కడేని
రంకెలేయంగ నోరు మాత్రంబు కలదు
నోరు కాదది తుప్పు కైజారు గాని[395]

సమాజంలోని కొందరు స్త్రీలలో కృత్రిమంగా చోటు చేసుకుంటున్న విచిత్రవైనాన్ని పై పద్యాలలో ఎండగట్టారు.

కొందరు పొగడ్తలంటే ఉబ్బిపోతారు. అలాంటివాళ్ళ స్థితి ఎలా ఉంటుందో కవి చాటుక్తిలో ప్రదర్శించారు.

పొగడుట పొగడించుకొనుట
పొగడ్తలకు డబ్బు ధారబ్రోయుట బ్రతుకై
నెగడెడు వారల, కెప్పుడు

పొగడ్తలేదప్పుడు మతిపోవును గదరా[396]

పొగడడం, పొగడించుకోవడం, పొగడ్తలకు డబ్బు ధారపోయడం కొందరికి జీవితంగా ఉంటుంది. అలాంటి వాళ్ళకు పొగడ్తలు లేకపోతే మతిపోయినంత పనవుతుంది.

వర్తమానంలోని ఉద్యోగాన్ని తలపోస్తూ గతమే ఎంతో మధురంగా ఉండేదని కవి ఈ కింది పద్యంలో చెప్పారు.

ఏ.జి. ఆఫీసులో తృప్తిగా మసలిన
రోజులే మిన్న యీ రొష్టుకన్న
అట స్ట్రిక్టు ఆఫీసరయ్యారె మేలన్న
ఈ ప్రిన్సిపాల్ పొగరెద్దుకన్న
పెండింగు ఫైల్సుపై మొండి రాతలె మిన్న
ఈ వ్యర్థ బోధల యెగపుకన్న
చాలిచాలని నాటి సంపాదనే మిన్న
మబ్బు నీరగు నేటి డబ్బుకన్న
ఎంత జూచిన గతమె తేనియలు కురిసె
వర్తమానము మానము ప్రక్కలయ్యె
ఎట్లు శాంతి సౌఖ్యాల జీవింతునింక?
పంటలెత్తునె మరుభూమి వానలైన![397]

నేటి కొలువుకన్న ఏ.జి.ఆఫీసులో పని చేసిన రోజులే మిన్నగా ఉండేవనీ, పొగరెద్దులాంటి ఈ ప్రిన్సిపాల్‌కంటే నాటి స్ట్రిక్ట్ ఆఫీసరే మేలనీ, పనికిరాని ఈనాటి బోధనలకంటే అప్పటి పెండింగ్ ఫైల్స్ మీది మొండిరాతలే మిన్నగా ఉండేవనీ, బాగా అందుతున్న డబ్బుకంటే చాలీచాలని ఆనాటి సంపాదనే మిన్నగా ఉండేదనీ, గతమే తేనియలు కురిసేదిగా ఉండేదనీ, వర్తమానంలో అభిమానం నశించిపోయిందనీ, శాంతి సౌఖ్యాలతో మనుగడ సాగించడం కష్టమని 'పంటలెత్తునే మరుభూమి వానలైన' అని ఆవేదనను వ్యక్తం చేశారు.

తిరుమల నవ్య కవితా వధూటిని ఆహ్వానించిన తీరు ఆయన శబ్దాలంకార వాల్లభ్యాన్ని ప్రకటిస్తుంది.

గువ్వలు గువ్వలై యెగసి కోర్కెలు సందడి సేయగా వలెన్
దివ్వెలు దివ్వెలైనయన దీప్తులు చీకటులార్పగా వలెన్
మువ్వలు మువ్వలై వలపు ముచ్చట లెయ్యెడ మ్రోయగావలెన్
నవ్వుల తావియై విరిసి నవ్య కవిత్వ వధూటి రావలెన్[398]

పక్షులలో గువ్వలు అందంగా ఉండే పక్షులు. అవి రెక్క విప్పడం, ఎగరడం,



విహరించడం, దూకడం చాలా బాగా ఉంటుంది. అట్లాగే గుండెలలో ఉదయించిన కోర్కెలు సందడి చేయాలి. దివ్వెలు చిన్నగా ఉన్నప్పటికీ వెలుగులను ప్రసరిస్తాయి. తమ ఉనికిని నిలుపుకుంటాయి. అట్లాగే కళ్ళకాంతులు చీకట్లను ఆర్పివేయాలి. మువ్వలు అందంగా ఉంటాయి. కమ్మగా మోగుతూ హృదయాలను రసపరవశం చేస్తాయి. అట్లా మువ్వలలా వలపులు అంతటా మోగాలి. నవ్య కవిత్వమనే పడతి నవ్వుల తావిలా విరిసి ఆగమించాలని కవి ఆకాంక్షించారు.

ఆనాడు శ్రీనాథుడు దేశ పర్యటన చేస్తూ ఎదురైన సంఘటనలను కమ్మని పద్యాలుగా రాశారు. పలనాడులో చిన్న చిన్నరాళ్ళు చిల్లరదేవుళ్ళుగా, సజ్జజొన్న కూళ్ళు సర్పాలు తేళ్ళుగా ఆ మహాకవి మనస్సును కలచివేశాయి. కడకు తాగడానికి తీయనినీళ్ళు కూడా ఆయనకు లభ్యం కాలేదు. అట్లాగే తిరుమల అలాంటి వేదనను కలిగించింది.

తెలుగుదనమ్ము లేదు, పని తీరున నేరుపు లేదు, ప్రేమగా
పలుకుట లేదు, భక్తిగత భావము లేదు, సమాజ శాంతికై
చెలిమి చిగిర్చుటన్నటి యసీ! నెఱసున్న! విచిత్ర మీ జనుల్
శిలలో! శివాగ్నులారిన నిశీథులో! దుర్మద మత్త యోధులో![399]

తెలుగువాళ్ళలో తెలుగుతనం అంతరించిపోతుంది చేసే పనిలో నేర్పు, నైపుణ్యం కొరవడుతుంది. ప్రేమగా పలకరించడం, భక్తిభావం కలిగియుండటం, శాంతికోసం స్నేహంగా కలిసి ఉండటం వంటి మంచి లక్షణాలు అడుగంటిపోతున్నాయని కవి ఆవేదన చెందుతున్నారు.

ఆచార్య తిరుమల 'మణిపుష్పకం' పద్యకావ్యంలో చాటువులకు ప్రత్యేక స్థానాన్ని ఇచ్చారు. ఆధునిక కవులలో ఆయన రాసిన చాటువులు విజ్ఞాన పదకోశంలా ఉన్నాయి. మనస్సులో బాధ కలిగినప్పుడు చదువుకొని ఊరట పొందేలా ఉన్నాయి.

## 17. సంప్రదాయం

సంప్రదాయం జాతి నిష్టమైంది. జాతి వైజ్ఞానికంగా వికసించడానికి సమాజంలో మానవతా విలువలను కాపాడడానికి సంస్కృతీ పరిమళాలను పంచడానికి సంప్రదాయం పునాదిగా దోహదపడుతుంది. మారుతున్న కాలం స్వరూప స్వభావాలను తెలియజేస్తూ నూతనమైన విలువలకు స్వాగతం చెబుతూ స్వీయమైన వ్యక్తిత్వాన్ని నిలపడంలో సంప్రదాయం చక్కని మార్గాన్ని మనిషికి సమాజానికి అందిస్తూ జాతి వికాసానికి దోహదపడుతుంది.

సంప్రదాయ శబ్దాన్ని కవులు, విమర్శకులు, విజ్ఞులు అనేక విధాలుగా వివేచించారు. అమరకోశంలో, ఆప్టే సంస్కృత నిఘంటువులో సంప్రదాయం విశిష్టమైన అవతరణమని, వర్తమానానికి వేదికగా అమరి ఉంటుందని, జాతికి క్రమమైన జీవన విధానాన్ని అందించేదని[400] రాయబడింది.

సినారె "సంప్రదాయ శబ్దమునకు దాని వ్యుత్పత్త్యర్థమును బట్టి చూచినచో 'సంక్రమించుట' (Transmission) అను అర్థము వచ్చును. ఈ దృష్టితో చూచినచో ప్రతి యుగమున ఆ యుగము తనకై తానుగా సృష్టించుకొన్న నూతనాంశములు, ఇతరుల నుండి ఎరువు తెచ్చుకొన్న అంశములు తప్ప సాంఘిక జీవితమునందలి తక్కిన అంశములన్నియు సంప్రదాయ సంబంధులే"[401] అని విశ్లేషణ చేసి చూపించారు. మహాకవి శ్రీశ్రీ సంప్రదాయాన్ని ఆదరిస్తూ సంప్రదాయం నిలిచే ఉంటుంది హమేశా, మూఢాచారాలు మారుతూ ఉంటాయి నిజం కాని సంప్రదాయం తాత ముత్తాతల నాటి ధనం"[402] అన్న మాటలు సంప్రదాయం విశిష్టతను తెలుపుతున్నాయి. సినారె సంప్రదాయ శబ్దాన్ని కవితాత్మకంగా రాశారు చూడండి.

అంత కడివెడు పాలపై ఒ
క్కింత మీగడ పేరినట్లుగ
మనకు మిగులును గతములోపలి
మంచి-అదియె సంప్రదాయము[403]

సంప్రదాయం మీగడలా రుచికరమైందని ఆయన అభివ్యక్తీకరించారు.

సంప్రదాయం అనేది సమాజానికి ఊపిరిలాంటిది. ఒక్కొక్క దేశానికీ, ఒక్కొక్క ప్రాంతానికీ ఒక్కో సంప్రదాయం ఉంటుంది. అయినప్పటికీ, రూపాలు, స్వభావాలు వేరైనప్పటికీ అభివ్యక్తి ఒకే విధంగా ఉంటుంది. అవన్నీ మానవత్వపు విలువలను పరిరక్షించడానికి, పంచడానికి సహకరిస్తూనే భిన్నత్వంలోని ఏకత్వానికి ఉపకరిస్తాయి.

ఆచార్య తిరుమల సంప్రదాయవాది. ఆయన కలం నుంచి వెలువడిన అతి నవ్య రచనలలోనూ సంప్రదాయమే ప్రముఖంగా ఉంటుంది. ఈ సంప్రదాయాభిజ్ఞత వలన ఆయన రచనలు ఆదర్శంగా, ఆదరణీయంగా ఉంటున్నాయి. తిరుమల వైదిక ధర్మాలను, ఆర్షవాఙ్మయ విలువలను పరిపోషిస్తూ నాణ్యమైన అభివ్యక్తితో ప్రజల హృదయాలకు చేరువకాగలిగారు. ఆయన తెలుగుభాష సౌందర్యాన్ని, మాధుర్యాన్ని వర్ణించడంలో సంప్రదాయాన్ని పాటించారు.

క్షీర సాగర తీరాన
దేవాసురకు అమృతాన్ని పంచే
మోహినీ నయన తారల
విలాసాల జిలుగు-నా తెలుగు[404]

క్షీరసాగరం, మోహిని వంటి పదాలకు ఆర్షమైన చరిత్ర చాలా ఉంది. దీనినంతా కవి దర్శించారు. అధ్యయనం చేశారు. ఆధునిక వస్తువుకు అన్వయింపజేశారు. అందుచేత కవితకు పటిష్టత చేకూరింది.

వ్యక్తిత్వాన్ని, వక్తవ్యాన్ని అభివర్ణించేటప్పుడు సంప్రదాయ కవులు పూర్తి స్ఫూర్తిని



కవితలో ప్రవేశపెడతారు.

'వేదాన్ని పంచిన నిరుపేద మాష్టార్ని'[405]

వేదం పురాతనమైనప్పటికీ అది ఆధునికతకు మార్గాన్ని నిర్దేశిస్తున్న శక్తిమంతమైన దర్శనం. అదొక చైతన్య దీపశిఖ. మాష్టారు ఎలాంటివాడు. వేదాన్ని పంచినవాడు. వేదాన్ని పంచడం అంటే ఏదో ఒక భౌతికమైన పాత్రతో కాదు. హృదయం అనే పాత్రికతో. హృదయం అనే పాత్రికతో పంచడం అంటే వేదాలనూ, వేదాంగాలనూ క్షుణ్ణంగా అధ్యయనం చేసి బుద్ధితో గ్రహించి మనస్సులో దాచిపెట్టుకొని ఆ తరువాత పంచడం. అప్పుడు మాత్రమే ఆ పంచడం అనే దానికి పవిత్రతా, ప్రత్యేకతా చేకూరుతుంది. అందరూ వేదాన్ని పంచడానికి అర్హులు కాకపోవచ్చు. అది కొందరు బుద్ధిజీవులకు మాత్రమే సాధ్యమవుతుంది. పై పాదంలో సంప్రదాయానికి ఎంతటి స్థానముందో తెలుస్తుంది. ప్రతి మనిషీ వేదాన్ని చదివితే జీవితం క్రమవికాసాన్ని పొందుతూ ఉంది. అయితే కవి భావించిన 'నిరుపేద' సౌమ్యానికి, ఆత్మీయతకు ప్రతీక. వేదం అంటే విజ్ఞానం. జ్ఞానం మేధ నిండుగా ఉన్నవాడు, విధేయతను ప్రకటిస్తాడు. మనసా వాచా కర్మణా మానవత్వాన్ని పోషిస్తాడు. మంచి గంధంలా పరిమళిస్తాడు. నిరుపేద అయినప్పటికీ వేదం చదవడం వల్ల అతడు మాన్యుడు కాగలిగినాడు.

సూర్యుణ్నీ, చంద్రుణ్నీ ఆది నుంచి అనేక విధాలుగా వాడుకోవడం కన్పిస్తుంది. ఈ స్థితి ముఖ్యంగా సాహిత్యంలో విశేషంగా వర్ణింపబడింది. తిరుమల ఈ ఇద్దరినీ తన కవితలో అనేక విధాలుగా భావించారు.

ఈ సూర్యకిరణ ఛత్రం క్రిందనే
ఆ రామాయణం పుట్టింది
ఈ చంద్రుని చలువ పందిరి క్రిందనే
ఆ భారతం పల్లవించింది.[406]

సూర్యకిరణ ఛత్రం కింద రామాయణం పుట్టడం అనేది వాస్తవమైన విషయమే. భారతాన్ని పాలించిన రాజవంశాలలో సూర్యవంశానికి చాలా విశిష్టత ఉంది. ఆ రాజన్యులు అయోధ్య రాజధానిగా చేసుకొని కోసల రాజ్యాన్ని పాలించి ధర్మ ప్రభుత్వాన్ని ప్రతిష్ఠించిన ప్రజానాయకులు. ఆ సూర్య వంశీయుల చరిత్రను తెలుపుతుంది రామాయణం. కవి దీన్నే కవితాత్మకంగా చెప్పారు. సూర్యవంశం పిదప హస్తినను కేంద్రంగా మలచుకొని దేశాన్ని పాలించింది చంద్రవంశం. వీళ్ళ చరిత్రను ప్రకటిస్తుంది మహాభారతం. ఈ రెండు గ్రంథాలు ఒక్క భారతదేశానికే కాక యావత్ ప్రపంచానికి ఉదాత్తమైన జీవన మాధుర్యాన్ని పంచుతున్నాయి. సార్వకాలికమైన, సార్వజనీనమైన సత్యాలను కొల్లలుగా అందిస్తున్నాయి. ఇవి ఆర్షధర్మాలను ప్రకటిస్తూ భారతీయ సంప్రదాయంలోని మూల్యాలను ప్రపంచానికి చాటిచెబుతున్నాయి.

మనిషికి కీర్తి అనే దీపం అవసరం. దాన్ని అందుకోవడానికి, స్వంతం చేసుకోవడానికి ఎంతో పరిశ్రమ అవసరం. కవి ఈ తాత్పర్యాన్ని అందించడంలో సంప్రదాయ ధారను రూపకంలో నిబంధించి ప్రదర్శించిన తీరు విశేషంగా ఉంది.

బాధాగ్ని కీలారణ్యా పర్వం అదిగో
అనుభవాల ఆస్తిని అస్త్రాలుగా మార్చుకో
విరాటపర్వ విరాట్ పురుషోపాసనలో
నీ మనస్సు బృహన్నల అయినా
స్త్రీ పర్వం అడ్డురానంత వరకు
ధీమాగా నర్తించు ప్రవర్తించు
ధర్మంతో విజయుడవై
నరత్వం వదిలి దివ్యుడవై
స్వర్గారోహణంలో[407]

తిరుమల భారతాంశాలను ఆధునిక సమాజానికి అనువర్తింపజేసి కవితగా పలికించిన తీరు బాగుంది.

తిరుమల పద్య కవిత చాలావరకు సంప్రదాయ నిష్ఠతో వెలువడిందే. 'యమునాతటి' పద్యకావ్యం పూర్వకవి స్తుతితో ప్రారంభించారు.

జయదేవుని నారాయణ
నియతాత్ముని క్షేత్రయాఖ్యు నిర్మల హృదయున్
భయహర లీలా శుకులను
జయసూక్తికి మ్రొక్కులిడెద సదమల వృత్తిన్

ఇమ్ముగ నాకవాహిను లనేకము చిత్తమునందు పొఱ న
ట్లిమ్మహి కృష్ణలీలలు త్రిలింగమునందు నెలుంగునెత్తి మై
కమ్మును కమ్మగా మిగుల కమ్మని గానము చేసినట్టి మా
బమ్మెర పోతనార్య పద పంకజముల్ ప్రణతింతు భక్తిమై[408]

జయదేవుడు, క్షేత్రయ్య, లీలాశుకుడు, బమ్మెర పోతన వంటి కవులను, పదకర్తలను స్మరిస్తూ కావ్యాన్ని ఆరంభించారు. ఇలా పూర్వకవి స్తుతి, ఇష్టదైవ స్తుతి చేస్తూ కావ్యా నారంభించిన కవులు మనకు తెలుగు సాహిత్యంలో అగుపిస్తారు.

తిరుమల చాలా పద్యకావ్యాలను శ్రీకారంతో ప్రారంభించారు. 'శ్రీ రామనామ సుధ' కావ్యాన్ని శ్రీకారంతో మొదలుపెట్టి దీర్ఘమంగళంతో[409] ముగించారు. శతక ప్రక్రియలో వెలువడిన ఈ కృతిలో ఎనిమిది పద్యాలలో మంగళం తెలిపారు. 'పితృస్మరణ' కావ్యం ఆద్యంతాలలో సంస్కృత శ్లోకాలు రాయబడినాయి.[410] ఈ కావ్య ప్రారంభం నన్నయ



భారతం ఆదిపర్వ అవతారిక ప్రారంభాన్ని గుర్తుచేస్తుంది. వైష్ణవ సంప్రదాయంలో ఇలాంటి సంప్రదాయాన్ని 'చరమ తనియన్' అని అంటారు. చివరలో ఆశ్వాసాంత గద్యం చెప్పబడింది.[411] విశ్వవిభూతి శతకం కూడా ఆశ్వాసాంత గద్యంతో[412] ముగింపబడింది. ఇలాంటి ప్రయోగాలు కవి సంప్రదాయాభిమానాన్ని ప్రకటిస్తుంది. తిరుమల 'మణిపుష్పకం' కవితా సంపుటిలోని తొలి కవిత 'అవతారిక'[413] ఆధునిక కవులలో సంప్రదాయాన్ని జీర్ణించుకున్న మంచి కవి రచనలా చవులూరిస్తుంది.

తిరుమల వైష్ణవ కుటుంబంలో ఆధ్యాత్మిక సాహిత్యాన్ని అధ్యయనం చేసిన మాతాపితరులకు జన్మించటం వలన వైష్ణవ తత్వాన్ని ఆమూలాగ్రంగా ఒంటపట్టించుకోవడం వలన ఆయన కావ్యావారాశిలో సంప్రదాయం పాల మీద మీగడలా కవితా మాధుర్యాన్ని వెలార్చుతుంది.

పురాణ పాత్రలను ఆధునికంగా ఉపయోగించడం, పురాణ పాత్రలను, సన్నివేశాలను విరివిగా వాడటం, సామెతల ప్రయోగం వంటి సంప్రదాయ రీతులు తిరుమల రచనలో చోటు చేసుకున్నాయి. ఇట్లా సంప్రదాయాన్ని జీర్ణించుకున్న కవులు ఆధునికంగా కొద్దిమందే అగుపిస్తారు. అందులో తిరుమల ఒకరు.

## 18. యువతాభ్యుదయం

సమాజం పరిపూర్ణత్వాన్ని సాధించడానికి యువత తోడ్పాటు ఎంతో అవసరం. వారు విద్యలలోని సారాన్ని సంగ్రహించి, అనుభవించి, ఆదర్శవంతమైన జీవితాన్ని గడుపుతూ సమాజాన్ని సంస్కరించడానికి పూనుకుంటారు. ఎక్కడ ఏ వైపరీత్యం జరిగినా, ఏ అన్యాయం పంజా విప్పి చరిచినా, అవినీతి ఎక్కడ తలెత్తినా వెంటనే వాటికి పరిష్కరించి సదాశయాలను ప్రబోధించి మనిషికీ మనిషికీ మధ్య, మనసుకీ మనసుకీ మధ్య స్నేహసంబంధాన్ని, అనురాగబంధాన్ని అల్లుతారు. జాతి కోసం, జాగృతికోసం, జనజీవన సౌఖ్యం కోసం చెమటను చిందిస్తుంటారు. వరకట్నం వంటి పాశవికమైన ఆశలకు సమ్మోహితులు కాకుండా, హింసా మార్గాన్ని అనుసరించకుండా స్వచ్ఛమూ, ప్రశాంతమూ, పవిత్రమూ అయిన హృదయాలతో నడుచుకుంటూ ఉత్కృష్టమైన సమాజ అవతరణ కోసం ముందు నడుస్తుంటారు. ప్రాచీన భారత సంస్కృతీ సంప్రదాయాల మూల్యాలను ఆధునీకరించుకొని నిత్యనూతనత్వాన్ని సంతరించుకొని దేశమాత నుదుటి సింధూర తిలకాన్ని మరింత ప్రకాశించేటట్టు చేస్తుంటారు. ఈ గమనంలో ఎన్ని అడ్డంకులు నిలువరించినా, ద్వేషం ఎంత మీదికి చిమ్మబడుతున్నా, మరెంత దౌర్జన్యం భయపెట్టినా అడుగు ముందుకు వేస్తూ ఆశించిన లక్ష్యాలను సాధిస్తుంటారు. చెడు అలవాట్లకు అందనంత దూరంగా, మానవతా విలువలకు మనసంత దగ్గరగా ఉంటూ ప్రయోజకులనిపించుకుంటారు. దేశ భావి నిర్ణేతలుగా నిలబెడతారు.

అయితే యువత అంతా ఒకే రకమైన సదాశయాలతో ఉండలేరు. దౌర్జన్యాన్ని ఆశ్రయించేవాళ్ళు, అవినీతిని పోషించేవాళ్ళు, ప్రగతి నిరోధకులూ, అమానుషమైన

ఉద్యమాలకు వెన్నుదన్నుగా ఉండే వాళ్ళూ ఉంటారు. చెడు అలవాట్లకు బానిసలుగా ఉంటూ వ్యక్తి జీవితానికి సమాజ గమనానికి మచ్చ తెస్తుంటారు. చదువు మానేసి సంస్కరణాభిలాషను పక్కకు తోసేసి ప్రగతికి సోపానంగా ఉంటున్న విద్యాలయాలను తమ దుశ్చర్యలతో కళంకితం చేస్తుంటారు. పాఠాలను, జీవిత పాఠాలను బోధిస్తూ మనుగడలో స్వర్ణోషస్సులు పలికిస్తున్న గురువులను, తోడుగా చదువుకుంటున్న సోదరీమణుల్లాంటి స్త్రీ మూర్తులను అవహేళనం చేయటం, ఏదో ఒక రాజకీయాన్ని ఆశ్రయించి కుమ్ములాటలకు దిగడం తుదకు మారణకాండకు సైతం వెనుకాడకపోవడం కొంత యువతలో కన్పిస్తుంది. మాదకద్రవ్యాలకు బానిసలై బతుకులను నిర్వీర్యం చేసుకుంటూ చప్పగా చతికిలపడి మనిషి లోకానికి చెడును పులుముతుంటారు. యువతలో ఈ రెండు పార్శ్వాలు కన్పిస్తున్నాయి.

ఆచార్య తిరుమల 'యువత' సన్మార్గంలో నడవడానికి దోహదపడే శక్తిమంతమైన రచనలు వెలువరించారు.

చట్టాల గుడి గంటలు వినలేక
చెవులు గట్టిగా మూసుకొని
కట్నాల ప్రసాదాల కోసం
ఒళ్ళంతా కళ్ళు చేసుకొని
విద్యాలయాన్ని విద్యా-లయలుగా
మారుస్తున్న యువతను చూడు.[414]

యువకుల్లో కొందరు పెద్దల ప్రభోదాలతో, మరికొందరు సొంత ఆలోచనలతో స్వార్థపూరితులవుతారు. కట్నం పేరుతో పెద్ద మొత్తాన్ని వధువు తల్లిదండ్రుల నుంచి లాగడానికి అనేక వ్యూహాలను పన్నుతుంటారు. పీడిస్తుంటారు. అనుకున్నదంతా అందకపోతే పీకలు నులిమేస్తారు. ఇలాంటివాళ్ళు గుడిగంటల్లాంటి చుట్టాల మధుర ధ్వనులను వినడానికి ఇష్టపడక చెవులు మూసుకుంటారు. కట్నాల ప్రసాదాల కోసమే చదువుతుంటారు. జ్ఞానాన్ని అక్షర స్వరూపంగా వెదజల్లుతున్న మనిషిలోని మహోత్తర గుణాలకు గుడి కడుతున్న పవిత్రతకు నిలయాలైన విద్యాలయాలన్ని విక్రయశాలలుగా మిగిల్చగలుగుతున్నారు. ఇది తిరుమల ఆవేదన. రూపకాలంకారంలో సమాజ ప్రగతి వ్యతిరేక భావాలున్న యువత వైఖరినీ, వికట స్వరూపాన్నీ మూర్తి కట్టించారు.

యువతలో ఆవేశం, ఉద్వేగం కావలసినంత ఉంటాయి. వీటిని సక్రమమైన పద్ధతులలో, సరళమైన రీతిలో వాడుకోకపోతే జీవితం ప్రశ్నార్థకంగా ఉండిపోతుంది. ప్రయోజనం శూన్యంగా ఉండిపోతుంది. తిరుమల ఈ వైఖరిని మార్చుకోమని యువతకు విలువైన సందేశాన్ని అందిస్తున్నారు.

రాబందు రెక్కల వెచ్చని నీడలో
తలదాచుకోవాలని



పరుగెత్తే త్రాచు పాములా
నేటి యువశక్తి ఉద్యమ ప్రబోధాల
నాగస్వరాలకి-బైటపడి-బరి మీద పడి
కట్టుబడి-పట్టుబడి ఆఫీసు బుట్టలో
అదే పనిగా తలూపుతూ
ఇంక్రిమెంటు ఈశ్వర పేరుతో
మాటల పడగ ముడిచి
స్వేచ్ఛా ప్రవృత్తి విడిచి
కాలానికి చట్రంలా చుట్టుకుపోయి
చిరాకు బుసకొడుతూ నల్లగా వెలిగేకన్నా
చీకటి బుట్టని చీల్చుకొని
ప్రగతి అక్షరాలు అధిరోహించే
ప్రజాభ్యుదయ భావాల
అడుగు జాడల మీద పడగ బ్రద్దలు కొట్టుకుని
ఆత్మార్పణ చేసుకోవటం మంచిది
ఆ త్యాగబలం ఆ రుధిర ఖడ్గంతో
రాబందు రెక్కలు నరకటం మంచిది
ఎందుకంటే-యువశక్తి ఆరిపోని జ్వాల
ఈ జన హృదయం వాడిపోని భావాల మాల[415]

పై కవితా పంక్తులు తేలిక పదాల పరుగులతో నిండైనా భావుకతతో ఉన్నాయి. యువత ఉద్యమాలలో చేరడం వాటిని ఉత్తేజితం చేయడం మంచిదే. నాయకత్వం వహించడం మంచిదే కాని, మానుష ధర్మానికి వ్యతిరేకంగా ప్రవర్తించడం ఉచితం కాదని అంటారు. రాబందులాంటి వ్యవస్థ చెప్పుచేతుల్లో బందీ కావడం కంటే, నల్లగా వెలిగేకంటే నాణ్యంగా మనుగడను సాధించడంలోనే ఔచిత్యం, ప్రయోజనం ఉన్నాయని భావించారు. నిటారుగా శిరసెత్తి విలువలను పరిరక్షించుకోవడానికి యువతకు ఆత్మార్పణం కావాలి. ఆత్మార్పణ నుంచే త్యాగం పుట్టుకొని రావాలి. అప్పుడు చేతులకు రుధిరఖడ్గం అందుతుంది. దాని సహాయంతో అరాచకం, అవినీతి, అధర్మం, అన్యాయం వంటి వాటితో మూర్తీభవించిన రాబందు రెక్కలను నరికివేయడం ఉచితంగా ఉంటుంది. అప్పుడు కాని సమాజం కొత్త వెలుగులను ప్రసరిస్తుంది. యువశక్తి ఆరిపోని అగ్నిజ్వాలలాంటిది. అది ఎప్పుడూ వాడిపోని భావాల మాలలా పరిమళాలను వెలారుస్తూ ఉంది.

యువతలలో కొందరికి అసలైన ప్రేమ సిద్ధాంతం తెలియదంటారు.

జననేంద్రియాల మీదికి తప్ప

జ్ఞానేంద్రియాల మీదికి దృష్టిపోని యువత
ప్రేమను గూర్చి మాట్లాడుతుంది
ఎంత వింత![416]

యువత పైపై అందాలకు మురిసిపోవడం, జననేంద్రియాల మీదనే ఆసక్తి చూపడం, తలపోయడం, తలపులలో పరవశించిపోవడం అంతమాత్రమే తెలుసు. వాళ్ళు ప్రేమను గూర్చి చెబుతుంటారు. భౌతికమైన అందాలు, జననేంద్రియాల మీది మమకారాలు మాత్రమే ప్రేమసూత్రాలు అనుకుంటే అంతకన్నా విడ్డూరమైన విషయం ఇంకొకటి ఉండదు. ఈ రెండు విషయాల మీదికి దృష్టి మళ్ళించేవాళ్ళు, మాట్లాడేవాళ్ళు కేవలం కాముకులు మాత్రమే. కాముకులకు బాహిర సౌందర్యం మాత్రమే తృప్తిని ఇస్తుంది కాని, ఆంతరమైన అందం అందదు. కాబట్టి, వాళ్ళు అనుభవించేది క్షణికమైందే. వీళ్ళు భావిస్తూ మాట్లాడుతున్నదీ క్షణికమూ, అర్థరహితమైనట్టిదే. ప్రేమ అందరికీ ఛప్పున అర్థమయ్యే అంశం కాదు.

ప్రముఖ సాహితీవేత్త డా॥ మిరియాల రామకృష్ణ

అందమునకొక కొత్త జీవమునందజేసే శక్తి ప్రేమయే
అందమునె పూజించు వానికి అందజాలని ధనము ప్రేమయే
యువతులను వెన్నంటి అరిచే యువకులందరి ప్రేమ గుడ్డిది
మదిర నయనల చూపులెరుగని మర్కటాలకు ప్రేమ ఎక్కడ[417]

అంటూ ప్రేమతత్త్వాన్నీ, అది అందుకోలేని యువత దృష్టినీ చెప్పారు. అయితే తిరుమల మరింత తాత్త్వికంగా చెప్పారు.

మహాకవి డా॥ దాశరథి

కవిత లేకయున్న యువత శూన్యంబౌను
యువత లేక యున్న నవత సున్న
నవత లేకయున్న నాగరికత లేదు
నాగరికత లేక నాడు లేదు[418]

అంటూ కవితకూ, యువతకూ సమ ప్రాధాన్యం కల్పించారు. యువత భుజస్కంధాలపై యున్న బాధ్యతను గుర్తుచేస్తున్నారు కవి. యువత యొక్క కృషే దేశ అభ్యున్నతికి మూలం అవుతుందన్నది సత్యసన్నిహితమైన విషయం.

ఆచార్య తిరుమల

ద్వేషమంటే అగ్నిరా
స్వార్థమంతా నూనెరా
మంటలార్పే సహనశీలమె
మానవతకు రక్షరా
ఆ రక్షయే మన యువతరా[419]



అంటూ మానవత్వాన్ని రక్షించేది యువతగా చిత్రించారు. ఎన్ని ఉన్నా ప్రాణం లాంటి మానవత్వం లేకపోతే అంతా ప్రయోజనశూన్యమంటారు కవి. 'ఒక్కటే ఒక్కటే యువత, నవ వికసిత మానవతామృత– ఒక్కటే' అని ఉప్పొంగిపోతారు. ఆయన యువతను జాగృతం చేస్తున్న వైనం విశిష్టంగా ఉంది.

మెరిసింది సమ సమాజ సీమాకాశం
ఉరిమింది యువజనాళి భావావేశం
శాంతి తారగా విరిసే హాసం
కాంతి ధారలో తడిసే దేశం
కష్టపడక సుఖంకోరు పామరులారా
పనిచేయక ధనం కోరు సోమరులారా
విత్తనాలు వెదజల్లక పొలం పండుతుందా?
దీపమొకటి వెలిగించక తమం తొలగుతుందా?
లేవండీ! యువలోకం చూడండీ
నడవండి! నవపథాన నడవండీ
ఒకరినొకరు దోచుకునే కోరిక వుంటే
నయవంచకులైన వారి మాటలు వింటే
మానవత్వమే నలిగి మమత మాయదా
దానవత్వమే ప్రబలి ధరణి కృంగదా[420]

నయవంచకుల మాటలు వింటే మానవత్వం నలిగిపోతుందని, మమత మాసిపోతుందని, దానవత్వం ప్రబలిపోతుందని యువత జాగురూకతతో ఉండాలని సందేశమిచ్చారు. 'సమభావమూ ఒక పువ్వయితే, ఆ పువ్వు కమ్మని తావి మీరు, జనసాగరమే విజ్ఞానం అయితే ఆ జ్ఞానసంపద తేజం మీరు' అని పోలుస్తూ భుజం భుజం కలిపి చేయి చేయి కలిపి ఆత్మీయతనూ, అభిమానాన్ని ప్రతి ఇంట్లో కల్పవృక్షాలుగా నాటమని చెప్పారు. ప్రగతిని సాధించమని ప్రబోధించారు.

తిరుమల యువత కర్తవ్యాన్ని గుర్తు చేస్తూ

యువలోకం రావాలి ముందుకు
ప్రగతి దివ్వె వెలిగించేటందుకు
వెలుగు వెదజల్లేటందుకు
దేశభక్తి కవితలోని ఆవేశంలా
దివ్యమైన శాంతిదేవి సందేశంలా
... ... ... ...
కులమతాల ఇనుపతెరలు తొలగించి
స్వార్థపరుల వంచనలను అదలించి

కిసానులై-వీర జవానులై

చైతన్యపు ఉప్పెనలా[421]

ముందుకు నడవాలని యువత భుజస్కంధాలపైన ఉన్న బాధ్యతను గుర్తు చేస్తున్నారు.

ఇట్లా సమాజ వికాసానికి శక్తిమంతంగా దోహదపడే యువతను కవి విశేషంగా వర్ణించారు. తిరుమల సందేశాత్మకమైన ఈ రచన ఎప్పుడూ యువతకు కరదీపికగా ఉంటుందని చెప్పడంలో అతిశయోక్తి లేదు.

## 19. పూర్వకవి ప్రభావం

ఆకృతి మీద పడిన ప్రభావంకంటే ఆలోచన మీద పడిన ప్రభావం శక్తిమంతం. ఆలోచనకంటే అనుభవం మీద పడిన ప్రభావం గుణవంతం[422] -ఆచార్య జి.వి.సుబ్రహ్మణ్యం.

మానవ జీవితంలో ప్రభావం అనేది సహజం. ఒక వ్యక్తి విశేషమైన గుణాలతో ఆదర్శంగా మనుగడ సాగిస్తున్నప్పుడు అతని వ్యక్తిత్వం, వక్తవ్యం సమాజం మీద ప్రగాఢ ప్రభావాన్ని చూపుతుంది. సమాజాన్ని చలింపజేస్తుంది. ఆలోచింపజేస్తుంది. ఉచితమైన మార్గంలో ముందుకు సాగేటట్టు చైతన్యపరుస్తుంది. సాహిత్యం కూడా అదే రీతిలో ఉంటుంది. ఒక కవి తనకంటే ముందు వెలువడిన రచనలకంటే భిన్నమైన, ఆలోచనాత్మకమైన, విప్లవాత్మకమైన రచనలు వెలయించినప్పుడు ఆయన దృక్పథం ఆ తరువాతి కవుల రచనల మీద ప్రసరిస్తుంది.

వాల్మీకి రామాయణంలో ఉన్న హనుమత్సందేశం అనంతర కవుల సాహిత్యం మీద బాగా ప్రభావాన్ని చూపింది. ఈ సన్నివేశం పాథేయంగా మహాకవి కాళిదాసు మేఘసందేశం వెలువడిందని అభిజ్ఞులు భావించారు.

తెలుగులో వెలువడిన భారత, రామాయణ, భాగవతాలలో కూడా ఈ దృక్పథం కన్పిస్తుంది. అయితే వస్తువును బట్టి అభివ్యక్తిలో మార్పు కన్పిస్తుంది. నన్నయకు ముందు శాసనాలలో పద్యకవిత ఉన్నా ఆదికవి వృత్త నిర్మాణంలో, కవితాభివ్యక్తిలో, కథావిస్తారంలో కొత్తపుంతలను ప్రదర్శించాడు. అది అనంతర కవుల మీద చక్కని ప్రభావాన్ని కలిగించింది. పాల్కురికి సోమన, నాచన సోమన, ఎఱ్ఱనల కవితను బమ్మెర పోతన ఎంతగా అనుసరించాడో సాహితీపరులకు తెలుసు. అయితే ఇది కేవలం అంధానుకరణం కాక చదివినకొద్దీ మాధుర్యాన్ని అందించి చదువరిని చకితం చేస్తుంది.

ప్రాచీన కవులతో పాటు ఆధునికులలో గురజాడ, రాయప్రోలు, విశ్వనాథ, శ్రీశ్రీ, సినారె వంటి సాహితీ దిగ్గజాల రచనలు రసజ్ఞుల మీద గాఢమైన ప్రభావాన్ని చూపుతున్నాయి.

తిరుమల ప్రాచీన ఆధునిక కవుల కవిత్వాన్ని ఔపోశన పట్టిన మహాకవి. వారి సాహితీ దృక్పథాలను సాకల్యంగా వివేచించిన సద్విమర్శకులు. అయితే, తిరుమల కవిత్వం మీద ప్రాచీన, ఆధునిక కవితా ప్రభావం ఉందన్న విషయం సత్య సన్నిహితమైనదే.



తిరుమల కవులను అనుకరించినవారు కారు. వారి కవితా రీతులను సాకల్యంగా అధ్యయనం చేసి ఒక విలక్షణమైన అభివ్యక్తిని సంతరించుకొని కావ్యసస్యాలను పండించారు.

ఆదికవి నన్నయ కవితారీతులు అనంతర కవులకు ఒక మార్గాన్ని చూపాయి. కొందరు నన్నయలాగా రాశారు. మరికొందరు ఆయన మార్గాన్ని విస్తృతపరచి అనేక నూతన ధోరణులను ప్రవేశపెట్టి రాశారు. భారతాంధ్రీకరణంలో నన్నయకు నారాయణభట్టు తోడ్పడ్డాడని ఆదికవే తెలిపారు.

పాయక పాకశాసనికి భారతఘోర రణంబునందు నా
రాయణునట్లు తానును ధరామర వంశ విభూషణుండు నా
రాయణభట్టు వాఙ్మయ దురంధరుఁడుదనకిష్టుడున్ సహా
ధ్యాయుడునైన వాఁడభిమతంబుగఁదోడయి నిర్వహింపగన్[423]

ఈ పద్యం తెలుగు సాహిత్య విమర్శ చరిత్రని చకితం చేసింది. ఎందరో రాటుదేలిన విమర్శకులు నన్నయ కాలాన్ని నిర్ణయించేటప్పుడు ఆయన భారత రచన చేయడానికి ఉద్యమించినప్పటి పరిస్థితులను వివరించేటప్పుడు ఈ పద్యంలోని అంశాలను తీసుకొని విపులంగా చర్చించారు. దీనితో ఈ పద్యం సాహితీ పిపాసువుల రసనలకెక్కింది. ఆచార్య తిరుమల ఈ పద్య శిల్పానికి ముగ్ధులయ్యారు. ఇట్లాగే రాయడానికి ప్రయత్నించారు.

పాయక శాతవాహనులు పల్లవ కాకతి రెడ్డి వంశజుల్
రాయలు నాదిగా గలుగు రాజులుదగ్ర రణోర్వ్యుగ్రాలుటన్
ధ్యేయము సర్వతంత్ర గణ దివ్య మహాంధ్రముఁ గూర్చి నూతనా
ధ్యాయము తెల్గువారి చరితంబునజేర్చి తరింపకాదకో[424]

నన్నయ పద్యంలో అర్థస్ఫూర్తి వేరు. తిరుమల పద్యంలో భావదీప్తి వేరు. తిరుమల పద్యం నన్నయశైలి ననుసరించి వెలువడి నూతనమార్గంలో నడిచింది. అభివ్యక్తిలో కూడా కొత్తదనాన్ని చూపింది.

శ్రీనాథుని కావ్య ప్రపంచానికి సాహితీ లోకంలో ఎంతటి విశిష్టస్థానం ఉందో చాటుపద్యాలకు కూడా అంతటి విశేష గౌరవం ఉంది. చాలామంది సాహితీపరులు శ్రీనాథుని చాటువులను మననం చేసుకుంటూ ఆ మహాకవి లోకజ్ఞతనూ, ధిషణనూ మెచ్చుకుంటారు. ఆయన పల్నాడు సీమకు వెళ్ళి అనుభవించిన బాధలను పద్యాలలో చూపించారు. ఉడుకుబచ్చలి శాకం జొన్నకూటితో తినడం వలన కలిగిన నష్టాన్ని

పుల్ల సరోజ నేత్ర, యలపూతన చన్నుల చేదుద్రావి నాఁ
డల్లదవాగ్ని ద్రింగితి నటంచును నిక్కెదవేల? తింత్రిణీ
పల్లవ యుక్తమౌనుడుకు బచ్చలి శాకము, జొన్నకూటితో
మెల్లన యొక్క ముద్ద దిగమ్రింగుమ! నీ పస కాననయ్యెడిన్[425]

అంటూ వర్ణించారు.

తిరుమల ఇదే పద్యం నడకను తీసుకొని కృష్ణయ్య కోసం నిరీక్షిస్తున్న గోపకాంత హృదయోద్వేగాన్ని

పుల్ల సరోజ సౌరభ సముజ్వల సుందర సీమలోన-నన్
మెల్లన కౌగిలించి మితిమీరి రత్న తనువెల్లగొన్మ హో
నల్లనివాడయంచు నదె నగ్న శరీరము తోడవచ్చె నీ
గొల్లది; సిగ్గు చెంది వనకోయిల కోమ్మలమాటుకేగగన్[426]

అని నడిపించారు.

భాగవతంలోని

నల్లనివాడు పద్మనయనంబులవాడు కృపారసంబు పై
జల్లెడు వాడు మౌళి పరిసర్పిత పింఛము వాడు నవ్వురా
జిల్లెడు మోము వాఁడొకడు చెల్వల మానధనంబు దోచెనో
మల్లియలార! మీ పొదల మాటున లేడు గదమ్మ చెప్పరే?[427]

అనే పద్యం లోకప్రసిద్ధమైంది. సాహితీపరులకే కాక పామరులు కూడా నిత్యజీవితంలో ఆయా సందర్భాలలో ఈ పద్యాన్ని గుర్తు చేసుకుంటారు. ఈ పద్యం తిరుమల రసహృదయాన్ని బాగా కవ్వింపజేసింది. ఆ ప్రేరణతో

నల్లనివాడ వీవు నిను నమ్మి వివాహము జేసికొన్న నా
తెల్లని జీవితమ్ము వెలితిన్ మసిబారును, నీకు ప్రేమయా?
చల్లగ జేరబోకునను, చాలును నీ నయ వంచనమ్ము నే
నొల్లను కృష్ణ! పొమ్మనె, తలోదరి యోర్తు వియోగ వేదనన్[428]

పోతన పద్యంలో గోపాంగనల ప్రియాన్వేషణ రసోచితంగా సాగుతుంది. వెదికి పట్టుకొని నిలదీయాలన్న తపన తీవ్రంగా కన్పిస్తుంది. అయితే తిరుమల అభివ్యక్తి మార్గం వస్తుభేదం మరోవిధంగా ప్రియుణ్ని నిరసించే విధంగా ఉంది.

పోతన కవిత రసజ్ఞులను పరవశింపజేస్తుంది. ఆయన భాగవతమంతా ద్రాక్షాపాకంలా ఉంటూ చవులూరిస్తుంది. పోతన హృదయాన్ని తిరుమల తన హృదయం మీద కొంత ప్రతిష్ఠించుకున్నారు.

ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపల నుండు లీనమై
యెవ్వని యందుడిందు బరమేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం
బెవ్వఁడనాది మధ్యలయుఁడెవ్వఁడు సర్వముఁదానయైన వాఁ
డెవ్వఁడు వాని నాత్మభవు నీశ్వరునే శరణంబు వేఁడెదన్[429]

ఈ పద్యం స్పందనగా తిరుమల కలం నుంచి

ఎవ్వడు దివ్యలోకములకెల్ల నవారిత కాంతి ధారియో



ఎవ్వడు సర్వజీవ జగదీశ్వర మూర్తుల నేత్ర తారయో
ఎవ్వడు శైవ వైష్ణవ సుహృన్మయ వైదిక భావ రాశియో
అవ్విమలాత్ము విఘ్నపతినర్చన చేసెద లక్ష్యసిద్ధికిన్[430]

అనే పద్యం సాక్షాత్కరించింది. పోతన చెప్పింది లోకానికి మూలకారకుడైన నారాయణుణ్ని. తిరుమల ఆరాధించింది గణపతిని. పోతన పద్యంలో వైష్ణం, తిరుమల పద్యంలో శైవ వైష్ణవాలు. అట్లాగే "ఇన మధ్యంగత దివ్యమూర్తి యెవడో"[431] "మునులే దేవుని గూర్చి నిచ్చలు తపంబులు సేతురో"[432] వంటి తిరుమల పద్యాలలో పోతనపై పద్య ప్రభావం కనిపిస్తుంది.

పోతన్నదే మరో పద్యం

అలవైకుంఠ పురంబులో నగరిలో నా మూలసౌధంబు దా
పల మందార వనాంతరామృత సరః ప్రాంతేందుకాంతోపలో
త్పల పర్యంక రమా వినోదియగు నాపన్న ప్రసన్నుండు వి
హ్వల నాగేంద్రము "పాహిపాహి" యనఁగుయ్యాలించి సంరంభియై[433]

అనే పద్యం

అలవైకుంఠ పురంబులో వెలయు నీలాంభోధర శ్యాము లీ
లలు గుర్తించి లిఖింపగా గలము కైలాసంబునన్ బొల్చు మం
గళ మూర్తిన్ గిరిజానువర్తి నెరుంగగావచ్చు గంగాధరున్
గలనైనన్ గనజాల మీ ప్రకృతి యాకారంబు శ్రీ రాఘవా![434]

పోతన పద్యంలో భక్తుడైన గజేంద్రుని దైన్యాన్ని అలకిస్తున్నప్పుడు వైకుంఠంలో నున్న స్వామి స్థితి వర్ణింపబడితే తిరుమల పద్యంలో కైలాసనాథుని తత్వం వర్ణింపబడింది.

కృష్ణదేవరాయల 'ఆముక్తమాల్యంద' ప్రభావం కూడా తిరుమల కవితపై ఉంది. శ్రీవిష్ణువు తన భక్తుడైన విష్ణుచిత్తుని పాండ్యరాజ సభకు వెళ్ళి అక్కడి పండితులతో వాదించి విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని స్థాపించుమని ఆజ్ఞాపిస్తాడు. ఆ సమయంలో విష్ణుచిత్తుని వినయ దృక్పథాన్ని రాయలు

స్వామీ! నన్ను నితః పురా పఠిత శాస్త్ర గ్రంథ జాత్యంధు, నా
రామక్ష్మాఖనన క్రియాఖర, ఖనిత్ర గ్రాహితోద్యత్కిణ
స్తోమస్నిగ్ధకరు, న్భవద్భవనదాసు, న్వాదిగాఁబంపుచో
భూమీ భత్సభ నోటమైన నయశంబుస్నీకు రాకుండునే?[435]

అని వర్ణించారు. ఇది తిరుమల హృదయాన్ని ఆకట్టుకుంది. ఆ పరవశత్వం నుంచి

స్వామీ! తత్పరదాస దాసుడను, దైవద్యాన పారీణతా
కామోద్విగ్న విశిష్ట భక్తజన శక్త్యారాధ నా వాసుదన్

సామ ప్రోజ్జ్వల కృష్ణ గీత సుర రాసావాస రాసేశ్వరి
శ్రీ మోక్షాత్ముడ, నిన్నెఱుంగు తమి సర్వేశా! దయన్ దీర్చవే[436]

అనే పద్యం వెలువడింది. ఈ రెండు పద్యాలు కూడా సుదీర్ఘ సమాసాలతో ఉన్నాయి.

పండితులూ, పామరులూ సమంగా అలరించిన వేమన పద్యాలు రచయితలను మరింతగా ప్రభావితం చేశాయి. తిరుమల కొన్ని సన్నివేశాలలో వేమనను అనుకరించారు.

వెర్రివానికైన వేషధారికినైన
రోగికైన పరమ యోగికైన
స్త్రీల జూచినపుడు చిత్తంబు రంజిల్లు

అనే వేమన పద్యం 'తిరుమలోక్తి' లో

కానిపించు జగము కామ సముద్రమ్ము
చిత్తమెపుడు పెద్ద చిల్లుపడవ
సారమతులకైన తీరంబు తోచదు[438] అని వెలువడింది

అట్లాగే

ఇంటియాలు విడిచి యిల జారకాంతల
వెంట దిరుగువాడు వెర్రివాడు
పంటచేను విడిచి పరిగె యేరిన యట్లు[439]

అనే పద్యం

కాళ్ల మీద పడెడు కాంతను కాదని
మొట్టికాయ మొట్టు ముదగగోరు
పిచ్చివాని బ్రతుకు పెంటపై ఇస్తరి[440] గా వెలువడింది.

తిరుమల పద్యం మీద కరుణశ్రీ ముద్ర గాఢంగానే ప్రసరించింది. ఆధునిక కాలంలో పద్యానికి రెక్కలు కట్టించి హాయిగా పరుగులు తీయించిన ఒకరిద్దరు కవులలో కరుణశ్రీ ఒకరు. ఆయన ప్రతి పద్యం వసంత సమీరం తెచ్చి గుండెకు స్పర్శింపజేసినట్టి పరిమళంలా హాయిగా ఉంటుంది. అందుకే ఆయన పద్యాలు మాకంద ఫలాలు. కృష్ణస్వామి కోసం ఎదురుతెన్నులు చూస్తూ విరహాగ్నిలో దహించుకొని పోతున్న రాధ హృదయవేదనను కరుణశ్రీ

రాధనురా ప్రభూ! నిరపరాధనురా! అనురాగభావనా
రాధన మగ్నమానసనురా! కనరా! కరుణింపరా! మనో
వీధి పదే పదే కలకవేయుచున్నవిరా! పురా రహో
గాధలు- ఈదలేనిక అగాధ తమోమయ కాలవాహినిన్[441]

అనే పద్యం తిరుమల హృదయం నుంచి

బాలనురా! ప్రభో! విరహబాధ భరింపగలేనురా! మహో
కాల పయోధి నీద బలగర్వమొకింతయు లేని దానరా!
జాలము సేయబోకుర ప్రశాంతి నిశిథి శశాంక చంద్రికా
జాలములోన నన్ను మనసారగ యేలర కృష్ణ! సత్కృపన్[442]

అనే భావుకతతో వెలువడింది. ఈ పద్యంలో కరుణశ్రీ శైలి గోచరిస్తుంది.

కరుణశ్రీ మరో పద్యం

స్వాగత! మో స్వయంవర సమాగత రాజకుమారులార! మీ
యాగమనమ్ముచే హృది ప్రహర్ష పరిప్లుతమయ్యె- ఈధను
ర్యాగము నందు శంకర శరాసన మెక్కడి నెవ్వ; డా మహా
భాగు వరించు నా యనుగు పట్టి సమస్త సభా ముఖమ్మునన్[443]

అనే పద్య ప్రభావం

స్వాగతమోయి! విశ్వజన వందిత! స్వాగతమోయి! నిర్ఝరీ
రాగ మరంద! స్వాగతము రారా! మహార్థ తటిత్ప్ర భావ ది
వ్యాగమ శబ్ద రూప! గరళానల సాగరమైన లోక మం
దీ గతి మగ్నమైతి, జగదేక సుధామయ! ఊతనీయరా!
అనే తిరుమల పద్యంపై అగుపిస్తుంది.[444]

కరుణశ్రీ పద్యంలో సీతాస్వయంవరానికి వచ్చిన రాజకుమారులకు రాజర్షి జనకుడు స్వాగతం చెప్పడం వర్ణింపబడితే అదే పాదునుంచి పుట్టిన తిరుమల పద్యంలో వేదరూపుడైన నారాయణుని ఔన్నత్యం చిత్రింపబడింది.

కరుణశ్రీ పద్యం

సంజ వెలుంగులో పసిడిచాయల ఖద్దరు చీరగట్టి నా
రింజకు నీళ్ళు వోయి శశిరేఖవె నీవు: సుభద్ర సూతివై
రంజిత పాణి పల్లవము రాయుదునా-నిను మౌళి దాల్చి మృ
త్యుంజయ మూర్తివై జమునితో తొడగొట్టి సవాలు సేతు నా[445]

తిరుమల

సంజ వెలుంగులో మురళి సాధన జేయుచు నాలమంద ముం
దంజను వేయ దోలుచు గృహమ్మున కేగెడు కృష్ణుగాంచి-ఓ
కంజ దళాయతాక్షి రతికాంక్షను వాని కరమ్ము బట్టి పూ
పంజరమైన ఆ పొదల ప్రక్కకు లాగుచు నుండె చూడరే.[446]

అనే పద్యానికి పథ నిర్దేశం చేసింది. కరుణశ్రీ పద్యంలో ప్రణయానికి శశిరేఖ ప్రతీకగా

వర్ణితమైతే, తిరుమల పద్యంలో వ్రేపల్లె గోపాంగన పారవశ్యం తళుకొత్తింది.

అట్లాగే,

ఇచ్చోటనే త్రోసిపుచ్చె వరూధినీ
ప్రణయబంధము పిచ్చి బ్రాహ్మణుండు
ఇచ్చోటనే 'తిష్ఠనిడి' నిష్ఠగొనె మనో
రథసిద్ధికై భగీంథనృపుడు
ఇచ్చోటనే పొంగులెత్తి నేలకు దూకె
నమృతంబు వెల్లి గంగమ్మ తల్లి

ఇచ్చోటే యిచ్చటే హృదయేశ్వరునకు
కొండరాచూలి వలపులు గ్రుమ్మరించె
అనుచు విద్యాధరాంగనలను దినమ్ము
చెప్పికొనుచు విహారముల్ సేయుదురట[447]

అనే కరుణశ్రీ పద్యం ఊనికగా తిరుమల ఈ పద్యం దూసుకొచ్చింది.

ఇచ్చోటనే కదా ఇనకుల తిలకుని
బ్రతుకు వాల్మీకి కావ్యమ్ము చేసె,
ఇచ్చోటనే కదా ఇంద్రనందనునకు
గీతామృతము పోసె కృష్ణమూర్తి
ఇచ్చోటనే కదా ఏకదంతుని పిల్చి
బాదరాయణి చెప్పె భారతమ్ము
ఇచ్చోటనే కదా ఎలమీ నుహా గీతి
కలు నిక్కమనిపించె కాళిదాసు

ఇచటనే కదా శ్రీనాథుడు చతురగతి
కంచుఢక్క బ్రద్దలు కొట్టె కవితలల్లి
అట్టి సత్కవీశ్వర వంశమందు పుట్టి
పెరిగినందులకేను గర్వింతు సతము[448]

తిరుమల పద్యం కరుణశ్రీ నుంచి రూపొందితే, కరుణశ్రీ పద్యానికి పాదు 'మనుచరిత్ర'లోని 'నిడుద పెన్నెఱి జడగట్ట సగరుముమ్మను మండు తపము గైకొనినచోటు'[449] (2-8) అనే పద్యమని చెప్పవచ్చు.

అచ్చమైన భావకవిగా ఆధునిక కవిత్వాన్ని పరిపుష్టవంతం చేసిన కృష్ణశాస్త్రి కావ్యాలు ముఖ్యంగా లలిత గేయాలు అనంతర కవుల కవిత మీద బాగా ప్రభావాన్ని చూపాయి. ఆర్ద్రమైన భావుకత రసార్ద్రమైన శైలి దేశీయమైన దృష్టి ఆయన కవితల్లో కనిపించే ప్రధానమైన గుణాలు. తిరుమల నిరంతర పాఠకుడు కావడం వలన ఇతర కవుల కవితలవలనే కృష్ణశాస్త్రి కవితల అధ్యయనం కూడా ఆయన కవిత్వం మీద ప్రభావాన్ని చూపాయి.

సౌరభములేల చిమ్ము పుష్పవ్రజంబు?
చంద్రికలేల వెదజల్లు చందమామ?
ఏల సలిలంబు పాఱు? గాడ్పేల విసరు?
ఏల నా హృదయంబు ప్రేమించు నిన్ను[450]

అన్న కృష్ణశాస్త్రి పద్యం తిరుమల హృదయాన్ని బాగా ఆకట్టుకుంది. అది అతని హృదయంలో ఎన్నో వలయాలుగా తిరిగింది. ఆ స్ఫూర్తితో ఆయన కలం నుంచి

ఎవరినడిగి కూస్తుంది కోయిలమ్మ
ఎవరి నడిగి పూస్తుంది మామిడిరెమ్మ
ఎవరినడిగి, ఎవరినడిగి
సూర్యోదయమౌతుంది? శశివెన్నెల కాస్తుంది?

ఎవరి నడిగి పారుతోంది సెలయేరు?
ఎవరి నడిగి పల్లవించు విరికారు?
ఎవరి నడిగి? ఎవరి నడిగి నెమలి నాట్యమాడు
మొయిలు నింగి వీడు[451]

అన్న కవిత వెలువడింది. ప్రక్రియలు వేరుగా ఉన్నాయి. ప్రవచనాలు వేరుగా ఉన్నాయి కాని, ప్రశ్నా పద్ధతి ఒకే విధంగా ఉంది.

ఒక కవి సాహితీ జీవితంలోను, వ్యక్తిగత జీవితంలోను, ప్రభావాల ప్రసరణలు ఉండటం సర్వసాధారణం.

## 20. సత్కవితా లక్షణాలు

నానృషిః కవిరిత్యుక్త మృషిశ్చ కల దర్శనాత్
విచిత్ర భావ ధర్మాంశ తత్త్వ ప్రఖ్యాచ దర్శనం
న తత్త్వ దర్శనాదేవ శాస్త్రేషు పఠితః కవిః

దర్శనాద్వర్ణ నాచ్చాథ రూఢాలోకే కవి శ్రుతిః
తదా, హి దర్శనే స్వచ్ఛే నిత్యేప్యాది కవేర్మునేః
నోదితా కవితాలోకే యావజ్జాతా న వర్ణనా[452]

అని భట్టతౌతుడు కవిని గురించి చెప్పారు. పై శ్లోకాలను సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి "ఋషిగాని వాడు కవిగాడని చెప్పుదురు. ఋషియనగా ద్రష్ట. దర్శనమన విచిత్రమయిన వస్తువుల యొక్క ధర్మాంశముల తత్త్వము నెరంగుట (దీనికే ప్రతిభయని పేరు). అట్టి

తత్త్వదర్శనము గలిగిన వానినే శాస్త్రములు కవియని పేర్కొనుచున్నవి. కాన లోకమున దర్శనము (ప్రతిభాగుణములు), వర్ణనమునను నీరెంటి వలనను కవియని ప్రసిద్ధి వహించును. వాల్మీకి మొదట ద్రష్టయైనను వర్ణనము (రామాయణ రచనము) చేయు వరకు కవిగా గణింపబడడయ్యెను. దీని వలన ద్రష్టయైన వర్ణనా నిపుణుడు గావలయును"[453] అని తమ కావ్యాలంకార సంగ్రహంలో వ్యాఖ్యానించారు.

కవిని వర్ణనా నిపుణుడని భామహుడు, అపారమైన కావ్య ప్రపంచంలో కవియే సృష్టికర్తయని ఆనందవర్ధనుడు, లోకోత్తర వర్ణనలు చేయగల నిపుణత గలవాడే కవియని మమ్మటుడు కవి వాచ్య ప్రాశస్త్యాన్ని తెలిపారు. కవి తన ప్రతిభా వ్యుత్పత్తులతో సృష్టించే జగత్తే కావ్యం. 'యథాస్మై దోచతే విశ్వం తథేదం పరివర్తతే'. తన ఇష్టానుసారం కవి లోకాన్ని మారుస్తాడు. అయితే కావ్య సృష్టి చెయ్యడానికి కవి ఎలాంటి గుణాలు కలిగినవాడై వుండాలి? లేక అతని కవితలో ఏయే గుణాలు ప్రస్ఫుటంగా వుండాలి? అనే ప్రశ్న ఉదయిస్తుంది. కొందరు సంస్కృతాంధ్ర కవుల లక్షణాలను భట్టుమూర్తి నరస భూపాలీయంలో వివరించారు.

శ్రీనాథుడు కాశీఖండంలో

వచియింతు వేములవాడ భీమన భంగి
నుద్దండ లీల నొక్కొక్క మాటు
భాషింతు నన్నయభట్టు మార్గంబున
నుభయ వాక్ప్రౌఢి నొక్కొక్క మాటు
వాక్రుత్తు తిక్కయజ్వ ప్రకారము రసా
భ్యుచిత బంధముగ నొక్కొక్క మాటు
పరిఢవింతు ప్రబంధ పరమేశ్వరుని రేవ
సూక్తి వైచిత్రి నొక్కొక్క మాటు[454]

అని చెప్పిన పద్యంలో భీమన, నన్నయ్య, తిక్కన, ఎర్రనల కవి(తా) లక్షణాలను తెలియజేస్తుంది.

సారమతీం గవీంద్రులు ప్రసన్న కథాకవితార్థ యుక్తి లో
నారసి మేలు నా నితరు లక్షర రమ్యంత నాదరింప నా
నా రుచిరార్థ సూక్తినిధి నన్నయభట్టు తెనుంగునన్ మహా
భారత సంహితా రచన బంధురుడయ్యె జగద్ధితంబుగన్[455]

అని నన్నయ్య, 'అమలోదాత్త మనీష నే నుభయ కావ్య ప్రౌఢి చాటించు శిల్పమునం బారగుడం, గళావిధుడ'[456] అని తిక్కన, 'ఉన్నత సంస్కృతాది చతురోక్తి పదంబుల[457] అని ఎర్రన స్వయంగా తమ కవితా లక్షణాలను చెప్పుకున్నారు.

పొసగ ముత్తెపు సరుల్పోహళించిన లీలc
దమలోన దొరయు శబ్దముల గూర్చి



యర్థంబు వాచ్య లక్ష్య వ్యంగ్య భేదంబు
లెఱcగి నిర్దోషత నెసగcజేసి
రస భావములకు నర్హంబుగ వైదర్భి
మొదలైన రీతులిమ్ముగ నమర్చి
రీతుల కుచితంబులై తన రారెడు
ప్రాణంబు లింపుగాc బాదు కొల్పి
యమర నుపమాదులును యమకాదులు నగు
నట్టి యర్థ శబ్దాలం క్రియల ఘటించి
కవితc జెప్పంగ నేర్చు సత్కవి వరునకు
వాంఛితార్థంబు లొసcగని వారుcగలరే?[458]

అని కళాపూర్ణోదయంలో పింగళి సూరన తన కవితా లక్షణాలను చెప్పుకున్నారు.

ఆధునికుల్లో శేషేంద్ర శర్మ నదులను, కవులను కలుపుతూ కవి(తా) లక్షణాలను

నదులు కవులు భూగోళపు రక్తనాళాలు
నదులు ప్రవహిస్తున్నాయి కవితల్లా
పక్షుల కోసం పశువుల కోసం
మనుష్యుల కోసం
నదులు కంటున్న కలలు పొలాల్లో ఫలిస్తాయి
కవులు కంటున్న కలలు మనుష్యుల్లో ఫలిస్తాయి[459]

అని చెబితే, జ్ఞానపీఠ బహుమతి గ్రహీత డా॥ సి.నారాయణరెడ్డి కవితాత్మ లక్షణాలను తాత్వికత నేపథ్యంగా

కవితాత్మ కలకల లాడగా
ముఖాలలో పద్మాల పునర్ముద్రణలు
కళ్ళలో కలువల కలభాషణలు
పెదవులపై పండు వెన్నెల ప్రచురణలు
చెక్కిళ్ళలో చిగురుకెంపుల ప్రసరణలు[460] అని చెబుతారు.

ప్రతిభావంతుని కవితా హృదయం
ఒక మహోత్తుంగ తరంగం
దాని మ్రోల సకల చరాచర
నిమ్నోన్నతాలు అహం వీడిన[461]

అవనతాలు అంటూ డా॥ ఆవంత్స సోమసుందర్ ప్రతిభావంతులైన కవి హృదయాన్ని ప్రశంసించారు.

జీవితాన్ని కవిత్వాన్ని రెండింటిని అన్వయిస్తూ కవితా లక్షణాలను పేర్వారం జగన్నాథం ఇట్లా చెప్పారు.

కవిత్వం జీవితానికి దర్పణం
జీవితం కవిత్వానికి ఇతివృత్తం
కవిత్వానికి ఊహలే ఊపిరిగా నిలుస్తాయి
జీవితానికి ఊహలే
భవిష్యత్తులోకి నడిపిస్తాయి
కవిత్వానికి కావాలి
అలంకారాలు కొన్ని
జీవితానికి అలంకారాలు
అందాన్ని పెంచుతాయి
కవిత్వం రసానందానికి
రహదారి వేస్తుంది[462]

ఆచార్య తిరుమల సత్కవి లక్షణాలను ఇలా పేర్కొన్నారు.

సార సారస్వత క్షీర వారాశిలో
 వినయాంజలి ఘటించి మునుగకున్న
ఏ తత్సుధాగర్భ సంజాత కావ్యానంద
 రసధార లెదనిండ తావకున్న
పరతత్త్వ సార శబ్దబ్రహ్మ మహిమంబు
 నిస్తుల భక్తి ధ్యానింపకున్న
సత్యసూక్తి వితాన సౌరభ్య సీమలో
 మధుప భావము నొంది మసలకున్న
శాంతి గంభీర కీర్తి ప్రసార కేంద్ర
మంబు నిధివెలె దర్శనీయంబు గాక
యున్న లోక కళ్యాణ భావోదయమున
కై పరితపింపకున్న సత్కవియెయతడు[463]

సత్కవికి ఉండవలసిన మొదటి లక్షణం వినయం. వినయం లేకపోతే విజ్ఞుడు కూడా విర్రవీగి పతనమైపోతాడు. నలుగురిలోనూ నగుబాటుపాలౌతాడు. అందుకే- విద్యాదదాతి వినయం, వినయాద్యాతి పాత్రతాం! పాత్రత్వాత్ ధనమాప్నోతి, ధనాద్ధర్మం తతస్సుఖమ్!! అంటారు భర్తహరి. వినయం అంటే స్వర్వజ్ఞుడని భావించకుండా, ఇతరులు చెప్పింది సాదరంగా విని, నిష్పాక్షికంగా పరిశీలించి, తన తప్పుంటే ఒప్పుకోవడం, తనకు తెలియనిదాన్ని తెలుసుకోవడం అంటే ఒక విధంగా పండితుడు కూడా విద్యార్థి దశకు



రావాలి. ఈ దశ విద్యార్జనకు తొలిమెట్టు. ఇటువంటి మెట్లు ఎన్నో దాటితే గానీ మహోత్తుంగమైన జ్ఞాన సౌధాన్ని ఎవరూ ఎక్కలేరు. ఈ సువిశాల విశ్వంలో ఎందరో మేధావులున్నారు. మహానుభావులున్నారు. వాళ్ళతో పోల్చి చూసుకొని మన శక్తి సామర్థ్యాలను అంచనా వేసుకొని విజ్ఞానాన్ని సముపార్జించుకోవాలి. ఇలా చేసినవాడే వినయ సంపన్నుడు. వినయసంపన్నుడే విజ్ఞుడూ, సకల జనవంద్యుడూ అవుతాడు. కాబట్టి కవికి వినయం అవసరం.

కావ్యానందాన్ని కడుపునిండా తాగడం సత్కవికి కావలసిన రెండో లక్షణం. 'రస్యతి ఇతి రసః'- ఆస్వాదింపబడేది రసం. 'రసోవైసః-ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్' అని తైత్తిరీయ ఉపనిషద్వాక్యాలు రసాన్ని పరబ్రహ్మంగానూ, ఆనందంగానూ అభివర్ణించాయి. రసోత్పాదన చేసి, తాను రసానందాన్ని అనుభవిస్తూ, పాఠకుణ్ని కూడా రసస్థితికి తీసుకువెళ్ళేవాడే సత్కవి. రసానుభూతిని గుర్తించకుండా సారస్వతి క్షేత్రంలో విహరించేవాడు చేలో పడ్డ గుడ్డెద్దులాంటివాడు.

కవికి ఉండవలసిన మూడో లక్షణం 'శబ్దబ్రహ్మ' తత్వాన్ని అవగాహన చేసుకోవడం. పైన చెప్పిన ఆనందం బ్రహ్మస్వరూపం. అలౌకికం. అది పరతత్వసారం. శబ్దపరం. శబ్దం లేని వస్తువు నిర్వాచ్యం. నిర్వాచ్యమైనది శూన్యం. శూన్యంలో సృష్టి జరగదు. సృష్టికి కారణ హేతువులైన పంచభూతాలలో ఆకాశం ఒకటి. అది శబ్దాత్మకం. కాబట్టి సృష్టికి కారణం శబ్దం. శబ్దంలోంచి ఈ ప్రపంచం పుట్టింది. అందుకే అది శబ్ద బ్రహ్మ. అలాగే కవి కూడా శబ్దం చేతనే కావ్యసృష్టి చేస్తాడు. ఈ సృష్టికార్యంలో అతనికి శబ్దస్వరూప జ్ఞానమూ, శబ్ద ప్రయోగ నైపుణ్యమూ, శబ్దౌచిత్య వైచక్షణ్యమూ అవసరం. అవి తెలిసిన కవి మాత్రమే మహాకావ్య నిర్మాణం చెయ్యగలడు.

సత్యసూక్తి వితాన సముదాయ పరిమళ వ్యాప్తి సీమలో తుమ్మెదలాగా సంచరించడం సత్కవి నాలుగో లక్షణం. కవి కూడా సమాజంలోని మనిషే. సమాజం సమస్యలకు ఆలవాలం. సమస్యల వలయంలో అందరితో పాటు కవి కూడా పరిభ్రమిస్తాడు. ఈ పరిభ్రమణంలో అతను మానవ సృష్టినీ, సృష్టి వికాసాన్నీ, మంచి చెడ్డల్నీ, సుఖదుఃఖాల్నీ పరిశీలించి పరిశోధిస్తాడు. ఇదొక జ్ఞాన ప్రక్రియ. సత్యశోధన. ఇదే మధుప్రభావం. అనవరతం సాగే ఈ ప్రయత్నంలో అతనికి కొన్ని సత్యాలు గోచరిస్తాయి. అవి విశ్వజనీనమైనవి కావచ్చు. వాటిని అధ్యయనం చేసి, వివేచన చేసి, అనుభూతితో విశ్లేషించి, నిర్భీతితో లోకానికి తెలియజేయాలి. ఇవే సత్యసూక్తులు. పండిన అనుభవాలు. 'తిమిర సమాజాన్ని చైతన్యవంతం చేసే జ్ఞానదీపికలు.

కవి హృదయం శాంత గంభీర కీర్తి ప్రసారాలకు నియలమై సముద్రంలాగా దర్శనీయం కావాలనేది తిరుమల చెప్పిన మరో లక్షణం. సముద్రం వైశాల్యానికీ, గాంభీర్యానికీ, కీర్తికీ ప్రతీక అని ఇక్కడ గుర్తించాలి. సామాన్యంగా కవికి ఆవేశం అత్యావశ్యకం అనుకుంటాం. ఒట్టి ఆవేశంతో చేసిన రచన తాత్కాలిక ప్రయోజనాన్ని మాత్రమే కలిగిస్తుంది. రచనకు

శాశ్వతత్వం సిద్ధించాలంటే ఆలోచన, అవగాహన అవసరం. విశాలదృష్టితో శాంత చిత్తంతో కూలంకషంగా, సమగ్రంగా విషయావలోకనం చేసుకొని, ఒక పథకాన్ని రూపొందించుకొని, కవి రచనా నిమగ్నుడు కావాలి. అలా నిమగ్నుడు అయినప్పుడు దానిలో తదాత్మ్యం చెందుతాడు. అప్పుడే ఆవేశం దానంతట అదే వస్తుంది. దానితో రచనవేగం పుంజుకుంటుంది. కాబట్టి కవి శాంతచిత్తుడు కావాలి. దీనికి తోడుగా గంభీరమైన భావాలు కవి హృదయంలోంచి దొర్లుకురావాలి. భావగాంభీర్యం లేని కవిత్వం రాణించదు. ఈ విధంగా శాంత గంభీర గుణాస్పదమైన రచనకు కీర్తి తప్పకుండా వర్తిస్తుంది.

గ్రీకు దేశానికి చెందిన హోరెస్ (65 BC) "... you will win if you blend what is improving with what pleases, and as once delight and istruct the ueder. A poem like this earns money for the publisher his heart across the see and makes its famous author immortal"[464] అన్నారు.

ఏ కవి అయినా తన కాలంలోని సమాజ స్థితిగతుల్ని దృష్టిలో పెట్టుకొని వాటికి అనుగుణంగా రచనలు చేస్తాడు. కాలప్రవాహంతో సమాజం మారుతుంది. కవితా స్వరూపం మారుతుంది. వస్తువు మారుతుంది. సూక్ష్మంగా పరిశీలిస్తే కవి తన కావ్యంలో ఏదో ధర్మోపదేశాన్ని నిక్షిప్తం చేస్తాడు. అందరూ కోరుకోవలసింది లోకకళ్యాణమే. విశ్వశ్రేయమే. ఈ భావనతోనే నేడు చాలామంది రచనలు చేస్తున్నారు. ఇది హర్షణీయం. తిరుమల చెప్పింది కూడా ఇదే.

"మానవ వాక్కును సాధ్యమైనంత అధికాందకరమునగు నిర్దుష్టముగ జెప్పజాలుటయే కవితత్వము. అది మానవుడు సత్యము జెప్పుటకు మిక్కిలి సన్నిహితముగా రాజాలు సమగ్రమైన వాగ్రూపము కవితా సత్యసౌందర్య నియమములు అను జీవిత విమర్శనము కవిత్వము"[465] -మాథ్యూ ఆర్నాల్డ్

కవి సామాజికుడు. నిత్యం తాను దర్శిస్తున్న సమాజ స్వరూపాలన్ని ఆయన కవితగా రాస్తాడు. సమాజం ఆత్మగా ఉన్న మనిషి బహిరంతర్వలయాలను కవి పరిశీలించి అతనిలోని అమానుష కృత్యాలు అంతరించిపోవడానికి కవితలో నీతిని ప్రవేశపెట్టి మార్పుకోసం ప్రయత్నిస్తాడు. అందరు మనుషులలాగే సమాజంలో ఆయన ఉంటున్నప్పటికీ ఆయన ఆసనం ప్రత్యేకంగా ఉంటుంది. ఆయన సమాజ సరసిలో విహరించే రాజహంసలాంటివాడు. హంస పాలను నీళ్ళను వేరుచేసినట్టుగానే కవి మనిషి గుండెగుహల్లో గర్జిస్తున్న దానవత్వాన్ని అతని నుంచి దూరం చేసి మానవత్వాన్ని నిలుపుతాడు. మంచి చెడు చీకటి వెలుగులలాంటివి. వీటి ఘర్షణకు ఆధారక్షేత్రం హృదయతలం. కవి ఈ హృదయతలాన్ని కవితాక్షరాలతో అలంకరించి చెడులాంటి చీకట్లను తరిమివేసి మంచి అనే వెలుగులను ఈ నేల మీద వెదజల్లి కవి క్రాంతదర్శి అనిపించుకుంటాడు.



కవి ధర్మాలను తిరుమల ఇలా పేర్కొన్నారు.

ఎవరు ఎప్పుడు ఎక్కడ పిల్చినా అతడు పలకాలి
ఆత్మీయతా బోధ చేసి ఆనందం చిలకాలి
పూర్వీకులంటే 'పూర్-వీక్'లనా? కాదు
వాళ్ళు నీ మేధస్సులో భావాల్లో వెలిగే పురాణ దీపాలు[466]

తిరుమల ఈ నాలుగు పాదాల్లో భవ్యార్థం ఇమిడించి చెప్పారు. కవి ఒక విధంగా దేవుడిలా ఉండాలి. ఆయన ఎవరు ఎప్పుడు ఎక్కడ నుంచి పిలిచినా పలకాలి. ఎవరు అనే కర్త సమాజంలో ఉంటాడు. అతడు అనేక ఒత్తిడుల మధ్య నలిగిపోతూ ఆక్రందిస్తాడు. కవి తన ఆత్మీయతా భావంతో కవిత రాసి అతనిలోని దైన్యాన్ని దూరం చేసి ఆనందాన్ని కలిగించాలి. తన కలం పదునుతో ఆ దైన్యానికి హేతువుగా నిలిచిన అరాచకత్వాన్ని తుదముట్టించాలి. అప్పుడే కవి కర్తవ్యంలో ఒక భాగం ఫలించినట్టవుతుంది. కవులను పూర్వీకులని తక్కువగా చూడకూడదు. ఆధునిక కాలానికి కూడా అతడు పనికివస్తాడు. ఎందుకంటే, అతని మంచి కవిత సార్వకాలికంగా పనికి వస్తుంది. మణిదీపంవలె మానవుని మేధస్సులో వెలుగును నింపుతుంది. కవులలో రకరకాల వాళ్ళుంటారు. అందులో ఒక రకం కవిని గూర్చి తిరుమల ఈ కింది విధంగా చెప్పారు.

కవులలోన నొకడు నివురుగప్పిన నిప్పు
అతని అంతరంగమగ్నిమయము
వాని నూదు కాంతి పరవళ్ళు త్రొక్కును[467]

కవి అంతరంగం అగ్నిమయం. అది ఊదితే భగ్గుమంటుంది. కాంతిని ప్రవహిస్తుంది. ఈ కాంతిని స్పర్శిస్తే చాలు హృదయాలలోని చెత్తలాంటి కాలుష్యం కాలిపోతుంది.

తిరుమల ఉత్తమ కవికి ఉండవలసిన మరికొన్ని లక్షణాలను ఇట్లా చెప్పారు.

అకలంకాత్ములు గంగిగోవులు చిదాహరుల్ మహోధీరు లి
ద్ధ 'కళాపూర్ణులు' దానకర్ణులు దయాదాక్షిణ్య లావణ్య పు
ణ్య కలాపుల్ సుకుమార శాంతి విపులోద్యద్బ్రహ్మ తేజోనిధుల్
సకలశ్రేష్ఠులు సత్కవీశ్వరులు సాక్షాద్దేవత రాఘవా![468]

కవులు అకలంకాత్ములు. కాలుష్యం కాపట్యం అంటని హిమస్వచ్ఛంలాంటి మనస్సుతో ఉండేవారు. వారి వ్యక్తిత్వం, కవితా వ్యక్తిత్వం ఈ రెండు కూడా ఆదర్శంగా, పవిత్రంగా ఉంటాయి. ఎవరు ఏది చెప్పినా దాన్ని అనుసరించకుండా సత్యం శివం సుందరం లాంటి కవితతో సమాజాన్ని జాగృతపరచి విలువైన భవిష్యత్తులోకి నడిపిస్తారు. కొందరు కవులుంటారు. ఆదర్శాన్ని మాత్రమే రాస్తారు. ఆచరణంలో వేరుగా ప్రవర్తిస్తారు. ఇలాంటి వారిని సమాజం ఆదరించదు. అనుసరించదు కూడా. ఏ కళంకం లేని పూత హృదయులైన కవుల మార్గాన్నే అనుసరిస్తుంది. తిరుమల సత్కవులను గంగిగోవులతో పోల్చారు.

సాధారణంగా గోవులు అంటే సాధుజంతువులు. అమాయకంగా ఉంటాయి. వాటిలో క్రూరత్వం లేశమైనా కనిపించదు. పసిపిల్లలు దగ్గరకు వచ్చినా కొమ్ములతో చిమ్మివేయకుండా ఆత్మీయతను చూపిస్తాయి. అనురాగాన్ని కురిపిస్తాయి. అందరికీ తమ తీయని పాలను ధారలుగా వర్షిస్తూ మురిపిస్తాయి. దేహపుష్టికి దోహదపడతాయి. తిరుమల కవులను గంగిగోవులన్నారు. మరి గంగిగోవులు అంటే ఎంతో సాధువైనవి మాత్రమే కాకుండా తమను లాలించిన, ఆరాధించిన మానవాళిని సత్యలోకంలోకి నడిపించే పుణ్యమూర్తులు.

తల్లిలాంటి, దేవతలాంటి సురభి భారతీయ సంస్కృతిలో విశిష్టమైన స్థానాన్ని సంతరించు కుంది. సజ్జనులైన కవులు కూడా అంతే. వీరిని చిదాహారులన్నారు కవి. అంటే పరమాత్మ స్వరూపమైన సత్యాన్ని అనుభవించి ఆనందించి స్పందింపజేసి ఆనందింపజేసి శ్రేయాన్ని కలిగించే వాడన్నమాట. తిరుమల కవులను మహాధీరులన్నారు. నిజమే. కవికి ఆర్ద్రతాగుణంతో పాటు కాస్తంత రాజసమూ ఉండాలి. అప్పుడే అతడు సమాజాన్ని నాశనం చేసే దౌష్ట్యాన్ని తుదముట్టించే కవితాస్త్రాలను విసిరివేస్తాడు. అవసరమైనప్పుడు అధికారం నిరంకుశంగా మారిపోయినప్పుడు వీరుడిలా విజృంభించి అధికార గర్వాంధతతను క్రుద్ధతను తుడిచిపెట్టడానికి సమాజాన్ని సమాయత్వం చేస్తాడు. ఒక మహోద్యమాన్ని నడిపిస్తాడు. ఫలితాన్ని ప్రజలకు కమ్మని ఫలంగా అందిస్తాడు కవి. పవిత్రమైన మనసున్నవాడు కవి. ఆదర్శాన్ని వెదజల్లడానికి పూనుకున్న కవి హృదయం కళాత్మకంగా ఉండాలి. అతనిలో ఎలాంటి మచ్చ ఉండకూడదు. అలా ఉంటేనే అతడు మానవాళి మనుగడను సంస్కరిస్తాడు. దార్శనికత, సుందరత, వాస్తవికత అనే అంశాలను అక్షరాలుగా కురిపించే కవులంతా కళాప్రపూర్ణులే అవుతారు కదా! కవిత్వం లలితకళల్లో ఒకటని ప్రాజ్ఞులు చెబుతున్నారు కదా! సత్కవులను తిరుమల దానకర్ణునితో పోల్చారు. దానం చేయటంలో కర్ణుని మించినవారు మరొకరు కనిపించరు. అయితే కర్ణుడు అంగరాజు. సుయోధనునికి ఆప్తమిత్రుడు. అలాంటివారికి దానం చేయడానికి సంపద ఉంటుంది కానీ, దానం చేయడానికి కవులకు ఏముంటుంది? వారిలో ఉండేది సత్కవిత్వమే. తరగని సిరులుగా మనస్సులో ఉన్న కవితామృతధారలను అడగకుండా భూమి మీద కురుపించి ప్రజలకు అజరామరత్వం కల్పించడమే కవుల పని. ఇలాంటి కవులనే తిరుమల దానకర్ణులు అన్నారు. ఇంకా దయా 'దాక్షిణ్య లావణ్య పుణ్య కలాపులు'. దయాదాక్షిణ్యాలను, సౌకుమార్యాన్ని ఆభరణాలుగా అనుభవించి లోకానికి అందించేవారు. అంతేకాదు- సత్కవులు 'సుకుమార శాంతి విపులోద్యద్భ్రహ్మ తేజోనిధుల్'. లాలిత్యం శాంతితత్వం వంటి మానుష ధర్మాలతో ప్రభాసిస్తున్న గుణ సముదాయంలో ఆదర్శంగా జీవిస్తున్నవారు. అందరిలో శ్రేష్ఠులైనవారు. అలాంటి ఉత్తేజితమైన హృదయాలతో ఉంటున్న సత్కవులను తిరుమల సాక్షాత్తు దేవతలతో పోల్చారు. మరికొన్ని లక్షణాలను ఇట్లా ఉల్లేఖించారు.

నవరత్నంబులలోన వజ్రముగతిన్ నక్షత్ర షడంబులో
శ్రవణంబట్టుల పక్షులందు కలహంసంబట్లు పూబోండ్లలో



భువిపై పద్మినివోలె జంతువుల గోవుంబోలె, జేజేల మా
ధవు లీలన్ కవిరాజు మేటి నరజాతంబందు సీతాపతీ![469]

కవి నవరత్నాలలో వజ్రం లాంటివాడు. "వజ్రం ముక్తా ప్రవాళం చ గోమేదశ్చేంద్ర నీలన్: వైడూర్యం పుష్యరాగశ్చ పాచిర్మాణిక్యమేవచ మహారత్నాని చైతాని". వజ్రం, ముత్యం, ప్రవాళం, గోమేధం, ఇంద్రనీలం, వైఢూర్యం, పుష్యరాగం, పాచి(మరకతం) మాణిక్యం అనేవి నవరత్నాలు. వీటిలో వజ్రం మరీ విలువైంది. ప్రశస్తమైంది. ఉత్తమకవి కూడా అలాంటివాడే. అంతేకాదు, నక్షత్ర సమూహంలో శ్రవణంలాంటివాడు. పక్షులలో హంసలాంటివాడు. పాలను నీటిని వేరుచేసే సుగుణం దానిలో ఉంటుంది. ఉత్తమ కవి కూడా సమాజాన్ని చిలికి మంచినీ, చెడునీ వేరు చేసి మంచిని పాటించమని లోకానికి హితం చెబుతాడు. "కవులన్న నిత్య సూర్యోదయ కాల మానస సరోవర హంసలటుల్ రసప్రియుల్"[470] అని మాధవపెద్దివారి మాట. సత్కవులు స్త్రీలలో పద్మినివంటివాడట. స్త్రీలలో పద్మిని, హస్తిని, చిత్తిని, శంఖిని అని నాలుగు రకాల వారుంటారు. వీరిలో అన్నివిధాలా విశిష్టమైన స్త్రీ పద్మిని. ఈమెను సాధ్వి అని కూడా అంటారు. ఉత్తమ కవిలో కూడా ఈ లక్షణాలుంటాయని కవి మాట.

దారుల్ గొట్టరు సస్యముల్ గృహములున్ దగ్ధంబు గావింప బో
రారంభింపరు జీవహింస లవి సేయన్ జూచి దుఃఖింతు రె
వ్వారిన్ దిట్టరు శౌచమున్ విదరుదైవ ధ్యానమున్మాన రౌ
నేరీ సత్కవులంబలెన్ సుజనులుర్విన్ దేవకీ నందనా!![471]

సమాజంలో మనుషుల మధ్య ఉంటున్నప్పటికి కవి స్థానం ప్రత్యేకమైంది. ఉన్నతమైంది. వారు దారులు కొట్టేవారు కాదు. గృహాలను దగ్ధం చేసేవారు కాదు. జీవహింస చేయరు. జీవులు హింసబడడాన్ని చూసి బాధపడతారు. శోకిస్తారు. ఎవ్వరినీ నిందింపరు. ఔచిత్యాన్ని విడిచిపెట్టరు. దైవాన్ని ధ్యానించడం మానివేయరు. అలాంటి సుకవులలాంటి సజ్జనులు ఈ లోకంలో లేరని కవి మాట.

ఇట్లా తిరుమల సమాజంలో ఉత్తమకవి ప్రత్యేకతనూ ఆయన కవితా లక్షణాలను అనేక విధాలుగా వర్ణించారు.

"కావ్యముల్ త్రయీ మంత్రముల్ గావు, జన్మ
మోక్ష సంధాన హఠ యోగములును కావు;
ప్రాణి యంత; కరణ వృత్తి భావమయ మొ
నర్చి మృదులీకరించు ఆనందకళలు"[472]

అని రాయప్రోలు వారన్నట్టు సత్కవులు కూడా అంతే. సత్కవులు కావ్యాలలో చూపిన లక్షణాలే సమాజ వికాసానికి బాటలు వేస్తాయి. మంచివైపు నడిపిస్తాయి.

## 21. కవిస్తుతి

'కవయః క్రాంతదర్శి' అన్నది అలంకారోక్తి. కవి అనేవాడు క్రాంతదర్శి. ఆయన భూత భవిష్యద్వర్తమానాల తాత్వికతను దర్శిస్తాడు. వర్ణిస్తాడు. సందేశిస్తాడు. తన రచనల ద్వారా జీవన మాధుర్యాన్ని అందించడానికి ఆరాటపడతాడు. ఏ కాలంలోనైనా వెలువడిన సాహిత్యంలో త్రికాల స్థితమైన రేఖలు ఉంటాయి. కాని ప్రాచీనంలో ఈ దృక్పథం పరిమితులకు లోబడి ఉన్నప్పటికీ మారుతున్న కాలానికి అనుగుణమైన సాహిత్యం వెలువడుతూనే ఉంది. ఆధునికమైనప్పటికీ అందరూ చేతనత్వాన్ని రగిలించే కవిత రాస్తున్నారని ఖచ్చితంగా చెప్పలేం. సొంత అభిరుచులనూ, అభిప్రాయాలనూ చొప్పించడమో లేదా ఏవో ప్రలోభాలకు పట్టుబడి పోవడమో వికసించిన ఆశయాలను రాల్చుకోవడమో, కలాన్ని జార్చుకోవడమో జరుగుతుంది. అయితే పవిత్రమైన ఆదర్శాలనూ, సౌశీల్యమైన ఆశయాలను కవితాక్షరాలుగా సంధిస్తూ జాగృద్గీతికలు ఆలపించే కొద్దిమంది కవులుంటారు. వాళ్ళు కవిత్వాన్ని సత్యం-శివం-సుందరంగా భావిస్తారు. అదే మార్గాన్ని అనుసరిస్తూ సమాజాన్ని చకితం చేస్తారు. అపురూపమైన ఊహలను కవితాక్షరాలుగా వెదజల్లి భవిష్యత్తును బంగరు పళ్ళేరంలో పెట్టి ముందు నిలపెట్టు రాగ మధురమైన కావ్యాలు రాస్తూ ఉన్నారు. అలాంటి వాళ్ళ రాతలతోనే సమాజం కొత్త సింగారాలను సొంతం చేసుకుంటుంది. అలా ఉజ్వలమైన కవిత్వం రాస్తున్న ప్రతి కవీ ఆరాధనీయుడే. ఆయన ఏ కాలంలోని వాడైనా అభినందనీయుడే.

కళల చెల్వాడు వారి లక్ష్యంబు నందు
మాతృభాషాభిమాన ప్రమాణమందు
కవిని ప్రాణంబుగా జూచు కాలమందు
నేను దర్శింతు నానంద నిధులు సుధలు[473]

అంటారు తిరుమల. కవిని ప్రాణంగా చూచే వేళలో ఆనంద సుధలను చూస్తానంటారు. నిండుగా కవిత్వం ఉన్న ప్రతి కవీ ఒక దార్శనికుడే.

కవులను స్తుతించడం ఆనాటి నుంచి ఒక ఆదర్శమైన సంప్రదాయంగా వస్తుంది. ప్రతి కవి తనకు ముందున్న కవుల రచనలను, వాళ్ళ వ్యక్తిత్వాలను చదివి స్ఫూర్తిని పొందుతాడు. ఆ కవులలా రచనలు చేస్తాడు. లేదా కొత్త మార్గాన్ని అన్వేషిస్తాడు. సరికొత్త అభివ్యక్తిని స్వంతం చేసుకొని తనదైన ఒక విశిష్టమైన ముద్రను, శక్తిమంతమైన ఆకర్షణీయమైన శబ్ద సౌందర్యాన్ని సాధిస్తాడు. తన కాలంనాటి సామాజిక పరివేశాన్ని తన రచనల్లో ప్రస్తావించి అనంతర కాలాలకు ప్రణాళికలను నేపథ్యంగా ప్రదర్శిస్తాడు.

ఆచార్య తిరుమల తమ రచనలలో అక్కడక్కడా కవులను స్తుతించారు.

ఇచ్చోటనే కదా ఇనుకుల తిలకుని
బ్రతుకు వాల్మీకి కావ్యమ్ము చేసె
ఇచ్చోటనే కదా ఇంద్రనందనునకు
గీతామృతము పోసె కృష్ణమూర్తి
ఇచ్చోటనే కదా ఏకదంతుని పిల్చి
బాదరాయణి చెప్పె భారతమ్ము
ఇచ్చోటనే కదా ఎలిమి నూహ గతి
కలు నిక్కమనిపించె కాళిదాసు[474]

భారత గత వైభవాన్ని కీర్తించే సన్నివేశంలో తిరుమల కవిస్తుతి చేయడం ఉచితంగా ఉంది. ఈ దృక్పథం ఆయనలో బాగా కన్పిస్తుంది. పద్యాన్ని ప్రారంభిస్తూ కవి వాల్మీకి రామాయణం రాసాడని చెప్పకుండా ఇనకుల తిలకుని బ్రతుకును కావ్యంగా రాసినాడని చెప్పారు. ఇదొక ప్రత్యేకత. ఇనకులంలో మంధాత, సగరుడు, భగీరథుడు, హరిశ్చంద్రుడు, దిలీపుడు, రఘు, దశరథుడు లాంటి వాళ్లు చాలామంది చక్రవర్తులూ, మహారాజులూ ఉన్నారు. అయినప్పటికీ ఇనకుల తిలకుడని ఎవ్వరికీ సంబోధన లేదు. అది శ్రీరామచంద్రునికే ఉంది. రామాయణనామమే రాముని ఔన్నత్యాన్ని ఎత్తిచూపుతుంది. జనకనందిని సౌభాగ్యాన్ని చాటుతుంది. రామతత్వాన్ని, రఘువంశ మహత్వాన్ని బ్రహ్మ నుంచి, నారదుని నుంచి అందుకున్న పుణ్యమూర్తి వాల్మీకి. రఘువంశంలో ఎవరు ఉన్నతుడో ఆయనకు బాగా తెలుసు. అట్లాగే విశిష్టమైన రామతత్వం ఏమిటో తెలుసు. సాంప్రదాయికమైన హృదయమున్న తిరుమల వాల్మీకిని కీర్తిస్తూ 'ఇనకుల తిలకుని' బ్రతుకును కావ్యంగా సంతరించాడని చెప్పడంలో ఎంతో ఔచిత్యం కన్పిస్తుంది. తరువాత 'ఇంద్రనందనునకు గీతామృతము పోసె కృష్ణమూర్తి' అని రాశారు. భగవద్గీతను రాసింది వ్యాసమహర్షి, ఇక్కడ కవి ఈ కృతిని వ్యాసుడు రాశారని చెప్పకుండా ఆచార్యుడైన శ్రీకృష్ణుని పేర్కొన్నారు. కృష్ణుడు గీతామృతాన్ని పోసింది అర్జునునికి. కవి శబ్దాలను ప్రయోగించేటప్పుడు అర్జునుని పది పేర్లలో ఏ ఒక్కదాన్ని ప్రస్తావించకుండా ఇంద్రనందనుడు అనే పదాన్ని వినియోగించారు. ఇంద్రుడు దేవేశ్వరుడైనప్పటికీ అతడు తామస ప్రవృత్తి కలవాడు. అమరాధీశ్వరుడై కూడా కొన్ని అకార్యాలు చేసి పరాభవాలను చవిచూశాడు. అలాంటి సురేశ్వరుని వరం వలన జన్మించిన అర్జునునిలో పాపచింతన లేదు. కానీ కౌరవ సైన్యాన్ని చూడగానే వ్యామోహం కలగడం అది ఒక విధమైన పిరికితనంగా మారడం జరిగింది. సర్వమూ తెలిసిన గీతాచార్యుడు ఎవరిని ఎలా గుర్తిస్తాడో మన ఆధ్యాత్మిక సాహిత్యం స్పష్టం చేస్తుంది. ఈ వైఖరులను దర్శించిన తిరుమల ఇంద్రనందనుడు అనే పదాన్ని కల్పించి తాను చెప్పదలచుకున్న విషయానికి స్ఫూర్తిని తెచ్చిపెట్టారు. వ్యాసుడు కలం అందుకొని స్వయంగా రచన చేయలేదట. తాను చెపుతూ విఘ్నేశ్వరునితో రాయించాడని లోకంలో వాడుక. వ్యాసుడంతటి వానికి రాయరాకపోవడమ నేదేముంది! ఆయన కావ్యం శుభాంతం, సుఖాంతం కావడానికి శ్రీ గణేశుని అర్థించి ఉంటాడు. ఆ స్వామి మన్నించి ఉంటాడు. వ్యాస సాహిత్యమంతా మానవజాతిని నిలబెట్టేది. కాబట్టి శ్రీవినాయకుడు ఇట్లా లోకోద్ధరణ చేయడం కూడా అవుతుందని భావించి ఉంటాడు. తిరుమల ఈ భూమికను గుర్తుచుకొని వ్యాసుడు రాశారని చెప్పకుండా ఏకదంతునితో రాయించాడనే పురాణోక్తిని ప్రముఖంగా చెప్పారు.

వాల్మీకి, వ్యాసుల పిదప అంతటివాడు కాళిదాసు. ఆధ్యాత్మిక, లౌకిక సాహిత్యాలను సమంగా నడిపిన ఆనాటి అభినవ శారదామూర్తి ఆయన. ఆ మహాకవిని వర్ణిస్తూ తిరుమల 'ఐహాగీతికలను నిక్కమనిపించే' అంటారు. అట్లా అనడంలో ఔచిత్యం దాగి ఉంది. కాళిదాసు మేఘసందేశం ఊహాకావ్యం. మిగిలిన కావ్యాలకు రామాయణం, భారతాలు ఆధారాలు. కాళిదాసు మహాకవి మాత్రమే కాదు, కాళీమాతను ప్రసన్నం చేసుకొని కవితా రచన చేసినవారు. కాళిదాసు హృదయాన్ని బాగా చదివిన తిరుమల ఆయన చిత్రణంలో చక్కని నేర్పును చూపారు.

తిరుమల కవిత్రయాన్ని, వాళ్ళ కవితాభారతిని విశేషమైన ప్రజ్ఞతో అభినుతించారు.

అర్థసూక్తికి నిధియ ఆదికవి నన్నయ్య
తేట మాటల విధియ తిక్కన్న ధీనిధియ
నొసటి కన్నును దాచి పసగల్గు వర్ణనల
కైలాస శిఖరాల కవితా రసాలాల
సంచరించిన శంభుఁడా శంభుదాసుండు[475]

తెలుగు కవితకు కొత్త ద్వారాలు తీసి ఆద్యుడనిపించుచుకున్న నన్నయ్యను తిరుమల అర్థసూక్తికి 'నిధియ' అని కీర్తించారు. నన్నయ్య తన ఆదిపర్వం అవతారంలో 'సారమతీం' అనే పద్యంలో తన కవితా లక్షణాలను ప్రసన్నకథా కవితార్థయుక్తి, అక్షర రమ్యత, నానారుచిరార్థసూక్తి నిధి అని చెప్పుకున్నారు. ఈ మూడు లక్షణాలు ఆదికవి కవిత్వాన్ని ఆలోచనామృతం చేశాయి. అయితే తిరుమల ఈ మూడు కవితా లక్షణాల నుంచి అర్థసూక్తిని మాత్రమే గ్రహించి మిగతా రెండు లక్షణాలను విడిచిపెట్టారు. ఇందులో విశేషముంది. అక్షర రమ్యత, ప్రసన్నకథా కలితార్థయుక్తి ఈ రెండు లక్షణాలకంటే అర్థసూక్తికి విశేషమైన అర్థం ఉంది. తిరుమల వాడిన అర్థసూక్తివంతమైన సూక్తులకు నిధిలాంటిదని తాత్పర్యసారం. అక్షర రమ్యత, ప్రసన్నకథాకలితార్థయుక్తి ఈ రెండు కూడా నానా రుచిరార్థసూక్తి నిధిత్వంతోనే సమజమైన మాధుర్యాన్ని కలిగివున్నాయి. నన్నయ్య రాసిన భారతం నిండా అర్థసూక్తులు కొల్లలుగా కన్పిస్తాయి. అయితే ప్రసన్న కథాకలితార్థయుక్తిలోని అర్థయుక్తి ఇదే అర్థాన్ని ధ్వనింపజేస్తుంది. కాని అది కథకూ, కవితకు మాత్రమే పరిమితమై ఉంది. నన్నయ్య సూక్తినిధి, అర్థయుక్తి మాటలనే కాక సత్యసూక్తులను కూడా భారతం నిండా వెదజల్లారు. నన్నయ్య సూక్తినిధికి మరింత అర్థస్ఫూర్తి చేకూరడానికి ఆయన సత్యవచనాలు హేతువులని భావింపవచ్చు. ఆంధ్రమహాభారతవతారికలోని 'తన కుల బ్రాహ్మణు'[476] అనే సీసపద్యంలో ప్రస్తావింపబడిన ఆయన పదహారు లక్షణాలలో 'నిత్య సత్యవచనుడు' అనేది ఒకటి. ఇది ఆ మహాకవి లక్షణమైన వ్యక్తిత్వాన్ని ఎత్తిచూపుతుంది. సమాజమూ, మార్గదర్శకమైన వ్యక్తిత్వం, వక్తవ్యం ఉన్న కవి మాత్రమే తన రచనను సత్య సమన్వితం చేస్తాడు. అలాంటి కవి కలం నుంచే సూక్తినిధులూ, అర్థసూక్తులూ దూసుకొని వచ్చి కావ్యాన్ని సార్వజనీనం, సార్వకాలికం చేస్తాయి. అంతేకాక నన్నయ్య రాజరాజును సత్యవచనుడని తెలిపారు.



అరణ్యపర్వ ద్వితీయాశ్వాసాంతంలో ఆ చాళుక్య ప్రభువును 'వినీయ సత్య నిత్యోదయా'[477] అని, తృతీయాశ్వాసాంతంలో 'నిత్య సత్య ధనధన్య'[478] అని సంబోధించారు. తాను రాసిన రెండున్నర పర్వాల భారతంలో నాలుగు మారులు తన రాజు సత్యవచన పరాయణత్వాన్ని కీర్తించారు. నన్నయ్య సహజంగా విశిష్టమైన మనిషితనం ఉన్న మహాకవి కావడం వలన ఆయన రచన అంతా నానా రుచిరార్థ సూక్తి నిధిత్వంతో వెల్లువెత్తింది. తిరుమల నన్నయ్యను 'సూక్తినిధియ' అనడంలో ఈ విధమైన ఔచిత్యం దాగి వుంది.

ఇక్కడ తిక్కనను గూర్చి రాస్తూ 'తేట మాటలు' 'ధీనిధియ' అనే శబ్దాలను ప్రయోగించారు తిరుమల. కవిత్రయంలో నన్నయ్య సంస్కృత పద సంపదను విస్తృతంగా వాడుకున్నారు. తిక్కన తెలుగు శబ్దజాలాన్ని అమితంగా తన రచనలో వినియోగించు కున్నారు. ఎర్రన ఇద్దరి కవితారీతులను అవగాహనకు తెచ్చుకొని మధ్యేమార్గాన్ని అవలంబించారు. అయితే భాషా విషయంలోనూ, కవితా విషయంలోనూ తిక్కన మిగతా ఇద్దరు కవులకంటే విస్తృతిమైన ప్రయోగాలు చేసి అనంతర కవిత్వానికి భాషా వ్యాకరణాలకు ఎంతో మేలు కలగజేశారు. "యతియుం బ్రాసయు లేని సంస్కృతి కవిత్వారణ్య మందున్న భారత వేదాన పదేను పర్వముల కాంధ్రత్వంబు గల్పించి శాశ్వతుడైపోయిన యజ్వ"[479] అని తిక్కన ఆంధ్రత్వాన్ని మహాకవి జాషువా రమణీయంగా వర్ణించారు. అయితే తిరుమల తిక్కన కవితాభిజ్ఞతను , 'ధీనిధి' అని ఆయన ప్రజ్ఞను రూపు కట్టించారు. ధీనిధి అనడంలోనూ ఔచిత్యం పొరలుతుంది. తిక్కన మనుమసిద్ధి ఆస్థానకవి మాత్రమే కాకుండా మంత్రి దండనాథుడు కూడా! ఇట్లా ఆ మహాకవి వైదగ్ధ్యాన్ని తిరుమల హృదయైక వేద్యంగా కీర్తించారు.

ఇక ఎర్రన. ఆయన సామాన్యుడు కాడట. నుదుట కన్నును ధరించి పసందైన వర్ణనలు చేసి కైలాస శిఖరాల కవితా రసాలలో విహరించిన శంభుడట. నిజమే, ఆయన అద్భుత కవితా శక్తికి, అనల్ప కల్పనలకీ, రసాభ్యుచిత బంధానికే వర్ణనా చణత్వానికి హరివంశం ఒక్కటి చాలు.

తిరుమలచే కీర్తితుడైన మరొక కవి పాల్కురికి.

తేనె పల్కుల నురికి
పల్కు పల్కును కొరికి
జాను తెల్గుల పంట
పండించె పాల్కురికి
కావ్య కన్యల ఎదల
రాచిల్క పాల్కురికి[480]

తిక్కనలా పాల్కురికి వారివి కూడా తేనెపలుకులే. కాని అభివ్యక్తిలో, వస్తువరణంలో భేదం ఉంది. తిక్కన నిర్వచనోత్తర రామాయణాన్ని మినహాయిస్తే మిగతారచన అంతా చంపూ విధానాన్ని అనుసరించిందే. వృత్తాలదే పెత్తనం. పాల్కురికి ఈ మార్గాన్ని నిరసించి సామాన్యుల జీవితాలను కథా వస్తువులుగా తీసుకొని ఛందస్సులో, భావనలో, భాషలో

నవ్యత్వాన్ని ప్రవేశపెట్టి సమాజంలో అధిక సంఖ్యాకుల ఆదరాన్ని అభినందననీ పొందారు. ఆయన ఆశించింది వీరశైవ మత ప్రచారమే అయినప్పటికీ కవిత రెక్కలు కట్టుకొని సమాజాన్ని పరవశింపజేసింది. ఈనాటికీ మార్గదర్శకంగా ఉంది. పల్లె ప్రజలు పాడుకునే ద్విపద ఛందస్సును ఆహ్వానించి మహాకావ్యాలతో పాటు ఆనాడు సమాజంలో ఉన్న వివిధ రకాల పదాలను తన రచనలలో చేర్చి వాటిని విజ్ఞాన సర్వస్వాలుగా జాతికి అందించారు. తిరుమల అన్నట్టు పాల్కురికి మాటలు పాటలు రాచిల్క మాటలలా అపురూపమైనట్టివే. ఆస్వాదనీయమైనట్టివే.

తిరుమల కలం చిత్రించిన మరో కవితామూర్తి పోతన్న. ఆయన పేరు వినబడితే చాలు హృదయంలో అనురాగం రస స్వరూపంగా ప్రవహిస్తుంది.

పలుకు చెలి కన్నీటి చుక్కలను తను త్రాగి
మక్కువలు జిమ్ము ఆ మంద హాసాలన్ని
భాగవత సీమలో విరియించె మా అన్న
తలపుజున్నుల మిన్న రైతన్న పోతన్న[481]

చదువుల తల్లి సరస్వతీదేవిని తల్లిగా ఆత్మీయతను అందుకున్న కొద్దిమంది కవులలో పోతన్న మేటి. భాగవతాన్ని నరాంకితం చేయాలన్న తలంపు పోతన్న మనస్సీమలో అంకురించగానే శారదాదేవి కనిపించి విలపించింది. ఆ లోకేశ్వరి 'కాటుక కంటనీరు'ను తుడిచి పేదరికం కుటుంబాన్ని కుంగదీస్తున్నప్పటికీ ఆ కృతిని అయోధ్యపతి శ్రీ రఘురాములకే అర్పించి జీవితాన్ని ధన్యం చేసుకున్న పుణ్యమూర్తి పోతన్న. పోతన్న సహజమైన ఆత్మీయతా భావాన్ని తిరుమల మరింత గాఢంగా దర్శించారు. చదువులతల్లి కన్నీళ్లను తుడిచివేయడానికి విమర్శకులు కొందరు రాస్తే, తిరుమల ఆ శ్రీవాణి కన్నీళ్లను తాగేసి పోతన్న మక్కువలను విరజిమ్ముతున్న చిరునవ్వులను భాగవతసీమలో విరియించినాడట. ఆయన తలపుజున్నుల కంటే మిన్నగా ఉండినాడట. ఆయన అన్న అట. రైతన్న అట. తిరుమల పోతన్న మృదువైన కవితామూర్తిమత్వాన్ని

ఇమ్ముగ నాకవాసులనేకము చిత్తము నందు పాఋన
ట్లిమ్మహి కృష్ణలీలలు త్రిలింగము నందు నెలుంగునెత్తి మై
కమ్మును కమ్మగా మిగుల కమ్మని గానము చేసినట్టి మా
బమ్మెర పోతనార్య పద పంకజముల్ ప్రణతింతు భక్తిమై[482]

అంటూ తెలుగు పదాలలో మనస్సులు ఊయలలూగే విధంగా చిత్రీకరించారు.

పోతన్న ఆత్మీయబంధువుగా తెలుగునాట తన ముద్రను శక్తిమంతంగా ప్రదర్శించిన మహాకవి శ్రీనాథుని కవితా రాజసత్వాన్ని తిరుమల నాద పరిమళంగా ఆవిష్కరించారు.

అటు చందనపు పూత-ఇటు భస్మరాగాలు
అటు రుద్ర మాలికలు-ఇటు రత్నడోలికలు



అటు శైవ వేదోక్తి-ఇటు భామిని రక్తి
శృంగార నైషధం పల్నాటి భారతం
మార్గ-దేశీ మార్గ మార్గదర్శక శక్తి
సాధించెనెవ్వాడు సరస సద్గుణ వర్తి
అతడు శ్రీనాథుండు కవిలోక యోధుండు
కనకాభిషేకాల కవిరాజు[483]

తెలుగు కవిత్వంలో శ్రీనాథుడు కవిసార్వభౌముడు. అతనిలో భోగి, యోగి అనే భిన్న పార్శ్వాలు సమ్మిళితమై ఉన్నాయి. యోగి అంటే 'నా నృషిః కురుతే కావ్యమ్' అన్న ఆర్యోక్తికి ప్రతీక. ఆయన చాటుపద్యాలలో స్త్రీ వాల్లభ్యం అమితంగా వర్ణింపబడింది. ఈ భావనతో శ్రీనాథుడు స్త్రీ లోలుడనే అపవాదుకు కారకుడయ్యాడు. శైవాన్ని వేదోక్తిమయంగా కావ్యాలలో పలికించి ప్రణతులందుకున్న శ్రీనాథుణ్ని తిరుమల నిండు మనస్సుతో కీర్తించారు. శ్రీనాథుని కవిత పురాణ కవిత్వానికీ, ప్రబంధ కవిత్వానికీ మధ్య వారధిలా ఉంటూ అనంతర సాంప్రదాయిక కవులను చకితం చేసింది. దాని ప్రభావంతో పెద్దనాది కవులు చవులూరించే కవిత్వాన్ని అమృతధారగా కురిపించారు.

"... ... ... శ్రీనాథ
కవితాభ్ర గర్జనల మార్మ్రోగి మార్మ్రోగి
దిక్కు దిక్కుల సాగి రసవీణలను తూగి
మంత్ర ముగ్ధము చేసి చెలరేగి-చెలరేగి
పదకింకిణీ ధ్వనుల ఘల్లు ఘల్లులు దూసి
కడగంటి చూపులను నుదులు రాసిగా పోసి
పెద్దన్న పాదాన గండ పెండేరమై
తిమ్మన్న లేఖినీ సుమ పారిజాతమై
కృష్ణరాయల హృదయ వాటిలో దొరికిన
కవితా తటిద్వల్లి ఆముక్తమాల్యదై
స్వర్ణయుగ ఛత్రాన వర్ణ మధుగాత్రాన
ఏ వెలుగు నిలిచెనో-ఏ వెలుగు పిలిచెనో[484]

తెలుగు కవిత మకరందాలు చిందే కలకండ చక్కెర వంటిది మాత్రమే కాదు. అంతరంగాలలో దాగిన చీకట్లను తుడిచిపెట్టే జ్యోతిర్గోళం. ఆ ప్రభా మండలానికి ఎక్కువగా కిరణాలను సంధానించింది శ్రీనాథుని కవిత. కవిసార్వభౌముని కవిత సంస్కృత ప్రౌఢకవుల కవితను ఆత్మీయం చేసుకొన్నది. నన్నయ్య ఉభయ వాక్ప్రౌఢిమను ఆత్మలో దాచుకొంది. తిక్కన 'రసాభ్యుచిత బంధం'ను ఎదలో నిలుపుకొంది. ఎర్రన సూక్తి వైచిత్రిని వశం చేసుకొని పరవశించింది. ఉద్దండుడైన వేములవాడ భీమకవి వలె దేశాన్ని పర్యటించి విజయకేతనాలను ఎగరేసింది. ఉక్తిలాలిత్యాన్ని సౌకుమార్యాన్ని సుదీర్ఘ సమాస ఘటనంలో

చేర్చి అనంతర కవులలో శబ్ద సౌందర్య స్వరూపంగా నిలిచింది. అట్లా 'తెలుగు తేనె' శ్రీనాథుని కవితాధార అభినయం తెచ్చిన పరిణామ దశలను చిక్కని పదాల పోహళింపుతో వర్ణించారు.

'తెలుగు తేనె' పెద్దన్న పాదాన గండపెండేరంగా రూపు ధరించిందట. అల్లసాని పెద్దన మనుచరిత్ర రాశారు. శిరీష కుసుమ కోమలంలా ఆయన కవిత్వం ఉంది. పెద్దన్న మనుచరిత్ర రాయడం, రాయలు పరవశించడం, ఆయన పాదాన గండపెండేరాన్ని అలంకరింపజేయడం జరిగింది. పెద్దన్న కవితలో శ్రీనాథుని ప్రాబంధిక లక్షణాల మంజీర ధ్వనులు రసనిష్యందంగా ఒదిగి ఉన్నాయని తిరుమల భావించారు.

ఇక ఆ 'తెలుగుతేనె' తిమ్మన్న లేఖినీ సుమ పారిజాతమైనదట. ఎట్లా? తిమ్మన్న పారిజాతాపహరణం అనే కావ్యం రాశారు. ఆ కావ్యం అంతటా ద్రాక్షపాకం ఉప్పొంగిపోయింది. అట్లాగే 'ముక్కు తిమ్మనార్యు ముద్దుపలుకు' లాంటి ప్రశంస రావటానికి ఆ కావ్యమే ప్రధానమైంది. ఆ కావ్యం ప్రముఖంగా వినతులందుకోవడానికి శ్రీనాథవాణి నేపథ్యంగా అమరింది. ఆ ప్రభావంతోనే తిమ్మన్న లేఖిని సుమపారిజాతమై పరిమళాలను అక్షరాలుగా చిత్రించి రసజ్ఞుల గుండెల మీదికి విసిరింది. తెలుగుతేనె అంతటితో ఆగిపోయిందా! కృష్ణరాయల హృదయ వాటికలో కవిత్వం అనే మెరుపుతీవె ఆముక్తమాల్యదగా వెలిసింది. ఆముక్తమాల్యద జటిలమైన ప్రబంధమైనప్పటికీ అందులో తెలుగు వాతావరణం, సామాజిక జీవనం చక్కగా చిత్రింపబడినాయి. అలాంటి 'తెలుగుతేనె' స్వర్ణయుగం అనే ఛత్రాన అక్షర గాత్రంతో వెలుగుగా ప్రభాసించింది. ఆ వెలుగుజాతిని పిలిచింది. అదే తెలుగు.

తిరుమల కవిస్తుతి సదామననయోగ్యమైనది. ఆధునికులలో కవి ప్రశంస చేసిన కవులు చాలా అరుదు. ముఖ్యంగా ఆయన వాగ్గేయకారులను నుతించడం ప్రత్యేకంగా ఉంది. అయితే ఆ కవిస్తుతి అలవోకగా రాయబడింది కాదు. ఆయన గుండె నుంచి పొంగివచ్చిన మధురభక్తి భావావేశానికి ప్రతీకగా ఉంది.

తలతును కడు భక్తి మదిని
సంగీత కళా మహనీయుల
పదములబడి నతులిడి సతతము[485]

అనడంలో తిరుమల వినయ విధేయతలు ప్రస్ఫుటంగా దర్శనమిస్తాయి. నిజంగా ఈ కవి మహోన్నతంగా ఎదగడానికి కవిస్తుతి ఆశీస్సులుగా దోహదపడినాయని మనస్సుకు తోస్తుంది.

గేయంలో ముందుగా త్యాగరాజును ప్రస్తుతించారు.

నిధికన్న రాముని సన్నిధి సుఖమని
వేల వేల కీర్తనలు వెలయించె త్యాగరాజు[486]



మహర్షి వాల్మీకి రామాయణాన్ని ఇరవై నాలుగువేల శ్లోకాలతో రాస్తే త్యాగరాజు ఇరవై నాలుగు వేల కీర్తనలతో దాశరథిని అభిషేకించారు. నిధి కన్నా శ్రీరాముని సన్నిధి చాలా సుఖమని భావించారు. నిధి అశాశ్వతమైంది. దీని వలన అనేక కష్టాలు వెంటబడి వేధిస్తాయి. కాని, రాముని సన్నిధిలో ఉంటే ఎంతో సుఖంగా ఉంటుంది. శ్రీరాముడు శ్రీ నారాయణుడు కదా! ఆయన ఇచ్చే సాయుజ్యంకన్నా గొప్ప ధనం ఏముంటుంది. అలాంటి పవిత్ర లక్ష్యంతో త్యాగరాజు కీర్తనలు రాసి శ్రీరామ ప్రభువుల దయకు పాత్రుడయ్యారు. అట్లా శ్రీరాముని స్తుతించి తరించిన మహాభక్తుడు రామదాసుగా ఖ్యాతిగన్న కంచర్ల గోపన్న భద్రాది మీద సీతారామలక్ష్మణులకు ఆలయాలు నిర్మించి గోలకొండ ప్రభువు ఆగ్రహానికి గురై కఠిన కారాగారవాస క్లేశాన్ని అనుభవించి ముక్తిని పొందాడు. కీర్తనలలో శ్రీ సీతారాముల స్తుతితో పాటు ఆయన ఆవేదన ప్రస్ఫుటంగా కన్పిస్తుంది. రామదాసు దాశరథి శతకం లోకప్రసిద్ధి పొందిన కావ్యం. మహా వాగ్గేయకారుడూ, పరమభక్తుడూ అయిన రామదాసును

కృతులెగాక దాశరథీ శతకము రచియించి
భద్రగిరిని వెలిగె కర్పూర జ్యోతి రామదాసు[487]

అని నుతించారు.

వాగ్గేయకారులలో అన్నమయ్యదొక ప్రత్యేకమైన దృష్టి. ఆయన కీర్తనలలో సాహిత్యపస ఎక్కువ. 'అదిగో అల్లదిగో' అన్న కీర్తన అన్నమయ్యకు మంచిపేరు తెచ్చిపెట్టింది. బహుళ ప్రచారాన్ని పొందిన ఆ గీతాన్ని ప్రధానంగా ఎంచుకొని తిరుమల అన్నమయ్య భక్తితత్వాన్ని అక్షరగీతంగా ఎలుగెత్తారు.

అదిగో! అని శ్రీహరి వాసము చూపె
సంకీర్తనాచార్యుడు అన్నమయ్య[488]

నిజంగా అన్నమయ్య భక్తి సంకీర్తనాచార్యుడే.

తిరుమల స్తుతించిన కవులలో పదకర్త క్షేత్రయ్య ఒకరు. ఆయన్ని

పదముల మొవ్వ గోపాలు పదములు
పూజించి తరియించె వరద క్షేత్రయ్య"[489] అంటూ స్తుతించారు.

తిరుమల కవిస్తుతిలో జయదేవుడు, నారాయణతీర్థులు, ముత్తు స్వామి దీక్షితులు, శ్రీ శ్యామశాస్త్రి శాక్తేయులు, తిరునాళ్, తుకారాంల కవితా ప్రాశస్త్యాన్ని శ్లాఘించారు.

తిరుమల కీర్తించిన ఆధునిక కవులలో విశ్వనాథవారిది విశిష్టగరిమ. ఆయన తెలుగులో కళ్ళు తెరిచిన అన్ని ప్రక్రియలకు సాహిత్య సౌగంధ్యాన్ని ఆర్ద్రంగా అలదిన మధుర భావకుడు. పాశ్చాత్య స్పర్శతో పరాజితమవుతున్న భారతీయ సంస్కృతిని శుభ్రంచేసి చిమ్ముకొని వచ్చే భావ పరిమళాలతో అభిషేకించి జాతి జనులలో నూతనోత్తేజాన్ని తుళుకొత్తించిన సాహితీమూర్తి. అలాంటి విశ్వనాథ జననం పవిత్రంగా అద్భుతంగా ఉంది.

సత్యోద్యాన మనోజ్ఞ వైదిక వచశ్శాలన్ మహద్వేదిపై
నత్యంతాద్భుత సృష్టి గీతములు వీణంబాడ, మోహోద్ధతిన్
బ్రత్యక్షంబయి నవ్వు నాధుగని లేవన్ వాణి చేజారి భూ
శ్రుత్యంకంబున బడ్డ కచ్ఛపియె ధీరుల్ సత్యనారాయణుల్[490]

అది సత్యోద్యానం అనబడే మనోజ్ఞ వైదిక వచశ్శాల. అందులో ఎత్తైన వేదిక. ఆ పీఠం మీద నుంచి సరస్వతి వీణ మీద అద్భుతమైన గీతాలను మధురంగా పలికిస్తుంది. సత్యలోకం శారదామాత గీతాలతో తడిసి పులకిస్తుంది. అదంతా పారవశ్యాన్ని భుజిస్తున్న సుమనోజ్ఞ రసవేళ సృష్టికర్త బ్రహ్మదేవుడు మిక్కిలి వేగంతో ఆమె ఎదుట ప్రత్యక్షమయ్యాడు. నవ్వుతున్నాడు. ప్రాణేశ్వరుని దర్శనంతో చదువుల తల్లి తన వేదిక నుంచి లేచింది. ఆ మధురమైన వేళలో వాణి చేతి నుంచి జారి భూమి అంక పీఠిక మీద పడిన కచ్ఛపి విశ్వనాథ వారని మహోదయాన్ని అద్భుతంగా వర్ణించారు.

విశ్వనాథ భారతీయ సంస్కృతిని పరిరక్షించాలన్న దృఢ సంకల్పంతో పారావారం లాంటి సాహిత్యాన్ని సృష్టించారు. విస్తారమైన ఆయన రచనలలో శబ్దశక్తి వినూత్నమైన పోకడలతో సోయగాలను కుప్పలుగా పోసింది. అలాంటి దార్శనికుడైన కవికి తిరుమల స్తుతిస్తున్న వైఖరి ఆత్మీయత మిళితమైన విధేయతతో ఉంది.

భారత భారతీ హృదయ వల్లకి మీటి, పరేహ మార్గ స
త్సారపు సంప్రదాయముల సంగతులన్ బలికించి, జీవ నా
కార రసైక గానమున క్రమగతిన్ జగదంత రంగమున్
ధీరత నాక్రమించు స్వర తేజుని గొల్తును విశ్వనాథులన్[491]

విశ్వనాథ సంప్రదాయజ్ఞుడు. ఆయన కలం రాల్చిన ప్రతి మాటలో ఈ దేశనాదం ఉదాత్తంగా ధ్వనిస్తుంది. ఆయన భారత భారతీ హృదయ వీణను పలికించారు. ఇహ పర మార్గాలలోని సారవంతమైన సంప్రదాయాల సంగతులను వారిద నినదంగా పలికించారు. జీవనాకార రసైక గానంలో మధుర ఫణితిలో జగత్ అంతరంగాన్ని ఆక్రమించారు. అలాంటి స్వరతేజుని తిరుమల కొలిచారు.

విశ్వనాథ సాహితీ విరాణ్మూర్తిని తిరుమల చిత్రించిన వైఖరి ఆశావహంగా ఉంది.

దేవ ప్రాణ ఘనుండు నైగమ బృహద్విజ్ఞాన తేజుండు పా
రావారాయత్ సాహితీ విభుడు ఛాత్ర స్వాంత బింబీకృత
ప్రావీణ్యుండు, ప్రఫుల్ల పుణ్య కథనోద్భాసాది శేషుండు, ఆం
ధ్ర విద్వన్నిధి విశ్వనాథ భరతోర్వీజ్ఞాన పీఠంబగున్"[492]

విశ్వనాథ స్థూలదృష్టి కలవాళ్ళకు కేవలం సాధారణమైన మనిషిలాగా కన్పిస్తారు. ఆలోచనాలోచనాలతో దర్శించినప్పుడు దైవికమైన హృదయం కలవారుగా మనోనేత్రాల ముందు నిలుస్తారు. కాబట్టే, విశ్వనాథను కవి దేవ ప్రాణఘనుడు అని ప్రస్తుతించారు. వేద



విజ్ఞానంలో ప్రకాశిస్తున్న మేధావి. సముద్రమంత విశాలమైన సాహిత్యానికి విభుడు. విద్యార్థుల మానసాలను చైతన్యపరిచి వెలిగించినవారు. ఉత్తేజమైన పుణ్యకథలను గానం చేస్తున్న ఆదిశేషునిలాంటివారు. ఆయన ఆంధ్ర విద్వన్నిధి. అంతేకాదు, భరతోర్వీ జ్ఞాన పీఠ బహుమతిని సొంతం చేసుకున్న సుకవి. పుణ్యరాశి. తిరుమల విశ్వనాథవారిని ఆదిశేషునితో పోల్చడం ఉదాత్తంగా ఉంది. ఆదిశేషుడు తన వేయినోళ్ళతో లోకహితాన్ని గానం చేస్తాడు. విశ్వనాథ తన అపారమైన ధీశక్తితో వేయి కలాలతో ఒక్కుమ్మడి రాస్తే ఎంత వేగం పుంజుకుంటుందో ఆ తీవ్రతను భజిస్తారు. ఈ సామ్యం సత్య సన్నిహితంగా ఉంది.

తిరుమల గుండె నుంచి తొణుకుతున్న భావధార ఎప్పుడూ పాఠకుని గుండెలో స్పందనలను కలిగిస్తుంది. శంపాలతా సౌందర్యంలో మున్కలు వేసినట్టుగా ఉంటుంది. కవి స్తుతిలో కూడా ఈ భావధార నూతన శబ్ద రూపాలకు ప్రేరణ అయ్యింది.

వేయి పడగలతో విశ్వనాథులవారు
కలముతో పోరాడు చిలకమర్తి
రమ్యదేశస్ఫూర్తి రాయప్రోలు సుకవి
ప్రియభావ దీపాళి వేదుల కవి
రాష్ట్రగానాలతో రంజిల్లు తుమ్మల
దేశమే తానైన దాశరథియు
భరత సమైక్యాన పరుగెత్తు గుఱ్ఱము
విరులచే నేడ్పించు కరుణశ్రీలు
పుణ్య కవితా నిధానము పుట్టపర్తి
ఇంతమంది మహాకవుల్ పొంత నుండి
కొంతనేర్చి కవిగ సమర్పింతు నేను
నా 'సువర్ణ భారతి'కి వందన శతమ్ము॥[493]

విశ్వనాథ పేరు వినిపిస్తే మన ముందు రెండు విశేషణాలు అగుపిస్తాయి. అవి శ్రీమద్రామాయణ కల్పవృక్ష కావ్యకర్త అనీ, వేయి పడగల కృతికర్త అనీ. విశ్వనాథను ఎవరు గుండెలకు అద్దుకున్నా ఈ రెండు విశేషణాలు బృహత్ అర్థాలను గుబాళింపజేసే తీరులో కన్పడతాయి. తిరుమల ఈ రెండింటినీ ఔచితీ స్ఫోరకంగా అభివర్ణించారు. మరొక ఆధునిక కవి చిలకమర్తి కలంతో పోరాడేయోధుడుగా చెప్పారు. వాస్తవమే. ఆయన నిత్య చైతన్య సాహితీమూర్తి. చాలా ప్రక్రియలలో మైలురాళ్ళ వంటి గ్రంథాలు రాశారు. జాతీయ సమర సమయంలో ఆయన రాసిన 'భరత ఖండంబు చక్కని పాడియావు' అన్న పద్యం తీవ్ర సంచలనాన్ని కలిగించింది. ఆనాటి పోరాట యోధులు ఈ పద్యాన్ని నినాద ప్రక్రియగా వాడుకున్నారు.

రాయప్రోలు వారిని రమ్యదేశస్ఫూర్తి సుకవి అన్నారు. ఆధునిక కవిత్వానికి రమ్యాక్షర క్షణిలాంటి సాకార స్వరాన్నిచ్చిన మహాకవి ఆయన. "ఏ దేశమేగినా ఎందుకాలిడినా" అన్న

ఈ ఒక్క పాట చాలు రాయప్రోలు అగ్రపంక్తిలో నిలపడానికి. ఆయన ఆధునికులలో నన్నయ్యలాంటివారు. ఆధునికులలో తెలుగు నుడికారానికి అచ్చతెలుగు సోయగాలను పులిమిన మంచికవి. ఆయన కావ్యాలు సాహితీలోకంలో ప్రచుర ప్రచారాన్ని పొందాయి.

తిరుమల దాశరథిని 'దేశమే తానైన దాశరథి' అని మెచ్చుకున్నారు. నిజమే. దాశరథి అంగారాన్ని శృంగారాన్ని సమంగా సమాదరించి కవిత రాశారు. ప్రాచీనార్వాచీన కవితా మార్గాలను ఏకసూత్రానికి బంధించి నవ్యత్వాన్ని తెచ్చారు. అంతకంటే గొప్పనైనది ఆయన దేశభక్తి. నిజాం నియంతృత్వాన్ని కూకటివేళ్ళతో పెళ్ళగించిన ఆయన కవితాస్త్రాల వాడీ వేడీ తెలుగు ప్రజలకు సుపరిచితమే. 'జండా వొక్కటె మూడు వన్నెలది' అన్న ఒక్క పద్యం చాలు ఆయన దేశభక్తిని చూపడానికి. ఇక జాషువా 'భరత సమైక్యాన పరువెత్తు గుఱ్ఱము' అనడం విశేషంగా ఉంది. పిండివేస్తున్న గాయాల వేదనలను స్ఫూర్తిగా తీసుకొని 'గవ్వకు సాటిరాని పలుగాకులు' అంటూ తోసివేస్తూ అపూర్వమైన కావ్య సస్యాలను పండించారు. సమైక్య జీవితానికి సాహిత్యాన్ని సాధనంగా వాడుకున్న విశ్వనరుడు ఆయన. అదే తిరుమల వాక్యార్థంలో దాగిన విశేషం. తిరుమల అక్షరార్చనను అందుకున్న మరొక మహాకవి కరుణశ్రీ. 'విరులచే నేడ్పించు కరుణశ్రీ' అన్నారు. కవి. కరుణశ్రీ ఆర్ద్రమైన హృదయమున్న కవి. ఆయన రాసిన ఖండకావ్యాలలో పుష్పవిలాపం బాగా ప్రచారాన్ని పొందింది. గాంధర్వశిల్పి ఘంటసాల ఈ ఖండికనే కాక ఆయన మరికొన్ని పద్యాలను తనదైన బాణిలో ఆలపించి కరుణశ్రీ వాణికి లోక విఖ్యాతిని కల్పించారు. ఆ మహాకవి పుష్పవిలాపం కవితా ఖండిక రసప్లావితమైంది.

తిరుమల కవితా నేత్రాల ముందు నిలిచిన మహాకవి పుట్టపర్తి నారాయణా చార్యులు. ఆయనను 'పుణ్య కథా నిదానము' అని సంకీర్తించారు. ఆయన శివతాండవం కావ్యం సాహితీ ప్రపంచంలో అపూర్వమైన సంచలనాన్ని కలిగించింది. అంతేకాక, ఆయన జనప్రియ రామాయణం బహుళ జనాదరణ పొందింది. తిరుమల ఈ పద్యంలో కవిస్తుతికి బిరుదులను ప్రయోగించకుండా కవితా శక్తినే ఎత్తి చూపారు.

ఆధునిక తెలుగు కవులలో సరస్వతి పుత్ర పుట్టపర్తి వారిది విశిష్టమైన స్థానం. అలాగే ఉత్పలవారిది విశేషమైన మార్గం. పుట్టపర్తివారి పురస్కారాన్ని అందుకున్న వేళలో తిరుమల ఉభయ కవులనూ అభినందించడం కవితాత్మతో ఒప్పింది.

గాయక మౌళి సత్కవి జగద్రవి
ధీమణి పుట్టపర్తి నా
రాయణు పేర నొప్పెడు పురస్కృతి
భాగ్యము నందు సత్య నా
రాయణ దేశిక ప్రభుఁడ నారత
శాంత రసాప్తి నాంధ్ర వా



గ్గాయిని కంఠ హారమయి
గ్రాలుత దివ్య కవిత్వ శోభలన్॥ 494

పుట్టపర్తి మధుర గాయకులు. సత్కవి. కవితా జగత్తులో సూర్యునిలాంటివారు. బుద్ధిశాలి. ఆయన పేరుతో ఉన్న పురస్కారాన్ని అందుకున్న ఉత్పలవారు కవితాశ్రేణికి ఉత్తమ దేశికులు. శాంతమూర్తి. సుకవితా ప్రశాంతదీప్తి. ఆ మహాకవి తన దివ్య కవిత్వ శోభలతో ఆంధ్ర శారద గళసీమలో వెలుగొందాలని కవి ఆశించారు.

మహాకవి సినారె వ్యక్తిత్వాన్ని, కవితాశక్తిని చాలామంది కవులూ రచయితలూ చాలా ప్రక్రియలలో అభినందించారు. ఇందులో ఎవరి మార్గం వారిదైనా కొందరి ప్రశంసలు భావస్ఫోరకంగా ఉంటాయి. మళ్ళీ మళ్ళీ చదివి మనసు మీద చిత్రంలా రాసుకోవాల నిపిస్తుంది. తిరుమల ఈ పద్య ప్రశంస అలాంటిదే.

బఱ్ఱున చీదలేదు జడి వానలనైన, హమేష బుఱ్ఱలో
గిఱ్ఱున తిర్గుచుండు రసగీతిక లాతని మానసమ్ము మేల్
గుఱ్ఱము వేగమెక్కువ, అకుంఠిత జీవిత మాత్మశక్తికిన్
వెఱ్ఱి తనమ్ము లేదు దొర బిడ్డడె అన్న 'సినారె' యెన్నడున్[495]

సినారె నిత్య చైతన్య శీలి. కొత్త ప్రక్రియలను సృష్టిస్తూ వాటి హృదయాలకు కవితాచందనాన్ని అలదే శ్రీమూర్తి. అందుకే తిరుమల 'బఱ్ఱున చీదలేదు జడివానలనైన' అని యదార్థాన్ని చిత్రించారు. సినారె బుఱ్ఱలో ఎల్లప్పుడూ ఏవేవో రసగీతికలు గిఱ్ఱున తిరుగతాయి. ఆయన మనస్సు గుఱ్ఱంలా ఎక్కువ వేగంతో పరుగులు తీస్తుంది. అకుంఠితమైన ఆత్మశక్తి కలవారు. నీటైన మనసున్నవారు. అన్నివిధాల ఆయన దొరబిడ్డడు. సినారె మోహినీదేవి బంగారు పతకం అందుకుంటున్నప్పుడు సభనుంచి తిరుమల ఆశువుగా ఈ పద్యాన్ని చెప్పారు.

శుంభత్ప్రతిభా సుమ వన
భంభర హృదయ ప్రమోద పద మధు ధారా
జృంభిత నారాయణ "వి
శ్వంభర నేడిట సు 'వర్ణ' పతకంబయ్యెన్[496]

నారాయణరెడ్డి శ్రీ కవితా నారాయణులు. ఆయన ప్రతిభ సామాన్యమైంది కాదు. ఎంతో ప్రకాశిస్తున్నటువంటిది. ఆయన కవితా ప్రకాశం చురుక్కుమనిపించేది. మేథలో దూరి రేపటి కాలగమనాన్ని తెలిపేది. హృదయంలో అడుగుపెట్టి ఆలోచనామృత ధారలను సృజించేది. విశ్వశ్రేయాన్ని కలిగింపజేసేది. సుమవనం అందరి హృదయాలను అలరించేది. రక రకాల పూలు నిండుగా పూస్తాయి. పరిమళాలు అనే తమ ఆత్మలను వెదజల్లుతాయి. ఏవేవో అపురూపమైన ఊహలకు రెక్కలు కట్టిస్తాయి. ఆనంద లోకాలలో విహరింపజేస్తాయి.

అలాంటి సుమవనంలో విహరించే బంభరస్వామి హృదయం వలపులతో నిండి ఉంటుంది. పూలు అనే చెలిమికత్తెల మానసాల నుంచి అలలెత్తుతున్న వలపుతేనియలను జుర్రుకుంటూ పరవశిస్తుంది. కమ్మని ప్రణయగీతాలను ఆలపిస్తుంది. తన ఝంకార నాదంతో లోకాన్ని సమ్మోహిస్తుంది. నిజంగా ఇక్కడ బంభరస్వామి ఎవరో కాదు. రసజ్ఞులైన విజ్ఞులు. వాళ్ళ హృదయాలను తన ప్రమోదభరిత మధుధారలతో విజృంభింపచేసిన శిఖరంలాంటి మహాకవి సినారె. ఆయన లేఖిని నుండి వెలువడిన మహాకావ్యానికీ మోహినీదేవి బంగారు పతకం మరింత విశిష్టతను ఆపాదించింది. తిరుమల గుండెలుప్పొంగ సినారె మధుపద హృదయాన్ని కీర్తించారు.

కవులలో కొందరు సహజకవులుంటారు. వాళ్ళు ఏ బడిలో చదవకపోయినా, ఏ కావ్య శాస్త్రాలు అధ్యయనం చేయకపోయినా పది కాలాలపాటు మనిషినీ, సమాజాన్నీ సంస్కరించే, హితాన్ని బోధించే సాహిత్యాన్ని సృష్టించడం మన తెలుగు సాహిత్యంలో కన్పిస్తుంది. అందెశ్రీ కలం పేరుతో భావగర్భితమైన కవిత్వం రాస్తున్న అందె ఎల్లయ్య అలాంటి సహజకవి. ఆయన బడిలో ఏ కావ్యశాస్త్రాలను చదవలేదు. ఆయనకు ప్రకృతిమాత ఒడి బడిగా అమరింది. కల్తీ లేని అందెశ్రీ కవన మార్గాన్ని తిరుమల సహజోక్తులతో అభివర్ణించారు.

అందెశ్రీ కవితా మక
రందశ్రీ స్నేహ భావ రంజిత రాజ్యా
నందశ్రీ విశ్వ కళా
బిందుశ్రీ చిరయశమున వెల్గెదు గాతన్[497]

ఆయన అందెశ్రీ. అందెలు గజ్జెయలు లేదా మంజీరాలు. ఇవి ఒయ్యారంగా కదిలితే నాదం ఉబికివస్తుంది. రసజ్ఞుల హృదయాలను కవ్విస్తుంది. ఆయం కలం పోలికి ఈ అందెలున్నాయి. కలం నుంచి అక్షర స్వరూపాలను అచ్చొత్తిస్తున్న సిరాచుక్కలకు అందెలున్నాయి. వీటితో ఆయన వర్తమాన కవితలో తన సహజమైన ధోరణితో కవితలు రాస్తున్నారు. అలా రాస్తున్న ఆ నవకవిని తిరుమల తన పద్య ప్రారంభంలో అందెశ్రీ అని ప్రారంభించి కవి ప్రాభావాన్ని ప్రదర్శించారు. అందెశ్రీ కవితా మకరందశ్రీలను పంచిన బహుత్తమ కవి. యదార్థమైన స్నేహభావాన్ని ప్రకటించే సాధుశీలి. ప్రజావళిని ఆనందపరిచే నిపుణత కలవాడని. అంతేకాదు, విశ్వకళాబిందుశ్రీ అట. రూపకంలో ఆయన కవితాశ్రీని అభివర్ణించారు. అందెశ్రీని ఈ మధ్యనే కాకతీయ విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేట్‌తో సత్కరించి గుండెలకద్దుకుంది. రాష్ట్ర ప్రభుత్వం ఆయన పాటకు పద్మశ్రీతో పట్టం కట్టింది. తిరుమల కీర్తించిన మరొక సహజమైన కవి రాధశ్రీ.

శ్రీదంబుగ నవ కవితా
నాదంబుగ హృదయ కుహరనైగమ వాణీ
మోదంబుగ రాధశ్రీ
ఆదర సత్కీర్తి గనుత ఆంధ్ర శ్రీలన్"[498]

డా॥ రాధశ్రీ (D.A.V.R.K. ప్రసాద్) శ్రీకరమైన కవిత పలుకుతున్నాడనీ, నవ కవితా నాదంతో కవిత వెలయిస్తున్నాడనీ, హృదయకుహరంలో ఉన్న వేద స్వరూపమైన వాణి ఆమోదించే విధంగా కావ్యసస్యాలను పండిస్తున్నాడని పొగడుతూ ఆ రాధశ్రీ ఆంధ్ర వైభవాన్ని అందుకోవాలని ఆశించారు.

సహజంగా ప్రతి కవికీ ఒక దృక్పథం అంటూ ఉంటుంది. ఆ దృక్పథాన్ని సమాజానికి అందించడానికి ఆయనదైన అభివ్యక్తిని పాటిస్తాడు. అయితే కొందరి అభివ్యక్తి మాత్రమే బాగా ప్రభావాన్ని చూపుతుంది. అలాంటి కవులు యుగకర్తలుగా ఆరాధింపబడతారు. రసాల ఫలరసంగా కవిత రాసే తిరుమల తెలుగు సాహిత్యంలోని శిఖరాలలాంటి కవుల, ఉదీయమాన కవుల వ్యక్తిత్వాన్ని, అభివ్యక్తిని తన కవితలో చిత్రించడంలో విశేషమైన ప్రతిభను చూపారు.

## 22. నాయక స్తుతి

తిరుమల అనుసరించిన నాయకస్తుతి విలక్షణమైంది. ఆయన దేశాన్ని నిలబెట్టినవాళ్ళనూ, మాతృమూర్తి నుదుటి సిందూర తిలకాన్ని మరింత వన్నెలతో దిద్దినవాళ్ళనూ, అమ్మచుట్టూ బిగుసుకున్న సంకెళ్ళను తెంచినవాళ్ళనూ, నీతికోసం, నిజాయితీ కోసం జీవితాన్ని కొవ్వొత్తిలా కాల్చుకున్నవాళ్ళను ఉదాత్తంగా స్తుతించారు.

### గాంధీజీ

గాంధీజీ భారత జాతిపిత. ఈ విశాల ప్రపంచానికి అహింసా సిద్ధాంతాన్ని అందించి భవిష్యత్తును తీర్చిదిద్దుకోమని సందేశమిచ్చిన త్యాగధనుడు. కలహాలు, కార్పణ్యాలు మానవత్వాన్ని వెలిగించే సాధనాలు కావని, అహింసా, సత్యాగ్రహం వంటివి సమాజాన్ని ప్రశాంతంగా తీర్చిదిద్దుతాయని, మనిషి వికాసమే జాతి చైతన్యమని ఆయన ప్రగాఢంగా విశ్వసించారు.

భారతదేశంలో, ముఖ్యంగా జాతీయ సమరంలో గాంధీజీ నిర్వహించిన భూమిక, ఆయన వ్యక్తిత్వం కవులను బాగా కదిలించివేసింది. ఫలితంగా చాలా ప్రక్రియలలో ఆయన జీవితం చిత్రింపబడింది. తెలుగులో కూడా పలువురు మహాకవులూ, ఉదీయమాన కవులూ గాంధీజీ జీవితాన్ని, ఆయన ప్రవచించిన సూక్తులను కమ్మని భావుకతతో గానం చేశారు.

ఆచార్య తిరుమల గాంధీజీ ఆదర్శవంతమైన జీవన సౌభాగ్యాన్ని మనోహరంగా గానం చేశారు. ఎందరో దేశభక్తులు భరతమాత దాస్యశృంఖలాలను తెంచివేయడానికి ఉద్యమించినప్పటికీ ఒక్క గాంధీజీ మాత్రమే హిమశృంగంలా నిలిచిపోయారు.

తిరుమల ఆయన పుట్టుక ప్రత్యేకతను అతిశయ లావణ్యంగా దర్శించారు.

బానిసతనపు పంకాన ప్రభవ మొంది
పరిమళించిన స్వాతంత్ర్య పద్మ మీవు
నిన్ను దనియింప భారత నిర్మలాంత
రంగ చైతన్య భానుదు భృంగమయ్యె[499]

గాంధీజీ బానిసత్వపు పంకం నుంచి ఉదయించిన స్వాతంత్రమనే పద్మంలాంటి వాడట. అలాంటి మహోన్నతమూర్తిని తనియింపజేయడం కోసం భారత నిర్మలాంతరంగ చైతన్యభానుడు తుమ్మెదలా మారిపోయాడు.

గాంధీజీ అందరివారు. అన్ని కులాలవారు. అన్ని మతాలవారు. ఆ గురుమూర్తిని అందరూ ఆరాధిస్తారు. అందుకు కొన్ని కారణాలున్నాయి. కవి ఈ సౌశీల్యాలను మధురంగా వాచ్యం చేశారు.

ద్వాపరుండు గీతాత్ముని వాక్యశక్తి
బుద్ధదేవుని కారుణ్య బోధనమ్ము
క్రీస్తు ప్రభుని ప్రేమామృత కీర్తనమ్ము
ఒక్కటై నీవుగా నిల్చెనో! మహాత్మ!![500]

ద్వాపరంలో అవరించింది శ్రీకృష్ణుడు. ఆ స్వామి అందించిన గీతాశక్తి అద్భుతమైంది. అపూర్వమైంది. విశాల విశ్వానికి ఆదర్శవంతమైన మార్గదర్శక సూత్రాలను అందించింది. అలా గీతామృతాన్ని అందించిన వాసుదేవుని వాక్యశక్తి, బుద్ధదేవుని కారుణ్య బోధనం, క్రీస్తు ప్రభువు ప్రేమామృత కీర్తనం ఇవన్నీ ఒక్కటై గాంధీజీగా రూపుకట్టినాడట. అంతేకాక, గాంధీజీ త్రేతాయుగ పుణ్యపురుషుడు, మర్యాద పురుషోత్తముడు అయిన శ్రీరామచంద్రుని 'రఘుపతి రాఘవ రాజారాం' అని స్తుతించడం వలన కూడా ఆయనలో మరిన్ని సుగుణాలు ప్రవేశించి మాననీయుడయ్యాడని చెప్పవచ్చు.

గాంధీజీ ఆగమనం ఈ అర్షధాత్రికి చరితార్థతను చేకూర్చిపెట్టిందని కవి భావించిన తీరు సత్యసన్నిహితంగా ఉంది.

నీ చిరునవ్వు వెన్నెలను నేలయె కల్వగ మారిపోయె, నీ
సూచనలన్ని సూక్తులయి సుందర షట్పద బృంద గీతులై
లోచన కాంతులై మనసు లోపల పొంగుచునుండె నో మహా
త్మా! చరితార్థమయ్య భవదాగనమ్ము పురాణ ధాత్రికిన్[501]

గాంధీజీ దేశకాలాలకతీతమైన పుణ్యపురుషుడు. విశ్వనరుడు కూడా. ఆయన చిరునవ్వు వెన్నెలను నేలను కలువపువ్వుగా మార్చివేసిందట. సూచనలన్నీ సూక్తులుగా మారిపోయి భ్రమరగీతాలుగా, కళ్ళకాంతులుగా మనసులో ఉప్పొంగుతున్నాయట. స్వీయశ్రేయస్సును



పరిత్యజించి ఈ నేల పావిత్ర్యం కోసం, సౌభాగ్యం కోసం పరితపించి పరిశ్రమించి అదే సాధనలో కన్నుమూసిన అమరవీరుడాయన.

గాంధీజీ అవతార లక్ష్యాన్ని కవి ఇట్లా చెప్పారు.

ఉభయ సంధ్యల అరుణిమ నుత్తరించి
ఉదయ భానుండ వగుచు, చంద్రోదయంబు
వగుచు ద్వైరూప విభవాన అమృతపురికి
మమ్ము నడిపించు జ్ఞాన దీపమ్ము నీవు[502]

గాంధీజీ ఉభయసంధ్యలలోనూ సూర్యుడు, చంద్రుడుగా మారిపోయి భారత ప్రజలను అమృతపురికి నడిపించారు. ఆయన జ్ఞానదీపం లాంటివారు. అమృతపురి అంటే అమృతం ఉండే పురి. దీనికి ఇంద్రుడు అధిపతి. కల్పవృక్షం, కామధేనువు, అమృతం ఇలాంటి విలువైనవన్నీ దివిజనలోక రాజధానియైన అమరావతిలోనే ఉంటాయి. వాటి వలన అక్కడికి వెళ్ళినవారికి సకల సౌభాగ్యాలు సమకూరుతాయి. అంతేకాదు, అమరత్వం సిద్ధిస్తుంది. అమరత్వం లభిస్తే పునర్జన్మ ఉండదు కదా! అదిగో! గాంధీజీ భారత ప్రజలకు అమరత్వాన్ని ఆపాదింపజేస్తున్న భాగవోత్తముడని తిరుమల భావించడంలో ఎంతో ఔచిత్యం ఉంది.

స్వర్గంలో ఉన్న గాంధీజీ మళ్ళీ ఈ నేల మీద అవతరించమని కవి తెలిపే స్వాగత గీతిక చూడండి.

విమల వేదముల విజయ నాదముల
సారధీర సంపదతో
సత్యలాలనము ధర్మపాలనము
సంతరించు పద సుధతో
అజేయవై శాంతి దూతవై
ప్రజా మనోరథమేల రమ్మురా![503]

సామాన్యంగా కనిపించే గాంధీజీ అసామాన్యులు. ఆయన వేదాలను చదివారు. అవి అందించే విజయాలను ఒక నాదధారలా స్వాయత్తం చేసుకున్నారు. వాటి సారధీర సంపదలతో సత్యలాలనం, ధర్మపాలనం సంతరించు పద సుధతో అజేయంగా నిలిచారు. సూర్యుడు అస్తమించని బ్రిటీషు రాజ్యాన్ని గడగడలాడించారు. విజయధ్వజం ఎత్తారు. పతాకం నీడలో జాతిని ఉద్ధరించారు. వెళ్ళిపోయారు. అమరపురిలో ఉన్న గాంధీజీ మళ్ళీ దిగొచ్చి ఈ నేలను పుణ్య ప్లావితం చేస్తే బాగుంటుందని కవి భావించారు.

## వివేకానందుడు

వివేకానందుడు మహర్షి. పరిమళిస్తున్న భారతీయ సంస్కృతికి స్వచ్ఛమైన ప్రతీక. నాలుగు పదుల జీవితంలో ప్రపంచాన్ని పర్యటించి భారతీయ సంస్కృతి మాధుర్యాన్ని ప్రకటించిన ఆధ్యాత్మిక మూర్తి. నవ్యత్వానికి పిలుపునిచ్చిన క్రాంతిమూర్తి. అమెరికాలోని

షికాగో నగరంలో సర్వమత సమ్మేళనంలో ఆయన వాణి విశాల విశ్వాన్ని పులకింపజేసింది. 'అమెరికా సోదర సోదరీమణులారా' అన్న స్వామి మాటలు సదస్సులో ఉపవిష్టులైన అయిదు వేల మంది ఆధ్యాత్మిక పండితుల హృదయాలను ఉద్రూతలూగించింది. విశ్వమానవాళి మానసాలలో దివ్యమైన పునీతమైన భావాలను పాదుకొల్పింది. ప్రాక్పశ్చిమాల సంస్కృతులలో భారతీయ సంస్కృతీ ధారకు వున్న ప్రత్యేకత ఏమిటో ఆత్మీయమైన నినాదంగా ప్రపంచ ప్రజల ఆమోద ముద్రగా నినదించింది. స్వామి తన గురువైన రామకృష్ణ పరమహంస బోధనామృతంలో నిలువెల్లా తడిసిపోయారు. తల్లి భువనేశ్వరీదేవి వాత్సల్యం తండ్రి విశ్వనాథుని అనురాగం వివేకానందుల వారిని భారతీయ సంస్కృతికి నిలువెత్తు సంతకంగా చేసి వేయగలిగింది. ఆయన వాణిలో వ్యాస వాల్మీకుల తత్వం గాఢంగా ఉంది. ఆయన నోటి నుంచి వెలువడిన ప్రతి మాటా రసయోగ సదృశంగా ఉంటుంది. అలాంటి మహర్షి జీవితం ఎప్పుడూ లోకానికి పాదేయంగా ఉంటుంది. ఆధునిక సమాజం పశుత్వంలోకి కూరుకుపోకుండా ఆయన వాణి ఉద్ధరిస్తుంది. ఆయన దివ్య మంగళ విగ్రహం చూపరులను వివశులను చేస్తుంది. పందొమ్మిదో శతాబ్దంలో వంగదేశంలో ఉదయించిన స్వామి చరిత్ర అన్ని భారతీయ భాషలలోనూ, చాలా ప్రక్రియలలోనూ రాయబడింది. చిత్రింపబడింది.

ఆచార్య తిరుమల వివేకానందుని కర్మయోగి అని ప్రస్తావించిన తీరు హృదయామోదంగా ఉంది.

సారహీనమైన సంసార జలధిలో
సారవంతమైన జ్ఞాననిధిని
వెలికిదీసి ప్రజకు ప్రేమతో నిచ్చిన
త్యాగి నీవు కర్మయోగి నీవు[504]

సంసారం కొద్దిమందికే సుఖప్రదాయిని. చాలా మందికి అది కంటకప్రాయమైంది. సారహీనమైంది. అదొక సముద్రంలాంటిది. సముద్రం అనగానే గుండెలో నుంచి ప్రమోదం పొంగులెత్తుతున్న మాట నిజమే కాని, దాని మీద ప్రయాణం అంత సుఖమంతమైనది కాదు. సుడిగాలులు వీస్తుంటాయి. ఉప్పెనలు విసురుతుంటాయి. అలలు భయంకరంగా గర్జిస్తాయి. జలజంతువులు అయోమయంలో దిగబడి క్రూరంగా విహరిస్తాయి. ఎటు చూసినా భీతావహమైన వాతావరణం భయంకంపితం చేస్తుంది. పడవ దరి చేరుతుందన్న మాట హుళక్కి. ప్రాణాలు నిలుస్తాయన్న మాట నీటి మీద రాతలాంటిది. దిక్కులు కన్పిస్తాయి కాని, దిక్కు చేరేమార్గం అందదు. అయితే సంసారం కూడా ఇలాంటిదే. సాగరాన్ని ఉప్పెనలు, సుడిగాలులు, జలచరాలు ఎట్లా మృత్యుతుల్యంగా మార్చివేస్తాయో సంసారంలో పుటుక్కున తెగిన అనుబంధాలు, ఆర్థిక పరిస్థితులు మనిషి హృదయాన్ని నిలువునా చీలుస్తాయి. సుఖాలు కరువై బతుకంతా గ్రీష్మంలోని ఎడారిలా మారిపోయి



కన్నుమూసేదాకా కాటు వేయబడుతూనే ఉంటుంది. అందుకే 'సంసార సాగరం' అనే పదసంపుటి ప్రచారంలోకి వచ్చింది. అయితే జలనిధి లాంటి సంసారంలో కూడా రవ్వలు ఉంటాయి. వాటిని వెలికితీయాలి. అవి మననం చేయబడాలి. ఆరాధనగా మార్చివేయబడాలి. వివేకానందులవారు అదేపని చేశారు. బాధల బరువులు మోయలేక చితికిపోతున్న మానవాళికి మార్గం చూపించారు. ప్రతి విషయాన్ని ఆత్మతో దర్శించమన్నారు. ఆత్మపరమాత్మల సంధానాన్ని ప్రకటించారు. ఉద్విగ్నమైన జీవిత పరిస్థితులలో ఉదాత్తమైన దైవాన్ని ఆరాధించి ముఖ్యంగా మనస్సును అదుపులో పెట్టుకొని ప్రవర్తించమని బోధించారు. మనిషి మేధ పొరలలో అణిగి మణిగి నిస్తేజంగా దాగి ఉన్న వినయం, వివేకం, విజ్ఞానం అనే కోణాలను అవగాహనకు తెచ్చుకొని మనుగడను రసాల మాధుర్యంగా మలచుకోమని హితాన్ని బోధించారు. సుఖశీరాలను ప్రేమహృదయంతో దానం చేసి విశ్వమానవాళిని ఉద్ధరించారు. స్వామి ముఖ్యంగా కర్మసిద్ధాంతంలో ఒదిగివున్న జీవిత మూల్యాలను ఆధ్యాత్మిక స్వరూపంగా చాటిచెప్పిన తీరు శ్లాఘనీయమైంది.

వివేకానందుల వారి బోధనలు ప్రజావళికి ఆశీస్సులుగా నడిపిస్తాయని కవి ఇట్లా చెప్పారు.

నీ శబ్దామృత తత్వదర్శనము, నీ స్నేహార్ద్ర సౌజన్యమున్
నీ శాక్తేయ వివేచనా విభవమున్ నీ వర్తనా భాగ్యమున్
నీ శైత్యాద్యుత చంద్రికా హసనమున్ నీ యోగ మహత్యమున్
ఆశీషంబులు గావె మా కిల వివేకానంద ధీరోత్తమా!![505]

వివేకానందులవారు రుషి. అయితే ఆయన కేవలం మోక్షాన్ని కామించి తపస్సు చేసిన అలనాటి రుషి కోటిలానివారు మాత్రమే కాదు. నిరంతరం జ్ఞానదీపాన్ని వెలిగించి మానవ మూల్యాలను ప్రకటించే భారతీయ సంస్కృతీధారను దశ దిశలకు వినిపించిన త్యాగశీలం సంతరించుకున్న పుణ్యపురుషుడు. అలాంటి విశ్వమానవాళి హితాన్ని సదా ఆకాంక్షిన ఆ స్వామి మాటలు వేదార్థసారాన్ని వెల్లువెత్తించే తాత్వికమైన శోభలతో నిండి ఉంది. అలా ఉన్నతంగా ఎదిగిన స్వామి స్నేహశీలి. సౌజన్యనిధి. ఆయన శాక్తేయ సిద్ధాంతాన్ని వివేచించి ప్రజలకు అందించిన మేధావి. ఆయన వర్తన ప్రవర్తన ఆదర్శమైన సౌభాగ్యాలతో కళకళలాడుతుంది. స్వామి హృదయంలో సంస్కృతీ నిధులు స్వరరాగ జలధులై పొంగుతున్నప్పటికీ ఉత్తుంగ ఆధ్యాత్మిక శిఖరంగా మానవాళికి గమ్యాన్ని చూపిస్తున్నప్పటికీ, గంభీరంగా ఉన్నప్పటికీ చల్లనివాడు వెన్నెలవంటి చిరునవ్వులతో లోకాలను తనవైపు పిలుస్తున్నట్టు తోచే అనురాగమూర్తి. అంతేకాదు, దేహానికీ, మనస్సుకీ, ఆధ్యాత్మిక రూపానికి పుష్టిని కలిగించే యోగార్థాలను వివేచించి లోకాలను ఉద్ధరించిన మాన్యుడాయన. అలాంటి నరేంద్రుని వ్యక్తిత్వం, వక్తవ్యం ప్రజలకు ఆశీస్సులని తిరుమల భావించడం సముచితంగా ఉంది.

వివేకానందుని పిలుపులో కాఠిన్యం ఉండదు. ఉండేది ఆర్ద్రతే. చూడండి:

"రా యిటు రా! యిదే వెలుగురా! యిది చీకటి లేని దారి రా
రా" యని పిల్చినన్ కదలిరాని శిలాంగుని జేరి వానిలో
ఛాయల బారద్రోలి నవశక్తిని నింపిన కాంతి పుంజమా!
రాయి త్వ దంఘ్రి సన్నిధిని రత్నము గాదె వివేకధారలన్[506]

ఆయన పిలుపు ఉదాత్తంగా ఉంది. వెలుగులోకి రమ్మని అనురాగ స్ఫూర్తి పొంగులెత్తిన పిలుపు. వెలుగు జ్ఞానానికి ప్రతీక కదా! ఆయన చూపించిన బాటలో చీకటి ఉండదు. చీకటిలాంటి క్రూర జంతువులు ఉండవు. విషసర్పాలు పడగలెత్తవు. ప్రశాంతంగా ఉంటుంది. ప్రయాణం సాఫీగా సాగుతుంది. ఆనందతీరాన్ని చేరుస్తుంది. అయితే ఆయన పిలుపుకు స్పందించని, కదలిరాని శిలా సదృశమైనవాణ్ని చేరుకొని అతని గుండెలో తిష్ట వేసిన కాలుష్యాన్ని, కాపట్యాన్ని వెళ్ళగొట్టి నవశక్తిని నింపి అతన్ని వెలిగిస్తాడు. లోకంలో వెలుగులు ప్రసరింపజేయుమని ముందుకు నడిపిస్తాడు. ఆయన ఎదుట రాయి రత్నంగా మారి కాంతులను వెదజల్లుతుంది. ఆయన పిలుపులో ఎంత సమ్మోహనశక్తి దాగివుందో!

ప్రపంచ ప్రజావళిని మానవతా మార్గంలో నడిపించడానికి భారతీయ సంస్కృతిని ఆధార కేదారంగా మలచిన స్వామి భారతదేశధర్మ నిరతిని మలగిపోనట్టి జ్యోతిగా ప్రభాసింపజేశారని ఆయన ధీమాన్యతను ఇట్లా ప్రశంసించారు.

ఖండ ఖండాంతరాల నుద్దండ పండి
తాళి నడుమ భారతదేశ ధర్మనిరతి
మలగిపోనట్టి జ్యోతిగా మలచినట్టి
ధీర! నీ సాటి వారలు లేరు లేర!![507]

వివేకానంద స్వామి భారతదేశంలో పలు ప్రాంతాలలో పర్యటించారు. ఇదొక దశ. ఇతర ఖండాలలో పర్యటించి జ్ఞానబోధ చేయడం మరొక విశిష్టదశ. పాశ్చాత్య దేశాలలో అక్కడి విద్వాంసుల సమక్షంలో ధీరగంభీరంగా ప్రసంగించి తలలూపింపజేసిన ప్రజ్ఞానిధి ఆయన. భారత ధర్మం, దర్శనం, అఖండమైన వెలుమండలం లాంటిదని ఎలుగెత్తి ప్రపంచానికి వినిపించి భారత వైభవాన్ని మరింత ప్రభాసింపజేసిన మాన్యుడతడు.

ఈ విధంగా ఆచార్య తిరుమల వివేకానందుని ఉన్నత వ్యక్తిత్వాన్ని, వక్తృత్వాన్ని దర్శించి చెప్పారు.

## అల్లూరి

శ్వేత జాతీయులను ఈ భూములను నుంచి తరిమివేయడానికి సాయుధ పోరాటమే ప్రథమ సోపానమని విశ్వసించి ఆంగ్ల సైన్యాన్ని, ఆంగ్ల ప్రభుతను కలవరపరచిన మన్నెం వీరుడు అల్లూరి సీతారామరాజు. పరాయివారికి బందీ కాకుండా వందేమాతరం అంటూ



తల్లిభారతి ఒడిలో కన్నుమూసిన విప్లవ వీరసింహం సీతారామరాజు. ఆయన అమర జీవితాన్ని తిరుమల

అమాయకులపై సాగే హింసకు
అగ్నికీల కురిపించెను అల్లూరి[508]

అంటూ స్తుతించారు.

## భగత్‌సింగ్

దౌర్జన్యంపై దురాగతంపై
ఉరికిన వీరుడు భగత్‌సింగ్[509]

అల్లూరి మార్గంలో ఉద్యమించిన యువయోధుడు భగత్‌సింగ్. ఉరికంబం మీదికి ఉరికి పాశాన్ని కంఠానికి తగిలించుకుని కన్నతల్లి గుండెల మీద కన్నుమూసిన అమరవీరుడు భగత్‌సింగ్. ఆంగ్లేయుల దౌర్జన్యం, దురాగతం అనే దుశ్చర్యలను ఎదుర్కోవడానికి, భారతీయుల హక్కులను కాలరాసే చట్టాలను కూల్చడానికి ఏకంగా ఆంగ్లేయ అసెంబ్లీపై బాంబులు విసిరిన వీరుడు భగత్‌సింగ్. అలాంటి వీరుణ్ని తిరుమల చక్కగా చిత్రీకరించారు.

## నేతాజీ

నేతాజీ జాతీయోద్యమంలో ప్రధాన భూమికను ప్రవర్తింపజేసిన వంగవీరుడు. గాంధీజీతో విభేదించి వంగదేశంలో 'ఆజాద్ హింద్ ఫౌజ్'ను స్థాపించి బ్రిటిష్ నాయకత్వాన్ని బెంబేలెత్తించిన విప్లవవీరుడు. ఆయనను కవి

విక్రమించి జైహిందంటూ
జాతిని నడిపిన నేతాజీ[510]

అని కీర్తించారు.

## నెహ్రూ

జాతీయోద్యమంలో గాంధీజీ పిదప అంతటి జనప్రియ నాయకుడు నెహ్రూజీ. ఆయన ప్రపంచంలో శాంతిని స్థాపించడానికి విశేషంగా కృషి చేసిన పురుషోత్తముడాయన. ఈ పూర్ణ పురుషుణ్ని కవి

పంచశీలతో శాంతిదూతగా
నిలిచిన పండిత నెహ్రూ[511]

అంటూ గానం చేశారు.

నెహ్రూ పేరు హృదయంలో మెదలగానే ఆయన 'శాంతిదూత'గా ప్రత్యక్షమవుతారు. పంచశీల సిద్ధాంతాలను విశ్వానికి అందించి తనదైన మార్గాన్ని శాశ్వతపరిచారు. ఆయన రచనలలోనూ ఈ సిద్ధాంతాలు ప్రత్యేకంగా కన్పిస్తాయి.

## ఇందిరాగాంధి

ఆధునిక భారతీయ చరిత్రలో నిత్య చైతన్య శీలం ఉన్న నాయకురాలిగా అఖండకీర్తిని అందుకున్న వీర వనిత ఇందిరాగాంధి. తండ్రి జవహరుని నుంచి రాజకీయ శాస్త్రాన్ని సొంతం చేసుకొని, పితామహుడు మోతీలాలు నుంచి ధైర్య గుణాలను స్వాయత్తం చేసుకొని; జాతిపిత గాంధీజీ నుంచి పట్టుదలను గుండెలో దాచిపెట్టుకొని ప్రపంచ మహిళగా వినుతికెక్కిన ఇందిరాగాంధి జీవితం చాలా విస్తృతమైంది. ఉన్నత శిఖరాలను అధిరోహించిన ఆవిడ అంగరక్షకుల చేతులలో హతమవడం ప్రపంచాన్ని కదిలించివేసింది. ఆ సంఘటనకు కవి హృదయం విచలితమయ్యింది.

శ్రేయమ్ము చేకూర్చు శ్రిత పారిజాతమౌ
ఇందిరమ్మను హత్య! ఏమి వింత
ఇది పుణ్యభూమియా! ఇది ధర్మసీమయా!
ఇది వేద ఋషుల మహీతలమ్ము?
కరుణామయుండైన గౌతమ బుద్ధుండు
పుట్టిన భూమి యీ భూమి యేన?
గుళ్ళ వర్షమ్ముచే కుప్పగా కూలెనా
బంగరుతల్లి యీ భరతమాత[512]

ఇందిర దేశానికి శ్రేయస్సును కలిగించిన శ్రిత పారిజాతం లాంటివారు. సువిశాలమైన భారతసీమను పాలించిన నేత. అలాంటి త్యాగశీలిని హత్య చేయడమేమిటి? ఇది పుణ్య భూమియేనా? ఇది ధర్మసీమయేనా? అని వాపోతారు కవి. ఇది వేద రుషుల మహీతలమేనా? బుద్ధుడు పుట్టిన కారుణ్యసీమయేనా? అని కవి గుండె నుంచి ప్రశ్నలు పరంపరలుగా దూసుకొచ్చాయి. ఆమె హత్యతో దేశచరిత్ర కళంకితమైపోయిందని తన ఆవేదనను వ్యక్తపరిచారు తిరుమల.

## ఘంటసాల

ఎంత గొప్ప మాటలకన్నా కూడా హృదయాన్ని కదిలిస్తుంది రాగం. విషయం లేకుండా అందాల్ని కల్పించగలదు. కనుకనే గానం కళలో కన్నీటికీ ఉత్కృష్టమైంది.

-చలం

మాటలు కొన్ని విశిష్టంగా ఉంటాయి. కమ్మని భావుకత్వంతో విశాలమైన అర్థాలను కుప్పలుగా పోస్తూ హృదయాలను పరవశింపజేస్తాయి. మేధలో అడుగుపెట్టి అనేక అవర్తాలను సృష్టిస్తాయి. జ్వలత్ ఆలోచనా ధారకు వేగాన్ని అందిస్తాయి. ఊపేస్తాయి. ఉద్వేగాన్ని ఉరికిస్తాయి. కర్తవ్యాన్ని గుర్తు చేస్తాయి. సమాజం హృదయ కదలికలను అద్దంలా చూపిస్తాయి. మనిషిని తెలిపే అనేక జీవన కోణాల రూపాలను ప్రసరింపజేస్తాయి. అయితే- ఇలాంటి అర్థాలను అందించే శబ్దావళి అందరి మేధలకు అందవు. కొందరు ఆలోచనాపరులైన మేధావులకు మాత్రమే అందుతాయి. అందాలను రాశులుగా పోసి విందు చేస్తాయి. కాని, రాగం అలా కాదు. అది పండితులనూ, పామరులనూ ఏకకాలంలో రంజింపజేస్తుంది. గీతంలో కవిత్వపు పస లేకపోయినప్పటికీ కమ్మని కంఠం నుంచి ఉప్పొంగి వచ్చినప్పుడు అది ఎంతో మధురంగా వీనుల విందుగా ఉంటుంది. అందుచేత కళలన్నింటిలోకెల్లా గానం ఉత్కృష్టమైన కళగా ఆరాధనీయమైంది. 'శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తిగాన రసం ఫణి' అనే లోకోక్తి బాగా ప్రచారాన్ని అందుకుంది. ఏడుస్తున్న శిశువులు సైతం తీయని పాటలు వింటే హాయిగా నిద్రపోతారు. పశువులు ఆనందంతో పులకరిస్తాయి. సర్పాలు శిరసులెత్తి నర్తిస్తాయి. అంతేకాదు, శిలలు ద్రవించి ప్రవహిస్తాయి. శిలలాంటి హృదయాలు కూడా ఆర్ద్రమవుతాయి. అనురాగ రసరాగిణులవుతాయి. పాటలో అంత మహత్యం ఉంది. అలాంటి పాటలతో లోకాలను ఆర్ద్రీకరించి సమ్మోహన పరచిన గాయకులలో ఘంటసాలది విశిష్టమైన ఉన్నతమైన పీఠం. ఆయన భక్తి, రక్తి, స్నేహం, ఆనందం, ఆరాధన, ఆవేదన, ఆలోచన, ఆవేశం, విరహం, విలాసం లాంటి ప్రక్రియలలో ఆలపించిన గీతాలు ఒక్క తెలుగుసీమలోనే కాదు ఈ దేశం పొలిమేరలు దాటి యావత్తు ప్రపంచాన్ని పరవశింపజేస్తున్నాయి. గంధర్వగాయకుడుగా ప్రసిద్ధులైన ఘంటసాల కృష్ణాజిల్లా చౌటపల్లి గ్రామంలో 1922 డిసెంబర్ 4వ తేదీన రత్తమ్మ, సూర్య దంపతులకు జన్మించారు. ఆయన తన తండ్రి నుంచి సంతరించుకున్న గానకళకు మరింత వన్నెలు చిన్నెలు దిద్ది స్వర్ణసీమ నేపథ్య గాయకులుగా సినీరంగంలో ప్రవేశించారు. 1974 ఫిబ్రవరి 11 దాకా అవిశ్రాంతంగా మధుర మధురంగా గీతాలు ఆలపించి గాంధర్వ లోకంలో కలసిపోయారు. హిమశృంగంలా ఎదిగిన ఘంటసాల కళా జీవితాన్ని కరుణశ్రీ, శ్రీశ్రీ, సినారె వంటి కవులు పరమ రమణీయంగా అక్షర పుష్పాలతో అభిషేకించారు. ఆధునిక మహాకవి తిరుమల కూడా ఆ మహనీయుని కళాత్మక జీవితాన్ని ఆ పాత మధురంగా వర్ణించారు.

ఎవ్వాని చూపులో ఏడుకొండల వాని
వెలుగు శ్రీగిరి వీడి కొలువు చేసె
ఎవ్వాని గొంతులో మృదుల గాంధర్వమ్ము
స్వర్గధామము వీడి సభలు చేసె
ఎవ్వాని గుండెలో పువ్వు కన్నెల నవ్వు
నవ వసంతము వీడి నటన చేసె
ఎవ్వాని కీర్తిలో ఈరేడు భువనాలు
విష్ణు గర్భము వీడి విడిది చేసె

అతడు సత్కళానందనోద్యాన హేల
అతఁడు దివ్య సంగీత రసాబ్ధి వేల
అతఁడు నిగమాబ్జమాల దివ్య ప్రమోద
గగన గంగా హృదయశాల! ఘంటసాల!![513]

ఘంటసాల గళమెత్తితే గీతాల సురగంగలు పొంగినట్టిగానే ఆయన చూపులు కూడా

అంత ఆర్ద్రమైనవి. గాంభీర్యాన్ని ప్రదర్శిస్తూనే ఆత్మీయతను ఒలకబోస్తాయి. అనురాగామృత ధారలను వర్షిస్తాయి. ముఖ్యంగా భక్తిగీతాలు ఆయన గొంతు నుంచి దుమికేటప్పుడు ఆయన ఒక సాధువులా భాసిస్తారు. సంపూర్ణమైన పరవశత్వం ఆయనలో ఆవేశిస్తుంది. భక్తిగీతాలలో- ప్రధానంగా ఏడుకొండల స్వామిని సంకీర్తనం చేసేటప్పుడు ఘంటసాల ఎంతగా వివశత్వాన్ని భజిస్తారో, ఆ స్థితిని వర్ణించడానికి మాటలు చాలవు. ఆ గంధర్వ గాయకుడు పిలిస్తే చాలు శ్రీగిరి వాసుడైన శ్రీనివాసుడు కదిలొస్తాడు. సపరివారంగా తరలివోస్తాడు. అంతేకాదు- స్వామి రాకకు ముందు ఆయన దివ్యమైన వెలుగు శ్రీగిరిని విడిచిపెట్టి ఆయన కళ్లల్లో కొలువు తీరుస్తూ ఉంటుంది. లోకాలను తన సమ్మోహనంలో ముంచెత్తే మృదుత్వమూ, సుకుమారమూ అయిన గాంధర్వం స్వర్గధామాన్ని విడిచిపెట్టి అతని గొంతులో సభలు తీర్చింది. పువ్వు కన్నెల నవ్వులు నవ వసంతాన్ని త్యజించి ఆ మధుర గాయకుని గుండెలో నర్తించాయి. ఈరేడు లోకాలు విష్ణుదేవుని గర్భాన్ని విడిచిపెట్టి అతని కీర్తనంలో సంకీర్తనం విడిది చేశాయి. ఆయన ఎవరు? ఎక్కడున్నారు? ఎవరో కాదు. ఆయన 'సత్యాానంద నందనోద్యాన హేల', 'దివ్య సంగీత రసాబ్ది హేల', 'నిగమాబ్జమేల', దివ్య ప్రమోద గగన గంగా హృదయశాల', మహనీయుడు ఘంటసాల. తన అపురూపమైన గాన మాధుర్యంతో ఈ నేలను రసప్లావితం చేసిన ఘంటసాల ఈ లోకాన్ని విడిచి వెళ్ళిపోవడం కవి హృదయాన్ని గాయపరచింది.

తన వీణ పలికింప దలచి తీగెలు సవ
    రింపఁ బిలిచెనో విరించి రాణి
తన దివ్యకేళికై తగిన సంగీతమ్ము
    సమకూర్చి పిలిచెనో శశిధరుండు
తన సభా గాయక దర్పంబు విదళింప
    భావించి పిలిచెనో దేవరాజు
తన గాన మాధుర్యమును చాటు మహతికి
    వెలఁగట్ట పిలిచెనో కలహ మౌని
కన్ను మరు గాయె రసడోల! ఘంటసాల
కదలిపోయెను స్వరలోల! ఘంటసాల
కరిగిపోయె చందనశీల! ఘంటసాల
తెలుగు గుండెకు కన్నీటి తెరలు దించి![514]

ఘంటసాల రాగరసరాట్టు. అలాంటి కళామూర్తిని తన వీణను పలికించాలని భావించి తీగెలు సవరించడానికి సరస్వతీదేవి సత్యలోకానికి పిలిచింది. శశిధరుడైన శివుడు తన దివ్య నటనకోసం చక్కని సంగీతాన్ని సమకూర్చడానికి కైలాసానికి పిలిచాడు. దేవరాజు తన సభలో ఉన్న గాయకుల దర్పాన్ని అణచివేయడానికి ఘంటసాలను అమరావతికి ఆహ్వానించాడు. కలహమౌని నారదుడు గాన మాధుర్యాన్ని ప్రకటించే తన వీణకు వెల



కట్టడానికి ఆ సారస్వత మూర్తిని హృదయంలోకి పిలిచాడు. నిజంగా ఘంటసాల ఉన్నతుడు. ఆయన రసడోల. స్వరలోల. అలాంటి పునీత యశస్వి పరమపదించడం తెలుగు గుండెలకు కన్నీటి తెరలు దించినంత వేదనాభరితంగా ఉందని తిరుమల భావించారు.

ఆ మహనీయుడు

శిలలు కరిగించు గాంధర్వ శిల్పి యతడు
నవ రసాశ్రయ చైతన్య కవన మతడు
'కలదు కల'దని ఉప్పొందు క్షణమునందె
'లేదు-లే' దను మాటలో లీనమయ్యె[515]

అని కుమిలిపోయారు కవి.

ఘంటసాల దేవలోకం తరలివెళ్ళినప్పుడు డా॥ కరుణశ్రీ, డా॥ సినారె వంటి కవులు రాసిన కవితలు హృదయాలను ద్రవీభూతం చేస్తాయి. తిరుమల ఈ కవితా ఖండిక కూడా కంటనీరు తెప్పిస్తుంది. ఈ కవితను చదువుతున్నంతసేపూ, మననం చేసుకుంటున్నంతసేపూ ఘంటసాల చదువరుల కళ్ళయెదుట విమల గాంధర్వాన్ని పలికిస్తున్నట్టుగా కన్పిస్తారు. తిరుమల చిక్కని భావుకత్వంతో రసవన్మధురంగా ఉన్న కవితలలో 'గాంధర్వ శిల్పి-ఘంటసాల' ఒక కమ్మని కావ్యం. నవ రసాశ్రితమైన నిశ్శబ్ద శబ్ద చందన శీల.

తిరుమల వివిధ రంగాలలో శిఖరాలలాంటి మహనీయుల ఎన్నుకొని వారి ఆదర్శ జీవన విధానాలను అనంతర కాలాల మీద చూపుతున్న ప్రభావాలను సౌజన్య స్ఫూర్తితో వర్ణించారు.

## 23. పండుగలు

ప్రకృతి ఆనందాన్ని పంచుతుంది. ఆనందం బ్రహ్మ స్వరూపమని వేదవిదులు చెబుతారు. మనిషి జీవితం ప్రకృతితో సమ్మిళితమై ఉంటుంది. ప్రకృతి పరిణామశీలమైంది. ప్రకృతి మధ్య మనుగడ సాగిస్తున్న మనిషి జీవితం కూడా అనేక మార్పులు ఒత్తిడులు కలిగి ముందుకు సాగి వస్తున్నట్టిదే. ప్రకృతి ప్రదర్శిస్తున్న విచిత్ర సన్నివేశాలలో రుతువులు బాగా ప్రాధాన్యతను వహిస్తాయి. ప్రతి రుతువుకూ ఒక ప్రత్యేకత ఉంటుంది. ఆ విశిష్టత ప్రకృతిలో ప్రతిఫలిస్తూ ఉంటుంది. రుతువుల ఆగమనాన్ని తెలపడానికి, కాల పరిణామాన్ని సూచించడానికి గుర్తులుగా మనకు కనిపించేవి పండుగలు. పండుగల తత్వాలను విశ్లేషించిన తిరుమల రామచంద్ర "మనసు మరుగున తారాడు మెలకులను వెలువరించుటకు మాటలేకాక మరి ఎన్నియో మార్గములున్నవి. వానిలో ఒకటి పండుగలు. ప్రజల మనో వికారములు, జిజ్ఞాసా విలసితములు, ఋతు పరివర్తనము వలన ప్రకృతిలో నేర్పడు వివిధ పరిణామములు, పరంపరాగతములగు పూర్వగాథలు, నభోమండలనమున నగపడు నక్షత్ర గ్రహాది సన్నివేశములు తమ పర్యవేక్షణ ఫలములన్నియు నిత్య జీవితమున మేళవింపజేసి వానికి నిత్యత్వము సంతరింపజేయవలెనను అభిలాష మొదలగునవెన్నియో జున్ను కట్టగా రూపొందినవి పండుగలు"[516] అని నిర్వచించారు.

తెలుగులో పూర్వకవుల నుంచి నేటి నవ్యకవుల వరకూ పండుగలను వర్ణించిన వారున్నారు. కవులలో కొందరు పండుగలు ఆత్మానందాన్ని చేకూర్చుతాయని వర్ణిస్తే, మరికొందరు ఇవి అలౌకిక సౌందర్యాన్ని మనిషికి అందిస్తాయని రాశారు. మరికొందరు పండుగలను లౌకిక విషయాలకు పరిమితమైన వానిగా భావించారు. ఆధునికులలో కొందరు సమాజ పరిస్థితులకు నేపథ్యంగా తలచి రాశారు.

ఆచార్య తిరుమల పండుగలను ఆధునిక దృష్టితో చూచి వర్ణించారు.

**ఉగాది**

నీ రాకన్ తెలుగింటి వాకిళుల సుస్నేహార్ద్ర భావంబుతో
స్వారస్య స్వర మాధురిన్ పరభృత స్వాముల్ శ్రుతుల్ సంస్కృతుల్
సౌరభ్య ప్రసవంబులై విరియగా చైతన్య గీతావళిన్
శ్రీ రంజిల్లగ నాలపించవలె ప్రాక్సీమంతిని కాంతులన్[517]

తెలుగువాళ్ళ తొలిపండగ ఉగాది. ఉగాదితో చైత్రం ఆరంభమవుతుంది. చైత్రమాసాన్నే మధుమాసం అంటారు. ఈ మధుమాసం వసంత రుతువులోని మొదటి నెల. ఈ వేళ తరువులన్నీ నవ వధువులా ముస్తాబవుతాయి. కోకిలలు మామిడి చివుళ్ళను తిని గొంతులు సవరించుకొని గొంతులెత్తి షడ్జమ స్వరంలో పాడతాయి. పూచిన పువ్వుల నుంచి ఎగిసిన పరిమళాలు వాయుతరంగాల మీద సాగుతూ లోకాన్ని సమ్మోహింపజేస్తాయి. ఇవన్నీ ప్రకృతికి అందాన్ని మాత్రమే కాదు, మానవ ప్రకృతిలో కూడా శోభాకరమైన మార్పును తెస్తాయి.

"యుగాదయశ్చ కథ్యంతే తథైలాః సర్వసూరభిః యా మన్వాద్యాః యుగాద్యాశ్చ తిథి యస్తాసు మానవః స్నాత్వా హుత్వాచ దత్వాచ జప్త్వానంత ఫలం లభేత్"[518] అని మహాభారతం ప్రవచిస్తుంది. ఉగాదులలో, మన్వాదులలో స్నానంచేసి, హోమదానాలు ఆచరించేవారికి అనంతమైన ఫలం లభిస్తుందని అర్థం. చైత్ర శుద్ధ పాడ్యమి అంతటి పుణ్యమైనది. యుగానికి ఆది ఉగాది. బ్రహ్మ సృష్టిని ఆరంభించిన రోజును "ఉగాది" అంటారని పురాణాలు చెబుతున్నాయి.

తిరుమల ఉగాది పర్వాన్ని మనోజ్ఞంగా వర్ణించారు.

ఈ మధుమాస మీ కుసుమ వృష్టిని పొంగిన సౌరభంబు లీ
కోమల కావ్య కన్యకల గుండెల తల్పులు తీసి రాగ సం
గ్రామ మనోజ్ఞ సీమలకు రమ్మను కమ్మని కోకిల ధ్వనుల్
మామక మానసంబునొక మల్లెల కోవెల జేసె నియ్యెడన్[519]

ఈ పద్యంలో కవి మధుమాసంలో కురిసిన పుష్పవృష్టి నుంచి పొంగిన సౌరభాలు, కోమలమైన కావ్య కన్యకల గుండె తలుపులను తీసి రాగాలు పోటిపడే మనోజ్ఞ సీమలకు రమ్మని కమ్మగా పిలిచే కోకిలలు కలకూజితాలు నా మనస్సును మల్లెల కోవెలగా మార్చాయని



పొంగిపోయారు. కవికి ప్రకృతి నుంచి అందవలసిన సౌందర్యం ఇలాంటిదే కదా!

చైత్రం రావడంతో కవి హృదయం ఎలా రసనిష్యంది అయ్యిందో చూడండి:

ఏమి ఈ చైత్ర, చైతన్య రామణీయ
కమ్ము! ఎక్కడో ఎడద లోకమ్ము నుండి
వేలు లక్షలు భావాలు వెల్లి విరిసె
మల్లె మొగ్గలట్లు, వసంత మధువు కురిసె[520]

వసంతంలో తడిసిన కన్నియ వలపుల తలపుల సొగసులను, మనసిజుని తుళ్ళింతల వల్ల కలిగిన గిలిగింతలను ఇట్లా కవి వర్ణించారు.

ఒంటరి కన్నియ చూపుల
తుంటరి మదనుండు నిలిచి త్రుళ్ళింతల పూ
వింటిని సంధింపః వలపు
మంటలు మదినెగసి సిగ్గు మసియై పోయెన్[521]

మధుమాసంలో కన్నియ ఒంటరిగా ఉంది. అదీ అలలు అలలుగా వస్తున్న మధుమాస పరిమళాలలో మునిగితేలుతూ ఉంది. ఆ వేళ మదనుడు తుంటరిగా మారిపోయి పూలబాణాలు ఆ ఎలజవ్వని గుండెకేసి విసిరివేశాడు. అంతదాకా ఉన్న సిగ్గు మసిగా మారి రాలిపోయింది. వలపులు మంటలుగా మనస్సు నుంచి ఎగిసాయి. ఇది తిరుమల ఆధునిక భావన ఛందస్సు పాతదైనా కొత్త అందాలను సంతరించుకున్నదీ పద్యం. ఎంతో అనవద్యంగా ఉందీ పద్యం.

తీపి, పులుపు, ఉప్పు, కారం, వగరు, చేదు ఈ షడ్రుచులు వసంత కాలంలో ప్రకృతి ప్రసాదించిన పదార్థాలు. సుఖదుఃఖాల సమ్మిళితమైన జీవితానికి ప్రతీకలు. తిరుమల వేప, మామిడి ధర్మాలను జీవితంలోని రెండు పార్శ్వాలకు అన్వయించి చెప్పిన ఈ పద్యం ఒక సూక్తిలా పాఠకుని హృదయంలో శాశ్వతంగా నిలుస్తుంది.

మరిచిపోయిన కష్టాలు మరల గుర్తు
చేయ నిలిచె నీ భువి వేపచెట్లు- కాగ
ఏదియో మంచి జరిగి యీ చేదు విరిగి
పోవునను కోర్కె లే మావి పూత పూసె[522]

తిరుమల కవితలో ఉగాది రసవేదికాక మరేమవుతుంది?

వేపచెట్లు మరచిపోయిన కష్టాలను మళ్ళీ గుర్తు చేసేవిగా ఉన్నాయి. అయితే ఏదో మంచి జరుగుతుంది. లేత మామిడి పుష్పించడంతో చేదు విరిగిపోతుందని కోరిక మిగులుతుందని కవి భావించారు. ఇక్కడ చేదు అంటే జీవితాన్ని కుదిపి వేసే సమస్యలు. అయితే అవి ఎప్పుడూ అలాగే ఉండవు. లేత మావి విరియడం అనే వసంతం అడుగుపెట్టి

కష్టాలనే శిశిరాలను వెళ్ళగొట్టి జీవితాన్ని ఆనంద మందిరం చేస్తుందనే సత్యోక్తిని ఉగాది పర్వ వర్ణన సందర్భంగా రాశారు.

మన పండుగలలో విజయదశమికి చాలా ప్రాశస్త్యం ఉంది. శరత్తులో ఈ పండుగ వస్తుంది. ఈ రుతువులో ప్రకృతి అంతా కళకళలాడుతూ ఉంటుంది. ఎటు చూచినా పచ్చదనం, పువ్వుల పరిమళం మనస్సును పరవశింపజేస్తాయి. ఒయ్యారంగా అడుగులు వేసుకుంటూ ముందుకు సాగే సెలయేళ్ళు, వెండి అంచులతో నింగిలో పయనించే మేఘమాలికలు హృదయాలలో మధుర భావనలను పలికిస్తాయి. అదే శరత్తులో ముందుగా బతుకమ్మ పండుగ అడుగుపెట్టి పల్లెపట్టులకు కొత్త అందాలను పులుముతుంది. అదే వేళ నవరాత్రి ఉత్సవాలు మానసాలను ప్రఫుల్లం చేస్తాయి. భక్తి భావాలతో పునీతం చేస్తాయి. ఈ శారదోత్సవాలకు 'విజయదశమి' మకుటం లాంటిది. దీనికి 'దసరా', 'దశరా'[523] అనే పేర్లున్నాయి. ఈ పండుగ ప్రాశస్త్యాన్ని కాళికా పురాణం, దేవీ పురాణం, బృహద్ధర్మపురాణం,[525], రామాయణం, భారతం[526] వంటి గ్రంథాలు స్పష్టం చేశాయి. ఇది భారతదేశంలోనే కాక ఆసియా ఖండంలో పలుచోట్ల పలు పేర్లతో ఆచరింపబడుతుంది.

వీరత్వానికి ప్రతీకగా ఉన్న ఈ పండుగను తిరుమల కవి ఆనందంతో తడిసిన హృదయంతో "వసంతాల పసిమేసిన మిసిమినీ విజయదశమినీ" అంటూ కమనీయంగా పిలిచారు. రుతుచక్రంలో వసంతం తరువాత గ్రీష్మం, వర్షం వస్తుంది. పిదప శారదం. ఈ రుతువులో కూడా చెట్టూ చేమా అన్నీ పచ్చదనంతో, చక్కని పూలతో, ఫలాలతో చూపరుల మానసాలలో చిక్కని కోరికలను సృష్టిస్తాయి. ఈ అందాలు రుతువుల్లో మొదటిదైన వసంతం యొక్క పసను మేయడం వల్ల కలిగిందని భావించారు. పూలకారు సొబగులను జుర్రుకోవడం వలన శారదకు అందాలు చేకూరాయి. ఈ అందాల గంధాలను విజయదశమి దోచేసుకుంది. అలాంటి పర్వాన్ని కవి వర్ణించారు. ఆ వేళ

అటు నింగికి ఇటు నేలకి
అల్లుకున్న చూపులతో
విరి తూపులతో"[527]

లోకమంతా పులకిస్తుందని భావించారు.

అంతేకాక

పల్లె పల్లె పల్లవించి మధువులు అందించ
పట్టణాలు పరవసించి సిరులను చిందించ
చైతన్యం మన ఖ్యాతిని జాబిలిపై నడిపించ
గతం-ప్రగతి చేయి కలిపి నేటి నవత నలరించ[528]

అని ఆశను ప్రకటించారు. గతం, ప్రగతి ఈ రెండు చేయి కలిపి నవతను అలరిస్తే చైతన్యం విరబూస్తుందని మన ఖ్యాతి చందురునిపై పయనిస్తుందని కవి విజయదశమిని ప్రేమతో వర్ణించి తన ఆశాభావాన్ని ప్రకటించారు.



హిందువులు ఆచరించే పండుగల్లో సంక్రాంతికి ఒక విశిష్ట స్థానముంది. 'సం' అంటే మిక్కిలి అనీ, 'క్రాంతి' అంటే అభ్యుదయకరమైన మార్పు అనీ అర్థం. మకర సంక్రమణమే ప్రాధాన్యం పొంది సంక్రాంతిగా వ్యవహరింపబడుతుంది. సంక్రాంతి నాలుగు రోజుల పండుగ. మొదటి రోజున భోగి, రెండవ రోజున మకర సంక్రాంతి, మూడవ రోజున కనుము, నాలుగవ రోజున ముక్కనుమ జరుపుకుంటారు. రైతుల పంటలు ఇంటికి చేరి ధనరాశులు ·చేతినిండా గలగలలాడుతాయి. ప్రతి ఇల్లు పాడిపంటలతో నిండి కళకళలాడుతుంటుంది.

ఆచార్య తిరుమల సంక్రాంతిని 'సర్వసు పర్వ పర్వ 'మా' అని చిత్రించారు. సంక్రాంతి అగమించిన వైఖరిని ఇట్లా చూపించారు.

ఇమ్ముగ జ్ఞాన కాంతి రథమెక్కి, విహాయస వీధి గోళ దీ
పమ్ముల వెల్గు దారి నిటు వచ్చితివా? భువి పళ్ళెరాన జీ
వమ్ముల నూత్న భావ రసవత్కృతి హారతి నంది, దివ్య హా
సమ్ముల సౌరభాలు వెదజల్లఁగ సర్వసు పర్వ పర్వ 'మా'[529]

సంక్రాంతి జ్ఞానమనెడి కాంతిరథాన్ని ప్రీతితో ఎక్కింది. నింగిదారులలో సూర్యచంద్రులు ప్రసరిస్తున్న వెలుగుదారులలో పయనించింది. భువి పళ్ళెరాన హారాలునందుకుంది. దివ్యమైన చిరునవ్వుల సౌరభాలు వెదజల్లుతున్నదని తిరుమల భావన. ఈ పద్యంలో సూర్యచంద్రులను 'విహాయస వీధి గోళదీవమ్ములు' భువి పళ్ళెరం అనడం కొత్త భావన.

తిరుమల సంక్రాంతి పండుగ నాటి విశేషాలను సహజంగా వర్ణించారు.

అటు చూడ పువ్వులు - ఇటు చూడ నవ్వులు
ఎటు చూడ నయనాల నెలిమి సరులు
ఆ వంక ముగ్గులు - ఈ వంక సిగ్గులు
ఏ వంక నెలవంక నేలు మరులు
అలగుడి గంటలు - ఇల భోగి మంటలు
ఎల్లడ నుల్లాస మెగయు సిరులు
అట జీవ గంధాలు - ఇట భావ బంధాలు
ఎటగన్న గ్రంథాల పుటల విరులు
పాసుర ప్రబంధ నిబద్ధ భక్త గాన
మాధురీ మకరంద ధీమాన్య ఝరులు
అతుల హరిదాసు కీర్తన లిటుల గంగి
రెద్దు నర్తనలు, శుభాంగి వీవు నేడు

సంక్రాంతి అడుగు పెట్టడంతోనే సౌందర్యం పురులు విప్పి ఆడినట్టు మురిపాలు

తొణుకుతాయి. ఎటు చూచినా పువ్వులు కన్పిస్తాయి. ప్రతి పెదవి మీదా నవ్వులు విరబూస్తాయి. కళ్ళలో సరాగాలు కదలుతాయి. అంతటా ముగ్గులు కనువిందు చేస్తాయి. సిగ్గులు జాలువారుతాయి. మరులు నెలవంకను పాలిస్తాయి. గుడిగంటలు మ్రోగుతాయి. భోగిమంటలు జ్వలిస్తాయి. అంతటా ఉల్లాసపు సిరులు ఎగిసిలేస్తాయి. ఎక్కడ చూచినా జీవగంధాలు, భావబంధాలు మురిపిస్తాయి. ఎక్కడ చూచినా గ్రంథాల పుటల విరులు పరమళిస్తూ ఆశలను పెంచుతాయి. గాయకుల పాసుర ప్రబంధాల మధురగానాలు. ఎక్కడ తిలకించినా హరిదాసు కీర్తనలు గంగిరెద్దు నర్తనలు. ఇదంతా రెక్కలు విప్పిన సంక్రాంతి సౌందర్య సౌభాగ్యమే. తిరుమల సహజోక్తిలో సరళశైలిలో ఇంపుగా వర్ణించారు.

సంక్రాంతి మహిమను తనివారగ చిత్రించిన వైఖరి చూడండి.

క్రొత్త కోర్కెల నెత్తమ్మి కొలని యలల
కురియు వెన్నెలయో! కాక, పరిమళించు
కావ్య కన్యల గాంధర్వ గానమో! ప్ర
మోద భరిత మీ సంక్రాంతి పుణ్యమహము

సంక్రాంతి మరో పౌష్యలక్ష్మి. ఆమె నర్తన ఆనంద సంధాయకమైనట్టిది.

పరవశించి నర్తించెను పౌష్యలక్ష్మి
పసిడి మువ్వల ఘలఘల పలుకులందు
వినబడ, హరిత మైదాన వేదిపైన
శాంతితో క్రాంతి నిలిచి సంక్రాంతియయ్యె!![532]

సంక్రాంతి వేళ సంబరాలు అంబరాన్ని తాకుతాయి. ఇంటిలో అందరూ వరుసలతో ఆత్మీయతను అల్లించుకుంటారు. బావా మరదళ్ళు, ఆలుమగలు వీళ్ళ మధ్య, బంధాలు మరీ రసస్ఫోరకాలు. ఈ వైనం తెలిసిన తిరుమల

బావతో మరదళ్ళు పరిహాస బంధాలు
కొత్త పెనిమిటి కనుల నటియించు అందాలు[533]

ఇవన్నీ ఇంటిలో జరిగే ఘటనలే. అయినప్పటికీ, పండుగవేళ వీటి ఆదుర్దా మరీ ఎక్కువగా ఉంటుంది. ఈ కోలాహలం లేకపోతే పండుగ ప్రత్యేకత ఏముంటుంది. బిగువు ఏముంటుంది. ఇంటిలో ఉన్న అందరిలో ఆత్మీయత ఎక్కడుంటుంది. తిరుమల పండుగ అందరిలో మమకారాన్ని అల్లించేదిగా ఉంటుందని భావించారు.

తిరుమల ఉగాది, దసరా, సంక్రాంతి పండుగల నేపథ్యాన్ని ప్రకృతిలో రసరేఖల వంటి పండుగ అందాలను కుటుంబీకుల మధ్య విచ్చుకొని అల్లుకున్న మమతానురాగ బంధాలను సహజంగా చిత్రించారు.



## 24. జానపద ధోరణులు

జాతికి జీవన నాళిక
జానపద గీతిక[534]

అన్నారు శ్రీశ్రీ. శిష్ట సాహిత్యం ఎంతగా రెక్కలు విచ్చుకున్నా జాతి సంస్కృతీ సంప్రదాయాలను సామాన్య ప్రజావళికి అంతగా అందించలేకపోయింది. పండితులు మాత్రమే శిష్ట సాహిత్యంలో ఉన్న మాధుర్యాన్ని అనుభవించడం, సంస్కృతీ సంప్రదాయాలను అనుసరించడం జరుగుతుంది. విశిష్టమైన విస్తారమైన క్రమశిక్షణా ప్రేరితమైన ఈ విధానాలను జానపద సాహిత్యం సామాన్య ప్రజల హృదయాలకు అందిస్తుంది. శిష్ట సాహిత్యానికంటే ముందే జానపద గీతాలు ప్రచారంలో ఉన్నట్లు మన విమర్శకులు అభిప్రాయపడ్డారు. ఒకప్పుడు మౌఖికంగా ప్రచారంలో ఉన్న ఈ గేయాలను తొలుత పరిశోధించి విశ్వవిద్యాలయాలలో జానపద సాహిత్యానికి స్థానం కల్పించినవారు ఆచార్య బిరుదురాజు రామరాజు. ఆయన పిదప ఎందరెందరో ఈ వాఙ్మయాన్ని అనేక కోణాల నుంచి పరిశోధించడం జరుగుతుంది. ఈ పరిశోధనల ఫలితంగా జానపద సాహిత్యం జానపద విజ్ఞానంగా మారిపోయింది. అయితే, జానపద గీతాలలో మౌఖిక ప్రచారంలో ఉన్నవి మాత్రమే కాకుండా ఆధునిక కవులు రాసినవి కూడా ఉన్నాయి. ఒకప్పటి గేయాలు ఆనాటి సంస్కృతీ సంప్రదాయాలను ప్రకటిస్తే, ఈనాటి గీతాలు అదే బాణిలో ఆధునిక సమాజ నిర్మాణానికి దోహదపడుతున్నాయి.

తిరుమల రమ్యాతిరమ్యంగా జానపదుల హృదయగతమైన నాదాలను అక్షరాలుగా పలికించారు.

ప్రేయసీప్రియులు- ముఖ్యంగా యౌవనంలో ఉన్నవాళ్ళు శరీర సౌందర్యానికి ముందుగా పరస్పరం ఆకర్షిలవుతారు. తమ తమ అందాల గంధాలను చల్లచల్లగా వర్ణించుకుంటారు. తిరుమల అలాంటి వలపును దృశ్యీకరించిన తీరు చూడండి:

ఎన్నెల్లో మల్లెపువ్వు
నవ్వల్లే నువ్వుంటే
నిన్నిడిసి ఉండలేనె
సిన్నమ్మీ! సిలకమ్మీ!
సుక్కల్లో సందమావా
ఓరయ్యా సక్కని మావా
ఏరల్లే గోల సెయ్యకు
గాలల్లే యీలయెయ్యకు
సూపులో సురకలేసావ్
సోకుల్తో గుబులెత్తించావ్

... ... ... ...

సెక్కరంట గుండెలా తోట పాడితే

ఆ పాటలన్నీ నీ కళ్ళలో దాసుకుంటానే[535]

ముందే వెన్నెల తెల్లగా, చల్లగా హాయిని కలిగిస్తుంది. అనురాగాన్ని మరింతగా పూయిస్తుంది. అలాంటి వెన్నెలలో ప్రేయసి మల్లెపువ్వులా నవ్వుతుంది. ఇక ఎంత అందంగా ఉంటుంది! అలాంటి నవ్వుల జల్లుల్లో తడుస్తున్న ప్రియుడు ప్రేయసిని ఎగిసిన అనురాగంతో సిన్నమ్మీ, సిలకమ్మీ అనీ అంటూ ఆమెను విడిచి ఉండలేనని తన సహజమైన ప్రణయాన్ని ఒలకబోస్తున్నాడు. ఇక ప్రేయసి అదే బాణీలో బదులిస్తుంది. తన ప్రియుడు చుక్కలలో చంద్రునిలా ఉన్నాడట. నిజమే మరి; నింగిలో ఎన్ని చుక్కలు ఉదయించినా, కిలుక్కున నవ్వినా చంద్రునికి ఉన్నంత సౌందర్యం తారుణ్యం కనిపించదు. చల్లదనం, తీయదనం ఉండదు. ప్రేయసి గుండెలో ప్రణయభావం ముమ్మరిస్తూ గిర్రున తిరుగుతూ ఉంటే ప్రియుడు నిజంగా చందమామలా కాక మరెలా కనిపిస్తాడు. అంతటితో ఆగలేదు. అవి- 'ఏరల్లే గోల సెయ్యకు' అంటుంది. ఏరు గంభీరంగా ప్రవహించదు. గలగల మనే శబ్దాలతో పరుగులు తీస్తుంది. అలా అతడు గోలచెయ్యడం ఆమెకు సుతరామూ ఇష్టముండదు. మరి గోల ఏమిటి? నిజంగా సెలయేరు గోలకాదు. వయస్సులో మనస్సులో రాపిడవుతూ పైకి ఉబికివస్తున్న ప్రణయగోల. ఇది అలవోకగా అన్న భావననే కాని ఆమెకు ఈ గోల ఇష్టమే. అంతటితో ఆగలేదు. అతని ప్రేమమయి. 'గాలల్లే యాల యెయ్యకు' అంటుంది. హృదయంలో వలపులు చెలరేగుతున్నప్పుడు నోట మాటలూ పాటలూ వచ్చినట్టుగానే ఈలలూ వస్తాయి. అవి వద్దంటుంది. అయితే ప్రియుడు ఆమె చూపులతో చురకలేయడం వల్ల సోకుల్తో గుబులెత్తించడం వల్ల ప్రేమోన్మాదిగా మారి ఈలలు వేస్తున్నాడు. మొదట అలా అంటుందే కాని చివరకు ఆమోదించకుండా ఉంటుంది! అది అతనికి తెలుసు 'సెక్కరంటి గుండెలా తోట పాడితే, ఆ పాటలన్ని నీ కళ్ళలో దాసుకుంటానే' అని తన మమతానురాగాలను చిలుకుతాడు. 'నా దారి పూదారి నా పాట గోదారి' అంటూ మరింతగా చెలరేగుతాడు. 'చిన్న నవ్వు నవ్వినా, సన్నజాజి పూలు పూస్తది' అని ఉప్పొంగిపోతాడు. 'ఆడేడో పైరుల్లో అల్లదిగో సిలక' అని సంబరపడిపోతాడు.

నీ వెంట నే రానా?

నిలువెల్ల దోచుకోనా

నీ కొంగునై పోనా- మేని

రంగునై పోనా-

బంగారపు కొండ మలచి

బ్రహ్మ నిన్ను చేశాడు

ఎర్ర గులాబీల వన్నె

బుగ్గలపై పూశాడు[536]



అంటూ ఆమె పరువం వెంబడి తన ప్రణయ భావాలను పరుగులు తీయిస్తాడు. 'ఒరిగికేగట నిదురపోతే, చూపులోనే స్వర్గముందని' మరింత గాఢంగా భావిస్తాడు. తిరుమల జానపద గేయాలను తనదైన శైలిలో సుందరంగా తీర్చిదిద్దారు. వీటిలో మరొక విశేషముంది. అదేమిటంటే- భర్తను 'మావ' అనడం. అంటే- ఆనాటి నుంచి మేనమామలతో మేనకోడళ్ళ పెళ్ళిళ్ళు జరిగే ఆచారం మన తెలుగునాట ఉంది. కాబట్టి, అదే వరుసలో ప్రేయసి ప్రియుణ్ణి 'మావ' అని పిలవడం, అట్లాగే మేనబావను పెళ్ళి చేసుకున్న మరదలు కూడా భర్తను బావా అని పిలవడం ఒక పద్ధతిగా వస్తున్నది. తిరుమల ఈ విధానాన్ని ముఖ్యంగా 'మావ' అనే శబ్దాన్ని అట్లా ప్రయోగించారు.

తిరుమల జానపద గేయాలు ప్రణయ ప్రవాహ ఒడ్డులను తాకుతూ మాత్రమే పారలేదు. సంకురేయి సంబరాన్ని కూడా తాకాయి.

పేద గొప్ప - నీది నాది భోగి మంటలవ్వాల

పిల్ల పాప - పాలు సేలు వెలుగు పంటలవ్వాల

ఒక్కటై బతకాల సుక్కలై ఉండాల

సుక్కల్లో ఎన్నెల్లు మాటల్లో నిండాలి[537]

అంటూ ఆకాంక్షించారు. సంకురేయి సంబరాన్ని ఆనందంగా అందరు అనుభవించాలంటారు. ప్రతి ఇంటా ముగ్గులు విరియాలంటారు.

తిరుమల రసరాజు. ఏ ధోరణినైనా కలకండగా పలికించి రాయగల సమర్థులు.

## 25. యుద్ధ విముఖత

మనస్సు అన్నిటికీ ప్రధాన కేంద్రం. మనిషి శాంతిగా బతకాలన్నా, అమానుషాన్ని ఆశ్రయించాలన్నా, ఆత్మీయతను పంచాలన్నా, అనురాగాన్ని చిలకాలన్నా- అన్నిటినీ మనస్సే నిర్ణయిస్తుంది. మేధకు అందించి దాని సహకారాన్ని అందుకొని పనులను చేయిస్తుంది.

మనస్సులో ప్రేమభావం పరచుకొని ఉంటే బతుకంతా వెన్నెల సంద్రంలా కళకళలాడుతుంది. ద్వేషం, పగ అడుగుపెడితే జీవితమంతా ఫలితం శూన్యమై రణక్షేత్రంలా శ్మశానవాటికలా ఉంటుంది. పగ, ద్వేషం, స్వార్థం, సంకుచితత్వం ఇవన్నీ కలహానికి ఇంధనాలు. యుద్ధం భగ్గున మండడానికి మూలధాతువులు.

మనిషి పుట్టినప్పటి నుంచీ ఈ అమానవీయ చర్యలు కూడా పుట్టాయి. యుద్ధాలు జరిగి మానవ చరిత్ర రక్తంతో తడిసిపోయింది. చరిత్రకు అందినప్పటి నుంచీ అన్ని యుగాలలో సమరాగ్నులు ప్రజ్వలించిన జాడలు కన్పిస్తాయి రామాయణంలో జరిగిన కలహాలు మానవతను బతికించడానికి జరిగాయి. మహాభారత యుద్ధం ధర్మాన్ని పవిత్రంగా నిలబెట్టడానికి జరిగింది. ఇలాంటివే మరికొన్ని జరిగాయి. ఒక్క తండ్రి బిడ్డలైన దేవతలూ,

దైత్యులూ అన్ని యుగాలలోనూ పోట్లాడారు. కడకు జయలక్ష్మి దేవతలను వరించింది. అపజయం రాక్షసులకు చిరునామా అయ్యింది.

కొందరు రాజులు కొత్తగా సింహాసనాన్ని పొందిన పిదప తమ ఔద్ధత్యాన్ని ప్రదర్శించడానికి, ప్రకటించడానికి, తమ పొలిమేరలను దాటి శత్రురాజ్యాలను గెలుచుకున్నారు. మరికొందరు అట్లా గెలిచి తిరిగి రాజ్యాన్ని వాళ్ళకే ఇచ్చి బాంధవ్యాలు నెరిపారు. ఒకప్పుడు సాగిన యుద్ధాలు ధర్మంగా ఉండేవి. కాలం మారుతున్నకొద్దీ అధర్మం పంచన చేరాయి. వంచనను ఆశ్రయించాయి. అసంఖ్యాకమైన ప్రాణాలను బలి తీసుకున్నాయి.

ఆధునిక కాలంలో యుద్ధం అనేక రూపాలతో సమాజాన్ని కుదిపివేస్తున్నది. భయకంపితం చేస్తున్నది. ఎప్పుడు మృత్యు రూపంలో యుద్ధం కాలుపెడుతుందో ఊహించని వైపరీత్యంలో ప్రపంచం దిగులుపడి ఉన్నది. ఇప్పటివరకు జరిగిన రెండు ప్రపంచ యుద్ధాల్లో అసంఖ్యాకమైన అమాయకులు అసువులను కోల్పోయారు. అధికార కాంక్ష, సామ్రాజ్యాపేక్ష యుద్ధాలకు కారణభూతాలవుతున్నాయి. ప్రాచీనయుగం నుండి ఇప్పటివరకు ఎన్నో నెత్తుటి మరకలు చరిత్రలో మిగిలి శాంతికేతనాన్ని వెక్కిరిస్తున్నాయి. సస్యశ్యామల శోభితమై విలసిల్లి మానవుని శ్రమకు ప్రతీకలై నిలవాల్సిన పంటపొలాలు అణుబాంబుల దాడికి బుగ్గియై మానవతను ప్రశ్నిస్తున్నాయి.

మనిషినీ, సమాజాన్నీ బుగ్గిచేస్తున్న ఈ రణక్రీడ నిలిచిపోవాలని అనాది నుంచి ప్రాజ్ఞులు కృషి చేస్తూనే ఉన్నారు. శాంతి కాముకులు సంఘాలను స్థాపించి యుద్ధ వ్యతిరేకతను ప్రచారం చేస్తున్నారు. కొందరు స్వార్థ త్యాగులు రణక్షేత్రాన్ని కల్యాణ కేదారంగా రూపుదిద్దుతున్నారు. కవులు శాంతినీ, సమతనీ కోరుతూ రచనలు వెలయిస్తున్నారు. నన్నయ నుండి అతినవ్యకవి వరకు కూడా పచ్చని మానవత్వాన్ని చిచ్చుల్లోకి విసిరివేసే ఈ అమానవీయ చర్యను ఎండగడుతూనే ఉన్నారు. శాంతి స్థాపన కోసం ప్రజలను ఉద్యమోన్ముఖుల చేస్తూనే ఉన్నారు. శాంతి సమీరాన్ని ఆకాంక్షిస్తూ సమరాన్ని వ్యతిరేకిస్తూ రచనలు చేస్తున్న తిరుమల తన విశిష్టమైన పంథాలో యుద్ధాన్ని నిరసించారు. ఆయన కవితా చక్షువులకు యుద్ధం తాటకిలా కన్పించింది. ఆయన హృదయంలో నుంచి ప్రశ్న సూటిగా ధాటిగా ఇలా వెలువడింది.

"నీ వెవరు
రక్త సిక్త పటు కేటక తాటకలా
మానవత్వపు కూడలిలో
విలయ తాండవం చేసే నీ వెవరు?[538]

యుద్ధం ఒక తాటకి. రామాయణ కాలంలో తాటకి ఉండేది. ఆమె మారీచుని తల్లి. విశ్వామిత్రుని యజ్ఞాన్ని విధ్వంసం చేయడానికి వచ్చి రామ బాణహతికి తనువు చాలించిన రాక్షస స్త్రీ. ఆమె భీకరాకార. వాల్మీకి తాటకి వికృత స్వరూపాన్ని వర్ణించారు. ఆచార్య



తిరుమల తాటకిని యుద్ధానికి ప్రతీకగా వాడుకున్నారు. ఆమె సామాన్యమైన తాటకి కాదు. రక్తసిక్తపటు కేటకమైంది. అంటే రక్తంతో తడిసి క్రూరంగా కర్కశంగా భయాన్ని కలిగించేటటువంటిది.

యుద్ధం అట్లా తాటకిలా ఉంది. ఆ తాటకి ఉండేది ఎక్కడో కాదు. మానవత్వపు కూడలిలో విలయ తాండవం చేస్తున్నది. ఆ తాండవ కేళిలో ఎందరు చితికిపోయారో మరెందరు వికలత్వం పొందారో చెప్పలేం. అటువంటి ఆ రక్త పిపాసిని తిరుమల ఇలా ప్రశ్నించారు.

క్రిములు రాలే కోరలతో
అహింసా స్వరపేటిని పొడిచి
అట్టహాసంగా ఆనందించే నీవెవరు?[539]

యుద్ధ దైత్యాంగన భీకరంగా ఉంది. ఆమె కోరలు మనుషుల్ని చీల్చుకొని నిరంతరంగా తినడం వలన కోరల పాదుల నుంచి వాటి నిలువెత్తు నుంచి క్రిములు రాలుతున్నాయి. చూడడానికి మిక్కిలి భయం భయంగా కన్పిస్తున్నాయి. అలాంటి వికృతమూ, కలుషితమూ అయిన కోరలతో అహింసా స్వరపేటికను పొడిచివేస్తుంది. మానుషధర్మం మాటలుగా పైకి ఎగిసిరాకుండా చూస్తుంది. గుండెలో జ్వలిస్తున్న అహంకారాన్ని అట్టహాస స్వరూపంగా ప్రకటిస్తుంది.

అట్టహాసాలూ, అరుపులూ మానవత్వాన్ని ముక్కలు చేస్తాయి. ప్రశాంతమైన సమాజ జీవితాలలో ఉప్పెనలను సృష్టిస్తాయి.

విజ్ఞాన హృదయంలో
వెన్నెల కలల కిరణాలు చెరిపి
కల్లోల సంద్రాలు సృష్టించిన నీవెవరు?[540]

హృదయం విజ్ఞానంతో నిండి ఉన్నప్పుడు ఆ హృదయం నుంచి ప్రయోజనాత్మకమైన, ఆనందాత్మకమైన అంశాలు పుడతాయి. వేకువలు పూస్తాయి. వెన్నెలలు వికసిస్తాయి. వెన్నెల కలలు ఉదయిస్తాయి. అవి కిరణాలు అవుతాయి. జీవితాలను రసానందంలో ఈదులాడించేస్తాయి. మనిషిని మనీషి చేస్తాయి. ఆ వేళ మానవుడు దివ్య పురుషుడు అవుతాడు. అట్లా సుకుమారమూ, సుందరమూ, ప్రయోజనాత్మకమూ అయిన కలల కిరణాలను ఆ దానవాంగన నిర్దాక్షిణ్యంగా తుంచివేస్తుంది. లాలిత్యాన్ని తారుణ్యాన్ని ఒలికిస్తున్న జీవితాలలో కల్లోల సంద్రాల గర్జనల లాంటి స్థితిని సృష్టించి ఆశయాల కేతనాలను భళ్ళున తుంచివేసి నిక్కిన ఆనంద శిఖరాలను నిలువునా బద్దలు కొట్టి శ్మశానం చేస్తుంది.

మనిషి నెత్తురును మధువు చేసుకొని గటగటా తాగేసే ఆ యుద్ధాంగనకు పసివాళ్ళనీ, పడచువాళ్ళనీ, ముసలివాళ్ళనీ, స్త్రీలనీ వ్యత్యాసం ఉండదు. చూపుకు అందినదాన్నంతా,

చేతులకీ, కాళ్ళకీ, పళ్ళకీ దొరికినదాన్నంతా నుగ్గు నుగ్గు చేసి తినటమే దాని లక్ష్యంగా ఉంది. పసిమొగ్గలు మరీ లేతగా ఉంటాయి. అలాంటి లేత చెక్కిళ్లను చూసినప్పుడు మానవత్వం ఉన్న భావకుని మనస్సులో ఒక్క రససాగరం ఒయ్యారమైన అలలతో నాజూకుగా కదలుతున్నట్టు అనిపిస్తుంది. అతడు అందాల గంధాలను మురిపెంగా ముచ్చట పడతాడు. గుండెలో క్రౌర్యం నిండినవాడు ఆ లేతబుగ్గలను కసితో బుగ్గి చేస్తాడు ఆదర్శం కోసం విరబూసిన లాలిత్యాన్ని బూడిద చేస్తాడు. అలాంటివాని దౌష్ట్యాన్ని, దురాగతాన్ని చెప్పడానికి మాటలు చాలవు. యుద్ధరాక్షసి అంతకన్నా నికృష్ట. పాలబుగ్గల ఆత్మలను చిదిమి రేపటిని నిలబెట్టడానికి పాటను ధారగా గొంతులను నులిమివేస్తుంది. కళ్ళకు అందంగా కనిపించి ప్రతీకగా ఉన్న పచ్చని గరికపోచలాంటి జీవితాలను కసిగా మండించివేస్తుంది. రేపటికోసం పరిమళాలను అందిస్తున్న, అందుకోసం పరుగిడుతున్న మనిషిని కడతేర్చుతుంది. కుశలంగా, కుదురుగా, తీయగా బతకనీయదు.

హాయి మేసే మనుగడను
పాతాళానికి నెట్టిన పాపీ నీ వెవరు?[541]

మనుషులందరూ ఆనందంగా ఉండాలి. అన్ని సౌఖ్యాలను సొంతం చేసుకోవాలి. ఆదమరచి నిద్రించాలి. తమ జీవితాలలో వెన్నెలలను పుష్పాలుగా భావించుకొని పరిమళాలను పంచుతూ మురిసిపోవాలి. కాని, ద్వేషం లక్ష్యంగా ఉంటున్న యుద్ధ రాక్షసి ఈ కమనీయమైన మనుగడను ఇష్టపడదు కదా! ఆ ప్రేమ మందిరాన్ని ఆ అనురాగలోకాన్ని పాతాళానికి నెట్టివేసి ఆనందం ఉరకలు వేస్తుంది. తన ఉనికిని ప్రదర్శిస్తూ మరింతగా చెలరేగిపోతుంది. ఆమె ప్రపంచ చరిత్రను రక్తాక్షరాలతో నింపినటువంటిది. మండే కొండలు కుచాలుగా ఉండి అగ్నిధారలతో స్వార్థాన్ని పెంచుకుంటున్న అమానుష శక్తి.

అలాంటి యుద్ధ పిశాచిని తిరుమల నిరసించారు.

సమైక్య భానుడస్తమించాడని చెలరేగకు
నీ ఆయువు తీరింది
ప్రతి అణువు తీరింది
నీ గుండె చీలుస్తుంది
శాంతి రథం నీ శవం మీదుగా
సాగి సాగి వస్తుంది
మాట మాట నీకు గోరీ కడుతుంది
మంచికి పట్టం కడుతుంది
అడుగు ముందుకు వేయకు[542]

మనిషిలో సమభావం లేకపోవడం వల్లనే యుద్ధాలు కలుగుతాయి.

వర్తమానం భయానకంగా ఉంది. అణ్వస్త్రాలను సమకూర్చుకున్న దేశాలు యుద్ధం



అంటే ఉవ్విళ్ళూరుతున్నాయి. రాజకీయ పండితుల, ప్రజల హృదయాలలో ఎప్పుడూ భయం భయంగా ఉంటుంది. ఏ వేళ ఏ దేశం చెలరేగి మారణాస్త్రాలను గుప్పిస్తుందోనని ఆందోళనగా ఉంటుంది. ఒక అస్త్రం చాలు ఈ విశాల భూగోళాన్ని బూడిద చేయడానికి. ఒక్క అణుబాంబు చాలు తరాల నుంచి పరిమళిస్తున్న సంస్కృతిని నిలువునా భస్మం చేయడానికి. ఈ భయానక సన్నివేశాలు తిరుమల హృదయాన్ని కదిలించివేశాయి.

పచ్చని పంటల మీద
మంటలు వాలుతున్నాయి[543]

జీవితాలు పచ్చని పైరులు మాత్రమే కావు. అవి పచ్చని పంటలు. వాటి మీద ఆయుధ రూపాలైన మంటలు వాలుతున్నాయి. ఫలితంగా రక్త ప్రవాహం అవుతుంది.

రక్త ప్రవాహాల్లో శిరస్సులు
కెందామరల్లా తేలుతున్నాయి

ఆయుధ ప్రహారాలకు శిరస్సులు తెగిపడ్డాయి. కదలుతున్న రక్తపు ప్రవాహాల్లో అవి ఎర్రని మందారాలలా తేలుతున్నాయి. ఎంత బీభత్సమైన సన్నివేశం. మనిషన్నవాణ్ని నిలువునా వణికించే దృశ్యం యిది.

గగన వృక్షం నుండి పక్షులు
పత్రాల్లా రాలుతున్నాయి[545]

ఆయుధ ప్రయోగాలకు, వాటి విన్యాసాలకు, ప్రవాహాలకు గగనం అనే వృక్షం గూళ్ళల్లో ఉన్న చుక్కలలాంటి పక్షులు ఆకులలా రాలి నేల మీద పడుతున్నాయి. అలా ధరాగోళం మీద పడడం వల్ల దివికీ, భువికీ అంత దూరం ఉండడం వల్ల

వ్యాధుల భయంకర దంష్ట్రల్లో
జీవాలు చూర్ణమై కూలుతున్నాయి[546]

వ్యాధులు వ్యాపించి యుద్ధంలో మరణించగా మిగిలిన ప్రాణులను తమ భయంకరమైన కోరలతో చూర్ణం చేసి తినివేస్తాయి. ఆ వేళ వెలుగుల కదలికలు ఉండవు.

లోకం తిమిరావృతమై
శోకాగ్నిని పానం చేస్తోంది[547]

లోకం చీకటితో నిండిపోతే మనిషికి మనిషికి మధ్య దూరం చూపుకు అందనంత, పిలుపుకు అందనంత పెరిగిపోతుంది. అప్పుడు లోకం గుండెల్లో శోకం పొంగిపొరలుతుంది. ఆ శోకాన్నే తాగివేస్తుంది. మరేముంది కనుక పావనం చేయడానికి. నదులూ, సముద్రాలూ. సరస్సులూ అన్నీ యుద్ధరాక్షసి విసిరిన, ఆయుధాలు కురిసిన విషంతో నిండిపోయాయి. ప్రాణాలను నిలబెట్టుకోవడానికి స్వచ్ఛమైన నీరు లభించటం లేదు.

దశ దిశల మధ్య భరింపరాని, నిలువరింపరాని విచలితమైన నాదం విన్పిస్తుంది. ఆ విషమ పరిస్థితులలో కావ్యాలు కాలిపోతున్నాయంటారు. నీతులు నిస్తేజమవు తున్నాయంటారు కవి. కావ్యాలు కాలిపోవడం అంటే విశ్వశ్రేయస్సు భగ్గున మండిపోవడమే. విశ్వశ్రేయానికి ప్రాణభూతమైన సంస్కృతీ సంప్రదాయాలు తగలబడిపోవడమే. ఈ తరహా సంస్కృతి ధనరాశి బూదిగా మిగిలిపోతే భావితరాలను నడిపించే సంస్కార కిరణాలు ఉండవు. అది కవి చిత్రణ. చిత్రణంలో వలయాలుగా తిరుగుతున్న ఆవేదన.

పసిపువ్వుల మీద నుండి
తుపాకీ పశువులు నడుస్తున్నాయి
అంతా దుర్గమ దుర్గంధ రోదసి
ఈ భూమివాక సౌందర్య శ్మశాన ప్రేయసి
ఏమిటీ? దృశ్యం
ఏమిటి దారుణస్వప్నం
మళ్ళీ ప్రపంచ యుద్ధమూ
క్రూర కిరాత అణ్వస్త్ర మృత్యు నృత్యమా
నో–[548]

బోసినవ్వులు విరబూస్తే అందం ఎంతో చిమ్ముకొని వస్తుంది. మనస్సు నుంచి ముచ్చట అలలుగా దూకుతుంది. అలాంటి వాళ్ళ మీద తుపాకీల పశువులు నడుస్తున్నాయట. ఎంత దారుణం? ఏమి వైపరీత్యం?

ఆయుధాల ఘర్షణల వలన రోదసిలో అడుగు పెట్టలేని దుర్గంధం వీస్తుంది. నేల ఒక సౌందర్య శ్మశాన ప్రేయసిగా మిగిలిపోయింది. ఇలా జరుగకూడదని, ఈ దారుణ దృశ్యం ఒక స్వప్నంగా మిగిలిపోవడమేమిటని ప్రశ్నించారు. తిరుమల యుద్ధ కవితలలో యుద్ధస్వరూపాన్ని, వాటి వలన కలిగే అనర్థాలను తమ నిండైన భావుకతతో వర్ణించారు.

## శాంతి ప్రియత

మనిషి మనస్సు నిలకడగా ఉండాలి. చల్లగా ఉండాలి. తెల్లగా ఉండాలి. అలాంటప్పుడు అతని జీవితమంతా మెరుస్తున్న మానవత్వంలా ఉంటుంది. మంచి గంధంలా ఉంటుంది. మనిషి ఇలాంటి పరిస్థితినీ, వాతావరణాన్ని పదిలంగా కాపాడుకోవాలి. పదుగురికీ పంచాలి. ఆత్మీయతను పెంచాలి. పరిస్థితులు ఎదురు తిరిగినా, సమస్యలు నిలువెల్లా కుదిపివేసినా తన ప్రత్యేకతను కోల్పోకూడదు. తన ఆశయం, వ్యక్తిత్వం, వక్తృత్వం ప్రశాంతంగా ఉంటే పదుగురికి శ్రేయస్సును కలిగిస్తుంది ఈ ప్రశాంతత అనేది మరీ ముఖ్యమైంది. ప్రశాంతతను శాంతి, సమత అని కూడా అంటారు.

సమాజంలో శాంతి స్థానం కోసం జరుగుతున్న కృషి ఈనాటిది కాదు. మనిషి పుట్టినప్పటి నుంచీ జరుగుతున్నదే. చదువుకు చాలా దూరంగా ఉండి జగడాలు మానివేసి



ప్రశాంతతను ప్రధానంగా కామించినట్టు మనకు సాహిత్యం సాక్ష్యం చెబుతున్నది. కాని, ఈనాడు మనకు ఎక్కడా శాంతి రూపం కనిపించదు. ఒకవేళ కనిపించినా అది కురూపిగానో, భయంకరంగానో కన్పిస్తుంది.

అనాది నుంచి క్రాంతదర్శులైన కవులు శాంతి కోసం కలాలు నడిపించారు. తమ కావ్యాలలో వైరుధ్యాల వలన కలిగే అనర్థాలను, అమానవీయ పరిస్థితిని, అనైతిక వికట తత్వాన్ని తీవ్రంగా దుయ్యబట్టారు. శాంతిస్థాపనకు యత్నించారు. మనిషి నుంచి కాలుష్యాలు వెళ్ళిపోవాలని, కాపట్యాలు అంతరించిపోవాలని, నిర్మలమయిన మానవుడు ఉదయించాలని, సమాజశ్రేయస్సుకు బతుకును అంకితం చేయాలని సాహిత్యం కోరుతుంది.

సంస్కృతంలో వాల్మీకి, వ్యాసుడు వంటి తత్వదర్శనులైన కవులు శాంతి దృక్పథాన్ని సూటిగా ఆకర్షణీయంగా చెప్పారు. అంతఃకలహాలు పరస్పర విద్వేషాలు జాతిని బలహీనపరచివేస్తుందన్న సత్యాన్ని ఎలుగెత్తి ప్రకటించారు.

తిక్కనకవి భారతంలో శాంతిని అనేకమారులు ప్రస్తావించారు. ప్రత్యేకంగా శాంతిపర్వం అనే పేరుతో భారతంలో ఒక విభాగాన్ని రచించారు. కురుసభకు రాయబారిగా వెళ్ళనున్న శ్రీకృష్ణునితో ధర్మజుడు "శాంతి యొనర్పుమెమ్మెయిన్"[549] అన్న మాటల్లో పాండవ కులదీపకుని శాంతి మంత్రం బలంగా వర్ణింపబడింది. అహంకారం వలన కలహం జ్వలిస్తుంది. దీని ప్రభావంతో సమాజం అలజడితో కంపించిపోతుంది. మనిషి ఎప్పుడూ కక్ష సాధించాలని మనసులో అనుకుంటుంటే అది మరింతగా భగ్గున మండుతుంది. ఎప్పుడూ ఎవరితోనో ఒకరితో లేదా జీవిత కాలమంతా పోట్లాడుతూ ఉంటే "పామున్న యింటిలో నున్నయట్లుగా"[550] ఉంటుందని తిక్కన భావించారు. "పగయడ గించుట శుభంబదిలెస్స యడంగనే పగన్నప"[551] అని పగచేత పగ నశించదని శాంతి అవతరించదని కవిబ్రహ్మ పాండవాగ్రజుని నోట చెప్పించారు.

ఆనాటి నుంచి కవులు శాంతి సమతలను కోరుతూ సాహితీ సృజన చేసినవారే. ఆధునిక కాలంలో 'శాంతి' కవుల కలాలలో నుంచి ప్రక్రియా వైవిధ్యంతో గానం చేయబడుతుంది. సమాజం నుంచి శాంతి నిష్క్రమిస్తే మిగిలేది శ్మశాన వాటిక.

ఆధునికులలో గుర్రం జాషువా, దాశరథి, సినారె వంటి ప్రసిద్ధకవులు శాంతి ప్రియత్వాన్ని ఆకాంక్షించారు. ముఖ్యంగా దాశరథి శాంతి అనే పేరుతో ఒక సుదీర్ఘమైన ఖండికను రాశారు.

రక్తం నదులై పారకపోతే రాదా రెవల్యూషన్?
బుర్రలు బుర్రలు పగులక సమస్యకు లేదా సొల్యూషన్?
హింసా, యుద్ధం ఔట్‌డేటెడ్ అని నేనంటాను
శాంతి ఒక్కటే మానవజాతికి సరియగు సాల్వేషన్"[552] అంటారు.

మహాకవి జాషువా ఇదే విధమైన శీర్షికతో ఆణిముత్యాలలాంటి పద్యాలు చాలా రాశారు. సినారె అపరిమితమైన కావ్యావరాశిలో మణులలాంటి శాంతి కవితలు బాగా వెలయించారు.

మొదటి రెండు ప్రపంచ యుద్ధాల కాలంలో శాంతి ఆవశ్యకత అవసరమనిపించింది. నానాజాతిసమితి, ఐక్యరాజ్యసమితి వంటి శాంతి ప్రేరక సంస్థలు ఏర్పడ్డాయి. సుందరమైన ఈ ప్రపంచాన్ని అణుబాంబులు సృష్టించే వికృత రూపాల నుంచి దూరంగా ఉంచాలన్న అభిప్రాయం ఏర్పడింది. జరిగిన రెండు ప్రపంచ యుద్ధాలవల్ల అనేకమంది ప్రజలు తమ అసువులను కోల్పోయారు. ఇలాంటి యుద్ధాలు మళ్ళీ సంభవిస్తే భూమిపై ఒక్క మొక్క కూడా మొలకెత్తే అవకాశం లేదన్న నగ్న సత్యాన్ని అందరూ గుర్తించాలి. సామ్రాజ్యవాదం అంతమొందనిదే ఈ ప్రపంచ యుద్ధాలను అరికట్టలేమేమో! క్రితం ఘటనలు తిరిగి పునరావృతం కాకూడదనే సదాశయంతో అందరి మానసాలలో యుద్ధ విముఖత్వం శాంతి ప్రియత్వం వెల్లువలాగా పొంగి వచ్చింది. నెహ్రూజీ హృదయం నుంచి వెలువడిన పంచశీల సిద్ధాంతం విశ్వమానవ జాతికి చల్లదనాన్ని అందించింది.

ఆచార్య తిరుమల స్వేచ్ఛ, సమానత్వం, సౌభ్రాత్రత కోసం తపన పడుతూనే ప్రపంచశాంతి కోసం, అది ప్రచలితం కావడం కోసం చాలా కవితలు రాశారు. ఆయన శాంతిని ఆహ్వానిస్తున్న తీరు ప్రత్యేకంగా ఉంది.

వెలిగించు శాంతి దీపం ప్రతి హృదయంలో
ప్రభవించు దైవరూపం ప్రగతి పథంలో
జనావళికి మోదము నీవై
మహా విజయ నాదము నీవై
శృతి చేసిన జీవనరాగం చరితార్థం కాగా[553]

తిరుమల ప్రతిదాన్ని వాచ్యం చేసి చెబుతారు. అందుకే ఆయన కవిత సహృదయుని గుండెలో అడుగుపెట్టి అనేక ఆవర్తాలను సృజిస్తుంది. ఈ కవితలో మనిషి కనిపించడు. మనస్సు అగుపించదు. మనిషిలోని మనస్సుకు ఉన్న సంకేతాలు కనిపిస్తాయి. వాటిని ధ్వనింపజేయాలి. ఆ ధ్వని ప్రసారాలకు ఒక రూపాన్ని కల్పించాలి. ఆ రూపాలకు ఆశయాల పథాలను నిర్దేశించాలి. అప్పుడుగానీ ప్రజ్వలన స్వరూపంలో ఆవిష్కృత మవుతుంది.

కవి శాంతి దీపాన్ని వెలిగించమంటున్నారు. శాంతిని దీపంగా వెలిగించడమేమిటి? సహజంగా చీకట్లను తరిమికొట్టేందుకు తైలం, వత్తి వంటి వాటితో దీపాన్ని వెలిగించవచ్చు. విద్యుత్తుతో దీపాలను వెలిగింపవచ్చు. అది సులభంగా సాధ్యమయ్యే విషయం. మరి శాంతి దీపాన్ని వెలిగింపజేయడం అంటే ఎట్లా? దానికి అవసరమైన ద్రవ్యాలు ఏవి? చమురు ఏది? వత్తి ఏది? కవి తానుగా సమాధానం చెప్పరు. దాన్ని పాఠకుల ఆలోచనకు అందిస్తారు. చదువరిలో ఒక స్పందన పుడుతుంది. స్పందన ఆలోచనకు వేదికగా నిలిచి ఉంటుంది. శాంతి దీపం వెలగడానికి అవసరమైన సరుకులు అందుతాయి. మనిషికి



మనిషికీ మధ్య దూరాన్ని తీసివేయడం, మనిషీ, మనస్సూ పరస్పరాశ్రయంగా ఎదగడం, విషోరగాల వంటి విద్వేషం విషం కక్కకుండా మనిషి చూడటం, ఆత్మీయతలోని అవసరమైన గంథాలను హృదయంతో పంచడం, అందరినీ ఆత్మీయంగా గుండెకు హత్తుకోవడం ఇలాంటి వాటితో శాంతిదీపం నిర్మితమవుతుంది. కవి భావించిన శాంతిదీపం ఇదే. అప్పుడు ప్రతి మనిషీ దైవస్వరూపంగా ఉండగలుగుతాడు. అందరు మానవులు దేవతలుగా ఉంటే ప్రగతి మరింతగా విరగబూస్తుంది. ఆ పచ్చని వేళ జనావళికి ఆమోదంగా మహా విజయనాదంగా మనిషిని ఎదగమని చెప్పారు. అప్పుడు శ్రుతి చేసిన జీవనరాగం చరితార్థం అవుతుందని అంటారు.

తిరుమల శాంతికి నిర్వచనరూపమైన అభివ్యక్తిని ఇట్లా ప్రకటించారు.

వేదాల శాస్త్రాల వేలాది సూత్రాల
సారమగు పదముల సఫలమగు శాంతి
క్రమశిక్ష పరిరక్ష లక్ష్య సాధన దీక్ష
జనులందు వర్ధిల్లి చరిత ధన్యతబడయ[554]

శాంతి అనేది ఏదో పడికట్టు మాట కాదు. భౌతిక దృక్పథానికి సంబంధించిన సూత్రవృత్తి కాదు. అది వేదాల శాస్త్రాల వేలాది సూత్రాల సారం. సాఫల్యతను సంధించేది. క్రమశిక్షణను పరిరక్షించి దీక్షతో లక్ష్యాన్ని సాధించిపెట్టే ఒక తేజో వలయం. అది జనులలో ఎదుగుతూ చరిత్రను ధన్యం చేస్తుంది. తిరుమల శాంతికి వేదరూపమైన ప్రతిపత్తి ఉందని ఎలుగెత్తారు. ఆయనలో ఉన్నది జీవనదిలాంటి భావుకత. వస్తువు ఏదైనా దాన్ని శిల్పంపు తోటలా

అదే అదే నేను కోరుకున్న నవ్య వసంతం
అదే నా యశోలతలు అల్లుకున్న దిగంతం[555]

స్థిర రూపాన్ని ధరించుకున్న శాంతిని నవ్య వసంతంగా భావించారు. కొత్త చివుళ్ళతో పూలతో సువాసనలతో ఉన్న తరుల తాదులు వసంతం రెక్క విప్పడానికి ప్రేరణ అయినట్టుగానే ప్రేమ అనురాగం కాలుష్యం లేకపోవడం వంటి సంప్రదాయాలతో ఉదయించేది శాంతి తత్త్వం అని కవి భావన. అదే దిగంతాలదాకా అల్లుకున్న యశోలతలుగా అభివర్ణించారు.

పంచశీలతో శాంతిదూతగా
నిలిచిన పండితనెహ్రూ[556]

పంచశీల సిద్ధాంతాల అవతరణకు నెహ్రూజీ భగీరథుని లాంటివారు. పంచశీలలో ఉన్నవి కేవలం అక్షరాలు కావు. అవి ప్రపంచాన్ని అభిమంత్రించే నాదాక్షరాలు. అక్షరభారతికి ప్రియమైన స్వరాలు. అవి పుట్టిన క్షేత్రం ఎర్రగులాబీ నీడలలో తడిసిపోయిన వసంతకేదారం. అందుకే తిరుమల నెహ్రూజీని శాంతి బీజప్రదాతగా గుర్తించారు.

తిరుమల శాంతిని పలురీతులుగా వర్ణించారు. ఆయన దేన్నీ పొడి మాటలతో చెప్పరు. మనిషి మేధకు ఆలోచనను ప్రేరేపిస్తారు. ఒక సాఫల్యత సమకూరేటట్టు సరళరేఖలు రాస్తారు.

దారి తెన్ను లేని గగనసీమలలో
జీవితాల కేతనాలు ఎగరాలి
ఆ నీడల్లో వెలుగుమేడ వెలియాలి[557]

గగన సీమలలో ఒక దారి అంటూ నిర్దేశితమై ఉండదు. గ్రహాలగతులూ, నక్షత్రాల నడకలూ చలనశీలత్వాన్ని కలిగి ఉంటాయి. సూర్యచంద్రులు అలుపెరుగకుండా పయనం సాగిస్తూనే ఉంటారు. అలాంటప్పుడు ఆకాశమార్గాలు స్థిరంగా ఉండవు. రోజూ వాటి రేఖలు మారుతూ ఉంటాయి. అవి ఆటుపోట్లను దాటేసి యుద్ధం లాంటి జీవితంలో జయకేతనాలు ఎగరేయబడాలి. అప్పుడు కాని జీవితాలలో ప్రశాంతత స్థిరపడుతుంది. మనుగడలో నిలకడగా ఉన్నప్పుడే సమాజం ప్రశాంతంగా ఉంటుంది. అదే మనం పదే పదే కొలిచే శాంతి. శాంతి నీడలలో ఎగసిన మేడలు మనం భావించిన ప్రగతికి సోపానాలు. శాంతి ఏర్పడడం వలన కలిగే శ్రేయస్సును చాలా గాఢంగా ఆకాంక్షించారు.

పావురాల తెలిరెక్కల సవ్వడిలో
ఫణిరాజుల మైమరచి ఆడాలి
ఆ ఆటల జాబిల్లి నవ్వు పండాలి[558]

తెల్లని పావురాలు శాంతికి సంకేతం. అది నింగిదారులలో సాగుతున్న ఆ విహంగం తెల్లని రెక్కల సవ్వడుల కమనీయమైన నాదాలకు ఫణిరాజులు కూడా ఒళ్ళు మరచి ఆడాలి. ఆ ఆటలలో జాబిల్లి నవ్వులు ఫలించాలి అంటారు కవి. ఇక్కడ ఫణిరాజులు అంటే విషపూరితమైన హృదయమున్న దుర్మార్గులని కవి తలంపు.

చేయి చేయి కలసినప్పుడు, అడుగులో అడుగులు పడినప్పుడు, మాట నుంచి మాట ఎలుగెత్తినప్పుడు ఐక్యం వర్ధిల్లుతుంది. కులమతాలు, వేరునినాదాలు, అంతఃకలహాలు లేనప్పుడు శాంతి అధరాల మీద చిరునవ్వులు తొణికిసలాడుతాయి. తిరుమల ఇదే భావాన్ని సరళమైన రీతిలో ఎలుగెత్తారు.

ధనవంతులు పేదవారనే తేడాలొద్దు
కులమతాల తెరలు పొరలు అసలే వద్దు
పిలవండీ శాంతిదేవిని రా రమ్మని
తెలపండీ ఐకమత్యం మా సొమ్మని[559]

అనటంలో శాంతి రూపంలో ఐకమత్యపు ప్రయోజనం కన్పిస్తుంది.

తిరుమల చేసిన శాంతిగానం ఒక ప్రత్యేకతను సంతరించుకొన్నది.



అందమైన సమాధిలో
ఉంటుందా శాంతి
శిథిలమైన ఆలయాన
లేకుండా కాంతి![560]

సమాధి అందం వేరు. శాంతి సౌభాగ్యం వేరు. సమాధి సుందరంగా నిర్మితమైనంత మాత్రాన అందులో శాంతి ఉంటుందా! ఉండదు. ఆలయం శిథిలమయినంత మాత్రాన దైవపరమయిన కాంతి ఉండకుండా పోతుందా! అని తిరుమల భావించడం ఉచితంగా ఉంది. అట్లాగే శాంతిని మరోవిధంగా చెప్పారు.

ఈ ప్రపంచంలో నువ్వు
సూదిలా ఉండి గుచ్చుకోకు
దారంలా అందరినీ
ఒక్కటిగా కలుపు
నీ వల్లే ప్రపంచం ఒక మాల
నీ వల్లే ప్రపంచం ఒక జ్వాల[561]

మనిషి సూదిమొనలా తగిలితే ప్రపంచం రణక్షేత్రం అవుతుంది. దారంలా కలిపితే మాల అవుతుంది. విరుద్ధంగా ప్రవర్తిస్తే జ్వాల అవుతుంది. తిరుమల జ్వాలకంటే మాలనే ఆదరించారు. స్థిరపడిన సమైక్యంతోనే శాంతిరెక్కలు విచ్చుకుంటుందని భావించారు.

## 26. స్త్రీ చిత్రణం

పురాణకాలం నుంచీ స్త్రీకి మగవారితో సమానమైన స్థానం కల్పింపబడలేదు. సంప్రదాయాలు, ఆచారాలు, కట్టుబాట్ల పేరిట స్త్రీ ఇంటివరకే పరిమితం చేయబడింది. ఆమెకు 'కార్యేషు దాసీ' అంటూ కొన్ని పరిమితులు, సిద్ధాంతాలు కల్పించి పరదాచాటుకు పరిమితం చేయడం జరిగింది. పాతివ్రత్యం పేర మహిళలకు ఒక కితాబు ఇవ్వబడినప్పటికీ సాంప్రదాయికమైన పొలిమేరలలో ఆమె కొట్టుమిట్టాడుతుండేది. అంతెందుకు, ఆధునిక సమాజంలో కూడా స్త్రీ అణచబడుతూనే ఉంది. విలాస వస్తువుగా పరిగణింపబడుతూనే ఉంది. స్త్రీ అభ్యున్నతికై అమలు పరచబడుతున్న శాసనాలు కూడా దిక్కుతోచని పరిస్థితులలో ఉసూరుమంటున్నాయి. పురుషాధిక్యపు దురహంకారం కొనసాగుతూనే ఉంది. వరకట్నం లాంటి అనైతిక సంప్రదాయాలు ఒళ్ళు విరుచుకొని వికృతహేలను సృష్టిస్తున్నాయి. అనాథ స్త్రీ జీవితాలలో అగ్నిజ్వాలలను ప్రజ్వలింపజేస్తున్నాయి.

అనాది నుంచీ పాశవిక ఉక్కు చట్టాలలో నలిగిపోతున్న మహిళాలోకం పాశ్చాత్య దేశాలలో తమ ప్రత్యేకతనూ, విశిష్టతనూ, చాటుకోవడానికి ఉద్యమాలు చేపట్టారు. పందొమ్మిదో శతాబ్దంలో తిరుగుబాటు బావుటాను ఎగరేసింది.[562] ఈ విప్లవధోరణి

ప్రపంచ మహిళాలోకాన్ని బాగా ఆకర్షించింది. భారతదేశంలోనూ ప్రభావం చూపింది. అంతేకాకుండా, సంస్కరణ ఉద్యమాలకు నాంది పలికింది. సాహిత్యాన్ని ప్రభావితం చేసింది.

స్త్రీ జనాభ్యుదయానికి తొలుత సంస్కరణ ద్వారా పిదప సాహిత్యం ద్వారా కృషి చేసిన తేజోమూర్తి కందుకూరి. ఆయన మార్గం అనంతర కవుల రచనల మీద ప్రగాఢ ప్రభావాన్ని చూపింది. భావ కవిత్వంలో ప్రేయసిగా భావింపబడినప్పటికీ తదుపరి వెలువడిన అభ్యుదయం, విప్లవం వంటి సాహిత్య ధోరణులలో స్త్రీ విముక్తికై అనువైన జీవన విధానాలు చెప్పబడినాయి. ఇరవయ్యో శతాబ్దం చివరి దశకంలో స్త్రీ వాద కవిత్వం బలమైన ఉద్యమ స్వరూపంలో అవతరించింది. కవయిత్రులే కాకుండా పురుష రచయితలు కూడా స్త్రీ స్వేచ్ఛా జీవనానికి తమ కలాలను కదిలించారు. గళాలను విప్పారు.

ఆచార్య తిరుమల స్త్రీ పరమైన కవితలు కొన్ని రాశారు. స్త్రీని పవిత్రమూర్తిగా అభ్యుదయశక్తిగా వర్ణించారు.

ఆడది అమ్మరా
జన్మనిచ్చే తల్లిరా
పాలిచ్చి పెంచే ఆ తల్లినే
కామంతో కాటేస్తావా?
స్వార్థానికి బలి చేస్తావా?
అక్కా చెల్లి, వదిన, మరదలు
వంశము నిలిపే అర్ధాంగీ–ఎన్ని రూపాలో
ఆడదానికి ఎన్నెన్ని రూపాలో
రప్పించకురా కలికి కన్నీరు
రగిలించకురా స్త్రీ హృదయం
అదవి అమృతమూర్తిరా
ఆడది అపర దేవతరా
ఆమెను గౌరవించు దేశమే
స్వర్గధామమై వెలుగునురా![563]

ఆడది జన్మనిస్తుంది. పాలిచ్చి పెంచుతుంది. కాబట్టే ఆమె జనని. లాలించే తల్లి. అలాంటి మాతృమూర్తిని కామంతో కాటువేస్తే, స్వార్థానికి బలిచేస్తే అందే ఫలితం స్మశానమే. స్త్రీ ఒక్క రూపంలో ఉండదు. ఆమె తల్లి, చెల్లి, అక్క, వదిన, మరదలు, అమ్మమ్మ, నాన్నమ్మ వంటి రూపాలలో ఉంటూ తన వాళ్ళనూ, తనచుట్టూ ఉన్న సమాజంలోని వాళ్ళనూ అలరిస్తుంది. మరీ ముఖ్యంగా వంశాన్ని నిలబెట్టే అర్ధాంగి. అలాంటి స్త్రీ మూర్తుల కళ్ళ వెంబడి కన్నీళ్ళు తెప్పించవద్దనీ, స్త్రీ హృదయాన్ని రగిలించకుమనీ కవి సందేశమిచ్చారు. కన్నీళ్ళు తెప్పిస్తే కలకంఠి కంట కన్నీరొలికిన తొలగిపోవురా సిరులు' అని అంటారు.



స్త్రీ రక్తమాంస నిష్ఠమైన స్వరూపం మాత్రమే కాదు. ఆమె అమృతమూర్తి. ఆమె హృదయంలో ఎన్నో చలివేంద్రాలు, ఎన్నో వెన్నెల ప్రవాహాలు, మరెన్నో మధుధారలు. ఇవన్నీ పురుషుణ్ణి రసలోకాలలో విహరింపజేయడానికే. అంతేకాదు, మహిళ అపరదేవత. ఆమెను గౌరవిస్తే, ఆరాధిస్తే సంసారమే కాదు, దేశం కూడా స్వర్గధామమవుతుంది.

స్త్రీ శక్తి స్వరూపిణి అని అనాది నుంచీ చెప్పబడుతుంది. స్త్రీ అనే పదంలో సత్యతామ రజోగుణాలు మూడు ఉన్నాయనీ, అవి అవసరమైన వేళ తమ అస్తిత్వాన్ని ప్రదర్శిస్తాయని విజ్ఞులు చెబుతారు. వాళ్ళలోని రాజసగుణం జ్వలించినప్పుడే ఉద్యమాలు తీవ్రమైన స్వరంతో విస్తరించి ఫలితాలను సాధిస్తాయి. తిరుమల ఈ వైఖరిని చాలా తెలిసినవారవడం వలన 'మార్చింగ్ సాంగ్' లాంటి గీతాన్ని రాశారు.

కదిలింది కదిలింది నారీ లోకం
ఆ కదలికే ప్రగతి కావ్య పుణ్య శ్లోకం
వసంతమై నిశాంతమై
అనంతశాంతి తరంగమై
చెట్టు నీడ చెమ్మ చెక్కలాటలా
చెట్టుమీది కోయిలమ్మ పాటలా
పరువాల సెలయేటి పరుగులా
ఆటు–పోటు అలల నురుగులా
కవ్వించే లేమల్లి!
వాకిట ముగ్గుల్లో సిగ్గులా
చెలుని చెంత ఎర్రబడిన బుగ్గలా
పసిపాపల మురిపాల వెల్లిలా
ఇంటిసిరుల వెలుగు పసిడి తల్లిలా
కనిపించె భాగ్యవల్లి
పురుషాంకృతి కూల్చే ఉచ్చులా
సప్త వ్యసనాల పాలి చిచ్చులా
చదువు సంపాదనల ప్రథమ వ్యక్తిలా
ఓర్పు నేర్పు తీర్పుల సంఘశక్తిలా[564]

నారీలోక కదలికలు ప్రగతి కావ్యానికి పుణ్యశ్లోకాలు.

స్త్రీ మూర్తులు బాల్యంలో చెట్టునీడన చెమ్మచెక్కలాడతారు. చెట్టుమీది కోయిలమ్మలలా గొంతులెత్తుతారు. సెలయేటి పరుగులతో శోభను పెంచుతారు. ఆటుపోటులతో పుట్టుకొచ్చే అందమైన నురగలా, మల్లెల సౌందర్యంలా స్వచ్ఛంగా ఉంటారు. అంతేకాదు, పురుషాంకారాన్ని కూల్చే ఆయుధంలా, సప్త వ్యసనాల పాలిటి ఆటంకంలా, ఓర్పు నేర్పు తీర్పుల సంఘశక్తిలా, స్త్రీ మూర్తులు ప్రవర్ధిల్లుతారన్న కవి అభిప్రాయం ఉజ్వలంగా ఉంది.

అలాంటి అమృతమూర్తిని 'ఆడది ఆటబొమ్మ కాదురా, ఆడది కీలుబొమ్మ కాదురా' అంటూ 'ఆ దేవతనే తెలుసుకోరా' 'సోదరభావం కలిగించు స్త్రీని గౌరవించు'మని సందేశమిచ్చారు. కొట్టిపారేయడానికి, మెతుకుల కోసం ఎగిరొచ్చిన కాకులు కాదు ఆడవాళ్ళు, పాదాలు తాకే సముద్రాలు' అని లోతైన భావాన్ని వివరిస్తారు కవి. అలాంటి స్త్రీ మూర్తిని అవగాహనకు తెచ్చుకొని అర్చించమని అంటారు కవి. అలాకాక ఆమె యెడల క్రౌర్యాన్ని ప్రదర్శిస్తే చరిత్ర పుటలు నెత్తుటి మరకలను రాసుకొని యుగాల వరకూ మగవాని కీచకత్వాన్ని ప్రకటిస్తాయి.

అబల లనుచు స్త్రీల నవమాన పరచెడు
పురుష శక్తి ఘనత పుడమి యందు
చరిత పుటల నెత్రు మరకలలో చూడు
పరమ సత్యసూక్తి తిరుమలోక్తి[565]

అట్లాగే,

ఆడ గుండెను నావగా నమరజేసి
అగ్నిసాగర మీదగా ఆశపడకు[566]

అని పురుషలోకానికి సత్యాన్ని చెబుతారు.

అసలు సిసలైన కార్మికులనిన స్త్రీలె
స్త్రీలు పనిచేయకున్నచో శ్రీలు లేవని[567]

ఘంటాపథంగా చెబుతారు.

ఆడదిల్లాలు కాదేని బీడునేల
పురుషుడాడది లేనిచో మోడు నీడ[568]

ఆడది ఇల్లాలు కావాలన్నది కవి అభిమతం. లోకంలో అందరు స్త్రీలు ఇల్లాళ్లే అయినప్పటికీ ఇల్లాలు అనే గౌరవం కొందరికే వర్తిస్తుంది. ఇల్లాలు ఒక పురుషుడికి భార్య అని మాత్రమే కాదు. ఇల్లుకు ఆలి అంటే ఇంటికంతా స్త్రీ అనే అర్థం స్ఫురిస్తుంది. భర్తకు అర్ధాంగిగా, సంతానానికి అమ్మగా, కోడళ్ళకు అల్లుళ్ళకు అత్తగా, మనుమలకు, మనుమరాళ్ళకు అమ్మమ్మ నాన్నమ్మగా ఆమె లాలనా, పాలనా ఉంటుంది. 'ఆలు' అనే మాటకు భార్య, గోవులు, స్త్రీ[569] అర్థాలు నిఘంటువులో ఉన్నాయి. ఈ మూడింటికి లోకంలో ఎంత గౌరవం ఉందో విజ్ఞులకు తెలుసు. నిజంగా ఆడది ఇల్లాలు కాకపోతే ఇల్లేకాదు అంతా బీడునేల. ఆడది లేకపోతే పురుషుని జీవితమంతా పచ్చదనం తొంగిచూడని బీడునేలలా ఉంటుంది. శబ్దమాంత్రికులైన తిరుమల ఇన్ని అర్థాలతో 'ఆలు' పదాన్ని ప్రయోగించి తమ లోకజ్ఞతను, దక్షతను ప్రకటించారు.

తిరుమల సమాజ వికాసానికి స్త్రీ మూర్తి దోహదపడుతున్న అంశాలను కవితాత్మకంగా వెలువరించారు.



## 27. అక్షర సన్నుతి

'నక్షరం అక్షరం' అంటే నాశనం లేనిదని అర్థం. ఎప్పుడూ ఉండేది అన్ని కాలాలను నడిపిస్తుంది. అన్ని లోకాలను వెలిగిస్తుంది. ఆత్మానందాన్ని పంచుతుంది. భౌతికావరణానికి సొగసులు దిద్దుతుంది. అంతకంటే ముఖ్యంగా భగవత్ తత్వాన్ని ప్రకటిస్తుంది. తానే ఆ మూర్తిగా మారిపోయి ఆత్మసౌందర్యాన్ని పెంచుతుంది. అనురాగ మందిరాన్ని నిలుపుతుంది. భూమికీ రోదసికీ మధ్య ఒక అనిర్వాచ్యమైన అనుబంధాన్ని సంధిస్తుంది. కదులుతున్న గ్రహాల చలనతత్వాన్ని వివేచిస్తుంది. కాల మాంత్రికుని బహురూపుల వేషాలను కనిపించని సంకేతాలుగా ప్రకృతికీ, ప్రకృతిలోని భాగమై, అదే ప్రకృతిని ఆరాధిస్తున్న మనిషికి అందజేస్తుంది.

అక్షరం లోకంలోని అన్ని పార్శ్వాలను సఫలం చేస్తుంది. బోధనకు వాహికగా, ఉపదేశానికి ఊతగా, సందేశానికి సారథిగా ఉంటుంది. యావత్ ప్రపంచాన్ని వెలిగించే సాధనంగా తనను విస్తృతపరచుకుంటుంది.

అక్షరం భాషగా, కవితగా, కథగా, నవలగా, నాటకంగా అనేక రూపాలు ధరిస్తుంది. ఒక్కో ప్రక్రియకు ఒక్కో విధమైన మానసిక చర్యను ఒక శాసనంగా నిలుపుతుంది.

అక్షరం కవి ఉత్తేజితమైన భావానికి శైలి రూపంలో, అభివ్యక్తి స్వరూపంలో సహాయపడుతుంది. కవులలో కొందరు అక్షర శిల్పులుగా, అక్షర రమ్యతను పొందిగినవాళ్ళుగా, శబ్దవిదులుగా పేరుతెచ్చుకోవడం దీనివలనే. తెలుగులో కొందరు అక్షరం శీర్షికతో వివిధ ప్రక్రియలలో రచనలు చేశారు.

ఆధునికులలో ఆచార్య తిరుమల అక్షర స్వరూపాన్ని ఆత్మీయం చేసుకున్న అక్షరశిల్పి. వస్తువును అందుకోవడం, భావుకతతో మేళవించడం అక్షర నిర్మాణమైన శైలిని రూపొందించడం కవితగా రసజ్ఞుల గుండెలలోకి నేరుగా సంధించడం ఆయన ప్రత్యేకత.

'సృష్టి దృష్టి' శీర్షిక గల కవితలో సృష్టితత్వం, దృష్టితత్వం చెప్పడంలో ఆయన నిశిత పరిశీలనాదృష్టి, అక్షరశక్తి కన్పిస్తుంది.

క్షర విశ్వం మీద అక్షర సౌదామినీ చలనంతో
పొల్లు దేహాల హల్లులపై
ప్రాణ ప్రతిష్ఠ చేయబడుతుంది[570]

విశ్వం క్షరమైయ్యేది. ఎన్ని సోయగాలతో ఉన్నా, ఎన్ని విలువలతో ఒప్పుతున్నా, మరెన్ని ఆశయాలను రాలుస్తున్నా ఇదంతా కొంతకాలం వెలిగే జీవనతత్వ సంగీతనాదమే. ఇదంతా అశాశ్వతత్వాన్ని లీనం చేసుకొని ప్రతిఫలించేదే. బుద్బుదమైన ఈ విశ్వం మీద అక్షరాల మెరుపు తీవెల చలనంతో పొల్లు దేహాల హల్లుల మీద ప్రాణ ప్రతిష్ఠ చేయబడుతుందని తిరుమల భావించారు. పొల్లు దేహాలు అంటే సంపూర్ణంగా మూర్తి కట్టని రూపాలు. నిండుగా కుదురుకోని జీవితాలు. ఇలాంటి వెలితి బతుకులలో అక్షరం

మెరుపుల కదలికలను అచ్చొత్తి వాళ్ళ ముంగిళ్ళలో సుప్రభాతాన్ని పలికిస్తాననేది కవి ఆశయం. ఇందులో సృష్టిని గాఢమైన దృష్టితో చూచి అక్షరం విలువ ఎలాంటిదో మనకళ్ళ ఎదుట నిలపడం కవి విశేష ప్రజ్ఞకు చిక్కని తార్కాణ.

కవికి అక్షరాలు అనేక రూపాలలో, గుణాలలో కన్పిస్తాయి.

అక్షరాలు పలుకుతున్నాయి
అమృతాన్ని చిలుకుతున్నాయి

అక్షరాలకు ఆత్మ ఉన్నప్పుడే పలుకుతాయి. అప్పుడే అమృతాన్ని చిలుకుతాయి. అక్షరాలకు ఆత్మ ఉండడం అంటే ఏమిటి? అన్న మీమాంస తలయెత్తుతుంది. కవి తన సహజమైన, మధురమైన ఊహలలోంచి అక్షరాలను అమర్చినప్పుడు వాటి నుంచి ఒక నాదం ప్రవహిస్తుంది నిశ్శబ్దంగా. అలా జరిగినప్పుడు మాత్రమే ఆ అక్షరాలు పలుకుతాయి. ఆ పసిడి పలుకుల నుంచి అమృతం పొంగుతుంది.

మరొకచోట తిరుమల

ఇది అక్షరాలతో చెక్కిన రసాలయం
రసాల కిసలయాలు మేసిన స్వరాలయం
... ... ... ...
ఈ భూమి మీకొక
పుస్తకమై విచ్చుకుంటుంది
అక్షర తత్త్వాన్ని మీ కళ్ళల్లో పిండి
అనంత భ్రమణంలో లీనమవుతుంది[572]

ఈ కవితా పంక్తులు 'అనంత భ్రమణం' కవితలోనివి. ఈ భ్రమణంలో కవి కళ్ళకు సాహిత్యపు మనసు కళ్ళకు అనేకం కనిపించాయి. అవి ఆకాశమూ కావచ్చు. అనురాగ కేదారమూ కావచ్చు. భావోద్యానమూ కావచ్చు. దీపతోరణ కళా నిలయమూ కావచ్చు. రసాయలం అనేది సాహిత్యం మాగాణం. అది అక్షరాలతో చెక్కబడి నిర్మింపబడింది. అంతేకాదు, రసాలం అంటే మామిడి వృక్షం. మామిడిపళ్ల రసాన్ని చిమ్ముతూ తీయదనంతో దేహాన్ని మాధురీ దర్శనం చేయిస్తుంది. ఆ రసాలం చివుళ్లను మేసిన కోయిలలకు స్వరాలయం. స్వరం అంటే అక్షరం కదా! భూమి చాలామందికి మట్టిలా కన్పిస్తుంది. కొందరికి మాత్రమే భావుకసీమలా తోస్తుంది. భావుకసీమలో నుంచి పుట్టిన పుస్తకంలా అనిపిస్తుంది. ఆ పుస్తకం మరేదో పదార్థంలో రూపొందింది కాదు. అక్షరాలతో పరిమళమైందే. అలాంటి అక్షరతత్వాన్ని రసజ్ఞుల కళ్ళల్లో చిలకరింపజేస్తుంది. అనంత భ్రమణంలో విలీనం చేయిస్తుంది. భ్రమణం అనేది లేకుంటే బుద్ధిపొరదు. రసలోకపు సృష్టి జరగదు.

తిరుమల అంతటా, అన్నింటా అక్షరమే కన్పిస్తుంది. అంతేకాదు, విశ్వమే అక్షరంలో ఒదిగి ఉన్నట్టు భావించారు.



నిజానికి
ఈ క్షర విశ్వమంతా అక్షరంలో ఉంది
అది అణువుగా, ఆకాశంగా, రోదనగా, రోదసిగా
దేహంగా, మోహంగా, దాహంగా-
ఆనందంగా, ఆత్మగా, ఆత్మీయంగా
దృష్టిగా, సృష్టిగా, కాలంగా, పదజాలంగా విస్తరించి ఉంది?
అక్షరం విధి? ఆత్మ కైవల్యనిధి
మనిసికి దొరికే పెన్నిధి[573]

అక్షరంలో అణువు, ఆకాశం, రోదన, రోదసి, దేహం, మోహం, దాహం, ఆనందం, ఆత్మీయం, దృష్టి, సృష్టి, విధి, ఆత్మకైవల్య నిధి అన్నీ ఉన్నాయి. వీటిలో విధి, ఆత్మకైవల్యనిధి అనేవి పారలౌకికమైన విషయాలు. మొదట అక్షరాల నుంచి ఇవే అవతరించిన ఆధ్యాత్మిక నిధులు. కవికి అక్షరం పరిమళద్రవ్యంలా అనిపించింది. మరొకమారు అక్షరాలు సెలయేరులా అగుపించాయి.

తిరుమల అక్షరం కవితలు రాయడమే కాక 'అక్షరాగ్ని' పేరుతో కవితా సంపుటి కూడా ప్రచురించారు. ఇందులో అక్షర విజేత, అక్షరాగ్ని అనే కవితలున్నాయి.

అక్షరాలతో జ్ఞానాన్ని కొలిచి
లోకం ఒడిలో పోస్తున్న వ్యాపారిని నేను[574]

అనే కవి ఆశయం ఉదాత్తంగా ఉంది.

పడగ విప్పి అక్షరం కాటేస్తే
పండితుడే కాదు
పామరుడూ అమరుడవుతాడు[575]

సర్పం కాటు వేస్తే మరణించడం తథ్యం. అక్షరం పడగ విప్పి కాటేస్తే మేధా-మనస్సూ- వీటితో దేహం నిండా స్పందన ఉబుకుతుంది. దీనితో పండితుడూ, పామరుడూ ఇద్దరు అమరులవుతారు. ఇది కవి చైతన్యం భావుకతకు అద్దం పట్టినట్టుగా ఉంది.

పద్య ప్రక్రియలోనూ కవి అక్షరాన్ని ఆరాధించిన తీరు ఆత్మానందాన్ని కలిగించేటట్టుగా ఉంది. అక్షరశక్తి అనంతమైంది. కవి భావించిన తీరు లోకోత్తరమైంది.

అక్షరమొక్క చిత్రమయి అందము చిందును నేత్రభిత్తిపై
అక్షరమొక్క శిల్పమయి పొరతలందును దేవభూమిపై
అక్షరమొక్క గీతమయి హాయిగ సాగును జీవవేదిపై
అక్షరమొక్క కావ్యమయి ఆత్మలనేలును కాలవేదిపై[576]

అక్షరం చిత్రమవుతుంది. చిత్రకారుడి కుంచె వేసిన చిత్రంకంటే అక్షరచిత్రం అందంగా

ఉంటుంది. కాలాల రాపిళ్ళల్లో కూడా దాని వన్నె తరగదు. సొగసు చవులూరిస్తూనే ఉంటుంది. రసజ్ఞుల హృదయాలలో దూరి చిద్విలాసాలు చూపుతుంది. అక్షరం నేత్రభిత్తి మీద సౌందర్యాన్ని చిమ్ముతుంది. అంతేకాదు, హృదయనేత్రం మీద కూడా లాలిత్యాన్ని కుప్పలుగా పోస్తుంది. అక్షరం అంతమాత్రంగానే ఉండిపోదు. అది శిల్పమవుతుంది. దేవభూమి మీద హారతులందుకుంటుంది. అక్షరం పాటవుతుంది. జీవన వేదిక మీద హాయిగా సాగుతుంది. జీవితం అవుతుంది. జీవితాలను నడిపిస్తుంది. అక్షరం కావ్యమవుతుంది. అది సాధారణమైన కావ్యం కాదు. మధురిమలను వెదజల్లే కావ్యం. అనురాగాన్ని అల్లించే కావ్యం. భౌతిక సౌందర్యాన్ని పెంచే కావ్యం. ఆత్మలను వెలిగించే కావ్యమవుతుంది. మారుతున్న కాలానికి అనుగుణంగా ప్రజావళిని నడిపించేదీ, పంచేదీ అవుతుంది.

అక్షరంలో దివ్యత్వం ఉంది

అక్షరమొక్క ఖడ్గమయి అసుర వృత్తుల చీల్చివేయు; ది
వ్యాక్షరమొక్క భానువయి అజ్ఞత నెల్లెడ కాల్చివేయు; భ
వ్యాక్షర మొక్క అబ్దమయి ఆకలి మంటల నార్పివేయు; ర
మ్యాక్షర మొక్క శబ్దమయి ఆకసమై నినదించు నెమ్మదిన్[577]

అక్షరం నీతిని ప్రబోధిస్తుంది. మంచి బాటలో నడిపిస్తుంది. అంతేకాదు, తల బిరుసుతనంతో పొగరెక్కిన రాక్షస ప్రవృత్తిని తుడిచిపెట్టడానికి ఖడ్గంలా పనిచేస్తుంది. అక్షరం అది దివ్యాక్షరం. సూర్యుడుగా మారుతుంది. వెలుగులను ప్రసరిస్తుంది. హృదయంలోని మాలిన్యాన్ని కడిగివేస్తుంది. కాలుష్యం లాంటి అజ్ఞానాన్ని కరిగించి విజ్ఞానాన్ని వికసింపజేస్తుంది. విస్తరింపజేస్తుంది. ఎద ఎదలో నాటుతుంది. అక్షరం భవ్యాక్షరం అవుతుంది. అబ్దంగా మారుతుంది. అబ్దం అంటే మేఘం. అలా మారిపోయి ఆకలిమంటలను ఆర్పివేస్తుంది. అక్షరం రమ్యాక్షరం అవుతుంది. శబ్దంగా రూపుకడుతుంది. ఆ శబ్దం ఆకాశమై నినదిస్తుంది. ఆకాశం నినదించడం అనేది విశేషమైంది. పంచభూతాలలో ఆకాశానికీ, భూమికీ దగ్గర సంబంధం ఉంది. 'ఆకాశం బీజ ప్రదాత అవని ఆది మాత'. ఈ రెండింటి కలయికతో విశ్వం ప్రవర్ధిల్లుతుంది. నాదమయం అవుతుంది. మరొకవిధంగా పరిశీలిస్తే, కావ్యపరంగా అనుశీలిస్తే రమ్యాక్షరాలతో ఒప్పుతున్న కావ్యమే పది కాలాలు నిలుస్తుంది. నన్నయ అక్షర రమ్యత[578] రాయప్రోలువారి రమ్యాక్షర క్షోణి[579] అనేవి అక్షరాన్నీ, కవితాక్షరాన్నీ మధురంగా తీర్చిదిద్దాయి. అట్లాగే తిరుమల అక్షరం కూడా కవితాత్మను మిళితం చేసుకొని కమనీయమైన సందేశాన్ని ఇస్తుంది.

తిరుమల అక్షర విశిష్టతను వివరిస్తూ

అక్షర మగ్ని కుండమది ఆరదు జన్మల నీరుపోసినన్
అక్షర మాత్మ యజ్ఞమది అంతము లేనిది మృత్యు సన్నిధిన్
అక్షర మబ్ధి గర్భమది అవ్యయ రత్న వితాన రోచులన్



అక్షర మద్భుతోదయ మనంత తమోగుణ జీవ లోకమున్[580] అంటారు.

తిరుమల కొన్ని కవితాపంక్తులు అగాధమైన అర్థాన్నే కాదు ఆలోచిస్తున్నకొద్దీ అనిర్వచనీయమైన అర్థాన్ని, ఆనందాన్ని పంచిపెడతాయి.

కడలి దాటి తూర్పు కొండ మీటి
శూన్యాన్ని కొలుచుకుంటూ
చుక్కలదారి పట్టిన వాడివి
నా వెన్ను తట్టిన వాడివి
వెనుదిరిగి చూడకు
వెనుక వంత పాడకు
నవ్వుతూ సాగిపో!
నా అక్షరాల మల్లెలపై నడచిపో[581]

ఈ కవితా పంక్తులలో రెండు అర్థాలు ఒదిగి ఉన్నాయి. అందులో ఒకటి సూర్యుడు, మరొకటి మానవతామూర్తి మనిషి. సూర్యుడు కడలి దాటి తూర్పు కొండను మీటి శూన్యాన్ని కొలుచుకుంటూ చుక్కలదారిన పయనిస్తాడు. మానవలోకాన్ని జాగృతం చేస్తాడు. ఆయన గమనానికి మబ్బులు కానీ, ఉల్కలు కానీ, మరేవైనా అడ్డుకున్నా వెనుకకు చూడడు. భయపెట్టేవానికి వంత పాడడు. అలాంటి తేజోమూర్తిని కవి తన అక్షరాల మల్లెలమీద నడిచి వెళ్ళమంటున్నారు. ఇక మంచి మనిషి మాటను పరిశీలిద్దాం. ఆయన కష్టాల కడలిని బుద్ధి బాహువులతో ఈదుతాడు. జలచరాలైన మొసళ్ళవంటివి ఎదురు తిరిగినప్పుడు పదునైన మేధాచక్రంతో అంతం చేసి లక్ష్యసాధనమనే తూరుపుకొండను ఆధారం చేసుకొని సాగుతాడు. కనిపించే శూన్యంలో మనిషి వికసించే నాదశక్తి ఉందని గ్రహిస్తాడు. మానవతకు మూలబీజం లాంటి శూన్యాన్ని ఆరాధిస్తాడు. అవసరమైనంత ఆత్మశక్తిని అందుకుంటాడు. చుక్కల దారిలో నడుస్తాడు. చుక్కలదారి అంటే ఆకాశమార్గం అని మాత్రమే అర్థంకాదు. చుక్కలకాంతి వంటి శుభ్రమైన మానసాలున్న మనుషులు నడిచే భూమార్గం అని కూడా అర్థం. అలాంటి పుణ్యశీలి మానవుడు తనతోటి మనుషుల హృదయాలని ఆత్మీయంతో స్పృశించి ముందుకు నడిపిస్తాడు. ఎన్ని కష్టాలు వేధించినా మరెన్ని బాధలు కుంగదీసినా వెనుకకు తిరిగిచూడడు. ఎవరికీ వంత పాడడు. అలాంటి ఉత్తముణ్ని తన అక్షరాల మల్లెల మీంచి నడిచిపొమ్మంటారు కవి. ఈ కవితలో కవి ఆత్మీయతా భావాన్ని ఆరాధనం స్వరూపంగా 'అక్షరం' ద్వారా అందించారు.

అక్షరాలను అక్షరాలుగా చూస్తే ప్రయోజనం ఉండదని కవి భావన.

అక్షరాన్ని కాగితం మీద చూడకు
అక్షరాల సెలయేటి విన్యాసాలు
గుండెల్లో చూడు

అక్షరాల సెలయేటి విద్యుత్తు
నీ అస్తిత్వానికి హేతువు
పూర్వపు అపూర్వపు
అక్షరాల సెలయేటి హోరు-ఆ తీరు-నీలో విను[582]

అక్షరాలను కాగితాల మీద స్వరూపాలుగా చూస్తే మనిషికి శ్రేయస్సు అందదు. అక్షరాన్ని మేధ నుంచి చూడాలి. మనస్సు నుంచి దర్శించాలి. అలా చూచినప్పుడు అక్షరాల కమనీయ విన్యాసాలు గుండెలో పొంగుతాయి. అనేక వర్ణాలతో తళుకులను అద్దుతాయి. మనిషి జీవితంలోని చాలా మలుపులను తెలుపుతాయి. అక్షరాల సెలయేటి విద్యుత్తును మనిషి అందుకొని వాడుకుంటే అతని అస్తిత్వానికి అర్థం చేకూరుతుంది. ఆ అర్థానికి పరిమళం అబ్బుతుంది. అక్షరాలను మనసు కళ్ళతో చూసిన మనిషిలో అన్ని కాలాలలోని అక్షరాల సెలయేరు హోరు మనిషిలో నినదిస్తుంది చూడమంటారు. అందుకే అక్షరాన్ని ఆత్మగా సందేశమిచ్చారు.

తిరుమల అక్షరాన్ని అనేక విధాలుగా నిర్వచించారు. కొన్ని సమయాలలో తన వ్యక్తిత్వాన్ని కూడా మృదువుగా చెప్పారు.

ఈ పుస్తకాల గుడిలో నేనో కిరణదీపాన్ని
ఈ భావాంబర వీధిలో నేనో అక్షర నక్షత్రాన్ని
వికసించే పువ్వుల్లో పరిమళించే ప్రాణాన్ని
ఎగిరే జండాకు ఎనలేని గీర్వాణాన్ని
నిజానికి-అక్షరాల చుక్కల దివాణాన్ని[583]

కవి పుస్తకాల గుడిలో కిరణదీపం లాంటివారు. భావం అనే ఆకాశవీధిలో అక్షర నక్షత్రం లాంటివారు. అట్లాగే వికసించే పువ్వులలో పరిమళించే ప్రాణంలాంటివారు. ఎగిరే జండాకు ఎనలేని గీర్వాణం వంటివారు. నిజానికి కవి అక్షరాల చుక్కల కొలువు కూటం లాంటివారు. కిరణదీపం, గీర్వాణం, దివాణం లాంటి శబ్దాలు కవి భావించిన అక్షరశక్తిని తెలిపేవి. అంతేకాదు- అతని వ్యక్తిత్వంలోని శబ్ద ప్రకాశనాన్ని ప్రకటించేవి.

అక్షరాలను ఊపిరిగా చేసుకొని ఎదుగుతున్న మనిషి పరిణామ దశలను కవి నిర్వచించిన అంశాలలో అక్షర మయూఖల సవ్వడులు ధ్వనిస్తాయి.

లోచన లేని ఆలోచనతో
దేశానికి పనికిరాని సందేశంతో
గతిలేని ప్రగతి కావాలనే వాళ్ళని
నీ ముందు నిలబెట్టి
నలిగిపోయిన పూల కూర్పు నేర్పుతో
వర్ణక్రమాల అక్షయ అక్షరాల శిక్ష గరిపి



ధనిక మర్యాద హద్దులు చెరిపి
పగిలిపోయిన గుండెల విషాన్ని విరిచి
అమృత దృష్టిని అందరికీ విందు చేస్తాను[584]

సమాజంలో కొందరు లోచనాలు లేని ఆలోచనలు చేస్తారు. దేశానికి పనికిరాని సందేశాలిస్తారు. గతి లేని ప్రగతి కోసం శ్రమిస్తారు. ఇదంతా నిష్ప్రయోజనమే. అలాంటి తిరోగమన వాదులను అక్షరం ముందు నిలబెడతానంటారు కవి. నలిగిపోయిన పూలు అంటే చితికిన బతుకులను నేర్పుతో చేర్చి వాళ్ళకు వర్ణక్రమాల అక్షయ అక్షరాల శిక్ష గరుపుతారు. ధనికులు ప్రదర్శించే మర్యాద హద్దులను చెరిపి పగిలిపోయిన గుండెల విషాన్ని విరిచివేసి అమృత దృష్టిని అందరికీ పంచి విందు చేస్తానంటారు. నిజంగా అక్షరాలూ- అమృతమూ ఉన్నప్పుడే లోకం శాశ్వతమవుతుంది. జీవితాలు ఆనంద మందిరాలు అవుతాయి.

ఈ శూన్య యుగం మీదికి
నా కలం నుండి కవితా హారాన్ని తెంపి విసురుతున్నాను.
అక్షరాల్ని అల్లరి చేయవద్దని కసురుతున్నాను[585]

కవి భావించిన శూన్యయుగం. అజ్ఞాన యుగం. సంస్కృతి సంప్రదాయాలు మృగ్యమై మానవత్వం లేకుండా

వీధి బడిలోంచి
పాఠశాల ఆవరణలోంచి
కళాశాల ప్రాంగణంలోంచి
విశ్వవిద్యాలయ సోపాన పంక్తిలోంచి
అక్షరంలోంచి మాటలోంచి వాక్యం లోంచి
సూర్యుడు ఉదయిస్తున్నాడు.[586]

బాల్యం, కౌమారం, యౌవనం అనే దశలు మనిషిని ఉన్నతస్థాయికి చేర్చే విజ్ఞాన సోపానాలు. మనిషి ఈ దశలలో విద్యార్థిగా అనిపిస్తాడు. అతడు మొదట వీధి బడిలోంచి ఎదుగుతాడు. అక్షరాలను దిద్దుకుంటాడు. పాఠశాలలో పాఠాలను సొంతం చేసుకుంటాడు. కళాశాలలో కౌశల్యాన్ని అందుకుంటాడు. విశ్వవిద్యాలయ సోపానాలను దాటి విశ్వరహస్యాలను తనవిగా చేసుకుంటాడు. ఇట్లా పురోగమన స్వరూపంలో ఉన్న మనిషి సూర్యుడు అవుతాడు. ఈ పరిణామక్రమంలో జిజ్ఞాసువుల కనిపించేది అక్షరశక్తే.

సరస్వతీ క్షీర బిందువు గ్రంథాలయం
సర్వ మానవలోకం ఒక అక్షర సింధువు[587]

తిరుమలకి గ్రంథాలయం సరస్వతీదేవి క్షీరబిందువులా కన్పిస్తుంది. సర్వ మానవలోకం

ఒక అక్షర సముద్రంలా కన్పిస్తుంది. ఇది ఆయన సువిశాలమైన దృక్పథానికి ప్రతీక. నిజంగా తిరుమల అక్షరసింధువు. కాబట్టే ఆయన దృష్టిలో "మనిషి వర్ణమాల". వర్ణమాలలో స్వరూపాలు చాలా రకాలుగా ఉన్నట్టే మనిషి జీవితంలో అంత వైవిధ్యం ఉంటుంది. వైవిధ్యం లేని జీవితం సూర్యుడు కన్పించని సమయం.

'విశ్వశ్రేయం కావ్యం' అని లాక్షణికులు చెప్పారు కదా! తిరుమల విశ్వశ్రేయాన్ని ఆకాంక్షించి రచనలు చేస్తున్న నిత్య చైతన్యశీలి, దీన్ని పలికించాలి. వెలుగులతో వెల్లువెత్తించాలి. అందుకోసం తన కలం నుంచి కవితాహారాన్ని తెంపి మనిషి హృదయంలోకి, మేథలోకి విసురుతున్నారు. అక్కడ అల్లరి చేయొద్దని కసురుతున్నారు. అల్లరి చేయొద్దనడంలో విశేషం ఉంది. అంధకారం లాంటి అజ్ఞానంలో ఉన్నవాళ్లు, జ్ఞానం ఉండీ మూఢ విశ్వాసాలను కాపాడుకుంటున్నవాళ్ళు అనామకుల వంటివాళ్ళు. అలాంటివాళ్ళను ఒక్కసారి అక్షరాల విసురుతో సంస్కరించడం కంటే అక్షర క్రమంతో తీర్చిదిద్దడంలోనే ప్రయోజనం ఉంటుందని తిరుమల భావించారు.

అంతేకాక-

అక్షర మెక్కుబెట్టి హృదయాంతర సీమల నేలగా దగున్
అక్షర మెక్కుబెట్టి కవితామృత సిద్ధిని పొందగా దగున్
అక్షర మెక్కుబెట్టి సుగుణాంబుధి రత్నములందగా దగున్
అక్షర మెక్కుబెట్టి మహిమాన్విత కీర్తిగా నిల్చిపోదగున్[588]

అక్షరం సర్వస్వం. అక్షరం సర్వాంతర్యామి. అందుకే అది క్షరం లేనిది. అక్షరం గురించి ఇన్ని విధాలుగా చెప్పిన కవి బహు అరుదు అని చెప్పవచ్చు.

## 28. కవితా ప్రశంస

కవిత్వం అనేది సత్యసనాతనం నిత్యనూతనం
క్రొత్తదైనా సరిక్రొత్తదైనా కవిత్వం కవిత్వమే[589] - కరుణశ్రీ

కవిత్వం అనేది అనాది నుంచి ప్రజాశ్రేయస్సునే కాంక్షిస్తూ వస్తున్నది. ఏ వస్తువును తీసుకున్నా, ఏ దృక్పథంతో రాసినా, ఏ ప్రక్రియను అందుకున్నా అది విశ్వశ్రేయాన్ని కోరిందే. అది సత్యసనాతనం కావచ్చు. నిత్యనూతనం కావచ్చు. అత్యాధునికమూ కావచ్చు.

తిలక్

కవిత్వం అంతరాంతర జ్యోతిస్సీమల్ని
బహిర్గతం చేయాలి
విస్తరించాలి చైతన్య పరిధి
అగ్నిజల్లినా, అమృతం కురిసినా
అందం, ఆనందం దాని పరమావధి[590]



అంటూ చైతన్య పరిధి విస్తరించాలని అందం, ఆనందం దాని పరమావధిగా ఉండాలని భావించారు.

ఆధునిక కవులలో అగ్రపంక్తిలో ఉన్న తిరుమల కవిత్వానికి చక్కని సూత్రాల లాంటివి రాశారు.

కవిత అన్నది జీవితంబగు
కవిత అన్నది జీవనంబగు
కవిత వైరుధ్యములు కలిపే
క్రమ మానస సూత్రమే యగు[591]

కవిత్వమే జీవితంగా జీవిస్తున్న తిరుమల కవిత్వాన్ని చక్కగా నిర్వచించారు. కవిత్వం జీవితమవుతున్నది. జీవనమూ అవుతున్నది. జీవనము అంటే జీవితంలో జీవించి అనేక మజిలీలను, మలుపులను దాటి విజయాలను సాధించడం. అంతేకాదు, అది వైరుధ్యాలను కలిపివేస్తుంది. 'వైరుధ్యం' అంటే విరుద్ధమైన అంశాలు. ఈ విరుద్ధమైన అంశాలు ఘర్షణ పడినా, వేరు వేరు దృక్పథాలను బోధించినా కవిత్వం ఈ వైవిధ్యాన్ని కరిగించి మనసులను తెల్లని చల్లని క్షేత్రాలుగా మార్చివేస్తుంది. ప్రాచీన వైరుధ్యాలను రూపుమాపిన సంఘటనలు చాలా కన్పిస్తాయి. ఆధునిక కవిత్వంలో మరీ ఎక్కువగా ఉన్నాయి. ఇది క్రమ మానస సూత్రమవుతుందని తిరుమల హృదయైక వేద్యంగా చెప్పారు.

భూమిచుట్టూ సాగరాలున్నాయి
సాగరాలచుట్టూ సాహిత్యం ఉంది.[592]

కవి ఈ పాదాల్లో భావుకత గూఢంగా ఉంది. ఆయన భూమి చుట్టూ సాగరాలున్నాయని అనడం మామూలుగా అనిపించవచ్చు. కానీ, సాగరాల చుట్టూ సాహిత్యం ఉందనడంలోనే సాహిత్య స్వరూపం గోచరిస్తుంది. అంటే భూమి, సముద్రం, దిక్కులు ఇవన్నీ కవితామయమేనన్న భావనను తెలుపుతుంది.

దప్పికతో తిరుగుతున్నాను
భువన భవనాలు
కవితాధార కోసం[593]

అనడం కూడా సృష్టి అంతటా కవిత్వమే కురుస్తుందన్న సత్యాన్ని తెలుపుతుంది. ఎల్లప్పుడూ సతత హరితంగా రాస్తున్న కవి అన్వేషణ కూడా పై కవితా పంక్తులలో దాగి ఉంది.

కవితకు సత్య స్వరూపాన్ని ఇవ్వడంలో తిరుమల ప్రత్యేకమైన అభినివేశం ఉంది.

మనిషి ఒక మేడిపండు
కవిత ఒక పనసపండు" అని

ఏం? ఎందుకని?
మనిషి జీవితాన్ని చీలిస్తే పురుగులు
కవిత కడుపు చీలిస్తే
పలుకుల పనసతోనలు
తేనె వెలుగుల పులుగులు[594]

మనిషికంటే కవిత్వం మధురమైందని, హృద్యమైందని, తేనె పలుకుల పనసతోనల వంటిదని అనడం ఔచితీమంతంగా ఉంది.

తిరుమల కాలానికంటే కవిత్వానికి విలువనిచ్చారు.

కాలమంటే మృత్యుతల్పం
కవిత అంటే సత్య శిల్పం[595]

కాలం అంటేనే సంతోషమూ, సంభ్రమమూ, భయమూ ఈ మూడింటి కలయిక. అది ఎన్నో గారడీలు చేస్తుంది. గమ్మత్తులూ చేస్తుంది. మురిపిస్తుంది. మరిపిస్తుంది. అనిశ్చితమైన పరిణామానికి కాలం సంకేతమైంది. కవి కాలాన్ని మాత్రం మృత్యుతల్పంగా భావించారు. అంటే ఆయన కవితకు ప్రగాఢంగా ప్రేరణనిచ్చిన సన్నివేశాలు ఆయన కలంచేత అలా రాయించి ఉంటాయి. అంతేకాక కవి మృత్యుతల్పం లాంటి కాలానికంటే సత్య శిల్పం లాంటి కవితకు మాత్రమే బాగా ప్రాధాన్యం ఇచ్చారు. కరుణశ్రీ 'కవిత్వం సత్యసనాతనం' అని అన్నారు కదా! అది తిరుమలలో చేరి సత్యశిల్పంగా అవతరించింది.

తిరుమల కవిత్వాన్ని

చూస్తుండగా నీటిలో పడిన నెక్లస్
దారిలో కనిపించిన మనీపర్స్
ఆలయంలో పంచిపెట్టే ప్రసాదం
మండు వేసవిలో పండు వెన్నెల రేయి
చెట్టున పండిన 'పంచదార కలశం'
మానవతా మందిరంలో దీపం[596]

మనసులో నిద్రించే ఆనందరూపంగా చెప్పారు.

సమాజం నీటిలో పడిన నెక్లస్‌లాంటిది కవిత్వం. ఎవ్వరికి దొరికితే వారు లాక్కోవాలి. దారిలో మనీపర్స్ కనిపిస్తే ఆనందం అవధులు దాటుతుంది. ఆలయంలో పంచిపెడుతున్న ప్రసాదం చేతికి అందగానే భక్తిభావం మరింత వికసిస్తుంది. అంతేకాదు, అంతటి పవిత్రతను కలిగినటువంటిది. భగ్గుమంటున్న వేసవి కాలంలో రాత్రివేళ పండువెన్నెల కురిస్తే సంతోషం హద్దులు దాటుతుంది. పంచదార కలశంలా అద్భుత తీపిని కలిగింది కవిత్వం. మానవతా మందిరంలో దీపం వెలిగినప్పుడు మనుషులు దేవతలలా భాసిస్తారు. ఆనందరూపం



మనసులో నిద్రిస్తున్నప్పుడు మనిషి ఎంతో హాయిగా ఉంటాడు.

కవితను నిర్వచించడంలో తిరుమల అనేక కోణాలను, మనిషిచుట్టూ ఉన్న వలయాలను ఎన్నుకొని కలకండ చక్కరలా అభివర్ణించారు.

సర్వ సమతా వాయి వీక్షణ
సారమది నా కవిత కావలె
మూలధనమై శీలధనమై
శబ్దమాలై కవిత కావలె[597] నని ఆశించారు.

తిరుమల కవితను సూత్రబద్ధం చేసినట్టుగానే కవిత రాయడానికి ఎన్ని కోణాల నుంచి ఇన్‌స్పిరేషన్ వస్తుందో చెప్పారు.

ఈ లోకంలో ఆకలితో
మాటాడుతున్నప్పుడు
'అడుక్కు' తిని-ఎండుటాకుల్లా
బ్రతుకులు రెపరెపలాడుతున్నప్పుడు
కళ్ళారా చూస్తే-నాలో
కవిత్వం రాయటానికి ఇన్‌స్పిరేషన్ వస్తుంది[598]

కవి ఏ ఒక వస్తువునో కవితా చిత్రశాల చేస్తే సరిపోదు. సమాజాన్నీ, దాని తత్వాన్నీ క్షుణ్ణంగా చూడవలసి ఉంటుంది. మనిషికీ మనిషికీ మధ్య పెరుగుతున్న అడ్డుగోడలు, మానవత్వాన్ని గాయపరిచే మత వైషమ్యాలు నిలువునా కుంగదీసే పేదరికం- ఇవన్నీ కవితకు కావాలి. మరెన్నో ఆధునికమైన అంశాలు కూడా కవితగా రూపొందించాలి.

కవి ఇన్‌స్పిరేషన్ ఆయన ఆశయాన్ని ప్రకటిస్తుంది కూడా-

శిలల్లో చైతన్యం ఉబికేలా
చీకటి వెన్నెల్ని పిదికేలా
చిట్లిన శాంతిదేవి గుండెల్లో
జీవనరాగం మెరిసేలా
కవిత రాయాలనుకున్నాను[599]

అంటూనే విశ్వశ్రేయాన్ని ఆశించే కవిత రాశారు తిరుమల. 'కాదేది కవితకనర్హం' అన్న శ్రీశ్రీ కవితోక్తికి అనుగుణంగా ఆయన హృదయనేత్రాలకు అందిన ప్రతి వస్తువును కవితగా తీర్చిదిద్దారు. అలాంటి కవితలలో చాలావరకు కవితా సూత్రాలుగా ఉన్నాయి. విమర్శకులు ఉపయోగించుకునే రీతిలో ఉన్నాయి. పాఠకుడు సదా మననం చేసుకునే రీతిలో ఉన్నాయి.

# పాదసూచికలు

1. ముత్యాల ముచ్చట్లు-పుట 11
2. భక్తి-పుట 1
3. ఆంధ్ర మహాభాగవతము-పుట- 7-167
4. త్యాగరాజు కవిత్వము-పుట- 120
5. జీవియస్ పీఠికలు-పుట- 18
6. చక్రారపంక్తి-పుట 1
7. రాగానందం-పుట- 38
8. చక్రధ్వజం-పుట- 2
9. పద్యప్రభాస-పుటలు- 25,26
10. శ్రీ రాధా మాధవతత్త్వము-సంప్రదాయము-పుట- 5,6
11. రాధా రహస్యము-పుటలు- 1,2
12. రాధా రహస్యము-పుట- 6
13. చక్రారపంక్తి-పుట- 1
14. చక్రారపంక్తి-పుట- 1
15. శ్రీరామనామసుధ-పుట- 2
16. పద్య ప్రభాస-పుట- 221
17. రాగానందం-పుట- 57
18. గేయనందిని-పుట- 253
19. చక్రధ్వజం-పుట- 18
20. కాలరేఖ-పుట- 76
21. హృదయభారతి-పుట- 40
22. హృదయభారతి-పుట- 40
23. ఆంధ్ర మహాభాగవతము- 1-6
24. హృదయభారతి-పుట- 54
25. చక్రారపంక్తి-పుట- 1
26. గేయనందిని-పుట- 242
27. మణిపుష్పకం-పుట- 15
28. మణిపుష్పకం-పుటలు- 15,16
29. శ్రీ ముదిగొండ వీరభద్రయ్యగారి వందేమాతరం-పరిశీలన-పుట- 1
30. గేయనందిని-పుట- 172
31. గేయనందిని-పుట- 172
32. గేయనందిని-పుట- 172
33. గేయనందిని-పుట- 172
34. వాత్సల్యవల్లి-అముద్రితం
35. వాత్సల్యవల్లి-అముద్రితం
36. వాత్సల్యవల్లి-అముద్రితం
37. వాత్సలవల్లి-అముద్రితం
38. వాత్సల్యవల్లి-అముద్రితం
39. వాత్సల్యవల్లి-అముద్రితం
40. వాత్సల్యవల్లి-అముద్రితం
41. వాత్సల్యవల్లి-అముద్రితం
42. వాత్సల్యవల్లి-అముద్రితం
43. వాత్సల్యవల్లి-అముద్రితం
44. దివ్వెలమువ్వలు-పుట- 9
45. ఋగ్వేదము- 18-9,10,11
46. ఆంధ్రకవి తరంగిణి-పుట- 179
47. ఆధునికాంధ్ర కవిత్వము సంప్రదాయములు-ప్రయోగములు-పుట- 451
48. ఆధునికాంధ్ర కవిత్వము సంప్రదాయములు-ప్రయోగ ములు-పుట- 450
49. 'ఎలిజీస్ ఇన్ తెలుగు' అముద్రితం(ఎం.ఫిల్.సిద్ధాంత వ్యాసం)
50. ఆధునికాంధ్ర కవిత్వము సంప్రదాయములు-ప్రయోగములు-పుట- 458
51. న జాయతే మ్రియతే వాకదాచిత్
నాయం భూత్వా భవితా వా న భూయః
అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే -భగవద్గీత
52. నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః
న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి
మారుత్ -భగవద్గీత
53. పితృస్మరణ-పుట- 20
54. పితృస్మరణ-పుట- 20
55. పితృస్మరణ-పుట- 21
56. పితృస్మరణ-పుట- 21
57. పితృస్మరణ-పుట- 22
58. పితృస్మరణ-పుట- 22
59. పితృస్మరణ-పుట- 23



60. పితృస్మరణ-పుట- 23
61. పితృస్మరణ-పుట- 24
62. పితృస్మరణ-పుట- 24
63. పితృస్మరణ-పుట- 25
64. పితృస్మరణ-పుట- 25
65. పితృస్మరణ-పుట- 26
66. పితృస్మరణ-పుట- 8
67. పితృస్మరణ-పుట- 6
68. పితృస్మరణ-పుట- 27
69. పితృస్మరణ-పుట- 28
70. పితృస్మరణ-పుట- 5
71. పితృస్మరణ-పుట- 6
72. పితృస్మరణ-పుట- 17
73. పితృస్మరణ-పుట- 29
74. పితృస్మరణ-పుట- 35
75. వైతాళికులు-పుట- 158
76. ఉదయశ్రీ-పుట- 49
77. చక్రధ్వజం-పుట- 34
78. చక్రధ్వజం-పుట- 34
79. రాగానందం-పుట- 44
80. మహాభారతము- 1-8-139 (అర్జునుడి తీర్థయాత్ర సందర్భంలో)
81. అభ్యుదయ కవిత్వానంతర ధోరణులు-పుట- 246
82. అభ్యుదయ కవిత్వానంతర ధోరణులు-పుటలు- 246, 247
83. భావ కవిత్వం-కరుణశ్రీ-భారతి, మే, 1969
84. శ్రీ ముదిగొండ వీరభద్రశాస్త్రిగారి వందేమాతరం-పరిశీలన-పుట- 12
85. జాతీయ గీతాలు-పుట- 51
86. అభ్యుదయ కవిత్వానంతర ధోరణులు-పుట- 235
87. మహాభారతం-విరాటపర్వం- 4-4
88. చక్రధ్వజం-పుట- 22
89. చక్రధ్వజం-పుట- 22
90. చక్రధ్వజం-పుట- 24
91. చక్రధ్వజం-పుట- 12
92. గేయనందిని-పుట- 43
93. గేయనందిని-పుట- 204
94. రాగానందం-పుట- 41
95. గేయనందిని-పుట- 205
96. రాగానందం-పుట- 39
97. గేయనందిని-పుట- 206
98. చక్రధ్వజం-పుట- 10
99. చక్రధ్వజం-పుటలు- 25,26
100. మణిపుష్పకం-పుట- 26
101. మణిపుష్పకం-పుట- 26
102. The Cosmos in my eye-పుట- 21
103. మణిపుష్పకం-పుట- 78
104. గేయనందిని-పుట- 201
105. గురజాడ రచనలు(5) లేఖలు-పుట- 83
106. గురజాడ రచనలు-కవితలసంపుటం-పుట- 10
107. ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు-ప్రయోగములు-పుటలు- 286,299
108. రాయప్రోలు సౌందర్య దర్శనం-పుట- 168
109. రాయప్రోలు సౌందర్య దర్శనం-పుట- 169
110. వచన కవిత కాదంబిని-పుట- 329
111. వచన కవితా కాదంబిని-పుట- 329
112. వచన కవితా కాదంబిని-పుట- 329,330
113. రాగానందం-పుట- 26
114. రాగానందం-పుట- 26
115. చక్రధ్వజం-పుట- 41
116. వచన కవితా కాదంబిని-పుట- 318
117. వచన కవితా కాదంబిని-పుట- 330
118. పద్య ప్రభాస-పుట- 5
119. రాగానందం-పుట- 53
120. My love of love (Read at WII World Congress of Poets, Istamble)
121. వ్యాసవాణి-పుట- 540
122. వ్యాసవాణి-పుట- 541
123. అమృతాన్వేషణ-పుట- 1
124. అమృతాన్వేషణ-పుట- 4
125. అమృతాన్వేషణ-పుట- 9
126. అమృతాన్వేషణ-పుట- 9

127. శ్రీ శివభక్తి విజయం-పుట- 744
128. అమృతాన్వేషణ-పుట- 10
129. అమృతాన్వేషణ-పుట- 25
130. అమృతాన్వేషణ-పుట- 25
131. ఆంధ్ర మహాభాగవతం-దశమస్కంధం పూర్వభాగం, పద్యం- 342
132. భగవద్గీత-మోక్షసన్యాసయోగం- 66
133. అమృతాన్వేషణ-పుట- 35
134. అమృతాన్వేషణ-పుట- 16
135. భగవద్గీత-మోక్షసన్యాసయోగం- 66
136. అమృతాన్వేషణ-పుట- 59
134. అమృతాన్వేషణ-పుట- 16
135. భగవద్గీత-మోక్షసన్యాసయోగం- 66
136. అమృతాన్వేషణ-పుట- 59
137. స్వరవల్లరి-పుట- 4
138. స్వరవల్లరి-పుట- 7
139. హరివంశం-పుట- 158
140. ఆంధ్ర మహాభాగవతం- దశమస్కంధం-పుట- 1081
141. శ్రీరామనామసుధ-పుట- 4
142. ఆధునికాంధ్ర కవిత్వంలో మానవతావాదం 'విశ్వంభర' విలక్షణత-పుట- 16
143. Bertrend Russel 'Protagoras' a History of Westren Philosopho- pg. 77
144. A Glossary for the Study of English, pg. 82
145. వి.ఆర్.నార్ల గురజాడ అనువాదం-పుట- 82
146. ఆధునికాంధ్ర కవిత్వంలో మానవతావాదం 'విశ్వంభర' విలక్షణత-పుట- 15
147. ముత్యాల సరాలు-పుట- 18
148. అభ్యుదయ కవిత్వానంతర ధోరణులు-పుట- 215
149. యుగగీత-పుట- 14
150. తెలుగు ఉన్నత వాచకం-పుట- 1
151. యుగగీత-పుట- 2
152. చీకటి మెరుపులు-శీర్షిక-'ముక్తి'
153. అభ్యుదయ కవిత్వానంతర ధోరణులు- 219
154. చీకటి మెరుపులు-శీర్షిక-ఆశాజ్వాల
155. అభ్యుదయ కవిత్వానంతర ధోరణులు- 146
156. విద్యుల్లత-శీర్షిక- 22
157. విద్యుల్లత-శీర్షిక- 74
158. మాట్లాడే మల్లెలు-శీర్షిక-వెలుగుపూలు
159. చీకటి మెరుపులు-శీర్షిక-ఆగు! అడుగు వేయకు!
160. ఆంధ్రప్రభ 5.3.1985
161. స్వరవల్లరి-పుట-30
162. వచన కవితా కాదంబిని-పుట- 322
163. మాట్లాడేమల్లెలు-శీర్షిక-దేశమంటే మనుషులోయ్
164. ఆంధ్రప్రభ 5.3.1985
165. గేయనందిని-పుట- 205
166. గేయనందిని-పుట- 45
167. వచన కవితా కాదంబిని-పుట- 263
168. వచన కవితా కాదంబిని-పుట- 185
169. మాట్లాడే మల్లెలు-శీర్షిక-నిత్య స్వాగతం
170. మాట్లాడే మల్లెలు-శీర్షిక-నిత్యస్వాగతం
171. మాట్లాడే మల్లెలు-శీర్షిక-నిత్యస్వాగతం
172. మాట్లాడే మల్లెలు-శీర్షిక-నిత్యస్వాగతం
173. మాట్లాడే మల్లెలు-శీర్షిక-నిత్యస్వాగతం
174. మాట్లాడే మల్లెలు-శీర్షిక-మంచుబొట్టు
175. మాట్లాడే మల్లెలు-శీర్షిక-మంచుబొమ్మ
176. మాట్లాడే మల్లెలు-శీర్షిక-అగ్నికిరీటం
177. My love of love శీర్షిక-Humanity
178. The Cosmos in my eye, pg.12
179. ఆధునికాంధ్ర కవిత్వము సంప్రదాయములు- ప్రయోగములు-పుటలు- 559, 560
180. అభ్యుదయ కవిత్వానంతర ధోరణులు- 42
181. కవిత్వం కాలాతీత కాంతిరేఖ- 137,138
182. నవ్యాంధ్ర సాహిత్య వీథులు- 649, 650
183. ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్న ధోరణులు- పుట- 75
184. తెలుగు కవితా వికాసం-పుట- 231
185. మాట్లాడే మల్లెలు-శీర్షిక-నీ కోసం
186. మాట్లాడే మల్లెలు-శీర్షిక-ఉద్దీపన
187. మాట్లాడేమల్లెలు-శీర్షిక-దేశమంటే మనుషులోయ్
188. మాట్లాడేమల్లెలు-శీర్షిక-దేశమంటే మనుషులోయ్
189. మాట్లాడే మల్లెలు-శీర్షిక-మాట్లాడే మల్లెలు



190. మాట్లాడే మల్లెలు-శీర్షిక-నిత్య స్వాగతం
191. మాట్లాడే మల్లెలు-శీర్షిక-అక్షరాల సెలయేటు
192. తృతీయ అభ్యుదయ రచయితల మహాసభ- అధ్యక్షోపన్యాసం, మార్చి, 1946
193. చీకటి మెరుపులు-శీర్షిక-మౌనాగ్ని బిందువులు
194. చీకటి మెరుపులు-శీర్షిక-సహవాసం
195. అభ్యుదయ కవిత్వం-మార్చి 1947(అభ్యుదయ)
196. విద్యుల్లత-శీర్షిక- 40
197. విద్యుల్లత-శీర్షిక- 44
198. వచన కవితా కాదంబిని-పుట- 176
199. వచన కవితా కాదంబిని-పుట- 178
200. వచన కవితా కాదంబిని-పుట- 186
201. కవిత్వం కాలాతీత కాంతిరేఖ-పుట- 9
202. వచన కవితా కాదంబిని-పుటలు- 187,188
203. తిరుమలోక్తి-పుట- 13
204. తిరుమలోక్తి-పుట- 14
205. తిరుమలోక్తి-పుట- 15
206. గీతాభాషిణి-పుట- 33
207. అభ్యుదయ 23
208. స్రవంతి-పుట- 12
209. కవిత్వం కాలాతీత కాంతిరేఖ-పుటలు-91,92
210. కవిత్వం కాలాతీత కాంతిరేఖ-పుటలు -93
211. భారతి-పుట -61
212. మాట్లాడే మల్లెలు-శీర్షిక-నిత్య స్వాగతం
213. మాట్లాడే మల్లెలు-శీర్షిక-నిత్య స్వాగతం
214. వృషభ పురాణం-పుట -36
215. మాట్లాడే మల్లెలు-శీర్షిక-కావలెను
216. స్నేహదేహళి-పుట -52
217. చైతన్యశిఖరం-పుట -61
218. చీకటి మెరుపులు-శీర్షిక-అగ్ని కిరీటం
219. రచన-పుట -45
220. వచన కవితా కాదంబిని-పుటలు -184,185
221. గేయనందిని-పుట -114
222. చక్రారపంక్తి-పుట -18
223. యుగగీత-పుట -30
224. సారస్వత వ్యాసములు-పుటలు -39,56
225. భారతి-పుట -14(1972)
226. చైతన్య శిఖరం-పుట -28
227. కవిత్వం కాలాతీత కాంతిరేఖ-పుట -148
228. సహృదయ చక్రము-పుట -209
229. మాట్లాడే మల్లెలు-శీర్షిక-ఉద్దీపన
230. మాట్లాడే మల్లెలు-శీర్షిక-ఉద్దీపన
231. చీకటి మెరుపులు-శీర్షిక-ఆ-రంభ శూరులం
232. చీకటి మెరుపులు-శీర్షిక-పెరుగుదల
233. విద్యుల్లత-శీర్షిక -91
234. వచన కవితా కాదంబిని-పుట -197
235. స్వరవల్లరి-పుట -7
236. గేయనందిని-పుట -41
237. గేయనందిని-పుట -59
238. పద్యప్రభాస-పుట -5
239. తెలుగు నిఘంటువు-పుట -729
240. కావ్యాలోకము-పుటలు -68,69
241. చైతన్య శిఖరం-పుటలు -42,43
242. చీకటి మెరుపులు-శీర్షిక-అనంత భ్రమణం
243. గేయనందిని-పుట -58
244. చక్రధ్వజం-పుట 10
245. The Cosmos in my eye
246. My love of love-'Awaken the Brethren'
247. మాట్లాడే మల్లెలు-శీర్షిక-మల్లెలపై నడిచిపో
248. చీకటి మెరుపులు-శీర్షిక-అక్షరాల సెలయేటు
249. విద్యుల్లత-శీర్షిక -7
250. విద్యుల్లత-శీర్షిక -41
251. ఆధునిక తెలుగు కవిత్వం-వాస్తవికత అధివాస్తవికత-పుట -3
252. తిరుమలోక్తి-పుట -5
253. పాశ్చాత్య సాహిత్య విమర్శ చరిత్ర- సిద్ధాంతాలు-పుట -200
254. ఆంధ్ర సాహిత్య విమర్శ-ఆంగ్ల ప్రభావం- పుట- 152
255. ఆంధ్ర సాహిత్య విమర్శ- ఆంగ్ల ప్రభావం- పుట -152
256. ఆంధ్ర సాహిత్య విమర్శ-ఆంగ్ల ప్రభావం-పుట -153

257. నవయుగ రత్నాలు-పుట -111
258. ఆంధ్ర సాహిత్య విమర్శ-ఆంగ్ల ప్రభావం-పుట -154
259. మాట్లాడే మల్లెలు-శీర్షిక-లే...!
260. మాట్లాడే మల్లెలు-శీర్షిక-ఏ కోఽహం బహుస్యాం
261. చీకటి మెరుపులు-శీర్షిక-అనంత భ్రమణం
262. చీకటి మెరుపులు-శీర్షిక-గమ్యం
263. వచన కవితా కాదంబిని-పుట -215
264. వచన కవితా కాదంబిని-పుట -204
265. విద్యుల్లత-శీర్షిక -65
266. అమృతాన్వేషణ-శీర్షిక -30
267. అమృతాన్వేషణ-శీర్షిక -32
268. అమృతాన్వేషణ-శీర్షిక -37
269. అధిక్షేప శతకములు-పీఠిక -3
270. సాహిత్యావలోకనం-పుట -110
271. అధిక్షేప శతకములు-పీఠిక- 3
272. క్రీడాభిరామము-పుట- 93
273. క్రీడాభిరామము-పుట- 96
274. క్రీడాభిరామము-పుట- 97
275. తెనాలి రామలింగకవి (జీవిత చరిత్ర- హాస్యకథలు)-పుట- 30
276. తెనాలి రామలింగకవి (జీవిత చరిత్ర-హాస్యకథలు)-పుట- 19
277. మాట్లాడే మల్లెలు-శీర్షిక-దేశమంటే మనుషులోయ్
278. మాట్లాడే మల్లెలు-శీర్షిక-దేశమంటే మనుషులోయ్
279. మాట్లాడే మల్లెలు-శీర్షిక-మా వాడు మంచివాడు
280. అమృతం కురిసిన రాత్రి-పుట- 9
281. వృషభ పురాణం-పుట- 36
282. చీకటి మెరుపులు-శీర్షిక-అక్షరాల సెలయేటు
283. చీకటి మెరుపులు-శీర్షిక-ఆహుతి
284. చీకటి మెరుపులు-శీర్షిక-కాటు
285. చీకటి మెరుపులు-శీర్షిక-ఆ-రంభశూరులం
286. వచన కవితా కాదంబిని-పుట- 195
287. కవితా పుష్పకం-పుటలు- 94,95
288. ఖడ్గసృష్టి-పుట- 63
289. అగ్నిధార-చివరి అట్టపైన
290. మరో హరివిల్లు-పుట- 79
291. గేయనందిని-పుట- 47
292. గేయనందిని-పుట- 53
293. గేయనందిని-పుట- 131
294. గేయనందిని-పుట- 117
295. స్నేహదేహాళి-పుట- 38
296. గేయనందిని-పుట- 114
297. గేయనందిని-పుట 216
298. గేయనందిని-పుట- 118
299. గేయనందిని-పుట- 197
300. గేయనందిన-పుట- 210
301. గేయనందిని-పుట- 214
302. గేయనందిని-పుట- 202
303. తెనుగు విందు-పుట- 2
304. తెనుగు విందు-పుట- 2
305. వ్యాసం కలాపం-పుట- 26
306. తెనుగు విందు-పుట- 3
307. తెనుగు విందు-పుట- 3
308. తెనుగు విందు-పుట- 3
309. గేయనందిని-పుట- 219
310. గేయనందిని-పుట- 219
311. చక్రధ్వజం-పుట 27
312. చక్రధ్వజం-పుటలు- 27,28
313. చక్రధ్వజం-పుట- 27
314. తిరుమలోక్తి-పుట- 1
315. చీకటి మెరుపులు-శీర్షిక-తెలుగు తేనె
316. చీకటి మెరుపులు-శీర్షిక-తెలుగు తేనె
317. చీకటి మెరుపులు-శీర్షిక-తెలుగు తేనె
318. అమృతనేత్రాలు-పుటలు- 13,14
319. అమృతనేత్రాలు-పుట- 15
320. మణిపుష్పకం-పుట- 5
321. తెలుగు ఉన్నత వాచకం-పుట- 1
322. ఆంధ్ర మహాభారతం-ఆదిపర్వం- 1-26
323. నృసింహ పురాణం-ప్రథమ- 17
324. నృసింహ పురాణం-పీఠిక-పుట- 60
325. ఎర్రన శ్రీనాథుల సూక్తి వైచిత్రి-పుట- 18



326. కొలమానమ్-పుట- 258
327. చక్రధ్వజం-పుట- 8
328. చక్రధ్వజం-పుట- 8
329. చక్రధ్వజం-పుట- 9
330. చక్రధ్వజం-పుట- 33
331. చక్రధ్వజం-పుట- 33
332. చక్రధ్వజం-పుట- 10
333. చక్రధ్వజం-పుట- 21
334. చక్రధ్వజం-పుట- 21
335. చక్రధ్వజం-పుట- 29
336. చక్రధ్వజం-పుట- 24
337. మాట్లాడే మల్లెలు-పుట- 24
338. విద్యుల్లత-శీర్షిక- 45
339. విద్యుల్లత-శీర్షిక- 22
340. వచన కవితా కాదంబిని-పుట- 241
341. యుగగీత-పుట- 2
342. యుగగీత-పుట- 1
343. యుగగీత-పుట- 8
344. స్నేహదేహాళి-పుట- 51
345. యుగగీత-పుట- 10
346. తిరుపతి వేంకటకవులకావ్యసమీక్ష-పుట- 166
347. మనిషీ-చిలక-పుట- 29
348. యుగగీత-పుట- 8
349. యుగగీత-పుట- 15
350. సుమతి శతకం-పుట- 9
351. యుగగీత-పుట- 2
352. యుగగీత-పుట- 4
353. వేమన పద్యాలు-పుట- 38
354. యుగగీత-పుట- 7
355. యుగగీత-పుట- 6
356. యుగగీత-పుట- 10
357. యుగగీత-పుట- 12
358. యుగగీత-పుట 16
359. భర్తృహరి సుభాషితము-పుట- 2
360. యుగ్గగీత-పుట- 11
361. వేమన పద్యాలు-పుట- 2
362. యుగగీత-పుట- 19
363. యుగగీత-పుట- 30
364. వచన కవితా కాదంబిని-పుట- 204
365. వచన కవితా కాదంబిని-పుట- 203
366. వచన కవితా కాదంబిని-పుట- 275
367. అమృతనేత్రాలు-శీర్షిక-సమైక్య దర్శనం
368. అమృతనేత్రాలు-శీర్షిక-నదీ గీతం
369. విద్యుల్లత-శీర్షిక- 29
370. వచన కవితా కాదంబిని-పుట- 322
371. విద్యుల్లత-శీర్షిక- 86
372. చీకటి మెరుపులు-శీర్షిక-రవ్వలు
373. చీకటి మెరుపులు-శీర్షిక-కిటుకు
374. విద్యుల్లత-శీర్షిక- 83
375. కొలమానమ్-పుట- 259
376. కలంతో కాలం-పుట- 8
377. భారతి(డిసెంబర్)-పుట- 22
378. మినీ కవిత్వం నిర్మాణశిల్పం-భావాభివ్యక్తి-పుట 10
379. భారతి(డిసెంబర్)-పుట- 23
380. భారతి(డిసెంబర్)-పుట- 23
381. భారతి(డిసెంబర్)-పుట- 23
382. విద్యుల్లత-శీర్షిక- 8
383. విద్యుల్లత-శీర్షిక- 2
384. విద్యుల్లత-శీర్షిక- 15
385. విద్యుల్లత-శీర్షిక- 96
386. విద్యుల్లత-శీర్షిక- 94
387. విద్యుల్లత-శీర్షిక- 112
388. విద్యుల్లత-శీర్షిక- 24
389. తెనుగు విందు-పుట- 34
390. మణిపుష్పకం-పుట- 64
391. శబ్దార్థ చంద్రిక-పుట- 487
392. సూర్యరాయాంధ్ర నిఘంటువు-పుట- 850
393. మణిపుష్పకం-పుట- 67
394. మణిపుష్పకం-పుట- 70
395. మణిపుష్పకం-పుటలు- 70,71
396. మణిపుష్పకం-పుట- 67
397. మణిపుష్పకం-పుట- 69
398. మణిపుష్పకం-పుట- 74
399. మణిపుష్పకం-పుట- 45
400. ఆధునికాంధ్ర కవిత్వము సంప్రదాయములు

ప్రయోగములు-పుటలు- 2,3

401. ఆధునికాంధ్ర కవిత్వము సంప్రదాయములు ప్రయోగములు-పుట- 3

402. సినీవాలి-పుట- 11

403. సమదర్శనం-పుట- 9

404. చీకటి మెరుపులు-శీర్షిక-తెలుగుతేనె

405. చీకటి మెరుపులు-శీర్షిక-అగ్ని కిరీటం

406. చీకటి మెరుపులు-శీర్షిక-అనంత భ్రమణం

407. చీకటి మెరుపులు-శీర్షిక-కీర్తిదీపం

408. పద్యప్రభాస-పుట- 1

409. శ్రీరామనామసుధ-పుటలు- 1,26,27

410. పద్యప్రభాస-పుట- 123

411. పద్యప్రభాస-పుట- 140

412. పద్యప్రభాస-పుట- 168

413. మణిపుష్పకం-పుటలు- 1,2

414. మాట్లాడే మల్లెలు-శీర్షిక-దేశమంటే మనుషులోయ్

415. మాట్లాడే మల్లెలు-శీర్షిక-రుధిర ఖడ్గం

416. విద్యుల్లత-శీర్షిక- 9

417. స్నేహదేహళి-పుటలు- 32,33

418. మహేంద్రోదయం-పుట- 52

419. గేయనందిని-పుట- 220

420. గేయనందిని-పుట- 128

421. గేయనందిని-పుట- 44

422. ఆంధ్ర సాహిత్య విమర్శ- ఆంగ్ల ప్రభావం- పుట- 159

423. మహాభారతము-ఆదిపర్వము- 25

424. చక్రధ్వజం-పుట- 28

425. క్రీడాభిరామము-పుట- 93

426. పద్యప్రభాస-పుట- 5

427. భాగవతము- (10-1010)

428. పద్యప్రభావ-పుట- 24

429. భాగవతము (8-73)

430. చక్రధ్వజం-పుట- 2

431. చక్రారపంక్తి-పుట- 6

432. చక్రారపంక్తి-పుట- 6

433. భాగవతము- (8-95)

434. చక్రారపంక్తి-పుట- 16

435. ఆముక్తమాల్యద-పుట- 38

436. హృదయభారతి-పుట- 28

437. వేమన పద్యాలు-పుట- 10

438. తిరుమలోక్తి-పుట- 2

439. వేమన పద్యాలు-పుట- 11

440. తిరుమలోక్తి-పుట- 3

441. ఉదయశ్రీ-పుట- 58

442. పద్యప్రభాస- 25

443. ఉదయశ్రీ-పుట- 58

444. హృదయభారతి-పుట- 12

445. ఉదయశ్రీ-పుట- 35

446. పద్యప్రభాస-పుట- 16

447. కరుణశ్రీ-పుట- 42

448. చక్రధ్వజం-పుట- 25

449. మనుచరిత్ర (2-8)

450. కృష్ణపక్షం-పుట- 32

451. వచన కవితా కాదంబిని-పుట- 247

452. కావ్యాలోకము-పుట- 4

453. కావ్యాలంకార సంగ్రహము-పుటలు- 89,90

454. కాశీఖండం-పుట- 5

455. మహాభారతము-ఆదిపర్వము (1-5)

456. నిర్వచనోత్తర రామాయణము (1ఆ-13)

457. నృసింహ పురాణము-(1-17)

458. కళా పూర్ణోదయము-(1-189)

459. మధువర్షం-పుట- 1

460. విశ్వంభర-పుట- 29

461. ఆంధ్ర పత్రిక, 6-2-76

462. గరుడ పురాణం-పుట- 2

463. చక్రధ్వజం-పుట- 1

464. కవిసేన మేనిఫెస్టో-పుట- 269

465. సాహిత్య సౌందర్య దర్శనం-పుట- 9

466. చీకటి మెరుపులు-శీర్షిక-అక్షర పరిమళం

467. తిరుమలోక్తి-పుట- 1

468. చక్రారపంక్తి-పుట- 13

469. చక్రారపంక్తి-పుట- 13

470. పంచవటి-పుట- 2

471. చక్రారపంక్తి-పుట- 13

472. చైతన్య కవిత-పుట- 59



473. మణిపుష్పం-పుట- 3

474. చక్రధ్వజం-పుట- 25

475. చీకటి మెరుపులు-శీర్షిక-తెలుగుతేనె

476. మహాభారతము-ఆదిపర్వము- 9

477. మహాభారతము-అరణ్యపర్వము- ద్వితీయాశ్వాసము - 358

478. మహాభారతము-అరణ్యపర్వము- ద్వితీయాశ్వాసము- 398

479. గబ్బిలం(మొదటిభాగం)-పుట- 619

480. చీకటి మెరుపులు-శీర్షిక-తెలుగుతేనె

481. చీకటి మెరుపులు-శీర్షిక-తెలుగుతేనె

482. పద్య ప్రభాస-పుట-1

483. అమృతనేత్రాలు-పుటలు- 75,76

484. అమృతనేత్రాలు-పుటలు- 76,77

485. రాగానందం-పుట- 15

486. రాగానందం-పుట- 15

487. రాగానందం-పుట- 15

488. రాగానందం-పుట- 15

489. రాగానందం-పుట- 15

490. మణిపుష్పకం-పుట- 10

491. మణిపుష్పకం-పుట- 10

492. మణిపుష్పకం-పుట- 10

493. మణిపుష్పకం-పుట- 65

494. మణిపుష్పకం-పుట- 77

495. మణిపుష్పకం-పుట- 69

496. మణిపుష్పకం-పుట- 69

497. మణిపుష్పకం-పుట- 77

498. మణిపుష్పకం-పుట- 77

499. పద్యప్రభాస-పుట- 199

500. పద్యప్రభాస-పుట- 199

501. పద్యప్రభాస-పుట- 199

502. పద్యప్రభాస-పుట- 199

503. స్వరవల్లరి-పుట- 28

504. మణిపుష్పకం-పుట- 22

505. మణిపుష్పకం-పుట- 22

506. మణిపుష్పకం-పుట- 23

507. మణిపుష్పకం-పుట- 23

508. గేయనందిని-పుట- 43

509. గేయనందిని-పుట- 43

510. గేయనందిని-పుట- 43

511. గేయనందిని-పుట- 43

512. పద్యప్రభాస-పుట- 200

513. మణిపుష్పకం-పుట- 28

514. మణిపుష్పకం-పుట- 29

515. మణిపుష్పకం-పుట- 29

516. హిందువుల పండుగలు పర్వములు-ముందుమాట- పుట- 3

517. మణిపుష్పకం-పుట- 12

518. ఈనాడు, 18.03.1999

519. పద్యప్రభాస-పుట- 231

520. పద్యప్రభాస-పుట- 231

521. పద్యప్రభాస-పుట- 231

522. పద్యప్రభాస-పుట- 231

523. హిందువుల పండుగలు పర్వములు-పుట- 184

524. హిందువుల పండుగలు పర్వములు-పుట- 185

525. హిందువుల పండుగలు పర్వములు-పుట- 186

526. హిందువుల పండుగలు పర్వములు-పుట- 195

527. స్వరవల్లరి-పుట- 32

528. స్వరవల్లరి-పుట- 32

529. చక్రధ్వజం-పుట- 47

530. చక్రధ్వజం-పుట- 47,48

531. చక్రధ్వజం-పుట- 49

532. చక్రధ్వజం-పుట- 49

533. గేయనందిని-పుట- 131

534. సినీవాలి-పుట- 11

535. గేయనందిని-పుట- 181

536. గేయనందిని-పుట- 175

537. గేయనందిని-పుట- 184

538. చీకటి మెరుపులు-శీర్షిక-'ఆగు! అడుగు వేయకు'

539. చీకటి మెరుపులు-శీర్షిక-'ఆగు! అడుగు వేయకు'

540. చీకటి మెరుపులు-శీర్షిక-'ఆగు! అడుగు వేయకు'

541. చీకటి మెరుపులు-శీర్షిక-'ఆగు! అడుగు వేయకు'

542. చీకటి మెరుపులు-శీర్షిక-'ఆగు! అడుగు వేయకు'

543. వచన కవితా కాదంబిని-పుట- 250
544. వచన కవితా కాదంబిని-పుట- 250
545. వచన కవితా కాదంబిని-పుట- 250
546. వచన కవితా కాదంబిని-పుట- 250
547. వచన కవితా కాదంబిని-పుట- 250
548. వచన కవితా కాదంబిని-పుట- 250
549. మహాభారతము-ఉద్యోగపర్వము-3- 264
550. మహాభారతము-ఉద్యోగపర్వము-3- 20
551. మహాభారతము-ఉద్యోగపర్వము-3- 21
552. అగ్నిధార 132
553. స్వరవల్లరి-పుట- 27
554. గేయనందిని-పుట- 53
555. గేయనందిని-పుట- 59
556. గేయనందిని-పుట- 43
557. గేయనందిని-పుట- 59
558. గేయనందిని-పుట- 59
559. గేయనందిని-పుట- 118
560. విద్యుల్లత-శీర్షిక- 16
561. విద్యుల్లత-శీర్షిక- 77
562. పేర్వారం సాహితీ నీరాజనం-పుట- 350
563. గేయనందిని-పుట- 112
564. రాగానందం-పుట- 45
565. తిరుమలోక్తి-పుట- 26
566. పద్యప్రభాస-పుట- 254
567. పద్యప్రభాస-పుట- 256
568. పద్యప్రభాస-పుట- 263
569. తెలుగు నిఘంటువు-పుట- 100
570. మాట్లాడే మల్లెలు-పుట- 13
571. చీకటి మెరుపులు-శీర్షిక-అనంత భ్రమణం
572. చీకటి మెరుపులు-శీర్షిక-అనంత భ్రమణం
573. చీకటి మెరుపులు-శీర్షిక-అనంత భ్రమణం
574. వచన కవితా కాదంబిని-పుట- 213
575. వచన కవితా కాదంబిని-పుట- 219
576. వచన కవితా కాదంబిని-పుట- 320
577. వచన కవితా కాదంబిని-పుట- 320
578. మహాభారతము-ఆదిపర్వము- 26
579. రాయప్రోలు సౌందర్య దర్శనం-పీఠిక-పుట- 18
580. వచన కవితా కాదంబిని-పుట- 320
581. మాట్లాడే మల్లెలు-పుట- 50
582. చీకటి మెరుపులు-శీర్షిక-అక్షరాల సెలయేఋ
583. చీకటి మెరుపులు-శీర్షిక-ఆ-రంభ శూరులు
584. వచన కవితా కాదంబిని-పుట- 184
585. వచన కవితా కాదంబిని-పుట- 229
586. మాట్లాడే మల్లెలు-శీర్షిక-అక్షర పరిమళం
587. వచన కవితా కాదంబిని-పుట- 229
588. వచన కవితా కాదంబిని-పుట- 320
589. ఉదయశ్రీ(నాల్గవ భాగం)-పుట- 44
590. అమృతం కురిసిన రాత్రి-పుట- 78
591. వచన కవితా కాదంబిని-పుట- 317
592. విద్యుల్లత-పుట- 91
593. వచన కవితా కాదంబిని-పుట- 226
594. చీకటి మెరుపులు-శీర్షిక-అక్షర పరిమళం
595. విద్యుల్లత-శీర్షిక- 6
596. విద్యుల్లత-శీర్షిక- 54
597. వచన కవితా కాదంబిని-పుట- 316
598. మాట్లాడే మల్లెలు-శీర్షిక-ఉద్దీపన
599. మాట్లాడే మల్లెలు-శీర్షిక-మంచుబొట్టు



# అధ్యాయం-4

# తిరుమల కవితా వైశిష్ట్యానుశీలనం

## 1. శైలి

మనం ఈనాడు 'శైలీ' అనే శబ్దాన్ని అనేక సందర్భాలలో అనేక విధాలుగా ఉపయోగిస్తున్నాం. మనుషుల స్వభావ, స్వరూపాలను, నడకానడతలను, మాటామన్ననూ, అలంకరణను, నటనను మొదలైన వాటన్నింటిని 'శైలీ' అని అంటున్నాం. ఆధునిక కాలంలోను, వర్తమానంలోను విస్తృత ప్రచారాన్ని పొందిన ఈ శైలి ఆంగ్ల శబ్దం 'STYLE' నుంచి నిష్పన్నమైందని విమర్శకులు చెబుతున్నారు. ఈ స్టైల్ అనే పదం ప్రాచీన రోమను దేశీయులు మైనపు బట్టలపై రాయుటకుపయోగించిన వాడి మొన గల యొక ఇనుప గంటం వంటి సాధనానికి పేరైన 'Stylus' అనే పదం నుండి స్టైల్ అనే పదం పుట్టిందని విమర్శకుల అభిప్రాయం. అయితే ఇప్పుడది అర్థపరిణామం చెంది ఒక కవి భావాలను శబ్దార్థాలను వెలువరించే విధమనే అర్థంలో వాడబడుచున్నది.

తెలుగు సాహిత్య దర్శనంలో ప్రత్యేకతను సాధించిన శైలి స్వరూప స్వభావాల గురించి కవులు, పండితులు, విమర్శకులు పలు విధాలుగా వివేచించి చెప్పారు. ఆచార్య పింగళి లక్ష్మీకాంతం -

"ఈ 'శైలి' అను పదమును మనము ఆంగ్ల భాషలో 'Style' అను దానికి పర్యాయ పదముగా కల్పించుకొన్నదే కాని, మన భాషలోని శబ్దము కాదు. ఇది మన అలంకార శాస్త్రములలో ఎచ్చటనూ లేదు. మన పూర్వులెవ్వరును దీనిని వాడలేదు. శైలికి సన్నిహితమైన అర్థములు శబ్దములు రీతి, శయ్య అనునవికలవు. ఆ శబ్దములోనైనను విశేషార్థములలో వాడెదరు కాని సాధారణార్థములో వాడరు. కావున, శైలీ శబ్దము మనకు నూతన సంపాదనము"[1] అంటూ శైలిని పరిచయం చేశారు. ఈ మాట అలంకార శాస్త్రాలలో లేదని, ఆంగ్ల భాషలో Style శబ్దానికి మరొక రూపమని తెలిపారు. పింగళి వారే మరొక చోట శైలి మాటలో దాగివున్న విశేషార్థాన్ని ఇట్లా తెలిపారు. "శైలి యను పదము భాషా పరముగ నేనెరిగిన ఏ అలంకార శాస్త్రములోనూ లేదు. ఇతరత్ర ఎచ్చటనైన ప్రయుక్తమై యున్నదేమో నేనెరుగను. దానికి శబ్ద నిష్పత్తిని బట్టి 'శీలవంతుని భావకర్మ' అను ఒక నిఘంటువునున్నది. ఈ నిర్వచనములో 'శీలవంతుని' అనేడి విశేషవాచకమును సాధారణ వాచకముగా గ్రహించినచో మానవుని భావకర్మయని అర్థమగును. భావకర్మ అనగా మానవుడు శారీరకముగా గాక మానసికముగా చేసెడి వ్యాపారము. కాగా శైలికి మానవుని మనో వ్యాపారము అని యర్థము వచ్చును. దానికే భాగవతీయని పేరు. ఆ భావమును శబ్దరూపమున వ్యక్తము చేయునపుడు ఆ భాగవతా శబ్దగతిగా రూపొంది ఆంగ్లమున

STYLE అను పదము ఏ యర్థమున వాడబడుచున్నదో ఆ యర్థమునకు సరిపోవును. కావున కల్పితమైన శైలి యను పదము శాస్త్ర సమ్మతమే యగునని నా తలంపు. ఇది బహుజనాంగీకృతమగుటచే విమర్శకులు ధారాళముగా వాడుచుండిరి. ఆంగ్లమున సాహిత్యపరముగానే గాక ఆ పదమును తీరు, సరణి, రీతి మొదలగు ఇతరార్థములో కూడా వాడుచుందురు"[2] అని పింగళి వారు శైలిని మనో వ్యాపారమని, ఆంగ్లపదం Styleకు సమానార్థకంగా వాడబడుతున్న మాట అని తేల్చి చెప్పారు.

ప్రాచీనమైన మను స్మృతి ప్రథమాధ్యాయం నాల్గవ శ్లోకంలో "ప్రాయేణ ఆచార్యాణామ్ ఇయం శైలీ యత్ స్వాభిప్రాయమ్ అపి పరోపదేశమ్ ఇవ వర్ణయన్తి"[3] ఉంది. ఇందులో ఉన్న శైలీ శబ్దం ఈనాడు ప్రచుర ప్రచారాన్ని పొందిన శైలికి పర్యాయ వాచి కాదు. తెలుగులో పాల్కురికి సోమనాథుడు,[4] శ్రీనాథుడు[5] శైలిని ప్రయోగించారు. వీళ్ళిద్దరూ కూడా శైలి సాహిత్యంలోని రీతికి సమానార్థకంగా వాడలేదు. తదుపరి ప్రాచీన కవులలో మరి కొంత మంది శైలిని తమ రచనలలో ప్రయోగించారు. అయితే అది సాహిత్యేతరమైనదే.

శైలి ఆంగ్ల సాహిత్యంలో బాగా ప్రచారాన్ని పొందింది. ఆంగ్ల విమర్శకులు, అనేకులు అ పదాన్ని పలు విధాలుగా వింగడించారు. పోప్ అనే సాహిత్య సిద్ధాంతకర్త "Style is the dress of thought"[6] అని సూత్రీకరించారు. ఈ నిర్వచనంలో అర్థస్ఫూర్తిలోపించింది. కవికీ, భావానికీ మధ్య ఉండే సాన్నిహిత్యాన్ని ఈ కవితోక్తి సూటిగా చెప్పలేకపోయింది. గోల్డ్ స్మిత్ "కొన్ని ప్రత్యేకమైన శబ్దాలు కవిత్వ శైలికి అనువైనవే"[7] అని అభిప్రాయపడినారు. అయితే గోల్డ్ స్మిత్ నుడి శైలికి అనువుగా ఉంటుందని అన్నారు. అదీ కవిత్వ శైలికి మాత్రమే పరిమితం చేశారు. మరొక అంగ్ల పండితుడు కార్లైల్ సిద్ధాంతం సాహిత్యేతరమైనదిగా భావింపవచ్చు. న్యూమేన్ "Style is not the coat of a winter but his skin"[8] అని అభిప్రాయపడినారు. ఈయన వివేచన సాహిత్యపరమైనదికాక శారీరక పరమైనదిగా కన్పిస్తుంది. కార్లైల్ సిద్ధాంతం సాహిత్యేతరమైనదిగా భావింపవచ్చు. న్యూమేన్ "Style is the man"[9] అని భావించారు. ఇందులో కవిత్వపు శైలితో పాటూ మానవ జీవితంలోని అనేక కోణాలను శైలిగా భావించినట్టు తెలుస్తుంది. న్యూమేన్ అభిప్రాయం బహుళ జనాదరణ పొందడానికి కారణమిదేనని భావింపవచ్చు. ఆంగ్ల పండితులు శైలిని సాహిత్యంలోనే కాక, జీవితంలోని అనేక కదలికలను వర్ణించిన సన్నివేశాలలో వాడినట్టు స్పష్టమవుతుంది.

తెలుగులో ఆచార్య పింగళి లక్ష్మీకాంతం "ప్రపంచమునందలి నానా వాఙ్మయముల పరిణామము గమనించినచో ప్రపంచ విఖ్యాతి పొందిన మహాకవులందరు కర్ణపేయమైన శైలితోపాటు రమణీయ గంభీరార్థములగూడా స్వీకరించుచున్నట్లును, ఆ అర్థ గాంభీర్యమును బట్టి కేవలం కవులుగాక తత్త్వవేత్తలుగా, విజ్ఞానబోధకులుగా కొనియాడబడుచున్నట్లుగా విదితమగుచున్న"[10]దని శైలిని కర్ణపేయమైన కవితాగుణంగా పేర్కొన్నారు.



ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి "రచనలోని అంశాలన్నింటినీ నిర్వహించేది శైలి. ఈ అంశాలన్నింటినీ వచనంలో నిర్వహించాలంటే భాష మీద అధికారం ఉండాలి. భాష మీద అధికారమే రచనా విధానాన్ని నిర్ణయిస్తుంది. ఆ విధానంలోని పద ప్రయోగ కౌశలం, పదబంధ నిర్మాణంలోని నేర్పు, వాక్య విన్యాసంలోని ప్రావీణ్యత అనేవి కలసి శైలిగా రూపొందుతాయి"[11] అని అన్నారు. రచనలోని అంశాలన్ని అన్నప్పుడు రీతి, శయ్య, పాకం, అలంకారం, గుణం లాంటివి అనేకం వస్తాయి. ఇవన్నీ భాష మీద అధికారాన్ని కలిగింపజేస్తాయి. ఇదే శైలి అని ఆచార్య రెడ్డి నిర్వచించారు. సుప్రసిద్ధ పండితుడు డా॥ పాటిబండ మాధవశర్మ "శీలధాతు నిష్పన్నమైన శీలము, శైలి, శిల్పము తరతమ భావముననే కార్థకములే. అనంత జన్మాభ్యా సంస్కారము శిల్పము. మహర్షుల యందు శీలమైనది మహాకవులందు శిల్పమగుచున్నది. అప్రయత్నఫలసిద్ధి శీలమూలకము. సప్రయత్న ఫలసిద్ధి శీలమూలకము"[12] అని శైలిని ఆనాటి భారతీయులు భావించారని చెప్పారు. శీలం, శైలి, శిల్పం తరతమ భావాలలో ఏకార్థాన్ని సూచిస్తాయని తెలిపారు. "రచయిత సహజ సంస్కారము ఉక్తి నాశ్రయించి కావ్యంలో జాలువారితే శైలి అవుతుందని"[13] రచయిత్రి డా॥ కె. సీతామహాలక్ష్మి అభిప్రాయపడినారు.

ప్రాచ్య పాశ్చాత్య విమర్శకుల రాతలలో అభివ్యక్తమైన శైలి మొదట వేరు వేరు అనిపించినా వివేచనంలో, విశ్లేషణంలో మాత్రం ఒకే అర్థాన్ని సూచిస్తుంది. రచయితలో భావావేశం కట్టలు తెంచుకొని కవితా స్వరూపంలో వెల్లువెత్తినప్పుడు ఆ కవిత్వంలో, కవితకు అవసరమైన అన్ని గుణాలు అక్షరాలై భావుకత్వంతో శోభిస్తాయని స్పష్టమవుతుంది.

విద్వాంసులు శైలిని అనేక భేదాలతో అనుశీలించారు. ఆచార్య పింగళి లక్ష్మీకాంతం "ఒకటి కావ్య సామాన్య సరణి; మొదటిది వస్తు విన్యాసమునకు సంబంధించినది. రెండవది శబ్ద విన్యాసమునకు సంబంధించినది"[14] అని రెండు విధాలను సూచించారు. ముదిగొండ వీరభద్ర శాస్త్రి 'పద గుంఫన శైలి'[15], 'సరళశైలి'[16] అని విశదం చేశారు. ఆచార్య దివాకర్ల వేంకటవధాని "కథనశైలి, వర్ణనశైలి, సంవాద శైలి"[17] అని శైలిని మూడు విధాలుగా వింగడించి చెప్పారు.

ప్రతి కవికీ తనదైన ఒక శైలి ఉంటుంది. కాలాన్ని అనుసరించి సాహిత్యమూ మారుతుంది. పరిణామ శీలమైన సాహిత్యంతో పాటూ శైలీ భేదాలు కూడా మారుతుంటాయి. నన్నయ కాలం నుంచి నేటిదాకా అనుశీలిస్తే రకరకాల శైలీ సంప్రదాయాలు కన్పడుతున్నాయి. కవి జీవించిన కాలం, అతడు ఎన్నుకున్న వస్తువు, అతని అభివ్యక్తి, చిత్తవృత్తి శైలిలో భేదాలను సూచిస్తాయి. ఈ భేదాలకు పరిమితి అంటూ లేదు.

ఆచార్య తిరుమల సహజకవి. కాబట్టే ఆయన శైలి వస్తువు సంప్రదాయాలను అనుసరించి పలురకాలుగా ఉన్నాయి. అవన్నీ కూడా ఆర్ద్రమైన ఆయన హృదయ మార్దవాన్ని, కవితాభినివేశాన్ని ప్రకటించే సార్వకాలికమైన సత్యాలను అనుసరించి ఉన్నాయి. సహజమైన కవి శైలిని ఒకటి రెండు రూపాలకు మాత్రమే పరిమితం చేసి అనుశీలించడం సముచితంగా

ఉండదు. విమర్శకుడు కవి తత్వాన్ని, హృదయ దృక్పథాన్ని, కవితా మార్గాన్ని సమత్వ బుద్ధితో దర్శింపవలసి ఉంటుంది. ఆ చతురత, పరిశీలనా దృష్టి ఉన్నప్పుడు మాత్రమే అతనికి కవి సమగ్ర కవితా స్వరూపం అందుతుంది. తిరుమల సాహితీసాగరాన్ని దర్శించినప్పుడు సమాజం భూత, భవిష్యత్తు, వర్తమాన స్వరూప స్వభావాలు స్పష్టంగా కన్పిస్తాయి. ఇవన్నీ కూడా ఆయన రసోచితమైన శైలిలో ఆవిష్కరింపబడి విజ్ఞులను కాలంతో పరుగిడేటట్టు, అవసరమైనప్పుడు కాలానికంటే కూడా ముందుకు సాగేటట్టు చేస్తాయి. ఇదంతా భావుకత్వంతో గుండె నుంచి చిమ్ముకొని వచ్చే కవితాధారవల్లనే సాధ్యమవుతుంది. తిరుమల ఈ కవితాశైలిని సొంతం చేసుకున్న సాహితీమూర్తి కావడం వలన ఆయన శైలీ దృక్పథాలు సమాజ ప్రయోజనం దృష్ట్యా ఔచితికి పుష్టిని సంతరించే విధంగా సహజమైన కవితాత్మతో శోభిస్తున్నాయి.

మానవీయమైన ఆత్మీయత దేశీయ స్వరూపంగా వెలువడినప్పుడు శైలి రూపం లలితంగా ఉంటుంది. ఇందుకు తిరుమల

ఉల్లము పల్లవించు మధురోహల బిడ్డను జూచి తల్లికిన్
సల్లలితాను బంధమది; శాశ్వత నైజ సరాగమైన ఆ
తల్లిని జూచి యే సుతుడు తన్మయుడౌనో సుతుండువాడె ఓ
పుల్ల దళాక్షి! నిన్ను గని మోదమునన్ చివురింతు నెంతయున్[18]

ఈ పద్యం చక్కని ఉదాహరణ. ఇది ఆర్ద్రమైన శైలి. దేశానికి, పౌరునికీ గల సంబంధం తల్లీబిడ్డల అనుబంధంగా చెప్పబడింది. ఇదొక మధురభావం. ఇది ఆత్మీయతా దృక్పథానికి ఒక సహజమైన ప్రతీక, హృదయాన్ని ఛప్పున ఆకర్షించే గుణం ఈ పద్యంలో తొణికిసలాడుతుంది. ఇది సుకుమారమైన శైలికి గుర్తు. అంతేకాదు, జాతీయ సమైక్యతా భావాన్ని మరింత శక్తిమంతంగా ప్రదర్శించే శైలికి ఇదొక ఆకర్షణీయమైన తార్కాణం.

వృత్యను ప్రాసంతోనూ, శబ్ద మాధుర్యంతోనూ హొయలు చిలికిస్తూ, మల్లెల విరిజల్లుతో మనసుదోచే పద్యాలు తారసపడతాయి శైలికి అలంకారంగా ఆత్మలా ఉంటూ ప్రసాదగుణాన్ని ప్రసరిస్తుంది.

సిరులకు పుట్టినిల్లు-శ్రమ జీవులకు న్విరిజల్లు-సత్కవీ
శ్వరులకు పూలవిల్లు-పగవారలకుం దగ తుమ్మ ముల్లు-ఖే
చరులకు తీపికల్లు-మరి స్వార్థులకున్ రణభీమ మల్లు సు
స్థిర నిగమాంత రంగులకు శ్రీధరు నిల్లన జెల్లు నాంధ్రమున్[19]

పద్యం ఆద్యంతం ఉదాత్తంగా సాగింది. మొదటి మూడు పాదాలలో త్రిప్రాసం కూర్చబడింది. ఆంధ్రదేశ ఔన్నత్య వర్ణనంలో విల్లు, ముల్లు, కల్లు అనేవి పదాంతంలో కవి కలం నుంచి శబ్ద చిత్రాలుగా దూకి నాద సౌందర్యాన్ని పెంచాయి.



తిరుమల శైలిని మరింత ఒయ్యారంతో శబ్దనాదంతో పులకింపజేసే పద్యం యిది.

అటు చూడ పువ్వులు - ఇటు చూడ నవ్వులు
ఎటు చూడ నయనాల నెలిమి సరులు
ఆ వంక ముగ్గులు - ఈ వంక సిగ్గులు
ఏ వంక నెలవంక నేలు మరులు
అలగుడి గంటలు - ఇల భోగి మంటలు
ఎల్లెడ నుల్లాస మెగయు సిరులు
అట జీవ గంధాలు - ఇట భావ బంధాలు
ఎటగన్న గ్రంథాల పుటల విరులు[20]

ఈ పద్యంలో సంక్రాంతి సోయగాలు సయ్యాటలాడాయి. సంబరాలు అంబరాలను తాకాయి. కలిసిపోయిన శ్రుతిలయలలా గుండెలని రస పరవశం చేస్తాయి. అయితే గీత పద్యంలోకి వచ్చేసరికి "పాసుర ప్రబంధ నిబద్ధ భక్తగాన మాధురీ మకరంద ధీమాన్య ఝరులు" అనే సమాన పద సంపుటి వేగంగా పరుగులు తీస్తున్న కవి భావావేశాన్ని పదగుంఫన దృక్పథాన్ని ప్రకటిస్తుంది. పరిమళాలు సన్నగా హృదయాన్ని తాకినప్పుడు పరవశించడం, గాఢంగా హత్తుకున్నప్పుడు వివశులవ్వడం సహజమైన విషయమే కదా! ఇదే గీతంలోని

అటుల హరిదాసు కీర్తన లిటుల గంగి
రెద్దు నర్తనలు, శుభాంగి వీవు నేడు[21]

అనడంలో సీసం హుందాతనం చివుళ్ళు వేసింది. 'అటుల' ఇటుల' అనే పదాలు కదులుతున్న కమ్మని దృశ్యాన్ని వర్ణించేవి. సంక్రాంతి రోజుల్లో హరిదాసులూ, గంగిరెద్దుల వాళ్ళూ, వెంట వెంట వస్తూ పాటలను వినిపిస్తూ ఆటలను చూపిస్తారు. ఒక్కొక్కప్పుడు ఇవి ఏక కాలంలో కూడా జరుగుతాయి. ఇది కొంత కోలాహలంగా అనిపించినా చెట్టుకొమ్మకు అలంకరించిన ఊయల ఊపులలా హృదయాలను పరవశింప జేస్తాయి. తిరుమల వాడిన ఈ రెండు పదాలు పండగ సంబరాలను మరింత అతిశయింపజేసే రీతిలో సుకుమారమైన భావుక శైలితో భాసిస్తున్నాయి.

జటిలమైన పదాలను కుప్పలుగా పోస్తూ పద్యం రాయటం తమ బరువైన శైలీ విన్యాసాన్ని చూపడం సులభమైన విషయమే. కాని, సరళమైన శైలిని వాడి రసజ్ఞులను మెప్పించడం మాత్రం చాలా కష్టం. అయితే తిరుమల ఈ రెండు రకాల శైలీ స్వరూపాలను వాడినారు.

తనకు తానెంత యెదిగిన తప్పులేదు
పరుల దూషించు గుణమున్న బాధ రగులు
ధర్మచింతన వీడని కర్మ వీరు
డెపుడు శాంతి సౌఖ్యాలరాణించగలడు[22]

ఈ పద్యంలో ప్రౌఢోక్తులూ, వ్రక్రోక్తులూ లేవు. అన్నీ సరళోక్తులే. చదివిన పాఠకుని గుండెలో ఛప్పున నాటుకొని ఉంటుంది. ఇలాంటి పద్యాన్ని నల్లేరుపై బండి నడకలా నడిపించడం తిరుమల లాంటి నిపుణత కలిగిన వారికే సాధ్యమవుతుంది.

అదునెరిగి ప్రయోగించిన అలంకారాల వల్ల శైలీ సౌందర్యం మరింత అతిశయిస్తుంది.

రామా! గుణగంధ సుమా
రామా! నీ పూజ సేయరామా! దయతో
రా, మా మొరవిన మనసా
రా మాటడగ జనుల దొరా! మా తండ్రీ![23]

ఈ పద్యంలో 'రామా' అనే శబ్దాన్ని ప్రయోగించి పిదప 'రా' 'మా' అనే వర్ణాలుగా విడివిడిగా చెప్పి తరువాత 'రా'ను మరో పదంతోనూ, 'మా'ను మరో పదంతోనూ సంధానించి అర్థగౌరవాన్ని పెంచారు. శబ్దాలంకారాలను అదునెరిగి ప్రయోగించి తిరుమల శబ్ద చమత్కారాన్ని ప్రదర్శించి శైలికి సొగసును పెంచారు.

కవి కలం నుంచి వెలువడిన శైలి రచన అంతటా ఒకే విధంగా ఉండదు. పలు విధాల సోయగాలను ముద్రిస్తుంది. వాటిలో కథన శైలి పాఠకుని హృదయాన్ని మరీ అలరిస్తుంది. తిరుమల దీన్ని మరింత ప్రాభవంగా అభివర్ణించారు.

కాల మెడారి కాదు; బ్రతుకంతయు భారము కాదు; కష్టముల్
జ్వాలలు కావు – ఆత్మగత భావములెల్ల వికార వీచికా
మాలలు కావు, జ్ఞాన ఘన మానవ జన్మముగాది, చైత్ర వా
ణీ లలిత ప్రశస్తినిది నిత్య వసంత సరాగ మెన్నగన్![24]

పద్యంలో లలిత పదాలు, సుకుమారమైన పరుగులు, మరింత సొరుతో గుండెలని కదనుతొక్కించే భావుకత, భవిష్యత్తులో ఆశల మెరుపులు, నవరాగ ముద్దుల స్పర్శలు ఇవన్నీ రాశిగా కన్పిస్తూ హృదయాన్ని ఊగించేస్తాయి.

కావ్యంలో ప్రసాద గుణం మనస్సుకు హాయిని కలిగిస్తుంది. ఆర్ద్రమైన చందన స్పర్శలా పులకింపజేస్తుంది. పూచిన ఊహలకు రెక్కలు కట్టించి ప్రకృతి జీవన తీరాల మీద మురిపాలను తొణికిస్తుంది. ముగ్ధమోహన తారుణ్య భావనని మరింత పెంచుతుంది. ఇలాంటి ప్రసాద గుణం కథనశైలిలో ఒదిగినప్పుడు కవిత మధుర హేలలా దృశ్యమవుతుంది.

పలుకుల ధార్మిక ప్రభలు పండి, దురంత విషాద వేదనా
వలయ మహోర్మటుల్ సమసి, పచ్చని వన్నెలు కాపురాలపై
నొలికి కుటుంబ సభ్యులకు నూపిరులూదిన రామ రాజ్యమున్
పులుగులు జంతువుల్ కవుల్ పూర్ణ మతుల్ జగదేక సద్గురుల్[25]



ఈ పద్యంలో అర్థం సమార్ద్రమై పఠితను చకితం చేస్తుంది. పద్యం అంతా భావుక జలపాతం నుంచి ఎగసిదూకి సత్యమనే హరిత శోభలను కుమ్మరిస్తుంది. అలా మనస్సుకు తోచటంకాదు. అది నిత్య సత్యమనే నాదాన్ని స్థిరపరుస్తుంది.

వస్తువుకు పుష్టిని చేకూర్చడానికి శైలి బాగా దోహదపడుతుంది. ఒక్కొక్కప్పుడు ఒకరు సంభాషిస్తున్నట్టు మరొకరు కాదు– ఔను అన్నట్టు కన్పిస్తుంది.

ఎచటదీ కాంతి? గగన సూర్యేందు తార
కాళిదా! కాదు, మకర సంక్రాంతి దివ్య
నేత్ర దీపాలదా? కాదు, నిఖిల మానవ
హృదయ రసైక భోగ సౌభాగ్య మదియ[26]

ఈ సంభాషణంలో శైలి చదువరులను బాగా ఆకట్టుకుంటుంది. లాలిత్యాన్ని కలుపుతున్న గాంభీర్యం ప్రతి పదంలో ఉంటూ నేత్ర పర్వం చేస్తుంది. గణాల విరుపు గుణాల తళుకును మరింతగా భాసింపజేసింది.

ప్రశ్నలు, ఆశ్చర్య సన్నివేశాలు వెంట వెంట సాగినప్పుడు శైలిలో మాధుర్య గుణం శోభిస్తుంది.

"ఏమది! కృష్ణుడేడి? మదికింపుగ నెచ్చటి నుండి వచ్చునో
యీ మురళీరవమ్ము; వివరించరె ఓ విరులార! తెల్పరే
కామన తీరు మార్గ"మని కంజ దాళాక్షి ప్రఫుల్ల మల్లికా
సీమలలోన కృష్ణుదరి జేరగ ప్రశ్నలు వేసె పూవులన్[27]

గోపాంగన కృష్ణుణ్ని అన్వేషిస్తూ పువ్వులను ప్రశ్నిస్తుంది. దేహాన్ని ఉడికిస్తున్న వేడి వేడి కామనను శ్రీకృష్ణుని రతితో చల్లార్చుకో ఆ యాదవ ముగ్ధాంగన ఆతురత పడుతున్నది. ఆ భావ తీవ్రత పద్య ప్రారంభంలోని 'ఏమది!' అనే మాటలోనే కన్పిస్తుంది. ముందుగా రెండు ప్రశ్నలు, ఆ వెంటే ద్విగుణితమవుతున్న సంశయం. వీటితో శైలి శృంగార భావాన్ని అలంకరించింది.

ప్రేమకు ఒక రూపాన్నిచ్చిన తిరుమల భావన మధుర శైలి రూపంలో కన్పిస్తుంది.

ప్రేమయె దైవమంచు మన పెద్దలు చెప్పిన మాటలోన నే
ప్రేమయు కానరాదు; కనిపించని ప్రేమకు రూపమిచ్చి యీ
నామముతో ప్రభూ! యిటకు నా కొఱకై యరుదెంచినావు; నా
నోములు పండె కృష్ణ! యని నూత్న వధూమణి పల్కె జ్ఞానియై!![28]

ఆమె నవ వధుమణి. ప్రియాలింగనం కోసం నిరీక్షిస్తూ తపిస్తుంది. ఆ వేగిరింతలో ఆమె గుండెలో ప్రేమమయమైన అనేక భావాలు పొర్లుతున్నాయి. ప్రేమ దైవమని పెద్దలు చెప్పారు. కాని ఆ మాటలలో ఎలాంటి ప్రేమ కన్పించదు. అయితే కన్పించని ప్రేమకు

సహజమైన రూపాన్నిచ్చిన మోహనమూర్తి యదు కిశోరుదు, ఆమె కళ్ళ ముందు కన్పించే సరికి పొంగిపోతుంది. తన నోములు ఫలించాయని మురిసిపోతుంది. ఇదంతా ఆ ప్రౌఢత్వంలో ఒత్తుకొని వచ్చే కామన. ఈ భావనాలహరిని కవి తీయని రీతిలో ముద్రించారు.

జాతీయాలు, లోకోక్తులు, సామెతలు మొదలైన వాటితో కూడిన శైలిని దేశీయ శైలి అంటారు. ఈ శైలి పద్యానికి ప్రాణం లాంటిది. ఇది పామరులను సైతం ఆకర్షించి జేజేలు అందుకుంటుంది. అటువంటి శైలీ సంపదతో తులతూగే లోకోక్తులు చూద్దాం.

చిల్కరించె, చీకు చింతలేక
గొడుగు పట్టు కాలం
తేనె బూసి, విస్తుబోవు
డంబు సూపి
నీకేమి మునిగి పోవు
ఇంతవాడ వెపుడైతివో
తెలివి...........తెల్లవారె
వెర్రిబాగుల వాడు
నిలువెల్ల మందు చుందు
వేడి వేడి పొంగలి
కాలుదువ్వె
ఓడినట్టి చూపు మోడయ్యె[29]

భాషా సౌకుమార్యమూ భావసౌందర్యమూ ముప్పిరిగొన్న తిరుమల శైలి పాఠకుల్ని ఆనందంలో ముంచెత్తుతుంది. అయితే అర్థకాఠిన్యమూ, అన్వయ కాఠిన్యమూ ఉన్న ఈ పద్యాన్ని పరిశీలిద్దాం.

పూని మడిలోని వరిగింజ పొట్ట చీల్చి
శుక్ర సంభవ జీవిని చూడలేము
వ్యక్తమగు సృష్టి దృష్టికి పట్టువడదు
దృష్టి సృష్టికి హేతువౌ దివ్యశక్తి[30]

వరి మనకు ఆహారం. ఇది మన శరీరంలో జీర్ణమై శుక్రంగా మారి జీవోత్పత్తికి హేతువు అవుతుంది. అన్నానికి అంతటి దివ్యశక్తి ఉంది. వరి గింజ పొట్ట చీల్చి చూస్తే ఆ దివ్యశక్తి నుంచి ఉద్భవించిన జీవి కనిపించదు. శుక్ర సంభవమైన ఈ జీవి సృష్టిలోని ఒక భాగం. జగత్తులో వ్యక్తమయ్యే ఆ సృష్టి యొక్క దృష్టి చర్మచక్షు సంబంధమైంది. అటువంటి దృష్టితో సృష్టికి హేతువైన దివ్యశక్తి దృశ్యమానం కాదు. దాన్ని దర్శించాలంటే దివ్యదృష్టి-జ్ఞాననేత్రం అవసరం. ఈ విషయాన్నే పై పద్యం ధ్వనిస్తుంది.



అస్తమయమ్ము లేని లసదక్షర దివ్య హృదంతరాళ నా
దస్తుత వైదిక ప్రవర తత్పర లక్షణ లక్ష్య రోదసీ
పుస్తక హస్త! విశ్వనట భూషిత సద్గుణ మాధురీ ప్రభా
న్యస్త సమస్త! వాఙ్మయ కళాంబ! నమోస్తు! నమోస్తుతే సదా![31]

సరస్వతీ దేవిని గురించి చెప్పిన పద్యం యిది. మనోహరమైన శబ్దఘటన కలిగివున్న ఈ పద్యం శ్రవణ సుభగంగానే ఉన్నప్పటికీ అర్థం సుబోధకం కాదు. దానికి కొంత అవగాహన అవసరం. సృష్టి కారకుడైన భగవంతుడి 'మహత్‌తత్వం' ఇచ్ఛా జ్ఞాన క్రియాశ్రయం. ఈ తత్వం నుంచి శబ్దతన్మాత్ర రూపమైన ఆకాశం ఏర్పడింది. ఈ ఆకాశం నుంచి స్పర్శ గుణ కలితమైన వాయువు, దాని నుంచి రూప గుణాత్మకమైన తేజస్సు, అగ్ని, దాని నుంచి రసాత్మకమైన జలమూ, జలం నుంచి గంధాత్మకమైన భూమి ఉద్భవించింది. ఆకాశంలో ఒకే గుణం (శబ్దం) ఉంటుంది. వాయువులో రెండు గుణాలు (శబ్దస్పర్శలు), అగ్నిలో మూడు గుణాలు (శబ్ద స్పర్శ రూపాలు), జలంలో నాలుగు గుణాలు (శబ్దస్పర్శ రూప రసాలు), భూమిలో అయిదు గుణాలు (శబ్దస్పర్శ రూప రస గంధాలు) ఉంటాయి. ఈ అయిదు గుణాల సమ్మేళనం ఒక 'మహత్సూత్రం'. దీని ఆధారంగా విశ్వసృష్టి జరిగింది. ఈ సృష్టినీ, సృష్టి రహస్యాల్నీ, సృష్టికి కారణమైన మహాశక్తినీ వేదాలు వర్ణించి కీర్తించాయి. ఈ వేదాలు విశ్వవ్యాప్తమై ఒక సత్సంప్రదాయానికి ప్రమాణాలుగా నిలిచాయి. ఈ ప్రమాణాలే ఒక పరంపరగా ఏర్పడి భూమ్యాకాశాలను ఆక్రమించాయి. భూమ్యాకాశాల మధ్య భాగం రోదసి. ఇది వైదిక విజ్ఞాన పవనాలతో నిండి ఉంది.

ఈ భూమికను మనఃఫలకం మీద ఏర్పాటు చేసుకొని పద్యంలోని మొదటి సమాసాన్ని (అక్షర హృదంతరాళ నాద స్తుద వైదిక ప్రవర తత్పర లక్షణ లక్ష్య రోదసీ పుస్తక హస్త) అర్థం చేసుకోవాలి. 'అక్షరం' అనే పదానికి ఎన్నో అర్థాలున్నాయి. ఇక్కడ ఆకాశం అనే అర్థం తీసుకోవాలి.

ఆకాశం శబ్ద గుణాత్మకం. శబ్దం అంటే వాక్కు. ఈ వాక్కే వాగ్బీజం. దీనికి అధిష్ఠాన దేవత సరస్వతి. ఆమె తత్వం వేద నిక్షిప్తం. ఈ తత్వాన్ని దర్శించడం కోసం వాగ్బీజ మంత్ర హృదయం నాదరూపంలో వేదస్తుతి చేస్తుంది. పరంపరాగతమైన ఆ వేద మార్గ తత్పరత్వ లక్షణానికి లక్ష్యం రోదసి. శాశ్వతత్వానికీ, అనంతత్వానికీ ప్రతీకగా నిలిచే ఈ రోదసి ఒక పుస్తకం. ఒక మహాకావ్యం. ఈ కావ్యమే వాణి హస్తాన్ని అలంకరించిన భూషణం. సూక్ష్మంగా చెప్పాలంటే వాగ్బీజ హృదంతరాళనాదంతో రోదసి ప్రతిధ్వనిస్తుంది. దీనికి అస్తమయం అనేది లేదు. రోదసికున్న ఈ ప్రాధాన్యం వల్లనే అది పుస్తకంగా భావించబడింది. ఆ పుస్తకాన్నే చదువుల తల్లి హస్తగతం చేసుకుంది. ఈ భావనలోని ముఖ్యమైన ఉద్దేశం వాణిని విశ్వరూపిణిగా చిత్రించడమే.

ఈ సమాసంలోని విశ్వకావ్యాన్ని అన్వయించుకొని రెండవ సమాసంలోని అర్థాన్ని పరిశీలించాలి. రోదసి అనే విశ్వకావ్యాన్ని రచించింది భగవంతుడు. అందులో శాశ్వత

చైతన్య నర్తనం చేసే నటుడూ, నాయకుడూ ఆయనే. సరస్వతి తన సద్గుణ మాధుర్య కాంతులతో ఆ నర్తనాన్నీ, ఆ వ్యాపారాన్నీ ప్రకాశవంతం చేస్తుంది. మరో విధంగా చెప్పాలంటే ప్రకృతి పురుషుల అన్యోన్య మైత్రితో విశ్వకార్య నిర్మాణం జరిగింది. ఇప్పుడు 'విశ్వ నటుడి చేత భూషితమైన మాధుర్య గుణ ప్రభా సమస్తము కలదానా!' అని సమాసార్థం తేటతెల్లం అవుతుంది. ఇక్కడ మాధుర్యం అంతే కావ్యగుణం. ఈ గుణంతో విశ్వకావ్యం మాధుర్యం అయిందని తాత్పర్యం. చిక్కని శైలి విన్యాసానికి ఈ పద్యం తార్కాణం.

దేవుణ్ణికానీ, మనుషుల్లో దేవుణ్ణి కానీ పొగిడేటప్పుడు శైలి స్తుత్యాత్మక రూపంలో ఉంటుంది. సర్వలోక రక్షకుడు అయిన శ్రీనారాయణుని స్తుతిలో సాగిని ఈ పద్యం చూడండి.

ఓ నీలోత్పల వర్ణ విగ్రహా! పరంజ్యోతి స్వరూపా! కృపా
దీన స్వాంత! ముకుంద! చక్రధర! భక్తి జ్ఞాన వైరాగ్య వే
ద్యా! నాగేంద్ర శయనా! సద్గతి శరణ్యా! యాది మధ్యాంత శూ
న్యా! నారాయణ! పుండరీక నయనా! నన్గావనా కేశవా![32]

వైకుంఠుని ఔన్నత్యం ఉద్ధోలంగా వర్ణింపబడింది. పద్యంలో సమాస ఘటనం అహ్లాదకరంగా ఉంది.

తెలుగు మాటలూ, పలుకుబడులూ ప్రయుక్తమైనప్పుడు ప్రసాదగుణం ప్రవహిస్తుంది. దానితో శైలి మరీ హృదయాన్ని రంజింపజేస్తుంది.

పూటలు పూటలె గడుచును
కూటికి లోపంబురాదు, కూరో నారో
నోటికి అందును కానీ
మాటల నీ మాటలేని మనుజుండ రామా!![33]

సరి వారెవ్వరు రారు కష్టములలో సాయంబుసేయంగ, ఎ
వ్వరు నా వారొ, పరాయి వారెవరొ చెప్పన్ వీలు లేదీ గతిన్
మరి యాదల్ మరి, ఇచ్చిపుచ్చుకొనుచున్ మానంబు కాపాడు కొం
చరుగన్ కొండొక పాటి మేలయె, మనో వ్యాపారముల్ కల్పనల్[34]

అలంకారాలు కానీ, రసాలు కానీ, మరే కవితా రీతులైన కవి సంయోజన చేసే విధానంపై ఆధారపడి ఉంటుంది. కవితాసేద్యంలో రాటు తేలిన మంచి కవులకు ఈ ప్రయోగాలు సుసాధ్యమే. తిరుమల ఈ జాబితాలో మొదటి పంక్తిలో దీపిస్తున్న కవికదా! చూడండి శబ్దాలంకారాన్ని మార్దవంగా సొగసొత్తించి శైలికి ప్రత్యేకతను సంతరించిన తీరు.



దూరము దూరమైన అది రూరము దూరమె; పంతగించి తా
నేరక దూరమైన తన నీతికి జాతికి వాక్య రీతికిన్
దూరమె కాదు భారమును తోచును కావున మంచి వానికిన్
'చేరువ' యన్న మాట రససేవిక కాదటె అంతరంగమా![35]

పద్యంలో పై రెండు పాదాలలో 'దూరం' అనే శబ్దం అయిదు మార్లు ప్రయోగింప బడింది. అట్లాగే నీతి, జాతి, రీతి అనే మాటలు కూడా అలంకారాల లతలకు విచ్చుకున్న మెరుపు పూలే కదా! ఈ ప్రయోగాల వలన శైలికి హరిత వర్ణం అలదినట్టయింది.

ప్రశ్నలతో కవిత తడిసినప్పుడు అదొక విధమైన రసోత్సేకం అతిశయిస్తుంది.

శ్రీకరుడెవ్వడు కరుణా
లోకనుడెవ్వండు గానలోలుండెవ, డే
కాకృత వెలుగు నెవండా
సాకార పరాత్మ సత్యసాయి భజింతున్[36]

ప్రశ్నాత్మకమైన శైలి పఠిత హృదయంలో ఉత్కంఠతను ప్రేరేపిస్తుంది. శ్రీకరుడైన సాయి సమారాధనంలో స్వామి ఔన్నత్యాన్ని ప్రకటించడానికి కవి 'ఎవడు' అనే పదాన్ని పలు మార్లు ప్రయోగించారు. ఈ ప్రశ్నల కారణంగా శైలిలో కాఠిన్యంకాక వాత్సల్యగుణం ప్రముఖంగా కన్పిస్తుంది. పోతన్న భాగవతంలో గజేంద్రుని నోటి నుంచి 'ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపల నుండు' అనిపించి శైలికి అరుదైన కమనీయమైన నడకను నేర్పారు.

ఏమి లేని దాంట్లో
ఏమి లేకుండా – ఏమి కాకుండా
ఏమి లేని నీవు – హే భగవాన్
ఈ పురాన్నెలా నిర్మించావో
ఏమీ తెలియటం లేదు[37]

'ఏమి' అనే మాట స్థూలదృష్టికి ప్రశ్నార్థకంగా కనిపించినా ఏమి లోనే శూన్యం, శూన్యాన్ని భవహర్మ్యంగా రూపొందించే భగవంతుని తత్త్వం ఇమిడి ఉంది. శూన్యం మరొక విధంగా ఉంది.

ఏ చెట్టూ లేదు ఏ పుట్టా లేదు
ఏ వసంతమూ లేదు
ఏ శిశిరాఘాతమూ లేదు[38]

ఈ పంక్తుల్లో 'ఏ' అచ్చు పాదాల మొదట్లో వాడబడింది. ఇలా జరగడం వల్ల కవి తాను చెప్పదలచుకున్న దానిని మరింత ఊనికతో వ్యక్తీకరించినట్టైంది.

అపురూపమైన పదాలను ఎన్నుకొని వాటిని నిపుణతతో సంధానించాలి. అలా

జరిగినప్పుడు అది హృదయానికి హత్తుకుంటుంది. హృదయానికి హత్తుకునే శైలి సుకుమారమైన శైలి. ఇది పాఠకుని వసంత వాటికలో కమనీయంగా విహరింపజేస్తున్నట్టుగా హాయిని కల్పిస్తుంది.

ఇది – సువిశాల శాద్వలాల
మంచు తెరలు చీల్చుకొని
ఛెంగు ఛెంగున దూకే
కృష్ణ మృగ వినోదం
ఇది-దివ్యగాంధర్వ వీణాంగనా
నవ్యరాగాల గమన విన్యాసం[39]

ఈ కవితా పంక్తులలో 'ఛెంగు ఛెంగు' అనే ధ్వని ప్రధానమైన శబ్దాలతో పాటు కృష్ణ మృగవినోదం, వీణాంగన, గమన విన్యాసం అర్థస్ఫూర్తితో భాసిస్తున్న పదబంధాలు. వీటి పోహళింపుతో శైలిలో మార్దవమైన స్థితి ఏర్పడింది.

అభివ్యక్తిలో తీవ్రత చోటు చేసుకున్నప్పుడు దాని ప్రభావం శైలిలో కన్పిస్తుంది.

శత కోటి హక్కుల హస్తాల
శత సహస్ర కోట్ల అస్త్రాలు ధరించిన
ఓర్వలేని ఒక ఊపిరి హృదయంలో...అగాధంలో
మాటల చేతలతో చీకటిని చెరుగుతూ
వికృతంగా వినోదిస్తుంటే – రోదన రోదసి దాకా
వేదన నివేదన కాదా[40]

అసూయ హృదయంలో అగ్నిలా ప్రజ్వలిస్తునప్పుడు వెలువడే మాటలు కూడా అదే తీరులో ఉంటాయి. తిరుమల పై కవితా పంక్తులలో శతకోటి, శత సహస్ర, రోదన, రోదసి, వేదన, నివేదన అనే పదాలలో ధ్వనింపజేసారు. ఇది శైలికి వేగాన్ని భజింపజేసే దృక్పథం.

చక్కని శైలితో లయ ఏర్పడుతుంది. లయాత్మకమైన కవిత అందరి మానసాలను ఆకర్షిస్తుంది. కమ్మని అనుభూతిని కలిగిస్తుంది.

భ్రమణాల్లో – పరిభ్రమణాల్లో
నడకల్లో – పరుగుల్లో
శ్వాసల్లో – విశ్వాసాల్లో
పచ్చదనాలు – వెచ్చదనాలు
మృదుస్పర్శలు – పద ఘట్టనలు[41]

ఇది 'మృత్యునేమి' కవితలోని పంక్తులు. వీటి వలనే మిగతా కవితోక్తులు కూడా ఇదే శైలీ ధారను సంతరించుకొని ఉన్నాయి. పై పంక్తుల్లో అంత్యప్రాసల వల్లనే కాక అక్షరాల



కూర్పుతో ఒక తూగువచ్చింది. ఇలాగే 'పుస్తకాల కోవెల' కూడా అనేక వయ్యారాలతో హొయలను ప్రదర్శిస్తుంది. అర్థస్ఫూర్తి కూడా జుంటి తేనె లాంటి మాధుర్యంతో భాసిస్తుంది.

నగరాల మేడల మీద – నిరుపేద వాడల మీద
పిల్ల కాలువ మీద – కల్లోల జలనిధి మీద
సూర్య చంద్రుల చూపు ఒకటే – ఒక్కటే –
గాలి అందరి కొక్కటే – జ్వాల అందరి కొక్కటే[42]

సమైక్యతా సందేశాన్ని విన్పించే ఈ గేయ పంక్తులలో పదాల కూర్పు కవినేర్పును ప్రదర్శిస్తుంది. ఈ కూర్పు కమనీయ భావుకతతో వెల్లివిరిసింది. మనస్సును రస లోకాలలో విహరింపజేసే శైలితత్వం బాగుంది.

శ్రీరామచంద్ర మూర్తిని దాశరథిగా వర్ణిస్తూ రాసిన ఈ కవితా పంక్తులు చూడండి.

అమరానంద మరంద ధారవో
ఆది కావ్య రసార్ణవ సుధలో
కమలా మానస మరాళ మణివో
విమలాధర్మ నూత ప్రభా తరణివో[43]

ఇది తిరుమల వర్ణనాత్మకమైన శైలి. ఈ వర్ణనాత్మకశైలిలో సుకుమారత్వం రేకు విచ్చుకోవడం వలన నాద సౌందర్యం హృదయాన్నూపేస్తుంది.

తన రచనలలో సంస్కృత సమాసాల్ని గుప్పిస్తూ, తెలుగు పలుకుల జిగిని వెలయిస్తూ, ఉభయ భాషా పదాలను ఇంపుగా పొందుపరుస్తూ, శబ్దార్థాల సొగసుల్ని చిందిస్తూ, భావ ప్రకటనలో సారళ్యాన్నీ, కాఠిన్యాన్నీ తిలదండుల న్యాయంగా సమకూరుస్తూ, వైవిధ్యంలో సౌకుమార్యాన్ని మేళవించి భాషా వధూటిని విరి మల్లెల బాట మీద సుకుమారంగా నడిపించటం తిరుమల ప్రత్యేకత. అది ఆయన శైలీ రమ్యత.

## 2. రసావిష్కరణ

"కవి అనుభవించిన భావావేశమును మనలో రస భావముగా ఉచ్చిన్నము చేయుటకు అతడు చేయు ప్రయత్నమే కవిత్వ రచన. రసమనునది రసభావము యొక్క పరిణామము. మన హృదయములలో రసభావమును పుట్టించి దానిని పోషించి రసముగా ఆస్వాదింపజేసెడి శబ్దశక్తికే రసధ్వని అని పేరు"[44]

కావ్యాన్ని అధ్యయనం చేస్తున్నప్పుడు కవి అందులో తళుకొత్తించిన భావాలు పాఠకుని హృదయంలో సొగసుగా దూరి పరవశింపజేయడం, ద్రవింపజేయడం జరిగితే అది రసవంతమైన రచన అని తెలుస్తుంది. కవి హృదయంలో పరిమళించే మనోహరమైన భావాలకు రసదృష్టి కారణంగా ఉంటుందని ఆలంకారికులు చెబుతారు.

కవిలో భావావేశం కదనుతొక్కినప్పుడు మాత్రమే పదికాలాలు నిలబడే కావ్యం వెలువడుతుంది. ఆ కావ్యం మరి కొన్ని రచనలు సాహితీ జగత్తులో దృశ్యమవడానికి దోహదపడుతుంది. భావ తీవ్రత ధ్వనించని కావ్యం మఖలో పుట్టి పుబ్బలో అదృశ్యమవుతుంది. పాఠకుని కర్తవ్యోన్ముఖం చేయడానికి ఉపయోగపడే హితోక్తులు రసభరితంగా ఉంటాయి. కాబట్టే, అవి కాలం రాపిళ్ళను ప్రక్కకు తోసి నిరంతరం సమాజాన్ని పిలిచి, భవిష్యత్తులోనికి నడిపిస్తాయి. ఒక కావ్యంలో రసపోషణం వెల్లువెత్తిందంటే మహాకవి విశ్వనాథ వారు "రసము వేయిరెట్లు గొప్పది"[45] అని రసావేశానికి ఉన్నత స్థితి ఉందని చెప్పారు. డా॥ సి. నారాయణ రెడ్డి "రసమంటే మరేమీ కాదు విభిన్న భావ పరిణతే"[46] అన్నారు. కావ్యంలో భావాలు వైవిధ్యంతో ఉంటాయి. అవన్నీ పరిణతిగా ఉంటేనే కావ్యం పరిమళిస్తుంది. ఆచార్య జీవియస్ రసదృష్టిని విస్తృతంగా అనుశీలించి "కావ్యమునకు రసము ప్రాణము"[47] అని సిద్ధాంతీకరించారు. కావ్యానికి రసదృష్టి ప్రాణసదృశ్యమైంది. డా॥ ఎల్లూరి శివారెడ్డి 'రచనలో భావము, భాష, అలంకారము, శయ్య, వృత్తి, రీతి గుణాదులు ప్రధానమైన అంగములు. తత్వతః వాటిలో అత్యంత ప్రధానమైనది భావము. కావ్యాదులను పఠించు సహృదయులు భావ పరి వర్తనములను గమనించుటే ముఖ్యము. సాహిత్యంలో కేవల వస్తు వర్ణన కంటే భావ వర్ణన శక్తిమంతము. ఈ భావ తత్వమును నిరూపించుటయే అలంకారశాస్త్రములలోని రసప్రకరణము చేయుపని"[48] అంటూ రసప్రకరణ ప్రాధాన్యతను ప్రకటించారు. వివిధ పరిశోధకుల రాతలను అనుసరించి భావ తీవ్రత వల్ల రసం ఉత్పన్నమవుతుంది.

ఆచార్య తిరుమల రసవాది. ఆయన అపారమైన రచనలలో రసావేశం కట్టలు తెంచుకొని పరవళ్ళు తొక్కుతుంది.

## శృంగార రసం

"శృంగారమనగా ప్రాధాన్యము పొందినదని అర్థము"[49] మనిషి జీవితం సమగ్రంగా సంపన్నం కావడానికి అది ఆదర్శమంతమైన సమాజాన్ని రూపొందించడానికి శృంగారం ఒక పార్శ్వంగా దోహదపడుతుంది. ఇది సాంప్రదాయికమైన దృష్టితో మాత్రమే పావిత్ర్యాన్ని సంతరించుకొని మానవ సంబంధాలను పునీతం చేస్తుంది. స్వేచ్ఛా శృంగార కామన వ్యక్తి విశిష్టతను, సమాజంలోని ఆదర్శమంతమైన దృక్పథాన్ని పెడత్రోవలలో నడిపిస్తుంది. తెలుగు సాహిత్యాన్ని పరిశీలించినప్పుడు ప్రబంధయుగం నాటికి వేలం వెర్రిగా శృంగార రసం పోషించబడి పాఠకులలో జుగుప్సనుపెంచింది. సమాజం తిరస్కృతికి కూడా గురయింది. అయితే దీనికి సమాజమే కారణమని కొందరు భావిస్తారు. ఇది సరియైన, సారవంతమైన అభివ్యక్తి అనిపించుకోదు. 'సహితస్యహిసాహిత్యం' కదా! సాహిత్యం సమాజ స్వరూపాన్ని మార్చివేయాలి. హృదయ పరివర్తనను కలిగించడానికి ప్రేరేపించాలి కాని మరొకటి కాదు. అందుచేత దక్షిణాంధ్రయుగంలో వచ్చిన చాలా ప్రబంధాలు ఈ అపవాదుకు గురికాక తప్పలేదు. మన ప్రాచీన భారతీయాలంకారికులు శృంగార రసాన్ని పలు విధాలుగా



వర్ణించినప్పటికీ దంపతీనిష్టమైన శృంగారానికి అధిక ప్రాధాన్యత ఇచ్చారు. ఆధునికులలో ముఖ్యంగా భావకవులలో కొందరు ఈ మార్గంలో పయనించి నప్పటికీ ఎక్కువ మంది ఆదర్శాన్ని ఆదరించి కావ్యాలను రసప్లావితం చేశారు. ఆచార్య తిరుమల 'యమునాతటి'లో ఈ రసం తీయని పరిమళాలలో పొంగి పొరలింది. సమ్మోహనమైన సౌరభ్యాలను కురిపించి చదువరుల హృదయాలను లయాత్మకంగా కదనుతొక్కించింది. రాధతో ఆ కృష్ణస్వామి నెరపిన సాంగత్యం గోప భామినులతో సాగించిన రాసకేళి వంటి సన్నివేశాలు సహృదయైక వేద్యంగా ఉన్నాయి. రాధాకృష్ణతత్వాన్ని, వ్రేపల్లె యాదవాంగనలు కృష్ణునితో క్రీడించిన ఘట్టాలు తిరుమల కవితలో కళాఖండాలుగా భాసించాయి.

ఒక గోపాంగన కృష్ణునితో రతికేళిని అనుభవిస్తూ పరవశాన పలికిన పలుకులు ఆమె సహజమైన వలపుకు ప్రతీకగా ఉన్నాయి.

తులసి మాలగ మారి వెలసెద నీ కంఠ
    సీమలో తులలేని ప్రేమతోడ
కస్తూరిగా మారి విస్తుబోవ జగతి
    నీ పాల భాగాన నిలిచి యుంది
కౌస్తుభంబుగ మారి కాంతులీనుచు సదా
    నీ వక్ష మందు పునీతమగుదు
గంధంబుగా మారి బంధురంబైన నీ
    తనువెల్ల నిండి వాసనల నిడుదు

నెమలి కన్నుగ మారి శిరము నందు
ననుచు నొకలేమ గర్వాన గనుచు నెల్ల
రేయి కృష్ణుని గూడి సారించె హాయి
తొంగి చూచి జాబిలి నవ్వ నింగిలోన!![50]

ఆమె కృష్ణుని ప్రణయభావనంలో సమ్మిళితమైపోయింది. గుండె నుంచి చిమ్ముకొని వస్తున్న ఆ గోపాంగన ఆలోచనా ధారలు పలు విధాలుగా మధురిమలను కురుస్తున్నాయి. ఆమె తులసి మాలగా మారి కృష్ణుని కంఠసీమలో తులలేని ప్రేమతో అమరి ఉండాలని అంటుంది. కస్తూరిగా మారి పోయి లోకమంతా ఆశ్చర్య చకితమయ్యేటట్టుగా కృష్ణుని ఫాల భాగాన నిలవాలని తపిస్తుంది. అంతే కాదు, కౌస్తుభంగా మారిపోయి స్వామి వక్షస్థలంపై సదా కాంతులీనుతూ పవిత్రంగా మారిపోవాలను ఉబలాటపడుతుంది. గంధంగా రూపాంతరం పొంది యదుకిశోరుని తనువంత వ్యాపించి సువాసనలను వెదజల్లుతానని అంటుంది. నెమలి కన్నుగా మారి స్వామి తలపై ఉంటానని తహతహలాడుతుంది. ఆమె హృదయ తారుణ్యాన్ని గాఢమైన ప్రణయ స్పందనలను చూస్తూ చంద్రుడు నవ్వులను కురిపిస్తున్నాడు. తిరుమల పై పద్యంలో సొగసు దాగి ఉంది. గోపాంగన రతి భజిస్తుంది. ఆమె కృష్ణునితో శారీరకమైన కామనను అనుభవిస్తున్నప్పటికీ ఆమె నోటి నుంచి వెలువడుతున్న

మాటలు ఆలోచనామృతంగా ఉన్నాయి. ఆపాత మధురంగా ఉన్నాయి. లోకమంతా వ్యాపించిన చల్లని నల్లనయ్యతో తాను మిళితమైపోయి తన ప్రణయమూర్తికి శాశ్వతరూపాన్ని సంతరింపజేసుకోవాలనే తపన ప్రగాఢంగా కన్పిస్తుంది. తులసి మాలగా మారి కంఠ సీమలో ఉండడం, కస్తూరిగా ఆ స్వామి ఫాల భాగాన ఉండడం, కౌస్తుభంగా వక్షస్థలాన అమరడం, గంధంగా ఆయన తనువంతా వ్యాపించడం అనేవి ఆ గోప స్త్రీ ఉజ్వలమైన ఆశయాలకు ప్రతీకలుగా నిలుస్తున్నాయి. ఆ గోప స్త్రీ కృష్ణుణ్ని ఏవేవో కానుకలను అర్థించలేదు. లోకమే మూర్తిగా మారిన ఆ జగన్మోహనునిలో తాను సదా కాలాలు నిలిచి ఉందామనే. ఇదీ రాధాకృష్ణతత్వానికి ఒక ఆకర్షణీయమైన ప్రతీక. కృష్ణస్వామి అనురాగమూర్తి రాధాదేవి వల్లనే వ్రేపల్లె యాదవాంగనలు ఉద్భవించారని పురాణాలు చెబుతున్నాయి. ఆ పురాణోక్తులు పరిశీలిస్తే ఇదంతా రాధాకృష్ణతత్త్వంలోని ఒక విశిష్టమైన దృశ్యమని తోస్తున్నది.

మరొక గోపాంగన రతి పారవశ్యంతో పలికిన మాటలలో కూడా ఇదే తత్త్వం ఒదిగివుంది.

హాయి ఎప్పుడు పుట్టెనోయి గోపాలకా?
నీ వద్ద నేనున్న నిమిషమందు
ప్రేమ ఎప్పుడు పుట్టె కామితదాయి? నీ
కంటి పిలుపులు నే గాంచినపుడు
కైపు ఎప్పుడు పుట్టె కంజాత నేత్ర! నీ
చేతికి నా చేయి చిక్కినప్పుడు
మదనుడెప్పుడు పుట్టె మదిలోన సుందరా!
వలువ లూడిచి నీవు నిలిచినపుడు

అనుచు కృష్ణుని వెర్రిగా గనుచు నొక్క
భామ ఏమేమొ తనకు తాఁ బలుకుచుండె
సురత యందు కృష్ణుని క్రింద వరలు చుండి
చూడు మల్లెదె మామిడి నీడలోన!![51]

'హాయి' అంటే అలలెత్తుకుంటూ పరుగెత్తుకొని వచ్చే సుఖప్రదమైన ఆనందం. ఆ హాయి ఆ గోపాంగన కృష్ణుని ప్రణయ ప్రాంగణంలో ఉన్నప్పుడు మాత్రమే పుట్టిందట. ఆ యదువీరుని చేతికి ఆమె చేయి చిక్కినప్పుడు 'కైపు' పుట్టిందట. కృష్ణుడు ఆమె వలువలను లాగివేసినప్పుడు 'మదనుడు' ఉద్భవించాడట. ఇవి ఎంతో చక్కని భావనలు. ఇవి స్థూలమైన చూపులకు సాధారణమైన ప్రేమ విషయాలుగా కన్పిస్తాయి. కానీ, అంత మాత్రమే కాదు. హాయి, ప్రేమ, కైపు మదనుడు అనేవి విశాలమైన ప్రపంచం హరిత శోభతో అలరారడానికి దిక్సూచిగా అనిపిస్తాయి. ఈ లోకమంతా ప్రేమమయమే. ఈ ప్రేమకు పై నాలుగు మాటలు ప్రాణ సదృశంగా ఒప్పుతున్నాయి. లోకేశ్వరి శ్రీకృష్ణుని సృజించిన పిదప ఆమె రాధగా అవతరించి కృష్ణుని వలపుల రాణిగా అమరి పలురకాలుగా పరిమళిస్తున్న



ప్రేమకు భాష్యంగా నిలిచింది. ఆ రాధాదేవి మానస పుత్రిక ఈ గోప స్త్రీ కదా!

మరొక యదు వనిత

ప్రేమ యనగ నీవు ప్రేమించగా నీవు
ప్రేమించబడు తత్త్వ విత్త మీవు
జీవ మాలలు నీవు భావ కీలలు నీవు
జీవ భావ విచల చిత్ర మీవు
మదన శాస్త్రము నీవు మదన శాస్త్రము నీవు
సృష్టి కార్యము నీవు సృష్టి నీవు
పురాషార్థ సాధనా మూల కామము నీవు
కామ శత్రుచ్ఛేద ఖడ్గ మీవు

గోప భావ మీవు వ్రేపల్లె యే నీవు
మధుర దృశ్యమైన మధుర నీవు
వేద మీవు రాస బృందావనం బీవు
సర్వమీవె కృష్ణ! సర్వమీవె !![52]

కృష్ణస్వామి ప్రేమమూర్తి. ఆయన ప్రేమిస్తాడు. ప్రేమింపబడతాడు. ఆయన ప్రేమ తత్త్వం పవిత్రమైంది. ఆదర్శమైంది. 'మనసిచ్చిన కోరికలిచ్చువాడు' కాదా! ఎవ్వరు ఏ విధంగా ఆయనను ప్రేమతో భావిస్తారో వాళ్ళకు ఆయా రూపాలతో సాక్షాత్కరించి అలరిస్తాడు. రాధ, రుక్మిణి, సత్యభామ, నారదుడు, కుచేలుడు, గజేంద్రుడు, పాండవులు, మీరాబాయి వంటి వాళ్ళకు కనిపించి వాళ్ళ కామితాలను సఫలం చేశాడు. ఆయన జీవమాల. అంతేకాదు భావలీల. ఈ రెండూ కలసిన విచిత్రమైన లీలలు అయనవి. ఔను! అనంతంగా వ్యాపించిన ఈ లోకానికి ప్రాణదాత ఆ అనంతుడు. అంతేకాదు. ఈ సృష్టే ఆయన. అలాంటి విశ్వవ్యాపకుడైన, పురుషోత్తముడైన ఆ స్వామి అనేక భావలీలలను సృష్టించి జగన్నాటకం ఆడిస్తాడు. ఇవన్నీ ఆయన విచిత్రమైన లీలలు కదా!

శ్రీకృష్ణుడు సృష్టికి తండ్రి. సృష్టి ప్రవర్ధం కావడానికి ఆయనే ప్రేరణ. ఆయనే కామ వాసనలను సృష్టించేది. జీవధాతువు కూడా. ఇదే విషయాన్ని గీతలో చెప్పాడు కూడా! కాబట్టే, తిరుమల మదన శాస్త్ర ఆయనేననే యదార్థాన్ని చిత్రించారు. పురాషార్థసాధనా మూల కామం కృష్ణ స్వామి అయితే, అవాంఛనీయ మైన కామాన్ని తుంచివేసే ఖడ్గం కూడా ఆయనే. గోప భావన కూడా ఆయనే. లోకాన్ని స్పందింపజేస్తున్న రాధాకృష్ణతత్త్వానికి మూలమైన వ్రేపల్లె ఆయనే.

ఆచార్య తిరుమల 'యమునాతటి' కావ్యం నిండా శృంగార రసం పరవళ్ళు తొక్కింది. "ఇందున్నది శృంగార రసము కాదు, కామ రసము. ఆ శ్రీకృష్ణపరమాత్మ మీకు సద్బుద్ధిని ప్రసాదించుగాక"[53] అని విశ్వనాథ వారు తిరుమలకి ఒక లేఖరాశారు.

ప్రేమ ప్రేమని చెప్పి పెదవి పంటను నొక్కి
ఒక చేటితో నడు మొదిమి పట్టి
ఒక చేనితంబంబు నొడిసి దగ్గఱ లాగి
కాళ్ళతో కాళ్ళ సంకెళ్ళు వేసి
ముడివిప్పి జడబట్టి మెడకు వృత్తముజుట్టి
పొదల మాటున రైక నొదలు జేసి
మంచి వాసన లీను మల్లెపూ దారుల
నడవ నీయక నన్ను పడక ద్రోసి

అరుణ గండస్థలమ్మును కొరికి కొరికి
గబ్బి గుబ్బలు మర్ధించి కర్కశముగ
సురతలో కరిగించె నా పరువ మనుచు
గోపి కామణి కృష్ణుని గొప్పుజెప్పె!![54]

పై పద్యంలో శృంగార కామన తీవ్ర స్థాయికి చేరుకున్న సంఘటనలు మనకు ప్రదర్శితమవుతున్నాయి.

తిరుమల శృంగార రస పోషణంలో లాక్షణికుల మార్గాన్ని అనుసరిస్తూనే ఆధునిక భావధారను ప్రవహింపజేసిన సన్నివేశాలు ఆయన రచనలలో చాలా ఉన్నాయి.

చలి రోజున్ గావలె, నె
చ్చెలి తా పరవశాన చేరగవలె పూ
వుల పానుపు గావలెనది
సెలవు దినము కావలె సుఖ సీమలు దిగిరాన్[55]

ఛందం, రస సంప్రదాయం, పాతవి. అభివ్యక్తి నవ్యమైంది. పద్యంలో 'సెలవు దినము కావలె సుఖ సీమలు దిగిరాన్' అనేది ఆధునికమైన అభివ్యక్తి. మూడు పాదాలలోని వస్తువు చివరి పాదంలోని వస్తువుతో నూతనత్వాన్ని సంతరించుకుంది.

శృంగారంలో సందేశం అందింపబడినప్పుడే కవితా ప్రయోజనం సాధించినట్టవుతుంది. ఇది ప్రజాకవిత్వపు లక్షణం కూడా.

కామము గట్లం ద్రెంచక
సీమితమై పాఱవలయు జీవితమందున్
నీమము దప్పని వారల
కామని పున్నమలె అన్ని ఆలోచనముల్[56]

పద్యంలో కవి 'కామాన్ని' కేవలం శృంగారం వరకు మాత్రమే కాకుండా అన్ని దశలలోనూ అనువర్తింపబడినట్టు చెప్పారు. కామం గట్లు తెంచుకోకుండా సీమితంగా ఉండాలని అలా నియమం తప్పకుండా ఉన్నవారి జీవితాలలో అన్ని ఆలోచనలు ఆమని పున్నమలై లోకానికి శ్రేయస్సును కలిగిస్తాయని చెప్పడం నవ్యంగా, నాణ్యంగా ఉంది.



## హాస్య రసం

మనిషి నిత్య జీవితంలో హాస్యానికి ప్రత్యేక స్థానం ఉంది. కనిపించని ముళ్ళు హృదయానికి తగిలినప్పుడు, ముందుకు వెళుతున్న పాదాలకు పల్లేరులు దిగబడినప్పుడు, ఆశయాలు ఎదురు తిరిగినప్పుడు, అనుబంధాల ఆత్మీయతను పుటుక్కున తెంచినప్పుడు మనిషి అంతరంగాలలో విషాదం అల్లుకుంటుంది. ఆ వేళ మనిషి తన జీవితం అంతా శూన్యమని భావిస్తాడు. తనకు సుప్రభాత రేఖలు ఇక కనిపించవని తపించిపోతాడు. బతకడం దుర్భరంగా నడుస్తున్నప్పుడు హాస్యంతో ఆయన పెదాల మీద నవ్వుల దొంతరలు పేర్చగలిగితే చాలు - అతడు గతాన్ని విస్మరించి ఆ గతంలోకి పయనమవుతాడు. పరుగులు తీస్తాడు. నవ్వుకు అంతటి శక్తి ఉంటుంది.

నవ్వుకు హాసం, పరిహాసం, దరహాసం, సరసం, చమత్కారం, పరియాచకం, ఒఱగొడ్డెం, ఎగతాళి, ఉపాలంభం, నిందాస్తుతి, నర్మగర్భోక్తి[57] అనే అర్థాలున్నాయి. ఆంగ్లంలో కూడా Wit, humour, satire, parody, sarcasm, invective, irony, comedy, comic, fun, joki, jest[58] లాంటి పర్యాయ పదాలు చాలా ఉన్నాయి. ఇవి సన్నివేశాన్ని అనుసరించి అనువర్తితాలవుతాయి.

హాస్యాన్ని నవరసాల్లో ఒకటిగా ప్రాచీనలంకారికులు చెప్పారు.[59] ప్రాచీన తెలుగు కావ్యాలలో హాస్యం కన్పిస్తుంది. కొందరి కావ్యాలలో క్వాచిత్కంగా చెప్పబడితే, మరి కొందరి రచనలలో కొంత అతిశయంగా కన్పిస్తుంది. శతకాలలో, చాటువులలో హాస్యం చిత్రింపబడింది. హాస్యం అనే మాట వినబడితే చాలు తెనాలి రామకృష్ణుడు ఛప్పున మనస్సుకు స్ఫురిస్తాడు. ఆయన కృతులలో హాస్య వర్ణన అంతగా లేకపోయినప్పటికీ ఆయన చాటువులలో ఈ రసం గట్లు తెంచుకొని పరుగులు పెట్టింది. రాయల సభలో అడుగుపెట్టిన మహాపండితులను తన చమత్కార శైలిలో ఆట పట్టించి అదరగొట్టాడు. 'కవిచిత్కరి' 'మేకతోకకుమేక' అనే పద్యాలలో హాస్యరసం ఉట్టిపడుతుంది. 'తెలియని వన్ని తప్పులని' అనే పద్యంలో 'నిరసాతుసాభుసా' వంటి మాటలు చిమ్ముకొని వచ్చే నవ్వులను ఆపలేవు. శ్రీనాథుని చాటువులలో కూడా హాస్యం ఉంది. 'పూజారి వారి కోడలు తాజార బిందె జారి దబ్బున' అన్న పద్యంలో హాస్యం పరచుకొని ఉంది. అల్లసాని పెద్దన 'అంకము జేరి శైల తనయా' అన్న గణేశస్తుతి పద్యంలో కూడా హాస్యం సుకుమారంగా పొందుపరచబడింది. దక్షిణాంధ్రయుగంలో వచ్చిన చాలా ప్రబంధాలలో ఈ ధోరణి కన్పిస్తుంది.

ఆధునిక సాహిత్యంలో హాస్యం విస్తృతంగా అభివర్ణింపబడింది. ఆధునికులలో హాస్యం అనగానే మునిమాణిక్యం నరసింహారావు అలోచనాలోచనాలకు కన్పిస్తారు. పేరడీలలో జరుక్ శాస్త్రి దర్శనమిస్తారు. విశ్వనాథ వారు కూడా తన నవలలో హాస్యాన్ని పోషించారు. మహాకవి జాషువా 'నవ్వవు జంతువుత' అనే పద్యంలో నవ్వుల చిత్రగతుల లాస్యాలను ప్రకటించారు. డా. సి. నారాయణ రెడ్డి 'నవ్వు' కవితలను అధిక సంఖ్యలో రాసిన మహాకవి.

ఇంకా కొందరు హాస్య కవితలు అనే పేరుతో రాశారు. వాస్తవాలకు చిత్రికపడుతున్న కార్టున్ కవిత్వానికి హాస్యం ఊపిరిగా అమరింది.

ఆచార్య తిరుమల తన కావ్యాలలో హాస్యాన్ని చవులూరించే తీరులో వర్ణించారు. అలంకారాలతో హాస్యం తేవడం బాగా ఉంటుంది. అందులో అంత్యప్రాస మరీ మనస్సును ఊగించేస్తుంది. తిరుమల ఈ దారిలో నడిచారు.

భూచక్రం పసితనం
చిచ్చుబుడ్డి యౌవనం
ఉప్పుపొట్లం వృద్ధాప్యం
ఐనా బ్రతుకంతా గోప్యం[60]

పసితనం, యౌవనం, వృద్ధాప్యం అనే మనిషి దశలను భూచక్రం, చిచ్చుబుడ్డి, ఉప్పుపొట్లంతో పోల్చి వర్ణించడంలో హాస్యం ధ్వనిస్తుంది. యౌవనాన్ని చిచ్చుబుడ్డితో, వృద్ధాప్యాన్ని ఉప్పుపొట్లంతో పోల్చి చిత్రించడం నవ్వు పుట్టించేదిగా ఉంది.

కౌటుంబిక జీవితాల్లో హాస్యం తొణుకుతూ ఉంటుంది. అది అనేక రకాలుగా ఉంటుంది.

అల్లుడు కూతురు వస్తే
పెల్లుబుకును సంబరం
ఆపై లెక్కలు వేస్తే
సర్వం దిగంబరం[61]

ఈ మినీ కవితలోని చివరి పంక్తిలో హాస్యరసంతో పాటు జీవన సత్యం చెప్పబడింది. అల్లునికి దశమగ్రహం అనే పేరుంది. అత్తవారింటిలో అడుగుపెట్టడంతోనే కానుకలు, కట్నాలు, మర్యాదలు అంటూ అత్తారింటిని హడలెత్తిస్తాడు. కొందరు ఆస్తిపాస్తులను చివరికి ఇంటినీ అమ్మేసి అల్లునికి నైవేద్యంగా ఇస్తారు. సమస్తం సమర్పించుకొని మామ ఇంటి వారు దిగంబరులుగా తయారవుతారని చమత్కారంగా చెప్పారు.

నువ్వు నీ పెళ్లాన్ని తంతే రంగేళి
నీ పెళ్లాం నిన్ను తంతే గయ్యాళి[62]

పురుషాధిక్య ప్రపంచంలో సహజంగానే మగాడిది పైచెయ్యే. అంతా తన ఇష్టప్రకారమే జరగాలంటాడు. ఇందుకు అడ్డొచ్చిన ఆలిని హింసకు గురి చేస్తాడు. ఎంతో ఘనకార్య చేసానని విర్రవీగుతాడు. అదే భార్య ఎదురు తిరిగితే న్యాయం కోసం పోరాడితే గయ్యాళి అని నిందిస్తారు. సమాజం ద్వంద్వ నీతికి అద్దం పట్టే ఈ విషయాన్ని తిరుమల చక్కని హాస్యస్ఫోరకంగా చెప్పారు.

చమత్కారం విసుర్లతో హాస్యం మొలకేస్తుంది. అది జీవన సత్యాలకు సంకేతాలను



అందిస్తుంది. తిరుమల హాస్యాన్ని జాతి పరంగా చిత్రించడంలో నిపుణత చూపారు.

ఎవరన్నారు? ఆంధ్రులు ఆరంభశూరులని
మనం ఆ - రంభ శూరులం
దేవతా వంశం వాళ్ళం
మానవతా రేఖాంశం వాళ్ళం
పురాణాల్లో వంకాయల్ని కూడా
పులుసులో వేసుకోగల వాళ్ళం
సెంటు భూమి లేక పోయినా
సెంటు వాసన కొట్టగల వాళ్ళం
సున్నం పుట్టని వూళ్ళకి కూడా
అన్న పెట్టగల వాళ్ళం
నేల మీద ఈత కొట్టగల వాళ్ళం
కడుపులో వుండగానే కూతపెట్టగల వాళ్ళం
మనం తెలుగులం మరఫిరంగులం
తెలుపులో రంగులం రంగుల పొంగులం
మనం అసలు 'అరవం' ఏ మాటా మరవం[63]

ఈ కవితా పంక్తులన్నీ తిరుమల హాస్య చతురతను ప్రకటిస్తాయి. హాస్యరసంతో చదువరులను మెప్పించడం సులభమైన పనికాదు. దానికెంతో శబ్దశక్తి కావాలి. సన్నివేశ చిత్రణం కావాలి. అనువైన అభివ్యక్తికావాలి. అప్పుడు కాని హాస్యరసం కట్టలు తెంచుకొని ఉరకలు వేస్తూ నీరసమైన మానసాలను సైతం రసప్లావితం చేస్తాయి. జడత్వం బిగుసుకుపోయిన హృదయాలను పూల తోటలుగా చేస్తాయి. తిరుమల వ్యక్తీకరణ దృక్పథం అంత ఆకర్షణీయంగా ఉంటుంది.

సరదగా ఓ అమ్మాయిని జేరి
ఓ పూబోడి అంటే
ఎవర్రా బోడి? నీ అమ్మ బోడి, నీ అక్కబోడి
నీ తాత బోడి, నువ్వు బోడి అంటూ
కస్సుమంటూ వుందా కలకంఠి[64]

'బోడి' అనే శబ్దంలో ఒదిగి ఉన్న సౌకుమార్యం ఆ కలకంఠి మనస్సుకు అందకపోవడంతో ఆమె నోటి నుండి వెలువడిన 'బోడి' హాస్యానికి పూచిన మరో రసరేఖ అయ్యింది.

కొందరు స్త్రీ పురుషులు తమ జీవితాలలో పొదుపును పాటిస్తారు. మరి కొందరు దుబారాగా ఖర్చు చేస్తారు. ఈ జీవన సత్యాలు కవి కలంలోంచి వెలువడిన సత్యాలు. కవి కలంలోంచి వెలువడిన విధం విశేషంగా ఉంది.

ఆడదాని సంపాదన
మొగలి రేకుల జడ
మగవాడి సంపాదన
ముక్కలు చేసిన చెఱుకు గడ[65]

ఆడవాళ్ళు సహజంగానే చాల మంది పొదుపరులు. ప్రతి పైసా ఖర్చు చేసే ముందు ఆలోచిస్తారు. వారు దాచుకున్న డబ్బులు సైతం ఇతరులకు అంత సులభంగా దొరకవు. అదే మగవాడి సంపాదన ఇంటిలోని సభ్యులందరికి అందుబాటులో ఉంటుంది. అందుకే కవి ముక్కలు చేసిన చెఱుకు గడలతో పోల్చారు.

జీవితంలోని వివిధ దశలను అనేక భంగిమలలో తీర్చిదిద్దారు ఆచార్య తిరుమల. ఒక్క విషయాన్నే వైవిధ్య భరితంగా వర్ణించడం, మెప్పించడం ఆయనలో ఉన్న భావుకతకూ శబ్దశక్తికీ నిదర్శనం.

బాల్యం - పాఠ్య పుస్తకం
కౌమార్యం - కథల పుస్తకం
యౌవనం - సెక్సు పుస్తకం
వార్ధక్యం - రిఫెరెన్స్ పుస్తకం[66]

ఈ మినీ కవితలో నిండుగా అంత్యప్రాసలు లాస్యం చేశాయి. ఇందులో హాస్యంతో పాటు జీవన పరాగ మాధురులు కూడా కన్పిస్తున్నాయి. వాస్తవాలను సంయోజిస్తే బాల్యం పాఠ్యపుస్తకం కావాలి. బాల్యం నేర్చుకునేదశగా చెప్పుకోవచ్చు. మనిషి జీవన రేఖలను పలికించే పాఠాలు, మనిషి అన్నింటా విజయాన్ని సాధించి ఉన్నతంగా ఎదిగిపోయే దారులను పాఠ్యపుస్తకాలు అందిస్తాయి. శాస్త్రీయమైన ఆలోచనలను సృష్టించి రోదసిని అందుకొని తన మేధకు సాధ్యం కానిదేది లేదనే విషయాలను పాఠ్యాంశాలు నిరూపిస్తాయి. బాల్యంలో ఇవన్నీ మేధలో, మనస్సులో అడుగుపెడితే అతడు మాననీయుడవుతాడు. బాల్యం వెళ్ళిపోయిన పిదప ప్రవేశించేది కౌమార్యం. కష్టసుఖాలు తెలియని దశయిది. కౌమారం కథల పుస్తకం లాంటిది. కథలన్నప్పుడు, అవి ఏవైనాకావచ్చు. అయితే కవి ప్రయోగించిన కథల పుస్తకం ఆ వయస్సును ఊహాలోకాల్లో విహరింపజేస్తుంది. అదే నీతి కథల సంపుటిగా భావించుకుంటే కౌమారం దాన్ని అందుకుంటే మనిషి మనుగడ పరిపూర్ణమవుతుంది. యౌవనం అనుభవించేదశ. అందుకే సెక్సు పుస్తకంతో ఉపమించారు. సెక్సు అన్నప్పుడు వెంటనే అసభ్య భావన మనస్సులో స్ఫురించదు. అలాగే వార్ధక్యాన్ని రిఫెరెన్స్ పుస్తకంతో పోల్చారు. మనిషి పూర్ణ జీవితంలోని బాల్య, కౌమార, యౌవన దశలు సమయోచితంగా ఎదిగితే వార్ధక్యం ఫలవంతం అవుతుంది. ఇది అనుభవాలు నిండిన దశ. ఈ అనుభవాల మంజూష సమాజానికి భవిష్యత్తును భావించే రిఫెరెన్స్ పుస్తకం వార్ధక్యం అవుతుంది అనంతర తరాలకు.



మూర్ఖుడి మనసు బ్లాటింగ్ పేపరు
ఆడదాని మనసు డైలీ న్యూస్ పేపరు
విద్యార్థి మనసు వైట్ పేపరు
వేదాంతి మనసు క్వశ్చన్ పేపరు[67]

మూర్ఖుడి మనసు బ్లాటింగ్ పేపరు లాంటిది. ప్రతి సంఘటనను, మంచి చెడుల ప్రసక్తి లేకుండా గ్రహిస్తుంది. ఆడవాళ్ళ మనసు డైలీ న్యూస్ పేపరు లాంటిదన్నారు. వార్తలు మారినట్టుగానే రోజు వారి ఆలోచనలు మారుతూ ఉంటాయన్నది అభిప్రాయం. విద్యార్థి మనసు వైట్ పేపరుతో పోల్చారు. మనసు కాగితంపై ఏదైనా రాయవచ్చు. అంతేకాదు, కాగితమంత తెల్లగా, స్వచ్ఛంగా ఉంటుంది ఆయన హృదయం. వేదాంతి మనస్సు ఆలోచనా మగ్నంగా ఉంటుంది. అందుకే క్వశ్చన్ పేపరన్నారు తిరుమల. ఈ కవితలో అన్య భాషా పదాలను వాడుకొని శైలికి పుష్టిని కలిగించారు.

తిరుమల ప్రణయభావంలో హాస్యాన్ని మధురంగా భావించారు.

అమ్మాయి వెనక అబ్బాయి నడిస్తే
తెలియదు కాలం
అబ్బాయి వెనక అమ్మాయి నడిస్తే
తెలియదు దూరం[68]

యౌవనంలో స్త్రీ పురుషుల ఆత్మీయతత్వం గాఢంగా ఉంటుంది. కాలం-దూరం ఈ రెండూ వాళ్ళకు తెలియవు. సత్యోక్తులను కవి చమత్కారంగా అభివర్ణించారు.

హాస్యోక్తులలో వ్యంగ్యం ప్రధానంగా ఉంటుంది. వ్యంగ్యం వాస్తవికత బాగా పరుచుకొని ఉంటుంది. దీన్ని మరో విధంగా విశ్లేషించాలంటే కార్టూన్‌లో వలె కవితలో హాస్యం స్ఫురిస్తుంది. కార్టూన్‌లో విశిష్ట వ్యక్తుల నింద కూడా ప్రశస్తంగానే ఉంటుంది.

సామాన్యుడు స్త్రీ లోలుడైతే వ్యభిచారి
శ్రీమంతుడు స్త్రీ లోలుడైతే రసికుడు
అవతార పురుషుడు స్త్రీ లోలుడైతే లోకోద్ధారకుడు[69]

సామాన్యుడు, శ్రీమంతుడు, అవతార పురుషుడు ఈ ముగ్గురు స్త్రీ లోలురైతే సమాజంలో లభించే గౌరవాదరాలు ఏ రూపంలో ఉంటాయో తిరుమల యదార్థంగా చెప్పారు. ఆ పదాల వెనక దాగిఉన్న మర్మం హృదయ కవాటాల్లో దాగిన హాస్యాన్ని మాత్రం ఆపలేవు.

పురాణకాలంలో అంటే రావణుడు లంకను పాలించిన రోజుల్లో అన్ని ఋతువుల్లో అన్ని పూలు పూయాలని శాసించేవాడట.[70] అలాగే ఋతు ధర్మాలను విడిచిపెట్టి అన్నీ వికసించేవని దాశరథి చెప్పారు.

నా పాలనలో వెన్నెల వేడిగా వుండాలి
పాలు నల్లగా వుండాలి పంచదార పుల్లగా వుండాలి
చెట్లు పూత లేకుండా కాయలు కాయాలి
గర్భధారణ లేకుండా అర్భకులు పుట్టాలి[71]

ఈ తరహా మనుషులు అదే పనిగా పుట్టుకొస్తే ఈ ధరిత్రి పై సధర్మం నిలవదు. ఏ ఆశయమూ ఫలించదు. ఏ సత్యమూ స్థిర రూపాన్ని ధరించలేదు. ఈ వైకృత్యాలు అంతరించి పోవాలని తిరుమల ఆశించారు.

హాస్యం ఉక్తి చమత్కారం వల్ల రూపుదిద్దుకుంటుంది. చాతుర్యం లేకపోతే కవిత పుష్టిని సమకూర్చుకోలేదు. తిరుమల సందర్భోచితంగా చతురోక్తులను హాస్యరూపంలో అందించి సాహితికి ఒక తళుకు సింగారాన్ని సంతరించారు.

## కరుణ రసం

కవి సమాజంలోని మనిషి. ఆయన అనుక్షణం సమాజ ఉత్థాన పతనాలను గమనిస్తాడు. అందులోని వివిధ దశలను పరిశీలిస్తాడు. దర్శనానికి అందిన అంశాన్ని రచనోత్సాహంతో రసాభిరామం చేస్తాడు. తిరుమల అలాంటి కవితాసృజన చేస్తున్న మహాకవి. ఆయన మల్లెలను ప్రతీకగా తీసుకొని పేద జీవితాలను అక్షరీకరించిన తీరులో కరుణ రసం తొంగి చూస్తుంది.

పాలు విడువని కన్నబిడ్డ ఏడుపు పోలుస్తూ
జాలి కన్నుల యంత్రాల హోరు రాలుస్తూ
యజమాని మేడ మెట్లులైన మల్లెలు
పొగరుకి పొగచుట్టలైన మల్లెలు[72]

కవి ఆవిష్కరించిన ఈ దృశ్యాన్ని భావన చేసినప్పుడు పాఠకునిలో జాలి ఉద్భూర్తమవుతుంది. కన్న బిడ్డ ఏడిస్తే హృదయం ముక్కలయినంత ఆవేదన కలుగుతుంది. మరీ పాలు విడువని పసికందు విలపిస్తే తల్లి మనస్సు కానీ, తండ్రి మనస్సు కానీ తల్లడిల్లి పోతుంది. అప్పుడు కన్నులలో కరుణ తొణుకుతుంది. కళ్ళనుంచి యంత్రాల హోరు అనే బాధ పొర్లుతుంది. యజమాని మేడమెట్లుగా అమరిన మల్లెలు పొగరుకు పొగచుట్టలుగా కాల్చబడతాయి.

సమాజంలో నిరుపేద కుటుంబాలను నిలువునా కుంగదీస్తున్న సమస్య వరకట్నం. ఎందరో కన్యల పచ్చని జీవితాలు ముళ్ళ మీద రెపరెపలాడుతున్న చలువ వస్త్రంలా పేలికలైపోతున్నాయి. మరెందరో స్త్రీ మూర్తులు అంగడి బొమ్మలుగా మారి దైన్య జీవితాలను వెల్లదీస్తున్నారు. ఇవన్నీ కవి హృదయాన్ని కలచివేశాయి. ఈ పైశాచిక హేలను కవి సమాజం కళ్ళ ఎదుట నిలిపారు. చదివిన ప్రతి రసజ్ఞుని కళ్ళ వెంట శోకాశ్రువులు రాలుతాయి.



పగబట్టిన కట్నాల
కాల సర్పాల కాట్లు తినలేక
చివురాకు నీడల నుండి
అపవాదం రొంపిలో కూలిపోతున్న మల్లెలు
అపరాధం అంకపీఠిని వాలిపోతున్న మల్లెలు[73]

వరకట్నం కాలసర్పంగా మారింది. తన విషపు కోరలతో కాటు వేస్తుంది. ఆ విషపు కాట్లను భరించలేక ఎందరో స్త్రీ మూర్తులు కన్నుమూశారు. మరెందరో మిసిమి మయస్సులో చెలరేగిన కామనంతో అపవాద రొంపిలో కూలిపోతున్నారు. ఇంకెందరో అపరాధం అంకపీఠిని వాలిపోతున్నారు. ఇవన్నీ కూడా శిలలాంటి హృదయాలను జలజలా కరిగించి వేస్తాయి. కళ్ళ నుంచి వేడి కన్నీటి చుక్కలను చిందుతాయి. మనస్సు నుంచి కరుణం కూడా కట్టలు తెంచుకొని దూకుతుంది.

## రౌద్ర రసం

యుద్ధం రౌద్రహేలకు ప్రతీక. రణక్షేత్రంలో మహావీరులతో పాటు నిరపరాధులు కూడా వధింపబడతారు. వీళ్ళతో కూడిఉన్న రణాంగణం భయాన్ని కలిగిస్తుంది.

నీవెవరు?
రక్తసిక్త పటు కేటక తాటకలా
మానవత్వపు కూడలిలో
విలయతాండవం చేసే నీవెవరు?
విజ్ఞాన హృదయంలో
వెన్నెల కలల కిరణాలు చెరిపి
కల్లోల సముద్రాలు సృష్టించిన నీవెవరు?
పసి మొగ్గల బుగ్గలు చిదిపి
పాడే గుండెల గొంతులు నులిమి
కసిగా పసరికనే మండించే నీ వెవరు?
క్రిములు రాలే కోరలతో
అహింసా స్వర పేటిని పొడిచి
అట్టహాసంగా అనందించే నీ వెవరు?[74]

ఇది యుద్ధ పిపాసి రౌద్ర రూపం. మానవత్వపు కూడలిలో విలయతాండవం చేసే రక్త సిక్తపటు కేటక తాటక. ఇది వెన్నెల కిరణాలను కరిగించివేసి కల్లోల సముద్రాలను సృష్టిస్తుంది. పసి మొగ్గల బుగ్గలు చిదిమి, పాడే గుండెల గొంతులు నులిమివేస్తుంది. కసిగా పచ్చని గడ్డిని దహించివేస్తుంది. ఆ వికృత రూపిణి క్రిములు రాల్చే కోరలతో అహింసా స్వరపేటిని పొడిచివేస్తుంది. హింసను ప్రజ్వలింపజేస్తుంది.

## వీర రసం

వీరానికి ఉత్సాహం ప్రాతిపదిక. ఆచార్య భరతుడు

ఉత్సాహాధ్యవసాయా దవిషాదిత్వా దవిస్మయా మోహాత్
వివిధాదర్థ విశేషాత్ వీరరసో నామ సంభవతి[75]

అని వీర రసాన్ని నిర్వచించారు. ఉత్సాహం ఉరకలు వేస్తున్నప్పుడే రస సంయోజనం ఉధృత రూపాన్ని ధరిస్తుంది. ఈ రసంలోనూ కొన్ని అంగాలు ఉన్నాయి. ఆచార్య తిరుమల కార్గిల్ యుద్ధాన్ని వర్ణిస్తున్న ఘట్టంలో వీరదీప్తికి ప్రత్యేక రూపాన్నిచ్చారు.

ఎవడురా వాడు తుహిన పర్వత నిధిని
దోచుక పోజూచు దుండగీడు?
ఎవడురా వాడు కాశ్మీర కస్తూరిలో
బురద కలుప జూచు మోసగాడు?
ఎవడురా వాడు శాంతించు సింహపు జూలు
పట్టుకు లాగు చివ్వాట గాడు?
ఎవడురా వాడు వక్రించి భారత దేశ
సరిహద్దు చెఱుపు దుశ్శాస నుండు?

ఎవడు లాహోరు యాత్ర ముగింపు గాక
మున్నె కార్గిలు వెనుపోటు పొడచినాడు?
వాని చెండాడి శాంతించవలదె నేడు
రండు! విక్రమింపుడు జయ లక్ష్మిగొనుడు!![76]

కాశ్మీరు పొలిమేరలలో దురాక్రమణదారులు పొంచి ఉండి భారత సంపదను కొల్లగొట్టాలనే దుశ్చర్యకు పాల్పడ్డారు. ఈ దురాగతాలను నిలువునా చిత్తుచేయడానికి రమ్మని కవి భారత వీర జవానులనూ, ప్రజలనూ ఎలుగెత్తి పిలుస్తున్నారు.

మన పొరుగువాళ్ళు దుండగీళ్ళు. మన తుహిన పర్వత నిధిని దోచుకొనాలని చూస్తున్నారు. 'తుహిన పర్వత నిధి' అంటే భారతీయ సంస్కృతి అన్నమాట. మన ప్రక్కయింటివాడు మోసగాడు. కాశ్మీర కస్తూరిలో బురదనింపాలని ఉద్యమిస్తున్నాడు. మనలను సోదరులు అంటూనే రణక్రీడలో శాంతించిన సింహం జూలు పట్టుకొని లాగుతున్నాడు. వాడు దుశ్శాసనుడు. వక్రబుద్ధితో భారతదేశ సరిహద్దులను చెరిపివేయడానికి పూనుకున్నాడు. వాడు లాహోరు సోదర శాంతి యాత్ర ముగిసిపోకముందే కార్గిలు వెన్నుపోటు పొడిచాడు. అలాంటి ముష్కరులను చీల్చిచెండాడవలసివుందని కవి గొంతెత్తినారు.

## అద్భుత రసం

రచనలో అద్భుత రసానికి విశేష ప్రాధాన్యం ఉంది. అది భావుకుడైన పాఠకుని



హృదయాన్ని బాగా స్పందింపజేస్తుంది. అసాధారణమూ, అమానుషమూ అయిన సన్నివేశాలు అద్భుత రస సృజనకు హేతువులుగా ఉంటాయి. ధనుంజయుడు "అద్భుత రసాస్వాదనలో చిత్తము విస్తరణ గుణము కలది"[77] అవుతుందని అభిప్రాయపడ్డారు. నిజమే, జీవితంలోని సంఘటనలూ, సమాజంలోని సంఘటనలూ కావ్యంలో వస్తువులో అంగాంగాలలో అద్భుతమైన సృజన శక్తిని ప్రేరేపుతాయి. అతిలోకమైన ఆశ్చర్యాన్ని ప్రకటింపజేస్తాయి. నాటకాలలో అద్భుత రసం ప్రేక్షకులను మరీ ఆకట్టుకుంటుంది. ఆవేశంలో తన్మయత్వాన్ని కలిగింపజేస్తుంది. దీన్నే విస్మయం అంటారు. "అద్భుతానికి స్థాయి భావం విస్మయం"[78] అని లాక్షణికులు తెలిపారు.

తిరుమల కవిత్వంలో అద్భుతరసం పోషింపబడింది. ఆయన ప్రణయ కావ్యం యమునాతటి, యమున, యమునా సైకత తీరాలు, పొగడచెట్లు, బృందావనం, ఇవన్నీ కృష్ణుని రాసకేళికి ప్రాంగణాలు. ఇవన్నీ భౌతిక నేత్రాలకు, ప్రణయ కలాపాలకు కేంద్రాలుగా అనిపిస్తాయి. కాని, అంతర్నేత్రాలకు అవన్నీ మోక్షమార్గాలుగా కన్పిస్తాయి. విస్మయాన్ని సృష్టిస్తాయి.

చూడండి తిరుమల అభివ్యక్తిలో అద్భుతం ఆర్ద్రంగా ఒదిగిపోయింది.

దాగుడు మూతలాడెదము దాగెద పట్టుమటంచు మాధవుం
డేగను చెట్టుచాటు హరిణేక్షణ కన్నుల గంత కట్టి; సం
భోగ తితిక్షతో హృదయ పూర్వక భక్తిని "కృష్ణ"! యంచుఁజే
దేగను దాకగా నది సుధీ నిధి కృష్ణుడునయ్యె నామెకున్[79]

దాగుడు మూతలాడడం అనేది ఒక క్రీడ. ఇది ఉల్లాసంలో ఉద్వేగాన్ని, ఉద్వేగంలో ప్రయోజనాన్ని కలిగించే ప్రక్రియ. ప్రయోజం అంటే ప్రణయంలో ఒక శిఖరాన్ని అందుకోవడమే. భావి తరాలకు ఒక ఆదర్శంగా అందించడమే.

కృష్ణుడు గోపాంగనా-ఇద్దరూ దాగుడు మూతలాడదామని నిశ్చయించుకున్నారు. మాధవుడు వారిణేక్షణ కళ్ళకు గంతలు కట్టి చెట్టుచాటున దాక్కున్నాడు. ఆ మనస్సులో ముమ్మరిస్తున్న సంభోగకాంక్షతో ఆ యదుకుల వేణి నల్లనయ్య కోసం వెదుకుతున్నది. ఇంతలో చేతులకు అక్కడ ఉన్న తీగెతాకింది. మనస్సులో పొంగుతున్న వేగిరపాటులో ఆ తీగెను కృష్ణుడనుకుంది. నిజంగా ఆ లత కృష్ణుడుగా మారింది. ఆ గోపనితంబిని హృదయంలో ముందుగా ఆశ్చర్యం తళ్ళున మెరిసింది. పిదప ఆనందం నిండుగా విరబూసింది. పద్యంలో తీగె కృష్ణుడుగా మారడమనేది అద్భుతానికి సంకేతం.

గోప స్త్రీలు ఒకరినొకరు ముద్దు పెట్టుకోవడం కృష్ణుణ్ని చుంబించటం సహజంగా జరుగుతూనే ఉంటాయి. కృష్ణుని పరియాచకాలను ఎద్దేవా చేసే గోపాంగనాలూ ఉంటారు. ఇవన్నీ కూడా రాసకేళిలోని భాగాలే.

విమలాకాశ శశాంక మూర్తి ముఖమై, విశ్వంభరాభృన్మనో
జ్ఞ మహాసీమయె వక్షమై, గగన గార్జాభ్రంబె వాఘ్బోషయై
కమనీయాంబు తరంగ రంగ యమునా కల్యాణి ప్రేమాంకమై
సుమనోరాగము జేసె కృష్ణ! యనెనో శోభాంగి చుంబించుచున్[80]

కృష్ణుడు ఒక్కొక్కరికి ఒక్కొక్క రూపంలో ఒక్కొక్క భంగిమలో కన్పిస్తున్నాడు. ఒకరికి మన్మథుడిలా కన్పిస్తే, మరొకరికి సృష్టిరూపంలో దర్శనమిస్తాడు. కుసుమాస్త్ర లాంటి మగువకు అద్భుతమూర్తిగా ఆ మూర్తిలో ఆర్ద్రప్రణయ భావుకునిలా కన్పిస్తాడు. విమలాకాశంలో నిండుగా విరబూసిన చంద్రబింబం లాంటి ముఖం కలవాడుగా, భూగోళం ఉరస్థలంగా, ఆకాశంలోని మేఘ గర్జన మాటలుగా యమునా కల్యాణి ప్రేమాంకంగా కృష్ణుడు సుమనోరాగం జరిపించాడు. ఇది ఆ మదవతి మనస్సులో మెదిలిన కృష్ణుని కమనీయ రూపం. ఇది పోతన్న వామనావతార ఘట్టంలో 'ఇంతింతై' పద్యాన్ని స్ఫురణకు తెస్తుంది. అయితే ఇందులో తిరుమల ముద్ర స్పష్టంగా కన్పిస్తుంది.

## శాంత రసం

'విశ్వశ్రేయం కావ్యమ'ని పెద్దలన్నారు. విశ్వశ్రేయానికి బలమైన సాధనం శాంతం. మనుషుల మధ్య దూరాలు చెరిగిపోయి ఆత్మీయత అల్లుకుంటే ద్వేషం అంతరించి స్నేహం పుష్పిస్తే లోకం హరిత శోభతో ప్రవర్ధిల్లుతుంది. కూటనీతి, యుద్ధం ఇవన్నీ అశాంతిని ప్రజ్వలింపజేసే పైశాచిక కోణాలు. ఇవి అంతరించి పోవాలన్నది కవి ఆకాంక్ష.

కురుక్షేత్రం, పానిపట్టు, బొబ్బిలి
క్రిమియా, కొరియా రణభూముల్ని
ప్రథమ ద్వితీయ ప్రపంచ సంగ్రామాల్ని
చరిత్ర చెరసాలలో బంధించి -
ఈ భీకర భయదాంధ జీవితానికి
ఒక ప్రభాతరేఖని వెలిగించటానికి
అంతరాత్మను రగిలిస్తున్నాను
హృదయాంతరాళాల్ని శోధిస్తున్నాను[81]

భీకర భయదాంధ జీవితంలో ఒక సుప్రభాత రేఖను వెలిగించటం, అందుకోసం అంతరాత్మను రగిలించటం అనేది శాంతి సాధనంలో ప్రథమ మజిలీ. ఈ మజిలీని నిర్విఘ్నంగా దాటివేస్తే ఆపైన అందేది శాంత నవ సౌధం. అదే మానవజాతికి పాథేయమైంది. దీన్ని అందించటానికి కవి తపస్సు దీక్షతో సాగుతుంది.

ఇన్నాళ్ళకి
అమృతం నా భావం మీద కురిసింది



ఇన్నేళ్ళకి
అందం నా హృదయం మీద విరిసింది
నీడల్ని తొలగించుకుంటూ
విషాదాల్ని దాటుకుంటూ
వినోదాల్ని మీటుకుంటూ
అంతరాత్మలో శాంతి బీజాలు నాటుకుంటూ
నడుస్తున్నాను[82]

అని కవి తన శాంతి యాత్రను సాగిస్తారు. ఈ అయనం వలన వనంలో నుంచి జ్ఞానబోధ వినిపిస్తుంది. ప్రేమపాత్రలో అవ్యక్త మధురానంద ధారలు కురుస్తాయి. ఉషః కిరణ స్పర్శతో శాంతి అనే బిందువు సుగంధ సింధువుగా మారుతుంది.

తిరుమల ప్రాచీన కవిత్వాన్ని, ఆధునిక కాలంలో వెలువడిన సాహిత్యాన్ని విస్తృతంగా అధ్యయనం చేశారు. రచనకు మాధుర్య గుణంతోపాటు భావావేశాన్ని పెంచే సాహిత్య సోపానాలలో నవరసాల ప్రాధాన్యతను గుర్తించారు. సన్నివేశాలకు అనుగుణంగా రసాలను ప్రవేశపెట్టి తన కవిత్వాన్ని రసాభిరామం చేశారు.

## 3. వర్ణనా ప్రియత్వం

కవి తాను దర్శించిన వస్తువును బాగా పరిశీలించి, భావించి, చమత్కార జనకంగానో, రసరమ్యంగానో, సహజత్వం ఉట్టిపడేటట్లుగానో చెప్పడం వర్ణన. సందర్భోచితంగాను, రసానుగుణంగాను చేసిన వర్ణనలు కావ్యానికి శోభను కలిగిస్తాయి.

'లోకోత్తర వర్ణనా నిపుణ కవి కర్మకావ్యమ్' అని భామహుడు కావ్యాన్ని నిర్వచించారు. దీనిని బట్టి కవి వర్ణనా నిపుణుడు అయి తీరాలి. కావ్యంలో వర్ణనలు తప్పకుండా సందర్భానుసారంగా ఉండి తీరాలి.

ప్రాచీన కాలం నుంచీ తెలుగు కావ్యాలలో వర్ణనలు అగుపిస్తున్నాయి. క్రీ.శ. 6 శతాబ్దికి చెందిన భామహుడు వర్ణనలు అయిదు[83] రకాలని పేర్కొన్నాడు. ఇదే కాలం వాడైన దండి,[84] 14వ శతాబ్దానికి చెందిన విద్యానాథుడు,[85] విశ్వనాథుడు[86] వర్ణనలు ఇరవై నాలుగని ప్రతిపాదించారు. 'అలంకార శేఖరం'లో కేశవమిత్రుడు ముప్పై రెండు[87] వర్ణనల్ని ముచ్చటించగా, నరసభూపాలీయ కర్త (భట్టుమూర్తి) పద్దెనిమిది[88] వర్ణనల్ని పేర్కొన్నాడు. ప్రబంధ కర్తలు ఈ వర్ణనల్నీ, వాటికి సంబంధించిన నియమాల్ని పాటించారు. కాల క్రమేణా ప్రబంధ నిర్మాణం తగ్గిపోయింది. మహాకావ్యాలు అంతరించి ఖండకావ్యాలు అవతరించాయి. వీటిలో కథకు ప్రాధాన్యం ఉండదు. ఇక్కడ ముఖ్యమైనదల్లా భావ పరంపరా ప్రకటనే, అవసరమైనప్పుడు సందర్భాన్ని బట్టి వర్ణనలు చెయ్యవచ్చు. వర్ణనా నిపుణుడైన కవి వర్ణ్య వస్తువును చిత్తరువులాగా మన కళ్ళముందు సాక్షాత్కరింప జేస్తాడు.

రసోచితం, హృదయాహ్లాదకరమూ అయిన వర్ణనలు పాఠకుల్ని రసలోకంలో విహరింపజేస్తాయి. కావ్య సౌందర్యాన్ని ఇనుమడింపజేస్తాయి.

## పురవర్ణన

ప్రాచీన కాలం నుంచీ కావ్యాలలో పురవర్ణన చోటు చేసుకుంది. కథ ప్రారంభం పురవర్ణనతోనే మొదలవుతుంది. కవులు తమ పాండితీ ప్రాభవాలను ప్రదర్శించుకోవడం ఇక్కడ నుంచే ఆరంభమవుతుంది. అంతేకాదు, కావ్యంలో అక్కడక్కడా పురవర్ణన కన్పిస్తుంది.

ఆధునిక కాలంలో కూడా కొందరు కవులు నగరాలను, పట్టణాలను తనవితీరా వర్ణించారు. అభ్యుదయ యుగంలో కూడా ఈ విధానం కన్పిస్తుంది. శ్రీరంగం నారాయణ బాబు విశాఖ అందాలను అభ్యుదయ దృక్పథంతో చిత్రించారు.[89] మహాకవి తిలక్ హైదరాబాదు నగరంలోని కొన్ని చారిత్రక స్థలాలను తనదైన శైలిలో హృద్యంగా అభినుతించారు.[90] సినారె కూడా భాగ్యనగర వైశిష్ట్యాన్ని గుండెలుప్పొంగగా గానం చేశారు.[91] జె. బాపురెడ్డి విదేశీ పర్యటన సందర్భంగా ఐరోపా దేశాల సౌభాగ్యాన్ని సహజోక్తులతో చిత్రించారు.[92] కరుణశ్రీ తమ రసార్ద్ర భావుకతతో ఓరుగల్లు విశిష్టతనూ,[93] కపిల వస్తు పురం సౌందర్యాన్ని[94] వర్ణించారు. ఇంకా కొందరు ఆధునికులు, అతి నవ్య కవులు ఇలాంటి వర్ణనలు చేసి తమ కవితాభివ్యక్తిని చాటుకున్నవారే.

ఆచార్య తిరుమల చేపట్టిన ప్రతి వస్తువును కమనీయంగా వర్ణించినట్టుగానే కొన్ని పట్టణాల విశిష్టతను ప్రత్యేకంగా వర్ణించారు. ఆంధ్రుల రాజధాని హైదరాబాదు నగర వర్ణనను ప్రారంభిస్తూ సొంపైన భాగ్యనగరం అనీ, తెలుగు ప్రభల కలహంసల మహాసరోవరం అనీ అన్నారు.[95] హైదరాబాదును భాగ్యనగరం అనడంలోనే ఔచిత్యం ఉంది. సంపదలతో భాసిల్లుతుందనే అర్థం స్ఫురిస్తుంది. అంతేకాక, తెలుగు కాంతుల కలహంసలు విహరించే విశాలమైన సరోవరం లాంటిది. ఇక్కడ తిరుమల తెలుగు కాంతుల కలహంసలలా కవులు రచించిన కవితలు హిమస్వచ్ఛంగా అందంగా ఉన్నాయని చెప్పటమూ. ఈ వర్ణనం తిరుమల నగర వైభవాన్ని తెలపడం మాత్రమే కాక, తెలుగు సంస్కృతీ సంప్రదాయాల విశిష్టతను కూడా చెప్పినట్టయింది. ఇదే కవితలో "ఆ రవీంద్ర భారతి భవనమైన కవనం"[96] అని చెప్పారు. రవీంద్ర కవీంద్రుని కవితా భారతి భవనంగా రూపొందిందని అభివ్యక్తీకరించడంలోనే తిరుమల కవితా భారతి సోయగాలు కన్పిస్తున్నాయి.

బిర్లా మందిరం కవి హృదయానికి

"నీలాద్రిని బిర్లా పాలరాతి కోవెల
నిఖిలానికి వేంకటపతి నయనాల వెన్నెల"[97]లా కనిపించింది.

తెల్లని కాంతులతో భాసిస్తున్న బిర్లా మందిరం పాలరాతి కోవెల. అది నిఖిల ప్రపంచానికి శ్రీ వెంకటేశుని కళ్ళ వెన్నెలలా తెల్లనైనదీ, చల్లనైనదీను. ఈ ఆలయ చిత్రణంలో తిరుమల కవితా పటిమ చక్కగా కన్పిస్తుంది. హైదరాబాదు పట్టణం హిందూ, ముస్లీం,



సంస్కృతీ సంప్రదాయాలకు సమ్మిళితమైన కేదారంగా ఉందని ఈ జంట నగరాల శోభలన్నీ మన భారతదేశానికే ప్రకాశమని వర్ణించారు. ఇట్లే హైదరాబాదు నగర వర్ణనంలో సాలర్జంగ్ మ్యూజియం, హైకోర్టు, రాజ్‌భవన్, హిమాయత్ సాగర్ వంటి అనేక ప్రదేశాలను ప్రతీకాత్మకంగా వర్ణించారు.

తిరుమల రస హృదయులు అగుటచేత చారిత్రక స్థలాలన్నీ ఆయనను ఊరిస్తున్నట్టుగా ఉన్నాయి. ఈ ప్రదేశాలు ఒక్క భారతదేశంలోనివే కానక్కరలేదు. ప్రపంచంలోనివి కూడా ఉన్నాయి. అవి ఆయన హృదయ వాకిటిలో నిండుగా విచ్చుకొని పరిమళాలను ధారగా పోస్తున్నట్టున్నాయి.

ఆగ్రాలో తాజ్‌మహల్
శ్రీనగర్ బోటు హౌసులు
ఢిల్లీలో కుతుబ్‌మినార్
---------------------
అజంతా గుహల వికాసం
ఎల్లోరా శిల్ప విలాసం
కలకత్తా కాళీమాత, ఖాట్మాండు జల నారాయణుడు
రామేశ్వర పాంబన్ బ్రిడ్జి
ఖజురహో మైథున రీతులు
రామప్ప, శ్రావణ్ బెళగొల
బేలూరు, హళేబీడుల శిల్పకళా విన్యాసాలు
భాక్రాడాం సట్లేజ్‌నది - నాగార్జున సాగర కృష్ణ
గంగా గోదావరి, నర్మద కావేరి సింధు జలాలు
క్షణక్షణం ఊరిస్తున్నాయ్! ఊరిస్తూ ఉడికిస్తున్నాయ్[98]

ఇంకా బదరీ, గయ, ప్రయాగ, ద్వారక, శ్రీశైలం, తిరుపతి వంటి స్థలాల జయగంటలు మ్రోగుతూ కవిని కవ్విస్తున్నాయి. అట్లాగే ప్రపంచంలో ఉన్న స్థలాలు కూడా తిరుమల అక్షరాలలో అభిషిక్తమై హృదయానందాన్ని కలిగిస్తున్నాయి.

ఉత్తర ధ్రువ ఆరోరా బొరియాలిస్
దక్షిణ ధ్రువ పెంగ్విన్ పక్షి
సాగరాల సరిగమ సీమ - పర్వతాల శీతల వసనం
స్వాగతాలను చిలుకుతు వున్నాయ్
రోడ్స్ కొలాసస్ అపోలో శిల్పం
బాబిలోన్ వ్రేలాడే తోటలు
హలి కర్నసస్ మా సులస్సమాధి
షారోన్‌లో వైట్ హౌస్

ఒలంపియా జూస్ విగ్రహం
ఆసియాలో దయానాలయం
ఈజిప్టులో పిరమిడ్లు
కలల తుఫానులు రేపుతువున్నాయ్
మనసును ఉప్పెన చేస్తున్నాయ్[99]

అరోరా బొరియాలిస్, పెంగ్విన్ పక్షులు, రోడ్స్ కొలాసస్, అపోలో శిల్పం, వేలాదే తోటలు కవిని రమ్మంటున్నాయి. స్వగతోక్తులతో ఆయన హృదయ విపంచిక మీద గీతాలుగా మోగుతున్నాయి. ఇంకా అవన్నీ కవిలో కలల తుఫానులను రేపుతున్నాయట. మనస్సును ఉప్పెన వలె ముంచుతున్నాయట.

## గ్రామీణ వర్ణన

గ్రామాలు ప్రకృతి మాత ఒడిలో తూగే అందాల సీమలు. వాగువంకల మధ్య నిండుగా విరబూసిన వనాల మధ్య, వనాల నుంచి అలలు అలలుగా వస్తున్న పరిమళాల మధుర స్పర్శల మధ్య నిత్యం పులకించిపోతాయి. రుతు ధర్మాలను అనుభవిస్తూ, వసంత, శరత్ రుతువులలో మరింతగా పరవశించిపోతూ సౌందర్యాలను పంచుతూ మంచికి, మానవతకు దగ్గరగా పల్లెసీమలు ఆదర్శాన్ని పెంచుతూ ఉంటాయి.

తిరుమల గ్రామసీమలను 'గేయ' ప్రక్రియలో సహజసుందరంగా అభివర్ణించారు. పల్లెలు చిందించే అందాలు "వెన్నెల్లో పువ్వల్లె కనువిందు చేసేను"[100] అంటారు. పూలు అంటేనే మనస్సు రసమయం అవుతుంది. ఈ రెండూ మనస్సుకు సంబంధించినవే. పువ్వులు వెన్నెల వెలుగులలో తడిసిపోతూ ఉంటే ఆ దృశ్యం కళ్ళకు విందు చేసినట్టుగా అనిపిస్తుంది. అంతే కాదు. కవ్విస్తున్నట్టుగా అనిపిస్తుంది.

పారే సెలయేరు కమ్మగా పాడేను
పచ్చని వరిచేలు సయ్యాటలాడేను
వెలసిన కోవెల - కూసే కోయిల
కురిపించులే దీవెన మనసారా
ఈ అందం ఆనందం రాగాలు తీసేను[101]

సెలయేరులు ప్రవహిస్తూ పాడతాయి. పచ్చని వరిచేలు సయ్యాటలాడతాయి. ఊరిలోని కోవెల మాత్రమే కాదు. పల్లె కొమ్మల మీద కూర్చొని కోయిల కూడా మనసారా దీవెనలు కురిపిస్తుంది. అవి అందాలను దిద్దుతాయి. సింగారింపబడిన అందాలు ఆనందరాగాలు తీస్తాయి. ఈ కవితా పంక్తులలోని కోవెల, కోయిల అనే రెండు మాటల శైలి సౌందర్యం కోసం ప్రయోగింపబడిన పదాలు మాత్రమే కాదు. కోవెల మనిషిలో ఆధ్యాత్మిక విలువలను ప్రేరేపిస్తూ ఆముష్మిక చింతనను దృఢతరం చేయిస్తూ పారలౌకిక సౌఖ్యాలను ప్రసాదిస్తుంది. కోకిల గళం నుంచి రాగ మాధురులను చిలికిస్తూ ప్రపంచాన్ని రాగరసమయం చేస్తూ



కళ్ళకూ, మనసు కళ్లకూ నిత్యం వసంతాన్ని ఇస్తుంది. ఇది కేవలం లౌకికంగా అనిపించినా ప్రకృతికి చేరువగా ఉంటుంది. మనిషి ఆముష్మిక చింతనకు ప్రకృతి కూడా తన సహకారాన్ని అందిస్తుంది. తిరుమల మనిషికి రెండు పార్శ్వాలుగా అమరిన కోవెల, కోయిలల తాత్విక దృక్పథాన్ని పాఠకుల హృదయ నేత్రాల ముందుంచారు.

అట్లాగే,

చూడ చక్కని రంగవల్లులు
మావి తోరణం మమతల జల్లులు
చూపులతోనే పలకరింపులు
తీయని నవ్వుల పులకరింతలు
ఈ వన్నెలు - ఆ చిన్నెలు - బంధాలు వేసేను[102]

వాకిళ్ళలో తీర్చబడిన రంగవల్లులు పల్లె స్త్రీల అమాయకమైన హృదయ సౌందర్యాన్ని, వాళ్లకు అందిన పురాణ కథా పరిచయాలను తెలియజేస్తాయి. ఇది సహజత్వాన్ని కలిగి వాకిళ్ళను మాత్రమే శోభావిలసితం చేయవు. మనసు లోగిళ్ళను కూడా రసమగ్నం చేస్తాయి.

ద్వారాలకు తీర్చబడిన మావి తోరణాల పచ్చదనాన్ని మాత్రమే కాదు, మమతల జల్లులు కురిపిస్తాయి. పల్లె ప్రజలు ఆత్మీయతకు ప్రతీకల వంటివారు. పలకరించుకోవడం, మమతానురాగాలను వరుసలతో పంచుకోవడం, అనుబంధాలను పవిత్రంగా అల్లించుకోవడం, కష్టాలలో చేతులందించుకోవడం పల్లె ప్రజలకు మాత్రమే సాధ్యమవుతుంది. అంతేకాక, మనిషి కనిపిస్తే తీరిక లేకపోతే చూపులతో ప్రశ్నించుకోవడం, మౌనంగా సమాధానం చెప్పుకోవడం వాళ్ళనైజం. ఈ ముగ్ధత్వాన్ని చూసిన తిరుమల ఇవన్ని వన్నెలని, చిన్నెలని, అందిరికీ బంధాలు వేసే మధురమైన సూత్రాలని చెప్పారు.

తిరుమల పల్లెల్లోని ప్రతి అంశాన్నీ కవితామయం చేశారు.

పాడి పంటల పచ్చని నవ్వులు
పద కవితల నర్తించే మువ్వలు[103]

పాడి పంటలు సమృద్ధిగా ఉంటేనే మనిషి అధరాలపై చిరునవ్వులు విరిసేవి. పల్లెలలో శాస్త్రీయమైన గీతాలు కాదు వినిపించేవి. గుండె నుంచి దూసుకొని సహజత్వాన్ని చిందించే జానపద గీతికలు. వీటితో పల్లెపట్టులు ఆరామ సుందరంగా కనిపిస్తాయి. ఆనందభైరవి రాగంలో తడిసిపోతున్నట్టు పరవశింపజేస్తాయి ఈ దృశ్యాలు.

పల్లెలలో వచ్చిన మార్పులను తిరుమల హృదయ రంజకంగా వర్ణించారు.

పేద గొప్ప ఎంచదు సంఘనీతి
వెలుగుతోంది రేపవలు అక్షర జ్యోతి

కష్టించే వారికి కడుపు నిండ తిండి
కష్టందోచే వారికి కాశీ చండి!
తలుపు తట్టి బిలుస్తోంది అధికారం
పిలిచి అప్పులిస్తోంది ధనగారం
భలేగా సాగుతోంది బ్రతుకు నావ
కొత్త వెలుగులో అదిగో! పల్లె త్రోవ[104]

తిరుమల పల్లెను మరింత భావ గర్భితంగా దర్శించిన విధం తాత్త్వికంగా ఉంది.

ప్రకృతి యాజ్ఞనూని ప్రజ్ఞా విశేషాన
అమృత సత్య దర్శనంబు వడసి
నిరుపమానమైన నిర్గుణాత్మక భావ
సిద్ధి నొందుటనియె జీవ ఫలము[105]

పల్లె ప్రకృతి అనుమతిని పొందుతుంది. ప్రజ్ఞ విజ్ఞత వంటి విశేషాలతో అమృత సత్య దర్శనాన్ని పొందుతుంది. నిరుపమానమూ, నిర్గుణాత్మకమూ అయిన భావసిద్ధిని పొందుతుంది. అదే మనిషికి నిజమైన జీవఫలం. ఇలాంటి గ్రామ సీమలను విడిచిపెట్టి పట్టణాలకు ఎగబ్రాకే వాళ్ళను చూసి బాధపడతారు.

పల్లెటూళ్ళు విడిచి పట్టణాలకు చేరి
బాపుకొనెడిదేమి బడుగు ప్రజలు
పూలు, తీగెవీడి బురదలో నడినట్లు[106]

తిరుమలకి గ్రామ సీమలంటే అమిత అనురాగం ఉంది. ఆయన తన అనురాగాన్ని, ఆత్మీయతను కవితలో అందించి రసజ్ఞులను అలరించినారు.

## లేపాక్షి శిల్ప వర్ణన

లీనమయ్యె మనసు లేపాక్షి శిల్పాల
రాతి కంబములకు రమ్య కావ్య లతలు
పూసే, ఏమి లావణ్య భాగ్యమ్ము!
వృద్ధముని వలె గుడి వెలసి యుండె!![107]

ఇది లేపాక్షి శిల్ప వర్ణన. లేపాక్షిలో ఉన్న బసవన్న భారతదేశంలో ఉన్న నందీశ్వర మూర్తుల కంటే పెద్దది.[108] అడవి బాపిరాజు "లేపాక్షి బసవయ్య లేచి రావయ్య, కైలాస శిఖరిలా కదలి రావయ్యా"[109] అని రాసిన గేయం ఆ మూర్తి స్వరూప స్వభావాన్ని బాగా చాటి చెప్పిన గేయం. తెలుగు ప్రజలను అలరించిన గేయం అది. లేపాక్షి శిల్పాల అందాల గంధాలను కవి సహజోక్తులతో అభివర్ణించారు. లేపాక్షి దేవాలయం విజయనగర రాజుల శిల్ప ప్రతిభకు నిదర్శనం. ఇది ఒకే మండపం చుట్టూ నిర్మించిన పాపనాశేశ్వర, శ్రీరామ



వీర భద్రాలయాల సమూహం. దీనిని వీరణ్ణ, విరూపణ్ణలు నిర్మించారు. హన్మకొండ,[110] పాలంపేట,[111] హంపి[112] ఇలాంటి ప్రదేశాలలో శిల్పాలు మనోహరంగా ఉన్నాయి. అయితే లేపాక్షిలో ఉన్న శిల్పాలు వీటికంటే భిన్నంగా ఉన్నాయి. దీనికి ఆనాటి పాలకుల అభిరుచులే కారణం అనిపిస్తాయి.

లేపాక్షిలోని రాతి స్తంభాలకు కావ్యలతలు పూశాయట. స్తంభాల మీద తీగలు దట్టంగా అల్లుకొని పుష్పించడం సహజం. ఈ శిల్పాలను దర్శించి పరవశించిన కవులు ఎందరో వాటి మీద కావ్యాలు రచించారు. ఆ కావ్యాలే లతలుగా పుష్పించాయి. అక్కడి వాతావరణం లావణ్య భాగ్యాన్ని సంతరించుకొంది. అక్కడి ఆలయ స్తంభాలను మీటితే సరిగమలను పలుకుతాయి. దీనికి తోడు అక్కడో గుడి వున్నదట వృద్ధమునిలాగా, ముని అంటే మౌనం కలవాడు. ప్రశాంత మనస్కుడు. జీవితంలోని కలతల్ని అధిగమించి తురీయాశ్రమంలో జీవిత శేషాన్ని గడుపుతున్నవాడు. ప్రలోభాలకు లొంగనివాడు. ఏకాగ్ర చిత్త విశ్రాంతుడు. పైగా వృద్ధుడు. శరీరం శిథిలమైనా ఆత్మబలంతో ప్రకాశించేవాడు. గుడిని అటువంటి మునితో ఉపమించడం వల్ల అది ప్రశాంతతతకు నిలయమనే భావం ధ్వనించడమే కాకుండా ఉపమానంతో ఉపమేయానికి గౌరవం చేకూరింది. అంతేకాదు, ముని అంటే "క్షుత్పిపాసాదులతో శతాబ్దులు శతాబ్దులు యోగ సమాధి"[113]లో ఉండి "ప్రకృతి కావల నిల్చి త్రికాల వేదులై"[114] ఈశ్వరవాణి పలికిన భాగవోత్తములు అని కవులు నిర్వచించారు. అలతి అలతి పదాలతో కూడిన ఈ పద్యం నడక కూడా ప్రశాంత వాతావరణాన్ని సూచిస్తుంది.

## సూర్యోదయ వర్ణన

దూర తీరాన అల్లదే తూర్పుకొండ
ధ్యాన యోగ సమాధిలో స్థాణునట్లు
కొండ కొమ్మున అల్లదే కొత్త వెలుగు
తామ్ర వర్ణాంచిత జటా కదంబమట్లు[115]

దూరపు కొండలు నునుపు అని సామెత. దూరంగా ఉండి చూస్తే అవి నునుపుగా కన్పిస్తాయి. వాటిలోని ఎత్తు పల్లాలు కనిపించవు. అలాగే దూరం నుంచి చూసినపుడు అవి ఏదో ఒక ఆకారంలో కన్పిస్తాయి. అదే విధంగా తూర్పుకొండ ధ్యాన యోగ సమాధిలో వున్న స్థాణువులాగా కనిపిస్తోందట. స్థాణు శబ్దానికి స్థిరమైనదనీ, శివుడనీ రెండు అర్థాలు. పర్వతం కదలదు. మెదలదు. అది ఒక స్థాణువు. ధ్యాన యోగ గతుడైన శివుడు కూడా కదలడు. మెదలడు. కాబట్టి ఆయన కూడా స్థాణువే.

ఉదయాద్రి శిఖరాన పొడసూపే వెలుగు తామ్రవర్ణంతో కూడిన జటాకదంబంలాగా కన్పిస్తుంది. ఉషఃకాంతి లాగానే జటాకదంబ కాంతి కూడా తామ్ర వర్ణ సంకలితమే. ఉదయాద్రిని యోగీశ్వరుడైన పరమ శివుడితో పోల్చడం, ఉదయ రాగాన్ని ఆయన జటాజూట కాంతిగా అభివర్ణించడం సహజ సుందరంగా ఉంది.

## చైత్రోదయ వర్ణన

వసంతం రాగానే నవ చైతన్యం తాండవిస్తుంది. వయస్సు పరవశం చెందుతుంది. మనస్సు కొత్త కోరికలతో పుష్పించి మధురానుభూతులతో పరిమళిస్తుంది. ఈ భావం 'శరీర వనంబెల్ల హసించు'[116]అనే ప్రయోగంలో నిక్షిప్తమై ఉంది. శరీరాన్ని శృంగారోద్దీపన హేతువైన వనంతో పోల్చి, వసంత వికాసాన్ని వన దరహాసంగా చెప్పడం రసోచితమైన ఊహే.

చిన్న చిన్న పదాలతో అంతర్భూతమైన ఒక భావాన్ని వ్యంజింపజేసే పద్ధతి చైత్రవర్ణనల్లో కన్పిస్తుంది.

ఆకులు రాలిపోయినవి ఆమనికై ఎదతోటలోన ఏ
కోకిల కూనయో చివురు గొంతుకతో సవరించు కోరికల్
లోకము నావహించె; శుభలోచన పద్మ విముక్త మన్మథ
శ్లోకము లాలపించు రతి సుందరియై బ్రతుకెల్ల పొంగెడున్[117]

జీవితం నవనవోన్మేషంగా ఉండాలని మానవ హృదయం ఎప్పుడూ తాపత్రయ పడుతుంది. నిత్య వసంతం కోసం ఉవ్విళ్ళూరుతుంది. దీని కోసం ముదిరి పండిపోయిన పాత జీవిత సంకేతాల్ని (ఆకుల్ని) విడిచిపెడుతుంది. ఈ పద్యంలో మరో విశేషం ఉంది. 'ఆకులు రాలిపోయినవి' అని ప్రారంభమై 'బ్రతుకెల్ల పొంగెడున్' అని అంతం అవుతుంది. పద్యం మధ్యలో 'కోరికల్ లోకము నావహించె' అని ఉంది. ఈ కోరికలు జీవిత చక్ర మధ్యస్థమైన ఇరుసులాంటిది. పాత జీవితాన్ని జీర్ణపర్ణంలాగా పరిత్యజించి కొత్త జీవితంలో పరిభ్రమించడానికి ఈ కోరికల ఇరుసే ప్రధానం.

చిగురుటాశల సంధ్యలు చిక్కబట్ట
కటిక చీకటి కోయిలల్ కాలుదువ్వె!
గానదీపమ్ము వెన్నెల వాన కురిసె
తడిసె ఈ వృద్ధ లోకమ్ము తరుణ దృష్టి!![118]

అది సాయం సంధ్య. నవ పల్లవ కాంతులీనే దిశల్లో సంధ్యా కాంతులు దట్టంగా వ్యాపించాయి. ఈ అర్థంతో పాటు మరో శ్లేషార్థం గోచరిస్తుంది. మధుమాసంలో చెలరేగే కొత్త కోరికలు (చిగురుటాశలు) సాయంత్రం కాగానే బలీయం అవుతాయి శృంగార రసాను భూతికోసం. అటువంటి ఆశలతో పాటు సంధ్యాకాంతులు సాంద్రమైపోయాయి.

ఆ తర్వాత కటిక చీకట్లు వ్యాపించి కోయిలలూ కాలు దువ్వుతున్నాయి. మావి చిగుళ్ళు మేసి మదించిన ఆ కోయిలలు మధురగానం చేస్తున్నాయి. ఆ గానం చీకటిలో దీపంగా భాసించింది. ఆ దీపం వెన్నెల వాన కురిసింది. ఆ వానలో తడిసిన వృద్ధులలో కూడా యౌవన భారం అంకురించిందని. ఒక చిత్రకారుడు సుందర తైల వర్ణ చిత్రాన్ని మన ముందు ప్రదర్శించినట్లు అనిపిస్తుంది. ఈ పద్యం చదువుతున్నప్పుడు.



## చంద్ర వర్ణన

ఆధునిక కవులు చంద్రుణ్ని లలిత శబ్దాలతో మనోజ్ఞంగా వర్ణించారు. చంద్ర మండలం మీద మనిషి అడుగు పెట్టిన తర్వాత కూడా ఆధునిక కవులు, అతినవ్య కవులు చంద్రుణ్ని పూర్వ రూపంలోనే దర్శించడం కన్పిస్తుంది. సినారె మాత్రం చంద్రుణ్ని ప్రశ్నిస్తూ ఆయన దీనత్వాన్ని చూసి

పసబైట పడింది శశీ!
పత్తా దొరికిపోయింది 'చంద్రమసీ'!
సుధకాదు నీలో ఉంది
సుద్ద[119] అంటూ

నీవు హరుని నెత్తికెక్కితే
నీ నెత్తికెక్కను మా నరుడు
నిజంగానే అతడు ఘన భుజుడు
మానవ జాతి చరిత్రలో
మారాకు హత్తిన మరో అజుడు[120]

అంటూ మనిషి సాధించిన ప్రగతికి ప్రాధాన్యతను ఇస్తూ చంద్రుని పై సానుభూతిని చూపించారు.

ఆచార్య తిరుమల చంద్రుణ్ని అందాల జాబిల్లిగా చిత్రించారు. ప్రణయాన్ని ప్రజ్వలింపజేసే మూర్తిలా భావించారు.

పదునారు కళలతో చెన్నారు మోముతో
వెండి బంతియు లాగు వినువీధి ప్రభవించి
తారకామణులు నీ దర్బారు కొలువంగ
ఆకాశ సామ్రాజ్య మంతయును పాలింప'[121] అంటారు.

అమృత, మానద, పూష, తుష్టి, పుష్టి, రతి, ధృతి, శశిని, చంద్రిక, కాంతి, జ్యోత్స్న, శ్రీ, ప్రీతి. అంగద, పూర్ణ, అమృత[122] అనేవి చంద్రునిలోని పదహారు కళలు. ఈ కళలన్నీ చంద్రుని ముఖంలో ఉండడం వలన ఆ ముఖం మరింత శోభాయమానమైందని కవి చెప్పారు. చంద్రుడు వెండి బంతిలా గగన వీధిలో ప్రభవించినాడట. తారకా మణులు ఆయనను కొలుస్తుండగా ఆకాశ సామ్రాజ్యాన్ని పాలిస్తున్నాడట.

చంద్రుడు వెన్నెలను కుమ్మరిస్తున్నప్పుడు ఏవి పులకిస్తాయో, పరవశిస్తాయో తిరుమల మనోజ్ఞంగా చిత్రించారు.

కలకల నవ్వుచు కలువ లేమలు విరియ
కొమరు కోర్కెల చకోరములు పులకింప

పూదీగ జొంపాల పొదరిళ్ళ చాటులో
తొంగి తొంగి చూచి దోబూచులాడంగ[123]

ఈ కవితా పంక్తులు చంద్రుని పదహారు కళలలోని కొన్ని కళల సమ్మేళనంలాగా అందంగా అర్థస్ఫూర్తితో ఉన్నాయి.

లోకాన్ని చంద్రికలతో ముంచివేస్తున్న చంద్రుణ్ని శారద కన్య పిలుస్తుందని సహృదయ సమ్మోహనంగా రాశారు.

మబ్బుతెర ముసుగులో మరుగొందకోయి
నీ కోసమై వీచె నీ రాణి నేలుకో
ప్రణయ స్వాగత గీతి పాడ శారద కన్య[124]

ఈ శారద కన్య ఎవరో కాదు. శరదృతువే. ఆమె చంద్రునిలో విలీనమైనట్టుగానే భావిస్తుంది.

చంద్రమా! ఒక్కటే
నేపూ-నీవు
అందుకే నన్ను చూసి
కడలి పొంగి పోవు!!
పదహారు కళలు వున్న నీవు
పదహారు వసంతాల నేను
నింగిలో-నేలపై పరుగులు తీస్తే
ఆపలేరు ఎవరు-
కోరిక తీరని బ్రతుకే చీకటి
చీకటిలో వెలుగురేక ఆశ
ఆశా సౌధానివీవు అందని వాడవు
నీలాగే నేనూ అందని దానను
అందమైన దానను[125]

అతడు పదహారు కళల రసికుడు. ఆవిడ పదహారు వసంతాల జవ్వని. ఇద్దరూ కలసి పరుగులు తీస్తే నింగీ నేలలో ఎవ్వరూ ఆపలేరని శారద మురిసిపోతుంది. అయితే ఆమెలో విరుద్ధ భావాలు ఎదురెదురుగా ప్రశ్నిస్తాయి. ఎట్లాగంటే కోరిక తీరని బ్రతుకు చీకటిలాంటిదట. ఆ చీకటిలో వెలుగురేఖ ఆశఅట. ఆ సౌధం అందనిదట. ఆమె కూడా అందదట. తిరుమల ప్రకృతిలోని ఒక రసరేఖయైన శరదృతువును శారదగా, ప్రియురాలిగా రూపొందించి చంద్రునితో సయ్యాటలాడించడం సహృదయుల మనస్సులను ఎంతో ఆహ్లాదపరుస్తుంది.



## బెంకాక్ పుర వర్ణన

చూచితి కవితా కాంతా
లోచన సౌందర్య భరము, లోకైక కళా
ప్రాచీ లతా సుమ వరము
వీచీ సౌరభ్య శరము బెంకాక్ పురమున్[126]

రాయల్ రివర్ హోటల్లో కవుల బస ఏర్పాటైంది. ఎత్తైన ఆ రమ్య హర్మ్యంలోంచి చూస్తే భూమి పాదపీఠంలాగా గోచరించిందట. గగన దీపంతో విశ్వాన్ని చూసినప్పుడు 'నేను-నాది' అనే భావం పోయి 'మేము-మాది' అనే భావంతో మేను పొంగిందట. అంటే ఆత్మభావం పోయి విశ్వాత్మ భావం కలిగింది.

బెంకాక్ నగర సభలో తిరుమలకి గోచరించిన దృశ్యాలు-

ఒకట సాగును పాట లొకట రేగును
లొకట నెయ్యపు తేట లొకట పులక
లొకట విందుల నవ్వు లొకట పొందుల
లొకట విలాసమ్ము లొలుకు పలుకు మువ్వ
లొకట రంగుల చూపు లొకట పొందుల చూపు
లొకట సంద్రపులోతు లొలయు చూపు
లొకట కృతి వినతు లొకట సత్కవి లోక
సమ్మతు లొకట శాస్త్రార్థ గతులు[127]

పదాల విరుపుతో సోయగాలు చిందిస్తున్న ఈ పద్యం చక్కని రేఖా చిత్రాల్ని మనకు చూపిస్తుంది.

అన్ని తావుల రేబవళ్లన్ని తావు
లలమి దేశదేశాల కవుల కవిత్వ
శక్తి 'చౌపాయ్' నదిని జేరి సర్వ జగతి
కద్భుతానంద సస్యంబు లందజేసె[128]

సారవంతమైన కవిత్వ శక్తులు ఏకమై చౌపాయ్ నదిని చేరినాయి. నదీ జలమూ, నదీ తీరమూ కూడా సారవంతమే గదా! ఇప్పుడది మరీ సారవంతమై ఆనందాన్ని పండించింది.

కవిత వర్ణనలో సాగితేనే రచన అంతా రసవన్మధురంగా ఉంటుంది. హృదయైక వేద్యంగా ఉంటుంది. తిరుమల వర్ణనా నిపుణుడు కావటం వలన ఆయన రచనలన్నీ కలకండగా ఉన్నాయి.

## 4. అలంకార పోషణ

సృష్టి అంతా సౌందర్యంతో నిండి ఉంటుంది. అలా ఉండటానికి అలంకారాలు ప్రధాన హేతువులుగా ఉంటాయి. కాలాన్ని సూచించే రుతువులలో వసంతం చాలా అందంగా ఉంటుంది. ఆ రుతువులో అన్ని చెట్లు చివుళ్ళు వేస్తాయి. మొగ్గలు తొడుగుతాయి. నిండుగా విరబూస్తాయి. తుమ్మెదలు ఝుంకారనాదాలు చేస్తూ పువ్వుల చుట్టూ పరిభ్రమిస్తాయి. వాటి గుండెల మీద వాలుతాయి. ప్రణయోత్సేకాన్ని మరింతగా పెంచుతాయి. మధువును ఆస్వాదిస్తాయి. కోయిలలు తరుశాఖల మీద కూర్చొని చివుళ్ళతో గొంతులను తడుపుకొని మధురంగా పాడుతాయి. ఇవన్నీ వసంతానికి సింగారాలను పెంచే ఆభరణాలే. తొలకరి వేళలలో నింగిలో నల్లని మేఘాలు గర్జనలో చిందులు తొక్కుతాయి. వాటి హృదయాలలో మెరుపులు తళుక్కున మెరుస్తాయి. రసజ్ఞుని హృదయంలో అనిర్వచనీయమైన ఆనందాన్ని శబ్దింపజేస్తాయి. అవే శారదవేళలలో అనేక రూపాలతో వెండి నగలు అలంకరించుకున్నట్టు శోభను పెంచుతాయి. హేమంతంలో ఎక్కడో ఒక దగ్గర సిగ్గులను ఒలకబోస్తున్నట్టుగా, కవ్విస్తున్నట్టుగా కన్పిస్తాయి. శిశిరంలో భయానక స్వరూపంతో వడగండ్లను కురుస్తాయి. ఈ రుతువులో ఆకులను రాల్చుకున్న తరువులు రతి భావాన్ని భజిస్తున్న తరుణుల్లా కన్పిస్తాయి. ఇవన్నీ ప్రకృతి లాలిత్యాలే. మలుపులు తిరుగుతూ పరుగులు తీసే సెలకన్యలు, మునులలా నిశ్చల గంభీర ధ్యాన ముద్రలో ఉన్న పర్వతాలు, ఆకాశంలో సయ్యాటలాడే చుక్కలు ఇవన్నీ అందాన్ని పెంచే ఆభరణాలే. ఇలాంటివి ఎన్నో ప్రకృతిని అలంకరణలతో జిగేలు మనిపిస్తాయి.

సృష్టిలో ఒక భాగమైన మానవ సమాజమూ అంతే. మనిషి తాను అందంగా ఉండటానికి రకరకాల పద్ధతులతో దుస్తులు, ఆభరణాలను ధరిస్తాడు. ఇళ్ళను అనేక వస్తువులతో సింగారిస్తుంటాడు. అనుభవించే ఆహార పదార్థాలను శుచిగా రుచిగా రూపించుకొని అనుభవించి ఆనందాన్ని పొందుతాడు. కళలను ఆరాధించి, ప్రదర్శించి ఉత్తేజితుడవుతాడు. వాటి ప్రచారానికి పూనుకుంటాడు. వీటిలో ఎన్నో అందాలు లాస్యం చేస్తాయి.

మానవ సమాజంలో పుట్టిన రకరకాల శాస్త్రాలు ఎన్నో ఉన్నాయి. వీటిలో అలంకారాలు ఏదో ఒక రూపంలో ఉంటూనే ఉంటాయి. అయితే సాహిత్యంలో మాత్రం ఇవి చాలా గాఢంగా ఉంటాయి.

సాహిత్యం విశ్వశ్రేయాన్ని ఆకాంక్షించేదీ, ఆనందాన్ని పంచే ప్రక్రియ కావడం వల్ల అలంకారాల ప్రయోజనాలు బహుళంగా ఉంటాయి.

మానవ జాతి జీవన గమనాన్ని తొలుత నిర్దేశించిన వేదాలలో అలంకారాల ప్రస్తావన ఉంది. ఋగ్వేదంలో "కాతే అస్య రజ్ కృతిః సూక్తాః కదాః నూనంతి మఘవన్ దాశేషః[129] అని మనిషి అలంకరణ స్వభావం కలిగిన వాడని ఉంది. వేదాల తరువాత గ్రీకు సాహిత్యంలో 'Aurum'[130] అనే అర్థంలో వాడబడింది.



విశ్వసాహిత్యంలో ఆద్యమైన వేదాల నుంచే అలంకరణమనేది ఉద్బుద్ధమై ప్రపంచ సాహిత్యానికి పుష్టిని చేకూర్చింది. ఇక భారతీయాలంకార శాస్త్రాలు వీటి ప్రయోజనాన్ని అనేక విధాలుగా వింగడించి అభివర్ణించాయి. భామహుడు "సహజ సుందరమైన సౌందర్యమున్నప్పటికినీ అలంకారములు లేనిచో కాంతా ముఖముపై తేజస్సు రాదంటాడు"[131] దండి, వామనుడు, రుయ్యకుడు, కుంతకుడు, విద్యానాథుడు, మమ్మటుడు వంటి అలంకారికుల అభివ్యక్తిలో అలంకారాలు కవితలో భావుకతను పెంచి సౌందర్యాన్ని అతిశయింపజేసే రసప్రక్రియగా అభివర్ణించారు. సంస్కృత, ఆది కావ్యమైన రామాయణంలో అలంకారాలు ప్రస్తావింపబడినాయి. పాణినీయంలో ఉపమాన ఉపమేయాలు అభివ్యక్తమైనాయి. నిరుక్తంలో ఉపమాలంకారం చెప్పబడింది. అగ్ని పురాణంలో వివరింపబడినాయి.[132]

అలంకారాల సంఖ్య విషయంలో పండితాభిప్రాయాలు రకరకాలుగా ఉన్నాయి.

"భరతుడు మూడు అలంకారములను చెప్పెను. అగ్నిపురాణమున ఎనిమిది చెప్పబడెను. విష్ణు ధర్మోత్తర ఖండమున పదునేడు చెప్పబడెను. భామహుడు ముప్పదియారు చెప్పెను. దండి ముప్పెదియైదు, ఉద్భటుడు ముప్పదియేడు, వామనుడు ముప్పది యొకటి, విద్యానాథుడు అరువదియారు, విశ్వనాథుడు డెబ్బది, రుద్రటుడు అరువది యెనిమిది, భోజుడు డెబ్బది రెండు, మమ్మటుడు ఏబది తొమ్మిది, రుయ్యకుడు డెబ్బది మూడు, జయదేవుడు నూరు, అప్పయ్య దీక్షితులు నూట యిరువది నాలుగు అలంకారములను జెప్పెను. జగన్నాథ పండిత రాయలు ఉత్తరాలంకారము వఱకు డెబ్బది అలంకారములను అసంపూర్ణముగా చెప్పెను".[133] అలంకారికుల మతాలలో భేదాలున్నా, అభివ్యక్తిలో భేదాలున్నా అవన్నీ కావ్య సౌందర్యాన్ని పంచే రసరేఖలని భావింపవచ్చు.

ఆధునిక మహాకవి ఆచార్య తిరుమల రచనలలో వివిధ అలంకారాలు ప్రయోగింపబడినాయి. ఆయన రచనలలో అలంకార ప్రస్థానం సహజంగా ఉంటూ లాలిత్యాన్ని ఇనుమడింపజేసాయి.

### 1. శబ్దాలంకారాలు

#### 1. అంత్యానుప్రాసం

పదాల చివర లేక పాదాల చివర ఒకే అక్షరం లేక అక్షర సముదాయం మరల మరల వచ్చుట.

సిరులకు పుట్టినిల్లు, శ్రమ జీవులకు కున్విరిజల్లు, సత్కవీ
శ్వరులకు పూలవిల్లు - పగవారల కుందగ తుమ్మముల్లు ఖే
చరులకు తీపికల్లు - మతి స్వార్థులకున్ రణభీమమల్లు-సు
స్థిర నిగమాంతరంగులకు శ్రీధరునిల్లల జెల్లు నాంధ్రమున్[134]

ఆంధ్రదేశం సిరులకు పుట్టినిల్లులాంటిది. శ్రమ జీవులకు పూలజల్లులాంటిది. సత్కవులకు పూలవిల్లు లాంటిది. శత్రువులకు తుమ్మముల్లులా తాకుతుంది. ఖేచరులకు తీపి కల్లులాంటిది. స్వార్థపరులకు రణభీములాంటిది. స్థిరమైన నిగమాంతరంగులకు శ్రీధరుని నివాసమైన వైకుంఠం లాంటిదని కవి చెప్పారు. ఇందులో 'ల'కారం పదాంతంలో అవృత్తి చెందడం వలన పద్యానికి సొగసు ఇనుమడించింది.

## 2. వృత్త్యనుప్రాసం

ఒక వాక్యం నందు గాని, పద్య పాదం నందు గాని అక్షరం అవృత్తి చెందుట వృత్త్యనుప్రాసం.

ఒకట సాగును లొకట రేగును మాట
లొకట నెయ్యపు తేట లొకట పులక
లొకట విందుల నవ్వులొకట పొందుల మువ్వ
లొకట విలాసమ్ము లొలుకు పలుకు
లొకట రంగుల చూపు లొకట పొంగుల చూపు
లొకట సంద్రపు లోతు లొలయు చూపు
లొకట కృతి వినతు లొకట సత్కవి లోక
సమ్మతు లొకట శాస్త్రర్థ గతులు[135]

ఈ పద్యంలో 'ల'కారం, 'ట'కారం పలుమార్లు ఆవృతమయ్యింది.

## 3. యమకం

స్వరసహితములగు వ్యంజనముల కావృత్తి కలుగుట[136] యమకం. (అర్థభేదం గల పదం మరల మరల వచ్చుట).

రామా! గుణగంధసుమా
రామా! నీ పూజ సేయ రామా! దయతో
రా, మా మొరవిన మనసా
రా మాటాడగ జనుల దొరా! మా తండ్రీ[137]

'రామా నీ పూజసేయ రామా' 'రామా మొరవిన' 'రామాటడగ' అనే పదాలలో యమకం ప్రయుక్తమైంది. కవి శ్రీరామచంద్రునికి స్వాగతం చెప్పడంలోనే అభ్యర్థనాన్ని మిళితం చేసి శబ్దాలంకార మాధుర్యాన్ని తెలిపారు.

## 4. ఛేకాను ప్రాసం

ఛేకం అనగా పలుకుబడిలోని అందం అని అర్థం. అర్థ భేదంతో హల్లుల జంట పదాలు వ్యవధానం లేకుండ ఒకటి వెంట మరొకటి వచ్చుట.



ఎన్నికలలో - ఎన్ని-కలలో
ఒక చేపకై ఎన్ని వలలో[138]

ఎన్నికలొస్తాయి. పోటీ చేస్తున్న వాళ్ళకూ, ఓటు వేస్తున్న వాళ్ళకూ కలలు విరబూస్తాయి. నేనే విజయం సాధిస్తానని నేత, నాకు నచ్చినవాడే గెలుస్తాడని ఓటరు కనే కలలను కవి ఛేకాను ప్రాసంలో తీర్చిదిద్దారు ఇక్కడి కవి. ఎన్నికలలో, ఎన్ని-కలలో అని రెండేసి పదాలను వెంట వెంట ప్రయోగించి 'ఛేకు'ను కల్పించి శబ్ద మాధుర్యాన్ని రసహృదయాలలో తరగలెత్తించారు.

## 5. ముక్తపదగ్రస్తం

వ్యవధానం లేకుండా ఒక మారు వాడి విడిచిన పదాన్ని వెనువెంటనే మరల రెండవ పాదం మొదట గ్రహించి చెప్పుట.

కనుల ముందర గోళాలు కదలియాడె
కదలియాడెడు కనులలో కలలురేగె
కలలురేగెడు వలపులు జలదరించె
జలదరించెడు గుండెలో శిలలు మొలిచె[139]

కళ్ళముందు గోళాలు కదిలాయి. అలా ఆడుతున్న కళ్ళల్లో కలలు చెలరేగాయి. అలా చెలరేగుతున్న కళ్ళ నుంచి వలపులు జలదరించాయి. అలాంటి గుండెలో శిలలు మొలిచాయి అని వర్ణించారు. ఇందులో కదలియాడు, కలలు రేగు, జలదరించు అనే పదాలు పదాంతాలలో ప్రయోగింపబడి తిరిగి పాద ప్రారంభంలో అభివ్యక్తమువడం వలన మనోజ్ఞమైన ముక్తపదగ్రస్త శబ్దచిత్రంలా లాస్యం చేసింది.

## II. అర్థాలంకారాలు

## 1. ఉపమానలంకారం

ఉపమానానికి ఉపమేయానికి చక్కని సామ్యాన్ని చెప్పుటయే ఉపమానలంకారం.

'ఒక మహాశబ్దసాగరం లా సూర్యుడు కనిపిస్తున్నాడు'[140]

కవి సూర్యుణ్ని వర్ణిస్తున్నాడు. ఆ వర్ణనంలో అర్థాలంకారాల్లో ఆద్యమైన ఉపమ వచ్చి చేరింది. కన్పిస్తున్న సూర్యుణ్ని 'మహా' శబ్ద సాగరం. సూర్యుణ్ని శబ్ద సాగరంతో పోల్చడంతో ఉపమకు ఔచిత్యం చేకూరిందా అని యోచించినప్పుడు భావం స్ఫూర్తిదాయకంగా ఉందని కన్పిస్తుంది. సూర్యునిలో ఉండేవి కిరణ జాలం. సాగరం మహా శబ్దాలతో కూడుకున్నది. కిరణాలు సూర్యుని నుంచి వెదజల్లబడుతున్నప్పుడు అవి కవి భావనలో ఒక శబ్దంలా ఒక రవళిలా, ఒక నాదంలా తోస్తాయి. శబ్దం కూడా ప్రకాశవంతమైందని భావింపవచ్చు. అందుచేత సూర్యుడు మహాశబ్ద సాగరంలో కన్పిస్తున్నాడనే కవితలో ఉపమ అర్థస్ఫూర్తితో నిబంధింపబడిందని భావింపవచ్చు.

ఉపమేయం - సూర్యుడు
ఉపమానం - మహా శబ్ద సాగరం
ఉపమవాచకం - లా
సమాన ధర్మం - కన్పిస్తున్నాడు

## 2. రూపకం

ఉపమానోపమేయాలకు అభేదమును గాని, తాద్రూప్యమును గాని నిరూపించుట రూపకలంకారం[141]

సూర్య ఫలాన్ని
నా హృదయ పాత్రలో పిండి
నా దాహాన్ని తీరుస్తున్నావు[142]

సూర్య ఫలం, హృదయ పాత్ర ఈ రెండూ రూపకానికి గుర్తులు. సూర్యుడు అనే ఫలాన్ని పిండి హృదయం అనే పాత్రలో పోసి దాహాన్ని తీర్చడం. రూపకం పై కవితా పంక్తుల్లో చక్కగా ఒదిగిపోయింది.

## 3. ఉత్ప్రేక్ష

ఉపమానం యొక్క గుణ క్రియాదుల సంబంధంచే ఉపమేయం ఉపమానంగా ఊహింపబడుట ఉత్ప్రేక్ష.

జీర్ణ దళాలు రాల్చి వనసీమను మోడయినట్టి కొమ్మ- సౌ
వర్ణ సుమాల బొమ్మ యయి పాటలు పాడుచునుండె సత్కళా
పూర్ణ మనోజ్ఞ చంద్రికల స్ఫూర్తిని; శూన్యమె సైన్యమయ్యె దు
ష్కర్ణుల జృంభణం బణచి కావగ నీ బహుధ్యాన రాశులన్!![143]

వనసీమలోని కొమ్మ జీర్ణదళాలను రాల్చి వేసికుంది. ఫలితంగా మ్రోడుగా మిగిలింది. అలాంటి కొమ్మ సౌవర్ణ సుమాల బొమ్మలా మారి పాటలు పాడుతున్నది. ఆ గీతం ఎలా ఉంది. సత్కళలతో నిండిన మనోజ్ఞ చంద్రికల స్ఫూర్తిని ప్రదర్శిస్తుంది. శూన్యం సైన్యంలా మారిపోయింది. అలా మారి దుష్కర్ణుల విజృంభణాన్ని అణచి ప్రజావళిని ఆదుకునే రీతిలో ఉంది. ఇందులో ఉత్ప్రేక్షాలంకారం ఒదిగి ఉంది. మోడయినట్టి కొమ్మను ఉపమేయంగానూ, అది వర్ణసుమాల బొమ్మగా మారడం అనేది ఉపమానంగానూ కవి భావించడం జరిగింది.

## 4. శ్లేష

ఒక వాక్యంలో ప్రకృత విషయానికి అప్రకృత విషయానికి వేరు వేరు అర్థాలు వచ్చునట్లుగా నానార్థాలు వచ్చే పాదాలనుపయోగించి చెప్పుట శ్లేష.

మానవతే కులదైవము మాకు
మా నవతే కలరావము మీకు[144]



మనిషిలో తన తనం అంటే మనిషితనం నిండుగా ఉండాలి. అట్లా మానవత్వంతో ఎవరు జీవిస్తారో వారు ఆరాధ్యదైవంగా ఆరాధనీయమౌతారు. ఇదే విషయాన్ని కవి శ్లేషలో చెప్పారు. మానవత్వం అన్నింటికన్నా విశేషమైన జీవన దృక్కోణం. దీన్ని అనుసరించడం, ఆచరించడం చాలా కష్టమైనప్పటికీ అదొక విశిష్టపురస్కారం లాంటిది. దాన్ని అందుకున్న మనిషి దేవుడు. అలాంటి కనిపించే దేవుడు మానవజాతికి నవత్వాన్ని కలరావంగా అందిస్తాడు. తిరుమల రెండో పాదంలో మా నవత్వం అనే పదంలో రెండర్థాలను చూపారు.

## 5. స్వభావోక్తి

వస్తువు యొక్క యధార్థమైన స్థితిని ఉన్నది యున్నట్లుగా రమణీయంగా వర్ణించి చెప్పుట.

శిఖ పింఛ గుచ్ఛంబు శిరముపై సవరించి
కస్తూరి నళిక భాగాన దిద్ది
కౌస్తుభ మణిమాల కంఠాన ధరియించి
చెవులకు కుండల శ్రీలనద్ది
మోహన రాగాల మురళిని చేబట్టి
పీతాంబరము మేన బిగియ గట్టి
సర్వాంగకములకు చందనంబును బూసి
యొంటిగా కూర్చొనియున్న నిన్ను[145]

కృష్ణుడు శిఖ పింఛ గుచ్ఛాన్ని తలపై సవరించాడు. అలిక భాగానా కస్తూరి దిద్దాడు. కంఠసీమలో కౌస్తుభ మణిమాల, చెవులకు అందమైన కుండలాలు ధరించాడు. మోహన రాగాలను వర్షించే మురళిని చేతబట్టాడు. పీతాంబరాన్ని కట్టి సర్వాంగాలకు హరి చందనాన్ని అలదుకున్నాడు. ఈ పద్యంలో శ్రీకృష్ణుని స్వభావాన్ని అలంకరణను ఉన్నదున్నట్లుగా చెప్పారు కవి.

## 6. దృష్టాంతం

ఉపమేయ ఉపమాన వాక్యాలలో వేరువేరుగానున్న ధర్మాలను బింబ ప్రతిబింబ భావంగా చెప్పటం.

ఆడదాని సంపాదన
మొగలి రేకుల జడ
మగవాడి సంపాదన
ముక్కలు చేసిన చెఱకుగడ[146]

ఆడదాని సంపాదనను మొగలిరేకుల జడ అన్నారు. అంటే మొగలికి ముళ్ళు ఉండడం వలన ఆ పుష్పాన్ని త్వరగా అందుకోలేని స్థితిలో ఉంటుంది. అంటే స్త్రీ సంపాదన త్వరగా ఖర్చు చేయబడదు. ఎవ్వరైన అందుకోవడానికి ప్రయత్నించినా అంత సులభంగా

అందదు. ఇక మగవాడి సంపాదన ముక్కలు చేయబడిన చెఅకుగడలా త్వరగా అనుభవించటానికి అందుబాటులో ఉంటుంది. ఈ కవితలో కవి స్త్రీ సంపాదనను మొగలిరేకు జడకు, మగవాడి సంపాదనను ముక్కలు చేయబడిన చెఅకు గడకు దృష్టాంతంగా వర్ణించారు.

## 7. ఉల్లేఖనం

అనేక ధర్మసంయుక్తమైన విషయాన్ని వేరు వేరు వ్యక్తులు తమ కిష్టమైన ధర్మాన్ని బట్టి తద్ధర్మ విశిష్టమగు ఉపమానముతో పోల్చి వర్ణించిన యెడల ఉల్లేఖాలంకారమగును.

కవులకు జ్ఞానపీఠి, వరగాయక మానస మంజు పల్లకీ
భవ పరమార్థ నాద సుధ, భక్తజనాళికి వేల్పుటావు, భూ
ధవులకు శాంతనేత్రము, నిదర్శన సూత్రము సామ్య వాదికిన్
నవరసరాగ గాత్రము జన ప్రియ రామ చరిత్ర మెప్పుడున్[147]

రామ చరిత్ర విశిష్టమైంది. ఆ పవిత్ర గ్రంథం కవులకు జ్ఞాన పీఠిలాంటిది. శ్రేష్ఠులైన గాయకుల హృదయాలలో వీణపాటలా స్వరించే సాయుజ్య పరమార్థమైన నాదసుధలాంటిది. భక్త జనావళికి కామధేనువు. భూపాలురకు శాంతి నేత్రం. సామ్యవాదికి నిదర్శన సూత్రం. నవరసరాగ గాత్రం లాంటిది. జనప్రియమైంది. కవి తిరుమల రామకథా వైశిష్ట్యాన్ని ఉల్లేఖంగా హృదయ రంజకంగా నిబంధించారు.

## 8. అర్థాంతరన్యాసం

సామాన్య విషయాన్ని విశేష విషయం, విశేష విషయాన్ని సామాన్య విషయాన్ని సమర్థించుట అర్థాంతరన్యాసం.

తపముల్ సల్పిన రాజ్యమేలిన మహాదానంబులున్ ధర్మముల్
జపముల్ జేసిన వేదముల్ సదివినన్ సన్యాసముం బొందినన్
తపనీయామల కోమలాంగుడయినన్ తథ్యంబుగా మానవుం
డెపుడో కాటికి జేరుకున్నె? మరణం బెవ్వారి కిం దప్పునే?[148]

మరణం అన్నది అందరికీ నిశ్చయమే. తపం చేసినప్పటికీ, రాజ్యాన్ని పాలించినప్పటికీ, మహాదానాలు ధర్మాలు చేసినప్పటికీ, జపం చేసినప్పటికీ, వేదాలు చదివినప్పటికీ, సన్యాసం స్వీకరించినప్పటికీ, కోమల శరీరుడైనప్పటికీ - మానవుడు మృత్యువు ఒడిలోనికి వెళ్ళవలసినవాడే. మానవుడన్న వాడు సామాన్యుడు. అతనిలోని ఈ విశేషగుణాలుండడం వలన ఉన్నతుడు అయ్యాడు కాని - అన్ని విశేషగుణాలున్నప్పటికీ అతనికి కూడా మరణం నిశ్చయమై ఉంది. ఇట్లా సమర్థించడంలో అర్థాంతరన్యాసం చెప్పబడింది.

## 9. అనన్వయం

ఒక్క ఉపమాలంకారమే, ఆహార్య భేదమున నానాలంకారములుగా భాసించునని అప్పయ్య దీక్షితులు అభిప్రాయం. అనన్వయం కూడా ఉపమ యొక్క ఆహార్య భేదమే.



దీనిలో ఉపమాన ఉపమేయముల అన్వయం ఉండదు.

దుఃఖంలో దుఃఖంలా
నన్ను బ్రతకనీ[149]

దుఃఖం మరిదేనితోనో పోల్చబడలేదు. అది దుఃఖంలాగానే ఉంది. కావున అనన్వయాలంకారం.

## 10. అన్యోన్యలంకారం

రెండు వస్తువులు పరస్పరాశ్రయంతో భాసిస్తుంటాయి. అలాంటిది అన్యోన్యాలంకారం.

మాధుర్యం అనుభూతిలా
అనుభూతి మాధుర్యంలా గోచరిస్తుంది![150]

ఇందులో మాధుర్యం, అనుభూతి అనే రెండు పదాలు పరస్పరాశ్రయంతో శోభించటం కన్పిస్తుంది.

## 11. నిదర్శనాలంకారం

సమానమైన వాక్యాలకు ఐక్యమైన ఆరోపణ జరిగితే నిదర్శనం అవుతుంది.

ప్రేమించటమంటే
గద్దె విడిచి బోధి వృక్షాన్ని చేరటం
తుపాకి గుండు తగిలినా రామనామంతో రాలిపోవటం
శిలువ మీద రక్తపుష్పమై వికసించటం[151]

ఇందులో గద్దెను విడిచి బోధి వృక్షాన్ని చేరడం, తుపాకి గుండు తగిలినా రామనామంతో రాలడం, శిలువ మీద రక్త పుష్పమై వికసించడం అనే వాక్యాలకు ఐక్యమైన ఆరోపణ జరిగింది.

## 12. భ్రాంతిమదలంకారం

మిథ్యాజ్ఞానం భ్రాంతి. భ్రాంతి వలన ఏర్పడు అలంకారం భ్రాంతిమంతం. ఇందు ఉపమానోపమేయముల యందలి సాధారణ ధర్మాన్ని బట్టి ఉపమేయము ఉపమానంగా భ్రమించినట్లు వర్ణించుట.

ఇన్నాళ్ళూ ఈ వెన్నెల్లో
ఈ కుబుసాన్ని చూచి
సర్పమని భయపడ్డాను[152]

వెన్నెల తెల్లగా ఉంటుంది. వస్తువుల స్వరూపాలు స్పష్టంగా కన్పిస్తాయి. కుబుసం కూడా కాస్త తెల్లగా ఉంటుంది. అయినప్పటికీ, చూసే వ్యక్తిలో అది సర్పంలా భ్రాంతిని కలిగించింది. ఇందులో పాము కుబుసం అనే ఉపమేయం సర్పమనే భ్రాంతిని కలగజేసింది.

## 13. సహజోక్తి

సర్వంబు వెలిగించు చండ మార్తాండుండు
చిన్మయ ప్రకృతికి సేవకుండు
తన జలబాహు బంధమున నొప్పు సా
గరుడు ధరాంగ రక్షక వరుండు
విస్తార శాఖల విలసిల్లు తరురాజు
పక్షి సంతకు స్థిర వాహకుండు
ఆకాశమంటిన అవనీధర విభుండు
శత్రు భావ మణచు సైనికుండు
జన్మనిచ్చిన తల్లి దాసాను దాసి
ఊపిరందించు వాయువు, ఉజ్జ్వలించు
వహ్ని, ప్రవహించు నదులు సేవకులు కాగా
అల్పుడధికారి నని మాటలాడుచుండు[153]

పై పద్యంలో సూర్యుడు, సాగరుడు, తరురాజు, పర్వతరాజు, మాతృమూర్తి, వాయువు, అగ్ని, నీరు - వీరు వీటి సహజమైన గుణాలను కవి వర్ణించడంలో సహజోక్తి లాస్యం చేసింది.

అన్నింటినీ వెలిగించే సూర్యుడు చిన్మయ ప్రకృతికి సేవకుడు. తన జలబాహుబంధనంతో ధరాంగాలను రక్షించేవాడు సముద్రుడు. విస్తారమైన కొమ్మలతో విలసిల్లుతున్న తరురాజు ,పక్షి సంతానాన్ని స్థిరంగా మోసేవాడు. ఆకాశం అంటే దాకా ఎగిసిన పర్వతరాజు శత్రుభావాన్ని అణచే సైనికుడు. అట్లాగే కన్నతల్లి, వాయువు, వహ్ని, నదులు ఇవన్నీ కూడా సాగరునికి పరిచర్యలు చేస్తూ ఆయన వ్యక్తిత్వాన్ని పెంచటానికి ప్రతీకలుగా ఉంటాయి. పద్యంలో కవి భావ ప్రతీకలన్నీ కూడా సముద్రుని ఔన్నత్యాన్ని ప్రకటిస్తున్నాయి.

## 14. వ్యాజస్తుతి

వ్యాజస్తుతిః నిందాస్తుతి చేత పలు నిందలు చేసిన యెడల వ్యాజస్తుతి యగునని లక్షణం. ఇందులో రెండంశాలు కలిగియున్నవి. దీనిని బట్టి వ్యాజస్తుతి రెండు భేదాలను కలిగియుండును. నిందా వ్యాజాన స్తుతి గావించుట వ్యాజస్తుతి యందలి మొదటి భేదం. స్తుతి వ్యాజాన నిందసేయుట వ్యాజస్తుతి యందలి రెండవ భేదం.

తిరుమల ఈ అలంకారంలో రెండవదియైన వ్యాజస్తుతిని సమాదరించి అలంకారాన్ని రసనిష్యంది చేశారు.

చేపగా తాబేలుగానే కాదు
పందివి కూడా అయ్యావంటే
నీ కార్య సాధనా చమత్కారం
అర్థమవుతూనే ఉంది[154]

విష్ణుమూర్తి తొలి అవతారాలైన చేప తాబేలును స్తుతిస్తూనే 'పంది' రూపాన్ని వ్యంగ్యం ప్రయుక్తం చేశారు.

## 15. స్తుతినిందా

వ్యక్తమైన స్తుతిచేత నింద వ్యంగ్యస్వరూపంలో వెలువడినప్పుడు వ్యాజస్తుతి నిందగా ఆవిష్కృతమవుతుంది.

ఒక చేతిలో లేడి- ఒక చేత గొడ్డలి
ఒక చేతిలో పుర్రె-ఉండగా
సిగ నీరు కురియగా-కంటి మంటెగయగా
మడి వడ్డించేటి అన్న పూర్ణుండగా
ఆకలా నీకు ఓ ఈ
బిచ్చ మడుగుట నీకు మేలేనా?
మేలైన గొనుము మా హృదయాలు
మా కనుల నిలిపి నీ చరణాలు[155]

ఒక చేతిలో లేడి అన్నప్పుడు స్తుతి ప్రసక్తమై, ఒక చేత గొడ్డలి అన్నప్పుడు నింద చోటు చేసుకుంది. సిగ నీరు కురియడం అనేది గంగానది పరంగా అభివర్ణితమైంది. కంటిమంటెగయగా అనేది జ్వలనతత్వంకల శివుని మూడోకన్ను ప్రసక్తి వస్తుంది. పాలనేత్రం అనగానే మనస్సులో ఒక భయానకమైన సన్నివేశం ప్రత్యక్షమవుతుంది. గంగతలపై నెలకొనడం స్తుతికి, చిచ్చరకన్ను నిందకు ప్రతీకగా కవి ప్రయోగించారు.

కవిత నాద ప్రధానమైంది. నాదం అలంకారాల పోహళింపు మీద ఆధారపడి ఉంటుంది. అలంకారాలన్నప్పుడు శబ్దాలంకారాలూ, అర్థాలంకారాలూ ఏమైనా కావచ్చు. ఆ రెండూ మిళితమై కూడా ఉండవచ్చు. కథాకథనాన్ని, సన్నివేశాన్ని అనుసరించి అలంకార ప్రయోగం జరిగితే ఆ రచన జీవమున్న రచనలా పదుగురుని ఆలోచింపజేస్తుంది. సామిత్యం ఆలోచనాత్మకమైందని విజ్ఞులు భావిస్తారు. ఆలోచన పదునుగానూ, ఆర్ద్రంగానూ ఒక్కొక్కమారు రెండూ మిళితమై ఉన్నప్పుడే ఆ రచన సత్యం శివం సుందరమై లోకాలను ఆకట్టుకొని సమాజాన్ని నిలబెడుతుంది.ఆ అదునూ, పదునూ తెలిసిన కవి తిరుమల. అందుచేత ఆయన అలంకార వైచిత్రి ఆశావహమైన దిశగా సాగింది.

## 5. ఛందస్సు-నిర్మాణ దక్షత

ఒడిదుడుకు లేని పథము వెంబడి రథమ్ము
నడచుచుండెను సుకవి ఛందమ్ము రీతి[156]

ఛందం కవితకు ఉదాత్తతను కలిగిస్తుంది. ఉత్తేజాన్నిస్తుంది. నాద పరిమళాన్నిస్తుంది. చిక్కని రసస్థితినిస్తుంది. పాఠకునిలో స్పందనతో ఎలుగెత్తి పాడుకునేటట్టు మరీ అవేశించి కవితను రాసేటట్టు దోహదాన్ని కలిగిస్తుంది. కాథాకథనం ఔచితీమంతంగా సాగడానికి, దానికొక ప్రయోజన రూపాన్ని కల్పించడానికి ఛందం బహుధా సహకరిస్తుంది. పరోక్ష, ప్రచ్ఛన్న సన్నివేశాలలో, ఆవిష్కారాలలో నూతన సంప్రదాయాలకు ప్రేరణను కలిగిస్తుంది. ఇది కవితకు ప్రాణసదృశంగా ఉంటూ సమాజ శిల్పానికి మరింత పరిమళ సౌందర్యాన్ని అలదుతుంది. జడత్వం అలముకున్న మనిషి గుండెలో లయాత్మక స్థితిని రగిలించి అతనిలో సంస్కార భావ భూమికను మాధురీవిలసితం చేస్తుంది. విశాలంగా విస్తరించిన ఈ మానవ సమాజం కోసం ఛందం ద్విగుహితమైన పరిణతిని కలిగిస్తుంది. విజ్ఞులు రాసిన శాస్త్రాలలో ఛందశ్శాస్త్రం సమాజపు మౌలిక విషయాలను మాత్రమే కాక సమాజానికి మూల బిందువైన మనిషి హృదయ పరివర్తనకు అవసరమైన స్థితిని కలిగించే కవితా రూపానికి ఆత్మగా అమరివుంది.

ఛందం కవిత్వపు ప్రక్రియ ఏర్పడిన నాటి నుంచి అనేక రూపాలతో వెలువడుతున్నది. లక్షణకారులు సూత్రీకరించిన చాలా అంశాలు ఛందం ప్రత్యేకతను ప్రకటిస్తుంది. ఈ శాస్త్రాన్ని కూలంకషంగా అనుశీలించిన ఆచార్య సంపత్కుమార ఇట్లా రాశారు.

" "ఛందస్" అన్న సంస్కృత పదము 'ఛద్' అను ధాతువు నుండి నిష్పన్నమగుచున్నది. ఈ ధాతువునకు 'ఆహ్లాదము' అని అర్థము. ఈ ఛందశ్శబ్దము వేద పరముగా, అభిప్రాయ పరముగా, ఛందశాస్త్రపరముగా అమర కోశము చెప్పుచున్నది. ఆహ్లాదము కలిగించెడు వాక్య సమూహము ఛందస్సు అనియు చెప్పవచ్చును. వర్ణపద సంయోజనముల చేత, వాక్య నిర్మాణములోని ప్రత్యేక లక్షణముల వలన, ఆవృత్తి వలన నియమ పూర్వకమయిన విచ్ఛేదముల వలన, స్వరాందోళనము వలన ఛందస్సు ఆహ్లాదము కలిగించుచున్నది. పయిన చెప్పిన వన్నియు లయనుద్దీప్తము చేయుచున్నవి. కావుననే ఈ ఆహ్లాదము కలుగుచున్నదని చెప్పవలయును."[157]

ఛందం ప్రధానంగా ఆహ్లాదాన్ని కలిగించేదని, ఈ ఆనందం అక్షరాల సమీకరణంతో, వాక్య సంయోజనంతో సిద్ధిస్తుందని, ఇవన్నీ లయను ఉద్దీప్తం చేస్తాయని సంపత్కుమార భావించారు.

గిడుగు వేంకట సీతాపతి ఛందస్సు లయ ప్రధానంగా ఉంటుందని అభిప్రాయ పడినారు.

"పాటకు కావలసిన తాళమునకున్న పద్యమునకు కావలసిన నడకకున్ను సంబంధ మున్నది. ఈ రెండింటికీ వ్యత్యాసమేమంటే, పాట పాడినప్పుడు తాళము సువ్యక్తంగా ఉంటుంది. పద్యము చదివినప్పుడు ఆ తాళ లక్షణము గుప్తముగా ఉంటుంది. ఉత్సాహ, సుగంధి, తోటకము, భుజంగ ప్రయాతము, మత్తకోకిల, తరళ, రగడలు మొదలైనవి



చదివినప్పుడు పాటలలో ఉండే తాళము వీటిలో కూడా ఎట్లా ఉంటుందో స్పష్టముగా కనబడుతుంది. ఉత్పలమాల, చంపకమాల, మొదలైన వృత్తాలలో పాటలకు కావలసిన తాళము గుప్తముగా ఉండడము చేతను వీటిలో లయ అంటూ ఒకటి ఉన్నదా అనే సంశయము కలుగుతుంది. గాని, విమర్శించి చూస్తే లయ ఉన్నట్లు స్పష్టమవుతుంది. ఉత్పలమాల, చంపకమాల చరణాలలో ఏదైనా ఒకటి విభజించి చూస్తే అది చతురస్రగతి, త్రిశ్రజాతి, త్రిపుట తాళమునకు సరిగా నడచుననుటకు సందేహము లేదు."[158]

గిడుగు వారు ఛందం లక్షణాలను చెప్పకుండానే చెప్పారు. ఆయన సంగీత ప్రధానంగా ఛందాన్ని విశ్వసించారు. ఆయన మరొక చోట వస్తువును బట్టి, అవసరాన్ని బట్టి కొత్త ఛందస్సులను సృష్టించుకోవడం ఉచితంగా ఉంటుందని రాశారు.

తిరుమల తెలుగు కవిత్వంలో వెలువడిన అనేక ధోరణులలో రచనలు చేసిన దిట్ట. ఆయనకు ఛందస్సుల అశ్వహృదయం బాగా తెలుసు. ఆయన ఎన్నుకున్న వస్తువుకు అనుగుణమైన చందాన్ని ఎన్నుకొని తన రచనను రసప్లావితం చేశారు. ఉత్పలమాల, చంపకమాల, శార్దులం, మత్తేభం, మత్తకోకిల, మధ్యాక్కర, ధ్రువకోకిల, కందం, తేటగీతి, ఆటవెలది, సీసం, మానినీవృత్తం, స్రగ్విణి, ద్విపద వంటి పద్యాలను విరివిగా వాడుకున్నారు.

తిరుమల కొందరు ఆధునిక కవుల వలే గేయ, పద్య ప్రక్రియలను ఒకే రచనలో సంధించారు. వచన కవితనూ వాటితో సమ్మిళితం చేశారు. అయితే కొన్ని సంగీత రూపకాలలో కూడా మిశ్రమ ప్రక్రియను సంధించి రచనను రసోత్సేకం చేశారు. అయితే తిరుమల వృత్తం, జాతి, ఉపజాతి పద్యాలలో కొన్ని ప్రయోగాలు చేశారు. వృత్తంలో నాలుగు పాదాలు చెప్పవలసివుండగా అయిదు పాదాల దాకా సాగదీశారు. అంటే కవి హృదయం నుంచి విరచుకొని దుముకుతున్న భావావేశాన్ని నిలువరించుకోలేక ఈ అయిదు పాదాల పద్యాలను అందించారు.

చేటల నెత్తి పోసితిమి చేలను నిన్ను, స్మశాన మందు సా
పాటును పెట్టి నిన్ దలచి వాయన సంతును బిల్చినార మే
లోటును జేయ రాదనెడు లోలుపతన్ భవదస్థికల్ నిరా
ఘాటముగా మహానదులు గౌతమి కృష్ణలఁగల్పినా మహో!
మాటల మమ్ముజెప్పికొన మమ్ములఁ జూడుము తండ్రీ! బండలన్[159]

తిరుమల తేటగీతిలో కూడా ఇదే ప్రయోగం చేశారు.

నిన్ను జూడగ వచ్చి నేనెన్ని విషయ
ములను నీ నుండి వింటినో! పుస్తకాల
నుండి గాని, మరే గొప్ప పండిత పర
వర్గముల నుండి గానినేఁ బడయఁగలనె
అట్టి అపురూప వాక్య విన్యాసములను[160]

ప్రాచీనాలంకారికులు ఒక్కొక్క ఛందం ఒక్కొక్క రీతిని ప్రదర్శిస్తుందని చెప్పారు. ఈ లాక్షణికోక్తిని ప్రాచీనులు నుంచి ఆధునిక కవుల దాకా అందరూ పాటించిన వారు కారు. క్వాచిత్కంగా మాత్రమే ఈ సంప్రదాయాన్ని అనుసరించారు. కవి మనస్సులో ముమ్మరించిన భావజాలాన్ని దృష్టిలో పెట్టుకొని ఛందాన్ని మార్చుతూ రసదీప్తిని అతిశయింపజేశారు. అయితే ఈ దృక్పథం ఔచితికి భిన్నమైందని నిరసించడం సముచితం కాదు. దేశకాలాలను అనుసరించి సాహిత్యం మారుతుందని రాయప్రోలు వారు అభిప్రాయ పడినారు కదా! తిరుమల తన పద్యాలలో అక్కడక్కడ ఈ ఔచిత్యాన్ని ప్రదర్శించారు. తిరుమల కొన్ని సన్నివేశాలలో లాక్షణికోక్తులను పక్కకుపెట్టి స్వేచ్ఛను ప్రదర్శించారు. ఉగాది బహుధాన్యకు సుకుమారమైన అనురాగంతో స్వాగతం పలుకుతూ శార్దూల వృత్తాన్ని ఎంచుకున్నారు.

నీ రాకన్ తెలుగింటి వాకిళుల సుస్నేహార్ద్ర భావంబుతో
స్వారస్య స్వర మాధురిన్ పరిభృత స్వాముల్ శ్రుతుల్ సంస్కృతుల్
సౌరభ్య ప్రసవంబులై విరియగా చైతన్య గీతావళిన్
శ్రీ రంజిల్లగ నాలపించవలె ప్రాక్సీమంతినీ కాంతలన్[161]

ఛందంలో యతి ప్రాసలు ప్రాధాన్యం కలిగి ఉన్నాయి. కవిత శ్రవణపేయంగా వినబడడానికి అర్థమాధుర్యంలో మరింత జిగిబిగిని కల్పించడానికి ఇవి బాగా సహకరిస్తాయి. తిరుమల ఈ సంప్రదాయాన్ని కొన్ని సన్నివేశాలలో పాటించారు.

తిరుమల వచన కవిత్వం రాశిలోనూ వాసిలోనూ ఎక్కువే. వచన కవిత్వానికి లక్షణాలను నిర్దేశిస్తూ కొందరు పండితులు తమ తమ అభిప్రాయాలను ప్రకటించారు. ఈ రంగంలో విశేషంగా కృషిచేసిన సంపత్కుమార వచన కవిత్వ లక్షణాలను ఇట్లా వివరించారు.

"భావం వచన పద్యం భావాలకు సమభారం కలిగిస్తుంది. సామాన్యంగా భావం పూర్తి కావడంతో పాదం కూడా పూర్తి అవుతుంది. ఒక్కొక్కప్పుడు భావం పూర్తికాకున్నా భావాంశం పూర్తి అయినా కూడా పాదం పూర్తికావచ్చునన్నమాట"[162] అని భావ గణాల సహాయంతో ఒక నియమాన్ని ప్రతిపాదించారు. అయితే ఈ అంశాలను గురించి పండితులలో చాలా వరకు వాదోపవాదులు జరిగాయి. డా॥ దాశరథి "విద్యుత్తులా ఊహించగల మనకు మద్యంలా పారే పాత ఛందస్సు పనికిరాదని వచన కవిత్వాన్ని విద్యుత్ ఛందస్సని సంభావించారు."[163] దాశరథి ఈ అభిప్రాయం విశిష్టమైంది. మారుతున్న సమాజ స్వరూపాల్ని ఆవిష్కరించడానికి ఇంకా పాతబడిన ఛందాన్ని వాడుకోవడం కంటే వినూతనమైన లక్షణాలను అన్వేషించడం ఉత్తమమైన అంశం. తిరుమల ఒక వైపు పాత సంప్రదాయాన్ని ఆదరిస్తూనే నవ్యమైన ఛందోరీతులను సమాదరించి కొత్త అభివ్యక్తిని ప్రదీప్తం చేశారు. ఆయన వచన కవితలు లక్షణాలకు దగ్గరగా ఉంటూనే సొంత బాణిని వెల్లువెత్తించాయి.

శబ్దాలు ప్రసవించిన శతాబ్దాల సుందర వనాలు దాటి
ఆనంద మలయ మారుతాలు మీటి



అసూయోన్మాద అనుభవాల ముళ్ళపొదల కౌగిళ్ళలో
రాలిపడిందో వేయి కిరణాల పువ్వు!
అది జాతి చైతన్య భానుని నవ్వు!
దాని వెలుగు తావిని త్రాగి
ఈ చల్లని నేల మీద ఎర్రగా వీచే ఈ గాలిని
సందె ప్రొద్దుకు పయ్యెదగా సవరించాలని
తమస్సు నుండి కాంతిని ప్రసరించాలని
తపస్సు చేసే నా ఆలోచనా అహస్సుని
చురకత్తుల్లాంటి ముళ్లు చీల్చి అపహాస్యపు అగ్నిలో కాల్చి
నల్లగా నవ్వుతున్నాయి-
రాలిపడిన పువ్వుమీద కాలనాగులు వాగుల్లా ప్రవహిస్తూ
చీకటి బుసలు రువ్వుతున్నాయి-
'అడుగు' వెనక్కి పడింది, ఆలోచన అగాధంలో పడింది
మానవతా ప్రగతి ప్రస్థానం కోసం
విచ్చుకొన్న నాకళ్ళకి గుచ్చుకొని
శతాబ్దాల చరిత్ర గమనాన్నింకా శిలలే చెప్తున్నాయి!
ఐనా - ముళ్ళల్లో పువ్వు 'వాడటం' లేదు
కళ్ళల్లో ఆశ వీడటం లేదు![164]

భావం ముగిసేదాకా హ్రస్వదీర్ఘ పాదాలతో ఈ వచన కవితా పంక్తులు రాయబడినాయి.

పద్య కవిత్వాన్ని బాగా రాసి వచన కవిత్వమనే ఉద్యానవనంతో స్వేచ్ఛగా విహరించి మాకందఫలాల వంటి కావ్యాలను వెలయించారు. ఆయన ఆదరించిన మరొక ప్రక్రియ గేయ కవిత. పద్యం, వచనం ఆయనకు ఎలా పట్టుపడ్డాయో శాశ్వతంగా సమాజాన్ని సంస్కరించే రీతిలో ఉన్నాయో గేయం కూడా వాటి స్థాయిలోనే ఉంది. కవి ప్రాచీనాధునిక కవితా రీతులను బాగా ఔపోశన పట్టిన వారవడం వల్ల గేయం రసవన్మధురంగా ఒదిగిపోయింది. కొన్ని వందల దాకా ఉన్న ఆయన గేయాలలో సమాజం అన్ని పార్శ్వాల నుంచి దర్శనమిస్తుంది.

తిరుమల లాక్షణికులు నిర్దేశించిన పద్ధతులను చాలా గేయాలలో గౌరవించారు. మరికొన్ని గేయాలలో స్వేచ్ఛగా విహరించారు. అలా జరగడానికి ఆయన భావావేశం వస్తువరణం ప్రధాన హేతువులుగా కన్పిస్తాయి.

**త్రిశ్రగతి:** ప్రతి పాదంలో 12 మాత్రలుంటాయి. ఇది 'తకిట' అనే మూడు మాత్రలతో నడిచేది.

రేయి కలను కలిశాడే (12)
కలిసి కనుల పిలిచాడే (12)
ఏవో కమ్మని పూసులు (12)
ఎద నిండా పోశాడే[165] (12)

**చతురస్రగతి:** ప్రతిపాదంలో 16 మాత్రలుంటాయి. ఇది 'తకతక' అనే నాలుగు మాత్రలతో నడిచేది.

త్రిగుణాతీతుని గుణ సంజాతుని (16)
త్రిపురాసుర మద మత్సర ఘాతుని (16)
త్రిపుర సుందరీ హృదయోల్లాసుని (16)
రాజ రాజ రాజేశ్వర మౌళిని[166] (16)

**ఖండగతి:** ప్రతిపాదంలో 10 మాత్రలుంటాయి. ఇది 'తకతకిట' అనే అయిదు మాత్రలతో నడిచేది.

గాలి కదలికలోన (10)
నీ పిలుపు విన్నాను (10)
దాని తొలి మలుపులో (10)
నీరాక కన్నాను[167] (10)

**మిశ్రగతి:** పాదానికి 14 మాత్రలుంటాయి. చివరి (నాలుగో) పాదంలో 9 గాని, 12 గానీ మాత్రలుంటాయి. దీనినే 'ముత్యాలసరం' అని పిలుస్తారు.

గుండె దీపం ఆరిపోగా (14)
అంధకారం అలమిరాగా (14)
కాంతా ద్వారం శాంతి తీరం (14)
చూపు దైవం నీవెగా[168] (12)

*1, 3 పాదాల్లో 12 మాత్రలు, 2, 4 పాదాల్లో 9 మాత్రలు*

ఏ గీతము నే రీతిగ (12)
వినిపించెదు దాన (9)
నీవు లేక పలుక లేదు (12)
నా మానస వీణ[169] (9)

లాక్షణికులు నిర్దేశించిన సూత్రాలు కూడా కాలాన్ని అనుసరించి మారుతాయి. గేయ కవిత్వంలో పలు రకాల ప్రయోగాలతో ప్రయోజనాన్ని సాధించిన సినారె కూడా ఈ ప్రక్రియలో కొత్త రూపాలను ప్రదర్శించారు. ఇది అనివార్యమైన్నటికీ అందరికీ సాధ్యం కాదు. తిరుమల ఈ నవీనతనీ, పరిణామాన్ని హృదయ ద్రావకంగా చెప్పారు.



వలపులు ముమ్మరించి హృదయంలో సుడులుగా ఆడినప్పుడు మనస్సు నుంచి దూసుకొని వచ్చే వలపుల రాణి తీయని భావాలను తిరుమల నవ్య ప్రయోగాలతో రాశారు. ఒకటి మూడు పాదాలలో పన్నెండు మాత్రలు చొప్పించి రెండు నాలుగు పాదాలను తొమ్మిది మాత్రలతో మలిచారు. ఒకటి రెండు పాదాలలోని అర్ధమైన ప్రణయోద్వేగాన్ని రెండు నాలుగు పాదాలు పరిష్కార స్వరూపంలో ఉన్నాయి.

ఇలాంటి ప్రయోగాలు మరికొన్ని

*1, 3 పాదాల్లో 9 మాత్రలు, 2, 4 పదాల్లో 10 మాత్రలు*

పూలేవి పూయవు (9)
నా గుండె తోటలో (10)
రాగాలు సాగవు (9)
ఈ పేద గొంతులో[170] (10)

*1, 3 పాదాల్లో 16 మాత్రలు, 2, 4 పదాల్లో 11 మాత్రలు*

కలలే కథలై కమ్మని సుధలై (16)
కదల సాగె మదిలోన (11)
ఏ ఏ తారలు నిలువరించెనో (16)
నిను వరించి నెఱజాణ[171] (11)

*1, 2 పాదాల్లో 10 మాత్రలు, 3, 4 పదాల్లో 13 మాత్రలు*

చిన్న చిన్ని పాపలు (10)
ముద్దు ముద్దు పాపలు (10)
నవ్వాలి పూల తోటలా (13)
నడవాలి జోల పాటలా[172] (13)

*1, 3 పాదాల్లో 12 మాత్రలు, 2, 4 పదాల్లో 8 మాత్రలు*

మెరుపులాగ మెరిసితాను (12)
మాయ మయ్యింది (8)
తీపి బాధ సోకి నా ఎద (12)
గాయ మయ్యింది[173] (8)

*1, 3 పాదాల్లో 15 మాత్రలు, 2, 4 పదాల్లో 11 మాత్రలు*

సంసారంలో కష్ట సుఖాలు (15)
సాగర మందలి అలలు (11)
వచ్చే పోయే కలిమిలేములు (15)
వెలుగు చీకటుల తెరలు[174] (11)

*1, 3 పాదాల్లో 12 మాత్రలు, 2, 4 పదాల్లో 14 మాత్రలు*

ఛెంగు ఛెంగున లేళ్ళల్లా (12)
గట్టూ పుట్టా దాటేద్దాం (14)
గలగల సెలయేళ్ళల్లా (12)
చెట్టూ చేమా చుట్టేద్దాం[175] (14)

*1, 2 పాదాల్లో 12 మాత్రలు, 3 పదాంలో 11 మాత్రలు*

తీవెల్లా సాగి - పూల (12)
దారుల్లో ఆగి - తేనె (12)
వూహల్లో తేలిపో[176] (11)

*4 పాదాల్లో 11 మాత్రలు*

మంచి మంచి అలవాట్లు (11)
తోడు నీడ చేసుకొని (11)
మేలి మేలి సుగుణాలు (11)
గంధంలా పూసుకుని[177] (11)

*4 పాదాల్లో 13 మాత్రలు*

కల్లలు - అల్లరి మీ కొద్దు (13)
చీకటి జోలికి పోవద్దు (13)
పాల కడలి తరగలు మీరు (13)
పరుమాత్ముని నవ్వులు మీరు[178] (13)

*4 పాదాల్లో 15 మాత్రలు*

మంచు సోనలో మరి మరి మురిసి (15)
కడలని త్రాగే ఎండల జడిసి (15)
ఉరుముల మెరుపుల వానల తడిసి (15)
పచ్చగ నవ్వే పుడమిన నిలిచి[179] (15)

మొదటి రెండు పాదాలలో ఒక మాత్రా సమత్వాన్ని, చివరి రెండు పాదాలు ఒక మాత్ర సమత్వాన్ని పాటించడం.

నెమ్మనమ్ములో క్రమ్ముకొన్నదిర (16)
పరివేదన పాహి దామోదరా (16)
వెలుగుల నిడ రావె కరుణించవె (15)
ఆత్మ గుణాకర రస సాగరా[180] (15)



*అన్ని పాదాలలో ప్రథమాక్షరాలకు యతి పాటించడం*

మల్లె నడిగితే చెబుతుంది
మనసు ఎలా ఉండాలో
మబ్బు నడిగితే చెబుతుంది
మనిషి ఎలా వుండాలో[181]

*నాలుగు పాదాలకూ ప్రాస*

ఆట నీది కృష్ణా
పాట నీది కృష్ణా
ఆటా పాటా కలసిన
మాట నీది కృష్ణా[182]

*నాలుగు పాదాలకూ అనుప్రాస - అంత్యప్రాస*

చదువే మణిదీపం
చదువే చక్కని రూపం
చదువే ఘనం - చదువే ధనం
చదువే శాంతికి ఆధారం[183]

*నాలుగు పాదాల్లో ప్రాస - అంత్యప్రాస*

చీర దొంగిలించెదవు
చీర నిచ్చి బ్రోచెదవు
నరుని రథము తోలెదవు
నర హృదయము నేలెదవు[184]

*సరిపాదాంత శబ్దసామ్యం*

అందీ అందని ఆనందంతో
నా ఎద నదిలా పొంగింది
విరిసీ విరియని అనుబంధం
ఒక ఇంద్ర ధనసులా వొంగింది[185]

*1, 3 పాదాలు, 2, 4 పదాలు పాదాంత గణ సారూప్యం*

నీలో కదిలె అందమే
నాలో కవితగా పల్లవించె
పల్లవించే ప్రణయ బంధమే
జగతిలో పరిమళించె[186]

*1,2,3,4 పాదాల్లో పాదాంత గణ సారూప్యం*

నిక్కి నిక్కి లేడిలా చూడనా
చుక్కలతో గొంతు కలిపి పాడనా
నా పిలుపులో పూల విల్లు వొంగుతుంది
నా చూపులతో మరుల వాగు పొంగుతుంది.[187]

*1,2,4 పాదాల్లో అంత్య ప్రాస*

మలయ వీచికల ఆడినవి
పెను గాలులలో నలిగినవి
రేయి పగలు ఒకే మనసుతో
హాయిని మాత్రమే పాడినవి[188]

తిరుమల గేయ కవిత్వంలో 'రుబాయి' లక్షణాలను అక్కడక్కడా ప్రయోగించారు. ఆచార్య ఎన్. గోపి రుబాయిని గురించి చెబుతూ ఇలా అన్నారు.

రుబాయిలో నాలుగు పాదాలుంటాయి. 1,2,4 పాదాలకు అంత్య ప్రాస నియతి ఉంటుంది. మూడో పాదంలో వుండదు. మూడో పాదం పై రెండు పాదాలకు అనుసంధాయకంగా వుంటుంది. లేదా మొదటి రెండు పాదాల్లోని అభిప్రాయాన్ని మోసుకుపోతూ చివరి పంక్తిని జిగేలుమని మెరిపిస్తుంది. సూక్తి చతురతో, అధిక్షేప గుణమో, కవితా చమత్కారమో ఇలాంటి ఏదో ఒక ప్రత్యేకత చివరి పాదంలో వుండాలి".[189] తిరుమల ప్రయోగించిన ఈ రుబాయిలో కవితా చమత్కారం దర్శనమిస్తుంది.

*1,3 పాదాలకు 2,4 పాదాలకు అంత్య ప్రాస*

సందె పొద్దు కెంజాయ చివురుకై
చీకటి కోయిల పరుగులు తీసె
చుక్క మల్లె నెత్తావి మోవికై
జాబిలి తుమ్మెద ఝుమ్మని మ్రోసె[190]

*ఏ పాదానికాపాదం సంపూర్ణంగా ఉండడం, పాదాంతంలో భావం పూర్తి*

జ్వలిత జ్వాలకు లేదు ఏ స్వార్థం
వాయు వీచికి లేదు ఏ స్వార్థం
కురియు మబ్బుకు లేదు ఏ స్వార్థం
స్వార్థ రాహిత్యమే జీవ పరమార్థం[191]

ఒక్కొక్క మారు ఒకే పాదంలో అర్థం ముగియదు. రెండు మూడు పాదాల దాకా అది సాగుతూనే ఉంటుంది. అయితే సన్నివేశాన్ని అనుసరించి ఈ విధానంలో మార్పు



ఉంటుంది. ఏ పాదానికాపాదంలోనే పూర్తి అర్థం ఇమిడి ఉంటుంది. అయితే నాలుగో పాదంలో భావ రూపంలో దాని లక్ష్యం నెరవేరుతుంది.

*అర్థ చమత్కృతితో సోపాన క్రమం*

మనసులో ఆశకు విలువెంత?
మేఘాల మెరిసేటి మెరుపంత!
మాటలో మెదిలె మనసెంత?
ఉండుండి ఉరిమేటి ఉరుమంత![192]

ప్రశ్నిస్తూ సోపాన క్రమంలో పదాలను అలవోకగా వాడుతూ చమత్కృతిని సాధించడం అనేది కవి నిపుణత మీద ఆధారపడి వుంటుంది. ప్రాచీన కవులలో చేమకూర కవి ఈ విధమైన క్రమాన్ని ప్రయోగించారు. అయితే గేయ ప్రక్రియలో సినారె చమత్కృతి కోసం కొన్ని ప్రయోగాలు సాధించి ఫలితాలను సాహిత్యానికి సింగారాలుగా అందించారు. సినారె పిదప ఆ మార్గంలో తిరుమల నడిచారని చెప్పవచ్చు. తిరుమల చెప్పిన ఈ చమత్కృతి కేవలం పదబంధాలకు మాత్రమే పరిమితం కాకుండా ఉద్వేగ రీతిని ప్రకటిస్తుంది.

*సమభారత్వం సాధించడం*

మల్లె నడిగితే చెబుతుంది
మనసు ఎలా వుండాలో
మబ్బు నడిగితే చెబుతుంది
మనిషి ఎలా వుండాలో[193]

గేయం రాయబడినప్పుడు మాత్రలు సమంగా ఉన్నప్పుడు కూడా సమతుల్యత లోపించవచ్చు. అది అనివార్యమైన విషయమే. శబ్దవిదురుడు, భావ చతురుడైన కవి నాలుగు పాదాలలోనూ సమ భారత్వాన్ని సంధించి అర్థస్ఫూర్తిని కలిగిస్తాడు. తిరుమలలో ఈ గుణం ఉంది. ఆయన సమభావాన్ని ప్రదర్శిస్తునే అక్షర సౌందర్యాన్ని కూడా చిత్రించి కవితకు నాద ప్రియత్వాన్ని ఇనుమడింపజేశారు. ఇది పాఠకుని హృదయంలో ఉత్సుకతనీ, భావావేశాన్ని మరింతగా అతిశయింపజేస్తుంది.

## 6. శీర్షిక – నామౌచిత్యం

శీర్షిక రచనలో ఉన్న విషయాన్ని పాఠకుల గుండెల్లోకి ప్రసరించి అతనిలో ఉద్వేగాన్నీ, ఉత్తేజాన్నీ ఆ వెంటనే నిర్మాణాత్మకమైన ఆలోచనలను రేకెత్తిస్తుంది. వస్తువు చిక్కని భావుకతతతో చక్కని శబ్ద మాధుర్యంతో ఉన్నప్పటికీ శీర్షిక ఆకర్షణీయంగా లేకపోతే చదువరి ఆ పుటలను సరదాగా తిరిగేస్తాడే కాని, దాన్ని చదివి అనుభూతి పొందడానికి ఉన్ముఖుడు కాలేక పోతాడు. అలాంటి రచన ప్రజా బాహుళ్యానికి దూరంగా ఉండిపోతుంది.

శీర్షిక రచయిత ఊహాశక్తినీ, నైశిత్యాన్ని ప్రకటించేది. భావదీప్తినీ, అర్థస్ఫూర్తినీ, దార్శికతత్వాన్ని, అభినివేశాన్ని విదితం చేస్తుంది. కొన్ని సమయాలలో వర్ణితమైన వస్తువు రస స్ఫోరకంగా లేకపోయినప్పటికీ శీర్షికలో జ్వలితతత్వం ఉండి ఆ రచనను చదివింపజేస్తుంది. సామాన్యంగా శీర్షిక చూడగానే రచన ఏ విషయానికి సంబంధించిందో అర్థం అవుతుంది. కొన్ని శీర్షికలు విషయాన్ని సూటిగా సూచిస్తాయి. అందులో హృదయ స్పందన ఏమి కలగదు. అలా కాకుండా పాఠకునిలో ఉత్కంఠనూ, ఆసక్తినీ రేకెత్తించేటట్లు శీర్షికలకు నామకరణం చేయడం ఒక కళ. ఇటువంటి శీర్షికలు పఠితల మనస్సుల్లో ఆసక్తిని కలిగిస్తాయి.

ఆధునికులలో చాలితమైన శీర్షికలు ఇవ్వడంలో శ్రీశ్రీ గారికి ప్రతేకమైన ప్రతిభ ఉంది. అవి కంటపడగానే గుండెలోకి అడుగిడి మేధతో మిళితమై పాఠకునిలో అపూర్వ స్పందనను కలుగజేస్తాయి. 'మహాప్రస్థానం' అన్నది అలాంటిదే. 1+1=1 అన్నది ఎంత సవ్యమైందో అంత అర్థస్ఫూర్తిని అందిస్తుంది. దాశరథి 'తిమిరంతో సమరం', కవితాపుష్పకం, పునర్నవం అనే శీర్షికలు భావస్ఫూర్తికి నిలయాలు. శీర్షికలు ఇవ్వడంంలో సినారెకి ప్రత్యేకమైన టెక్నిక్ ఉంది. మధ్య తరగతి మందహాసం, గదిలో సముద్రం, భూగోళమంత మనిషి బొమ్మ వంటివి సాధారణమైన ఆత్మకు అందవు. శేషేంద్ర మండే సూర్యుడు, గొరిల్లా వంటివి కవితను పదడుగులు ముందుకు వేయించేవే. సదా మననయోగ్యాలే.

ఆచార్య తిరుమల కవితా శీర్షికలు అంతటి తేజశ్చక్రాలే. హరిత పతాకాలే. జుమ్మని చిమ్ముకొని వచ్చే భావధార, మేధకు పదును పెట్టే కాంతిధార, వాటిలో గట్టులొరుసుకుంటూ ప్రవహిస్తాయి. శీర్షికను ఎన్నుకోవడంలో తిరుమల ప్రత్యేకత స్పష్టంగా గోచరిస్తుంది. 'చక్రధ్వజం' ఒక ఖండిక పేరు. చక్రం ధ్వజం మందు కలది అని దీని అర్థం. ధ్వజమంటే టెక్కం – పతాకం. మన జాతీయ పతాకంలో చక్రం ఉంది. కాబట్టి చక్రధ్వజం అంటే భారత జాతీయ పతాకమని అర్థం. తిరుమల శీర్షికల్లో ప్రత్యేకతను సంతరించుకుంది 'కృష్ణ చంద్రిక'. చంద్రిక అంటే వెన్నెల. కృష్ణ శబ్దానికి నలుపు అనీ, కృష్ణుడనీ రెండర్థాలు. శీర్షిక చూడగానే 'కృష్ణ' శబ్దానికి 'చంద్రిక' శబ్దానికి అన్వయంకుదరక అర్థాంతరంకోసం పద్యం చదువుతూ ముందుకు సాగిపోవాలి. అలా సాగిపోతూ 'నంద కూమర శోభన కళాం ప్రజ్ఞాన దీపాంకురం' అనే పాదం దగ్గర ఆగిపోయి ఆలోచనా నిమగ్నులం అయితే – శ్రీకృష్ణుడి దివ్య శరీరాంతర్గతమైన 'చిత్కళ' అని గానీ, ఆయనలోని 'ప్రకృతి శక్తి' అని గానీ మనకు అర్థం స్ఫురిస్తుంది. కృష్ణుడు చంద్రవంశీయుడు కాబట్టి ఆయనలోని 'శక్తి'నీ, ఆయన ప్రసరించే 'కాంతి'నీ చంద్రికగా భావించడం సముచితం.

మరో శీర్షిక 'అంతర్వేద (నా) నాదం'. కవి మనస్సులోని వేదన చేసే (పద్య) నాదం అని ఒక అర్థం. కవి ఆంతర్యంలోని వేదం చేసే నాదం– లేక వేద స్వరూపిణి అయిన సరస్వతిని గురించి చేసిన నాదం అని రెండవ అర్థం. 'బలభద్రం' శీర్షిక చూడగానే బలభద్రుడికి (బలరాముడికి) సంబంధించిన విషయమేదో వుందని అనుకుంటాం. కానీ,



ఇందులో ఒక్కొక్క విషయానికీ, ఒక్కొక్క వస్తువుకీ, ఒక్కొక్క ప్రాణికి ఏది బలమో చెప్పబడింది. ఆ బలం భద్రమైనదని విశేషణోత్తర పద కర్మధారయంగా చెప్పుకోవాలి. జ్యోతి స్వరూపుడైన భగవంతుడు సాకారుడై స్తంభంలోంచి ఆవిర్భవించాడు. భక్త రక్షణ కళా సంరంభంలో కాబట్టి ఆయన్ని 'స్తంభజ్యోతి'గా చెప్పడం ఒక చమత్కృతి.

స్వచ్ఛతకీ, సౌరభానికీ, చల్లదనానికీ ఆకరమైనది కర్పూరం. దీన్ని సాధుశీలుడికి సంకేతంగా చేసి బాష్పాలను అతని దైన్యానికి ప్రతీకగా చెప్పడమే 'కర్పూర బాష్పాలు' శీర్షికలోని విలక్షణత. 'పుట్టతేనె' ఈ శీర్షికకు అర్థం రామాయణం. పుట్టలోంచి పుట్టిన వాల్మీకికి పుట్ట ప్రతీకగా వాడబడింది. ఆయన మనకందించిన రామాయణం మధురాతి మధురం. అందుకని దానికి 'తేనె' ప్రతీక అయింది. మన నిత్య వ్యవహారంలోని ఒక సాధారణ పదానికి రమ్యార్థాన్ని కల్పించడం మంచి భావుకత.

'చక్రారపంక్తి' ఇది చక్రధ్వజం ఖండకావ్యంలోని విషయ సూచికకు కవి పెట్టిన పేరు. చక్రంలోని అరముల వరుస అని దీనికి అర్థం. అరములు అంటే చక్రంలోని ఆకులు. కావ్యంలోని శీర్షికలు చక్రంలోని ఆకులతో ఉపమించబడ్డాయి. ఆధ్యాత్మిక పరంగా అన్వయిస్తే మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, విశుద్ధ, అనాహత, ఆజ్ఞాచక్రాల వరుసక్రమమూ, ఆ చక్ర స్థానాలలోని పద్మాలూ గుర్తుకొస్తాయి. ఆ పద్మాలలోని దళాలే వివిధ శీర్షికల్లోని పద్యాలు. మరి ఈ చక్రాలకూ పద్మాలకూ పైన సహస్రార చక్రం (సహస్రార కమలం) వుంది. అది చక్రధ్వజం. ఇక్కడ ఆనందామృతం కురుస్తుంది. జ్ఞాన సిద్ధి కలుగుతుంది.

'మాట్లాడే మల్లెలు' అనేది ఒక వచన కవితకు శీర్షిక. 'మల్లెలు' అంటే సామాన్యం అనిపిస్తుంది. మల్లెలు మాట్లాడతాయంటే ఆ పదబంధం రసజ్ఞుని హృదయంలో గభాలున దుమికి అనేక వలయాలను సృష్టిస్తాయి. కవి అనాథల నికృష్ట జీవితాలూ, మానవత్వం మనిషిలోంచి వెళ్ళిపోయిన వాళ్ళ కిరాతక కృత్యాలకు బలియైన దీనుల కథలూ ఆయన కలం పాళీకి 'మాట్లాడే మల్లెలు'గా కనిపించాయి. ఇలాంటి మల్లెల మాటలలో జాతీయ గీతం పాడేవాడు కావాలని ఆయన ఆశిస్తున్న వైఖరి యిది. దీన్నంతా భావ గర్భితంగా, శీర్షికలో పొదిగారు. ఆయన మరో మంచి శీర్షిక 'రుధిరఖడ్గం'. జాతిని తిరోగమనం చేయించే రాబందుల రెక్కలను ఖండించేదిగా ఆరిపోని యువజ్వాలగా ఖడ్గాన్ని ఇందులో ధ్వనింపజేశారు.

కొన్ని శీర్షికలు సూటిగా ఉంటాయి. వస్తువుకు ఆముఖంలా ఉంటాయి. కొన్ని అలాకాక అభివ్యక్తికంటే భిన్నంగా తోస్తాయి. అదొక టెక్నిక్. ఒక ఎత్తిపొడుపు. తిరుమల 'మావాడు మంచివాడు' అన్నది అలాంటిదే. వస్తువు అంతా మనిషి దౌష్ట్యాన్ని వర్ణిస్తుంది. కానీ, శీర్షిక ఉత్తముణ్ని సూచిస్తుంది. ఇదొక సెటైర్‌లా ఉంది. ఆయన శీర్షికలలో 'అక్షర పరిమళం' అనేది విశిష్టంగా ఉంది. సమాజంలోని భిన్న పార్శ్వాలు ఇందులో కన్పిస్తాయి. 'అక్షరాల సెలయేరు' అనేది రమణీయమైన ఆర్ద్రభావుకతకు సంకేతంలా ఉంది. 'మౌనాగ్ని బిందువులు' కవి తీవ్రమైన ఆర్తిని ప్రకటించేది. గాయపడ్డ ప్రజ పాడుకునేది. 'రూపా'ఇ', 'ఆ–రంభశూరులం' వంటి శీర్షికలు హాస్యానికి ప్రతీకలుగా కన్పిస్తున్నా భావ వీచికలను వెదజల్లేవే.

'చక్రారపంక్తి'లో సింగారించుకున్న శీర్షికలలో అనుతాపం, స్వోత్కర్ష ఆర్ష ప్రాధాన్యాన్ని వెలువరిస్తున్నాయి. 'హృదయ భారతి'లోని పంచతంత్రులు కు-వలయం, కు-రంగం, కు-చేలం, కు-బేరం, కు-శలం అనేవి కవి అపూర్వ శబ్దశక్తిని ప్రకటించేవిగా ఉన్నాయి.

శీర్షిక రచనకు కళ్ళవంటిది. కవి రచనను కడదాకా చదివించడానికి శీర్షిక పేరు బాగా దోహదపడుతుంది. ఇది కవి భావుకత్వంతో కూడిన పదునైన ఆలోచన మీద ఆధారపడి ఉంటుంది. తిరుమల ఇలాంటి విజ్ఞతను ప్రదర్శిస్తున్న సాహితీమూర్తి కావడం వలన ఆయన ప్రతి రచనకూ స్ఫూర్తిమంతమైన శీర్షికను ఇచ్చారు. ఇది దార్శనికుడైన కవి లక్షణం.

## 7. సామెత

సామెతలు భాషా సౌందర్యానికి, అర్థస్ఫూర్తికి దోహదపడతాయి. ఇవి మనుషుల రకరాకల జీవిత సంఘర్షణల నుంచి మలుపుల నుంచి, మజిలీల నుంచి ఛప్పున దూసుకొస్తాయి. ఇవి మనిషితోనే పుట్టాయి. ఒకనాటి పామరుని దగ్గర నుంచి ఈనాటి అధునిక మానవుని దాకా వివిధ దశలలో సామెతలు పుడుతూనే ఉన్నాయి. సామెతలు సూక్తులుగా, దృష్టాంతాలుగా, సాదృశ్యాలుగా, నిదర్శనాలుగా, ఉపమలుగా, ఉత్ప్రేక్షలుగా, అర్థాంతరన్యాసాలుగా, శ్లేషలుగా వెలువడుతున్నాయి. మనిషి జీవితం ఎప్పుడూ ఒకే దృక్పథంతో ముందడుగు వేయదు. అతడు ఏడుస్తాడు. సంతోషిస్తాడు. కేరింతలు కొడతాడు. ఉప్పొంగిపోతాడు. ఆడతాడు. పాడతాడు. ఇలాంటి సన్నివేశాలలో అప్రయత్నంగా సామెతలు ఉప్పొంగి వస్తుంటాయి. కాబట్టే వీటిలో సహజత్వం, చమత్కారం, ఆలంకారికత వంటి సాహిత్య గుణాలు ఉంటాయి. వీటి వల్లనే లయ ఏర్పడుతుంది. లయ కవిత్వంలో ప్రముఖ స్థానాన్ని కలిగి ఉన్నప్పటికీ అది ముందుగా హృదయ గతమైందని చెప్పాలి. ఇట్లా లయాత్మకంగా వెలువడిన సామెతలు రసవంతంగా ఉంటాయి. వినడానికి ఇంపుగా ఉంటాయి. ఒక్కోమారు వాడిగా, వేడిగా గుండెను చీల్చేట్టుగా కూడా ఉంటాయి. అంతేకాదు, ఇవి మనిషి పుట్టుకతో వచ్చినవి కాబట్టి తరాల సంస్కృతీధార వీటిలో కనిపిస్తుంది. చారిత్రక విషయాలు చాలా ఉంటాయి. ఇట్లా సాహిత్యానికి లాలిత్యాన్ని పెంచుతున్న ఈ సామెతలు అన్ని వర్గాల ప్రజలు వాడుతుంటారు. అయితే చదువు తెలియని వాళ్ళు వాడుకునే సామెతలలో సహజత్వం ఉట్టిపడుతుంది. వాళ్ళు ప్రకృతి ఒడిలో ఉంటూ ఆ సౌందర్యాన్ని తృప్తిగా అనుభవిస్తూ, ఆరాధిస్తూ, క్రీడిస్తూ వినోదిస్తూంటారు. కాబట్టి వాస్తవ స్థితి వాళ్లు వాడుకునే సామెతలలో తొణికిసలాడుతుంది.

సమగ్ర విషయాలను, విశాల భావాల్ని మానవ మనస్తత్వాలను సంక్షిప్తరూపంగా చెప్పడానికి వాడుకునే వాక్యమే సామెత. సామెతలను నానుడులు, సుద్దులు, సూక్తులు, లోకోక్తులు, చాటువులు అని కూడా అంటారు. బాగా పరిశీలించి చూచినప్పుడు ఈ మాటలకు వేరు అర్థాలు స్ఫురిస్తాయి. అయినప్పటికీ సామెతల పాదు ఇవి ఎదిగిన జాడలు కన్పిస్తాయి.



మంచి మాట మనిషికి నిజమైన అలంకారమని భర్తృహరి చెప్పినట్టుగా ఆ అలంకారానికి సహజమైన రుచిని అందించేది సామెత అని చెప్పవచ్చు. పలు విధాల పుష్పాలు నిండుగా విరబూసి తమ పరిమళాలను వెదజల్లినప్పుడు ఆ ప్రదేశం అంతా ఆహ్లాదభరితమవుతుంది.

సామెతలను అందరూ అన్ని వేళలా వాడకపోయినప్పటికీ కొందరి వాడకంలోనే అవి కన్పిస్తాయి. సామెతను వాడడం ఒక చమత్కారం, ఒక కళ, సామెతలకు సహజత్వం, సరసత్వం, సంక్షిప్తత, సూటిదనం ముఖ్య లక్షణాలుగా కన్పిస్తాయి. సామెతలలో హాస్యం, వ్యంగ్యం, లోకానుభవం, విమర్శనం ఎక్కువ పాళ్ళలో ఉంటాయి.

డా|| ముదిగొండ వీరభద్రయ్య సామెతను సూత్రీకరిస్తూ "సామెతలలో చమత్కారం, పోలిక, అవి ఏవీ లేకపోయినా సామెత గొప్ప అర్థాన్ని ఎట్లా కొద్దిలో సూటిగా ఘాటుగా చెప్పగలిగిందో అదే విధంగా ఆ ప్రయోజనం సమకూర్చగల వాక్యాలు ముఖ్యంగా ఒక జీవితానుభవాన్ని, లేదా ఒక ధర్మాన్ని ఒక నీతిని ముచ్చటగా చెప్పే వాక్యాలు కూడా సామెతలుగా చలామణి అవుతున్నవి.... సామ్యం అంటే పోలిక. దాని నుంచి సామెత (సామెత<సామ్యత) పుట్టిందని పెద్దలు భావిస్తారు."[194] అని చెప్పారు.

డా|| అక్కిరాజు రామాపతి రావు "సామెతలు ఒక జాతి జీవన విధానాన్ని తెలియ జేసే సూత్ర సంపుటి. ఇవి ఆ జాతి జనుల ఆచార వ్యవహారాలు, సంస్కృతీ సౌరభాలు, విశ్వాసాలు, విలువలు తెలియజేసే వ్యాఖ్యానాల వంటివి. సామెతలలో ఒక ప్రాంతం యొక్క నుడికారం, నాగరికత, పాడిపంటల వివరాలు, సాంప్రదాయిక విజ్ఞానం, ధార్మిక విశ్వాసాలు, సామాజిక నిబంధనలు వెల్లడి అవుతాయి.

తరతరాల అనుభవ సంపుటీకరణమే సామెతల వాఙ్మయం. మాట కూర్పుల పొదుపు, భావ వ్యక్తీకరణంలో చమత్కారం, అలంకార విన్యాసం, శబ్దలాలిత్యం, వ్యంగ్య వైభవం సామెతలలోని జీవశక్తి"[195] అని 'సామెత' లక్షణాన్ని విపులీకరించారు.

డా|| జి.యన్. రెడ్డి తాను రూపొందించిన తెలుగు నిఘంటువులో సామెతకు లోకోక్తి, నానుడి, సామ్యోక్తి[196] అనే అర్థాలను ఇచ్చారు.

ఈ విధంగా సాహిత్య సిద్ధాంతకర్తల నిర్వచనాలు అన్నీ సామెత వైశిష్ట్యాన్ని తెలుపుతున్నాయి.

ఆచార్య తిరుమల ఔచితీసారాన్ని బాగా తెలిసిన మహావిద్వాంసులు. రచనకు లోకజ్ఞతను సంధానించడానికి ఆయన సామెతలను ప్రవేశపెట్టారు. వాటిలో 'సిగ్గులేనమ్మకు నవ్వే సింగారం' అనేది ఒకటి. స్త్రీకి సిగ్గు సహజమైన అందాన్ని తెస్తుంది. కొందరు స్త్రీలు ఈ అందాన్ని అతి జాగ్రత్తగా కాపాడుకుంటారు. మరి కొందరు తమ మాటల చేత, ప్రవర్తన చేత సిగ్గు అనే సౌందర్యాన్ని పోగొట్టుకుంటారు. అలా అందం తుడిచివేయబడిన స్త్రీకి కేవలం నవ్వు మాత్రమే సింగారంగా ఉంటుంది. అయితే ఇది అన్ని సమయాలలో

అందాన్ని అతిశయింపజేయదు. ఇలాంటిదే మరో సామెత. "సిగ్గు లేని ప్రభుతకు చీరే సింగారం". ప్రభుత్వం పాలనా సూత్రాలను దాచి పెట్టి నిరంకుశంగా ప్రవర్తించి ప్రజలకు దూరమైనప్పుడు అలాంటి ప్రభుత్వాన్ని ప్రజలు నిరాకరిస్తారు. ఓటు ఆయుధంతో పడదోస్తారు. ప్రభుత్వం ఏమి చెప్పినా ప్రణాళికలు అనే చీర ధరించినా జనావళి ఏవగించుకుంటుంది. ఇది ధూర్త ప్రభుత్వాన్ని వ్యంగ్యంగా హెచ్చరించడానికి కవి ప్రయోగించిన సామెత.

తిరుమల ప్రజాకవి. దేశీయ కవి. అందుకే ఇంటినీ, దేశాన్నీ చక్కబెట్టుకోవాలని సామెత ద్వారా జాతిని ప్రబోధం చేశారు.

దీపం ఉండగానే ఇల్లు చక్క బెట్టుకో
దీపం పెట్టి దేశాన్ని చక్కబెట్టుకో[197]

పూర్వకాలంలో రాత్రి వేళలలో ఇళ్ళల్లో దీపాలు భోజనం చేసేంత వరకే వెలిగించుకుని ఆ పిదప ఆర్పివేసి పడుకునేవాళ్ళు. దీపం వెలుగుతున్నప్పుడే ఇంటిలోని వస్తువులను ఏవి ఎక్కడ ఉండాలో అక్కడ జాగ్రత్తగా అమర్చిపెట్టుకునే వాళ్ళు. ఇట్లా ఆనాటి వాళ్ళ జీవన విధానం నుంచి పుట్టుకొచ్చిన సామెతయిది. తిరుమల ప్రయోగించిన మరో సామెత 'దీపం పెట్టి దేశాన్ని చక్కబెట్టుకో.' దీపం అంటే విజ్ఞానం. దేశ ప్రజలందరూ విజ్ఞానాన్ని సంతరించుకొని దేశాన్ని కాపాడుకోవాలని కవి ఆశయం.

తిరుమల లేఖిని నుంచి వెలువడిన మరో సామెత 'నూనెతో వెలిగే దీపం నవ్వులతో వెలగదు'. దీపాలు తైలంతో వెలుగుతాయి. తమ ఉనికి ఉన్నంత వరకు చీకటితో పోరాడుతూ ఉంటాయి. తైలం ఇంకిపోగానే అవి చీకట్లకు బందీయైపోతాయి. ఆ ప్రమిదలో మళ్ళీ తైలాన్ని పోస్తేనే పూర్వ రూపాన్ని ధరిస్తుంది. అయితే నవ్వులతో దీపం వెలుగదు. కాని, నవ్వులతో జీవితం అనే దీపం ప్రకాశిస్తుంది. మనిషి ఆరోగ్యంగా ఉండటానికి నవ్వుకూడా అవసరమే. తైలంతో వెలిగే దీపం భౌతికమైన చీకట్లను తరిమివేస్తే నవ్వులతో వెలిగేదీపం జీవితాలలో కళాత్మక విలువలను పెంపొందిస్తుంది. ఈ రెండింటికీ సమానమైన శక్తి ఉంది.

ప్రజల నాలుకల మీద గుడికట్టుకొన్న సామెత 'జోగిజోగి రాసుకుంటే బూడిద' అనేది. జోగి అంటే యోగి. ఆయన సర్వసంగ పరిత్యాగి. ఆస్తి అంటూ ఏమీ ఉండదు. శరీరాలంకరణ కూడా ఏమీ ఉండదు. కాని దేహం నిండుగా బూడిద మాత్రమే రాలుతుంది కాని మరొకటి రాలదు.

తిరుమల కలం నుంచి జాలు వారిన మరో సామెత. 'పూసిన పూలన్నీ సిగను చేరవు' అనేది. సహజంగా పూసిన పూలన్నీ ఫలాలు కాలేవు. గుడిని చేరలేవు అన్న మాటలకు ఈ సామెత దగ్గరగా ఉంది. లోకంలో వికసించిన పుష్పాలన్నీ స్త్రీల సిగలలో చేరవు. కొన్ని వాడిపోతాయి. కొన్ని గాలి ఒత్తిళ్ళకు చెదిరిపోతాయి. కాబట్టి అన్నీ జడముడిలో చేరి మురిపాలను కురిపించవు. ఇది సార్థకతను దృష్టియందుంచుకొని చేసిన ప్రయోగం.



దరిద్రానికి ఆకలెక్కువ, వ్యాధి ఒక చోట ఉంటే వైద్యం మరో చోట, కోటి విద్యలెన్నైనా కూటి కొరకే, నీటికి కలువ మాటకు చలువ అందం, దిగితే గాని లోతు తెలియదు, గుడిలో దీపమైన ముద్దుపెట్టుకుంటే మూతి కాలుస్తుంది, పెరటి చెట్టు వైద్యానికి పనికిరాదు, తాటి చెట్టెక్కి పాలకై తరచుదేల, కల్లలాడ ఆడపిల్లలు కల్గుదురు, ఎవరి కంపు వారికెపుడు నిష్టమగును, గిరిద్రవ్వి యెలుక బట్టగవలెనా, ఏఋదాటి తెప్ప నేటిలో ముంచుటే వంటి మరెన్నో సామెతలను తిరుమల తమ కావ్యాలలో వాడుకున్నారు. కావ్య దృక్పథానికి గౌరవం ఆపాదించుకున్నారు.

## 8. అన్యభాషా పదాలు-ప్రయోగ సాఫల్యం

దేశాలు వేరైనప్పటికీ, దూరమైనప్పటికీ ఒక దేశ ప్రజల జీవన విధానాలు మరొక దేశ ప్రజల దైనందిన జీవితాల మీద ప్రసరిస్తాయి. ఇది అనివార్య సంఘటన. ఉత్సాహశీలురు, మేధావంతులైన చరిత్ర పరిశోధకుల పర్యటనలు, వర్తక వాణిజ్యాలు వీటి వలన కొంత, సంస్కృతీ సంప్రదాయాలతో పాటు సాహిత్యం కూడా వినిమయం అవుతుంది. రాజులు పరాయిదేశాలను ఆక్రమించి పరిపాలించడం వలన వాళ్ళు మాతృభాష రాజభాషగా అమలు పరచడం వలన ఈ వినిమయం సూటిగా ప్రజల జీవన విధానాల మీద నూతన సంప్రదాయంగా అవతరిస్తుంది.

తెలుగు సాహిత్యాన్ని పరిశీలిస్తే అన్యదేశీయాలు తిక్కన నుంచే కావ్యాలలో చోటుకున్నాయి. ఆయన ప్రయోగించిన 'త్రాసు' అనే మాట 'తరాజ్' నుంచి ఉద్భవించిందని పరిశోధకులు చెబుతున్నారు[198] మహాకవి శ్రీనాథుని కాలం నుంచి ఈ అన్యదేశాలు విరివిగా మన కావ్యాలలో ప్రవేశించాయి.

ఆధునిక కాలంతో వీటిని వాడుకోవడం విస్తృతంగా కన్పిస్తుంది. ఆచార్య తిరుమల కూడా తన రచనలలో అన్యదేశ్యాలను ప్రయోగించారు. అవి కవితకు ఔచితిని పెంచాయి.

అమాయకత్వంతో
అయోమయంతో
అపశ్రుతులకి అంకితమైన
ఈ సమాజ గళాన్ని 'పాడి' చేస్తే-నాలో
కవిత్వం రాయటానికి 'ఇన్‌స్పిరేషన్' వస్తుంది.[199]

కవిత్వం రాయడానికి అవసరమైన ఆవేశాన్ని కవి 'ఇన్‌స్పిరేషన్' అనే ఆంగ్లపదంతో చెప్పారు. ఇట్లా తిరుమల తన రచనలలో ఆంగ్ల, ఉర్దూ, హిందీ పదాలు ప్రయోగించారు. స్కూల్ ఫైనలు, ఏ.సి. రూము, బెడ్, ఏ.జి. ఆఫీసు, స్ట్రిక్టు, ఆఫీసర్, పెండింగ్, బ్యాంక్ మేనేజర్, కార్బను, కాఫీ, బ్రిటను, కాలర్, ఇంక్రిమెంటు, అలవెన్సు, బేసిక్ సాలరీ, ప్రమోషన్, ఇంటర్వ్యూ, సెక్రటరి, కరస్పాండెంటు, బిస్కెట్, పూర్-వీక్, ఇకనామిక్స్, గేటు, రూటు, ఫీజు, పోలీసు, బ్రాంది, హోటల్, హీరో, జీరో, సెంటు, కాం, రెఫరెన్సు, బుక్,

పోర్టుపోలియో, బార్బర్, నెక్లస్, మనీపర్స్, డిమాండ్ డ్రాఫ్టు, చెక్, బ్లాటింగ్ పేపరు, డైలీ న్యూస్, వైట్, క్వశ్చన్, సెక్సు, పౌడరు, సైన్టిస్ట్, లైట్ హౌస్, డైరీ, ఫ్యాక్టరీ, సైరన్, టార్చ్ బ్లేడ్, మ్యూజియం, హైకోర్టు, హాస్పిటల్, జూపార్కు మార్కు పబ్లిక్ గార్డెన్, బ్రిడ్జ్, గల్ఫ్ వంటి ఆంగ్ల పదాలు ఆయన కవిత్వంలో సహజంగా ఒదిగిపోయాయి.

మరికొన్ని అన్యదేశ్యాలు ఇట్లా ప్రయోగింపబడినాయి.

సిఫార్సుల శీతల వాతావరణంలో
లంచాల కంచాల్లో
సామాన్య జీవితాలు వడ్డించుకొని
చూపులతో ఆరగించే
అధికారుల నిండు గుండెలోని
విష జ్వాలలు చూడు[200]

అన్న కవితా పంక్తులలో 'సిఫారస్' అనే ఉర్దూ పదాన్ని వాడుకొని ఔచితిని పెంచారు.

అభ్యర్థులు తమ సొంత పేర్లతో గానీ
విలాస చిరు 'నామాల'తో గానీ
దరఖాస్తులు పెట్టుకోరాదు[201]

'దరఖాస్తు' అనే ఉర్దూ పదం బహుళ వ్యాప్తిని పొందింది. ఈనాడు గ్రామాలలో కూడా ఈ పదాన్ని బాగా వాడుతున్నారు. తమాష, ఖాతర్, హమేష, పంకా, బడాసేటు, దస్కత్, జవాన్, దళారీ, సలాం వంటా ఉర్దూ, హిందీ పదాలను తన కవితలో ప్రయోగించి కవి జన వాల్లభ్యాన్ని గౌరవించారు.

## 9. పలుకుబడులు

తెలుగు భాష సొగసులతోనూ, మాధుర్యంతోనూ అలరించడానికి హేతువులు చాలా ఉన్నాయి. వాటిలో పలుకుబడులు ఒకటి. పలుకుబడి అనగా పరిమితమైన మాటలో అపరిమితమూ, ఆసక్తికరమైన అర్థస్ఫూర్తిని నిబంధించడం. అయితే పలుకుబడులు కావ్యాలలోనూ, ప్రజలవాడుకలోనూ కన్పిస్తాయి. కావ్యాలలోని పలుకుబడులు సాహితీ విలువలను రూపుకట్టిస్తే, సామాన్య ప్రజల నోళ్ళల్లో వాడుకవున్న పలుకుబడులు సహజత్వాన్ని చిందుతాయి. అయితే ప్రజల నోళ్లల్లో తిరుగుతున్న ఈ మాటలు కవి హృదయంలో అడుగుపెట్టి అక్కడి నుంచి కావ్యాలలో చేరిపోయి నూతన గతులను పాఠకులలో సృజింపజేస్తూ ఉన్నాయి. తిరుమల పలుకుబడులను ప్రయోగించడంలో తన ప్రజా కవిత్వ ధర్మాలను చూపారు. ఔచితికి చేవ కలిగించే తీరులో ఆయన పలుకుబడులను ప్రయోగించారు. తిరుమల పలుకుబడులలో కొన్ని:

ఇంటివేల్పు, పట్టువిడిచి, చుక్కలురాలు, ముక్కుసూటి, అడ్డదారి, పరాన్నభుక్కు,



ఊరికుక్క, కూటికి మోమువాచు, విసుగుచెందు, అన్నమో రామచంద్రా, పొట్ట కూటికి, కట్టుబట్ట, పిడికెడు తిండి, ఈగల మోత, చెట్టంత కొడుకు, పొగరెద్దు, రంకలేయు, మాయల మారి, మొండితనం, దాగుడు మూత, ఒప్పులకుప్ప, వెర్రికన్న, కడుపే కైలాసం, ధనమే ప్రత్యక్షదైవం, పెండ్లామే స్వరాజ్యలక్ష్మి, కోతలు కోయుట, మంకుపట్టు, నిండు కుండ, మున్నాళ్ళ ముచ్చట, గుప్పెడన్నం, రెండు మెతుకులు, గూడు కట్టుకొని, వెర్రివేషాలు, చిప్పచేతికి వచ్చే, పట్టెడన్నం, గోరుముద్దలు, మేక వన్నెపులి, నడుంబిగించి, కాకులు దూరని కారడవి, చిలక పలుకులు, తల్లడిల్లు, కడుపు తీపి, పాలనవ్వు, కన్నుల విందు, పాలముంతలు, ముద్దుల మూట, తిండి తిప్పలు, కొంటె కోణంగి, నీటుగాడు, గిలిగింతలు, దొంగనిద్ర, పట్టినది బంగారం, మంకుపట్టు, కాకావికలు, పూలబాట, చెల్లెనో నూకలు, ఇనుపగజ్జెలు, అష్టదరిద్రం, నివురు గప్పిన నిప్పు, కనుసన్న, రాతి గుండె మెదలగునవి. పలుకుబడులు రసధారలోని తరంగాలు. తిరుమల ఆ ధారలోని అలలను తమ ఆశయానికనుగుణంగా రాశారు.

## 10. ఆవృత్త పదాలు

సాహిత్యంలో ఆవృత్త పదాలు ధ్వని మాధుర్యాన్ని వెదజల్లుతూ వీనుల విందు చేస్తూ హృదయాన్ని రసరంజితం చేస్తాయి. అయితే, వీటిని శబ్దాలంకారాలుగా మాత్రం భావించకూడదు. ఆవేశితుడైన కవి రచనను సాగిస్తున్నప్పుడు ఆవృత్తపదాలు ఛప్పున వచ్చేస్తాయి. ఆరగిస్తున్న పాయసంలో సుగంధ ద్రవ్యాలు రసనకు తాకి మధురిమలను పెంచినట్టుగా ఈ ఆవృత్తపదాలు కూడా అలాంటి తియ్యదనాలనే ఎగజిమ్ముతాయి.

ఆచార్య తిరుమల తన రచనల్లో ఆవృత్త పదాలను విరివిగా వాడారు. ఆయన 'సృష్టి దృష్టి' అనే కవితలో

ఇది - సువిశాల శాద్వలాల
మంచు తెరలు చీల్చుకొని
ఛెంగు ఛెంగున దూకే
కృష్ణ మృగ వినోదం[202]

'ఛెంగు ఛెంగు' శబ్దాలను ప్రయుక్తం చేశారు. కవి హృదయంలో భావలహరులు చిమ్ముకొని వస్తున్నాయి. ఆ తరుణంలో ఈ పదాలు కవితకు శ్వాసలా అమరాయి. కృష్ణమృగం యొక్క వినోదం సువిశాలమైన శాద్వలాల మంచు తెరలను చీల్చుకొని ఛెంగు ఛెంగున దూకుతున్నదట. నిజంగా కవి ఆవృత్తి శబ్ద విన్యాసం వినోదంగా హృదయాహ్లాదంగా పరిణమించింది. మరికొన్ని ఇలా ఉన్నాయి.

నెడనెడ, ఘల్లుఘల్లు, తిరిగి తిరిగి, పూటపూట, గలం గలం, కలకల, నటు నటు, గంట గంట, కృష్ణ కృష్ణ, వచ్చి వచ్చి, పచ్చ పచ్చ, చూచి చూచి, చూడగ చూడగ, పొన్న పొన్న, మీది మీదికి, పిలిచి పిలిచి, పట్టుము పట్టుము, పులుకు పులుకు, పలుకు పలుకు,

అడుగు అడుగు, నిన్ను నిన్ను, పాహిమాం! పాహిమాం, వచ్చి వచ్చి, గోడుగోడున, మిన్కు మిన్కు, హర హర, శివ శివ, పాహి పాహి, గుసగుసలు, సారెసారెకు, గుండె గుండె, గోల గోల, తలపు తలపు, ఘలఘల, తొలచి తొలచి, నేల నేల, చూపుచూపును, మాటమాటకు ఛెంగుఛెంగు, కణ కణ,ఫెళ ఫెళ, దినం దినం, ముద్ద ముద్ద, బిక్కు బిక్కు చీకటి చీకటి, అణువు అణువు, కుత కుత, పల్కు పల్కు, దిక్కు దిక్కున, గుట్టలు గుట్టలు, ఏమిటి? ఏమిటి?, రండి రండి, సాగండటు సాగండటు, గుత్తులు గుత్తులు, వంగి వంగి, సాగి సాగి, మాట మాట, ఏమన్నవి? ఏమన్నవి?, రుస రుస, బుస బుస, కాదు-కాదు, కరిగి కరిగి, చిలికి చిలికి, నడిచాను నడిచాను, ఎంత వాన ఎంత వాన, ఎంతవెన్న ఎంతవెన్న, ఏం వనంతం ఏం వసంతం, ఎంత అవేకం ఎంత అవివేకం, చేపా చేపా, జన్మజన్మకూ, జోగిజోగి, ఎగసి ఎగసి, ఏడ్చి ఏడ్చి, జల్లు జల్లు, జాగ్రత్త జాగ్రత్త, క్షణం క్షణం, కణం కణం, పువ్వు పువ్వు, ఇటుక ఇటుక, అమ్మాన్ అమ్మాన్, చినుకు చినుకు, కెరటాలు కెరటాలుగా, ఎక్కడో ఎక్కడో, తెలుగు-తెలుగు, ఎవరిది ఎవరిది, రగిలి రగిలి, పరుగులు పరుగులు, ఎవరికెరుక? ఎవరికెరుక?, వెలుగు వెలుగు, మాటి మాటికి, శూన్యం శూన్యం, నడిచి నడిచి, రంగురంగుల, గిరగిరా, వరదా! వరదా!, చూచి చూచి, అనగా అనగా, గడ్డి మేటా! గడ్డిమేటా!, అవ్వా అవ్వా, పిల్లాడా పిల్లడా, చీమా చీమా, భ్రమించి భ్రమించి, విస్తరించి విస్తరించి, బిక్కుబిక్కు పరుగు పరుగున, ఇంకా ఇంకా, పెద్ద పెద్ద, కలకల, మేడ మేడ, పదే పదే, గిలగిలా, విని విని, సలసలా, పలుపు పలుపు, పెరిగి పెరిగి, హాయిహాయిగ, లాలీలాలి, గిలగిల, పగలు పగలు, పొగిలి పొగిలి, అర్థం అర్థం, స్వార్థం స్వార్థం, తలచి తలచి, మరల మరల, పల్లె పల్లె, నీదైతే నీదైతే, నాదైతే నాదైతే, ఇలా ఇలా, కొత్త కొత్త, రేకు రేకు, నిజం నిజం, మధుర మధుర, ఏఏ, వింత వింత, గుండె గుండె, మంచి మంచి, మేలి మేలి, తరలిరారా తరలిరారా, అడిగి అడిగి, వరుణా వరుణా, ఉబికి ఉబికి, మిలమిల, ఉరికి ఉరికి, గుండె గుండె, వంగి వంగి, రావే రావే, విస విస, అదిగో అదిగో, రామా రామా, చెలీ చెలీ, ప్రేయసీ ప్రేయసీ మొదలైన ఆవృత్త పదాలు తిరుమల కవిత్వంలో సహజంగా ఒదిగిపోయాయి.

## 11. పద బంధాలు

కవి ఎప్పుడూ కొత్తదనం సృష్టించడం కోసం ఆరాటపడతాడు. వస్తువులోనూ, శిల్పంలోనూ, శైలిలోనూ విశిష్టమైన అభివ్యక్తిని తేవడానికి యత్నిస్తాడు. రచన అంత రసప్లావితం కావడానికి, పది కాలాల పాటు సమాజాన్ని నడిపించాలని ఊహిస్తాడు. సంస్కరణ కోసం, సహజత్వం కోసం మక్కువ చూపుతాడు, ఒకప్పటి ఉపమానాలూ, వర్ణనలూ, పదాలతో పాటు తన గుండెలో జ్వలించే భావ సంచలాన్ని అదే తీరులో పాఠకుడు అనుభవించాలని ఆశిస్తాడు. కొత్త పదాలను, పదబంధాలను రచనలో నిండుగా వెదజల్లుతాడు. సమాజాన్ని చకితం చేస్తాడు.

ఆధునికంగా భావింపబడుతున్న పదబంధాలు ప్రాచీన కావ్యాలలో ఉన్నప్పటికీ అవి



దీర్ఘ సమాసాల మధ్య నలిగి నిస్తేజంగా ఉండేవి. వాటి స్వరూపాలను, తాత్పర్యసారాలను పాఠకుడు ఛప్పున అందుకునేవాడు కాదు. ఆనాటి సాహిత్యం కొన్ని పరిధుల వరకే పరిమితమైపోవడం వలన విశాలత్వంలో ఒదిగి ఉన్న నవ్యత్వానికి అవకాశం లేకుండా పోయింది. "రమణీయార్థ ప్రతిపాదక శబ్దం కావ్యం" అని ప్రాచీనాలంకారికుడు చెప్పింది అర్థాన్ని రమణీయంగా చెప్పేది పదమని ధ్వనిస్తుంది. ఆధునిక కవి పదనిర్మాణంలోనూ, పలుకుబడి సంయోజనంలోనూ అర్థం కంటే భావార్థం పరిమళ భరితంగా ఉండాలని ఆరాట పడతాడు. ముఖ్యంగా అన్య భాషల సహచర్యం లభించడంతో పద సౌందర్యంకోసం కవులు మేధకు పదను పెట్టి చెలరేగే ఊహలకు తాత్వికమైన పద రూపాన్ని శిల్పంగా మార్చుతాడు. ఈ ధోరణి తెలుగు సాహిత్యంలో 'పదబంధాలు' పేరుతో శబ్దార్థ సౌందర్యాన్ని తెచ్చింది.

తిరుమల తన కవితలో అపురూపమైన పదబంధాలను ప్రయోగించి కవితకు శబ్ద సౌందర్యంతో పాటు అర్థమాధుర్యాన్ని కూడా సంతరించి పెట్టారు.

తిరుమల వాడిన పద బంధాలలో 'నిలువుటద్దం' అనేది ఒకటి. నిలువెత్తు అద్దం ముందుండి శరీర సౌందర్యాన్ని దిద్దుకోవచ్చు. అలాగే దేశం అనే నిలువుటద్దం ముందు దేశీయతనూ, ఆత్మీయతనూ, మాతృదేశాభిమాన్యతను పెంచుకోవచ్చు. ఏవేవో కలహాలనూ, కక్షలనూ పెంచుకొని నిలువుటద్దం లాంటి దేశాన్ని ముక్కలు చెక్కలు చేస్తే వినాశనం జరుగుతుంది. ఇది వాంఛనీయమైన విషయం కాదు. అందుచేత కవి భావించిన నిలువుటద్దం లాంటి మాతృదేశాన్ని అపురూపంగా కాపాడుకోవలసి ఉంది.

ఆదాయం లేని దంపతులు అదేపనిగా పిల్లలను కనడాన్ని చూసిన కవి వాళ్ళ ప్రణయ జీవితాన్ని 'ప్రణయ ఘాతుకం' అనే పదబంధంలో ఎత్తి చూపారు. ఇదెంతైనా గర్హనీయమైన విషయం. అధిక సంతానం దేశ సౌభాగ్యాన్ని తుడిచి వేసే చర్య అని గుర్తుచేయడానికే ఈ పదబంధాన్ని ప్రయోగించి ఉంటారని విదితమవుతుంది. తిరుమల రచనలలో మరికొన్ని పదబంధాలు ఇలా ఉన్నాయి. అవ్యయ జీవ దీపాలు, శరీర కీచకం, అక్షర సౌదామని, నక్షత్ర కిరణ పథం, ఆత్మదర్పణం, వృద్ధ యువతాదరహాసం, భావాల మాల, శిశుశ్వాస, భావాల నెమళ్ళు, చరిత్ర పరిమళం, వీరతాండవం, అమృత జలాల కాయలు, కిరణ ఖడ్గం, సూర్యామృత భాండం, విశ్వసభ, భస్మవధూటి, పరుగెత్తే హృదయం, మానవతా రేఖాంశం, కిరణదీపం, అక్షర నక్షత్రం, హృదయ మంజీరాలు, రుతు ప్రభలు, అరుణీకృత నేత్రాంచలం, ప్రేమభాష్యం, ప్రభాత పుష్పం, శబ్దమాల, తుషార జ్వాల, శీతల వసనం, చిచ్చుపూలు, మనసు చిలక, పాదాల పసిడి, జీవితాగ్ని, రసిక మేఘాలు, మంత్ర పుష్పం, విలాసాల జిలుగు, కోయిల పులుగు, ఐకమత్యపు కోయిల, వెన్నెల శాలువ, ప్రణాళిక చంద్రుడు, గగన వృక్షం, తుపాకీ పశువులు, హృదయారణ్యం, ముక్తికాంత, సత్యకామిని, ఆత్మనయనం, చిచ్చునాలుక, జన్మశూలం, కాలసర్పం, నక్షత్రాల నవ్వులు, సౌందర్యరాగం, మృత్యుజ్వాల, అరుణాధరం, ప్రాచీకన్య, మబ్బుపాగలు, జ్వాలా మాలికలు,

భగ్నవీణ, శాస్త్ర కాసారం, ఆత్మకళ, దేహవీణ, భీభత్స సౌందర్యం, నిశిత కారణాలు, రాగపుష్ప మేఘాలు, వ్యాధిబాణం, కుసుమదీపం, వెన్నెలదీవి, వెలుగుమేడ, వలపుదీపం, ఇలా ఆయన రచనలలో పదబంధాలు పరిమళిస్తున్నాయి. ఇవన్నీ కవి అపూర్వ ప్రతిభను చాటుతున్నాయి.

## 12. కవితా చిత్రాలు

కవితాభివ్యక్తిలో ఎప్పుడూ కొత్త రుచులు ప్రవేశిస్తూఉంటాయి. పరిణామశీలమైన కాలంతో పాటూ సమాజం కూడా అతి నవీనమైన సింగరాలతో ముస్తాబవడం సహజంగానే ఉంటుంది. కవిత్వాన్ని కావ్యరూపంలో తెచ్చిన నన్నయ అక్షర రమ్యత అనీ, నానారుచిరార్థసూక్తి నిధి అనీ, ప్రసన్న కథాకలితార్థయుక్తి అనీ కొన్ని విశేష లక్షణాలు తన కవితలో ఉన్నాయని చెప్పారు. తిక్కన్న తేట తెలుగు పదాల మాధుర్యాలు నిండుగా ప్రవహిస్తాయని తెలిపారు. అల్లసాని అల్లిక జిగిబిగి అనీ, పాండు రంగ విభుని పదగుంఫనం అనీ, చేమకూర కవి ప్రతి పద్య చమత్కృతి అనీ చెప్పుకోవడం జరిగింది.

పందొమ్మిదో శతాబ్దంలో తెలుగు కవితాభివ్యక్తిలో కొత్త కాంతులు ప్రసరించాయి. కందుకూరి, గురజాడ, రాయప్రోలు వంటి కవులు సమాజంలో వినూత్న భావాలను ప్రేరేపించడానికి రచనలు చేసి వాటిని కళాఖండాలుగా, భవిష్యదాశా పరిమళాలుగా మలిచారు.

వచన కవిత్వం రేకులు విచ్చుకోవడంతో లలితమైన కావ్య కుసుమాలు పురులు విచ్చాయి. విశ్వ సాహితీ ప్రభావాలు తెలుగు కవితా హృదయం మీద ఆధునికమై ప్రతీకలను, పదబంధాలను, మనశ్చిత్రాలను, శబ్ద చిత్రాలను, అక్షర చిత్రాలను అందంగా రస నిష్యందంగా కదను తొక్కించాయి.

కవిత్వంలో చిత్రావిష్కృతి పలువిధాలుగా ఉంటుంది. కవిత్వాన్ని కవిత్వంగా చదువుతూ అనుభవించడంలో పొందే అనుభూతులు ఒక విధంగా ఉంటే, చిత్రాలుగా దర్శించి మానసిక స్పందనలతో పులకించిపోవడం మరొక విధంగా ఉంటుంది. ఈ రెండు అభివ్యక్తి శైలులలో రెండవది ఛప్పున మనో నేత్రాలకు కన్పించి హృదయంలో అనేకమైన పరిమళావర్తాలను సృజిస్తుంది. ఎత్తైన గిరి శిఖరాలు జాలులా వంగివున్న లోయలు, గిరి శృంగాల నుంచి దూకి లోయల గుండెల మీద నుంచి జలజల పరుగులు తీసే స్రవంతికలు, వాటి తీరాల మీద పురులు విప్పి నర్తించే నెమళ్ళు, కొమ్మల మీద గళాలెత్తి పాటలు పాడే కోయిలలు-వీటిని చిత్రకారుడు తన కుంచెతో రాసినప్పుడు ఆ దృశ్యాలు కళ్ళనుంచి హృదయంలో అడుగుపెట్టి మేధను వివశత్వంలో ముంచెత్తుతుంది. అవి పాఠకుని హృదయ ఫలకం మీద ఎప్పుడూ నిలిచి ఉంటాయి. ఏవో భావ పరంపరలను సృజిస్తుంటాయి. ఏవో ఆశయాల హరివిల్లులను జీవితాలలో తళుక్కు మనిపిస్తాయి.

ఆచార్య తిరుమల కవిత్వంలో ఈ కవితా చిత్రాలు నేత్ర పర్వం చేస్తాయి. హృదయ



నేత్ర పత్రం మీద చిత్రాలుగా రాయబడి కవ్విస్తుంటాయి. ఆయన కవితా చిత్రాలు రెండు విధాలుగా ఉంటాయి. అవి

(అ) భావ చిత్రాలు

(ఆ) శబ్ద చిత్రాలు

### (అ) భావ చిత్రాలు

ఆచార్య జీవియస్ భావ చిత్రం గురించి ఇట్లా రాశారు. "అలంకారం కంటే భావచిత్రం శక్తివంతమైనది. విశిష్టమైనది కూడా. అలంకారం ద్వారా కవి పఠితలో తాను ఉద్దేశించిన చిత్రాన్ని పరివర్తింపజేస్తాడు. అలంకారం భావ చిత్రాన్ని పరిమళంగా అనుభవించి పరవశించటానికి తోడ్పడే శబ్దార్థాభివ్యక్తి సాధనం. భావచిత్రం కవి ఉద్దేశించినది మాత్రమే కాదు; ముమ్మూర్తులా అనుభవించింది. ఈ అనుభవాన్ని పఠిత హృదయంలో పరిమళంగా వ్యాపించటానికి మాత్రమే భావచిత్రాన్ని ఆధునిక కవి ప్రయోగించడు. హవాయ్ జువ్వలాగా ప్రేలటానికి ప్రయోగిస్తాడు. రంగురంగుల రూప చిత్రాల విస్ఫోటనం భావ చిత్రాల విస్ఫోటనం భావ చిత్రాల పరికల్పనంలోని ప్రయోజనం. ఈ విస్ఫోటనంలో వివిధ వర్ణ సంయోజనానికి, వాటి అభివ్యక్తికి తోడ్పడేవి ప్రతీకలు (సింబల్స్). కవి పఠితల హృదయాకాశంలోకి రువ్వే జువ్వ భావ చిత్రం; బహురూపంగా ప్రేలటం దాని స్వభావం. అంటే భావ చిత్రం పఠితను భావనామయమైన ఉద్వేగావస్థకు లోను చేస్తుంది. అందులోని తత్త్వాభివ్యక్తి ప్రతీకనాశ్రయించి ఉంటుంది. ఉద్వేగంతో అర్థాన్వయ శక్తిని అనుభవ స్ఫూర్తిని అందించగలిచేది భావ చిత్రంలోని అలంకార రూప ప్రతీక. అనుభవ విస్ఫోటకంగా ప్రతీకను భావచిత్రంలో పొదిగే ప్రజ్ఞ ఆధునిక కావ్య కవి సాధించిన అభినవ కవితా శిల్పం"[203]

కవితకు భావచిత్రాలు అందిస్తున్న చందన సౌందర్యం విశేషమైందని జీవియస్ అభిప్రాయబడ్డారు. ఇవి ఒక్కో సన్నివేశంలో ఛప్పున స్ఫురిస్తాయి. మరొక స్థితిలో గాఢమైన సంయోజనకు అందుతాయి. ఇంకొక పరిస్థితిలో కావ్యఖండిక అంతటా పరిమళిస్తాయి.

భావ చిత్రాల అవతరణ గురించి ప్రముఖ రచయిత సుధామ ఈ విధంగా అభిప్రాయపడినారు. "ప్రతిభావంతుడైన కవి గొప్పదనం అతని హృదయంలో ఉంటుంది. మస్తిష్కంలో లేదా బుద్ధిలో ఉండదు. మేధ బుద్ధి రెండూ కేవలం ఆలోచింపగలవు. ఆ ఆలోచనలను అక్షరాకృతి నిచ్చేది, బొమ్మ గీసేది కేవలం హృదయం మాత్రమే."[204] భావ చిత్రాలను రాయడానికి హృదయమే ప్రముఖ భూమిక నిర్వర్తిస్తుందని సుధామ భావించారు.

ఇల్లు గడవక-బ్రతుకులో
వేగుచుక్క పొడవక
కామ రాక్షసుని కత్తుల మంచం మీద
ఊపిరిలో విషం నింపుకొంటున్న మల్లెలు
శీలంపై 'కిరోసిన్' వంపుకొంటున్న మల్లెలు[205]

ఈ మల్లెలు నిరుపేద కుటుంబంలో నుంచి కళ్ళు తెరచిన ఆడపడుచులు. వాళ్ళ జీవితాలలో వేగుచుక్క ఉదయించదు. ఆశా సంకేతాల సంరంభాలు వినిపించవు అడుగడుగునా చీకట్లు ప్రత్యక్షమవుతాయి. కవ్విస్తాయి. కాలుష్యాన్ని పులుముతాయి. వాళ్ళ జీవితాలలోని తారుణ్యాన్నీ, మాధుర్యాన్నీ జుర్రేస్తాయి. కడకు పిప్పిచేస్తాయి. ఇది కామ రాక్షసుని కత్తుల మంచం మీద మల్లెల లాంటి యువతుల శీలం ముళ్ళ మీద ఆరవేయబడిన బంగరు వస్త్రంలా చీలికలు పేలికలు పడిపోయి కడకు విషాన్ని ఆశ్రయించి కిరోసిన్‌ను అందుకొని నశిస్తాయి. ఈ దైన్యం సహృదయుని హృదయాన్ని నలిపి వేస్తుంది. కవియైన వాని హృదయం కళ్ళ వెంబడి నీళ్ళు తెప్పించే బొమ్మను రాస్తుంది. అదే తిరుమల హృదయం.

గుండెని రెండుగా భాగించి
తలుపులు మూసేసుకో
వలపులు దోచేసుకో
ద్రాక్షారసం సిరాగా
నగ్న సత్యాలు రాసేసుకో
చిరంజీవివై పో!
కాలాన్ని- ఊపిర్ని బిగబట్టి
లోకిల్ని లోచనాల్ని గురిపెట్టి
గట్టిగా పిలు!
వచ్చే వసంతాలు నిలుపుకో
దిగంతాలకి మలుచుకో
చిరంజీవివైపో![206]

కవి మనిషి సుఖమయమైన జీవితాన్ని కాంక్షిస్తున్నారు. ఆయనను శాశ్వతంగా తీర్చిదిద్దుతున్నాడు. హృదయాన్ని రెండుగా భావించడంలోనే నిజమైన భావచిత్రం కన్పిస్తుంది. గుండెని రెండుగా భావించడం అంటే ఒకటి మనిషి తత్వం, మరొకటి నిత్యత్వం. ఈ రెండూ కూడా మనిషి పవిత్రమైన వ్యక్తిత్వం వలన సాధ్యమయ్యేవి. ఆ రెండింటి ద్వారా చుట్టూరా ఆవరించి ఉన్న సమాజాన్ని దోచేసుకొని ద్రాక్షరసం సిరాగా మార్చి నగ్నసత్యాలను రాసేసుకొని చిరంజీవిలా మనుగడ సాగించమంటారు. ఇక్కడ ద్రాక్షరసాన్ని సిరాగా తీసుకోమన్న కవి వాక్కులో ఔచిత్యం తొణికిసలాడుతుంది. ద్రాక్షరసం మాధుర్యానికి మాత్రమే సంకేతంగా కాక ఔషధంగా కూడా పనిచేస్తుంది. అలాంటి రసంతో అక్షరాలను గీస్తే మనిషిని నిత్యుణ్ని చేస్తుంది. అంతేకాదు, కాలాన్ని ఊపిరి బిగబట్టి లోకాల్ని లోచనాల్ని గురిపెట్టి గట్టిగా పిలిస్తే వసంతాలు వస్తాయి. వాటితో దిగంతాలను మలచుకుంటే మనిషి ఉన్నతుడవుతాడు. చిరంజీవి అవుతాడు. ఉత్తేజిత మనస్వి అవుతాడు. ఉన్ముక్త కాంతి ప్రవాహం అవుతాడు.

అర్థాన్ని కళ్ళతో అందుకోలేనివానికి ప్రతి దృశ్యం పిచ్చివాడు గీసుకున్న గీతలలా కన్పిస్తాయి.



సాయంత్రం తూర్పు వాకిలి చూసి
వెర్రిగా విడిచే నిట్టూరుపు
చావబోయే వారు
చచ్చిన వారిని గూర్చి ఏడ్చే ఏడుపు[207]

ఉదయానికీ, సాయంత్రానికీ భేదం ఉంటుంది. సాయంత్రంలో ఉదయాన్ని ఊహించడంలో విశేషం ఉంటుంది. కానీ, ఉదయంలో సాయంత్రాన్ని భావించడం అర్థరహితంగా ఉంటుంది. అలా అనుకునేవాళ్ళు చావబోయేవాళ్ళను గూర్చి ఏడ్వడం లాంటిది. ప్రయోజన శూన్యమైంది.

మధ్య తరగతి బ్రతుకులా పసితనం
తన చుట్టూ తల్లి వొడిలా చీకటి
తన మీద వాగ్దానంలా వీచే గాలి
నిజానికి తన పుట్టుక
చీకటి కంటికొక వెలుగు సూడిద
కానీ-తెల్లారితే ఏముంది
ప్రతి గడప ముందు
కావల్సినంత కోర్కెల బూడిద[208]

మధ్య తరగతి జీవితంలో ఘర్షణ పడే సన్నివేశాల రూపకల్పన కన్పిస్తుంది. ఆశలు చిగురిస్తుంటాయి కానీ, అవి దృశ్యరూపంలో ఉంటాయి కానీ ఫలితాలను పొందినట్టు అనిపించవు. చీకటి వెలుగుల ఒత్తిడుల మధ్య నీరసించి చలన శూన్యంగా పరిణమిస్తాయి.

విశాల దృక్పథం కలిగివున్న వాళ్ళ ఆశయం ఇట్లా ఉంటుంది.

నా రెప్పల్లో
ఈ జగత్తు వుంది
నా హృదయంలో
మహత్తు వుంది[209]

కనుపాపలకు రెప్పలకు ఉన్న అనుబంధం విడదీయరానిది. కనుపాప నుంచి చూపు నిదానంగా ప్రసరించాలంటే రెప్పల తోడ్పాటు తప్పనిసరి. అలాగే రెప్పస్థితి కూడా. రెండు రెప్పల మధ్య నుంచి ప్రసరించే చూపు జగత్తును దర్శిస్తుంది. మోస్తుంది. అలాంటి హృదయాన్ని హృదయంగా దర్శించుకునే వ్యక్తి హృదయంలో మహత్తు ఉంటుంది. హృదయాన్ని మరిచిపోయిన వాళ్ళకు, విడిచిపెట్టుకున్న వాళ్ళకు ముందుగా తన తనం అంటే ఏమిటో తెలియదు. కోరికలను అదుపులో పెట్టుకున్న వాళ్ళకు హృదయం స్థితీ, మహత్తూ కన్పిస్తాయి.

హింసకు హింస సేయుటది హింసయె గాక తదన్య మెట్లగున్
హింసను గాక అభ్యుదయ మేర్పడదంచు వచించి రక్త మీ
మాంస లిఖించు కాకవుల మాటకు కాలము నవ్వు: కావ్యముల్
హింసల నెండగట్ట వలె హేళి గదా కవి అంతరంగమా[210]

హింసకు ప్రతి హింస చేయటం అది కూడా హింసయే అవుతుంది. అహింస కాదు. మరొకటి కాదు. హింసతో అభ్యుదయం ఏర్పడుతుందనే భావనను కవితగా రాస్తున్న కవుల మాటలకు కాలం నవ్వుతుంది. కావ్యాలు హింసను ఎండగట్టాలి. హింసను నిర్మూలించాలి. కవి భావనంలో అహింస ప్రాధాన్యం కన్పిస్తున్నది.

భోగభాగ్యాల చీకట్ల మునిగినట్టి
బ్రతుకులకు లేదు శాంతి తీరాల వెలుగు[211]

కొందరు ధనికులుంటారు. వాళ్ళు తాము సంపాదించుకున్న భోగభాగ్యాలలో ఓలలాడుతుంటారు. అదే జీవిత పరమార్థం అనుకుంటారు. అదే నిజమైన శాంతి అనే తీరాల వెలుగు కనిపించదు. ఒకవేళ కనిపించినా ఆ ప్రభలను అందుకోవడానికి యత్నించరు. నిజమైన మానవ ముత్యాలు ఆ ధనికుల హృదయంలో కనిపించవు. అలాంటి మానవుల వలన సమాజానికి ప్రేయస్సే కలుగుతుందే కాని శ్రేయస్సు పలకదు.

భావ చిత్రాల పోహళింపు వలన పాటకు తూగువస్తుంది. అలాంటి పాట గుండె లోతుల్లో అడుగుపెట్టి అనేక ఆనందమయ లోకాలను కళ్ళ ఎదుట దింపుతుంది చూడండి.

భాషలన్ని పువ్వులైన తీవె తల్లి మనదేశం.
మతాలన్ని తరగలైన మహా జలధి మన హాసం
శక్తులన్ని రేకులైన పద్మం మన అభ్యుదయం
జనహితమే పరిమళించు జాతి మనది నిజం నిజం[212]

మనదేశంలో అనేక రకాలైన భాషలున్నాయి. అవన్నీ ఒకే తీవెకున్నాయి. ఆ తీవెను మోస్తున్న తల్లిలాంటిది మనదేశం. పలువిధాలైన మతాలున్నాయి. వాటిలో ఒప్పుతున్న మహాజలధి మందహాసం మనదేశం. శక్తులన్నీ రేకులై విరబూసిన పద్మం మన దేశ అభ్యుదయం. మన జాతి విశిష్టమైంది. అది ఎప్పుడూ జనహితాన్నే కోరుకుంటుంది. కవి భావించిన ఐకమత్యానికి ఈ నాలుగు పాదాలు చక్కని తార్కాణాలు.

## (ఆ) శబ్ద చిత్రాలు

శబ్ద చిత్రాలు కవితకు ఆలంకారితను సంతరించి పెడతాయి. అయితే ఇవి అలంకారాల వల్ల ఏర్పడినవి కాక స్వీయ వ్యక్తిత్వంతో పద్యానికి గానీ, వచన పద్యానికి గానీ, గేయానికి గానీ సొగసులు అద్దుతాయి. ఇవి హుందాగా కవి భావయిత్రి మీద ఆధారపడి ఉంటాయి. శబ్ద చిత్రాలు ప్రాచీనుల నుంచి కన్పిస్తున్నా ఇవి ఆధునికంగా బాగా ప్రచారాన్ని పొందాయని



చెప్పచ్చు. అభ్యుదయ కవులలో 'మరో ప్రపంచం' అన్న కవిత శబ్ద చిత్రాల మేళవింపుతో రాయబడి పాఠకుల హృదయ సీమల మీద వినూత్నమైన భావ సంపుటిని ఆవిష్కరిస్తుంది. సినారె, శేషేంద్ర, రామచంద్ర మౌళి, సుధామ వంటి వాళ్ళు శబ్ద చిత్రాలను రసాభిరామంగా తీర్చిదిద్దారు.

ఆచార్య తిరుమల శబ్ద చిత్రాలను సన్నివేశానికి అనుగుణంగా ప్రయోగించారు. దేశాన్ని స్వర్గ సీమగా తీర్చి దిద్దడంలో ఉన్న ధ్యేయాన్ని తిరుమల శబ్ద చిత్రాలతో రక్తి కట్టించారు.

ఈ దేశం మట్టిలోంచి మహాపురుషులు-

మహాసందేశాలు, వెలిగే హస్తాలు
వెలుగు రాస్తాలు-అవిగో!
సముద్రంలో నదులు - వనంలో వృక్షాలు
మాలలో పువ్వులు - నాదేశంలో ప్రజలు
చీకటిని చీల్చే కత్తులు
నా దేశీయ భావ గరుత్తులు[213]

శిలల్ని శిల్పాలుగా మార్చడం అంటే శిలలాంటి జీవితాన్ని శిల్పంపు తోటలా మార్చివేయడమనేది ఒక పవిత్ర మైన ధ్యేయం. దీన్ని సాధించడం అందరికీ సాధ్యంకాదు. ఉన్నతమైన హృదయమున్న సత్పురుషులకే సాధ్యమవుతుంది. వాళ్ళనే మహాపురుషు లంటారు. వాళ్ళ సందేశాలు, మహాసందేశాలు. అవి వెలిగే హస్తాలు. వెలుగు రస్తాలు. అలాంటి జాతీయ మూర్తుల కృషీ, ప్రేరణా ఆశయాల వల్లే రకరకాల నదులలాంటి ప్రజలు భారత సమాజ సముద్రలో ఒక్కరుగా, వివిధాలైన వృక్షాలు సంఘమనే ఉద్యానంలో ఒక్కరుగా, వైవిధ్యమైన పుష్పాలతో ఒప్పుతున్న మాలలా ఒక్కరుగా చీకటిని చీల్చే కత్తులుగా, దేశీయ భావ గరుతులుగా జగీయమైన మనుగడ సాగిస్తారని కవి భావన. ఈ కవితా పంక్తుల్లో మహాసందేశాలు, వెలిగే హస్తాలు, వెలుగు రాస్తాలు, దేశీయ భావ గరుత్తులు అనేవి శబ్ద చిత్రాలుగా కవితకు సొగసును పెంచాయి.

ఆచార్య తిరుమల శబ్ద చిత్రాలను సన్నివేశానికి అనుగుణంగా ప్రయోగించారు. భావాల మేఘాలు, నాయక సుగ్రీవులు, రుధిర తర్పణం, నిట్టూర్పుల ప్రభంజనాలు, సూర్యవనం, కిరణఖడ్గం, మౌనాగ్ని బిందువులు, సముద్ర పుష్పం, శిలలపొదలు, దివ్య గంధం, ఆత్మైక మధువు, భావనా విశ్వం, వెన్నెల ఏరు, పాషాణ శకలం, భావ నిధులు, వేద తీరం, రక్తనాట్యం, అశ్రు కణాలు, దైన్య సందేశాలు, చీకటి సిరా, కులాల కలాలు, పుష్పించే మస్తకాలు, కవితా విద్యుల్లత, ప్రణయ ఘాతకం, అవ్యయ జీవ దీపాలు, మనస్సముద్రం, బాధా రుధిరం, విశ్వగర్భం, చీకటి కిరణం, కర్పూరపు కొండ, నయన పంజరం, ఆత్మతర్పణం, ప్రేమ సరోజాలు, విజ్ఞాన వృక్షం, కాంతి క్షీరం, శిరోగుహ,

విలాసాల జిలుగు, నింగి తోట, వరాల స్వరాలు, శబ్ద ధనుస్సు, ఐకమత్యపు కోయిల, రసిక మేఘాలు, రుతు మాలికలు, మేఘాల శాలువ, కిరణ ఛత్రం, ఆత్మశంఖాలు, అక్షరాల సరస్సు, పురాణ దీపాలు, నల్లటి గతం, పుడమి కన్నె, కాంతి వసంతాలు, తూర్పు పెదవి, ఆకలి పర్వతం, స్వేద సముద్రాలు, కాంతి గోపురం, నమ్మకాల పంటలు, చీకటి ముగ్గులు, తృణ ఖండాలు, కోర్కెల బూడిద, మబ్బు దుప్పటి, వెన్నెల పొదరు, పూల మడుగు, మబ్బుటూయెల, కిరణ నేత్రాలు, మౌన రక్తి, రసిక నయనాలు, స్వేద కవనం, ఆదర్శాల పంజరం, క్షితాజరేఖ, శాంతి స్వనం, అమృత భాష, జన్మశూలం, నేత్రజ్యోతి, ప్రపంచ ప్రసూనం, భావఖడ్గం, కైవల్యమాల, అరుణరాగాలు, ప్రపంచ కాసారం, ప్రణయ ఛాయ, ప్రళయ వర్షం మొదలైన శబ్దచిత్రాలెన్నో తిరుమల కవిత్వంలో దర్శనమిస్తాయి.

కాలాన్ని అనుసరించి కవిత్వం పరిధి కూడా విస్తరిస్తున్న విషయం తిరుమలకి బాగా తెలుగు.సమాజం అభిరుచిని అనుసరించి రచన చేయడంలోనే ఔచిత్యం ఉందని ఆయన భావించి ఆధునికమైన వస్తువును ఎన్నుకొని భావ చిత్రాలను, శబ్ద చిత్రాలను ప్రవేశ పెట్టి కవితకు పటుత్వాన్ని కలిగించారు.



# పాద సూచికలు

1. పలనాటి వీర చరిత్ర-పీఠిక -పుట 52
2. ఆంధ్ర సాహిత్య చరిత్ర -పుట 53
3. తెలుగు విద్యార్థి -పుట 30
4. పండితారాధ్య చరిత్రము - పర్వత ప్రకరణము - పుట 433
5. శృంగార నైషధం 7-157
6. చైతన్య శిఖరం - పుట 66
7. పాశ్చాత్య సాహిత్య విమర్శ చరిత్ర - సిద్ధాంతాలు - పుట 153
8. చైతన్య శిఖరం - పుట 66
9. తెలుగు విద్యార్థి (రజతోత్సవ సంచిక)-పుట 30
10. సాహిత్య శిల్ప సమీక్ష- పుట 61
11. తెలుగు- పుట 200
12. చైతన్య శిఖరం - పుట 66
13. చైతన్య శిఖరం - పుట 66
14. తెలుగు విద్యార్థి -పుట 29
15. తెలుగు- పుట 222
16. తెలుగు- పుట 223
17. ఆంధ్ర మహాభారతం-సభాపర్వం-పీఠిక-పుట 53
18. చక్రధ్వజం- పుట 22
19. చక్రధ్వజం- పుట 27
20. చక్రధ్వజం- పుట 47
21. చక్రధ్వజం- పుట 48
22. చక్రధ్వజం- పుట 40
23. చక్రధ్వజం- పుట 45
24. చక్రధ్వజం- పుట 50
25. చక్రధ్వజం- పుట 45
26. చక్రధ్వజం- పుట 49
27. పద్యం ప్రభాస- పుట 5
28. పద్యం ప్రభాస- పుట 11
29. 'చక్రధ్వజం' పద్యాలలోని లోకోక్తులు
30. చక్రధ్వజం- పుట 5
31. చక్రధ్వజం- పుట 7
32. చక్రార పంక్తి- పుట 3
33. శ్రీరామ నామ సుధ- పుట 4
34. హృదయ భారతి- పుట 3
35. మణిపుష్పకం- పుట 6
36. మణిపుష్పకం- పుట 15
37. అమృతాన్వేషణ- పుట 79
38. అమృతాన్వేషణ- పుట 86
39. మాట్లాడే మల్లెలు- పుట 10
40. చీకటి మెరుపులు - శీర్షిక - కిరణ ఖడ్గం
41. వచన కవితా కాదంబిని- పుట 190
42. గేయ నందిని- పుట 58
43. గేయ నందిని- పుట 3
44. సాహిత్య శిల్ప సమీక్ష- పుట 124
45. శ్రీమద్రామాయణ కల్పవృక్షము - బాలకాండము- పుట 1
46. ఆంధ్ర మహాభారతంలో రస పోషణము - పీఠిక- పుట 5
47. రసోల్లాసము- పుట 123
48. ఆంధ్ర మహాభారతంలో రస పోషణము - పీఠిక- పుట 1
49. ఆంధ్ర మహాభారతంలో రస పోషణము - పీఠిక- పుట 94
50. పద్య ప్రభాస- పుటలు 20, 21
51. పద్య ప్రభాస- పుట 20
52. పద్య ప్రభాస- పుటలు 25, 26
53. పద్య ప్రభాస- పుట XI
54. పద్య ప్రభాస- పుట 12
55. మణిపుష్పకం- పుట 47
56. మణిపుష్పకం- పుట 48
57. పోతన భాగవత నీరాజనము- పుట 176
58. పోతన భాగవత నీరాజనము- పుట 176
59. సాహిత్య సౌందర్య దర్శనం- పుట 205
60. మాట్లాడే మల్లెలు- పుట 20
61. మాట్లాడే మల్లెలు- పుట 21
62. మాట్లాడే మల్లెలు- పుట 43
63. వచన కవితా కాదంబిని- పుట 127
64. వచన కవితా కాదంబిని- పుట 129
65. విద్యుల్లత - శీర్షిక 5
66. విద్యుల్లత - శీర్షిక 65
67. విద్యుల్లత - శీర్షిక 70
68. విద్యుల్లత - శీర్షిక 88
69. విద్యుల్లత - శీర్షిక 98
70. కవితా పుష్పకం- పుట 94
71. వచన కవితా కాదంబిని- పుట 195
72. మాట్లాడే మల్లెలు- పుట 15

73. మాట్లాడే మల్లెలు- పుట 15
74. వచన కవితా కాదంబిని- పుట 102
75. నాట్య వేదము- పుట 226
76. మణిపుష్పకం- పుట 78
77. ఆంధ్ర మహాభారతంలో రస పోషణము- పుట 201
78. కావ్యాలోకము- పుట 98
79. పద్యప్రభాస- పుట 6
80. పద్యప్రభాస- పుట 12
81. వచన కవితా కాదంబిని- పుట 221
82. అమృత నేత్రాలు- పుట 67
83. భామహుడు పేర్కొన్న వర్ణనలు అయిదు-
మంత్రి, దూత, ప్రయాణ, యుద్ధ,
నాయకాభ్యుదయాలు. ఈ అయిదింటినీ చేర్చి
మొత్తం పద్దెనిమిది వర్ణనల్ని ప్రతిపాదించాడు
84. నగరార్ణవ శైలర్తు చంద్రార్కొదయ వర్ణనైః
ఉద్యాన సలిల క్రీడా మధుపాన రతోత్సవైః
విప్రలంభైర్వివాహైశ్చ కుమారోదయ వర్ణనైః
మంత్రదూత ప్రయాణాచి నాయకాభ్యుదయైరపి
- కావ్యాదర్శనము
85. ప్రతాప రుద్ర యశోభూషణము- పుట 25
86. సంధ్యా సూర్యేందు రజనీ ప్రదోషధ్వాంత వాసరాః
ప్రాతర్మధ్యాహ్న మృగయా శైలర్తు వన సాగరాః
సంభోగ విప్రలంభౌచ ముని స్వర్గ పురాధ్వరాః
రణ ప్రయాణోపయమ మంత్ర పుత్రోదయాదయః
- సాహిత్య దర్పణము
87. వర్ణ్యశ్చ రాజా దేవీచ దేశో గ్రామః పురీ సరిత్
సరోబ్ధ్యరణ్యోద్యానాద్రి ప్రయాణ రణ వాజినః
హస్త్యర్క చంద్రా వృతవో వివాహోథ స్వయం వరంః
కలాబుత వయస్సంధీ ధాతు వృక్షాభి సారికా
- అలంకార శేఖరము
88. పుర సింధు నగర్త్విన శశి
సరసీ వన మధు రతి ప్రసంగ విరహముల్
పరిణయ తనయోదయ నయ
విరచన యాత్రాజి దౌత్య విభు వర్ణనముల్
- కావ్యాలంకార సంగ్రహము
89. రుధుర జ్యోతి- పుటలు 106, 107
90. అమృతం కురిసిన రాత్రి- పుటలు 71, 72
91. దివ్వెల మువ్వలు- పుటలు 62,63,64
92. బాపురెడ్డి గద్య కావ్యాలు- పుట 75
93. కరుణశ్రీ- పుట 34
94. ఉదయ శ్రీ- పుటలు 89,90
95. గేయనందిని- పుట 232
96. గేయనందిని- పుట 232
97. గేయనందిని- పుట 232
98. వచన కవితా కాదంబిని- పుట 223
99. వచన కవితా కాదంబిని- పుటలు 223,224
100. గేయనందిని- పుట 165
101.గేయనందిని- పుట 165
102. గేయనందిని- పుట 165
103. రాగానందం- పుట 42
104. రగానందం- పుట 42
105. చక్రధ్వజం- పుట 32
106. తిరుమలోక్తి- పుట 3
107. చక్రధ్వజం- పుట 19
108. అనంత దర్శిని- పుట 14
109. అనంత దర్శిని- పుట 5
110. కాకతీయ శిల్పము- పుట 65
111. కాకతీయ శిల్పము- పుట 138
112. విజ్ఞాన సర్వస్వము- పుటలు 77, 78
113. పంచవటి- పుట 6
114. పంచవటి- పుట 6
115. చక్రధ్వజం- పుట 20
116. చక్రధ్వజం- పుట 50
117. చక్రధ్వజం- పుట 51
118. చక్రధ్వజం- పుట 52
119. మరో హరివిల్లు- పుట 7
120. మరో హరివిల్లు- పుట 8
121. గేయ నందిని- పుట 137
122. సంకేత పద కోశము- పుట 192
123. గేయ నందిని- పుట 137
124. గేయ నందిని- పుట 137
125. గేయ నందిని- పుట 160
126. చక్రధ్వజం- పుట 11
127. చక్రధ్వజం- పుట 11
128. చక్రధ్వజం- పుట 12
129. ఋగ్వేదము - 7-29-3
130. జానపద సాహిత్యంలో అలంకార
విధానం- పుట 27
131. జానపద సాహిత్యంలో అలంకార
విధానం- పుట 28
132. కావ్యాలోకము- పుట 118
133. సాహిత్య సౌందర్య దర్శనం- పుట 400
134.చక్రధ్వజం- పుట 27
135. చక్రధ్వజం- పుట 11



136. ఆంధ్ర ప్రతాప రుద్ర యశోభూషణము-పుట 411
137. చక్రధ్వజం- పుట 45
138. చీకటి మెరుపులు - శీర్షిక - ఉప్పుకడలి
139. చక్రధ్వజం- పుట 31
140. అమృతాన్వేషణ- పుట 14
141. కావ్యాలోకము- పుట 135
142. అమృతాన్వేషణ- పుట 77
143. మణిపుష్పకం- పుట 13
144. గేయనందిని- పుట 31
145. పద్య ప్రభాస- పుట 17
146. విద్యుల్లత - శీర్షిక 5
147. చక్రధ్వజం- పుట 44
148. పద్య ప్రభాస- పుట 190
149. అమృతాన్వేషణ- శీర్షిక 20
150. అమృతాన్వేషణ- శీర్షిక 34
151. విద్యుల్లత - శీర్షిక 9
152. అమృతాన్వేషణ- శీర్షిక 73
153. చక్రధ్వజం- పుట 40
154. అమృతాన్వేషణ- శీర్షిక 26
155. గేయనందిని- పుట 237
156. కరుణ శ్రీ- పుట 41
157. తెలుగు ఛందో వికాసము- పుట 3
158. సారస్వత వ్యాసములు (నాలుగవ
సంపుటము) - పుట 263
159. పితృస్మరణ- పుట 24
160. పితృస్మరణ- పుట 28
161. మణిపుష్పకం- పుట 12
162. తెలుగు కవితా వికాసం- పుట 293
163. తెలుగు కవితా వికాసం- పుట 301
164. చీకటి మెరుపులు - శీర్షిక - ఆశాజ్వాల
165. రాగానందం- పుట 6
166. రాగానందం- పుట 38
167. రాగానందం- పుట 5
168. రాగానందం- పుట 26
169. స్వర వల్లరి- పుట 6
170. గేయనందిని- పుట 65
171. గేయనందిని- పుట 68
172. గేయనందిని- పుట 82
173. గేయనందిని- పుట 96
174. గేయనందిని- పుట 122
175. గేయనందిని- పుట 135
176. గేయనందిని- పుట 138
177. గేయనందిని- పుట 82
178. గేయనందిని- పుట 85
179. గేయనందిని- పుట 170
180. రాగానందం- పుట 28
181. రాగానందం- పుట 48
182. రాగానందం- పుట 8
183. గేయనందిని- పుట 50
184. రాగానందం- పుట 8
185. రాగానందం- పుట 2
186. రాగానందం- పుట 3
187. రాగానందం- పుట 11
188. రాగానందం- పుట 4
189. నిలువెత్తు తెలుగు సంతకం-
సినారె వ్యక్తిత్వం- పుట 33
190. గేయనందిని- పుట 66
191. రాగానందం- పుట 9
192. రాగానందం- పుట 43
193. రాగానందం- పుట 48
194. తెలుగు- పుట 77
195. సాహితీ వ్యాసంగం- పుట 233
196. తెలుగు నిఘంటువు- పుట 805
197. యుగగీతి 45
198. వ్యావహారిక భాషా వికాసం- పుట 45
199. మాట్లాడే మల్లెలు- పుట 4
200. మాట్లాడే మల్లెలు- పుట 7
201. మాట్లాడే మల్లెలు- పుటలు 57, 58
202. మాట్లాడే మల్లెలు- పుట 11
203. సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు- పుట 596
204. చైతన్య శిఖరం- పుట 48
205. మాట్లాడే మల్లెలు- పుట 15
206. మాట్లాడే మల్లెలు- పుటలు 49, 50
207. విద్యుల్లత - శీర్షిక 107
208. వచన కవితా కాదంబిని- పుట 181
209. వచన కవితా కాదంబిని- పుట 217
210. మణిపుష్పకం- పుట 8
211. యుగగీత- పుట 4
212. గేయనందిని- పుట 48
213. వచన కవితా కాదంబిని- పుట 244

అధ్యాయం-5

# ఉపసంహారం

ఇరవైయవ శతాబ్దంలో తెలుగునేలలో జన్మించిన ప్రముఖ సాహితీవేత్తలలో డా॥ ఆచార్య తిరుమలది విశిష్ట స్థానం. ఆయన పుట్టి పెరిగిన ప్రదేశం, చదివిన నెలవులు, తిరిగిన తావులు, సంపాదించుకున్న కవితాశక్తి, అందుకున్న భాషాజ్ఞానం, ఆదరించిన ధోరణులు, దర్శించిన ఉద్యమాలు, వీచిన విభిన్న సాహిత్య పవనాలు, అలలెత్తిన విభిన్న ధోరణులు ఆయనను విశిష్ట సాహితీమూర్తిగా తీర్చిదిద్దాయి.

డా॥ ఆచార్య తిరుమల సాగర సీమలోని రాజమహేంద్రవరం ప్రాంతాలలో గడిపిన విజ్ఞుడూ, రసజ్ఞుడూ అవడంచేత నన్నయ ఆది కవిత్వం, కందుకూరి సంస్కరణ చాలనం, ఆంధ్రపురాణ కర్త మధునాపంతుల వారి లలితోక్తి రాసిక్యాన్ని అందుకొని, గోదావరి పావనోదకాలలో నిలువెత్తుగా తడిసి పులకించి కాలాన్ని నడిపిస్తున్నా తిరుమల సంప్రదాయ కుటుంబంలో జన్మించారు. మరీ ముఖ్యంగా శ్రీవైష్ణవ సంప్రదాయం ఆయన సాహితీ జీవితంలోని దీధితులను వెదజల్లడానికి బాగా దోహదపడింది. అక్కడి నుంచే, అప్పటి నుంచే పద్యాలు ఆయన హృదయం నుంచి దూసుకొని వచ్చాయి. ప్రముఖ సాహితీవేత్తలతో పరిచయం, బహుగ్రంథపఠనం ఆచార్య సాహితీ వ్యక్తిత్వం వినూత్నమైన పోకడలను ముద్రించడానికి ప్రేరణగా నిలిచింది. తిరుమల హైదరాబాదు వచ్చిన పిదప ఆయనలోని కవి సూర్యుడుగా వేయి కిరణాలతో భాసిస్తూ వచ్చాడు. ఉత్తాలంగా ఎదిగి జాతీయ, అంతర్జాతీయ వేదికల మీది నుంచి తెలుగువాణిని ఎలుగెత్తి వినిపించి మాన్యుడన్న పొగడ్తలతో అభిషిక్తుడయ్యారు.

కవి వ్యక్తిత్వం ఆయన రచనా జీవితాన్ని మరింత ఆదర్శంగా తీర్చిదిద్దుతుందన్న అభివ్యక్తికి నిలువెత్తు ప్రతీకగా ఆయన వ్యక్తిత్వం ఆదర్శాన్ని ఆవిష్కరిస్తూ అక్షరంగా భాసిస్తూ ఉంది. ఆ వెలుగులలోని వివిధ దశలు అనుశీలనకు తీసుకొనబడినాయి. ముఖ్యంగా వ్యక్తిత్వమూ, కవిత్వమూ పెనవేసేకొని ఉన్న అంశాలు సాకల్యంగా చర్చింబడినాయి.

ఈ సిద్ధాంత గ్రంథం తిరుమల కావ్యాలను పరిశీలించడానికి మాత్రమే ఉద్దేశింప బడింది. అయినప్పటికీ దీని స్వరూపం విస్తృత పరిధిని కలిగి ఉంది. అయితే ఆయన సాహిత్యంలోని అనేక ప్రక్రియలను అనుశీలించడం జరిగింది.

తిరుమల కావ్యాలూ, ప్రామాణికమైన సాహిత్య శాస్త్ర గ్రంథాలనూ రాసిన సాహితీమూర్తి అవటం చేత ఆయన సృష్టించి సాహితీ లోకానికి పంచిన మాధుర్య మూల్యాలను జాగ్రత్తగా ప్రస్తావించబడినాయి. ప్రక్రియ ఏదైనప్పటికీ ఆయన అభివ్యక్తి శక్తిమంతమైంది. ఆకర్షణీయ మైంది. అనుసరణీయమైంది కూడా. ఈ పార్శ్వాలన్నీ నిపుణతతో విశ్లేషించబడినాయి.



తిరుమల కవిత్వంలో అనేక ఆధునిక వాదాలున్నప్పటికీ అవన్నీ సంప్రదాయ నిష్ఠమైన దేశీయతతో వెలువడినవేనని సిద్ధాంతపరచటం జరిగింది.

తిరుమల కలం నుంచి వెలువడిన ఎక్కువ రచనలలో ప్రత్యక్షంగా కనిపించేది సమాజ శ్రేయస్సు మాత్రమే. అది ఐతిహాసికమైనా, ప్రాబంధికమైనా, అత్యాధునికమైనా అభివ్యక్తి వైవిధ్య స్వరూపంగా వెలువడినప్పటికీ సమాజానికి కేంద్రబిందువుగా ఉన్న మనిషిని శిల్పంగా, మనస్సును పరిమళ ప్రసూనంగా మార్చే తపన హృదయ నేత్రాలకు అందుతున్న రీతులు సాకల్యంగా అనుశీలింపబడినాయి. 'సహితస్యహి భావం సాహిత్యమ్' అన్న సత్యోక్తికి అనుగుణమైన కావ్య సస్యాలను పండించి సమాజాన్ని బలోపేతం చేసే ఆయన దార్శనిక వాదాలు సోపపత్తికంగా చర్చింపబడినాయి. తిరుమల ప్రతి రచనకూ ఉన్న నేపథ్యం, అందించిన దర్శనం వాస్తవిక మూల్యాలకు ప్రతీకగా అమరిన వైఖరులూ అందుకు యాత్రలాసాగిన ఆయన అన్వేషణం అందుకు అవసరమైన వైచిత్రీ సౌందర్యం తెలుగు సాహితీ కేదారంలో శిఖరంగా నిలబెట్టిన పోకడలు సిద్ధాంత సూత్రాలతో వివేచించి గ్రథనం చేయబడినాయి.

అనుబంధం

# తిరుమలతో ముఖాముఖి

తేది:12-12-1999

**ప్ర 1. మీరు రచన చేయడానికి ప్రేరణ కలిగించిన వ్యక్తులు, సన్నివేశాలు తెలపండి?**

జ. మా స్వగ్రామం పెంటపాడులో నేను వీధిబడిలో చదువుతున్న బాల్య దశలో మా తాతగారి పాండిత్యాన్ని గూర్చి, మానాన్నగారి ప్రతిభను గూర్చి నలుగురూ చెప్పుకుంటు వుండగా ఆనందంతో, గర్వంతో పదే పదే వినటం, వాళ్లు చదివే పద్యాలు ఆదమరచి వినటం నేను రచనా రంగానికి రావటానికి ప్రేరణ. అలాగే, మా స్కూలు తెలుగు మాష్టార్లు అప్పం గోవిందాచార్యులు, చామర్తి సత్యనారాయణ చెప్పే పాఠాలు నన్నెంతో ప్రభావితం చేశాయి.

**ప్ర 2. మీరు కలం పట్టే నాటికి తెలుగు కవిత్వ స్వరూప స్వభావాలెలా ఉండేవి?**

జ. నేను కలం పట్టేనాటికి నాకు ఏదో రాయాలనే కోరికే తప్ప కవిత్వ స్వరూప స్వభావాలు తెలియవు. పాఠ్యపుస్తకాలు చదువుకోవటం తప్ప లోకాన్ని గూర్చి నాకు తెలియదు. ఆ ఆలోచన కూడా వుండేది కాదు.

**ప్ర 3. విద్యార్థి దశలో మిమ్మల్ని బాగా ఆకట్టుకున్న సాహితీ సువ్రతులు ఎవరు?**

జ. శ్రీనాథ, పోతనామాత్యులు, విశ్వనాథ సత్యనారాయణ గారి పేరు బాగా వింటూవుండేవాడిని. అలాగే, సినిమాల ద్వారా చాలా ప్రచారంలో వున్న శ్రీశ్రీ, ఆరుద్ర, దాశరథి, దేవులపల్లి, సినారె వంటి వారు వారి వారి పాటల ద్వారా నాకెంతో అభిమానులు.

**ప్ర 4. రచనలో మీ సిద్ధాంతాలేమిటి?**

జ. ప్రాచీనాంధ్ర సాహిత్యాన్ని, కొద్దిగా సంస్కృత సాహిత్యాన్ని చదివాను. మన కంటే ఎంతో గొప్ప వాళ్లు వాటిలో నాకు కనిపించారు. "మహాజనో యేన గతస్స పంథా"-ఆత్మోద్ధరణకి, సమాజ శ్రేయస్సుకి వారి దారిని మించిన దారి లేదనిపించింది. రచనలో నా సిద్ధాంతం-"తమసోమా జ్యోతిర్గమయ" "అసతోమా సద్గమయ" "మృత్యోర్మా అమృతంగమయ"-ఈ ఆకాంక్షను వింగడించుకోండి. కవిత్వం ద్వారా ముందు మానవత్వాన్ని తర్వాత దివ్యత్వాన్ని సాధించటమే నా సిద్ధాంతం.

**ప్ర 5. తెలుగులో చాలా ప్రక్రియలు వచ్చాయి కదా! మిమ్మల్ని బాగా ఆకట్టుకున్న ప్రక్రియ ఏది?**

జ. నేను నవల తప్ప అన్ని ప్రక్రియలూ నిర్వహించాను. జుట్టు బాగా వున్నమ్మకు



కొప్పెటుపెట్టినా అందంగానే వుంటుందని, సృజనాత్మక శక్తి ఉండాలే కానీ ఏ ప్రక్రియను నిర్వహించకూడదు? నేను ఏ ప్రక్రియలో రాసినా సహృదయులు సంతోషించారు. అది వారి వారి ఔదార్యం కూడా కావచ్చు లేదా నా అదృష్టం కూడా కావచ్చు.

**ప్ర 6. ఆధునిక సాహిత్యంలో 'ఇజమ్స్' ఉన్నాయి కదా? మీరు ఏ ఇజాన్ని విశ్వసించి రచనలో ప్రతిఫలింపజేశారు?**

జ. ఎన్ని 'ఇజమ్స్' ఉన్నా మనకున్నది, ఉండవల్సిందీ 'హ్యూమనిజం'. మానవతను మరిచిపోయిన వారు గానీ, లేని వారు గానీ కళారంగానికి పనికిరారు. వారు మరేదైనా రంగాన్ని ఎన్నుకుని ఉద్ధరించవచ్చు. నా రచనల్లో దివ్యత్వం ఉందేమో కానీ అమానుషత్వం లేదు. నాది హింసణ చణ ధ్వంస రచన కాదు.

**ప్ర 7. తెలుగులో చాలా ఉద్యమాలు వచ్చాయి. అయితే ఏ ఉద్యమంతోనూ మీరు మమేకం కాలేక పోయారు. కారణం ఏమిటి?**

జ. ఉద్యమాలు ఏవేవో ప్రయోజనాలతో ఆవేశంగా లేస్తాయి. అవసరం తీరాక అవిరైపోతాయి. తర్వాత సాహిత్య చరిత్రకు పనికి వస్తాయి. ఉద్యమం కవికి పరిధిని నిర్దేశిస్తుంది. తర్వాత ఆ కవి దాని నుండి బయటపడలేడు. అది నాకు ఇష్టం లేదు.

**ప్ర 8. కావ్య రచనలో చాలా మార్గాలున్నాయి. మీరు ఎంచుకున్న బాట యేది?**

జ. నా మార్గం దుర్మార్గంగా అవతలి ఆలోచనలు తినేయటం కాదు. చదివించాలి, అర్థమవ్వాలి, ఆలోచింపజేయాలి. నారచనలలా లేకపోతే ఇన్నాళ్లు నేనీ రంగంలో నిలవలేను కదా?

**ప్ర 9. ఈనాడొస్తున్న చాలా కవితల్లో పులుముడు, గజిబిజి అనేది ఉంటుంది. మీరేమంటారు?**

జ. అవును. అయోమయంగా రచనలు చేసి అస్పష్టత ఒక లక్షణంగా చెప్పేస్తున్నారు. ఉత్తమ రచనను నిర్ణయించే 'ధ్వని' యొక్క లక్షణం అదికాదు. స్పష్టమైన విధానం మనసులో లేని అర్భక కవులే ఏదేదో చెప్పేయాలని ఏవేవో వచ్చేయాలనే ఆత్రంతో పులుముడుకి పూనుకుంటారు. అది రంగు పెన్సిళ్లతో పసి పిల్లలు తెల్లకాగితాలతో ఆడుకోవటం లాంటిది.

**ప్ర 10.** 'కమిట్‌మెంట్' అంటే ఏమిటి? మీ కమిట్‌మెంట్ ఏమిటి?

జ. కమిట్‌మెంట్ అంటే నిబద్ధత. ఇందాక మీరు వేసిన సిద్ధాంత ప్రశ్న కూడా యిదే. నా కమిట్‌మెంట్ జగద్ధితం. ఆత్మోద్ధరణం.

ప్ర 11. 'ఆదర్శం-అవసరం' అనే వాటిలో ఈనాడు 'అవసరం' బాగా వెలువడుతుంది. మీ అభిప్రాయం ఏమిటి?

జ. అవును. కానీ, అవసరంతో పాటు ఆదర్శాన్ని కూడా నిలిపేవారే మహాకవులు, రచయితలు.

ప్ర 12. ఎవరి కవిత్వం పండితుల్నీ, పామరుల్ని ఆకట్టుకుంటుంది. వివరించండి.

జ. ఎవరు సత్యాన్ని సరళ సుందరంగా చెబుతారో వారి కవిత్వం అందరినీ ఆకర్షిస్తుంది. సత్య ప్రతిపాదనకు కవికి నిజాయితీ చాలా అవసరం. నిజాయితీ లేనప్పుడు ఏ సత్యానికి గానీ, ధర్మానికి గానీ పట్టుండదు. అవి నిరాదరణకు గురౌతాయి.

ప్ర 13. రచయితలకు పొలిమేరలు అవసరమా? అయితే కొందరు పాటిస్తున్నారు కాదా! దీని వల్ల సాహిత్య పరిధి కుచించుకు పోతుంది కదా! మీ అభిప్రాయం ఏమిటి?

జ. శరీర పరిధిలో వున్న మనసు అపరిమితంగా ఉన్నట్టు రచన ఉండాలి. ఎక్కడైనా, ఎప్పుడైనా హద్దు మీరిన వారు శిక్షింపబడుదురు కదా! హద్దును నిర్ణయించుకోటానికి రచయితకు హద్దుండకూడదు.

ప్ర 14. 'జీవితానికి వ్యాఖ్యానం కవిత్వం' దీనిపై మీ అభిప్రాయమేమిటి?

జ. 'కవి' అంటే సూర్యుడు. కాబట్టి, కవిత్వం జీవితానికే కాదు ఈ సృష్టికే వ్యాఖ్యానం.

ప్ర 15. మీ దృష్టిలో కవిత్వ లక్షణం ఏమిటి?

జ. ఇహ-పరాల్ని ఏకం చేసేదే కవిత్వం.
ఇటు నుండి అటు వెళ్లటం – మంట
అటు నుండి ఇటు రావటం – పంట!
జ్వాలగా ఎగసి జలంగా వర్షించేదే కవిత్వం.

ప్ర 16. 'సంప్రదాయం' అనే పదానికి మీరిచ్చే నిర్వచనం ఏమిటి?

జ. సంప్రదాయ మంటే జగత్కల్యాణం కోసం ప్రవహిస్తున్న మంచి అలవాటు.

ప్ర 17. మీ రచనల్లో శ్రీరామపరమైనవీ, శ్రీకృష్ణపరమైనవీ చాలా కవితలు ఉన్నాయి. ఈ ఇద్దరు మహాపురుషుల్లో మీకు మరీ ఇష్టమైన పరమాత్మ ఎవరు?

జ. శ్రీకృష్ణ పరమాత్మ మా ఇలవేల్పు. "కృష్ణం వందే జగద్గురుమ్" కదా! ఆ జగద్గురుత్వాన్ని అర్థం చేసుకోవటానికి చేసే ప్రయత్నమే రామాయణం. అది జ్ఞానం. ఇది కర్మ. మనది భక్తి. నాలుగో మార్గం లేదు కదా!



ప్ర 18. పూర్వకవుల ప్రభావం మీపైన ఉందా! ఉంటే అది ఏ రకమైంది?

జ. పూర్వ కవుల ప్రభావం నా మీద అపారంగా ఉంది. అనేక రకాలుగా ఉంది. ఉండకపోతే నేను కవినెలా అవుతాను.

ప్ర 19. మీరు ఆధునికుల్లో ఎవరి రచనను ఆదరిస్తారు? వివరించండి.

జ. చాలా మంది ఉన్నారు. విశ్వనాథ, జాషువా, కరుణశ్రీ, దేవులపల్లి, శ్రీశ్రీ, దాశరథి, సినారె, శేషేంద్ర, తిలక్ ఈ జాబితా చాలా వుంది. ఒక్కొక్కరికి ఒకొక్క ప్రత్యేకత ఉంది. వివరిస్తే చాలా గ్రంథమవుతుంది.

ప్ర 20 మీ సాహిత్య జీవితంలో మరపురాని సంఘటనలను వివరించండి?

జ. (1) మా నాన్న నేనేది రాసి చూపించినా బాగలేదనటం. 'హృదయ భారతి'లో పద్యాలు విని నీకు శబ్దం పట్టుపడిందిరా అనటం.

(2) ఏలూరులో మొదటిసారిగా విశ్వనాథ వారు నా పద్యాలు విని మెచ్చుకుంటూ నాకు ఎరుపురంగు శాలువా కప్పి కౌగిలించుకోవటం.

(3) దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు నా కవితలు, పాటలు విని 'నువ్వు అసలైన కవివి' అని రాసి, సంతకం పెట్టి యివ్వమని నేనడిగితే బాగుండదని కొట్టేయటం.

(4) 'ఇండియా టుడే' పత్రిక నా కవిత ఒకటి ప్రచురించి వెయ్యి రూపాయలు పారితోషకం పంపటం.

ఇలా ఎన్నెన్నో సంఘటనలున్నాయి. ఆత్మకథరాసుకుంటే విపులంగా రాస్తాను.

ప్ర 21. పాఠాలను బోధించడంలో విద్యార్థులను ఆకట్టుకునే మీ వక్తవ్య శైలి పద్ధతి ఏమిటి?

జ. విద్యార్థులకు పాఠాలు చెప్పేటప్పుడు సందర్భానుసారంగా కథారూపంలో లోక వ్యవహారాల్ని, ధర్మాల్ని, సత్యాల్ని చెప్పి జీవితాన్ని గూర్చి ఆలోచింపజేయటం -వాళ్ల సందేహాలేటువంటి వైనా తీర్చటం-నా పద్ధతి.

ప్ర 22. దేశ, విదేశ పర్యటనలు చేశారు కదా! మిమ్మల్ని బాగా ఆకట్టుకున్న ప్రదేశం ఏది? అనుభూతి కలిగించిన సన్నివేశం ఏది?

జ. దేశంలో కాశ్మీరు. విదేశాల్లో అమెరికా నన్ను బాగా ఆకట్టుకున్నాయి. ఇక, టర్కీ దేశం ఇస్తాంబుల్ లో World Academy of Arts & Culture సంస్థ నుండి నేను గౌరవ డాక్టరేట్ పట్టా తీసుకుంటున్నప్పుడు వందలాది కెమేరాలు క్లిక్కవ్వటం, సుమారు రెండు వందల దేశాల సారస్వత ప్రతినిధులు కరతాళధ్వనులు చేయటం నాకొక మధురానుభూతి.

ప్ర 23. **మీరు రచన ద్వారా ఆశిస్తున్న ప్రయోజనం ఏమిటి?**

జ. రెండు ప్రయోజనాలు, ఒకటి జనం మెచ్చుకోవటం, రెండు నాకు ధనం రావటం.

ప్ర 24. **పద్య, గేయ, వచన ప్రక్రియల్లో మీకు బాగా నచ్చిన ప్రక్రియ ఏది?**

జ. పూర్వకవుల ప్రభావం ఉంది కాబట్టి పద్యం మీదనే మక్కువ యెక్కువయ్యింది.

ప్ర 25. **మీరు వివిధ ప్రక్రియల్లో విరివిగా రచనలు చేసినప్పటికీ, సాహితీలోకం మిమ్మల్ని చేయి తిరిగిన పద్య కవిగానే గుర్తిస్తుంది. దీనిపై మీ స్పందన.**

జ. ఎలా గుర్తించినా నాకంటూ ఒక గుర్తింపు ఉందని సంతోషపడుతున్నాను. 'లోకోభిన్న రుచిః' - కాదని చేసేదేముంది?

ప్ర 26. **'యమునాతటి' కావ్యంలో రాధాకృష్ణతత్వాన్ని ఎలాంటి భావభూమికతో ప్రవేశపెట్టారు?**

జ. ఏలూరులో డి.టి.వో. ఆఫీసులో L.D.C. గా నేను పనిచేస్తున్న రోజులవి. సుమారు 1967 ప్రాంతం. నా రచనలు చిన్ని చిన్ని పత్రికల్లో అచ్చవుతూ వుండటం, వాటిని కనిపించిన ప్రతివాడికీ చూపిస్తూ, నాకు నేను కొద్దిగా పొగుడుకుంటూ, వాళ్లు మెచ్చుకుంటూ వుంటే విపరీతంగా సంబరపడిపోతూ వుండే రోజులవి. మా ఆఫీసులో నాకొక గౌరవం వుండేది. చాలా మంది నన్ను చాలా అభిమానంతో చూసేవారు. ఆఫీసర్లు కూడా నన్నెంతో ఆప్యాయంగా మన్నించేవారు. కృష్ణమూర్తి గారని A.T.O. వుండేవారు. ఆయనొకనాడు మాటల్లో 'మీరో కావ్యం రాయొచ్చుగా' అన్నారు. నేను ఆలోచనలో పడ్డాను. మథనపడ్డాను. ఆఫీసుకు వస్తూ వుండగా బుర్రలో ఓ మెరుపు మెరిసింది. శ్రీకృష్ణ శృంగారాన్ని మానుషీకరించి పదహారు వేల నూటెనిమిది పద్యాలతో మహాప్రబంధం రాయాలని శ్రీకారం చుట్టాను. నూరు పద్యాలయ్యేసరికి వస్తువయిపోయింది. పునరావృత్తమౌవుతూవుంది. 'యమునాతటి'అని పేరు పెట్టి ఆపేశాను. ఇప్పుడు ఆ మహా ప్రబంధాన్ని రాయగలను గానీ రాయను. అప్పటి నా వయసు వేరు. ఇప్పుడు నాకు తెలిసిన శ్రీకృష్ణ భగవానుడు వేరు.

ప్ర 27. **'కవితాకళ' ద్వారా మీరు ఆశించిన ప్రయోజనం ఏమిటి?**

జ. 'కవితాకళ' గ్రంథాన్ని ఏడేళ్లు విపరీతంగా శ్రమించి రాశాను. వేదం నుండి వీధి నాటకం వరకు, ఆదికవి నుండి ఆధునిక కవి వరకు-కవిత్వాన్ని గూర్చి ఎవరెవరు ఎక్కడెక్కడ ఏమన్నా అదంతా యీ గ్రంథంలో వుండాలని తపించాను. కవిత్వానికి తాత్త్విక భూమిక ఎలా వుంటుందో అందులో ప్రతిపాదించాను. ఆ గ్రంథం ఆధారంగా చాలా గ్రంథాలు తర్వాత వచ్చాయి. నా రచన నాకు సంపూర్ణంగా కనిపించటం లేదు. కానీ సంతృప్తికరంగానే వుంది. దానివల్ల చాలా మంది



యువకవులు ప్రయోజనం పొందారు. దాన్ని ఆధునిక ఆలంకారిక గ్రంథంగా పత్రికలు సమీక్షల్లో పేర్కొనటం నాకెంతో ఆనందాన్ని కలిగించింది.

ప్ర 28. **'అమృతాన్వేషణ' కావ్య రచనకు ప్రేరణ ఏమిటి?**

జ. భారతీయ వేదాంత తత్త్వాన్ని మాతృభాషలో వచన కవితా రూపంలో ఆవిష్కరించాలనే సంకల్పం. ఆ తపనే 'అమృతాన్వేషణ'కు ప్రేరణ.

ప్ర 29. **ఈనాడు వెలువడుతున్న విమర్శ స్వరూప స్వభావాలు ఎట్లా ఉన్నాయి?**

జ. పాక్షికంగానే ఉంటున్నాయి. వైయక్తిక ధోరణులు చాలా కనిపిస్తున్నాయి. కవికి, పాఠకుడికి కూడా వెలుగునిచ్చి, విలువ పెంచే విమర్శలు అరుదుగా వస్తున్నాయి.

ప్ర 30. **యువ రచయితలకు మీరిచ్చే సందేశం ఏమిటి?**

జ. యువ రచయితలకు పుస్తకాలు చదివే లక్షణం ఉండాలి. ఏమీ చదవకుండా ఏదో తెలిసున్నట్టు ఏమేమో రాయకూడదు. 'చదువని వాడజ్ఞుండగు' కదా! అజ్ఞానిని ఒక రచయిత గానో, ఒక కవిగానో ఎవరు అంగీకరిస్తారు? రచన ఒక మహాజ్ఞాన దశ నుండి పుడుతుంది. అది యువకులు గ్రహించటం వారికి, లోకానికి కూడా మంచిది.

ప్ర 31. **తెలుగు సాహిత్యం ప్రస్థానం పై మీ అభిప్రాయం?**

జ. తెలుగు సాహిత్య ప్రస్థానం నిర్దిష్టంగా లేదు. ఎవరి గొడవ వాళ్లదిలా వుంది. అది అంత మంచి లక్షణం కాదు. నా జాతి, నా భాష అనే భావం అందరిలో కలగాలి. స్వప్రయోజనాల్ని అధిగమించి తెలుగు సాహిత్యానికి జాతీయ స్థాయిలో, అంతర్జాతీయ స్థాయిలో మంచి గుర్తింపు రావటానికి పెద్దలంతా కృషిచేయాలి. 'దశ'ను కాదు 'దిశ'ను చూడటం.

# స్పందన-ప్రముఖుల అభిప్రాయాలు

**దివాకర్ల వెంకటావధాని:**

పద్యంబల్లితివా రసజ్ఞ హృదయాజ్జంబుల్ రసానంద సం
పద్యోగంబున పారవశ్యము కనున్, మాధ్వీక ధారాలవ
తృద్యల్ గేయములన్ రచించిన సమస్తాంధ్రుల్ ప్రశంసింతు, రీ
విద్యల్ నీకు జని ప్రసిద్ధములగున్ విద్వన్మణీ! తిర్మలా!!

**డా॥ దాశరథి:**

తిరుమల యేగుదెంచినది తెల్గుల రంగుల రాజధానికిన్
పరువిడి, యన్నటుల్ సుకవి వర్యుడు స్నేహ సుధాపయోధి మా
తిరుమల యేగుదెంచె వినుతింపగ సత్కవితాభిలాషు తా
పురజనులెల్లరున్: సుకవి పుంగవ సత్కవితల్ సుధా ధునుల్

ఆచార్య తిరుమల నీ
ప్రాచుర్యంబేల గలిగె? రమణీయ కవి
త్వా చుంబిత భావాంచిత
రోచిఃపుంజంబు వోలె రుచులూరింపన్

**కరుణశ్రీ:**

మంచి మనసువాడు మర్యాద కలవాడు
అందమైన కవితలల్లువాడు
ఎదుటివారి సిరికి ఈర్ష్య చెందని వాడు
వికృతి సుంతలేని 'సుకృతి' యితడు

**కుందుర్తి:**

మీరు పంపిన చీకటి మెరుపులు అందింది. మీ నిరంతర కవితా జైత్రయాత్ర అమోఘంగా సాగుతున్నది సంతోషం.

**డా॥ సి. నారాయణ రెడ్డి:**

కవిత్వం ఎలా పుడుతుంది?
కదిలే మనసుంటే
పాట ఎలా గజ్జె కదుతుంది?
హృదయంలో లయ లహరులెత్తితే
మాట ఎలా ఉరుముతుంది
ధర్మాగ్రహం జడలు విదిలిస్తే
వ్యాసం ఎలా ఉదయిస్తుంది
అలోచనకు మారాకు హత్తితే
ఆ కవిత
ఆ పాట
ఆ మాట
ఆ వ్యాసం
నాలుగు పేటలుగా అల్లుకున్న ప్రతిభ
ఆచార్య తిరుమల ప్రభ

**తుమ్మల సీతారామమూర్తి:**

కవితా రహస్య వేత్తృ
ప్రవరుండవు గాన నీవు పల్కిన వ్యాఖ్యల్
కవిదర్శన రూపమ్మున
నవురా! తనియించె దిరుమాలాచార్య! ననున్!!

**ఎల్లోరా:**

మిత్రుడు ఆచార్య తిరుమల కృషి, పట్టుదల, దీక్ష, సంస్కార బలం నాకు బాగా తెలుసు. అక్షరాల చేత గారడీ చేయించడంలో, మాటల చేత పాటలు పాడించడంలో తిరుమల తిరుమలంతటి వాడు. కవి సమ్మేళనాల్లో బాంబులూ కురిపించగలడు. వెన్నెల విందులూ రుచి చూపించగలడు. మల్లెలు మాట్లాడటం, రాళ్ళు పాడటం అతనే వినగలడు.

**డా॥ ముకురాల రామారెడ్డి:**

స్వర సుధారస తరంగాల్లో
మెరుస్తున్నది నీ ప్రభా
మెరిసిపో కవి కౌస్తుభా
పరిసరాలను ఆవరించే
ఇరుల గుండెకు నిప్పురవ్వై
మింటినీ మంటినీ కలిపే
మిలమిలల తారాజువ్వై
మెరిసిపో కవి కౌస్తుభా
ప్రతి యుగానికి ఉషోరాగాల
పంచి పెట్టే సుమ మవ్వై

మానవతా వర్ణాలు చిమ్మే
మహోద్యమ కాగడవై
మెరిసిపో కవి కౌస్తుభా!

**మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి:**

శ్రీ ఆచార్య తిరుమల తన పలుకుబడికి వెలుగురేకలు ప్రసాదించు కులదీపముతో స్నేహము నెఱవుచున్న కవి కౌస్తుభము.

**ఆచార్య నాయని కృష్ణ కుమారి:**

తిరుమలకు సంబంధించిన మెత్తని సంభాషణ పద్ధతి, తనకు తెలిసినదంతా నలుగురితో పంచుకోవాలనే తపన, నన్ను బాగా ఆకట్టుకున్నాయి.

**డా॥ కోవెల సంపత్కుమారాచార్య:**

నిరంతరం సాగే మీ సాహిత్యం కృషికి అభ్యుదయం కాంక్షిస్తూ మీ అభిమానాన్ని చూరగొన్న.

**ఉందేల మాల కొండారెడ్డి:**

మల్లెల తోరణాలనే కాదు-మల్లెలతో రణాలు సృష్టించగల
మధుర పదబంధ శిలీ ముఖ సవ్యసాచి యితడు.

ఒకవైపు నుడిని గుడిగా జేసి నవ భావనా సౌందర్య దివ్య ప్రతిమల్ని సృష్టించగలడు. ఒక వైపు నుడిని మడిగా మలచి శ్రమ జీవన ఘర్మజలంతో అభిషేకించి విప్లవ భావ సస్యాలను పండించగలడు. భాషను, భావాన్ని సమాంతరంగా నడపగలడు. తన కలాన్ని ఉలిగా తీర్చి కటిక శిలలకు గిలిగింతలు పెట్టి కమ్మని కలలుగా మార్చే పద శిల్పి ఆచార్య తిరుమల.

**నాగభైరవ కోటేశ్వర రావు:**

మైడియర్ ఆచార్య తిరుమలా
ఇది నాడెందంలో కలకాని కళ
అచ్చపు కవివి-స్వచ్ఛపు కవితా రవివి నీవు
అల్లీ బిల్లీ కబుర్లు పోచు కోట జీవివి కావు
మాతృదేశం పట్ల మమకారం ఉన్న వేడిని
మాతృభాషకు మంత్ర పుష్పం ఇచ్చిన వాడివి

-----------------------------



అసలైన కవిత్వాన్ని పిలిచే మనసు అరుదు
అరుదైన అలాంటి కవుల్లో నీది బిరుదు
అవేశం అరచినపుడు నీవు తిరుమలవు
అలోచన కురిసినప్పుడు నీవు అచార్యుడవు

**ఆచార్య ఎన్. గోపి:**

ఆచార్య తిరుమల ప్రముఖ విద్వత్కవి. ఉత్తమ సాహిత్యాధ్యాపకుడు. పద్యరచన, వచన సృజనల్లో సవ్యసాచి. వచన కవితల ప్రజల మారుతాల మధ్య అఖండంగా పద్య దీపాలు వెలిగిస్తున్న వాడిగా, మరీ ముఖ్యంగా సలసల కాగే కన్నీళ్ళతో రూపొందిన 'పితృస్మరణ' కవిగా తిరుమల అంటే నాకు ప్రత్యేక గౌరవం ఉంది.

**డా॥ జె. బాపురెడ్డి**

తిరుమల అలంకారాల కోసం, లయకోసం, నాద సౌందర్యం కోసం వెతుక్కునే కవి కాదు. ఆయన నిండుగా వికసించి స్వరమెత్తిన వసంతం లాంటి హృదయమున్న వారు. తెలుగుదేశం అన్నికాలాలూ చదువగల రచయిత

**డా॥ గుంటూరు శేషేంద్ర శర్మ:**

ఆచార్య తిరుమల గారి సాహిత్య కీర్తి పూర్ణిమ నాటి చంద్రమండలం లాంటిది. ఆయన భారతీయ సాహిత్యాకాశాన్ని జాజ్జ్వల్యమానం చేశాడు.

**డా॥ సంజీవదేవ్:**

ఆయన ఎంత విశ్లేషణాత్మక పండితుడో అంత సంశ్లేషణాత్మక కవి. ఎంత సృజనాత్మక కవియో అంత సమీక్షాత్మక సమాలోచకుడు. కనుక ఆచార్య తిరుమల పండిత కవి. కవి పండితుడు.

**ఊట్ల కొండయ్య:**

శ్రీ రామానుజుడు నరా
కారమ్ముల నెల్ల విష్ణుగాంచెన్, నీవో
సారస్వతులెల్ల యం
దారసిత కవీశు తిరుమలాచార్య కవీ!

**డా॥ ఇలపావులూరి పాండురంగారావు:**

మీ అక్షర తపస్సు అభినందనీయం

**ప్రొ. ఆర్వీయస్ సుందరం:**

పద్యం వ్రాసినా గద్యం వ్రాసినా వచన కవిత్వం వ్రాసినా గేయ కవిత్వం వ్రాసినా మీకు మీరే సాటి. నిరంతర కవితా వ్యవసాయం మీది.

**ప్రొ. మాదిరాజు రంగారావు:**

కవితా భావనతో పాటు తాత్త్వికమైన ఆలోచన మీ ప్రాచీన విజ్ఞాన భూమికను అవగతికి తెస్తుంది.

**ప్రొ. ముదిగొండ శివప్రసాద్:**

బాబూ! నీవొక ఋషివి. గడ్డాలూ మీసాలూ లేకుండా ఆధునిక వేషభూషలతో, భాషలతో ఉన్నావు అంతే.

**పి.బి. శ్రీనివాస్:**

తిరుమలాచార్య 'తిరుమల దొర' కరుణను
వర్త కవీంద్రుండవై, మేటి బిరుదములను
గొనుచునున్నా, డవాత్మలో గనుచు నెలుగు
నిను రచించిన దొర॥ తేనియల తెలుగు॥
శ్రీసతి మహిమను సిరుల్ చేరఁజేర
నిత్య సౌహార్దయుతమైన స్నేహధార
వాస్తవిక కళా ప్రీతితో వఱలుచుండ
సర్వదా విమల యశో విశాల సీమ
శుద్ధమతి తోడనేలుచు సుఖము పండ
భావసుర చిర స్వరరాగ జీవ భరిత
కాంతి ధామ మనందగు క్రాంతి కవిత
క్షణమల యని దీక్షను రచించగల దిట్ట!!

**సాలూరి రాజేశ్వర రావు:**

మీ గీత రచనములో సరిక్రొత్తదనము కనబడుచున్నది. గీతములలోని భావములు మృదు మధురములై గాన యోగ్యములై ప్రశంసా పాత్రముగా ఉన్నవి. ఎత్తుగడ, ముగింపులందే గాక, విరుపులు అంత్య ప్రాసలందు ప్రత్యేకమైన ఆకర్షణ కలదు. అనుకరణము లేక స్వార్జితమైన శైలిలో సాగుచున్న మీ సాహిత్యకృషి మార్గదర్శకమై రాజిల్లగలదని విశ్వసించుచున్నాను.



**పెండ్యాల నాగేశ్వరరావు:**

ఆచార్య తిరుమల గారి రచనలలోని పదముల కూర్పు సంగీతానికి వెన్నవలె నోరూరించేటట్లుంటుంది. భావంలోను భాషలోనూ నిండుదనం, నవ్యత వున్నాయి. వీరి గీతాల్లో ప్రబోధం అంతర్వాహినిగా సాగుతుంది. ఏదో ఒక కమ్మని ధ్వని ప్రతిధ్వనిస్తూ వుంటుంది. వీరి పాటలలో ఒక్క మాట కూడా సంగీతంతో చుట్టరికం కలుపుకోకుండా వుండదు.

**ఎం. చిత్తరంజన్:**

సాహిత్య వ్యవసాయంలో చేయి తిరిగిన రైతు శ్రీ తిరుమల. ఈయన గద్యంలో కూడా గానం వినిపిస్తుంది. పాటల్లో సాధారణంగా లయ ఊగుతూ తూగుతూ ఉంటుంది.

**సుధామ:**

కవి మిత్రుడు గురించి ముఖ్యంగా చెప్పవలసిందొకటుంది. స్వీయ వ్యక్తిత్వం ఆధారంగా విరబూసిన మల్లెతీగ ఇతని సంకలనం. ఎవరి జెండాలో ఎగరేస్తున్న వాడు కాడు. నమ్మినా నమ్మక పోయినా గాలి వాటు చూసి కలం పోటు వేస్తున్న వాడు కాదు.

**పి.వి. సాయిబాబా:**

అడిగిన వారికల్లా అడిగినదే తడవుగా పాటలు రాసిచ్చి ఎంతగానో సహకరించే గుణం తిరుమల గారిది. నిజంగా గర్వించదగ్గ వ్యక్తి తిరుమల గారు.

**ఇరివెంటి కృష్ణమూర్తి:**

ఆచార్య తిరుమల బోధకుడు. కనుక ఆయన వ్రాసిన వ్యాసాలన్నీ పాఠకునితో మాట్లాడినట్లున్నవి. పాఠకుడేమైనా అడుగుతాడేమోనని తానే సమాధానం వ్రాసినట్లున్నవి.

**ద్వా.నా.శాస్త్రి:**

అతనితో మాట్లాడటమే ఎడ్యుకేషన్
అతని కలం యువకులకి మార్గదర్శకం
అతని గళం ఆదరాభిమానాల్ని ఒలకబోస్తుంది

**చక్రవర్తుల లక్ష్మీనరసమ్మ:**

శ్రీ చక్రాంకిత శారదా మృదు విపంచీ దివ్య శబ్దార్థ ని
ద్యా చాతుర్య కళా రహస్యములు, ఆద్యంతమ్ము మీ మూర్తియున్
మీ చేతంబుమ, మీ వచస్సుధలునున్, మీకైతలై వెల్గి! ఓ

ఆచార్య త్వనిధీ! ఆహో తిరుమలా ఆచార్య వర్యాగ్రణీ
శ్రీ వాల్మీకివొ! లేక ఆదిమ ఫణి శ్రేష్ఠుండవో గాక! వా
గ్గేవి మూర్తివొ! భాష్యకారుడవో! ధాత్రిన్ కృష్ణరాయేంద్రువో!
భావాతీత కవిత్వ మాధురులు హృత్పాత్రన్ రస స్ఫూర్తితో
ద్రావించేవు జనాళినాంగ్ల వరగీర్వాణాంధ్ర భాషాధునీ

## వై. రామకృష్ణరావు:

హృదయ భారతి సహృదయ హృదయ తిరుమ
లయ పవన వీచికా సుమాళమ్ము సుమ్ము
చిత్త శుద్ధియు, ధారాళ వృత్తి శుద్ధి
భళిర! అన్వర్థ సంబుద్ధి భరిత మిదియ!!

## డా॥ తిరునగరి

ఆధునిక యుగమందు విఖ్యాతిగన్న
కవులలో నొక్కరుడు కవి కౌస్తుభుండు,
ఉభయ భాషలయందున ఉక్కివుండు
యైన ఆచార్య తిరుమల నభినుతింతు.

అన్ని ప్రక్రియలందున అమృతరచన
చేసినట్టి మనీషి, అశేషజనుల
ఆదరాభిమానమ్ములనందుకొన్న
సుకవి ఆచార్య తిరుమలన్ స్తుతి యొనర్తు

అతని కృతులు నిలుచు అన్ని కాలాలకు
అతడు తెలుగునాట అమృతమూర్తి
ఆంధ్ర ప్రజలకెల్ల ఆరాధ్య కవియైన
తిరుమల కవి కేను కరము మోడ్తు

## కె.వి. భాస్కర రావు:

ఆధునిక తెలుగు సాహిత్యాన్ని ఆచార్య తిరుమల గారు సస్యశ్యామలం కావించారు. సాహిత్యంలో వారు చేపట్టని ప్రక్రియ లేదు. భాషలో, భావనలో, రీతిలో, నీతిలో రచయిత దేశభక్తిని, సామాజిక స్పృహను ప్రదర్శించడమే కాక, పండిత, పామరులను ఒకే కాలంలో రంజింపచేశారు. ఆధునిక ఆంధ్ర సాహిత్య లహరికి ఆచార్య తిరుమల ఒక అరుణోదయం.



## పి.యస్.ఆర్. ఆంజనేయ శాస్త్రి:

వచన కవిత్వమే యుగధర్మమైన రోజుల్లో పడికట్టు రాళ్లు లేకుండా పద్యాలు వ్రాసి మెప్పించగలిగిన వారిలో ఆచార్య తిరుమల ప్రథమగణ్యుల్లోనివారు.

## రంగకవి:

గేయ కావ్య నిర్మాతగా, ఛందస్సు బిగింపుతో ఆరితేరిన సాహితీ స్వరూపంగా, కట్టుతెగిన ఉపన్యాస చక్రవర్తిగా, పరిచయ వాక్య రచనా వారసునిగా, విద్యార్థి విజ్ఞాన కోశంగా, కీర్తి కిరీటాలు ధరింపచేసికొని నేడు ఆరాటానికి హారితగా ఈ పద్యాలను పలికారు. ఆచార్య తిరుమల ఏది వ్రాసినా హృదయాన్ని పొంగించే శక్తిగల యుక్తిని వీనే ఔపోసన పట్టారు.

## అనుముల కృష్ణమూర్తి:

నా తెలుగక్షరాల నయనాలకు నేటికి గాదె యబ్బె నీ
చేత నలంకరింపబడు సిద్ధి, శతాబ్దము లెన్ని ఏగెనో
వ్రాతనుదిద్ది, శబ్దముల వంచి, రసజ్ఞరసమ్ముపోసి, ఓ
నూతన కావ్యధారణకు నోచిన ముద్దగు బాస నీయగన్.

## రామదుగు నరసింహాచార్యులు:

తిరుమల గిరిహర వాసా
తిరుమల యాచార్య కవిని త్రిధప్రణియనుచున్
తిరు'మల' నాటిగదల్తును
తిరుమల శ్రీ 'మిత్రు'డనుచు దెలుపుదునెపుడున్

## డా॥ రామదుగు వెంకటేశ్వర శర్మ:

చిననాడే వలచి వచ్చిన కవితా కన్య
నేక పత్నిగ జేసి మేలు వ్రతము
క్రొత్తందనమ్ము తళ్కొత్త సాహిత్య ప్ర
యోగాలు సల్పునుద్యోగ గరిమ
హృదయ వీణను రాగ సుధలొల్క కమ్మగా
స్వర వల్లరుల మీటు చతురిమంబు
లలిత గాయక గళాల కళాపరిమళాళ్
తెలుగు తెమ్మెరలుగా నిలువు ప్రతిభ
అరయ చైతన్య విద్యాలయాన వృత్తి
కళల చైతన్య మొలయించు ఘన ప్రవృత్తి

నీకు సహజముల్ తిరుమలా! నీవు గూర్చు
ప్రతి కృతియు శ్రీనివాస భారతి గదోయి.

**కప్పిగంతుల మల్లికార్జునరావు:**

తెలుగు సాహిత్యాన్ని గత రెండున్నర దశాబ్దాలుగా తన రచనలతో సుసంపన్నం చేస్తున్న ప్రముఖుల్లో ప్రముఖులు డా॥ ఆచార్య తిరుమల. సాహిత్యంలో ఆయన సవ్యసాచి. పద్యకావ్యాలు, వచన కవితలు, లలిత గీతాలు, విమర్శనా వ్యాసాలు, సమీక్షలు, సంగీత రూపకాలు యిత్యాది ప్రక్రియల్లో అనేక గ్రంథాలు ప్రచురించిన ఆచార్య తిరుమల గారు మంచి కథా రచయిత కూడా.

**వేమూరి వెంకటేశ్వర శర్మ:**

వ్యక్తిగతంగా తిరుమల గారు ఉదార స్వభావులు. విశాల హృదయులు. తోటి వారికి సహాయపడాలనే తహ తహ కలవారు. ఎందరో యువకవుల్ని, పండితుల్ని పారితోషకాలిచ్చి, శాలువాలు కప్పి సత్కరించారు. యువకవులు గాని, యువ రచయితలు గానీ ఆయన్ని కలసినప్పుడు వారితో ఆప్యాయతతో పలకరించి, ఆదరించి మంచి సలహాలిచ్చి ఉత్తేజ పరుస్తారు. అంతేకాని నీ బొంద నీకేం తెలుసు? అని పాతాళానికి పంపించరు. ఆయన దోహదుతో మొగ్గలు చక్కగా వికసిస్తాయి. అలాంటి గుణం వారి హృదయంలో ఉంది. మనస్సులో ఉంది. మాటల్లో ఉంది. చేతల్లో ఉంది.

**పసుమర్తి పార్థసారథిరావు:**

బహువిధ గ్రంథకర్త, మృదుభాషి, రసజ్ఞుడు గేయ స్రష్టయున్
సహజ విమర్శకుండ, కవిచంద్రుడు, మానవ దర్మావాదియున్
ఇహపర జ్ఞాన బోధనల నింపుగ జేసిన మేటి వక్తయున్
అహమది లేని మా తిరుమలార్యున కెపుజయంబుగావుతన్

**యం. అమరనాథ్:**

మీ పద్యం జన హృద్యం
మీ కవనం రసరమ్యం
మీ గీతం మధుగీతం
మీ వచనం రస భరితం
యువకవులకు ప్రేరణగా
నవ కవితా దీపికగా
కవిహారవు కౌస్తుభవై
భాసించే ప్రియబాంధవా



చిరకాలం వర్ధిల్లు
కలకాలం జీవించు

**కె. శ్యాంప్రసాద్:**

మీ కవన మరీచికలు
చీకటి బ్రతుకలలో మెరుపులు
మీ సాహితీ ప్రభాసలో
మరెన్నో సాహితీ కుసుమాలు విరియాలి
మీ కీర్తి శిఖరాలు మరో మెట్టు ఎదగాలి.

**వడ్డేపల్లి కృష్ణ:**

హృద్యమగు నీ పద్యమందున
దాశరథి శిల్పమ్ము నిలుచును
మధురమగు నీ గేయమందున
'సినారె' సింగార ములుకును
వచన కవితా రూపమందున
వన్నెకెక్కిన భావమలరును

**డి.ఎ.యల్.యన్.మూర్తి:**

ఆంధ్ర సంస్కృత భాషలు ఆంగ్లమందు
పండితుడవయ్యు ఆచార్య వరుడవగుచు
మూడు భాషలలో కావ్యములు రచించి
పేరు గాంచితివయ్య కవీంద్ర చంద్ర

**శాంతిశ్రీ జంధ్యాల వెంకటేశ్వర శర్మ:**

ఎవరీతడు! ఎవరీతడు
సుగుణవతీ శ్రీనివాస గర్భశుక్తి ముక్తి ఫలం
తెలుగు తల్లి కవితామ తల్లి గళ మంగళ ముక్తాహారం

----

ఎవరీతడు! ఎవరీతడు
'యమునాతటి'పై హృదయా భారతి' నాలపించి
'శిలల పొదల'లో 'అమృతాగ్ని'ని చల్లి
'అక్షరాగ్ని'ని రగిలించి 'చీకటి మెరుపుల'లో
పయనించి 'మాట్లాడే మల్లెలు' పూయించి
'పల్లవి'తో 'స్వర వల్లరి'తో
'స్వేచ్ఛా భారతి' సేవించి 'కవితా కళ'తో

వచించాడు 'భగవద్గీత' కవితారంగంలో
అతడొక విజేత
మన ఆచార్య తిరుమల
తెలుగు తెమ్మెరల మల.

**సూదగాని శ్రీనివాస రావు:**

గరగరఁబోసి, తేనియల కమ్మదనమ్ములు నింపి జోకగా
గరగరికెల్ల కూడుదలగా, నెరపద్దుల సాముకొన్న మేల్
కఱదకు, నేర్మికిన్ నెఱవుగా నమయించిన మీదుకైత, ఓ
తిరుమలదంట! మా కదియ తిమ్మన మాయెను, మీకు పబ్బుతుల్

**యస్.టి.వి. రాజగోపాలాచార్యులు:**

భావ పటిమ, చక్కని పద్య పాదములును
ద్రాక్షరసశైలి, సత్య సందర్శనమ్ము
కలిగా యీ శతకము వెల్గె గాన దీని
నభినుతించును శ్రీరాముదాత్మలోన

**వెంపరాల ప్రభాకర సుబ్రహ్మణ్యం:**

తెలుగుంగైతల మల్లెతీగ ననలెత్తన్ నీదు చిత్తంబులో
నెలవైయున్న వసంత బాలకుని వన్నెల్ చిన్నెలున్ సోకి నీ
పలుకుందొయ్యలి తియ్యమావి చివురొప్పన్ మేసి కూర్చున్న కో
యిలకున్ కమ్మని పాట నేర్పెనట యేది, విన్నుమా తిర్మలా!

**యం.సి. నరసరాజు:**

గంగోత్తుంగ తరంగ మాలికలు మీ గంటాన పొంగార, స
ర్వాంగోపాంగ రసైక దివ్యమయ ధారల్ సర్వదా వెల్లువై
శృంగారమ్ముదయించు మీ కవితలన్ శ్రీ తిర్మలాచార్య చె
ప్పంగా నాకు వశంబె, మెచ్చెద భవద్భవ్య ప్రభావోన్నతుల్

ఒక్కొక్క పాట మీయది మహోన్నత భావము లొప్పుచుండ, కై
పెక్కెడు నాలపించు తరి; నెక్కడికో గొనిపోవునన్ను; మీ
చక్కని కూర్పు నా మదికి సంతసమున్ సమకూర్చునెప్పుడున్
నిక్కము మీ కవిత్వ రస నీరధి లోతులెరుంగ శక్యమే.

**అరుణ:**

పొంగులెత్తు రస సింధువు
ప్రతి నీ గీతిక
విందు గూర్చు సుధామృతం
ప్రతి నీ వాచిక
హృది ఉరకలేయు సంద్రమౌ
ప్రతి నీ ఖండిక
హోరులెత్తు దివిజ గంగ
ప్రతి నీ స్తుతిరా
పదును పెట్టు చుర కత్తులు
నీ పదములు గడుసరే

విరజల్లులు నెత్తావులు
నీ కవితలు భళిభళీ
మధుర జల్లు కమనీయం
నీ కావ్యం మరి మరి
హాస్యాల ఝురులు
నీ అల్లిక లోకపరి.

**కోరుప్రోలు మాధవరావు:**

ఎల్ల ఎల్లలు తాకి రాగాల ఆనందడోలల
తేలించు మీదు కవిత
------
కవి కౌస్తుభా!
మిముగన్న తల్లిదండ్రులు ధన్యులు
మీరు చరితార్థులు
మే మెల్లరము కృతార్థులము

**కృష్ణ ప్రసాద్:**

అద్దంలా నిర్మలమైన, నిబద్ధమైన, నిరాడంబరమైన వ్యక్తి అన్నింటినీ మించి వారికడకెవరేగినా సరస సారస్వత హృదయంతో ప్రోత్సహించే సుగుణశీలురు. తిరుమల వేసిన చేయి 'తిరుమలేశుని చేయి' అనడంలో ఏ మాత్రమతిశయోక్తి లేదు.

